# హాస్యప్రపంచం

**మాచర్ల రాధాకృష్ణమూర్తి**
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం నుండి
ప్రతిభాపురస్కారం పొందిన రచన

ప్రథమ ముద్రణ : జనవరి, 2006
ద్వితీయ ముద్రణ : జనవరి, 2011
తృతీయ ముద్రణ : ఏప్రిల్, 2021
ప్రతులు : 1000



ISBN No. : 978-81-908840-2-0

వెల: రూ. 200/-

ప్రతులకు : ఎం.ఆర్.కె.మూర్తి,
హారిక పబ్లికేషన్స్
ప్రకాష్ నగర్, నరసరావుపేట - 522 601.
ఫోన్ : చరవాణి-98664 30726

ముద్రణ: మురళీ ఆఫ్ సెట్ ప్రింటర్స్ నరసరావుపేట - 522 601.

కృతి స్వీకర్త

# శ్రీ చలవాది మల్లికార్జునరావు

## జీవన రేఖలు

సగటు దాతలాగా ఏ గుడిని గురించో, ధర్మసత్రాన్ని గురించో యోచించక, అధునాతన ఆలోచనాసరళిలో విద్య, వైద్య సేవలకు ప్రాధాన్యమివ్వడం ఆయన ప్రత్యేకత. పబ్లిసిటీకన్నా పదిమందికి చేయూతనివ్వడం మిన్న అన్నది ఆయన భావన. సహృదయత, స్నేహశీలత ఆయన తత్త్వం. నిరాడంబరత్వం, నిగర్వం ఆయన లక్షణం. జీవితపు ఆటుపోట్లను ఓర్పుతో భరిస్తూ నైరాశ్యపుటంచులకు చేరిన ఆయనను అదృష్టం వరించడంతో, అప్పటిదాకా తనకు అంతగా లేనిదానిని పదిమందికి అందించాలనుకు న్నారు. కులమతాల కతీతంగా అర్హతగల నిరుపేద విద్యార్థినీ విద్యార్థులకు ఆర్థిక సాయం అందజేయాలన్న ఆయన సంకల్పం చరితార్థం. "సంకల్పబలంతో నిరంతరం ప్రయత్నం చేసేవారికి ఏదీ అసాధ్యం కాదు. విజయ సాధనకు ఏకైక సూత్రం అదే" అన్న బాపూజీ వాక్కు ఆయనకు మార్గదర్శక సూత్రం అయ్యింది. ఆయనే శ్రీ చలవాది మల్లికార్జునరావు.

1949 జూన్ 18న కృష్ణా జిల్లాలోని మైలవరంలో చలవాది జమలయ్య, నాగ రత్నమ్మ పుణ్యదంపతులకు జ్యేష్ఠ సంతానంగా జన్మించారు శ్రీ మల్లికార్జునరావు. మైలవరంలో 10వ తరగతిదాకా చదివి, మచిలీపట్నంలో పి.యు.సి. చేసిన ఆయన, నూజివీడు డి.ఎ.ఆర్. కళాశాలనుండి 1970లో బి. ఎస్సీ. పట్టా పొందారు. అదే సంవత్స రంలో ఎస్.ఐ.గా ఎంపికైనప్పటికీ,తండ్రి ఆకాంక్ష మేరకు ఆ ఉద్యోగాన్ని కాదని వ్యాపారం చేయదలచారు. “తక్కువ ధరతో ఎక్కువ వస్తువులు అమ్మాలి”, “తెచ్చిన బాకీలను అడగకుండానే చెల్లించాలి”, “వినియోగదారుడు దైవంలాంటివాడు”, “నీతినిజాయితీలు దైవ ప్రతిబింబాలు” అని తండ్రి నేర్పిన పాఠాలను ఆయన ఆకళింపు చేసుకున్నారు. ఆరుగురు సోదరులు, ఇద్దరు సోదరీమణులుగల పెద్ద కుటుంబం అవడంతో స్వతంత్ర భావాలుగల శ్రీ మల్లికార్జునరావు1971లో కొండపల్లిలో స్వతంత్రంగా ఎరువుల వ్యాపారాన్ని ప్రారంభించారు. అదే సంవత్సరం మే 5వ తేదీన ల||సౌ|| రాజేశ్వరితో వివాహం జరిగింది. దివిసీమ తుఫాను మూలంగా (1977) రైతుల జీవనం అతలాకుతలం అవడంతో ఆయన వ్యాపారం బాగా దెబ్బ తిన్నది. ఆ తరువాత సిమెంటు వ్యాపారం ప్రారంభించి మరింత నష్టపోయారు. గత్యంతరం లేక వ్యాపారాన్ని మాని నాగార్జునసాగర్‌లో కాంట్రాక్టరుగా పని

ప్రారంభించారు. అక్కడ కూడా నష్టాలే చోటుచేసుకోవడంతో జీవితం చాలా భయంకరంగా కన్పించింది. ఏం చెయ్యాలో తోచని స్థితి. మనోవ్యధతో రాత్రింబవళ్ళు ఆలోచించారు. ముగ్గురు పాపలతో-సునీత, మంజుల, మాధవి-జీవితపు నావను ఎలా నడుపుకోవాలి? అని మథనపడ్డారు. అప్పు అడిగితే అనేకమంది మిత్రులు, బంధువులు ముఖం చాటుచేశారు. ఆత్మాభిమానం అధికంగాగల ఆయన దాదాపు రెండు సంవత్సరాలు అజ్ఞాతంగా గడుపుతూ పలుప్రాంతాలు తిరిగారు.1984లో గోధుమల వ్యాపారం లాభ దాయకంగా ఉన్నదని తెలుసుకున్నారు కాని,మరి పెట్టుబడి? అమ్మాయి చెవిపోగులు అమ్మి, ఆ డబ్బుతో గోధుమలు కొనుగోలు చేశారు. ఆ వ్యాపారంలో లభించిన లాభాన్ని రూ. 13,000/ - చూసి ఇది కలా? నిజమా? అని ఆశ్చర్యపోయారు. ఆ రాత్రి లేచి ఆ మొత్తాన్ని మరొక్క పర్యాయం లెక్కించుకొని ఆనందించారు. నాటినుండి ఆయన దశ తిరిగింది.

ఎండమావి అనుకున్న జీవితం క్రమంగా ఆశాజనకంగా కన్పించసాగింది. ఆ సమయంలో ఒక మిత్రుడు తారు వ్యాపారాన్ని చేయమని సలహా ఇవ్వడం,తక్షణం ఒక ఇంజనీర్ 100 లారీల తారు తెప్పించమని అడగడంతో ఆయన రూట్ మారింది. క్రమంగా ఆ వ్యాపారంలో మంచి పేరు వచ్చింది. నిజాయితీగల వ్యాపారస్తుడన్న గుర్తింపు లభించ డంతో వ్యాపారాన్ని ముఖ్య నగరాలకు విస్తరింపజేశారు.1990లో పంతులుగారనే ఆయన సలహాతో ట్యాంకర్‌ను, ఆ తరువాత లారీని కొన్నారు. డి.జి.ఎస్, & డి. పద్ధతిన డిపార్ట్‌మెంట్ ద్వారా కంపెనీకి నేరుగా మెటీరియల్ అందజేసి, డబ్బులు వసూలు చేసుకునే పద్ధతి మూలంగా మంచి లాభాలు లభించాయి. 1992లో మాధవి ట్రాన్స్పోర్ట్ సంస్థను నెలకొల్పి 10 బండ్లు కొనడంతో వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లింది. ఆ మరుసటి సంవత్సరం విశాఖపట్నం, విజయవాడ, మద్రాసులలో ఆఫీసులు తెరవడం, సిబ్బంది నియామకంతో జీవితంలో స్థిమితం ఏర్పడింది.

కుటుంబ సభ్యులంతా ఆయన సహాయాన్ని కోరగా,జ్యేష్ఠ కుమారునిగా అందరిని ఆదుకొని తన ప్రత్యేకతను చాటుకున్నారు. అప్పటిదాకా ఆయనను అభిశంసించిన వారంతా ప్రశంసించసాగారు. పెండ్లికని, పేరంటానికని, విద్యకని-ఎవరు ఏ సహాయాన్ని అర్థించినా లేదనకుండా ఇచ్చి పంపడం ఆయన నిత్యకృత్యమైంది. బాపూజీ గ్రంథాలయ సంస్థను నెలకొల్పి తండ్రి జ్ఞాపకార్థం ఆయన ఆశయం మేరకు1995లో రూ. 3,40,000/ -తో ఎవరి సహాయం తీసుకోకుండా గ్రంథాలయ నిర్మాణం గావించడంతో ఆయన బాగా వెలుగులోకి వచ్చారు. 1998లో జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ఎస్.వి.ఆర్.జి. నరసింహారావు స్కూల్ నిర్మాణానికి రూ.1,50,000/ -, కృష్ణా జిల్లాలోని వెలగలేరులో పి. హెచ్.సి. బిల్డింగ్

కు ఒక లక్ష రూపాయలు విరాళం అందించారు. 1999లో యాక్సిడెంట్ కేర్ ట్రస్టు ఒక వ్యాను, ఆ తరువాత రూ. 2.60 లక్షల వ్యయంతో అంబులెన్స్ కొనుగోలు ఒక అంకమైతే, మైలవరంలో రూ. 5 లక్షల ఖర్చుతో 'చలవాది మల్లికార్జునరావు, రాజేశ్వరి కళ్యాణ మండపం' నిర్మించడం మరొక ఘట్టంగా పేర్కొనవచ్చు. ఆయన నేతృత్వంలో2001 మే 28న శంకుస్థాపన చేయ బడిన కళ్యాణ మండపం 9 మాసాల్లో పూర్తి అయి, 2002 మార్చి 3వ తేదీన రికార్డుకాలంలో ప్రారంభోత్సవం జరుపుకుంది. ఆ మరుసటి సంవత్సరం నుండి ప్రతి జనవరి 26న కుమార్తె మంజుల జన్మదినం సందర్భంగా పేదలకు వైద్య శిబిరాలు ఏర్పాటు చేస్తున్నారు. ఆనాటి నుండి ప్రతినెల 4వ ఆదివారం నాడు 900 నుండి 1000 మందికి ఉచితంగా మందులు, వైద్య సలహాలు అందించడంలో ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్నారు.

ఐ. ఓ.సి. మీటింగులకు వెళ్ళినప్పుడు అందరూ ఆంగ్లంలో మాట్లాడుతుంటే, తనకు ఆ భాష రాకపోవడం వెలితిగా అనిపించింది. తనకు లేనిదానిని ఇతరులైనా అనుభవించేటట్లు చేయాలన్న ఆలోచనతో నిరుపేద విద్యార్థినీ విద్యార్థులకు ఆర్థిక సాయం కార్యక్రమాన్ని 1995లో ఒక లక్షతో ప్రారంభించి, క్రమంగా పెంచుకుంటూ ఈనాడు దానిని 5 లక్షలకు తీసుకువచ్చారు. దానిని వచ్చే సంవత్సరానికి10 లక్షలకు రూపాయలకు పెంచాలన్నది ఆయన సంకల్పం. ఈ విధంగా నిరుపేదల విద్యకు, వైద్యానికి తన శాయశక్తులా సహాయం అందించడమే జీవిత లక్ష్యంగా పెట్టుకున్నారు ఆయన.

ఇంక గుప్తదానాలు ఎన్నో! ముగ్గురు విద్యార్థులు అమెరికాలో చదువుకోడానికి అవకాశం కల్పించారు. ఇద్దరు విద్యార్థులను దత్తత తీసుకొని ఒకరిని ఇంజనీర్ గానూ, మరొకరిని డాక్టర్ గానూ చేయించిన వదాన్యులు ఆయన. తన క్లాస్ మేట్ అనారోగ్యంతో బాధపడుతుంటే, హైదరాబాద్లో దగ్గరవుండి బైపాస్ చేయించారు. అన్ని ఖర్చులు తానే భరించారు. ఆ తరువాత అతనికి తన ఆఫీస్ లోనే ఉద్యోగం ఇచ్చారు. తన విజయాలకు పూర్తికారణం తన శ్రీమతి రాజేశ్వరి అందించిన సహకారమే అంటారు శ్రీ మల్లికార్జున రావు. ఆయన కుమార్తెలలో ఇద్దరు అమెరికాలో, ఒకరు విజయవాడలో ఉన్నత స్థితిలో ఉండటం ఆయన జీవన గమనంలో మరొక మైలురాయిగా, అదృష్టంగా పేర్కొనవచ్చు.

ప్రతిచిన్న ఇబ్బందికి అమితంగా వ్యధ చెందడం సున్నిత మనస్కులైన మిత్రులు మల్లికార్జునరావుగారికి అలవాటు. మనసున్న అలాంటి వ్యక్తులు హాయిగా, ఆనందంగా నవ్వులు చిందిస్తూ జీవన యానం సాగించడం వారికేగాక, సమాజానికి కూడా అత్యవ సరం. అందుకే 'హాస్య ప్రపంచం'ను శ్రీ చలవాది మల్లికార్జునరావుకు అంకితం ఇస్తున్నాను.



# స్వీకరించండి



## శ్రీ చలవాది మల్లికార్జునరావు
## శ్రీమతి రాజేశ్వరి



అభిమానంతో...

ఎం.ఆర్.కె. మూర్తి





# కానుక

ధనమున్ లక్షలు క్రుమ్మరించితివి విద్యావైద్య సౌకర్య క
ల్పన గావింపగ, నీ సతీతిలకమౌ రాజేశ్వరీదేవి నీ
వెనుకన్ నిల్వగ; మేలుమే! లోనగెదన్ క్రీతిన్ కృతిన్; మల్లికా
ర్జునరాయా! నవమల్లికార్జున రుచి స్ఫూర్తుల్ భవత్కీర్తులౌ.

ఆర్తుల మొగాల చీకట్ల నవల ద్రోసి
స్మిత శరచ్చంద్రికల నింపు వ్రతము నీది;
స్వీకరింపు మౌచిత్యంబు చెంగలింప
సరస హృదయ! 'హాస్య ప్రపంచమ్ము' నెమ్మి.

చలవాది వంశ వర్ధన!
కులభేద విదూర హృదయ! కోవిద సదయా!
కలకాలము మన స్నేహము
నిలుచుత 'హాస్యప్రపంచ' నిగదిత మగుచున్.





ఆచార్య నాగార్జున యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్,
కృష్ణ, గుంటూరు జిల్లాల కలెక్టర్ల నుండి
సెప్టెంబర్ 11, 2007న
ప్రతిభాపురస్కారాన్ని అందుకుంటున్న
రచయిత ఎం.ఆర్.కె. మూర్తి









## మాదర్తి రాధాకృష్ణమూర్తి

జననం : ది. 24-11-1940 పెద్దగొట్టిపాడు
(గుంటూరు జిల్లా)

తల్లిదండ్రులు : వెంకటరత్నం, వెంకటసుబ్బయ్య గార్లు

విద్య : ఎం.ఎ., ఎం.డి.పి.ఎ., ఎం.ఫిల్.

నిర్వహించిన : ప్రిన్సిపాల్, ఎస్. ఎస్. ఎన్. కళాశాల, నరసరావుపేట.

పదవులు
2. ఎడిటరు : వాసవీ ప్రభంతి (1981-2005)
3. జిల్లా మేనేజరు : వార్త దినపత్రిక (1999)
4. వ్యవస్థాపక కార్యదర్శి :
   జాతీయ స్టాంపుల సేకరణ సంఘం (1973-1985)
5. రోటరీ డిస్ట్రిక్ సెక్రటరీ (1994-1995)

పురస్కారాలు :
1. ప్రతిభా పురస్కారం,
   ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం (2007)
2. విద్యారతన్ అవార్డు, సుధారం ట్రస్ట్, బెంగుళూరు (2002)
3. 'కవిరత్న' సీలా జంగయ్య స్మారక అవార్డు,
   హైదరాబాదు (1996)
4. డిస్ట్రిక్ట్ లెవెల్ స్టాండింగ్ రొటేరియన్
   (రోటరీ డిస్ట్రిక్ట్ గవర్నర్ 2010)

రచనలు : హాస్య ప్రపంచం ; సూక్తి ప్రపంచం ; స్టాంపుల సరదా;
ప్రసంగం ఒక కళ; గమ్యాన్ని నిర్దేశించుకో; సమయ పాలన.

అభిరుచులు : స్టాంపుల సేకరణ, కలం స్నేహం, సమాజసేవ,
పలు అంశాలపై ప్రసంగాలు చేయడం.

## ప్రోత్సాహకులు



# శ్రీ జక్కా నాగభూషణం
# శ్రీమతి విజయలక్ష్మి

శ్రీ కాశీ అన్నపూర్ణ వాసవి ఆర్యవైశ్య వృద్ధాశ్రమం
మరియు నిత్యాన్నసత్రం, వారణాసి.

ప్రోత్సాహకులు :



# శ్రీ చలవాది మల్లికార్జునరావు

ఛైర్మన్ :

శ్రీ పొట్టి శ్రీరాములు, చలవాది మల్లికార్జునరావు

ఇంజనీరింగ్ కళాశాల, విజయవాడ.

# విషయసూచిక

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డా॥ సి.నారాయణ రెడ్డి**
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.,
ఎక్స్ ఎం.పి.
అధ్యక్షులు : ఆంధ్ర సారస్వత పరిషత్తు ట్రస్టు,
తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001.

# అభినందన

నవరసాల్లో హాస్యరసానికున్న స్థానం నిరుపమానం. హాస్యమూ ఒక రసమేనా అని అనేవాళ్లు లేకపోలేదు. ఈ గ్రంథం చదివితే వారికి తెలుస్తుంది హాస్యం విశ్వరూప మేమిటో.

హాస్యానికి సంబంధించిన ఎన్నో పార్శ్వాలను, అంశాలను, బింబాలను, రేఖలను మాచర్ల రాధాకృష్ణమూర్తి గారు ఈ గ్రంథంలో ఎత్తిచూపిన వైనం ముచ్చటగా ఉంది. ఎన్నెన్నో గ్రంథాలను చదివి అవి అందించిన విషయాలను తమ అనుభవాల్లో రంగరించి ఈ'హాస్య ప్రపంచాన్ని రూపొందించారు రాధాకృష్ణమూర్తి గారు. నానారకాల నవ్వులను సరికొత్త రీతిలో ఆవిష్కరించారు. ప్రాచీనాంధ్ర చిత్రకవిత్వంలోని కొన్ని ఉదాహరణలు ఈ రచనకు పుష్టి చేకూర్చేట్టుగా వున్నాయి.

ఇంతకూ నవ్వని వాళ్లెవరు? ఎప్పుడు చూసినా ముఖం ముడుచుకుని కూర్చునే వాళ్లు కూడా ఆయా సందర్భాల్లో లోలోపల నవ్వుకోకుండా వుండలేరు. ఈ సందర్భంగా నా సినీగీతంలోని ఒక పంక్తి గుర్తుకొస్తున్నది. “నవ్వే మనిషికి ముద్దు - కానీ - నవ్వుల పాలు కావద్దు”.చదివేవాళ్ల మనసులను హాయిగా ఎగరేసే విషయభారమున్న ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ మాచర్ల రాధాకృష్ణమూర్తి గారికి నా హార్దికాభినందన.

-డా|| సి. నారాయణ రెడ్డి

డా|| తుర్లపాటి కుటుంబరావు

The First 'Padma Shri' Awardee - Journalist in Andhra Pradesh
Recipient of: "International Man of the Year "Award (England)
"Guinness Book" Felicitation (Highest Number of Public Speeches)
"World Lifetime Achievement Award" (America)
"National Citizen Award" (Delhi) (in Journalism, Arts, Culture & Litt. from PM of India) Honorary Doctorate "Kala Prapoorna" By Andhra University

# 'హాస్యరస బ్రహ్మ'

తెలుగువారిలో హాస్యరసజ్ఞత తక్కువని, వారు సాధారణంగా నిత్య గంభీర ముద్రాంకితులని ఒకనాడు వుంది - "ఆంధ్రానామ్ అనేకత్వం" వలె!

అయితే, దక్షిణాదివారిలో తమిళులు, కన్నడిగులు హాస్యప్రియులు. వారిలో తమిళులు మరీ హాస్య ప్రేమికులు. ఒకవిధంగా వా ఇది కొన్ని తమిళ చిత్రాలలో కొట్టవచ్చినట్టు కానవస్తుంది! అందుకు తగ్గట్టుగానే వారికి ఎందరో హాస్యనటులు, హాస్యనట జంటలు పుట్టుకువచ్చారు. తెలుగులో కూడా హాస్యనటు లున్నా, వారిని వేళ్లపైనే లెక్కపెట్టవచ్చు.

తెలుగువారిది సున్నితమైన హాస్యం. హాస్యంలోనే సందేశం, నీతి కూడా మిళితమై వుంటాయి. ప్రాచీన తెలుగు కవులలో తెనాలి రామకృష్ణుని పేరు హాస్య రసానికి మరో పేరు. అయితే, ఆయన రచనలలోకంటే ఆయన వ్యవహార శైలిలోనే హాస్యం పాలు ఎక్కువ. దానిపై అనేక కథలు,గాథలు తెలుగునాట ఆబాలగోపాలానికి ఒకప్పుడు సుపరిచితమే! ఇప్పుడు కాదనుకోండి. ఇప్పటివారిలో చాలామందికి తెనాలి రామకృష్ణుడెవరో తెలియదు. రెండుసార్లు - టి. రామకృష్ణశాస్త్రి రామకృష్ణుడుగా ఒకసారి, అక్కినేని నాగేశ్వరరావుతో మరోసారి వచ్చిన ఆ హాస్య కవీంద్రుని చిత్రాలు చూడనివారైతే, "ఆయనెవరు?" అని ప్రశ్నించే ప్రమాదం వుంది!

ఇక హాస్య ప్రధాన రచయితలు తెలుగులో తక్కువే. ఈ సందర్భంలో మనకు వెంటనే స్ఫురించే రచయితలు-భమిడిపాటి కామేశ్వరరావు, ముళ్లపూడి వెంకట రమణలు కనిపిస్తారు; ఇటీవల 'శంకర నారాయణ' పదాల గారడీతో హాస్యం సృష్టిస్తున్నారు.

కాగా, తెలుగులో అప్పుడప్పుడు - అక్కడక్కడా - కొన్ని హాస్యపత్రికలు బయలు దేరకపోలేదు. వాటిలో చాలా 'పుబ్బ'లో పుట్టి, 'మఖ' వచ్చేసరికే మాయమైపోతున్నాయి!

అమెరికా నుంచి ఇంగ్లీషులో చాలా కాలంగా వెలువడుతున్న,నవ్వుల పువ్వుల వర్షం కురిపించే త్రైమాసికపత్రిక 'హ్యూమర్'. ఇక భారతదేశంలో హాస్య రచనలలో కుష్వంత్ సింగ్ వంటివారు కొన్ని'జోక్స్' గ్రంథాల ప్రచురణకు, స్వయంగా వ్యాసాల స్థాయి రచనలకు మాత్రమే పేరెన్నికగన్నవారు.

కాగా, భారతదేశంలో ఏ భాషలో కూడా హాస్యరసంపై బృహద్గ్రంథాలు వున్నట్టు కనిపించదు. ఆ లోటును తీర్చారు శ్రీ మాచర్ల రాధాకృష్ణమూర్తి (గుంటూరు జిల్లా, నరసరావుపేట).

'హాస్య ప్రపంచం' అన్న పేరుతో ఆయన హాస్యరసం పై ఒక ఉద్గ్రంథాన్నే రచించారు! (కచ్చితంగా 580 పేజీలు!) ఈ గ్రంథంలో మూర్తిగారు హాస్యరసాన్ని అన్ని కోణాల నుంచి మధించారు; హాస్యం పుట్టుపూర్వోత్తరాలను పరిశోధించారు.

ఇందులో 'నవ్వు కథాకమామీషు' తో ప్రారంభించి, 'హాస్యం ప్రయోజనాలు', 'హాయిగా నవ్వండి; ఆరోగ్యం పొందండి', 'మహిళల హాస్యం', 'భార్యాభర్తల హాస్యం', 'దేశవిదేశాలలో హాస్యం', 'విదేశీ ప్రముఖుల హాస్యగుళికలు', 'నవ్వుల జల్లులు' మొదలైన 40 ఉపశీర్షికలుగా గ్రంథాన్ని విభజించారు.

ఇందులోని ప్రతి శీర్షిక వినోదమే కాదు,విజ్ఞానం కూడా. దీనిలోని ప్రతి పేజీ క్రింద ఒక హాస్య సూక్తిని చేర్చడం ఈ గ్రంథానికి ప్రత్యేక ఆకర్షణ. వందలాది హాస్య ప్రవచనాలను సేకరించడం ఎంతో కష్టం!!

ఈ గ్రంథాన్ని మూర్తిగారు శాస్త్రీయ దృష్టితో రచించారు. దీన్ని చదివిన తరువాత శ్రీ రాధాకృష్ణమూర్తి తనకు తెలియకుండానే - అనుద్దేశపూర్వకంగానే = హాస్యరసం పై ' పిహెచ్.డి.' చేశారా? అనిపిస్తుంది.

ఔను! ఇదొక సిద్ధాంత గ్రంథమే; హాస్యం పై థీసిస్!

ఎంతో శ్రమపడి, ఎన్నో విదేశీ, స్వదేశీ రచనలను పరిశీలించి, పరిశోధించి, తెలుగు సాహిత్యంలో ఇదివరకు లేని ఇంత బృహద్గ్రంథాన్ని వెలువరించినందుకు శ్రీ మాచర్ల రాధాకృష్ణమూర్తిని మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

హాస్యరసంపై ఇంతటి మహా గ్రంథాన్ని రచించిన మాచర్ల రాధాకృష్ణమూర్తి గారు'హాస్యరస బ్రహ్మ' బిరుదు ప్రదానానికి అన్ని విధాలా అర్హులు! (భమిడిపాటి కామేశ్వరావు గారి బిరుదు - 'హాస్య బ్రహ్మ' మాత్రమే)

- పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు

**ప్రొ॥ వి. బాలమోహన్ దాస్**
విశ్రాంత వైస్ ఛాన్సలర్ :
ఆచార్య నాగార్జున యూనివర్సిటి

# అభినందన

మాన్యులు శ్రీ మాచర్ల రాధాకృష్ణమూర్తి నాకు చిరపరిచితులు. నేను చదివిన శ్రీ సుబ్బరాయ మరియు నారాయణ కాలేజి,నరసరావుపేటలో వారు రాజనీతి శాస్త్రం అధ్యాపకులుగా,ప్రిన్సిపాల్ గా పదవులు నిర్వహించారు. వృత్తిరీత్యా అధ్యాపకులు అయిన ప్పటికీ, ప్రవృత్తిరీత్యా వారు అనేక సమాజ కార్యకలాపాల్లో సదా నిమగ్నమయ్యేవారు. రోటరీ సంస్థలో డిస్ట్రిక్టు సెక్రటరీ పదవి నిర్వహించిన సేవాదురంధరులు.'వాసవీ స్రవంతి' మరియు 'ఫిలాటిన్' అనే పత్రికలకు దాదాపు రెండున్నర దశాబ్దాలు సంపాదకులుగా పనిచేశారు. స్టాంపుల సేకరణ ఒక సరదా అని అందరికీ తెలిసిందే. జాతీయ స్టాంపుల సేకరణ సంఘాన్ని స్థాపించి, దానికి 1971-81 మధ్య ఒక దశాబ్దకాలం వ్యవస్థాపక కార్యదర్శిగా ఉన్న ఘనత ఆయనదే. కలం స్నేహం,సమాజ సేవ, ఇంకా అనేక అంశాలపై సమగ్రంగా ప్రసంగాలు చేయటం ఆయనకు ఉన్న అభిరుచులు.'వార్త' తెలుగు దినపత్రికకు గుంటూరు జిల్లా మేనేజరుగా సంవత్సరంపాటు వ్యవహరించారు.

రాజనీతి శాస్త్రం మీద గ్రంథాలు, 'స్టాంపుల సరదా' పుస్తకం, మరియు10వేల సూక్తులతో కూడిన 'సూక్తి ప్రపంచం' అనే పుస్తకం వారి ప్రముఖ రచనలు. శ్రీ సుబ్బరాయ మరియు నారాయణ కళాశాల ప్రిన్సిపాల్ గా, అధ్యాపకులుగా విద్యార్థుల మనసులో ఎంత మంచి పేరు సంపాదించారో,అంత మంచి పాలనాధ్యక్షులుగా, అధ్యాపకులుగా నరసరావు పేటలో కొనియాడబడ్డారు. రాధాకృష్ణమూర్తి గారు సౌమ్యుడు,సమాజ సేవకు అంకితమైన వ్యక్తి. విద్యా రంగంలో విశేష కృషి సలిపి అందరికీ,ప్రత్యేకించి నాకు ఒక స్నేహితుడుగా, శ్రేయోభిలాషిగా తెలుసును. వారంటే నాకు ఎంతో గౌరవం. వారు 'హాస్య ప్రపంచం' ఒక ప్రతిని నాకు ఇచ్చి, దాని గురించి నా అభిప్రాయం వ్రాయమనడం జరిగింది. రాధా కృష్ణమూర్తి గారిలో ఈ కోణం ఉన్నదని నాకు ఇంతవరకు తెలియదు. హాస్యం మీద ఒక సిద్ధాంత గ్రంథంగా అది నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. పండితులకు, పామరులకు, హాస్యప్రియులకు ఒక చక్కటి కానుక ఈ పుస్తకం. పుస్తకంలోని ప్రతి పేజీ చదువుతుంటే నవ్వవలసిందే. రచయిత చెప్పినట్లుగా హాస్యం ఒక ఆప్తమిత్రుని వంటిది. అది మనల్ని

నవ్విస్తుంది, కవ్విస్తుంది, ఆనందపరవశుల్ని చేస్తుంది. అది ఒక గొప్ప ఔషధంలా కూడా పనిచేస్తుంది. “నవ్వు నాలుగు విధాల చేటు” అన్న నాటి నానుడి నేడు “నవ్వు నలభై విధాల స్వీటు” అన్న సూక్తిగా మారిందంటే హాస్యం గొప్పతనం మనకు అర్థం అవుతుంది. రచయిత అన్నట్లుగా హాస్యం ఒక అద్భుత ప్రక్రియ. ఇతరులతో కలసి నవ్వటం మానవత్వం అయితే, ఇతరులను చూసి నవ్వటం పశుత్వమనుకోవాలి. సమాజంలో ఏడ్వలేక కొందరు నవ్వితే, నవ్వలేక ఏడ్చేవారు కొందరు లేకపోలేదు.

Voice of America రేడియో కేంద్రం వారు అనునిత్యం "నవ్వు పులుముకోని ముఖం నీకు ఏదైనా తారసపడితే - నీ నవ్వులలో ఒకదానిని వారికి ఇవ్వండి” అని చెప్తుంటారని రచయిత వారి తొలి పలుకులో అంటారు. ఎంత బాగుంది! దాదాపుగా 25 సంవత్సరాల క్రితమే మునిమాణిక్యం నరసింహారావు గారి రచనలతో ప్రభావితులై, హాస్యం గురించి ఆమూలాగ్రంగా అనేక దేశవిదేశ గ్రంథాలు, పత్రికలు పరిశీలించి, పరిశోధన చేసి ఒక సమగ్రమైన గ్రంథాన్ని హాస్యం మీద రచయిత అందించారు.'మనిషి ఎందుకు నవ్వుతాడు?” దగ్గరి నుండి హాస్యం గురించి అనేక విషయాల మీద సంబంధిత హాస్యోక్తు లతో వ్రాయడం వారి రచనా శక్తికి దర్పణం. హాస్యం యొక్క రూపం, నిర్మాణం, స్వభావం, చరిత్ర, తత్వం, దృక్పథం, నైతికత, ప్రయోజనాలు మొదలగు వాటి మీద ఎంతో చక్కగా వ్రాశారు. దేశవిదేశాలలో హాస్యం, జాతుల హాస్యం, భార్యాభర్తల హాస్యం, మహిళల హాస్యం, పిల్లల హాస్యం అంటూ వివిధ వ్యక్తుల మధ్య జరిగే హాస్యాన్ని సోదాహ రణంగా చర్చించారు.

నవ్వుల క్లబ్బులు ప్రతి గ్రామంలో వస్తే ఎంత బాగుంటుందో! రచ్చబండ దగ్గర కూర్చుని ఉబుసుపోక పనికిరాని కబుర్లు చెప్పే బదులు వారికి తెలిసిన హాస్యాన్ని గ్రామస్థులు పంచుకుంటే, వారికి మరియు గ్రామానికి ఎంతో ఆరోగ్యం! హాస్యాన్ని ఇష్టపడేవారు ఎక్కువ కాలం జీవిస్తారని, మరణాన్ని కూడా ఆహ్వానిస్తారని చక్కగా విపులీకరించారు రచయిత. మోనాలిసా చిత్రం ఈ పుస్తకంలో జతపరచి ఆవిడ నవ్వు గురించి వ్రాయడం మరో హైలైట్. ప్రతి అధ్యాయం చివరన అధస్సూచికలు ఇవ్వటం వారి పరిశోధన ప్రావీణ్యానికి నిదర్శనం. ఈ పుస్తకాన్ని మొదటి వాల్యూమంటూ,రెండో వాల్యూమ్ రావచ్చును అని సూత్రప్రాయంగా తెలియజేశారు. దీనితోసహా హాస్యంమీద సమగ్రంగా ఆంగ్లంలో పరిశోధన గ్రంథం వ్రాసి ఏ యూనివర్సిటీకైనా థీసి గా సమర్పిస్తే పిహెచ్.డి. డిగ్రీకి తప్పకుండా అర్థమవుతుందని నా భావన.

*వి. బాలమోహన్ దాస్*

**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**
పూర్వ ఉపాధ్యక్షులు :
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,
శ్రీవాణి, 1-8.702/105, నల్లకుంట, హైదరాబాదు - 44.
ఫోన్ : 040 - 27633275

# చిరంజీవి హాస్యం

విశ్వనాథవారు రామాయణాన్ని కల్పవృక్షమంటే ఎంత ఆనందంగా ఉందో,ఇప్పుడు మాచర్ల రాధాకృష్ణమూర్తిగారు హాస్యాన్ని ప్రపంచమంటే అంత ఆహ్లాదంగా ఉంది.

జీవితంలో ఉన్న వైవిధ్యమంతా ప్రపంచంలో ప్రత్యక్ష మయినట్లుగానే హాస్య ప్రపంచంలో నవ్వుకు సంబంధించిన వివేక విజ్ఞానమంతా వెన్నెలలాగా విరగగాస్తోంది. ఇది హాస్యకళాపూర్ణోదయం!

నవ్వలేనివాడు నాగరికుడు కాడు. నవ్వు మనిషిలోని తమస్సును కరగదీస్తుంది; రజస్సును తొలగదోస్తుంది; సాత్త్విక తేజస్సును వెలికితీస్తుంది. చీకటి రాత్రి ముగిసి ఉషస్సు మొలిచినట్లుంటుంది. మనసుకు మందహాసం మానవతను చిగురింపజేసే మధు రౌషధం. రాధాకృష్ణమూర్తిగారు ఆ దివ్యౌషధాన్ని అక్షరామృతంతో కలిపి ఆంధ్రావళికి మోద మొసగేటట్లుగా అందించారు; అభినందనీయులు!

పుస్తకాన్ని చూచినప్పుడు ఇది హాస్యోక్తుల సంకలనమేమో అని భావిస్తాడు పఠిత. విషయసూచిక చూసింతర్వాత ఇది సిద్ధాంత గ్రంథమేమో అని ఆశ్చర్యపడతాడు. పుటలు తిరుగవేస్తూ హాస్యవిజ్ఞానాన్ని తేనెతో రంగరించి పెట్టిన రసాయనమా అన్నట్లు ఆస్వాదిస్తూ ఆనందిస్తాడు. ఒక్కమాటలో చెప్పాలంటే హాస్యాన్ని గురించి తెలుగులో వెలుగు చూచిన విజ్ఞానసర్వస్వమా? అని పఠిత ఆశ్చర్యపోతాడు. 580 పుటల ఈ గ్రంథంలో ప్రతి పేజీలో హాస్యం జీవించింది. హాస్యాన్ని గురించి సంస్కృతంలో ఉన్న సూక్తి మౌక్తికాలన్నీ ఈ గ్రంథంలో మిలమిలా నక్షత్రాల్లాగా మెరుస్తున్నాయి. తెలుగులో ఉన్న పద్యాలూ, పాటలూ, మాటలూ, ఛలోక్తులూ, హాస్యోక్తులూ, కథలూ, గాథలూ - ఎన్ని ప్రక్రియల్లో నవ్వు విరబూచిందో ఆ పూలమొక్కలన్నీ కలిసి ఈ గ్రంథంలో ఉద్యానవన శోభను కలిగించాయి. మహాకవి జాషువా గారన్నట్లు (చూడు. పుట 229)

**"నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్**
**దివ్వెలు, కొన్ని నవ్వు లెటు తేలవు, కొన్ని విషప్రయుక్తముల్**
**పువ్వులవోలె ప్రేమరసముల్ వెలిగ్రక్కు, విశుద్ధమైనవే**
**నవ్వులు సర్వదుఃఖ దమనంబులు వ్యాధులకున్ మహౌషధముల్"**

ఈ పద్యం లక్షణమైతే ఈ గ్రంథం ఒక మహాలక్ష్యం . ఇంత సరళంగా తెలుగులో హాస్యాన్ని అందించిన శాస్త్రీయ గ్రంథం నా దృష్టికి రాలేదు. ఈ రచయిత హాస్యాన్ని గురించి ఆంగ్ల భాషలో ఉన్న సాహిత్యాన్నంతా అగస్త్యునివలె ఆపోశనం పట్టిన పాండిత్య వీరాన్ని గమనిస్తే అద్భుతరసం అనుభవంలోకి వస్తుంది.

ఒక విశేషం. గ్రంథమంతా ఒక ఎత్తు. ప్రతి పుట చివరలో బార్డర్ కట్టి ఉంచిన ప్రసిద్ధ సూక్తులన్నీ కలిపితే ఏర్పడే విజ్ఞానం మరొక ఎత్తు. ఇన్ని సూక్తులను చదువు తుంటే హాస్య మహాసాగరంలో ఇన్ని ముత్యాలున్నాయా? అనిపిస్తుంది. "మనిషికి దైవం ప్రసాదించిన అద్భుత వరం నవ్వు" అనే సూక్తితో ఈ గ్రంథం ముగుస్తుంది. విష్ణుగర్భంలో సర్వప్రపంచ సృష్టినే దర్శించిన మార్కండేయ మహర్షి పెదవులమీద నిలిచిన వాడిపోని మందహాసం మన ముఖంమీద కూడా లాస్యం చేస్తుంది. "అవమానాన్నీ, క్రోధాన్నీ ఎదుర్కోగల ఒకేఒక ఆయుధం చిరునవ్వు" అని గాంధీజీ అన్నారు. ఆ ఆయుధాన్ని చిరు నవ్వుతో అందించిన మిత్రుడు శ్రీ మాచర్ల రాధా కృష్ణమూర్తి గారు. హాస్యాన్ని చిరంజీవిగా మార్చిన అక్షర చతురాననుడు శ్రీ మాచర్ల. వారికి నా హృదయపూర్వకమైన అభినందనలు!

*- జి.వి. సుబ్రహ్మణ్యం*

**డా|| కె. బ్రహ్మానందం**
సినీ హాస్యనటుడు,
జర్నలిస్టు కాలని-ఎ, జూబిలీ హిల్స్,
హైదరాబాదు.

# హాస్యప్రపంచం

మాచర్ల రాధాకృష్ణమూర్తి గారు విశేష కృషి చేసి,ఎంతో శ్రమకోర్చి వెలువరించిన ఉద్గ్రంథం 'హాస్య ప్రపంచం'! "హాస్యాన్ని సృష్టించడానికి మూడే మూడు సూత్రాలున్నాయి.... దురదృష్టవశాత్తు అవి ఎవరికీ తెలీవు" అన్నాడో ప్రముఖ హాస్యవేత్త! హాస్యాన్ని విశ్లేషించడానికి కూడా అంతేనని నా అభిప్రాయం! హాస్యాన్ని ఆనందించగలం తప్ప అభివర్ణించలేం! అటువంటి క్లిష్టతరమైన ప్రక్రియని ఇష్టతరమైన (!) విధంగా రూపొందించడానికి రచయిత పడ్డ తపన మనకి అడుగడుగునా (పేజీ పేజీనా) కనిపిస్తుంది... నవ్వు మీద ఇటువంటి పుస్తకం రాయటం నవ్వులాట కాదు!

ప్రపంచ వ్యాప్తంగా ప్రచురించబడ్డ ఎన్నో వ్యాసాలను,పుస్తకాలను, సమీక్షలను అధ్యయనం చేసి ఒక శాస్త్రీయ గ్రంథ పరిమాణంలో ఈ హాస్య ప్రపంచాన్ని ఆవిష్కరిం చటం హాస్యంపట్ల రచయితకున్న అభిరుచిని, మక్కువనే గాక గౌరవాన్ని కూడా తెలియ జేస్తుంది. ఈ ప్రయత్నంలో ఆయన ఎంతోమంది లబ్ధప్రతిష్ఠులైన (హాస్య) రచయితల రచనల్ని కూలంకషంగా అధ్యయనం చేశారన్నది సుస్పష్టం! శరీర నిర్మాణశాస్త్రం,మనోవైజ్ఞానిక శాస్త్రాల ప్రాతిపదికగా నవ్వుని, హాస్యాన్ని విశదీకరించి శాస్త్రీయ దృక్పథాన్ని జోడించటం ద్వారా ఈ రచన యొక్క ప్రామాణికతను పెంచటం అభినందనీయం!

విస్తృతమైన విషయ సేకరణ వల్ల ఈ పుస్తకం ఓ సిద్ధాంత గ్రంథం స్థాయికి చేరింది. మరింతగా సమాచార సేకరణ చేసుకోవాలన్న ఆసక్తిగల పాఠకుల కోసం రచయిత ఈ పుస్తకంలో 'రిఫరెన్సు'ల రూపంలో వివిధ గ్రంథాల వివరాల్ని కూడా తెలియపర్చారు!

అలాగే, హాస్యం గురించి దేశవిదేశాల్లోని ఎందరో రచయితలు, మేధావులు, తత్వవేత్తలు వెలిబుచ్చిన అభిప్రాయాలను సేకరించి 'కొటేషన్లు'గా, ఇందులో ప్రచురించటం ఈ పుస్తకానికి వన్నె తెచ్చింది. అయితే ఇవన్నీ ప్రధానంగా పాశ్చాత్యులవే కావటానికి కారణం - మనవాళ్లు హాస్యాన్ని సృష్టించటానికి మాత్రమే ప్రాముఖ్యతనిస్తే, వాళ్లు దాన్ని విశ్లేషించడానిక్కూడా ప్రాధాన్యతనివ్వడమే కావచ్చు!

తెలుగు సాహిత్యంలో చిలకమర్తి, గురజాడ, మునిమాణిక్యం, భమిడిపాటి, ముళ్లపూడి, శ్రీరమణలాంటి ప్రముఖ రచయితల హాస్య సృ(వృష్టి) మనందరికీ సుపరిచితమే..... సందర్భానుసారంగా ఆయా రచనల్లోని చెణుకుల్ని, చమత్కారాన్ని ఒకచోట ఏర్చికూర్చిన రచయిత కృషి మెచ్చుకోదగ్గది! అలాగే, 'ప్రఖ్యాత హాస్యకారుల' పేరిట చేర్చిన అధ్యాయంలో విఖ్యాత హాస్యనటులైన శ్రీయుతులు అల్లురామలింగయ్య, రమణారెడ్డి, రేలంగి, పద్మ నాభం గార్ల హాస్యనట జీవితంలోని మెరుపుల్ని, తళుకుల్ని రచయిత ప్రస్తావించారు. మరి 'జాతుల హాస్యం' అనే ఛాప్టర్‌లో హాస్యాన్ని వర్గీకరించి వాళ్ల వాళ్ల సంస్కృతుల,అలవాట్ల నేపథ్యంలో విడమర్చి వివరించటం, సందర్భోచితంగా హాస్యోక్తుల్ని ఉదహరించటం రచయితకున్న పరిశోధనాసక్తికి తార్కాణం! కేవలం రచనలకే పరిమితం కాకుండా, హాస్య వ్యంగ్యాల కలయికగా సమాజ హితాన్ని కోరే శక్తివంతమైన ప్రక్రియ - కార్టూన్ కళ గురించి కూడా ప్రస్తావించి శ్రీ బాపు,ఆర్.కె. లక్ష్మణ్ లాంటి మహనీయులతోపాటు ఎందరినో స్మరించటం హర్షణీయం! ప్రపంచంలోని వివిధ నవ్వుల క్లబ్‌లు, నవ్వుల సంఘాల గురించి వివరించటం సమాచార సమగ్రతకు దోహదపడింది!

ఆ 'హాస్యరసాధి దేవత' గణపతి ఆశీస్సులతో, 'హాస్య ప్రపంచం' రెండవ భాగాన్ని తీసుకురావాలన్న రచయిత ఆకాంక్ష త్వరలో నెరవేరాలని మనందరం కోరుకుందాం!

**-బ్రహ్మానందం!!**

**డా॥ ధర్మవరపు సుబ్రహ్మణ్యం,**

పూర్వాధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి,
పి. & టి. కాలనీ, హైదరాబాద్ - 500 060.
ఫోన్ : 040-24047641

# మార్గగామి

నవరసాల్లో వొకటైనప్పటికీ 'హాస్యం' ఉపరసంగానే వుండిపోయింది గానీ, ప్రధానరసంగా పరిగణించబడలేక పోయింది. ఎప్పుడో అడపాదడపా 'హాస్యం' ప్రధాన రసంగా ఒకటీ అరా కావ్యా లూ, అయిదో ఆరో నవలలూ, పదో పన్నెండో నాటికలో, నాటకాలో మన భాషలో వచ్చాయి. అయితే గురజాడ వారి 'కన్యాశుల్కం' తరువాతనే ప్రయోజనాత్మక హాస్య సాహిత్యం బహుళ ప్రచారం పొందింది. తదాదిగ 'నరసింహావ' తారాలు పానుగంటి, మొక్కపాటి, మునిమాణిక్యం, చిలకమర్తి గారలు హాస్యాన్ని పండించి గాదెలకు పోశారు. నరసింహమనే ఉగ్రనామం ఉంటేనే గానీ హాస్యం రాయలేరేమో.

సినిమాల్లో అయినా అంతే. హాస్యమే ప్రధానంగా వచ్చిన సినిమాలన్నీ ప్రజాదరణ పొందినప్పటికీ హాస్య చిత్రాలు మాత్రం పదుల్లోనే వుంటాయి. ఉప్మాలో జీడి పప్పులాగా, పులిహోరలో కరివేపాకులాగా మాత్రమే ఉపయోగపడుతున్నది తెలుగు చలనచిత్రాల్లో హాస్యం. అయితే హాస్యాన్ని గురించి అధ్యయనం చెయ్యడానికి తెలుగులో సమగ్ర హాస్య గ్రంథాలేవీ లేకపోవడం బాధాకరం. ఇన్నాళ్ళకు మన భాషలో ఈ “హాస్యప్రపంచం” అనే పరిశోధనాత్మక హాస్య ఉద్గ్రంథాన్ని భగీరథ ప్రయత్నంలా శ్రీ మాచర్ల రాధాకృష్ణమూర్తి గారు వెలువరించడం అభినందనీయం. గ్రంథరచన కోసం వారెంత తపనపడివుంటారో, అంతకు మించిన ఫలితాన్ని “హాస్యప్రపంచం” అందిస్తుందనడంలో సందేహమే లేదు. ఈ మార్గంలో ప్రయాణిద్దామనుకునే వారికి ఇది 'మార్గగామి'. ఇంతటితో ఆగకండి మాచర్ల వారూ! ఇంకా కొనసాగించండి మీ హాస్య వ్యవసాయాన్ని.

హాస్యం సృష్టించబడదు. 'క్షీరసాగర మథనం'లో అమృతంతో బాటు అనేక వస్తువులు బయటపడ్డట్టు, ఏదో చేస్తుంటే హాస్యం బయటకొస్తుంది. హాస్యమే చెయ్యాలనుకుంటే ఏదో బయటపడుతుంది!

కథానాయకుణ్ణి నాయకుడుగాడు అనరు. ప్రతి నాయకుణ్ణి దుష్టుడుగాడు అనరు. కానీ హాస్యం చేసేవాణ్ణి మాత్రం 'హాస్యగాడు' అంటారు. అందుకే హాస్యంపై చిన్నచూపు పోవాలి. అందుకు రాధాకృష్ణమూర్తి గారి "హాస్యప్రపంచం" దోహదం చేయాలి. మరోసారి వారికి అభినందనలు.

-ధర్మవరపు సుబ్రహ్మణ్యం

డా॥ చేరెడ్డి మస్తాన్ రెడ్డి,
ఎం.ఏ., పిహెచ్.డి.
విశ్రాంత ప్రిన్సిపాల్, ఎస్.కె. ఆర్.బి.ఆర్. కళాశాల,
నరసరావుపేట.

## 'హాస్యాత్మ'

నవరసాలలోన నవనవలాడెడి
హాస్య మెల్లరకు నుపాస్య మిపుడు;
హాస్యలాస్య విగళి తాస్యంబు దాస్యంబు
సలుపు నెపుడు పెను విషాదమునకు

హాస్య రహస్యముం దెలియు నాస్థ జనించిన వేళ మీర లీ
'హాస్య ప్రపంచముం' దెరువుఁడల్లన! కన్నుల ముందు నెందఱో
హాస్యరసాత్ములైన దొర లంచితలీలను గానుపింత్రు! మీ
ఆస్యములందు కుందకుసుమావళి దీధితి కుస్తరింపగన్

మా గురుదేవు డెంద మను మంజుల వారిద మండలంబునన్
డాగురుమూతలాడిన కడాని మెఱుంగిదె గజ్జెకట్టె! మీ
లోగిళులందు నిండుగ వెలుంగులు పొంగు! సుధాతరంగముల్
స్వాగత మాలపించును చిరాయు రనామయ దాయకంబులై

మాచర్లాన్వయ దుగ్ధవార్ధిశశి రమ్యప్రాభవాఢ్యుండు వి
ద్యా చాతుర్య వికాసభాసురుడు రాధాకృష్ణమూర్త్యా హ్వయుం
డీ చిద్రూపనిధాన భవ్యకృతి నందించెన్ ప్రజాకోటి; కీ
రోచిస్తోమము హాస్యలోకమున చంద్రుండౌను! సూర్యుండునౌ!

-చేరెడ్డి మస్తాన్ రెడ్డి

రెండవ ముద్రణ గురించి

# మీతో రెండు మాటలు

తన జోక్స్ బుక్స్ అమితంగ అమ్ముడుపోవడమే భారతదేశంలో హాస్యానికి అత్యంత ఆదరాభిమానాలు ఉన్నాయనడానికి గొప్ప తార్కాణం అన్నారు ప్రఖ్యాత రచయిత కుష్వంత్ సింగ్. 'హాస్యంపై పరిశోధనా గ్రంథం'గ పలువురు ప్రముఖులచే అభివర్ణింపబడిన 'హాస్యప్రపంచం' ప్రతులు అతి తక్కువ కాలంలోనే మార్కెటింగ్ అవడం ఒక పార్శ్వం అయితే,ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంవారు ఈ గ్రంథానికి 'ప్రతిభాపురస్కారం' అందజేయడం హాస్యరసంతో బాటు హాస్య సిద్ధాంత రచనలను అటు మేధావులేగాక, ఇటు సామాన్య పాఠకులుకూడా స్వాగతిస్తారనడానికి గొప్ప ఉదాహరణ. **'గమ్యాన్ని నిర్దేశించుకో',** 'సమయపాలన' రచనలలో నిమగ్నమై ఉన్నందున 'హాస్యప్రపంచం' రెండవ ముద్రణలో జాప్యం అయి పాఠకులను కొంత అసౌకర్యానికి గురిచేసినందుకు కొంత బాధగా ఉన్నప్పటికీ, ఈ కాలంలో దీనిలో అనేక మార్పులు, చేర్పులు చేసి ఈ గ్రంథాన్ని మరింత ఉపయుక్తంగ, మరింత సాధికారికంగ తీర్చిదిద్దగలిగినందుకు కించిత్తు ఆనందంగానూ ఉంది.

ప్రాచీన భారతంలో హాస్యం కొరవడిందని ప్రముఖ రచయితల అభిప్రాయంతో తొలి ముద్రణలో మేమూ ఏకీభవించినది నిజమే. అయితే దక్షిణ ఆఫ్రికాకు చెందిన ప్రముఖ పరిశోధకులు మైఖేల్ క్లాస్విన్, హంగ్ లఫలొట్టె షాంక్స్ అద్భుత పరిశోధనా వ్యాసాన్ని చదివిన తర్వాత సంభ్రమాశ్చర్యాలతో బాటు ఒకింత గర్వం కూడా కలిగింది. విదేశీ ప్రముఖులు ప్రాచీన భారత సంస్కృత సాహిత్యాన్ని మర్దించి, అనూచానంగ విన్పిస్తున్న అభిప్రాయం పొరపాటని విమర్శనాత్మకంగ నిరూపించిన ఉదాహరణలు చదువుతూ సంభ్రమాశ్చర్యాలకులోనయితే, భారతీయ సాహిత్యం హాస్యరసానికి ఏనాడో ప్రాధాన్యం ఇచ్చిందని తెలుసుకుని సహజంగనే గర్వపడ్డాను. ఫలితంగ 'ప్రాచీన భారతంలో హాస్యం' (అధ్యాయం : 16) జోడించడం జరిగింది.

అనాదిగ ప్రపంచవ్యాప్తంగ మానవునికి అత్యంత సన్నిహితమూ, ఆత్మీయమైంది నాటకరంగం. ఒక ఉద్యమాన్ని వ్యాప్తి చేయాలన్నా, ఒక సంస్కరణను సమాజంలో ప్రవేశపెట్టాలన్నా, ఒక దురాచారాన్ని ఎండగట్టాలన్నా సగటు మనిషికి అర్థమయ్యే రీతిలో, 'అందమైన రూపంలో, ఆత్మీయ ధోరణిలో ఒప్పించగలిగేది, నచ్చజెప్పగలిగేది నాటకం ఒక్కటే! దానికి హాస్యరసం జోడించినప్పుడు మెరుగైన ఫలితాలు లభిస్తాయని నాటక చరిత్ర

మనకు స్పష్టం చేస్తుంది. అంతేకాదు. నాగరికత పెరిగే కొద్దీ మనిషి ఒంటరివాడు అవుతూ, రంగ స్థలం మీద కన్పించే సజీవ పాత్రలను చూడడానికి మరింత ఉత్సాహ పడతాడని, అందుకే అది చిరంజీవి అని జాహ్నవి ఆచారేకర్ (Call off the curtain, The Hindu 29-8-10) పేర్కొనడం గమనార్హం . నాటకం ఆనందంలో జన్మించింది, నవ్వులతో ఎదిగింది. దాని పుట్టుక, వ్యాప్తి గొప్ప రసానుభూతిని కల్గిస్తాయి. అందుకే 'నాటకరంగం - హాస్యరసం'(అధ్యాయం 27) కు రెండవ ముద్రణలో సముచిత స్థానం కల్పించబడింది. నాటకరంగంలో విశేష అనుభవంగల జర్నలిస్టు మిత్రుడు, మాజీ లైబ్రేరియన్ శ్రీ కె.వి.కె.రామారావు ఈ అధ్యాయం తయారీలో అందించిన సాయానికి ప్రత్యేక ధన్యవాదములు.

హాస్యాభిమాని, మిత్రుడు పెద్ది సాంబశివరావుగారు గుంటూరు నుండి 'హాస్య ప్రపంచం' పై సుదీర్ఘలేఖ వ్రాస్తూ కొసమెరుపుగా ఈ రచనను 'హాస్యవ్రతకల్పం'తో ముగిస్తే మరింత శోభ చేకూరుతుందన్నారు. ఇది ' ఊ

'ఉసలు' రాయుడు (ఉసలు అంటే ఉచిత సలహాలు అని ఆయన అర్థం లేండి!) పనికాదు, ఉత్తమ మిత్రుని భావన అంటూ ప్రత్యేక కృషిచేసి దానికి అవసరమైన కొంత సరంజామాను పంపినందుకు ఆయనకు ఆత్మీయ కృతజ్ఞతలు. దాని సాయంతో 'హాస్యవ్రతకల్పం' (అధ్యాయం:42) తయారు చేసినతర్వాత ఈ రచనకు మరొక వినూత్నకోణం ఏర్పడిందని సంతసించాను.

అలానే 'నవ్వు-చరిత్ర', 'వ్యంగ్య చిత్రాలు - కళారూపాలు', 'హాస్య సిద్ధాంతాలు' మొదలగు అధ్యాయాలలో అనేక మార్పులు చేసి, వాటికి సంబంధించిన చిత్రాలను నెట్ నుండి తీసుకుని జతపరచాము. హాస్యం సానుకూల ధోరణిలో ఉండాలని పదేపదే ప్రస్తావించిన ఈ రచనలో 'సంక్షోభసమయంలో హాస్యం' అన్న అధ్యాయం వ్యతిరేక ధోరణిలో నడిచిందన్న భావనతో ఆ అధ్యాయాన్ని తొలగించాము.

తెలిసిన పగలు గురించి యోచిస్తూ తెలియని రాత్రిని గురించి మనిషి భయపడినట్లే, జీవితాన్ని గురించి తెలిసిన మనం తెలియని మరణాన్ని గురించి అనవసరంగ భయపడుతున్నామేమో అన్న అద్భుత ఆంగ్ల గేయం శీర్షికగాని, రచయిత పేరుగాని మాకు జ్ఞప్తికి లేదని పేర్కొనగా (అధ్యాయం:36) బందా శ్రీనివాసరావుగారు హైదరాబాదు నుండి దాని పూర్తి వివరాలు అందించినందుకు కృతజ్ఞతలు.

కొన్ని అధ్యాయాలలో రచయితలు/పరిశోధకుల పేర్లు అధికంగ ఉన్నాయని, హాస్యోక్తులకు భిన్నమైన ఫాంట్ వాడాలని, సామాన్య పాఠకునికి అందనిరీతిలో క్లిష్టంగ ఉన్న కొన్ని వివరణలను సరళంగ మార్చాలని, పుస్తకం నిడివి తగ్గించాలని - ఇలా ఎందరో పాఠక మహాశయులు అందించిన ఎన్నో సలహాలను వీలైనంతవరకు అమలు పరచామని చెప్పడానికి ఆనందిస్తున్నాము.

ఇంక నా సహధర్మచారిణి ఒకవైపు డిటిపి చేస్తూనే కొంత ఎడిటింగ్ పనులు నిర్వహించగా, అబ్బాయి అనిల్ కుమార్, కోడలు శ్రీవిద్య ఈ పుస్తకాన్ని అందంగ తీసుకురావడంలో ఎంతో శ్రమించారు. మనవరాలు హారిక తనకు నచ్చిన హాస్యోక్తులు చదువుతూ గొప్పగ ఆనందించడం ఈ పుస్తక తయారీలో కల్గిన భారాన్ని కొంత తగ్గించింది.

ఈ విధంగ తీర్చిదిద్దబడిన 'హాస్యప్రపంచం' పాఠక మహాశయా....... ఇప్పుడు మీ చేతులలో ఉంది. ఎప్పటివలెనే మీ సూచనలు, సలహాలు పంపుతారని ఆశిస్తూ..... ఇంక సెలవు.

మాచర్ల రాధాకృష్ణమూర్తి

# మనలో మాట

"మన పక్క గదిలో ఉన్న పాతికమంది ఆడవాళ్ళను ఓ పది నిమిషాలవరకు ఎవ్వరూ మాట్లాడకుండా చెయ్యగలవా?" సవాల్ విసిరాడు కిరణ్. "ఓ......అదెంతపని" హామీ ఇచ్చాడు చరణ్. "అదెలా?" ఆశ్చర్యంగా అడిగాడు కిరణ్. "చూస్తుండు" అంటూ ఆ గదిలోకి వెళ్ళి "మీలో కాస్త పెద్ద వయసుగలవారు ఓ పది నిమిషాలు మాట్లాడండి" అన్నాడు చరణ్. అంతే! ఆ గదిలో నిశ్శబ్దం తాండవించింది!

రాంబాబు : రాత్రి మీ ఇంట్లో దొంగలు పడ్డారంటున్నావ్. అయినా నీకు కరాటేలో బ్లాక్ బెల్టు ఉంది కదా! వాళ్ళను చితకబాదకపోయావా?

శ్యామ్ : నేను గదిలోకెళ్ళి కరాటే డ్రస్సు వేసుకొని బెల్టు తగిలించుకొని వచ్చేసరికి పారిపోయారు పిరికిపందలు.

హాస్యం ఒక ఆప్తమిత్రుని వంటిది. అది మనల్ని నవ్విస్తుంది, కవ్విస్తుంది, ఆనందపరవశుల్ని చేస్తుంది. అది మన పరిచయాలను పెంచుతుంది. వీటన్నింటికీ మించి ఉత్సాహంగా, ఆనందంగా జీవించడానికి అవసరమైన పరిసరాలను సృష్టిస్తుంది. వాతావరణ కాలుష్యం గురించి నిరంతరం ఆందోళన చెందుతున్న నేటి తరానికి హాస్యం సాయంతో పరిసరాలను ఆహ్లాదకరంగా తీర్చిదిద్దవచ్చు. మరొక విశేషం. హాస్యం గొప్ప ఔషధిలా పనిచేస్తుంది. అదొక ఆరోగ్యదాయిని, ఆనందదాయిని. "నవ్వు, ఆరోగ్యంగా ఉండు" అన్న సామెత సారాంశం ఇదే. అందుకే నవ్వులేని జీవితం దుర్భర దారిద్ర్యంతో సమానం అవుతుంది. మనిషిలో నవ్వు ఉద్వేగాన్ని తగ్గిస్తుం దని ఫ్రాయిడ్ ఉద్ఘాటించాడు. ఆవిధంగా అన్ని రచనలకు,ఉపన్యాసాలకు, కార్టూన్లకు, ఆనందానికి....జీవంలా హాస్యం ఎదిగింది. ఎందరో మేధావులు ప్రపంచవ్యాప్తంగా హాస్యంపై పరిశోధనలు చేసి పిహెచ్. డి.లు, ఎం.ఫిల్.లు పొందడం హాస్య ప్రాధాన్యాన్ని తెలపడానికి మరొక ఉదాహరణ.

ఆనందానికి సూచిక, ఆహ్లాదానికి సంకేతం నవ్వు. "నవ్వు నాలుగు విధాల చేటు" అన్నారు ఆనాడు, "నవ్వు నాలుగు విధాల గ్రేటు" అన్నారు. నిన్నటిదాకా. "నవ్వు నలభై విధాల స్వీటు" అంటున్నారు ఈనాడు. నిజానికి మానవ జీవితమే ఓ గొప్ప హాస్యోక్తి!

మనిషికి మరణం తథ్యం. అయితే,మనిషి మరణించిందాకా జీవించాల్సిందే కదా! అందుకే జీవితకాలంలో హాయిగా ఆనందించడం నేర్చుకోవాలి. బౌద్ధధర్మ సిద్ధాంతకర్త శ్రీ ఆనంద్ శ్రీకృష్ణ తన గ్రంథం 'బుద్ధ ధర్మసారం, ఆచరణ'లో వివరించినట్లు మనం శాంతి,

సంతోషాలతో ఉంటే సమాజంలో వాటిని వ్యాపింప చేయగలుగుతాం. మనం దుఃఖంతో ఉంటే దుఃఖాన్నే వ్యాపింపచేస్తాం. మనలో అంతర్గతంగా ఏది ఉంటే దానినే ఇతరులతో పంచుకుంటాం, వ్యాపింపచేస్తాం. కనుక సంతోషాన్ని, దాని బహిర్గతరూపం అయిన నవ్వును మనం ఎప్పుడూ దూరం కానివ్వకూడదు. నిజానికి ఆనందం ఎప్పుడూ మనలోనే ఉంటుంది. అది ఉచితంగా, సమృద్ధిగా అన్నిచోట్ల లభిస్తుంది. ఎటొచ్చీ దానిని చూసే ఓర్పు కావాలి; స్వీకరించే మనస్తత్వం కావాలి.

మన దైనందిన జీవితంలోని వైచిత్రిని గమనించగలిగితే మన జీవితాలలో ఎన్నో నవ్వుల పువ్వులు పూస్తాయి. మన చుట్టూ ఉన్న సామాజిక పరిస్థితులలోని అపసవ్య ధోరణులను చూసి ఆనందించగలిగితే అంతటా నవ్వులే మిగులుతాయి. “పెళ్ళంటే నూరేళ్ళ పంట” అన్నది నానుడి. వరకట్నం చావులు, అత్త, ఆడపడుచుల వేధింపులు, భర్త నిర్లక్ష్యం - వీటిలో ఒకదాని ఆధారంగా చక్కని హాస్యోక్తిని తయారుచేసి “పెళ్ళంటే నూరేళ్ళ తంట” అంటే ఎంత ఆనందం కలుగుతుంది! ప్రపంచవ్యాప్తంగా మే నెల మొదటి ఆదివారంనాడు నవ్వుల దినోత్సవాన్ని ఘనంగా జరుపుకుంటున్నారు. “బాధ నుండి నవ్వును జనింపజేసేది హాస్యం. నవ్వు ద్వారా బాధను తెచ్చేది అపహాస్యం” అన్నాడు జోయల్ గుడ్ మన్. అందుకే మనం కడుపారా నవ్వుతూ ఇతరులను కూడా మనసారా నవ్వించగలగాలి.

విచిత్రమేమంటే అందరికీ సుపరిచితమైన హాస్యం లోతుపాతుల్లోకి వెళితే, అదొక కొరకరాని కొయ్యగా, అంతుచిక్కని ప్రశ్నగా మిగిలిపోతుంది. నిజానికి ఇదొక వింతగా విన్పించవచ్చు. విడ్డూరంగా కన్పించవచ్చు. అయినా ఇది యథార్థం. మనిషి ఎందుకు నవ్వుతాడు? దీనికి సమాధానంగా ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మేధావులు నూటికి పైగా ..... సిద్ధాంతాలు నిర్మించారు! నవ్వు రూపం మొదలైన అనేక ప్రశ్నలకు ఆ రచనలలో సమాధానాలు లభిస్తాయి.

సృష్టిలో బహుశా నవ్వని నరుడు ఉండడు. అయితే, ఆ నవ్వులలో హాస్యపూరిత నవ్వు, వేడుకోలు నవ్వు, విషపు నవ్వు, అజ్ఞానపు నవ్వు - ఇలా భిన్నరూపాలు కన్పిస్తాయి. నవ్వుకు ప్రతిరూపాలుగా అనాదిగా వస్తున్న విదూషకుల గురించి, దేశవిదేశా లలో హాస్యం, ప్రపంచ ప్రముఖ హాస్యోక్తులు, హాస్యం దృక్పథం,జాతుల హాస్యం, హాస్యం - నైతికత, తెలుగు సాహిత్యంలో హాస్యం, హాస్యం ప్రయోజనాలు, హాస్యతత్త్వం, హాస్యం రూపం : నిర్మాణం, నవ్వితే నగుబాట్లా? మొదలైన అనేక విషయాల గురించి ఇందులో వివరించాం. పాఠకుల సౌలభ్యం కొరకు అనేక హాస్య క్రీడలను కూడా అందించాం. అలానే మహిళా హాస్యం, పిల్లల

హాస్యం, భార్యాభర్తల హాస్యం, ప్రపంచ నవ్వుల క్లబ్ మొదలగు అనేక అధ్యయనాల సారాంశాన్ని ఇందులో పొందుపరచాం. హాస్యంపై ప్రపంచ వ్యాప్తంగా జరిగిన శాస్త్రీయ పరిశోధనలను గురించిన ఎంతో విలువైన సమాచారాన్ని సామాన్య పాఠకుడికి అందుబాటులో ఉండే రీతిలో సులభశైలి లో అందజేయడానికి ప్రయత్నించాం. ఈవిధంగా హాస్యం విశ్వరూపాన్ని పాఠకుల ముందుంచాలన్నది మా ఆశయం.

ఒక మనిషి ఒకే కాలంలో ఒకానొక వ్యక్తి లేదా ఒకానొక వస్తువు గురించి ప్రేమ, ద్వేషంవంటి పరస్పర విరుద్ధ భావాలు కలిగి ఉండడాన్ని ద్విసం వేగస్థితి అంటారు. హాస్యంలో ద్విసం వేగస్థితిని గురించి ఆంబ్రోస్ సుదీర్ఘంగా వివరించారు. మానవ మేధకు ఒక ప్రత్యేకత ఉంది. అది ద్విపాత్రాభినయం చేస్తుంది. హాస్యాన్ని సృష్టించడమేగాక దానిని తిలకించే, ఆనందించే శక్తి కూడా దానికి ఉంది. మానసిక ఆనందాన్ని కలిగించడంలో ఇది ఎంతగానో ఉపయోగపడుతుంది.

హాస్యం ఒక అద్భుత ప్రక్రియ. ఇతరులతో కలసి నవ్వడం మానవత్వమైతే, ఇతరులను చూసి నవ్వడం పశుత్వం అనిపించుకుంటుంది. గోతిలో పడిన అభాగ్యుణ్ణి చూసి, అరటి తొక్కపై కాలువేసి జారిపడినవానినిగాంచి, విచిత్ర వేషధారణ చేసిన వానిని,నత్తితో వత్తుతూ, యాసతో మాట్లాడేవానిని చూసి నవ్వుతాము! అంటే జాలిపడాల్సిన చోట కొందరు నవ్వులు చిందిస్తే,సానుభూతికి బదులుగా మరికొందరు నవ్వుతారన్నమాట. ఏడవలేక కొందరు నవ్వితే, నవ్వలేక ఏడ్చేవారూ కొందరు లేకపోలేదు.

హాస్యసిద్ధాంతాలు మానవస్వభావాన్ని అవగాహన చేసుకోడానికే గాక,హాస్యాన్ని ఆనందించాల్సిన పద్ధతులను కూడా తెలుపుతాయి. అలానే, కాలానుగుణంగా మానవాళిలో వచ్చిన మార్పులను ఆ సిద్ధాంతాలు మనముందుంచుతాయి. ప్రాచీన కాలంలో ఎవరినైనా గదిలో బంధించి ఏడ్పిస్తే, అది జనాన్ని నవ్వులలో ముంచేది. ఇంకా వెనక్కుపోతే నిందితుణ్ణి రాళ్ళతో కొట్టి చంపడం అద్భుత హాస్యాన్ని సృష్టించేది. మరి ఈనాడో?

నవ్వు మనిషి ఆత్మ అగాధాల నుండి పెల్లుబుకుతుంది. కొన్ని సమయాలలో అది బాధతో ప్రారంభమై, బాధలన్నింటినీ అధిగమిస్తుంది. అందుకే కొందరు నవ్వును ఆత్మజ్ఞానం, విజ్ఞానం, ఋషితత్వాలతో జత చేయవచ్చంటారు. అది ఆనందాన్ని పంచిపెడుతుంది. "నవ్వు పులుముకోని ముఖం నీకేదైనా తారసపడితే, మీ నవ్వులలో ఒకదానిని వారికి ఇవ్వండి" అని వాయిస్ ఆఫ్ అమెరికా రేడియో కేంద్రంవారు అనునిత్యం చెప్పడానికి కారణం ఇదే.

భారతీయ తత్త్వం ఆధ్యాత్మికతకు, గాంభీర్యానికి ప్రాధాన్యమిస్తుందే కాని, లౌకిక విషయాలకు - అందునా హాస్యానికి అంతగా ప్రాధాన్యం ఇవ్వదు. ప్రాచీన భారతీ యుల దృష్టిలో జీవితం మోక్ష ప్రాప్తికి, ఆధ్యాత్మికతకు ఉద్దేశింపబడిందే కాని, ఆడంబరాల ప్రదర్శనకు, ఆనందాలలో తేలియాడటానికి కాదు. అందువల్లనే ప్రాచీన సాహిత్యంలోనే కాక, ఇటీవలి కాలందాకా భారతీయ రచనలలో హాస్యంపాలు అతి తక్కువగానే కన్పిస్తుంది. అది కన్పించినచోట కూడా ప్రధానంగా విజ్ఞతతో సాహచర్యం చేయడంతో అది మరింత అరుదైన వస్తువు అయిపోయింది.

హాస్యం అనిర్వచనీయమైనది. దానిని మనం పరిశీలించవచ్చు, ఆనందించ వచ్చు కాని, అభివర్ణించలేము. జీవితాన్ని గంభీరంగా తీసుకుంటే అన్నీ బాధలే మిగులు తాయి, వేదనలే కన్పిస్తాయి. ఒక దేశ సాంస్కృతిక జీవన స్వభావాన్ని, లక్షణాన్ని హాస్యం మారుస్తుంది. హాస్యానికి క్షాళన లేదా పునీతం చేసే శక్తి ఉన్నది. అందుకే కాబోలు “ఒక వందమంది చెయ్యలేని పనిని ఒక హేళన కార్యం చేస్తుంది” అన్నారు శ్రీశ్రీ.

హాస్యం ఒక చిత్రాతిచిత్రమైన కళ. దానిని గురించి అందరూ మాట్లాడతారు. అందరూ దానిని ఆనందిస్తారు. కాని..... విచిత్రమేమంటే..... దానిని గురించి పూర్తిగా ఎవ్వరికీ తెలియదు. అందుకే లారెన్స్ పీటర్ మహాశయుడు "హాస్యాన్ని సృష్టించడానికి మూడే మూడు సూత్రాలున్నాయి. ఆ సూత్రాలేమిటో..... దురదృష్టవశాత్తు..... ఎవ్వరికీ తెలియదు” అన్నారు! అలాగని హాస్యాన్ని విడనాడలేము కదా! దానిని గురించి తెలుసుకోడానికి మనం మరింతగా కృషి చేస్తే తప్పనిసరిగా సమాధానం దొరుకుతుంది. ప్రయాణాన్ని ప్రారంభించకుండా గమ్యాన్ని చేరలేనట్లే నోరు తెరవకుండా నవ్వలేము. ఆ నోరును అందంగా తెరిపించడానికే....... ఈ ప్రయత్నమంతా!

హాస్యం మనిషికి ఎంత సన్నిహితమైనదో, అంత క్లిష్టమైనది కూడా. దానికి సంబంధించిన సిద్ధాంతాలు, దాని పై జరుగుతున్న పరిశోధనలు మొదలైన అంశాలను మరిం త క్లిష్టతరం చేసి సామాన్య పాఠకుణ్ణి గందరగోళపరచడం మా అభిమతం కాదు. కొన్ని పేజీలలో విషయాన్ని లోతుగా చర్చించినప్పటికీ, దానిని సామాన్య పాఠకునికి కూడా అందుబాటులోకి తీసుకురావాలన్న ధ్యేయంతో కొన్ని హాస్యోక్తులు ఇస్తూ, వాటిని వివరిస్తూ సిద్ధాంతాన్ని విశ్లేషించడానికి ప్రయత్నించడం జరిగింది. ఈ విధంగ పాఠకుడు హాయిగా విషయాన్ని చదువుకోడానికి వీలుగాను, ఇందులో ఆసక్తిగలవారికి అవసరమైన సమాచారాన్ని రిఫరెన్స్ రూపంలో ప్రతి వ్యాసం చివరలోను అందజేశాము.

ప్రపంచం మొత్తంలో 50 హాస్యోక్తులు మాత్రమే ఉన్నాయని,అవి అసలు సిసలైన మూల, మౌలిక(Original) హాస్యోక్తులని, మిగిలినవన్నీ మనం అలంకరించి, నగిషీలు చెక్కి తయారుచేసిన నకిలీ హాస్యోక్తులని కొందరు విజ్ఞుల ఉవాచ. ఆ అభిప్రాయం ఎంతవరకు సరైనదో ఆలోచించాల్సిందే! పరిశుద్ధ హాస్యం అందరికీ ఆనందం కలిగిస్తుంది. ఒక వర్గాన్ని లక్ష్యంగా పెట్టుకొని విసిరే హాస్యోక్తులు నిజానికి అపహాస్యంలో ఒక భాగం మాత్రమే! హాస్యోక్తిని చెప్పేవాళ్ళనే కాక, వినేవాళ్ళను కూడా మనసారా నవ్వించగలిగేదే నిజమైన హాస్యం.

హాస్యోక్తులన్నా, హాస్యం అన్నా నాకు అమితమైన సరదా. 1980లో ఆంధ్ర విశ్వవిద్యా లయంలో ఎం.ఫిల్. చేస్తూ లైబ్రరీలో యాదృచ్ఛికంగా మునిమాణిక్యం నరసింహారావు గారి రచన 'మన హాస్యము' (1965) చదివిన తర్వాత హాస్యం చరిత్ర గురించి, దాని శాస్త్రీయ ప్రయోజనాల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగింది. ఇంక విశ్వవిద్యాలయం గ్రంథాలయంలోని ఆంగ్ల విభాగం కాటలాగ్ తీసి హాస్య గ్రంథాల వివరాలను సేకరించాను. నాటినుండి హాస్యం నవ్వుకు సంబంధించిన వందలాది ఆంగ్ల, తెలుగు వ్యాసాలను, పుస్తకాలను సేకరించి ఒక బీరువాలో భద్రపరుస్తూ వచ్చాను.

1998లో ప్రిన్సిపాల్ గా పదవీ విరమణ చేసిన తర్వాత పదివేల సూక్తులతో కూడిన'సూక్తి ప్రపంచం' (2003) ప్రచురణ పూర్తి అయినతరువాత నా దృష్టినంతా హాస్యంపై కేంద్రీకరించాను. అమెరికాలోని Humor Project Inc. తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, అంతర్జాతీయ హాస్య పరిశోధనలో మేటి పత్రిక అయిన Humorను తెప్పించడం, ఆ అంశంపై ఎన్నో విలువైన గ్రంథాలను సేకరించడం, ఇంటర్నెట్ ద్వారా విలువైన సమాచారాన్ని పొందడం జరిగింది. ఇందులో ఉదాహరించిన పరిశోధనలు,రచయితల అభిప్రాయాలు ప్రధానంగా పాశ్చాత్యులవే! హాస్యానికి సంబంధించిన పరిశోధనలు, ప్రచురణలు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన దేశాలలో జరగడమే దీనికి ప్రధాన కారణమని పాఠకులు గమనించ ప్రార్థన.

ఈ రచనను ఆసాంతం ఓపికగా చదివి,తన విలువైన సూచనలు, సలహాలతో నాకెంతో సాయం అందించిన మిత్రుడు, పెదనందిపాడు కళాశాలలో తెలుగు రీడర్గా సేవలందించి, ఇటీవలే రిటైర్ అయిన డా|| జి. రామారావును గురించి ఎంత వ్రాసినా అసంపూర్ణమే అవుతుంది. ప్రిన్సిపాల్ గా గురుతర బాధ్యతలు నిర్వహిస్తూనే, నా మీద అభిమానంతో తీరిక చేసుకొని ఈ రచన మొత్తాన్ని అతితక్కువ కాలంలో ఎంతో ఆసక్తితో

చదివి, అనేక సూచనలు అందించడమేగాక, చక్కని పద్యాలుకూడా వ్రాసి ఇచ్చిన డా|| చేరెడ్డి మస్తాన్ రెడ్డి, అలానే విలువైన సలహాలు ఇచ్చిన డా|| పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి గార్లకు, ఈ రచనలోని కొంత భాగాన్ని 'హాస్యం ఆనందదాయిని, ఆరోగ్యదాయిని' అను శీర్షికతో మూడు భాగాలుగా ప్రసారం చేసిన ఆలిండియా రేడియో విజయవాడ వారికి ప్రత్యేక ధన్యవాదములు తెలుపుతున్నాను. తన 'హాస్య జ్యోతి' నుండి చిత్రాలను, సమాచారాన్ని ఉపయోగించుకోడానికి ఎంతో అభిమానంతో అనుమతించిన శ్రీరమణ గారికి, ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన మురళీ ఆఫ్సెట్ ప్రింటర్స్ వారికి, సుందరంగా ముఖచిత్రం గీసి ఇచ్చిన దేవీ ప్రసాద్ గారికి ధన్యవాదములు.

కులమతాలతో సంబంధం లేకుండా అర్హులైన పేద విద్యార్థినీ విద్యార్థులకు ప్రతి సంవత్సరం రూ.5 లక్షల విలువగల ఉపకార వేతనాలు అందిస్తున్న ఆదర్శమిత్రుడు చలవాది మల్లికార్జునరావు. “ఆధునిక సమాజానికి హాస్యంపై రచనలు అత్యంత అవసర మండి! మీరు మేధావులకే గాక, సామాన్యులకు కూడా అందుబాటులో ఉండే రచనగా హాస్యప్రపంచాన్ని తీర్చిదిద్దగలరు గనుక అది బాగా హిట్ అవుతుంది” అని ప్రోత్సాహ పరచిన ఆయనకు ఈ రచనను అంకితం ఇవ్వడం ఎంతో ఆనందంగా ఉంది. నా శ్రీమతి రామలక్ష్మి, కుమారుడు అనిల్ కుమార్, కోడలు శ్రీవిద్య ఓర్పుగా, నేర్పుగా కంప్యూటర్ పనిని అందంగా తీర్చిదిద్దడంతో బాటు విలువైన సూచనలు చీమడంతో నాపని అతి సులువైంది. ఇంక చిత్తుప్రతి తయారీలో యు. రాధాకుమారి, కె.శైలజల పాత్ర ప్రశంసనీయమైనది.

హాస్యం అంతులేని కథవంటిది. దానికి ఆఖరి అధ్యాయం ఉండదు, ఉండ కూడదు. ఈ రచనను హాస్య సర్వస్వంగా మార్చాలన్నది మా సంకల్పం. అందుకే విజ్ఞులైన పాఠకుల సలహాలను, సూచనలను అర్థిస్తున్నాము.

అధ్యాయం 1

# నవ్వు కథాకమామీషు

**ఉపోద్ఘాంతం : అవధానం** జోరుగా సాగుతూంది. అవధాని మంచి స్ఫురద్రూపి. అయితే, నెత్తిమీద జుట్టు మాత్రం బాగా పలచగా ఉంది. మాటిమాటికీ ఆయన జేబులోంచి దువ్వెన తీయడం, తల దువ్వుకోవడం అప్రస్తుత ప్రసంగం చేసేవానికి మంచి అవకాశం కదా! "అవధానిగారూ! మీ నెత్తి మీద ఉన్నవే నాలుగు వెంట్రుకలు. వాటిని పదేపదే పరామర్శించాలా?" అని ప్రశ్నించడంతో సభ నవ్వులలో మునిగి పోయింది. అవధాని అంటేనే సభను రక్తి కట్టించేవాడనికదా! "నా బాధ నీకేం తెలుస్తుంది నాయనా.... ఎనభై ఎకరాలు ఉన్న ఆసామి ఎలా ఖర్చు చేసినా ఫర్వాలేదు. మరి రెండే రెండు ఎకరాలు ఉన్నవాడు జాగ్రత్తగా ఆలోచిస్తూ ఖర్చు చేయాలికదా! నా పరిస్థితీ అంతే. అయినా ఒత్తుగా జుట్టున్న నీలాంటి అదృష్టశాలికి నాలాంటివాని బాధలు అర్థంకావులే!" అనడంతో సభలో మరొక్కమారు నవ్వుల పువ్వులు పూశాయి.

**వెనుకటికి** ఒకానొక వెంకట్రావు అమెరికాలో పరిశోధనలు గావిస్తున్న వినోద్ "అమెరికాలో నువ్వు ఏమి చేస్తావు?" అని ప్రశ్నించాడు."పరిశోధనలు చేస్తానండి. నన్ను రిసెర్చ్ స్కాలర్ అంటారు"అని వినయంగా పరిచయం చేసుకున్నాడు వినోద్.

**వెంకట్రావు** : దేని పైన పరిశోధన చేస్తావు?

**వినోద్** : కప్పల పైనండి

**వెంకట్రావు** : మా ఇంటి ప్రక్కన... మురుగు కాల్వలో కన్పించే...కప్పల పైన పరిశోధన చెయ్యడానికి అమెరికా దాకా వెళ్ళాలా? ఏం చదువులో ఏమిటో!... అని సాగదీశాడు.

నవ్వు ప్రపంచ భాష. అది మానవాళికే ఆప్తమిత్రుడు. ఇంతకూ నవ్వు అంటే ఏమిటి? మనిషి ఎందుకు నవ్వుతాడు? అన్న ప్రశ్నలకు ఎందుకు సమాధానం చెప్పలేకపోతున్నామో పరిశీలిద్దాం. ముందుగా నవ్వు పుట్టుక, నిర్వచనం, లక్షణాలు, హాస్యప్రవృత్తి గురించి తెలుసుకుందాం.

**పుట్టుక - అర్థవివరణ** : ఇంక 'నవ్వు' యొక్క అర్థవివరణలోకి వెళదాం. నిజానికి హాస్యం అంటే ఏమిటో వివరించడం కష్టమే అయినప్పటికీ చక్కని హాస్యరసాన్ని చవిచూసినప్పుడు మన మనస్సులో కలిగే ఆనందానుభూతులు మధురంగా ఉంటాయని మాత్రం స్పష్టంగా

---

మనోవిజ్ఞానక్షేత్రంలో ఏర్పడిన ఆనందానుభూతి హాస్యం. – మోరియల్

చెప్పవచ్చు. హాస్యం అనే పదానికి నిఘంటువు ఇచ్చే అర్థాలను క్లుప్తంగా రెండు భాగాలుగా విభజించవచ్చు.

1. నవ్వు పుట్టించే నమ్మశక్యం కాని భావాలను, సంఘటనలను, పరిస్థితులను మానసికంగా గమనించి, గ్రహించి, ఆనందించడం హాస్యం. కనుక, హాస్యచతురుడు అంటే అలాంటి సంఘటనలను తిలకించడమేగాక, వాటి ద్వారా ఆనందాన్ని పొందేవాడు అని అర్థం...

ఒక చీమ, ఒక ఏనుగు మోటార్ సైకిల్ పై షికారుకి పోతున్నాయి. దారిలో యాక్సిడెంట్ జరిగి ఏనుగుకు బాగా గాయాలయ్యాయి. కాని, చీమకు ఎటువంటి దెబ్బలు తగల్లేదు. కారణం ఏమిటి? సింపుల్ .... చీమ హెల్మెట్ ధరించి ఉంది. అంతే!

2. ఒకానొక సంఘటన కలిగించే అనుభూతి ఆనందం. అయితే, ఎలాంటి సంఘటన నమ్మశక్యం కాని, నవ్వు పుట్టించే అంశాలు కలిగి ఉంటుందో... అదే హాస్యం.

ముద్దుగా పెంచుకునే బొద్దుగా ఎదిగిన కుక్క తోకను కోశాడు మధు. “చక్కగా ఉన్న దాని తోకను అన్యాయంగా ఎందుకలా కోశారు?" ప్రశ్నించింది మధు భార్య శశి. “మా అత్తగారు వస్తున్నారు కదా! ఆమెకు ఎలాంటి స్వాగత సూచనలు కన్పించడం నాకు ఏమాత్రం ఇష్టం లేదు” అన్నాడు మధు! -

దీనినిబట్టి **హాస్యం కొన్ని సంఘటనల లక్షణం కాదని, అందంలా అది మనలోనే ఉందని** తెలుస్తుంది. అయితే.... కార్టూన్లు, జోకులు, విచిత్ర ప్రవర్తన మొదలైన ఉత్తేజకర లక్షణాలు మనకు హాస్యం కలిగించవచ్చు. అది మన మానసిక స్థితిని మార్చవచ్చు. అంటే, హాస్యం ఒక ప్రవర్తన కానప్పటికీ కొన్ని రకాల ప్రవర్తనలు మనకు హాస్యం కలిగిస్తాయన్నమాట!

మొత్తంమీద తర్కరహితంగా, అసంబద్ధంగా, అందరూ ఊహించేదానికి భిన్నంగా ఒక సంఘటనలోని అంశాలను కూర్చినట్లయితే, అది నవ్వు తెప్పిస్తుంది. ఆ క్రమం అర్థవంతంగా కన్పించినప్పుడు అందులోని అర్థరాహిత్యం కనుమరుగై హాస్యాన్ని జనింపజేస్తుంది. ఆక్షేపించడం, కించపరచడం మూలంగా కొందరిలో నవ్వు జనిస్తుంది.

ఆకాశవాణి విజయవాడ కేంద్రంవారు ఒకసారి చలంగారిని ఏదైనా కథ వ్రాసి పంపమని కోరారట. అందుకు చలంగారు 'గో టు హెల్' అని ఒక కథను పంపారు. ఆ విషయం తెలుసుకున్న శ్రీ శ్రీ ముక్కు మీద వేలేసుకొని “అయ్యో పాపం.... వాళ్ళు ఉన్నదే హెల్లో కదా! మరింకెక్కడికి పోతారు?” అన్నారట!

---

ఇద్దరు వ్యక్తుల మధ్య దూరాన్ని అతి తక్కువ చేసేది చిరునవ్వు. – విక్టర్ బోర్గ్

అలానే **వింతగొలిపే విషయాలు, అసంబద్ధ విషయాలు కూడా నవ్వు తెప్పిస్తాయి. ఒక రోజు** సావిత్రిగారింట్లో అన్నం బాగా పాచిపోయింది. దానిని కూతురికి పెడితే, వద్దంది. పనిమనిషికి ఇస్తే "ఆ అన్నం బాగాలేదమ్మా" అంటూ ముఖం తిప్పింది. చివరకు కుక్కకు పెడితే, అది కూడా మూతి తిప్పేయడంతో "ఆ అన్నాన్ని పారవేయ మంటావా అమ్మా?" అని అడిగింది పెద్దమ్మాయి పద్మ. "రాత్రికి మీ నాన్నకు పెడదాంలే తల్లీ. దానిని పారవేయకమ్మా" అంది సావిత్రి లాలనగా.

హాస్యం గురించిన చరిత్రపుటలు తిప్పేముందు ప్రపంచంలో అతిపురాతన హాస్యోక్తిని ఒకదానిని చూద్దాం.

ప్రాచీన గ్రీసు దేశంలో ఓ ఒంటికంటి రాక్షసి ఉండేది. దాని రూపానికి తగినట్లుగానే, దాని పేరు కూడా విచిత్రంగా Nobody (ఎవ్వరూకాదు)అని పెట్టారు. ఆ రాక్షసి ఆగడాలను సహించలేని రాజు తక్షణమే దానిని చంపేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. రాజభటులు దానిని తీసుకుపోతుండగా అది తిరగబడి సిపాయిలను చంపబోవడంతో భయకంపితులైన సిపాయిలు "Nobody మమ్మల్ని చంపుతుంది. రక్షించండి" అని అరుస్తున్నా జనం పట్టించుకోలేదట!

క్రీ.పూ. 800 సం||లో జరిగిన ఈ ఉదంతం ప్రపంచంలోని అతి పురాతన హాస్యోక్తుల లో ఒకటిగా చెబుతారు.

**హాస్యం ఎలా జన్మించిందనగా....**మనలో అధికంగా ఉన్న ఉద్రిక్తతలను తొలగించగలిగే రక్షాకవచంలాంటిది హాస్యం. వినోదం లేదా హాస్యంను ఆంగ్లంలో Humour / Humor అంటారు. ఇది లాటిన్ భాష నుండి ఉద్భవించింది. హ్యూమర్ అంటే ఆర్ధ్రత, తడి, తేమ, ద్రవము అని అర్థం. అయితే, ఆనందబాష్పాలతో కళ్ళు నిండటం అన్న భావనతో దానిని ఉపయోగిస్తున్నారో లేక ఆనందపారవశ్యంలో మునిగితేలడంవల్ల ఆ పేరు పెట్టారో తెలియదు. ఈ పదం యొక్క అర్థం ఈ నాటి స్థితికి ఎలా చేరిందో చారిత్రకంగా పరిశీలించినప్పుడు చాలా ఆసక్తికరంగా ఉంటుంది.

ప్రాచీన, మధ్యయుగ, పునరుజ్జీవన కాలాలలో శరీర శాస్త్రం ప్రకారం మానవ స్వభావం అతని శరీరంలోని నాలుగు ద్రవములు (Humor) - పసుపు పిత్తం (పైత్యరసం - Yellow bile), నల్ల పిత్తం (Black bile), రక్తము మరియు కఫము పై ఆధారపడి ఉంటుంది. భిన్న వ్యక్తులలో ఈ ద్రవాలు భిన్న పాళ్ళలో సమ్మేళనమై ఉంటాయి.

---

ఈ సమ్మేళనం ఆధారంగా ఆయా వ్యక్తుల రంగు,భౌతిక, మానసిక లక్షణాలు, వారి ఆలోచనాసరళి, ప్రవృత్తి నిర్దేశించబడతాయని మన పూర్వీకులు విశ్వసించారు. ఈ నాలుగు ద్రవాలు సమపాళ్ళలో ఉన్నప్పుడు మనిషి స్థితి సమతౌల్యంగా ఉంటుందని (Good Humour ఉన్నవాడు), అందులో ఏదైనా ఒక ద్రవం అధిక మొత్తంలో ఉన్నప్పుడు అతని వ్యక్తిత్వంలో వ్యత్యాసం కన్పిస్తుందని వారు భావించారు. ఉదాహరణకు, మనిషిలో పసుపు పైత్యం అధికంగా ఉన్నప్పుడు అతనిలో పైత్యరసం పెరిగి క్షణాలలో ఉద్రిక్తుడవుతూ ముక్కోపిగా కీర్తి గడిస్తాడు. అలాంటి వ్యక్తులలో ప్రతీకారవాంఛ అధికం. అతనికి పదునైన మనసు ఉంటుంది. అత్యాశ,గర్వం, వ్యవహార దక్షత ఆతని సొంతం. అలానే, నలుపు పిత్తం అధికమైనప్పుడు అతనిలో విషాదం, నిర్వేదం, డీలాతనం పెరుగుతాయి. రక్తం అధికంగా ఉన్నవాడు ఆశావాదిగా మారగా, కఫం పాలు పెరిగిన వ్యక్తి మందకొడితనంతో సోమరిగా ఉంటాడని, అతనికి జీవితంపట్ల ఉదాసీనత పెరుగుతుందని వారు విశ్వసించారు. ఈ విధంగా హ్యూమర్ అనే పదం మానసిక స్థితిని తెలిపే పదంగా మారింది. క్రమంగా అది మనలను మైమరచి హాయిగా ఆనందింపజేసే మంత్రదండంగా, జనావళికి ప్రీతిపాత్రమైన క్రీడగా ఎదిగింది.

మరి నవ్వు అంటే ఏమిటి? క్రీ.పూ. 4,5 శతాబ్దాలలో గ్రీసు దేశంలో ప్రసిద్ధ రచయితలుగా కీర్తి గడించిన **ప్లేటో, అరిస్టాటిల్** ప్రభృతులు **"అధికంగా, వింతగా, హాస్యాస్పదంగా ఉన్నదానిని సరిదిద్దేది నవ్వు"** అన్నారు. క్రమంగా దాని అర్థం విచిత్రంగా మారిపోయింది. 16వ శతాబ్దంలో Humor అంటే ఒకానొక అస్థిరమైన మానసిక స్థితిని కలిగి సహేతుకం కాని చపలత్వంతో, కొన్ని దుర్లక్షణాలతో కూడి ఉండటం అని విశ్వ సించారు! ఒక ద్రవం అధికంగా కలిగి ఉన్నవానిని Humorist అని, ఇతరులు నవ్వు కోడానికి అనువైనవాడని భావించారు. ఆ తరువాత దాని అర్థం మరొక మలుపు తిరిగి హాస్యకారుడు, హాస్యచతురుడు అనే భావంలో ప్రయోగించబడింది. 18వ శతాబ్దం నుండి నేటిదాకా పరిహాసశీలుడు, కొంటె కోణంగి, హాస్య ప్రసంగం చేసేవాడు, హాస్య నటుడు, హాస్యరచయిత అనే అర్థంలో ఆ పదం ప్రయోగించబడుతూంది.

విచిత్రమేమంటే నవ్వు అంటే ఏమిటో మనకు తెలిసినా దానిని గురించి పూర్తిగా చెప్పలేము. **లాటిన్ భాషలో నవ్వు అంటే రుచిచూసే విధానం, సారం అని అర్థం.** అందువల్లనే అందంవలె నవ్వు కూడా ఆయా వ్యక్తుల దృక్పథం పైన ఆధారపడి ఉంటుంది. “నాకు తుమ్ము వస్తుంది" అని చెప్పినప్పుడు నీ ప్రక్కనున్న వ్యక్తి నీ జేబురుమాలు తీసుకుంటే అది క్రూరమైన

---

తాత్వికుల దృష్టిలో నవ్వు ఎప్పుడూ నేరమే! – రాబర్ట్ ఇంగర్ సాల్

చర్యేకదా! నిన్ను దిగంబరుల పార్టీకి ఆహ్వానించినప్పుడు, అక్కడి మహిళా సభ్యురాండ్రను చూస్తూ నువ్వెంతో హుషారుగా ఉండవచ్చు. ఆ తరువాత విదూషకుడు వచ్చి నిన్ను వివస్త్రుణ్ణి చేసి ముచ్చటగా ముస్తాబైన వారిమధ్య నిలబెట్టినప్పుడు అది అందరికీ నవ్వు తెప్పించినా, నీకు మాత్రం ఘోర పరాభవంగా ఉంటుంది కదూ! అందుకే షా ఫెర్ వంటి మేధావికూడా "హాస్యాన్ని నిర్వచించడం అసాధ్యం. సాలెగూడును రేఖాగణిత సూత్రాలతో వివరించ బూనడం ఎంత నిష్ప్రయోజనం అవుతుందో, హాస్యం గురించి వ్యాఖ్యానించడం కూడా అంతే అవుతుంది" అనగా, "హాస్యానికి దాడి, వ్యతిరేకత, క్రూరత్వం, మనోవికారాలతో సంబంధం ఉన్నది" అంటారు డా॥ మార్టిన్.

**'నవ్వు' నిర్వచనం**:నవ్వు / హాస్యం అన్న పదాలు మానవాళికి ఎంత సన్నిహితమైనవో, వాటి వివరణ లేదా నిర్వచనం అంత కష్టంగా, క్లిష్టంగా ఉండటం నిజంగా నవ్వు తెప్పిస్తుంది. నవ్వు అంటే ఏమిటి? అని పొరపాటున ఎవరైనా ప్రశ్నిస్తే "చదివి చదివి వీడికేమైనా మతి చలించిందా ఏమిటి? నవ్వు అంటే ఏమిటని ప్రశ్నిస్తున్నాడు. ఔరా" అంటూ ముక్కు మీద వేలేసుకుంటారు!

ఈనాడు 'నవ్వు' గురించి సుమారు 500 నిర్వచనాలు ఉన్నాయంటే, నవ్వు ఎంత సంక్లిష్టమైనదో ఇట్టే అర్థమవుతుంది. గతంలో నవ్వును తాత్విక దృక్కోణం నుండి పరిశీలించగా, ఆధునికులు దానిని మనోవిజ్ఞానశాస్త్ర దృక్కోణం నుండి అధ్యయనం చేయసాగారు. విచిత్రమేమంటే నవ్వు విషయంలో మన పూర్వీకులవలె నేటి మేధావులు కూడా దానిని ఖండఖండాలుగా చూశారేగాని,అఖండంగా చూడలేకపోయారు. ఏనుగు గురించి ఏడుగురు గ్రుడ్డివారు ఏడురకాలుగా వర్ణించిన కథలాగే, నవ్వు నిర్వచనాలలో కూడా ఇదే వైచిత్ర్యం కన్పిస్తుంది. సంక్లిష్ట విషయాలపై రచయితలలో భిన్నత్వం, కొన్ని సందర్భాలలో వైవిధ్యం ఉండటం సాధారణమే. అయితే, నవ్వు విషయంలో ఆ వైవిధ్యం కాస్తా వైరుధ్యంగా మారడంతో చదువరులకు ఆనందం కలుగుతుంది! దాంతో కథ రసవత్తరమవుతుంది కాని **నవ్వు** అంటే ఏమిటో మాత్రం అర్థంకాక నిజంగా నవ్వు వస్తుంది!

నవ్వులో ఒక సందేశం ఉంటుంది. దానినుండి ఒక సందేహం తొంగి చూస్తుంది. దానిలో వ్యక్తిత్వ లక్షణాలు, సామాజిక ప్రభావాలు, ఉత్తేజం, ప్రతిభా ప్రక్రియ, ఇంకా ఎన్నో దాగివుంటాయి. నవ్వు శారీరక సంబంధమైన అనుభూతి మాత్రమే కాదు, అదొక మానసిక స్థితి. అదొక అనుభవం. అదొక ఉత్సాహం. అదొక ఆనందం. మనం ఆనందంగా ఉన్నట్లు ఇతరులను భ్రమింపజేయడానికి కొన్ని సమయాలలో కృత్రిమంగా నవ్వును సృష్టిస్తాము.

---

స్త్రీలు, పిల్లలు, అమాయకులు హాస్యాన్ని ఆనందిస్తారు. –అబినవ గుప్తుడు

షాపులలో అమ్మకానికి కూర్చున్న సేల్స్ గరల్స్, హోటలోని వెయిటర్స్,విమానాలలో ఎయిర్‌హోస్టెస్లు, పౌరసంబంధ శాఖలో పనిచేసే ఉద్యోగులు (భారతదేశంలో కాదులెండి!) ఎప్పుడూ నవ్వుతూ ఉండేలా శిక్షణ ఇస్తారు. నటులు, నటీమణులు డబ్బు తీసుకొని పై మెరుపుల నవ్వులు నవ్వితే, యుద్ధభూమిలో నగరాలను సర్వనాశనం చేస్తూ విజయగర్వంతో విమానచోదకులు విషపునవ్వులు చింది స్తారు. ఈ విధంగా నవ్వులో ఎన్నో అనుభవాలు, మదింపులు, సందర్భాలు నిబిడీకృతమై ఉంటాయి. కనుక భిన్నరకాల నవ్వులను,భిన్న సందర్భాలలో, భిన్న సమయాలలో నవ్వే నవ్వులను ఒకే నిర్వచం క్రిందకు తీసుకురావడం నిజంగా కష్టం .

ఇంక కొన్ని నిర్వచనాలు చూద్దాం.

**"సానుభూతి లేదా అనుభూతి శక్తి మూలంగా ప్రశాంతంగా ఆనందం కలిగించే సంక్లిష్ట స్థితి యొక్క లక్షణం నవ్వు"** (Dictionary of Psychology). "ముఖంలోని – ముఖ్యంగా పెదవులలోని - నరాల అసంకల్పితమైన కదలికతో సాధారణంగా నయనాలలో ఒక విచిత్రానుభూతితో ఆనందం, తృప్తి లేదా హేళనతో కూడి అవరోధాలతో ఊపిరితిత్తుల నుండి గాలిని బయటకు నెట్టే ప్రక్రియ నవ్వు"అన్నదిWebster's New International Dictionary నిర్వచనం.

"దిగువస్థాయికి చెందిన....నేలబారు, కురూపులు అయిన.... ప్రజలకు ఉపయోగ పడేది నవ్వు"అని అరిస్టాటిల్ భావించగా, "పెడదారి పట్టినవారిని సన్మార్గంలోకి తీసుకురావడానికి, చాదస్తాలను సరిదిద్దడానికి చేయూతనిచ్చేది నవ్వు" అన్నారు బెర్గ్ సన్. నిజానికి మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు మినహా ఇతరులెవ్వరూ నవ్వు నిర్వచనాల జోలికి పోలేదు. "నరాల దృఢత్వాన్ని అసంకల్పితంగా, క్షణికంగా లాగడం మూలంగా జనించేది నవ్వు. విద్యుత్ లేదా హాస్యోక్తిని అనువర్తింపజేయడం ద్వారా దానిని ప్రేరేపించవచ్చు" అంటారు ష్వాంభై బెన్. "నవ్వు అన్నది మూర్ఖుల వెక్కిళ్ళు" అని జాన్ రే భావించగా,**"నవ్వు అంటే మనసు తుమ్మడం"** అని లెనిన్ సిద్ధాంతీకరించారు.

ఫ్రాయిడ్ "హాస్యాన్ని ప్రధానమైన రక్షాకవచం"గా తలంచగా, మార్టిన్ దానినొక ధైర్య ప్రక్రియగా అభివర్ణించాడు. విశ్వనాథుడు 'సాహిత్య దర్పణం'లో 'వికృతాలైన ఆకార,వాక్, వేష, చేష్టలచే ఏర్పడేది హాస్యము. దానికి స్థాయిభావము హాసము' అన్నాడు.

నవ్వును ప్రేరణగా భావించాలా, ప్రతిక్రియగా తీసుకోవాలా లేక చిత్తవృత్తిగా స్వీకరిం చాలా? - ఈ మూడింటిలో ఏ దృక్కోణం నుండి మనం నవ్వును అర్థం చేసుకోవాలి?

---

పెదవులలోను, పొట్టలోను జరిగే ఆకస్మిక పరిణామ ఫలితమే హాస్యం. – నామ్ హాలెండ్

పెంగ్విన్ ఆంగ్ల నిఘంటువు ప్రకారం హాస్యం అర్థాలు ఇవి : 1."ఆనందానుభూతితో నవ్వు కలిగించడం" (ప్రేరణ). 2."ఉత్సాహభరిత వినోదం" (ప్రక్రియ). 3."ఒకానొక విషయంలోని హాస్యకోణాన్ని తిలకించగలగడం" (చిత్తవృత్తి). పైన పేర్కొన్న మూడు లక్షణాలు ఆ నిర్వచనంలో ఉండటం గమనార్హం.

నవ్వు అర్థం, నిర్వచనాలలో ఎంత వైవిధ్యం ఉన్నదో, దానికి సంబంధించిన అనేక ఇతర అంశాలలో కూడా అంతే అస్పష్టత, అసందిగ్ధత చోటుచేసుకున్నాయి. నవ్వును గురించి అందరికీ అంతా తెలుసు అన్నది ఎంత యదార్థమో, దానిని గురించి పూర్తిగా ఎవ్వరికీ తెలియదు అన్నది కూడా అంతే సత్యమేమో! .

**హాస్యం ఒక కళ :**"అన్ని జీవరాశుల యెడల రసార్ధత, సౌభ్రాతృత్వం కలిగి ఉండటం, వాటిని ప్రోత్సహించడమే హాస్యం యొక్క సారాంశం" (కార్లయిల్). హాస్యం ఒక ప్రక్రియ. అదొక ఆలోచనా పద్ధతి. ఆ పద్ధతి, ప్రక్రియలు జన్మతః వస్తాయనడం పొరపాటు. అదొక కళ. దానిని అభివృద్ధి చేసుకోవచ్చు. హాస్యం ఒక కళ అనడానికి పెక్కు కారణాలు కన్పిస్తాయి.

1. విషాదం మానవ హృదయాంతరాలలోకి చొచ్చుకుపోయి దానిని తొలవగా, హాస్యం మాత్రం ఉద్రిక్తతా వలయాన్ని ఛేదించి, దానిని తగ్గిస్తుంది. అందుకే ఉద్రిక్తత ఎప్పుడూ హాస్యానికి దూరంగా ఉంటుంది.

2. హాస్యోక్తి ఏకముఖి కాగా, మానవ జీవితం క్లిష్టమైనది, బహుముఖాలు కలది. అలాంటి సంక్లిష్ట జీవితానికి హాస్యోక్తి ప్రతిబింబం కాలేదు.

**చరిత్రలో యూదులు** అనేక బాధలకు గురయ్యారు. తమను దోచుకునేవారు, బాధించేవారి బారినుండి రక్షించుకోడానికి, ఆత్మగౌరవంతో జీవించడానికి వారికి చేయూతనిచ్చింది హాస్యం ఒక్కటే. ఆత్మనింద ఆత్మీయుల ఓదార్పుగా పనిచేస్తూ వారిని ఉత్సాహపరిచింది. వారి హాస్యంలో కొంత తిరస్కారం ఉంటుంది. జాతిని గురించిన గర్వం ఉన్నప్పుడే కదా తిరస్కార భావం ఉండేది! **రష్యా** దేశానికి చెందిన ఒక అధికారి యూదునితో ప్రయాణం చేస్తుండగా, దారిలో యూదుడు కంపుకొట్టే ఒక చేపను తీసి దానిని తినసాగాడు. యూదుజాతి మేధో సంపన్న జాతికదా? విషయాన్ని తెలుసుకోవాలన్న ఆసక్తితో రష్యా అధికారి "అవును....మీ యూదుల తెలివితేటలకు కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు. **యూదుడు** : ప్రత్యేక కారణం ఏమీ లేదండి. ఈ చేపలు తినడమే మా ప్రత్యేకత.

---

స్త్రీలు, పిల్లలు, అధములు హాస్యాన్ని తిలకిస్తారు. –భరతుడు

**రష్యా అధికారి** : అవి రోత పుట్టించవా? అసహ్యంగా ఉండవా?

**యూదుడు** : తెలివితేటలు కావాలంటే మరి వాటిని తినాల్సిందే కదా!

**రష్యా అధికారి** : వాటి ధర ఎంత?

**యూదుడు** : ఒక్కొక్కటి ఇరవై కొపెక్కులు అవుతుంది. అయినా....... ప్రస్తుతం మూడు చేపలు మాత్రమే నేనివ్వగలను.

ఆ అధికారి వాటిని తీసుకొని ముక్కుమూసుకొని ఎంతో బాధతో, అసహ్యంతో.... ఎలాగైతేనేం తిన్నాడు. ఆ తరువాత అతను అసలు విషయం తెలుసుకొని కోపంగా "ఓ యూదుడా! నువ్వు మోసకారివి. చేపలన్నీ కలిపి కూడా ఐదు కొ పెక్కులు కాకపోయి నా, దాని ఒక్క తలనే ఇరవై కొ పెక్కులకు అమ్మావు" అంటూ అరిచాడు. దానికి యూదుడు తల ఊపుతూ "చూశావా! అప్పుడే చేప పనిచేసింది....నీ తెలివి పెరిగింది" అన్నాడు నవ్వుతూ.

ఈ విధంగా యూదుడు పరాజయాన్నే తన విజయంగా స్వీకరించాడు. తాను బాధపడుతూనే ఆనందిస్తున్నట్లుగా కన్పించే ముసుగులాగా తమను, దోపిడీ చేసేవారి పైగల తీవ్ర ఆగ్రహాన్ని తనమీదకే తిప్పుకోగల విచిత్ర ప్రక్రియలాగా హాస్యాన్ని వినియో గించుకున్నాడు. అంటే పరాజయం, పరాధీనతలను, విజయం, గొప్పతనంగా మలచు కున్నాడన్నమాట!

చక్కని హాస్యరసాన్ని చవిచూసినప్పుడు మన మనసులో కలిగే ఆనందానుభూతులు మధురంగా ఉంటాయికదా! ఆ ప్రక్రియను మీ ముందు ఉంచడానికే, మీ చేతికందిం చడానికే ఈ కృషి అంతా. కనుక ఇంక హాస్య ప్రవృత్తిని గురించి తెలుసుకుందాం.

**హాస్య ప్రవృత్తి** : ఇప్పుడు హాస్య ప్రవృత్తి కలిగివుండటం అంటే ఏమిటో చూద్దాం.

1. ప్రతి అంశాన్ని, ప్రతి విషయాన్ని సరదాగా, హాస్యోక్తిగా తీసుకొని ఆనందించే వ్యక్తులలోనే హాస్య ప్రవృత్తి అధికంగా ఉందనడం ఎంతవరకు నిజం? ప్రతిదానికీ గట్టిగా నవ్వేవారిని మనం వీర అమాయకులుగా లేదా పిచ్చి వారిగా ముద్రవేస్తామే కాని, హాస్య ప్రవృత్తి గలవారిగా పరిగణించం. నిజానికి పిచ్చివానికి కూడా ప్రతిదీ ఆశ్చర్యకరంగా కన్పించదు, ఆనందం అందించదు. కనుక ఇది సరైన భావన కాదు.

2. హాస్యోక్తులను మరింత గాఢంగా, మరింత ఉత్సాహంగా ఆస్వాదించేవారిలో హాస్య ప్రవృత్తి అధికంగా ఉందనవచ్చా? సాధారణంగా మనం ఇతరుల పై ఉదారంగా చమత్కారాలు,హాస్యోక్తులు విసురుతూ ఆనందిస్తామేకాని, అవే హాస్యోక్తులు మనకుగాని, మన ఆప్తులకుగాని అవమానంగా అనిపిస్తే, బాధ కలిగిస్తే, వాటిని ఆనందించగలమా?

---

అసంబద్ధతను ఆనందించడమే హాస్యం.-జాన్‌మోరెల్

అలానే, అన్ని హాస్యోక్తులను అందరూ ఒకేవిధంగా ఆనందించ లేరంటే అలాంటి వారిలో హాస్య ప్రవృత్తి లేదని భావించాలా?

3. పోనీ తనను గురించి తాను నవ్వుకోగలిగే వ్యక్తులలో హాస్య ప్రవృత్తి అధికంగా ఉందని చెప్పగలమా? సమాజంలో అత్యల్ప సంఖ్యలో ఉన్న మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు, మేధావులు మినహా, ఇలాంటి వ్యక్తులు భూతద్దంతో వెదికినా మనకు కనిపించకపోవచ్చు. సగటు మనిషి ఇతరులలోని లోపాలను, బలహీనతలను చూసి వినోదిస్తాడే కాని తన పైన ఎలాంటి హాస్యోక్తిని, వ్యంగ్యాన్ని భరించలేడు. ఆవిధంగా హాస్యం అర్థం, పరమార్థం మారి, అది అపహాస్యంగా తయారవవచ్చు.

4. కొందరు ఎలాంటి హాస్యాన్నైనా ఆనందిస్తే, మరికొందరు ఏ హాస్యోక్తికీ చలించరు. మతం, కులం, సంస్కృతి మొదలైన అంశాలపై ఒక వర్గానికి చెందిన ఒకానొక హాస్యోక్తి ప్రత్యర్థి వర్గానికి పరమపరుషంగా కన్పించవచ్చు, బాధను కలిగించ వచ్చు. (కొన్ని హాస్యోక్తులలో నర్మగర్భంగా ఇమిడివున్న అసంబద్ధత అర్థం కాకపోవడం మూలంగా కొందరికి నవ్వు రాకపోవచ్చు. ఉక్రైన్లో ఒక క్రైస్తవ బాలిక హత్య చేయబడింది అన్న వదంతి దావానలంలా వ్యాపించింది. ఆ వార్త మత యుద్ధానికి దారితీస్తుందని ఆందోళన చెందుతున్న పెద్దలు ఆ సమస్య నుండి ఎలా బయటపడాలా అని యోచిస్తుండగా, ఒక మతాధికారి "సోదరులారా! మీకొక సువార్త. హత్య చేయబడిన బాలిక యూదుమతస్తురాలట!" అనడంతో అంతా సద్దుమణిగింది. ఇదొక హాస్యోక్తి. ఉక్రైన్ దేశంలో క్రైస్తవులకు, యూదులకు మధ్య తరచు మతసంబంధమైన సంఘర్షణలు జరుగుతాయని, ఏ చిన్న వదంతి అయినా ప్రమాద ఘంటికలను మోగిస్తుందని తెలిసిన పాఠకుడే ఈ హాస్యోక్తిని ఆనందించగలడు! )

హాస్య ప్రవృత్తి కలిగివుండటానికి విజ్ఞానం అవసరం అని కొందరు, కలుపుగోలు తనం అవసరం అని మరికొందరు భావిస్తారు. అయితే, హాస్యోక్తులను ఆనందించడానికి చదువుతో పనిలేదని చెప్పడానికి ఈ ఉదంతం ఒక ఉదాహరణ.

**ఆ భార్యాభర్తల** జంట ముచ్చటైన జంట. ఎక్కడ ఉన్నా వాళ్ళు అందరినీ ఇట్టే ఆకర్షిస్తారు. ఇద్దరూ బడా స్థూలకాయులే. ఒకరి చుట్టూ ఒకరు నడిస్తే ఆ రోజుకు వాళ్ళకు ఇంక వ్యాయామం అవసరం లేదు.

ఇలాంటి హాస్యోక్తులను ఆనందించడానికి చదువుసంధ్యలు అవసరం లేదుగదా! అలానే, పుస్తకంలో చదివి, సినిమా, టి.వి.లలో హాస్యోక్తులు విని మనసారా నవ్వుకోవచ్చు, కనుక హాస్యాన్ని ఆనందించడానికి కలుపుగోలుతనంతో అవసరం ఉండదు! "

---

అతిగా నవ్వేవాడు తీవ్ర మనస్తాపానికి గురి అవుతాడు. – జీన్ పాల్ రిక్టర్

మరి హాస్య ప్రవృత్తి కలిగివుండటం అంటే ఏమిటి? హాస్యం ప్రేమలాంటిది అని చెబుతారు. అక్కడ ఒత్తిడికి, భయానికి, కోపతాపాలకు, ద్వేషానికి తావు ఉండదు. అదొక ఆనందమయ స్థితి. అందుకే మనకు ఇష్టం లేని వ్యక్తి ఎంత గొప్ప హాస్యోక్తులను పేల్చినా"వీడిబొందలానే ఉన్నాయి. కుళ్ళుజోకులూ వీడూను" అంటూ ఈసడించు కుంటాము.అదే మనకు నచ్చిన వ్యక్తి ఎలాంటి హాస్యోక్తి చెప్పినా మనసారా నవ్వుతాము. హాస్య ప్రవృత్తి కలిగివుండటం అంటే ఆనందించే, ప్రేమించే మనస్సు కలిగివుండటమే; ఆనందమయమైన మానసిక స్థితి కలిగివుండటమే.

హాస్య ప్రపంచం ప్రధానంగా మానవపాత్రల చుట్టూ పరిభ్రమిస్తుంది. వ్యతిరేకత,పరిస్థితులు, లక్ష్యం, వివరణ పద్ధతి, భాష మొదలగు అంశాలపై అది ఆధారపడుతుంది. ఈ విధంగా హాస్యోక్తి మొదటినుండి చివరిదాకా పాత్రధారుల చుట్టూ పరిభ్రమిస్తూ, వారి చైతన్యానికి చిహ్నంగా మిగులుతుంది.

**"కమలా,** దీనితో నీకు వంద ప్రేమలేఖలు వ్రాశాను. ఎంతో ప్రేమతో పంపిన ఈ లేఖలలో ఒక్కదానికైనా నువ్వు సమాధానం ఇవ్వకపోవడం నాకు చాలా బాధకలిగి స్తుంది. దీనికైనా దయచేసి సమాధానం ఇస్తావా?" అంటూ ప్రేమలేఖను ముగించాడు మధు.

"మధూ! నువ్వు వ్రాసినలేఖలన్నీ అందాయి. అయితే, ప్రేమ "లేక" నీకు సమాధానం ఇవ్వలేకపోయా....బై...కమల".

దీని లక్షణాలు మూడు :1.సందేశాన్ని పంపడం;2. సామాజిక పునాది; 3. అఖండత్వంలో భావావేశంతో పనిచేయడం.

విశ్వనాధుడు 'సాహిత్య దర్పణం'లో హాస్యం శ్వేతవర్ణం కలిగివుంటుందని చెబుతూ మరికొన్ని లక్షణాలు పేర్కొన్నాడు. ఈ హాస్యోక్తి లక్షణం: ఏ సంస్కృతిలోనైనా హాస్యోక్తి వేగంగా, నిక్కచ్చిగా నవ్వుకు నాంది పలుకుతుంది. జాగ్రత్తగా నిర్మింపబడిన పొట్టి కథలాంటిది హాస్యోక్తి. హఠాత్తుగా ఆశ్చర్యాన్ని కలిగిం చడం, ఆనందపు శిఖరాలకు చేర్చడం, ఆశ్చర్యాన్ని ప్రయత్నపూర్వకంగా దారి మళ్ళిం చడం దాని లక్షణాలు. "వికృతి దర్శనాది జన్యో మనోవికారో హాసః" అన్నారు మన పూర్వీకులు. కనుక హాస్యంలో ప్రధానంగా వికృతి ధ్వనిస్తుంది.

**బడికి ఆలస్యంగా** వచ్చిన నరేష్ ను టీచర్ ఉరిమి ఉరిమి చూశాడు. బెత్తం ఎత్తి బాదబోతూ "ఇంత ఆలస్యంగా వచ్చావేరా వెధవ?" అంటూ అరిచాడు. "బయట జోరున వర్షం కురుస్తుంది. ఒక్కడుగు ముందుకువేస్తే రెండడుగులు వెనక్కు పడుతు న్నాయి సార్.

---

జీవన వైరుధ్యాలను గురించి కరుణాత్మకంగా వ్యక్తపరచడమే హాస్యం. – లికాక్

అందుకే..... ఆలస్యం......" అంటూ నసిగాడు సరేష్. "ఒక్క అడుగు ముందుకువేస్తే రెండడుగులు వెనక్కు పడుతుంటే, అసలు బడికి ఎలా చేరావురా భడవా?" అంటూ అరిచాడు ఉపాధ్యాయుడు. "అందుకే వీపు స్కూలువైపు పెట్టి వచ్చాను సార్!" అన్నాడు విద్యార్థి.

"సానుభూతికి విరుగుడుగా మానవాళి నవ్వును అభివృద్ధి చేసుకుంది. సహచరుల దుఃఖాలు, బాధలు, లోపాలనుండి కాపాడే కవచంలాంటిది నవ్వు"(విలియం మాగౌగాల్). "హాస్యం జగడాలమారి,కలహశీలి, అహంకు ప్రతీక" అంటారు ఇంకొందరు. ఆధిక్యతను చాటడానికి హాస్యం ఉపయోగపడుతుంది అన్నది ఒక వాదన. నిజానికి ఆరోగ్యకర హాస్యం - మంచి హాస్యం - కక్షను, కార్పణ్యాలను, ఆధిక్యతను కోరదు.

అయితే, హాస్యం యొక్క జగడాలమారితనాన్ని ఒక ఆయుధంగా తీసుకొని దానిని నియంతల పైకి గురి పెట్టవచ్చు. హాస్యం సాయంతో తమను రాజ్యాంగబద్ధపాలకునిగా మారుస్తారేమోనన్నది నియంతల భయం. అందుకే నియంతలకు హాస్యం అంటే అసహ్యం. ప్రజాస్వామికవాదులు మాత్రం దానిని ప్రేమిస్తారు, ఆహ్వానిస్తారు.

జీన్ పాల్ మాటల్లో "స్వేచ్ఛ హాస్యాన్ని ఉత్పత్తి చేస్తే, హాస్యం స్వేచ్ఛను ఉత్పత్తి చేస్తుంది........ **"ప్రతి జంటకు పరిణయం చేసే మారువేషంలో ఉన్న పురోహితుని వంటిది హాస్యం"**. అందుకే "హాస్యం ఒక చిక్కుముడిలాంటిది" అంటారు విజ్ఞులు.

బ్రిటన్ యువతిని ఆఫ్రికా వనిత 'మొన్న సెలవులు ఎక్కడ గడిపారు?' అని ప్రశ్నించింది. మొజార్కాలో' అని సమాధానం ఇవ్వగా 'అదెక్కడుంది?' అని అడిగింది. 'నాకు తెలియదు. నేనెప్పుడూ విమానంలోనే ప్రయాణం చేస్తాకదా!' అంది.

ఇది ఆంగ్లేయుల అహానికి ఓ ఉదాహరణ.

క్రిందపడ్డా పైచేయి నాదేనన్న ధోరణితో ప్రవర్తిస్తారు కొందరు.

**చేసిన తప్పిదానికి** చంటిగాడు చెప్పుదెబ్బలు తిన్నాడు. అక్కడ కూడా తన గొప్పతనాన్ని చాటుకోవడానికి "ఇంతకీ కిష్టిగాడు నన్ను బాటా చెప్పుతో కొట్టాడా? లేక అందమైన ఇంపోర్టెడ్ స్పాంజ్ షూతో కొట్టాడా?" దర్పంతో ప్రశ్నించాడు చంటిగాడు!

(హాస్య బ్రహ్మలు అందరూ చింతాక్రాంతులు, ఆవేదనాపరులై ఉంటారన్న కథనం ఒకటి వ్యాప్తిలో ఉంది. ఫ్రాన్స్ దేశానికి చెందిన ప్రముఖ హాస్య రచయిత పియర్రేడానినొ ఒక అడవిలో గదులలోకి ఏ శబ్దమూ ప్రవేశించకుండా ధ్వని నిరోధక (Sound proof) గృహాన్ని నిర్మించుకున్నాడు. అయినా ఆ గదులలోని శబ్దాలకు తాళలేక నిద్రపోవాలనుకున్నప్పుడు చెవులలో దూది పెట్టుకునేవాడు. అతని జీవితమంతా బాధల నిలయం అవడమే దీనికి

కారణం. అయితే, ఇజ్రాయిల్‌కు చెందిన ఎఫ్రైన్, బ్రిటన్, అమెరికాలకు చెందిన రిచర్డ్ గార్డన్, జేమ్స్ థర్బర్ మొదలైన హాస్యకారులు హాయిగా, ఆనందంగా, ఉల్లాసంగా జీవితాలు గడిపారు. విషాదానికి కూడా రంగులు పులిమి అందంగా వివరించేవాడేకదా హాస్యగాడు. మరి వారే చింతాక్రాంతులయ్యారంటే నిప్పుకు చెదలు పట్టినట్లే కదా!)

**చిరునవ్వుల చిద్విలాసం:** ప్రతి నవ్వుకు ఒక అర్థం ఉంటుంది. ఎటొచ్చీ దానిని అర్థం చేసుకోవడానికి ఎంతో విజ్ఞత కావాలి. ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు లియొనార్డో డావిన్సీ5 శతాబ్దాల క్రితం (1503లో) చిత్రించిన అద్భుత కళాఖండం **మోనాలిసా**.

మోనాలిసా నవ్వుకు అర్థం ఏమిటి? అని ప్రపంచవ్యాప్తంగా కొన్ని దశాబ్దాలుగా సుదీర్ఘ చర్చ జరుగుతూంది. ఆ నవ్వులో ఉన్నది మాతృత్వ మధురానుభూతి అట. అది బిడ్డను కనబోతున్నానన్న మందహాసమట. మరో ప్రాణికి ఆహ్వానం పలుకుతున్న దరహాసమట. గర్భంతో ఉన్నందువల్ల ఆమె చేతివేళ్ళు వాచాయని, ముఖం బొద్దుగా ఉందని ఏల్ విశ్వవిద్యాలయం ఆచార్యుడు షెర్విన్ నులాండ్ సిద్ధాంతీకరించారు. ఆ చిత్రాన్ని చూసిన ప్రతిసారీ ఆమె చిరునవ్వులో తేడాలు కన్పించడానికి, ఆ మార్మిక దరహాసానికి, అంతుచిక్కని ఆ అద్భుతానికి కారణం ఆమె పెదవి చివర్లలో డావిన్సీ వర్ణమిశ్రమం చేసి ఆ అద్భుతాన్ని సాధించాడని ఓ చిత్రకారుడు భావించగా, మోనాలిసా బ్రూక్సిజం జబ్బుతో బాధపడుతుండటంవలన తరచు పళ్ళు కొరుకుతుంటుందని, అందువలన ఆమె పెదవులు ఏదోలా నవ్వినట్లు కన్పిస్తాయని ఇటలీ పరిశోధకుడు ఫిలిప్పో సురానో పేర్కొన్నాడు.

ఆమె నవ్వు పలురకాలుగా కన్పించడానికి మానవ వినికిడి వ్యవస్థలోని భిన్న శబ్దస్థాయిలే కారణమని టేలర్ భావించగా, ఆమె అతి పలుచని ముసుగు వేసుకుందని ఇయాన్ ఆ హెన్, కాన్వాస్ పై లక్షలకొద్దీ సన్నని చుక్కలు పొరలు పొరలుగా పెట్టడం వలన ఆ అద్భుతం జరిగిందని ఇటలీలోని ఫిజే గ్యాలరీ నిపుణులు అంటున్నారు. నెదర్లాండ్ పరిశోధకులు ఆమె నవ్వులో 83 శాతం సంతోషం, 9 శాతం విచారం, 6 శాతం భయం, 2 శాతం కోపం, 1 శాతంకన్నా తక్కువగా అభావం ఉన్నట్లు ఎమోషన్ రికగ్నిషన్ ప్రక్రియ ద్వారా కనుగొన్నారు. **ఒకరకమైన మెరుపు రంగు ఆమె నోటిచుట్టూ అతి పల్చని పొరలుగా 40 పర్యాయాలు అద్దటంద్వారా అది సాధ్యపడిందని** గత 5 దశాబ్దాలుగ ప్రపంచ మేధావులను వేధిస్తున్న ఈ చిక్కు ప్రశ్నకు సమాధానం ఇచ్చారు ప్రఖ్యాత శాస్త్రవేత్త ఫిలిప్ వాల్టర్ (ది హిందు: 23-8-10). ఒక్క నవ్వును అర్థం చేసుకోవడం మానవాళికి ఎంత కష్టమైందో చూడండి!

---

హాస్యం అంతటిలో నిగూఢ సత్యం నిక్షిప్తమై ఉంటుంది. – రస్కిన్

ఫ్రాన్స్‌లోని లూవర్ మ్యూజియంలోగల ఆ అపురూప చిత్రం ప్రతి సంవత్సరం దాదాపు 7 లక్షలమందికి ఆహ్లాదం కలిగిస్తున్నది. మోనాలిసా మందహాస రహస్యం నిజానికి పూర్తిగా ఇప్పటికీ అంతుపట్టలేదు! 50 సంవత్సరాల క్రితమే కోటిడాలర్లు విలువగలదిగా నిర్ణయించబడిన ఆ కళాఖండంలో కన్పించేది నాటి ప్రపంచసుందరి డచెస్ ఆఫ్ మిలాన్ (మోనాలిసా గెరార్డినీ) అని, ఆమె అసలు పేరు లీసా డెల్ జియోకొండ అని, ఆమె ఒక సిల్క్ వ్యాపారి భార్య అని కొందరు చెబుతుండగా, డావిన్సీ తన ముఖాన్ని తానే ఇలా చిత్రీకరించుకున్నాడని ప్రాచీన ఇటలీ పరిశోధకులు భావించడం మరొక విశేషం!

సౌందర్యాన్ని నిర్దేశించడంలో డావిన్సీ అందించిన కొలతలనే ఈనాటికీ ముద్దు గుమ్మల ముగ్ధమనోహర సౌందర్యాన్ని అంచనా వేయడంలో ఉపయోగిస్తున్నారని నెబ్రాస్క విశ్వవిద్యాలయ పరిశోధకులు తెలిపారు!

నుదురు = ముక్కు పొడవు ముక్కు క్రింద నుంచి చుబుకం వరకు ఒకే కొలతలు

ముక్కు పొడవు = చెవి పొడవు

రెండు కళ్ళ మధ్య దూరం = ముక్కు వెడల్పుతో సమానం

నోటి వెడల్పు = 1.6 x ముక్కు వెడల్పు

ముఖం వెడల్పు = ముక్కు వెడల్పుకు 4 రెట్లు

ఇదంతా ఓ అద్భుతంగా ఉంది కదూ! అదే హాస్యం యొక్క ప్రత్యేకత.

ఈ విధంగా హాస్యం నవ్విస్తుంది, కవ్విస్తుంది; గిల్లుతుంది, గిచ్చుతుంది; చురుక్కు మనిపిస్తుంది, చివుక్కుమనిపిస్తుంది; వినోదాన్నిస్తుంది, వికారాన్నిస్తుంది; లాలిస్తుంది, పాలిస్తుంది. దానిలో అద్భుత సమ్మోహనా శక్తి ఉంది. అదొక అనంతలోకం. అందుకే **హాస్యాన్ని, పరిష్వంగాన్ని, తేనెను ఆస్వాదించాలేకానీ విశ్లేషించకూడదు!-**

నవ్వు నిర్వచనం విషయంలో రచయితల మధ్య ఏకాభిప్రాయం లేనప్పటికీ, మనిషి నవ్వుకు దూరం కాలేదుకదా! అందుకే ఇప్పుడు మనిషి ఎందుకు నవ్వుతాడో చూద్దాం...

---

హాస్య ప్రవృత్తిగల వ్యక్తి అత్యున్నత వ్యక్తి. – అబ్రహాం మాస్లో

అధ్యాయం 2

# మనిషి ఎందుకు నవ్వుతాడు?

అవును......మనిషి ఎందుకు నవ్వుతాడు? ఇది అక్షరలక్షలు చేసే ప్రశ్న. బలవంతునిదే రాజ్యం అన్న సూత్రం ప్రకారం జీవరాశి పరిణామం జరిగివుంటే మనందరం ఛలోక్తులు విసురుకుంటూ, హాస్యాలాడుకుంటూ ఎలా గడుపుతాము? మానవ మేధ పై ఇటీవల జరిగిన పరిశోధనా ఫలితాల ప్రకారం నవ్వాలన్న ఆసక్తి మనుషులను ఉన్నత సామాజిక జీవులుగా రూపొందించడంలో కందెనవలె పనిచేస్తుంది'.

హాస్య స్వభావాన్ని గురించిన ఫ్రాయిడ్ శాస్త్రీయ రచన 'Jokes and Their Relation to the Unconscious'లో ఎలాంటి హాస్యానికి చోటు లేకపోవడం గొప్ప విశేషం. అంతకన్నా విచిత్రమేమంటే మనం ఎందుకు నవ్వు తాము? అని తీవ్రస్థాయిలో పరిశోధనలు జరిపేకొద్దీ హాస్యానికి దూరం అవుతున్నట్లు ఆయన గ్రహించారు.

మనిషి ఆధిక్యతాభావంతో నవ్వుతాడా? ఇతరులలోని పొరపాట్లను సరిదిద్దడానికి నవ్వుతాడా? ఉద్రిక్తతల నుండి ఉపశమనం పొందడానికి నవ్వుతాడా? హాస్యోక్తిని విని ఆనందిస్తూ నవ్వుతాడా? అసంబద్ధతను చూసి నవ్వుతాడా? చిలిపి చేష్టలను చూసి నవ్వుతాడా? అలానే, సంభాషణలో ఏర్పడిన ఖాళీలను పూర్తి చేయడానికి కొన్ని పర్యాయాలు నవ్వగా, ఏడ్వలేక కొందరు నవ్వుతారు. తమ మనోభావాలను పూర్తిగా వ్యక్తం చేయలేక కొందరు నవ్వితే, ఏ కారణం లేకుండా మరికొందరు, సృజనాత్మక అనుభూతితో ఇంకొందరు నవ్వుతారు. ఇతరులను చూసి ప్రేమతో కొందరు నవ్వితే, విజయ గర్వంతో మరికొందరు నవ్వుతారు. హాస్యోక్తుల మూలంగా కొందరు, గిలిగింతలు పెట్టడం మూలంగా ఇంకొందరు నవ్వుతారు. ఇలా నవ్వుకు సవాలక్ష కారణాలు కన్పిస్తాయి.

మనిషిలో కలిగే భావోద్రేకాలకు, నవ్వుకు మధ్య సన్నిహిత సంబంధం ఉన్నట్లు తెలుస్తుంది. ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి చూచి కవ్విస్తూ నవ్వితే, ఒక మతస్తుడు మరొక మతాన్ని చూసి జాలితో నవ్వవచ్చు. హాస్యోక్తి అర్థం కాకపోయినా అర్థమైనట్లు నటిస్తూ కొందరు నవ్వగా, నవ్వు జబ్బులు గలవారు (సూడోబ్యులర్ పాల్సీ, గెలాస్టిక్ ఎపిలెప్సీ, మల్టిపుల్ స్క్లోరోసిస్, బ్రెయిన్ క్యాన్సర్) ఫుల్ స్టాప్లు, కామాలు లేకుండా నవ్వుతారు, కొందరు అసలు నవ్వుకే నోచుకోనివారు. కొందరైతే, నవ్వును ఆనందదాయినిగా ఆరాధించేవారు ఇంకొందరు. బాధలను దిగమింగడానికి, వాటిని కప్పిపుచ్చుకోడానికి ఇంకొందరు నవ్వవచ్చు. నవ్వును

---

హాస్యోక్తి ఒక పరిహాసమాడే తీర్పు లాంటిది. –ఫిషర్

జీవన రసాయనంగా కొందరు వర్ణిస్తే, జీవనవిధానంగా మరికొందరు అభివర్ణించారు. క్లుప్తంగ భిన్న భావాల కలయిక నవ్వు. దానిలో ఎన్నో ధ్వనులు, వ్యంగ్యాలు, ఆనందాలు, దుఃఖాలు, హెచ్చరికలు ఉన్నాయి. అనాదికాలం నుండి ఆధునిక కాలందాకా ఇతరుల తప్పిదాలను, పొరపాట్లను, వారి వింత చేష్టలను చూసి నవ్వుతారన్నది యదార్థం.

మనిషి ఎందుకు నవ్వుతాడు? – అన్నీ ప్రశ్నకు సమాధానంగా సుమారు 100 సిద్ధాంతాలు ఉన్నాయంటే, “అమ్మ నవ్వా! .....నువ్వు సామాన్యురాలివి కాదే” అనిపిస్తుంది. నవ్వుకు కారణం తెలుసుకోడానికి సామాజిక, మనోవిజ్ఞాన, భౌతిక శాస్త్రాలతో బాటు ఇంకాఅనేక పాఠ్యాంశాల అధ్యయనం అవసరం అవుతుంది. సృష్టిలో ఒక్కొక్కరు ఒక్కొక్క కారణంతో స్పందిస్తారు కనుక ఇక్కడ సూత్రీకరణలు కష్టమవుతాయి.

**సందీప్** ఇంటికి రావడంతోనే అతని భార్య శారద రాగాలు తీయడం ప్రారంభించింది. “మీ అమ్మ నన్ను అవమానపరచింది” అంటూ వెక్కివెక్కి ఏడ్వసాగింది. “మా అమ్మనా! 10 వేల మైళ్ళ దూరాన అమెరికాలో విహారయాత్ర చేస్తున్న ఆమె నిన్నెలా అవమానపరచింది?" ఆశ్చర్యంగా అడిగాడు సందీప్.

“ఆ సంగతి నాకూ తెలుసు. ఇప్పుడే మీ పేరిట ఒక జాబు వచ్చింది. ఆసక్తితో దానిని తీసి చదివా”

"అయితే?"

“లేఖ చివర్లో 'ప్రియమైన శారదా! జాబు ఆసాంతం చదివిన తర్వాత దీనిని మా అబ్బాయికి ఇవ్వడం మరచిపోకమ్మా' అని వ్రాసింది. ఇంక చాలా?”అంది కోపంగా.

ఇలాంటి హాస్యోక్తులు ఎవరికైనా ఇట్టే నవ్వు తెప్పిస్తాయి. ఇంక నవ్వుకుగల కారణాలను తెలుసుకుందాం.

**1) సంకల్ప, అసంకల్ప చర్యల ఫలితం నవ్వు :** కొన్ని విషయాలలో అనుకో కుండానే మనిషి నవ్వితే, మరికొందరు తమ పై అధికారులను మెప్పించడానికి నవ్వును ఒక పరికరంగా వాడుకుంటారు. ఆఫ్ఘనిస్తాన్ కు చెందిన మిహిరకుల మహారాజు తన జీవితకాలంలో ఏనాడూ నవ్వి ఎరుగడట! రాజును నవ్వించడానికి చైనా మొదలైన సుదూరదేశాల నుండి విదూషకులు వచ్చి విఫల ప్రయత్నాలు చేశారు.

చైనా చక్రవర్తి 'యూ' భార్య 'పావో స్యూ'. తన రాణిని నవ్వించినవారికి దోసిళ్ళతో బంగారం ఇస్తానని ఆ రాజు ప్రకటించాడు. చూశారా నవ్వు ఎంత ఖరీదైనదో! అమెరికా తొలి అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్ నవ్వుకు చాలా దూరంగా ఉండేవాడు. చిత్రం ఏమంటే, అందరినీ

---

హాస్యం గొరిల్లా యుద్ధలాంటిది. – డ్వైట్ మాక్డొనాల్డ్

నవ్వించే బ్రిటీష్ జోకర్ జోమాల్డి నిజజీవితంలో ప్రపంచంలోని బాధలన్నిం టినీ తానే భరిస్తున్నట్లుగా బాధపడేవాడు.

**2) కించపరచడం :** సామాన్యంగా ఎవరినో ఒకరిని ప్రయత్నపూర్వకంగా కించపరచినప్పుడే నవ్వు వస్తుందంటారు కొందరు. అయితే, ఆ 'కించపరచడం' అన్నదే అంతుపట్టని విషయం అవుతుంది!

ఒక అత్తగారు తన స్నేహితురాళ్ళతో ముచ్చట్లాడుతూ, అప్పుడే ఆఫీస్ నుంచి వచ్చిన కోడలిని చూస్తూ "మార్కెట్లోకి ఏ కొత్తచీరె వచ్చినా ప్రథమంగా మా కోడలు పిల్ల కొనాల్సిందే. కొత్తగా రిలీజైన సినిమాను మొదటి రోజునే - వీలైతే మొదటి ఆటనే చూడటం కొందరికి సరదా అయితే, మా కోడలికి మాత్రం కొత్తగా వచ్చిన చీరెను వీలైతే మొదటి రోజునే కొనడం అలవాటు. ఏ మాటకు ఆ మాటే చెప్పాలి. సినిమాలు మాత్రం విడుదలైన నాలుగైదు వారాల తర్వాతనే ఆమె తీరికగా చూస్తుందిలేమ్మా" అని అభినందనను అభిశంసనతో కలపడంతో స్నేహితురాండ్రు పకపకా నవ్వారు. ఆ కోడలు పిల్ల చాలా తెలివైనది. "ఎప్పుడూ ఇంట్లోనే కూర్చునేవారికి ఏ చీరె కట్టుకున్నా ఫర్వాలేదు. నాలుగైదు చీరెలతో ఎంచక్కా సంవత్సరమంతా గడపవచ్చు. మరి ఉద్యోగాలు చేసుకునే నాలాంటి వాళ్ళు మంచి చీరెలు కట్టకపోతే, నెలకు ఇరవై వేలు సంపాదించే ఈమె మంచి చీరెలు కూడా కట్టుకోదు అని కొందరు, వీరపిసినారి అని మరికొందరు హేళన చేస్తారండి" అంటూ వారివైపు ఓరగా చూసింది! నవ్వుతూ "ఆ విమర్శల బాధ పడలేకనేగాని....లేకుంటే నాకు చీరెల పైన అంత వ్యా మోహం లేదండి" అంటూ అత్తగారి విమర్శను మెత్తగా తిప్పికొట్టింది.

మీలాగా నేను తీరిగ్గా ఇంట్లోనే కూర్చోడానికి వీలు కాదు కదా అని ఒకవైపు, నేను నెలకు ఇరవై వేలు సంపాదిస్తున్నానుకదా అని మరోవైపు వారిని దెప్పిపొడిచింది. "నిజమేనమ్మా!" అంటూ అత్తగారి స్నేహితురాండ్రు బలవంతంగా తెచ్చి పెట్టుకున్న నవ్వు ముఖాలతో కోడలితో శృతి కలిపారు. మైనస్ ఇన్‌టు మైనస్ ప్లస్ అయినట్లు ఒక కించపరచడం మరొకదానితో ఢీకొనడంతో నవ్వు వచ్చిందనాలా?

నిజానికి మనిషిలోని ఒకానొక విలక్షణాన్ని గేలి చెయ్యగలమే కాని, ఆ మనిషి మొత్తం వ్యక్తిత్వాన్ని గేలి చేయలేము అంటారు కొందరు రచయితలు. "వాడొట్టి వెధవాయి" అన్నప్పుడు అతని వ్యక్తిత్వం మొత్తాన్ని హేళన చేసినట్లే అవుతుంది కదా! అయితే, ఒక్క విషయం మాత్రం స్పష్టంగా కన్పిస్తుంది. మన హాస్యోక్తులలో అధికభాగం మన ఆధిక్యతను చాటుతూ, ఇతరులను తక్కువచేసేవే. ఈ హాస్యోక్తి చూడండి.

---

ఈనాటి సంక్షోభం రేపటి హాస్యోక్తి కావచ్చు.- హెచ్.జె.వెల్స్

**రాము** బార్‌లో కూర్చొని ఉండగా, కృష్ణ కన్నీరుమున్నీరుగా ఏడుస్తూ కన్పించాడు. ఎందుకు బాధపడుతున్నావని రాము అతనిని ప్రశ్నించగా, "ఇప్పుడే డాక్టర్ వద్దనుండి వస్తున్నా. నాకు ఆయన కొన్ని మాత్రలు ఇస్తూ ప్రతిరోజూ ఒకటి చొప్పున జీవితాంతం వేసుకోవాలని చెప్పాడు" అంటూ మరల ఏడుపు లంకించుకున్నాడు. "ఇందులో వింత ఏముంది? రోజుకొక మాత్రచొప్పున చాలామంది జీవితాంతం మందు- తీసుకునే వాళ్ళున్నారు!" అన్నాడు రాము. "అదిసరే.మరి డాక్టర్ గారు నాకు పది మాత్రలే ఇచ్చారే! జీవితాంతం వీటినే ఎలా వాడుకోవాలి?" అంటూ మరల లబోదిబోమన్నాడు కృష్ణ.

**3) సంప్రదాయాలను ఛేదించే సాధనం :** మానవులుగా మనం కొన్ని నియంత్రిత వ్యవస్థలలో (Systems) జీవిస్తాము. కుటుంబం, వివాహం, కార్మిక సంఘం, క్లబ్ మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. ఈ వ్యవస్థలలో కూడా పెద్దలకు ఒకటి, పిల్లలకు మరొకటి, నిరు పేదలకు ఇంకొకటి - ఇలా భిన్న అంతర్వ్యవస్థలు కన్పిస్తాయి. వీటిలో కొన్ని బహిర్గతంగా, మరికొన్ని అంతర్గతంగా పని చేయవచ్చు. పెద్దల వ్యవస్థ సాధారణంగా బహిర్గతంగానే పని చేస్తుంది. ఉదాహరణకు పాఠశాలను తీసుకుందాం ఇక్కడ పిల్లలపై ఉపాధ్యాయులు ప్రత్యక్షంగా, తల్లిదండ్రులు పరోక్షంగా అధికారం చెలాయిస్తుంటారు. పిల్లల దృష్టిలో ఉపాధ్యాయుడు ఒక నియంత, ఒక గొప్ప అధికారిలాంటివాడు. (ఎలాంటి అధికార కాంక్ష లేని ఉపాధ్యాయులు కూడా ఉంటార నుకోండి.) బహిరంగంగా వారి అధికారాన్ని వ్యతిరేకించగల ధైర్యంగాని, అవకాశంగాని పిల్లలకు ఉండదు. అందుకే పిల్లలు తమ ఉపాధ్యాయుల పై రహస్యంగా కొన్ని హాస్యోక్తులు విసురుతూ, వారి అలవాట్లను, వేషభాషలను, నడక తీరును అనుకరిస్తూ వారి పై వున్న కసిని, కోపాన్ని రహస్యంగా ప్రదర్శిస్తూ, బహిర్గతంగా అధికారం అంటే భయం లేనట్లుగా కన్పించడానికి ప్రయత్నిస్తారు!

పిల్లవాని దృష్టిలో ఉపాధ్యాయుడు సర్వజ్ఞాని, అపూర్వ మేధావి. హఠాత్తుగా గురువుగారు అరటి తొక్క పై కాలువేసి జారిపడటంతో పిల్లవాని మనసులో ఒక్క క్షణకాలం ఆయన కూడా మానవమాత్రుడే అన్న భావన ఏర్పడుతుంది. లేదా అధికారానికి ప్రతీకగా నిలిచిన గురువును చూసి భయపడే శిష్యునికి అనుకోకుండా గురువుగారు పడిపోవడంతో ఆ భయం హఠాత్తుగా నవ్వుగా మారవచ్చు, లేదా రూపంలో అది బయటకు రావచ్చు.

**రఘుపతి వెంకటరత్నం** నాయుడు గొప్ప ఉపాధ్యాయుడు. ఒకరోజున ఆయన కాంపోజిషన్ పుస్తకాలను దిద్ది క్లాసుకు తీసుకొస్తుండగా ఒక కొంటె కోణంగి "మాష్టారూ! గాడిద బరువు మోస్తున్నారే" అన్నాడు ఛలోక్తిగా. అందుకు నాయుడు గారు నవ్వుతూ

---

ఆనందంతో కూడిన బాధ్యతారాహిత్యభావనయే హాస్యం. – సివార్డ్

"అవున్రా. ఒక్క గాడిద బరువు కాదు... నలభై గాడిదల బరువు మోస్తున్నా" (ఆ క్లాసులోని 40 మంది విద్యార్థులను గుర్తుచేస్తూ) అన్నాడు. ఉపాధ్యాయుణ్ణి హేళన చేద్దామని ప్రయత్నించిన విద్యార్థికి "అవును. మీ బరువంతా నేను మోస్తున్నానర్రా. ఇదంతా మీ బాగు కొరకే" అన్న భావన స్ఫురించేటట్లు చక్కని హితబోధ చేశాడు ఆ ఉపాధ్యాయుడు.

మరొక ఉదంతం. అప్పుడే తరగతి గదిలోకి ప్రవేశించిన ఉపాధ్యాయు డు బోర్డు పైన గాడిద బొమ్మను చూశాడు. ఆయనకు బాగా కోపం వచ్చినప్పటికీ తమాయించుకొని, పిల్లలవైపు చూసి నవ్వుతూ "ఈ బొమ్మ ఎవరు వేశారోకాని, చాలా బాగా వేశార్రా ా ా! ఇలాంటి 50 అడ్డగాడిదలకు టీచరు కావడం నిజంగా కష్టమేరా" అనడంతో పిల్లలందరూ ఖంగుతిన్నారు.

**4) అసంబద్ధత:** అసంబద్ధత మూలంగాగాని, మన దృక్పథంలో ఆకస్మికంగా అనుకోని మార్పు వచ్చినప్పుడుగాని నవ్వు వస్తుంది.

**తండ్రి** : ఒరేయ్ .... పక్కింట్లో సుత్తి తీసుకురా!

**కొడుకు** : (అలా వెళ్ళి వచ్చి) పక్కింట్లో లేదు నాన్నా

**తండ్రి** : అయితే... ఎదురింట్లో ఉందేమో అడిగిరా!

**కొడుకు** : (తిరిగొసూ....) వాళ్ళింటో కూడా లేదంట నాన్నా

**తండ్రి** : ఛ .... ఛ.... ఈ దేశం ఏం బాగుపడుతుందో ఏమో! ఏ కొంపలో చివరకు ఓ సుత్తి కూడా ఉండదు. ఉన్నా ఇచ్చి చావరు.... ఏం చేస్తాం... సరే.. మన ఇంట్లో సుత్తి తీసుకురా... (అన్నాడు గుక్కతిప్పుకోకుండా)

**5) విచిత్ర కూర్పు**: ఒక వస్తువుకు, దాని భాగాలకు మధ్యగల సంబంధం, కొన్ని సంఘటనలు, భావాలు, సామాజిక లక్ష్యాలు, ఆశలు మొదలైనవి అందరూ ఊహించినట్లే జరిగితే అందులో విచిత్రమేమీ ఉండదు. దానికి భిన్నంగా లేదా వ్యతిరేకంగా ఒక సంఘటనలోని భాగాలు కూర్చబడినట్లు కన్పిస్తే, ఆ సంఘటన హాస్యోక్తిగా కన్పించి చక్కలిగింతలు పెడుతుంది.

**పాపారావుగారి** అత్యంత ప్రియమైన కుక్క తప్పిపోయింది. అది ఆయనకు ప్రియమిత్రుడే కాదు, ప్రాణంలాంటిది కూడా. అందుకని స్థానిక సాయంత్రపు పత్రిక (Evening paper) లో ఆ కుక్కను తెచ్చి పెట్టినవారికి రూ. 10,000/- బహుమానం ఇస్తానని ప్రకటించాడు. ఆ రోజు గడిచింది. మరునాడు సాయంత్రమైనా పత్రిక రాకపోవడంతో పాపారావే స్వయంగా పత్రికా కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడ

---

సృజనాత్మకత, హాస్యం కవలలవంటివి. – లిల్లీ టామ్లిన్

కాపలాదారుడు తప్ప ఎవ్వరూ కన్పించకపోవడంతో ఆశ్చర్యపోతూ  కాపలాదారునితో "ఈనాటి సాయంత్రం పత్రిక విడుదల కాలేదా?" అన్నాడు పాపారావు. "అనుమానమేనయ్యా! ఆఫీస్ సిబ్బంది మొత్తం కుక్కను వెతకడానికి వెళ్ళారు" అని కాపలాదారుడు అనడంలో హాస్యం తొంగిచూస్తుంది.

అంటే ఇక్కడ మనం ఊహించేదానికి భిన్నంగా, వ్యతిరేకంగా ఒక సంఘటనలోని భాగాలు కూర్చబడ్డాయన్నమాట! దాంతో సంఘటనల క్రమం అర్థవంతంగా కాకుండా హాస్యజనితంగా మారిపోయింది.

**6) ఆంతరంగిక ఉద్రిక్తత** : బాహ్యంగా ఎలాంటి సంబంధంలేని లేదా అసంబద్ధమైన రెండు వ్యవస్థలు కలసినప్పుడు గొప్ప మానసిక క్రియాశీలత ఏర్పడుతుంది. మరి ఆ క్రియాశీలత యొక్క స్వభావం ఏమిటి? అది ఏ రూపంలో ఉంటుంది? అది ఆదుర్దాతోగాని లేదా వ్యతిరేక భావోద్రేకంగాగాని బహిర్గతం కావచ్చు. ఇవన్నీ కలసి ఆంతరంగిక ఉద్రిక్తతకు దారి తీయవచ్చు లేదా అది నవ్వు రూపంలో బహిర్గతం కావచ్చు.

మన భావావేశ జీవితాలు అంతర్ముఖంగా ఎలా నిర్దేశింపబడతాయో, బహిర్గతంగా కూడా అలానే పరిమితం చేయబడతాయన్న సత్యాన్ని నవ్వు మనకు గుర్తు చేస్తుందంటారు ఆచార్య ప్రొవైన్. భావావేశాలు వ్యక్తిగత విషయాలు కావని, అవి సామాజిక చర్యలని చెబుతూ నవ్వు కూడా అలాంటిదే నన్నారు. అంతేకాదు. మన శరీరం ద్వారా, ముఖం ద్వారా వ్యక్తమయ్యే భావ ప్రకటనలు మన సంక్షేమానికి అత్యంత అవసరం అన్న డార్విన్ సిద్ధాంతాన్ని ఆయన ఇక్కడ ఉటంకించారు.

ఉర్దూ, పారశీక భాషలలో మహాకవి మీర్జా గాలిబ్. ఆయన ఒక నిఘంటువులో దొర్లిన పొరపాట్లను తెలియజేస్తూ ఒక గ్రంథం వ్రాయగా, మరో పండితుడు గాలిబ్ రచనను దుయ్యబడుతూ ఇంకొక పుస్తకం వ్రాశాడు! ఆ విమర్శను చదివిన గాలిబ్ మిత్రుడు ఎంతో బాధపడుతూ "ఆయనెవరో నిన్ను ఘాటుగా విమర్శిస్తూ పుస్తకం వ్రాస్తే, అలా చూస్తూ ఊరుకున్నావేమిటి?" అని హేళనగా మాట్లాడాడు. అందుకు **గాలిబ్ నవ్వుతూ "మనల్ని గాడిద తన్నిందని మనం కూడా దాన్ని తంతూ కూర్చుంటామా ఏమిటి?"** అనడంతో ఆ స్నేహితుడు అవాక్కయ్యాడు.

**స్టీఫెన్** గొప్ప సంపన్నుడు. మరణానంతరం తనతోపాటు కొంత డబ్బును తీసుకుపోవాలన్న ఒక విచిత్ర ఆలోచన ఆయనకు కలిగింది. తనకు ఆప్తులైన ముగ్గురు మిత్రులను పిలిచి, ఒక్కొక్కరికి ఒక్కొక్క కవర్ ఇస్తూ "చూడండి ఒక్కొక్క కవర్‌లో 15 వేల

ఒక దేశ నాగరికతకు అత్యుత్తమ పరీక్ష హాస్యం – లావోజీ

డాలర్లు ఉన్నాయి. నా శవపేటికను మూసేటప్పుడు దానిలో ఈ కవర్లను వేయండి" అని కోరాడు. ఆ తరువాత ఆయన మరణం, అంత్యక్రియలు, సంతాపసభ అన్నీ జరిగిపోయాయి.

కొన్ని రోజుల అనంతరం మిత్రులు ముగ్గురూ కలసినప్పుడు మాటల్లో పాస్టర్ అయిన మొదటి మిత్రుడు "స్టీఫెన్ ఇచ్చిన 15 వేల డాలర్లలో 5 వేల డాలర్లను చర్చి మరమ్మత్తులకు ఉపయోగించాను. ఈ విషయం గుర్తుకు వచ్చినప్పుడల్లా దోషిగా బాధపడుతున్నా" అన్నాడు. ప్రక్కనే కూర్చున్న డాక్టర్ మిత్రుడు "నేను కూడా అందులో సగం డబ్బును ధర్మాసుపత్రిలో రోగులకు అత్యవసరమైన సామాగ్రి కొనడానికి ఉపయోగించా. ఈ విషయంలో నాకూ బాధగానే ఉంది" అనడంతోనే న్యాయవాది మిత్రుడు "మిత్రులారా! మన ప్రియ మిత్రుని కోరికను మీరు మన్నించనందుకు నాకు చాలా బాధ కలిగింది. నేను మాత్రం15 వేల డాలర్ల పర్సనల్ చెక్‌ను కవర్‌లో పెట్టి భద్రంగా శవ పేటికలో ఉంచా. ఈ విషయంలో మిత్రుని కోరిక నెరవేర్చినందు కు నాకు ఎంతో తృప్తిగా, ఆనందంగా ఉంది" అంటూ సంతోషాన్ని చాటుకున్నాడు!

**7) అనుకరణ :** కుంటివాడిని చూసి మనం నవ్వం కాని కుంటడాన్ని అనుకరించేవాడిని, నటించేవాడిని చూసి నవ్వుతాము. 'భావ ప్రకాశనం'లో శారదా తనయుడు నవ్వు పుట్టుక గురించి ఇలా చెప్పాడు : పార్వతి ప్రేమను పొందడానికి శివుడు జడలు కట్టిన జుట్టుతో, మెడలో పాములతో, దుప్పి చర్మంతో ప్రత్యక్షమయ్యాడు. అలాంటి ఆకారాన్ని చూసినప్పుడు మరి భయం కాక నవ్వు ఎందుకు వచ్చింది? శివుని భౌతిక ఆకారానికి, మనోభావానికి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని ఈ వివరణ వ్యక్తపరుస్తుంది. సహజంగా ఉండటం ప్రకృతి, దానికి భిన్నంగా ఉండటం వికృతి. 'నాట్య శాస్త్రం'లో భరతుడు ఒకవ్యక్తిని అనుకరించడం హాస్యానికి మూలకారణం అంటాడు. నటనలో ప్రధాన అంశం అనుకరణయే కదా! అందుకే 'ప్రతాపరుద్రీయం'లో భానుదత్తుడు **హాస్యం యొక్క ఫలితం వికారం** అన్నాడు. అసంబద్ధ ప్రలాపం, వింత వేషం, వికృత చేష్టలు, వికృత వాక్కు నవ్వుకు కారణాలుగా చెప్పవచ్చు. దీని మూలంగా మనిషిలో కలిగే మనోవికారమే హాస్యంగా బహిర్గతమవుతుంది. మిమిక్రి ప్రోగ్రాంలు చేస్తూ జనాన్ని విరగబడి నవ్వించే కళాకారులు చేసేపని ఎందరో ప్రముఖ వ్యక్తులను అనుకరించడమే కదా! పేరడి అంటే మూలరచనను అనుకరించడమే కదా! అందుకే చక్కని హాస్యానికి పట్టుకొమ్మగా తోడ్పడుతుంది అనుకరణ.

**8) రోగులకు సాయం:** బహిర్గతంగా హాస్యం ఎలా పని చేస్తుందో, అంతర్గతంగా కూడా దాని ప్రభావం అలానే ఉండవచ్చు. ప్రతి వ్యక్తిలోను రెండు పార్శ్వాలు ఉంటాయి. అవి

---

హాస్యం భిన్నసమతలాలలో భావాలను వ్యక్తపరుస్తుంది. – ఇలియట్ వోరింగ్

రెండూ పరస్పరం ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో పనిచేస్తే అది ప్రశాంతి నిలయం అవుతుంది. అలా కాకుండా అవి కురుపాండవుల్లా వ్యవహరిస్తే అది .అశాంతి నిలయంగా మారుతుంది. తనకు, ఇతరులకు మధ్య ఏర్పడిన విభేదాలను తొలగించు కోవడంలోను, కొన్ని సమయాలలో తన ఇరు పార్శ్వాల మధ్య ఏర్పడిన సమస్యలను పరిష్కరించుకోవడంలోను ప్రత్యామ్నాయాలు పరిమితంగా కన్పిస్తాయి. మనిషికి అత్యంత ముఖ్యమైన ఈ లక్షణాన్ని పెంపొందించుకోవడంలో సాయపడగలవాడు సైకియాట్రిస్ట్ ఒక్కడే. మరి ఆయన ఆ విజయాన్ని ఎలా సాధిస్తాడు? ఆయన రోగికి వస్తువుల / సంఘటనలలోని హాస్య కోణాన్ని చూపెట్టడంద్వారా ఈ విజయాన్ని సాధిస్తాడు!'

మనోరమ ఒక వైద్యుని సహాయాన్ని అర్థిస్తూ వెళ్ళింది. ఆమెకు ఆత్మవిశ్వాసం బహు తక్కువ. బజారుకు వెళ్ళి ఏమన్నా తీసుకురావాలన్నా బస్సు ఎలా ఎక్కాలి? ఆ రద్దీలో ఎలా నిలబడాలి? అని ఆందోళన చెందుతుంది. తాను చాలా కష్టమని భావించి భయపడిన పనిని త్వరగానే గాక, ఆనందంగా పూర్తిచెయ్యడానికి వైద్యుడు చేసిన చికిత్స ఇది. డాక్టర్ గారు మనోరమను హిప్నటైజ్ చేసి బస్సు ప్రయాణం చేయిస్తున్నాడు. బస్సు చాలా రద్దీగా ఉండటంతో ఆమె ఉక్కిరిబిక్కిరైంది. తన చేతిలో వున్న కొక్కెంతో కొంచెం దూరంలోవున్న వ్యక్తి టోపీని లేపి ముందున్నవాని నెత్తిమీద ఉంచింది. “నా టోపీని ఎందుకు లాగావు?” అని టోపీవాలా అడుగగా, “నాకు తెలియదయ్యా బాబూ! అని మరొకడు వాదులాడుకోవడంతో అంత రద్దీ ప్రయాణంలో కూడా ఆమె పగలబడి నవ్వుతూ హాయిగా ఆనందించగలిగింది.

ఇప్పుడు ఆమె రైలుబండిలో ప్రయాణం చేస్తున్నట్లుగా ఊహిద్దాం. అక్కడ కూడా బాగా రద్దీగా ఉండటంతో మనోరమ కొంగజపం చేస్తున్నట్లుగా ఒంటికాలి పైన నిలబడవలసిన దురవస్థ ఏర్పడింది. రోగికి చికిత్సకుడు చెవిలో ఏదో చెప్పడంతో హఠాత్తుగా ఆమె“అమ్మో! అయ్యో!" అంటూ మూల్గుతూ కూలబడింది. సీట్లలో కూర్చున్నవారంతా ఆదుర్దాతో లేచి ఆమెను పడుకోబెట్టారు. అలా పసందుగా ప్రయాణం సాగుతుండగా.... ఇంతలో రోగి ఊరు రావడంతో నెమ్మదిగా లేచి అలా వెళ్ళిపోయింది! ఇలాంటివి ఎన్నో ఊహాచిత్రాలను తయారుచేసి చికిత్సకుడు ఆశ్రితుణ్ణి (రోగిని) ఆనంద డోలికలలో ఊపుతూ అతని భయాందోళనలను పారద్రోలవచ్చు.

**9) భాషా సౌందర్యం :** శాబ్దిక హాస్యంలో ఒక ప్రత్యేకత, విశిష్టత ఉంటుంది. అక్కడ ఒక పదం అర్థం ఒక సందర్భంలో ఒకటి అయితే, మరొక సందర్భంలో ఇంకొకటి కావచ్చు. అందువలన హాస్యోక్తి మనల్ని హఠాత్తుగా ఒక చట్రం నుండి మరొక చట్రంలోకి

---

హాస్యం తక్షణ విశ్రాంతినిస్తుంది. అదొక సెలవు దినంలాంటిది. – లిల్లీ టామ్లిన్

తీసుకుపోతుంది. ఒక్క క్షణకాలం మనం ఆ రెండు చిత్రాలను గురించి ఏక కాలంలో ఆలోచించడంతో నవ్వు వస్తుంది!

ఓ సిగరెట్ ప్యాకెట్ కొని రూ. 500/- నోటు ఇచ్చాడు దయాకర్. చిల్లర లేదండి అని షాపు యజమాని అనగానే, ప్రక్కనేవున్న మిత్రుడు శశాంక్ రూ. 25/- ఇస్తూ, "దానిని మార్చి తరువాత ఇవ్వులే" అన్నాడు. "ఆ ('మార్చి' పదాన్ని నొక్కుతూ) మార్చి తర్వాతే ఇస్తానులే" అని దయాకర్ అనడంతో శశాంక్ గతుక్కుమన్నాడు! (అన్నట్లు ఆరోజు ఏప్రియల్ 10వ తేదీ)

**అమెరికా** ప్రఖ్యాత హాస్యనటులలో జోయి బిషప్ ఒకరు. హాయిగా బజారులో సంచరించేటప్పుడైనా ఒంటరిగా ఉండాలన్నది ఆయన కోరిక. మరి ప్రఖ్యాత నటుడుగదా! ఆ వెండితెర హీరోతో ఏదో మాట్లాడాలనో, ఆతని ఆటోగ్రాఫ్ తీసుకోవాలనో చాలామందిలో కోరికలుంటాయి. ఒకనాడు జోయి అలా వెళుతుండగా ఒకామె అతనిని తేరిపారజూస్తూ "మీరు జోయి బిషప్ కదూ?" అంటూ ప్రశ్నించింది. "అబ్బే! లేదండి నేనలా కన్పిస్తానంతే" అంటూ నవ్వుతూ, "అవునూ! ఇంతకూ మీరు అతని అభిమానినా?" అన్నాడు తన సహజమైన హాస్యధోరణిలో. "అబ్బే లేదండి. అలా కన్పిస్తానంతే" అన్నది ముసిముసినవ్వులు చిందిస్తూ ఆ గడుసరి.

భాషా సౌందర్యం మరింతగా గుబాళించిన ప్రాచీన హాస్యోక్తి ఒకటి చూడండి. శ్రీకృష్ణదేవరాయలు ఒక రోజున కవులతో ముచ్చటిస్తూ "మీకు ఇష్టమైన ఏ వాక్యాన్నైనా చెప్పండి. అందులోని ప్రతి అక్షరం లేక రెండు మూడు అక్షరాల కలయికతోనైనాసరే భిన్న భాషలలో ఒకే అర్థం రావాలి. **ఆ వాక్యంలో నాలుగు లేదా ఐదు భాషలకు చెందిన అక్షరాలు/పదాలు ఉండాలి.** అయితే, ప్రతి అక్షరం లేదా పదం అర్థం మాత్రం ఒక్కటే అయివుండాలి" అన్నాడు. కవులు ఎంతగా ఆలోచించినా సమాధానం దొరకలేదు. "రేపు కలసినప్పుడు దీనికి జవాబు చెప్పాలి" అంటూ రాయలవారు సభనుండి నిష్క్రమించారు.

ఆరోజు రాత్రి తెనాలి రామకృష్ణుడు ఈ చిక్కు ప్రశ్నకు సమాధానం ఏమిటా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. అలా గంటలు దొర్లిపోయాయి కాని, సమాధానం మాత్రం దొరకలేదు. ఇంతలో రామకృష్ణుని బావమరిది ఆనందంగా లోనికి వస్తూ "మన ఆవు ఈనింది బావా" అన్నాడు. రామకృష్ణుడు "ఏ ఆవురా బావా?" అని ప్రశ్నించడంతో, "నల్ల ఆవు బావా" అంటూ బావమరిది తుర్రుమన్నాడు. రామకృష్ణుని మదిలో ఏదో తళుక్కుమంది. అతని మనసులో ఒక్క వెలుగు వెలిగింది. ఆనందంతో ఆ రాత్రి హాయిగా నిద్రించాడు.

---

మానసికోద్వేగ పరివక్వమే హాస్యం. – గ్రాట్ జాన్

మరునాడు రాయలవారి వద్దకు వెళ్ళి “ప్రభూ....... మీరు వేసిన చిక్కుముడిని విప్పగలను” అన్నాడు. రాయలవారు నవ్వుతూ “ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు చెప్పడంలో మీకు మీరే సాటికదా! ఇంతకూ ఆ సమాధానమేమిటో సెలవివ్వండి” అని ఆత్రంగా ప్రశ్నించారు. **“ఏ ఆవురా బావా?"** అనే వాక్యంలో 'ఏ' అంటే మరాఠి భాషలో 'రండి' అని అర్థం. హిందీలో 'ఆప్' అంటే అదే అర్థం కదా! తెలుగులో 'రా' అంటాము. అలానే కన్నడంలో 'బా' అన్నా, తమిళంలో 'వా' అన్నా అదే అర్థం వస్తుంది. వాక్యం కూడా ముచ్చటగా “ఏ ఆవురా బావా” అని ఏదో ఆత్మీయతతో అడిగినట్లు ఉంది కదు ప్రభూ" అనడంతో అందరూ ఆనందంతో రామకృష్ణుని ప్రతిభను ప్రస్తుతించారు.

**10) చక్కిలిగింతలు :** చక్కిలిగిలిలో ఒక ప్రత్యేకత ఉంది. ఇతరులు చక్కిలిగిలి పెడితే నవ్వుతాము కాని, మనకుగా మనమే చక్కిలిగిలి పెట్టుకొని నవ్వలేము కదా! అన్నట్లు చింపాంజీలకు కూడా గిలిగింతలంటే మహా ఇష్టమట. చక్కిలిగింతల వెనుక ఆశ్చర్యం దాగి ఉంది. అదొక సామాజిక ప్రక్రియ. తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య అదొక గొప్ప అనుబంధంగా ఎదిగి, మనలో ఒకానొక రకమైన ప్రవర్తనా పునాదులు వేయడానికి దోహదం చేస్తుంది. అందుకేనేమో మనిషి ఎదిగిన తర్వాతకన్నా చిన్నతనంలోనే ఎక్కువగా నవ్వుతాడు. హాస్యానికి, చతురోక్తులకు మన శరీరం స్పందిం చడం లేదని, సామాజిక సంబంధాలకు అది స్పందిస్తుందన్నది ప్రొవైన్ సిద్ధాంతం.

**11) అస్పష్టత, అపార్థం : “డాక్టర్ గారు ఇంట్లో ఉన్నారా?” గుసగుసలాడినట్లు అడిగాడు బ్రాంకైటిటిస్‌తో బాధపడుతున్న ఒక రోగి. యౌవనవతి, రూపవతి అయిన డాక్టర్ గారి భార్య నెమ్మదిగా “ఆయన ఇంట్లో లేరండి" అంటూ "లోనికి రండి" అని ఆహ్వానించింది.**

ఈ హాస్యోక్తి ప్రత్యేకత ఏమిటి? ఈ హాస్యోక్తిలో భావ అస్పష్టత, దాని మూలంగా ఏర్పడిన అపార్థం హాస్యానికి కారణమైంది. అది ఉచ్చారణాపరమైన పొరపాటు కావచ్చు లేదా భావ ప్రకటనా లోపం కావచ్చు. మొత్తం మీద స్త్రీ పురుష సంబంధాలను గురించిన కల్పనాశక్తికి ఇది అవకాశం కల్పిస్తుంది. ఇక్కడ పరిహాసమైన, అందమైన భాష, వ్యభిచారానికి సంబంధించిన సామాజిక నిషేధాన్ని తలదన్నేటట్లు చేయడంలాంటి భావాలు మనల్ని ఉత్సాహపరుస్తాయి. ఇదొక చిన్న నాటకం. ఈ నాటకం చక్కిలిగిం తలతో ముగియడంతో ముసిముసిగా నవ్వుకుంటాము.

అనంతమైన కోరికలు ఆనందమయమైన అసంతృప్తిని మిగులుస్తాయి. చివరకు స్వేచ్ఛపొందిన కోరికయొక్క ప్రతిరూపంగా నవ్వు వస్తుంది. ఈ విధంగా రెండు విచి త్రమైన భావాలమధ్య ఏర్పడిన చైతన్యవంతమైన ఊగిసలాట ఆనందంగా ఆవి ర్భవిస్తుంది.

**నవ్వుకు కారణాలు** : పైన ఉదహరించిన ఉదంతం ఆధారంగా ఇప్పుడు నవ్వుకుగల కారణాలను తెలుసుకుందాం.

డాక్టర్ గారి భార్య హాస్యోక్తిలో 'అందమైన, యౌవనవతి అయిన భార్య' అనడంతోనే రాబోయే ఆసక్తికరమైన విషయం గురించి ఉత్సాహం కలుగుతుంది. అయితే ఆ వాక్యంలోని అస్పష్టత, దాని మూలంగా ఏర్పడిన అపార్థాలు మనకు చక్కిలిగింతలు పెడతాయి. నాటక లక్షణాలైన సంయమనం, చపలతల మధ్య ఏర్పడిన ఆతురతతో అది పతాకస్థాయిలో ఉత్తేజాన్ని కలిగిస్తుంది, ఆనందపు అంచులకు తీసుకుపోతుంది కాని, ఆ ఆనందం అలానే కొనసాగదు. మనం నవ్వుతామే కానీ ఆమె గృహంలోకి ప్రవేశించి, అక్కడ జరుగుతున్న కార్యక్రమాన్ని తిలకించడానికి ఉద్యమించం. అలాగని మనల్ని లోపలకు రానీయలేదన్న అసంతృప్తి మనలో మిగలదు! అందుకే హాస్యం శృంగార వ్యతిరేకమైనదిగా చెబుతారు. మరో విశేషం. ఈ విధంగా నవ్వు మనలోని మానసిక శక్తిని విసర్జిస్తుంది (రిచర్డ్ సైమన్).

ఈ కారణం వల్లనే హాస్యోక్తిని నిర్వచించడం కష్టమవుతుంది. హాస్యోక్తిలోని విషయం మన భిన్న కోరికలను, మన నైతికస్థితిని తెలియపరుస్తుంది. నవ్వు యొక్క ప్రభావం ముఖ్యంగా కోరికల ఉత్పత్తిపైన, కోరికల కేంద్రమైన సంస్కృతిలో మన ఉనికి పైన ఆధారపడి ఉంటుంది. డాక్టర్ భార్య హాస్యోక్తిలో ఏర్పడిన అపార్థాన్ని చూసి నవ్వడానికి కారణం మనలో కొంతమంది ముందుకు వెళ్ళడానికి ఇష్టపడకపోవడమే! ఇక్కడ ఉన్న నిషిద్ధ విషయం - శృంగారం, జగడాలమారితనం మొదలైన వాటికి నిజంగా విముక్తి కలగలేదు. దానినొక సరిహద్దుగా భావించి, దానిని దాటడం ఇబ్బందిగా ఉండటంతోనే ఈ హాస్యం ఉత్పత్తి అయింది.

“ఇలాంటి హాస్యోక్తులు విన్న తరువాత నవ్వు ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు ప్రారంభమైందో స్పష్టంగా చెప్పలేము. అంటే, నవ్వులో ప్రత్యేకత దానిలోని హాస్యానికన్నా, అది చెప్పే సమయం, సందర్భం పై ఆధారపడుతుంది” (గోర్ విడాల్).

**12) ఆధ్యాత్మిక కోణం** : ఇదే విషయాన్ని ఆధ్యాత్మిక కోణం నుండి ఆ రంగంలో నిష్ణాతుడు ఎలా వివరించాడో చూద్దాం. “రోజులో ఎక్కువ సమయం నేను అంత ఆనందంగా ఉండను. మిగిలిన సమయంలో ఇంక అసలే ఆనందం ఉండదు" అంటాడు హాస్యకారుడు

---

మనలోని మానసిక శక్తిని విసర్జించేది హాస్యం. – రిచర్డ్ సైమన్

ఊడి ఎలెన్. జీవితంలో ఇతరులకు జరిగిన పరాజయాలో, పరాభవాలో, వారు చేసిన పొరపాట్లో మనకు అమితానందం కలిగిస్తాయి. అయితే, ఆ హాస్యోక్తులు కొన్ని సందర్భాలలో మన పైననే పేల్చబడవచ్చు అన్న కఠోర సత్యాన్ని మనం మరుస్తాము. తెరపై ఇతరులకు జరిగిన ఊహాజనిత పరాభవాలను తిలకిస్తూ వాటిని మన పరాజయాలతో పోల్చుకుంటూ నిజజీవితంలో ఉపశమనం పొందుతామా? ఆ నాటకీయ సంఘటనలను తిలకించడం వలన మనలో అణగివున్న ఉద్విగ్నత నవ్వు రూపంలో బహిర్గతం అవుతుందా? ఇందులో ఏది నిజం అంటూ మరొక అడుగు ముందుకు వేశాడు తత్వవేత్త బాప్స్.

అత్యాశతో నిండిన బిలియనీర్ హృదయాంతరాళాలలో బిచ్చగాడిగా దేబిరించడం, మరింత ఖ్యాతి, మరింత సంపద కొరకు కాటికి కాళ్ళు చాచిన కోటీశ్వరుడు కూటికి లేనివాడిలా ఘోర దురాగతాలు గావించడం, ఏమీలేక కొందరు, అన్నీ వుండి మరికొందరు విలపించడం, విశ్వశాంతి, మానవాభ్యున్నతికి ఉద్భవించిన మతాలు భయంకర మారణహోమం సృష్టిస్తూ అశాంతికి కారణభూతమవడం ఓ గొప్ప హాస్యోక్తి కదూ! అందుకే అంటాడు మహనీయుడు సంత్ కబీర్ **"సముద్రంలో దప్పిక తీర్చుకునే చేపను చూస్తే నాకు చిత్రాతి చిత్రంగా ఉంటుంది"** అని. "ఇలాంటి విడ్డెరాలు చూసి యోగిపుంగవులు చిత్రంగా నవ్వుకుంటారని, అదే విశ్వ హాస్యోక్తి" అని ముగిస్తాడు బాప్స్ సాధూస్.

**మూల స్థానం:** ఇంతకూ నవ్వుకు మూలస్థానం ఏది? పెదవులు. ఇది ఎక్కడ జనిస్తుంది? మెదడులో. మరి మెదడుకు, నవ్వుకుగల సంబంధం ఏమిటి? ఈ విషయమై శాస్త్రవేత్తలు ఎన్నో పరిశోధనలు చేశారు, చేస్తున్నారు. ఈ పరిశోధనల మూలంగా మెదడు కుడి భాగంలో ఫ్రంటల్ లోబ్ అనేది ఉంటుందని, నవ్వుకు. అదే కారణమని తెలిసింది. ఈ భాగం దెబ్బతింటే మనిషి వ్యక్తిత్వమే మారిపోయి, పిచ్చివాడై అసందర్భంగా అంతులేకుండా నవ్వుతూనే ఉంటాడట! మొత్తంమీద నవ్వును నియంత్రించే స్విచ్ మెదడులోని ఫ్రంటల్ లోబ్‌లో ఉన్నది అని డా|| ఫ్రెడ్ పేర్కొన్నాడు. మెదడులోని ఒకానొక భాగం పై చిన్న ఎలక్ట్రిక్ షాక్ ఇవ్వడం ద్వారా మనిషిని నవ్వించ వచ్చంటాడు ఆయన. అయితే, మనసు ఎంతో తెలివైనది. అది తన చుట్టూవున్న పరిసరాలను, పరిస్థితులను, వ్యక్తులను కళ్ళతో చూసి, వాటిని పరిశీలిస్తుంది. వాటిలోని విశేషాలను, ఆశ్చర్యకరమైన అంశాలను జాగ్రత్తగా గ్రహించి, వాటి ప్రత్యేకతల పై విశ్లేషణ జరుపుతుంది. ఆ తరువాత నవ్వాలా? వద్దా? అనే విషయంపై నిర్ణయం తీసుకుంటుంది. ఆ నిర్ణయం ఆధారంగానే మనిషి నవ్వుతాడట!

---

ఒక వస్తువును వింత ఆకృతిలో చూడగలగడమే హాస్యం. – జాక్ స్మిత్

అయితే, ఈ నిర్ణయాలు తీసుకునే మెదడు పనితీరు ఆ మనిషి వ్యక్తిత్వం పై ఆధారపడుతుంది. అతను/ఆమె పెరిగిన వాతావరణం, మేధాశక్తి, అనుభవం, వ్యక్తిత్వ వికాసం, ఆర్థిక స్థితిగతులు, కుటుంబ పరిస్థితులు, సంస్కృతి - ఇలా ఎన్నో అంశాల ఆధారంగా మెదడు ఒక నిర్ణయం తీసుకొని శరీరంలోని మిగిలిన భాగాలకు సంకేతాలు పంపుతుంది. ఈ కారణంవల్లనే బ్రిటన్, న్యూజిలాండ్, ఆస్ట్రేలియా వాసులు శాబ్దిక హాస్యానికి ప్రాధాన్యమివ్వగా, అమెరికా, కెనడా ప్రజలు ఇతరులను గేలి చేసే ఛలోక్తులను, ఐరోపా ప్రజానీకం అతీంద్రియ, అవాస్తవిక హాస్యోక్తులను ఆహ్వానిస్తారు. లైంగిక హాస్యోక్తులు వింటూ కొందరు అసహ్యించుకుంటే, మరికొందరు వాటిని మైమరచి వింటారు. మన తోలుబొమ్మలాటలోని కేతిగాడిని చూస్తే భారతీయులు - ముఖ్యంగా పల్లెవాసులు నవ్వులలో మునిగిపోగా, అవి పాశ్చాత్య దేశీయులకు వికటంగా, జుగుప్సాకరంగా కన్పించవచ్చు. కనుక అందరినీ నవ్వించగలిగే హాస్యోక్తులు అరుదుగా ఉంటాయి.

ఆచార్య కేథరిన్ వాన్‌గఫే, ఆచార్య కల్లెన్, ఎం.మెహర్ మొదలైన రచయితలు వ్యక్తి ఇష్టం, ఆకర్షణ, మానసిక, భౌతిక ఆరోగ్యం, ఉన్నత సంవేదన, ఉన్నత భావావేశం, పనితీరు అనే అంశాలపై హాస్య భావన ఆధారపడుతుందని పేర్కొన్నారు. ప్రకృతి విరుద్ధంగా ఒక సంఘటన జరిగినప్పుడే నవ్వు వస్తుంది కాని, సర్వసాధారణంగా జరిగే విషయాలను చూసి మనం నవ్వం కదా! ఇక్కడ మరొక విచిత్రం ఉంది.

మెదడులోనుండి ఒక పర్యాయం బయటకు వచ్చిన ఆలోచన మరొక పర్యాయం కూడా బయటకు వస్తే మనలో ప్రత్యేక, ఆశ్చర్యకర భావాలు కలుగవు. అందుకే మంచి హాస్యోక్తిని మొదటిసారి విన్నప్పుడు పగలబడి నవ్వుతాము. దానినే రెండవ పర్యాయం వింటూ అంతగా స్పందించము. ఇక మూడవ పర్యాయం కూడా వినాల్సివస్తే ఇంక చెప్పేపనేలేదు!

ఒంటరిగా కూర్చున్నప్పటి కంటే నలుగురితో ఉన్నప్పుడు మనిషి 30 రెట్లు అధికంగా నవ్వుతాడు. అదేవిధంగా, మనిషి ఏకాంతంగా ఉన్నప్పుడు పెద్దగా మాట్లాడతాడే కాని పెద్దగా నవ్వడు. అందుకే అంటారు వ్యక్తిలో పిచ్చతనం అరుదు. సమూహాలలో అది రివాజు, నియమం అని. అందువల్లనే పుస్తకంలో హాస్య సంఘటనను చదువుతూ ముసిముసిగా నవ్వుతాము. అలానే పరిచయస్తులముందే నవ్వు వస్తుంది. కనుక నవ్వు హాస్యానికి భౌతిక ప్రేరణ కాదు', మరొక విచిత్రమేమంటే కొన్ని సందర్భాలలో మనం మాటలకన్నా నవ్వుకే అధిక ప్రాధాన్యమిస్తాం. అలానే, హాస్యోక్తులు వినేవారికన్నా చెప్పేవారు 46% ఎక్కువగా నవ్వుతారని పరిశోధనల ద్వారా తెలిసింది. మరొక విచిత్రం ఏమంటే,

ఒకానొక రకమైన గేలి, ప్రేమల కలయికయే హాస్యం. – రావ్

మనిషి నవ్వడానికి ప్రధాన కారణం హాస్యోక్తులు, అసంబద్ధత కాక, సామా జికమైన సంబంధాలే అంటాడు అవిశ్రాంతంగా 65 గంటల్లో 9 వేల హాస్యోక్తులు చెప్పి ప్రపంచ రికార్డు సృష్టించిన హాస్య చక్రవర్తి, కొలంబోవాసి జోస్ ఆర్డోనెజ్. అందుకే ఇంక హాస్యం రూపం, నిర్మాణం గురించి తదుపరి అధ్యాయంలో తెలుసుకుందాం.

అధ్యాయం 3

# హాస్యం రూపం: నిర్మాణం

**భారీకాయంగల** భీమారావు కూరగాయల దుకాణంలోకి వెళ్ళి ఒక పెద్ద టొమాటోను సగానికి కోసి ఇమ్మన్నాడు. "టొమాటో మొత్తంగా తీసుకోవలసిందేగాని సగాలు ఇవ్వడం కుదరదండి" సేల్స్ గర్ల్ వినయపూర్వక సమాధానం. అయినా భీమారావు తనకు సగం టొమాటోనే కావాలని పట్టుబట్టడంతో ఆ సేల్స్ గర్ల్ తన యజమాని అనుమతికై లోనికి వెళ్ళి అతనికి విషయాన్ని వివరిస్తూ "ఒక మూర్ఖుడైన స్థూలకాయుడు, నికార్సైన గొరిల్లా రూపం గలవాడు తనకు సగం టొమాటోను....." అని చెబుతూ వెనక్కు చూసి, ఆ భారీకాయం తన వెనుకనే ఉన్నట్లు గ్రహించి ఏమాత్రం తడుముకోకుండా "........ తీసుకుపోగా మిగిలిన సగాన్ని ఈ పెద్దమనిషి కావాలంటున్నాడు. ఏం చెయ్యమంటారు?" అని అడిగింది.

**"ఏమిటి సరూ!** మీవారికి ఏమైంది? ఒళ్ళంతా ఆ కట్లేమిటి, ఆ మూలుగులేమిటి? ఏమైనా యాక్సిడెంట్ జరిగిందా?" అడిగింది మనోరమ.

"అదేం లేదు మనూ! మావారికి, నాకు తరచు ఏవో చిన్నచిన్న పట్టింపులొస్తుంటాయి. ఆయన ముందు నోరు తెరచి మాట్లాడే అలవాటు నాకు బొత్తిగా లేదని నీకు తెలుసుగా....... అందుకే....." అంది సరోజ.

ఈ హాస్యోక్తులలోని సర్వసాధారణ నమూనాను (Common pattern) లేదా, ఒక పద్ధతిని పరిశీలించండి. ఈ రెండింటిలోను కొద్దిపాటి ఉద్రిక్తత కన్పించినప్పటికీ, ఆశించిన స్థాయికి అది చేరలేదు. మొదటి ఉదంతంలో ఓ భారీకాయుణ్ణి చాటుగా భారీస్థాయిలో అవమానపరచిన ఓ లతాంగి, అనంతరం ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠ, రెండవ కథనంలో ఒళ్ళంతా కట్లతో కుమిలిపోతున్న ఓ భార్యాబాధితునికి సంబంధించిన ఉద్రిక్తతలు దర్శనమిస్తాయి. అయితే, ప్రతి ఉదంతంలో ఊహించని రీతిలో ప్రవేశ పెట్టబడిన ఒకానొక మలుపుతో మనలో నెలకొన్న ఉద్రిక్తత అంతా క్షణాలలో తేలిపోయి మనకు ఉపశమనం కలుగుతుంది.

ఇక్కడ మనం స్వీయ సంగతమైన (Self - consistent), అసంబద్ధమైన రెండు పరస్పర విరుద్ధ చట్రాల ప్రమాణాలను ఏకబిగిన చూడాల్సి వస్తుంది. ఒకే పర్యాయం మనం రెండు తరంగాలకూ, శిఖరాలకూ నడుమ దూరంలో (Wavelength) ఆలోచించాల్సి వస్తుంది. ఆ వెంటనే ఉద్రిక్త క్షణాలన్నీ మలయమారుతంలా మారి ఆనంద డోలికలలో

---

హాస్యం మనల్ని నవ్విస్తుంది. కవ్విస్తుంది, ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. – లావోషే

తేలిపోతాము. అలానే, కొన్ని భావావేశ సంఘటనలు కూడా మనకు నవ్వు తెప్పిస్తాయి, గిలిగింతలు పెడతాయి. హాస్యభరితమైన కథ చదివినప్పుడు ఉత్పన్న మయ్యే ఉద్రిక్తత ఆ పరిస్థితిలోని మేధాసంబంధమైన గుర్తింపు మూలంగా కాక, అతితక్కువ ప్రతిఘటనల శరీర ధర్మం ప్రకారం బహిర్గతమవుతుంది. నవ్వు ఆ మార్గాలకు తెరదించుతుంది.

హాస్యోక్తిని ఆంగ్లంలో 'జోక్' (Joke) అంటారు. దానికి పర్యాయపదాలుగా పరిహాసం, ఎగతాళి, గేలి, నవ్వు పుట్టించే మాట, ఎకసెక్కం మొదలైన పదాలను వాడతారు. అన్ని హాస్యోక్తులు హాస్యాన్ని పుట్టించలేవు. మరి హాస్యోక్తి అద్భుతంగా పేలాలంటే, స్నేహితులను, సభికులను కడుపారా నవ్వించాలంటే దాని నిర్మాణం ఎలా ఉండాలి? దాని రూపాన్ని ఏవిధంగా తీర్చిదిద్దాలి? **హాస్యోక్తి ఆధిక్యత దాని నిర్మాణంపైనే ఆధారపడి ఉంటుందా లేక మరే ప్రత్యేక లక్షణాల వలన అది అత్యధికులను ఆకర్షిస్తుందా?** అన్నవి చాలా ముఖ్యమైన ప్రశ్నలు.

అటార్డో, చబానే మొదలైన రచయితల ప్రకారం హాస్యం ప్రధానంగా దాని కొసమెరుపు పై, హాస్యోక్తిలోని Punch Line పై ఆధారపడి ఉంటుంది. పంచ్ లైన్ అంటే సాధారణ అర్థంలో పిడిగుద్దు, రంధ్రాలు చేయుట అని చెప్పవచ్చు. హాస్యకారుడు కొసమెరుపుగా చెప్పే వాక్యంతో శ్రోతలో హఠాత్తుగా హాస్యం పెల్లుబుకుతుంది, ఏమాత్రం ఎదురుచూడని ఆకస్మిక, హఠాత్ సంఘటనలాగా, వెనుకనుండి ఎవరో గుద్దినట్లుగా, సాఫీగా సాగుతున్న ఆలోచనలకు చిల్లి పెట్టినట్లుగా జనించేమార్పు ఇది.

జర్మన్ భాషలో పంచ్ లైన్ ను Pointe (శిఖరాగ్రం - The Peak of a Climax) అంటారు. ఫ్రెంచి భాషలో దానిని Pensee (భావం) అని, ఇటాలియన్లో కన్ సెట్టో (Concetto) అని, స్పానిష్ లో కాన్ సెప్టో (Concepto) అని పిలుస్తారు. వీటన్నింటి అర్థం 'ఆలోచనలు' అనే. క్రాప్లిన్ (Kraepelin) ప్రకారం క్రమానుగతంగా తీవ్రతరం చేయబడిన మేధాసంపత్తిలోని భేదం మూలంగా నిరీక్షణలో ఏర్పడిన ఉద్రిక్తతా ఫలితమే Pointe. (The tension of an expectation caused by a successively intensified intellectual contrast.) ఇదే భావాన్ని లిప్స్, అతని నుండి ఫ్రాయిడ్ తీసుకున్నారని చెబుతారు.

అయితే, మరికొందరు రచయితల ప్రకారం కొన్ని హాస్యోక్తులు వివరణాత్మకంగా నడుస్తాయి. అక్కడ హాస్యం కొన్ని పదాలలో, పదబంధాలలో, వాక్యాలలో వ్యాపించి ఉంటుంది. దీనిని ఆంగ్లంలో Jab Line **(ముక్తాయింపు)** అంటారు. అటార్గో ప్రకారం

---

సంవేదనా విపత్తుకు సంకేతంలాంటిది నవ్వు. – హాన్స్ రాబర్ట్ జాన్

హాస్యం జనించడానికి రెండు మార్గాలు ఉన్నాయి. **1. కొసమెరుపు** (Punch Line) 2. ముక్తాయింపు (Jab Line). అర్థానికి సంబంధించినంతవరకు ఈ రెండూ కథతో కలసి నడుస్తాయి. అయితే, అవి చివరి వాక్యాలు కావు. అవి కథకు అంతరాయం కలిగించవు. అవి కథ మొత్తానికి పునర్వివరణగా ఉండవు. తెలుగులో Punch Line ను కొసమెరుపు అని, Jab Line ను ముక్తాయింపు అని వ్యవహరిద్దాం. ఇక్కడ **కొసమెరుపు**కు సంబంధించిన హాస్యోక్తిని చూడండి :

**కేథరిన్** బజారుకు వెళ్ళి ఎంతకూ ఇంటికి తిరిగిరాకపోవడంతో ఆమె భర్త మోసెస్ ఎంతో కలత చెందాడు. ఆమె కొరకు మూడు రోజులు ఎంత వెదికినా ప్రయోజనం లేకపోవడంతో పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి తన భార్య కన్పించడం లేదని ఫిర్యాదు చేశాడు. అలా ఫిర్యాదు చేసి మోసెస్ ఇంటికి రావడం.... కేథరిన్ తనకొరకే వేచివుండటాన్ని చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనై "ఇన్ని రోజుల నుండి ఎక్కడికి వెళ్ళావు? నువ్వెలా తప్పిపోయావు?" అంటూ ఆత్రంగా ప్రశ్నించాడు మోసెస్. "నా సమాధానం మీకు నచ్చకపోయినా....చెబుతాను. ముగ్గురు వ్యక్తులు నన్ను బలాత్కారంగా ఎత్తుకు పోయారు. వారు నన్ను గదిలో బంధించి నాలుగు రోజులు మానభంగం చేశారు" అంది కేథరిన్. "నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా? నువ్వు కన్పించకుండా పోయింది మూడు రోజుల నుండే కదా! మరి నిన్ను నాలుగు రోజులు బంధించారని చెబుతావేంటి?" ఆశ్చర్యంగా అడిగాడు మోసెస్. అందుకు కేథరిన్ "అవును........అది నిజమే. అయితే, నేను రేపు మరలా వెళ్తున్నా" అంది.

ఈ హాస్యోక్తిలో ప్రథమ భాగం పాత్రల పరిచయం, సందర్భం..... కేథరిన్ బజారుకు వెళ్ళి.....ఫిర్యాదు చేశాడు". ఇక రెండవ భాగం సమస్య వివరణ. "మోసెస్ ఫిర్యాదు చేసి ఇంటికి......నాలుగు రోజులు బంధించారని చెబుతావేంటి?" ఇంక మూడవ భాగం కేథరిన్ పలికిన చివరి వాక్యం ముక్తాయింపు క్రిందకు వస్తుంది. ఇక్కడ అనుకోని ఓ సంఘటన జరిగి, పాఠకుడు ఊహించని, ఊహించలేని ఓ మలుపు తిరిగింది. దానికొక పరిష్కారం కావాలి. ఈ ముఖ్య సంఘటనను సంభాషణ ద్వారా వివరించడం జరిగింది. హాస్యోక్తిలో అది ప్రధాన భాగం. అది లేనిదే సమస్యకు పరిష్కారం అవసరం లేదు, ముక్తాయింపుతో పని లేదు. ఇక్కడ మరొక ముఖ్యమైన అంశాన్ని కూడా గమనించాలి. మొదటి భాగం రెండవ భాగంకన్నా సుదీర్ఘంగా ఉంది. మొదటి భాగం సుమారు 30 శాతం నిడివి కలిగి ఉండగా, రెండవది 70 శాతం ప్రదేశాన్ని ఆక్రమించింది.

---

అందమైన అభిరుచి, హాస్యం పరస్పర విరుద్ధాలు. – మాల్కోంముగరిడ్జి

కొన్ని హాస్యోక్తులలో ముక్తాయింపుకు ముందే ఉన్న కొసమెరుపు ద్వారా హాస్యం జనించవచ్చు, పాఠకులు నిరంతరం నవ్వుతూ ఉండవచ్చు.

ఇంక **ముక్తాయింపు**కు సంబంధించిన ఉదంతాన్ని చూద్దామా....

**అది** తెల్లవారుఝామున 4 గంటల సమయం. త్రాగుడు మైకంలో ఉన్నట్లుగా అనుమానం కలిగించే స్వరంతో ఒక వ్యక్తి హోటల్ రిసెప్షనిస్టు ఫోన్ చేసి “మీ బార్ ఎప్పుడు తెరుస్తారు?” అని ప్రశ్నించాడు. “మా హోటల్ బారు మధ్యాహ్నం తెరుస్తా మండి” అని సమాధానమిచ్చాడు రిసెప్షనిస్ట్. ఒక గంట తరువాత అదే వ్యక్తి మరల ఫోన్ చేసి పీకలదాకా త్రాగి ఉన్నట్లుగా ధ్వనించే మాటలతో “మీ బార్ ఎన్ని గంటలకు తెరుస్తారు?” అని అడిగాడు. "అయ్యా! మీకు ఇందాకనే చెప్పినట్లుగా మా బారు మధ్యాహ్నం తెరుస్తామండి” రిసెప్షనిస్ట్ సమాధానం. మరొక గంట తరువాత అదే వ్యక్తి అదే బార్ కు ఫోన్ చేసి "మీ బాగ్ ఎన్ని గంటలకు తెరుస్తారని చెప్పావు?" అని అడిగాడు. ఆతని మాటలను బట్టి అతను తప్పతాగాడనిపిస్తుంది. “మధ్యాహ్నం 12 గంటలకు బార్ తెరుస్తామండి. అప్పటిదాకా మీరు ఆగలేకపోతే, మీ ఆర్డర్ పైన మీకు కావలసిన డ్రింకు మీ రూమ్ కే తెచ్చి ఇస్తాం” అన్నాడు రిసెప్షనిస్ట్. దానికి అవతలి వ్యక్తి “అది కాదయ్యా బాబూ! నేను మీ బార్ లోకి రావడానికి కాదు, మీ బార్ నుండి బయటపడటానికే నా ప్రయత్నమంతా” అన్నాడు.

ఈ హాస్యోక్తి ముక్తాయింపులో ఉన్న సమాచారం అంతకు క్రితం మూడు ముక్తాయింపు రేఖలలో ఉన్నదానికి భిన్నంగా కన్పిస్తుంది. మూడు పర్యాయాలు ఫోన్ చేయడం మూలంగా అతను ఆల్కహాల్ కొరకు ఆరాటపడుతున్నాడని, రిసెప్షనిస్టు వేధిస్తున్నాడని అర్థమవుతుంది. చివరి వాక్యంతో నిజానికి అతను బార్ లోపలి నుండి బయటకు రావడానికి ఆరాటపడుతున్నాడని తెలుస్తుంది. ఫోన్ చేసిన ప్రతి పర్యాయం అతనికి నిషా పెరిగిందని తెలియడంతో పాఠకునిలో కొంత ఉత్సుకత జనించడం సహజం. ఈ విధంగా ఇక్కడ హాస్యాన్ని సృష్టించడంలో ముక్తాయింపు కొసమెరుపుకు తోడ్పడిందని చెప్పవచ్చు. కొసమెరుపు ప్రాధాన్యతను క్షీణింపజేయకుండా, హాస్యోక్తిని వధించకుండా దాని ప్రాధాన్యతను ఇనుమడింపజేయడంలో ముక్తాయింపు తోడ్పడిం దని స్పష్టమవుతుంది. అంటే **ఆశ్చర్యాన్ని జనింపజేయడంలో హాస్యోక్తి వివరణకు ఉపయోగించే సమాచారంపైనే కాక, దాని పంపిణీ విధానంపై కూడా అది ఆధారపడుతుందన్నమాట**!

ఈ విధంగా అవాస్తవికమైన, సహేతుకం కాని పరిస్థితులు, ప్రదేశాలు, వ్యక్తులు లేదా చర్యలు మొదలైనవి మన ఊహలకు భిన్నంగా, వాస్తవ ప్రపంచానికి విరుద్ధంగా

---

బాకులకు హాస్యభావన ఉండదు. – రస్సెల్

హాస్యోక్తిలో ఒకటి రెండు పంక్తుల ద్వారా చిత్రీకరణ కావచ్చు. ఈ సహేతుకం కాని అంశాలు హాస్యోక్తి వివరణకు తోడ్పడతాయే కాని, దానికి భిన్నంగా, వ్యతిరేకంగా ఉండవని మనం గుర్తించాలి. హాస్యోక్తిని పేల్చడంలో ఇవి ప్రధాన పాత్ర పోషించినప్పటికీ ముక్తాయింపు ప్రకటన ద్వారా హాస్యోక్తి పేలడానికి ఇవి చక్కగా తోడ్పడతాయి.

ఇప్పుడు హాస్యోక్తిలో కొసమెరుపు, ముక్తాయింపు పాత్రల గురించి పరిశీలిద్దాం. ముక్తాయింపు హాస్యోక్తి నిర్మాణంలో మౌలిక పాత్ర వహిస్తుంది. కొన్ని సమయాలలో ముక్తాయింపుతోపాటు కొసమెరుపు కూడా హాస్యోక్తిలో భాగంగా ఉండవచ్చు. ఈ అంశం పై జరిగిన పరిశోధనలో 70 శాతం హాస్యోక్తులలో ముక్తాయింపుతోపాటు కొసమెరుపు కూడా ప్రముఖ పాత్ర వహించిందని తేలింది. అంటే, హాస్యోక్తిలో హాస్యాన్ని సృష్టించడానికి ఆకస్మికంగా నవ్వును తెప్పించేది ముక్తాయింపు అన్నమాట! "హాస్యోక్తి వివరణలో ఇది ప్రధాన ప్రక్రియ. హాస్యానికి ఇది ములం". **నూతన సమాచారాన్ని వినూత్న రీతిలో అందించడమేగాక, జరుగుతున్న ఉదంతానికి భిన్నంగా ఉండటం ముక్తాయింపు ప్రత్యేకత"** (రస్కిన్). దాంతో కథ మొత్తానికి పునర్వివరణ ఇచ్చినట్లు అవుతుంది. అప్పటిదాకా చెప్పిన విషయాన్ని ఒక నేపథ్యంగా, ఒక వివరణగా మనం భావిస్తే, ఆ వివరణకు వ్యతిరేకంగా, ఆ కథకు భిన్నంగా నడవడంలోనే దాని ప్రత్యేకత ఇమిడి ఉన్నది. అంటే హాస్యోక్తి ద్వారా తయారైన దృశ్యానికి పూర్తి భిన్నంగా, పరాకాష్టగా ముక్తాయింపును వర్ణించవచ్చు. **అంటే** హాస్యోక్తి మాలలో ప్రధానంగా 2 అంశాలు ఉంటాయన్నమాట.

**1. ఉపోద్ఘాతం:** ఇక్కడ పాత్రల పరిచయం, పరిస్థితి, సందర్భం ఇవ్వబడతాయి.

**2. సంభాషణా విభాగం**: ఇక్కడ పరిష్కరించవలసిన సమస్య వివరణ, ప్రేక్షకులలో ఆలోచనలు రేకెత్తించే అంశాలు చోటుచేసుకుంటాయి. దాంతో ఆ హాస్యోక్తికి అందమైన ముగింపు రావాలన్న ఆలోచన ప్రేక్షకులలో/శ్రోతలలో కలుగుతుంది. కథను కులాసాగా కంచికి సాగనంపడంలోను, శ్రోతలను మనసారా నవ్వించడంలోను ముక్తాయింపు సాయపడుతుంది.

ఒక హాస్య సంఘటనను వివరించదలచినప్పుడు ముఖ్యంగా **మూడు కొలమానాలు** తీసుకోవచ్చు: 1. ఆ ఉదంతం నిజంగా హాస్యాన్ని ప్రేరేపింపజేస్తుందా? 2. అది హాస్యాన్ని అందించడానికి ఉద్దేశించబడిందా? 3. దానిని విన్నవారు కూడా ఆ సంఘటన హాస్యాన్ని అందజేస్తుందని విశ్వసిస్తారా? 'ఈ అంశాల ఆధారంగా హాస్య నిర్మాణాన్ని గురించి

ఆలోచిద్దాం. ఇది నిజానికి అంతర్ జ్ఞానానికి సంబంధించిన అంశం. కొన్ని హాస్యోక్తుల ఆధారంగా వాటి నిర్మాణం, లక్షణాలు నిర్ణయించవచ్చు.

హాస్య సిద్ధాంతకర్తలైన కాంట్ (1790), షోపెన్ హోర్ (1819), మెయిర్ (1932), కోజ్లర్ (1964)ప్రభృతులు హాస్యానికి మూలం అసంబద్ధత అంటారు. అసంబద్ధత అంటే ఏమిటి? ఒక హాస్యోక్తి గమనంలో ఊహించినదానికి, వాస్తవంగా జరిగినదానికి మధ్య ఉన్న సంఘర్షణనే అసంబద్ధతగా పేర్కొనవచ్చు. అయితే, అర్థరహితమైన అసంబద్ధత మూలంగా హాస్యం జనించదు. సరళీకరణం చేసే విధానం హాస్యాన్ని అర్థరాహిత్యం నుండి వేరుచేయడానికి తోడ్పడుతుంది. అంటే అర్థవంతమైన అసంబద్దత హాస్యానికి అవసరం అన్నమాట!

**ఒక దేశంలో** యుద్ధ సన్నాహాలు జరుగుతున్న సమయమది. రాజు సేవకుణ్ణి పిలిచి“మౌర్య చక్రవర్తి స్ఫటికంలాంటి సైంధవాలను పంపుతానన్నాడు. అవి వచ్చాయా?” అని ప్రశ్నించాడు. అందుకు ఆ సేవకుడు “అవి స్ఫటికంలాగానే మెరుస్తున్నాయి ప్రభూ! అవి చాలా ఉప్పగా ఉన్నాయి కూడా” అన్నాడు.

సేవకుని సమాధానం చాలా అసంబద్దంగా, అర్థరహితంగా కన్పిస్తుంది, విన్పిస్తుంది. అయితే, దానిని జాగ్రత్తగా పరిశీలించినప్పుడు, దానిని సరళీకరణం చేసినప్పుడు అర్థరాహిత్యం పోయి హాస్యం జనిస్తుంది. సైంధవం అంటే గుర్రం అని, ఉప్పు అని రెండు అర్థాలున్నాయి. రాజుగారు గుర్రాలను గురించి ప్రశ్నిస్తే, సేవకుడు ఆ పదాన్ని ఉప్పుగా అర్థం చేసుకొని సమాధానం ఇవ్వడంతో అది హాస్యానికి చోటిచ్చింది. అందుకే అర్థవంతమైన అసంబద్ధత ఉన్నప్పుడే హాస్యం జనిస్తుంది కాని,అది లోపించినప్పుడు అపహాస్యంగా తయారవుతుంది.

ఇప్పుడు ఆంగ్ల భాష నుండి ఒక ఉదాహరణ తీసుకుందాం :

**జాన్సన్ :** శామ్యూల్ గారూ! యువకులకు **'క్లబ్బులు'** అవసరమని మీరు విశ్వసిస్తారా?

**శామ్యూల్ :** దయ విఫలమైనప్పుడు, మంచి పనిచేయనప్పుడు మాత్రమే. .

ఈ సమాధానం వినడంతోనే మనకు ఏదో అసంబద్ధత కన్పిస్తుంది. అంతా అగమ్యగోచరంగా అనిపిస్తుంది. ప్రశ్నకు, సమాధానానికి ఎలాంటి పొంతన లేనట్లుగా, గందరగోళంగా ఉంటుంది. అయితే, క్లబ్ అనే పదానికి ఉన్న అర్థం పూర్తిగా మనకు తెలిసినప్పుడు ఆ అస్పష్టత తొలగిపోతుంది. సాధారణంగా మనం 'క్లబ్' అనే పదాన్ని సమాజం, సంఘం, సమూహం అన్న అర్థంలో ఉపయోగిస్తాము. అయితే, దానికి దుడ్డుకర్ర

---

మరణించడం సులువు. హాస్యమాడటం కష్టం. – ఎడ్మండ్ గ్వెన్

అనే అర్థం కూడా ఉన్నదని తెలుసుకున్నప్పుడు సందిగ్ధతలు తొలగిపోయి, అస్పష్టత స్పష్టతగా మారుతుంది. నిజానికి ఈ ప్రశ్నలోనే ఒక సందిగ్ధత కన్పిస్తుంది. "యువకులకు క్లబ్బులు అవసరమని మీరు విశ్వసిస్తారా?" అన్న ప్రశ్నలోనే సేవ / సహకారం కొరకు ఏర్పడే సంఘం అవసరమా / దుడ్డుకర్రలు అవసరమా అన్న సందిగ్ధత ఉన్నది. దానికి సమాధానం ఇస్తూ శామ్యూల్ రెండవ అర్థాన్ని దృష్టిలో ఉంచుకోవడంతో సామాన్య పాఠకులకు ఇదొక అసంబద్ధతగా కన్పిస్తుంది.

**నేనే అట్టిపెట్టుకోవచ్చా?** ఒక నిందితుడు మారణాయుధాల సాయంతో దొంగతనం చేశాడన్నది నేరారోపణ. న్యాయస్థానంలో వాదప్రతివాదాలు జరిగాయి. న్యాయస్థానం అతణ్ణి నిర్దోషిగా నిర్ధారించింది. తనను నిరపరాధిగా వదిలివేశారన్న ఆనందంతో అతను "నమస్కారం సార్. అయితే, ఆ సొమ్మును నేనే అట్టిపెట్టు కోవచ్చా?" అన్నాడు అమాయకంగా! ఆ మాటలలో మనకు ఎంతో అసంబద్ధత కన్పిస్తుంది. న్యాయస్థానాలు ఇచ్చే తీర్పులన్నీ దోషులను శిక్షించలేవన్న యదార్థాన్ని ఇది చాటుతుంది. అయితే, చట్ట ప్రకారం అతని నిర్దోషిత్వం నిర్ధారింపబడింది కనుక ఆ సొమ్మును అనుభవించే హక్కు, అధికారం అతనికి చట్టబద్ధంగా లభించిందని స్పష్టమైంది. ఈ విధంగా ఆ సమాధానాన్ని సరళీకరణం చేయడంతో అక్కడ ఉన్న అసంబద్దత తొలగిపోతుంది.

ఇంతవరకు హాస్యంలో సంవేదన ప్రక్రియ గురించి తెలుసుకున్నాము. ఒక సామాన్య ప్రేరణ సైతం దాదాపు అసహజరీతిలో, నవ్వు రూపంలో భావావేశ ప్రతిస్పందనను బహిర్గతం చేయడం హాస్యం యొక్క ప్రత్యేకత.

**హాస్యోక్తి నిర్మాణం:** హాస్యోక్తి పాఠకుణ్ణి ఎప్పుడూ ఆనందంగా ఊరించాలే కాని, అతనిని హైరానా పెట్టకూడదు. ఆ ఉదంతం వివరణాత్మకంగా ఉంటూ ఖుషీగా, హుషారుగా కొనసాగాలే కాని, అదొక నసగా మారకూడదు. హాస్య బాంబును పేల్చేందుకు తాడుకు నిప్పు ముట్టించినట్లుగా కొసమెరుపును జాగ్రత్తగా సిద్ధం చేయాలి.

అందమైన యువ వితంతువు తన భర్త సమాధి ముందు మోకరిల్లి ప్రార్థన చేస్తోంది. ఇంతలో చిరుగాలి వీచి పచ్చిక మొక్కలు కదిలి ఆమె కాళ్ళకు గిలిగింతలు పెట్టాయి. ఆమె వెంటనే "మీరు ఆ లోకానికి వెళ్ళినా చిలిపి చేష్టలు మాత్రం మానలేదండీ" అంటూ సిగ్గుపడిపోయింది!

---

సాహితీ రూపాలలో హాస్యం అదృష్టంలాంటిది. – లియో రోస్టన్

ఈ హాస్యోక్తి మొదట సానుభూతి, బాధతో ప్రారంభమైంది. రెండవ వాక్యంలో కొద్దిగా గిలిగింతలు పెట్టింది. చివరి వాక్యంలో హాస్యబాంబు పేలడంతో పాఠకులు హాస్యంలో విహరిస్తారు. ముచ్చటగా మూడు వాక్యాలుగల అందమైన హాస్యోక్తి ఇది.

మనలోని భావావేశాన్ని బహిర్గతం చేసే గొప్ప సాధనంగా, ఒక గొప్ప బహుమతిగా పనిచేస్తుంది నవ్వు. దాంతో హాస్య శిఖరాగ్రాన్ని చేరడానికి అప్పటిదాకా చేసిన ప్రయత్నాలు సఫలీకృతమైనట్లుగా మనం సంతోషించడంతో ఆశ్చర్యంగొలిపే రీతిలో ఆనందం అంచుకు చేరతాము.

**కొన్ని సూత్రాలు :** హాస్యోక్తిని వినాలని అందరూ ఉవ్విళ్ళూరినట్లే, హాస్యోక్తులను పేల్చాలని చాలామంది ఆరాటపడతారు. చుట్టూ ఉన్న పదిమందినీ నవ్వించడానికి మించిన ఆనందం ఎవరికైనా ఏముంటుంది? కొందరు హాస్యోక్తిని చెబుతూ, అది బాగాలేదని భావించి, హఠాత్తుగా ఆపివేసి పెద్దగా నవ్వుతారు. మరికొందరైతే హాస్యోక్తి చెబితే, అది తుస్సుమంటుందేమో అని నిరుత్సాహపడతారు. ఇప్పుడు హాస్యోక్తి సూత్రాలేమిటో చూద్దాం:

1. హాస్యోక్తి చెప్పే ముందుగా **నీపైన నీకు విశ్వాసం ఉండాలి**. నేను హాస్యోక్తిని గొప్పగా చెప్పగలను అని నిన్ను నువ్వు విశ్వసించాలి. అది నాకు అలవికాని పని అని నీరసించకూడదు.

2. హాస్యోక్తిని చెప్పడానికి **ముందు గట్టిగా గాలి పీల్చుకోవాలి**. ఆ విధంగా నీలోకి ప్రాణశక్తి అధికంగా ప్రవేశించి, నీపై నీకు గొప్ప విశ్వాసం ఏర్పడుతుంది.

3. హాస్యాన్ని పంచేటప్పుడు **శ్రోతల కళ్ళలోకి చూస్తూ** కథాంశాన్ని వివరిస్తే వారు కూడా నువ్వు చెప్పే విషయాన్ని ఆసక్తిగా వింటారు.

4. హాస్యోక్తిని చిరునవ్వుతో ప్రారంభించాలి. ఆ విధంగా నీకు ధైర్యం కలుగుతుంది.

5. కథను దారి తప్పించక **వివరణ మీదనే కేంద్రీకరించాలి** కాని, అసలు కథలో పిట్టకథలు చేర్చకూడదు.

6. వివరణ ఇచ్చేటప్పుడు ఆశ్చర్యాన్ని గొలిపే అంశాన్ని వివరించడానికి ముందు **ఒక్కక్షణం ఆపి... మరల ప్రారంభించు**. ఇది శ్రోతలలో ఉత్సాహాన్ని రేకెత్తిస్తుంది.

7. ఆఖరి వాక్యాన్ని **- కొసమెరుపును - చాలా నింపాదిగా, గంభీరంగా చెప్పాలి.** హాస్యోక్తులను పేల్చడంలో కొంత అనుభవం గడించాక వీటిలో కొన్నింటిని పూర్తిగా విస్మరించవచ్చు. మరికొన్నింటికి మీదైన రీతిలో మెరుగులు దిద్దవచ్చు.

---

నిజానికి ఎలాంటి నిగూఢ ప్రయోజనం లేకుండా వింతగా, హాస్యభరితంగా ఉండే పలుకులే చతురోక్తులు. అవి పూర్తిగా ఒక వర్గానికి వ్యతిరేకంగా కాని, ఇతర వర్గాల పై విల్లు ఎక్కు పెట్టినట్లుగా కాని ఉండకూడదు. వ్యక్తుల నిజజీవితంలో జరిగిన యదార్థ సంఘటనలు కాకపోవచ్చు. పూర్తిగా కల్పితాలే అయి ఉండవచ్చు. ఈ

**విశ్లేషణ వద్దు - ఆనందం ముద్దు :** ఇక్కడ ఫ్రాయిడ్ చెప్పిన ఒక ఉదంతాన్ని తీసుకుందాం :

**ఒకరోజు** రాజు శరినిసిమస్ తన రాజ్యంలో పర్యటిస్తుండగా, ఒకచోట అతనికి అచ్చు తనలాగే ఉన్న వ్యక్తి కన్పించడంతో ఆశ్చర్యపోయాడు. వెంటనే అతనిని తనవద్దకు రమ్మని సంజ్ఞ చేశాడు. “మా రాజమహల్ లో ఎప్పుడైనా మీ తల్లి పని చేసిందా?” అని రాజసంతో ప్రశ్నించాడు. రాజు గారి ప్రశ్నకు ఆశ్చర్యపోయిన ఆ సామాన్యుడు నెమ్మదిగా తేరుకొని “లేదు ప్రభూ! మా తల్లి మీ కొలువులో ఎప్పుడూ పనిచేయలేదు. అయితే ....... మా తండ్రి మాత్రం....... కొద్దికాలం పని చేశాడు రాజా!" అని అతి వినయంగా సమాధానం చెప్పాడు.

ఇప్పుడు మనమొక భాషా తత్వవేత్తలా భావిస్తూ హాస్యోక్తిని ఎలా విశ్లేషించవచ్చో పరిశీలిద్దాం. ఇక్కడ రాజు మాటల్లో, చేష్టల్లో అహం, ఆధిపత్య ధోరణి, జగడాల మారితనం కన్పిస్తాయి. రాజు తనకు చేసిన అవమానానికి ఒక సామాన్యుడు తనదైన రీతిలో అమాయకంగా ప్రతీకారం తీర్చుకున్నాడని భావించవచ్చు. అయితే, ఫ్రాయిడ్ ఈ ఉదంతాన్ని గొప్ప హాస్యోక్తిగా మలచాడు. అదొక యదార్థ సంఘటన అనడానికి అవకాశం లేదు కనుక దీనినొక పెద్ద హాస్యోక్తిలో ఓ చిన్న హాస్యకథగా కూడా భావించవచ్చు. అంతేకాదు. ఒక హాస్యోక్తి వెనుక అనేక సామాజిక, చారిత్రక అంశాలు చోటుచేసుకుంటాయి కనుక వాటి యదార్థతను గురించి నిర్దిష్టంగా చెప్పలేము.

ఇంక మరికొన్ని వివరాలలోకి పోదామా?' ఆ సామాన్య వ్యక్తి సమాధానాన్ని రాజు ప్రతీకార ధోరణిగా భావించి ఉంటే, అతనిని క్షణాలలో ఉరికంబం ఎక్కించేవాడే! నిజానికి ఆ హాస్యోక్తిలోని వాక్యాలు భిన్న అర్థాలకు అవకాశం కల్పిస్తాయి. అందులో “నేను నీ తండ్రినా?” అన్న ఆధిపత్య భావన ఒకవైపు కన్పిస్తే, మరొకవైపు “మనిద్దరం సోదరులమా?” అన్న ఆత్మీయత ధ్వనించవచ్చు. ఆ రెండు పాత్రల (రాజు, సామాన్యుడు) వయసు పై కూడా దీని సమాధానం ఆధారపడుతుంది. అంతే కాదు. ఆ వ్యాఖ్యానం రాజు, రాణి ప్రవర్తనలతో ప్రారంభమై, రాజదర్బారులో పనిచేసిన సేవకుని దాకా వ్యాపించింది.

---

అసంబద్ధత యొక్క గ్రహణ శక్తియే హాస్యం.- కర్ట్ యాండర్సన్

ఈ హాస్యోక్తి ఎంతో విలువైనది అంటారు టోనీ వీల్. ఆ సామాన్యుడి తండ్రి వాస్తవంగా రాణివాసంలో పనిచేసి ఉన్నప్పటికీ, అతనికి రాణిగారితో ఎలాంటి శారీరక సంబంధం ఉండకపోవచ్చు. రాకుమారునికి, ఆ సామాన్యునికి మధ్యగల పోలిక యాదృచ్ఛికం కావచ్చు కనుక రాకుమారుణ్ణి జారజుడుగా వర్ణించడం పొరపాటే అవుతుంది. అన్నీ తెలిసి కూడా అలాంటి బలవంతపు వ్యాఖ్యనే దేనికి గౌరవిస్తున్నామంటే, అదే హాస్యోక్తిని కలిగిస్తుంది కనుక. అహంకారి రాకుమారుని ముఖంలోని చూపును తన హీన జననాన్ని గురించిన జ్ఞానోదయానికి సంకేతంగా వివరిస్తారు హాస్యకారులు. అధికారి, సంపన్నుడు అనడంతోనే ఒకరకమైన పక్షపాత ధోరణితో,జాతి వైరంతో అన్నట్లుగా ఆలోచిస్తాం. అలాంటివానిని అవమానించడం ఆనందం కలిగిస్తుంది కనుక, ఇలాంటి వ్యాఖ్యలు మనకు ప్రీతిపాత్రం అవుతాయి.

ఇది కేవలం ఒక ఉదంతం కనుక ఇంత సుదీర్ఘ వ్యాఖ్యానం అవసరమా? ఇలా ప్రశ్నించుకుంటూ, తర్కించుకుంటూపోతే ఆ చక్కని హాస్యోక్తిలోని హాస్యం అపహాస్యం గా మారి నవ్వు బదులు విసుగు పుట్టే ప్రమాదం ఉంది. **హాస్యోక్తికి కావలసింది ఆనందించగలిగే మనస్సే కాని, దానిని వ్యాఖ్యానించగల, విశ్లేషించగల నేర్పరితనం, భాషాజ్ఞానం కాదు.** హాస్యోక్తికి సాధారణంగా విలువల ప్రమాణాలు ఉండవు. అవి స్వానుభవాత్మకంగా తప్పు కావచ్చు, స్పష్టంగా అబద్ధం కావచ్చు, వ్యాకరణరీత్యాగాని, సాంకేతికంగాగాని వాటిలో లోపాలు ఉండవచ్చు. అక్కడ న్యాయసమ్మతి కూడా ఉండకపోవచ్చు. అందుకే అది స్వయం నిర్మిత సూత్రాలను పాటిస్తుంది. అదే దాని ఆంతరంగిక స్థిరత్వం. అదే హాస్యపూరిత సంభాషణకు మార్గం అవుతుంది.

పిల్లి ఎలుకలను పట్టుకుంటుందా లేదా అన్నదే ముఖ్యం కాని, దానిని ఏ పేరుతో పిలిచాము అన్నది ముఖ్యం కాదు కదా! అలానే కడుపారా నవ్వించగలిగేది, పదిమందిని హాయిగా ఆనందపరిచేది గొప్ప హాస్యోక్తి అనిపించుకుంటుంది. ఇతరులను నవ్వించగలగడం, హాస్య డోలికలలో ఆనందపరవశులను గావించగలగడం సమ్మోహపరిచే క్షణం అవుతుంది. అంతటి ఉత్తమ క్షణాన్ని మనం ఆనందించగలగాలేకాని, దానిని ప్రశ్నలతో హింసించడం, వ్యాఖ్యానాలతో వేధించడం న్యాయమా?

హాస్యశక్తి ఉపయోగిస్తే అంతా ఆనందమే మిగులుతుంది. ప్రపంచంలో గొప్ప హాస్యచతురుడు దైవం. నవ్వడానికి ఇష్టపడని గుడ్డి ప్రేక్షక జనంతో ఆయన ఆడుకుంటాడు! అందుకే హాస్యాన్ని ఆశల మాలికగా, ఊహల జాబిలిగా అభివర్ణిస్తారు. అది మానవ సృష్టి.

---

హాస్యం ఒక దిగ్భ్రాంతి, ధైర్యంతో కూడిన యుక్తిలాంటిది. అందమైన అబద్ధం. ఆ అబద్ధాన్ని నెమ్మదిగా వెల్లడి చేయడంతో ఒక దిగ్భ్రాం తిని కలిగిస్తుంది. ఇక్కడ ఒక మానసికమైన పులకింత, ఒక గంతు అవసరం. అందుకే హాస్యాన్ని విశ్లేషించడమంటే దానిని ధ్వంసం చేయడమే అవుతుంది!

**మరి హాస్యోక్తిని ఎలా పేల్చాలి :** ఎన్నో పరిస్థితులు, మరెన్నో సంఘటనలు నవ్వును పండిస్తాయి. భౌతికంగా గిలిగింతలు పెట్టే దగ్గరనుండి, మానసికంగా కితకితలు పెట్టి నవ్వించి కవ్వించడానికి కారణాలు కోకొల్లలు. అందుకే హాస్యం వైభవాలు పలువిధాలు. హాస్యోక్తులు, మూకాభినయం, విదూషకులు, హాస్యగాళ్ళు, హాస్యరచయితలు, వ్యంగ్య చిత్రకారులు, కార్టూనిస్ట్ ద్వారా భిన్న రూపాలలో హాస్యం దర్శనమిస్తుంది. అయితే, హాస్యోక్తిని చెప్పేముందు నేనొక అద్భుత హాస్యోక్తిని పేల్చబోతున్నా నని, అది వింటే నవ్వలేక మీ పొట్టలు చెక్కలౌతాయని డంబాలు దలుకకూడదు. చక్కని హాస్యోక్తులను వ్యర్థ, పోద్ఘాతాలతో నిరర్థకం చేయవద్దు.

కొందరు హాస్య చక్రవర్తులుగా కీర్తి గడించాలని ఎంత ప్రయత్నించినా కాలేరు. మరికొందరు అనాయాచితంగానే నవ్వుల పువ్వులు పూయిస్తుంటారు. హాస్యం వంశపారంపర్యంగా సంక్రమించే జన్యు సంబంధమైన లక్షణం కాదు. ఇతర కళలవలె, కౌశలంవలె హాస్యాన్ని కూడా ప్రత్యేక కృషితో అభివృద్ధి చేసుకోవచ్చు. హాస్యోక్తి చెప్పడంలో ఒక నేర్పు, ఒక విరుపు, ఒక మెరుపు ఉంటుంది. అదొక టెక్నిక్, అదొక ప్రక్రియ, అదొక పద్ధతి, దానికి సంబంధించిన పలు అంశాలను హాస్యరచనల నుండి తెలుసుకోవచ్చు.

**అసహజత్వం, ఆశ్చర్యం హాస్యానికి కారణమవుతాయి. ఒక ప్రముఖ హోటల్ లోని వెయిటర్తో ఒక కస్టమర్ "ఏమయ్యా! ఇంతమంది నీకు టిప్స్ ఇస్తారు కదా! అదంతా ఏం చేస్తావు?" అని అడిగాడు. అందుకు సర్వర్ నవ్వుతూ "ఏం లేదండి. ఒక మంచి హోటల్ కెళ్ళి భోంచేస్తా" అన్నాడు!** ఇక్కడ ఒకానొక అసహజత్వం మూలంగా ఆశ్చర్యం కలుగుతుంది.

హాస్యోక్తి చెప్పేవారు శ్రోతల మనస్తత్వాన్ని కూడా తెలుసుకోవాలి. మరొక విషయం. ఆర్థిక, మత, సంస్కృతీపరమైన భేదాలుగల ప్రేక్షకులలో ఒకే హాస్యోక్తి అందరినీ ఒకేలా నవ్వించలేదు. ఒక సర్దార్జీ అమాయకత్వాన్ని గురించి చెప్పే హాస్యోక్తి చాలామంది సర్దార్జీలకు నవ్వు తెప్పించకపోగా, కొందరికి కోపం కూడా తెప్పించవచ్చు. హాస్యోక్తి చెప్పేటప్పుడు ఒకదాని తరువాత మరొకదానిని పేల్చుతూ భరించలేని భారాన్ని శ్రోతల పై మోపకూడదు. శ్రోతలు నవ్వుకోడానికి కొంచెం అవకాశం కల్పించాలి. వారు హాయిగా గాలి పీల్చుకోడానికి

---

ఉత్తమ భావానికి పునాది కామెడీ. – జార్జి మెరెడిత్

కొంత సమయం ఇవ్వాలి. జార్జి ఎస్. కౌఫ్మన్ గొప్ప నటుడు. ఒక నాటకంలో నవ్వు తెప్పించే వాక్యాలు వరుసగా మూడు ఉన్నప్పుడు రెండింటిని తీసివేసి ఒక్కదానినే ఉపయోగించాలంటాడు ఆయన. సంక్షిప్తతే హాస్యానికి సౌందర్యం అన్నది ఆయన విశ్వాసం.

**'హాస్యోక్తిని ఎలా నాశనం చేయాలి?'** అనే అంశంపై ఆండి సిమ్మన్స్ అందించిన ఉదంతం చదవండి. ఓ నర్సు పరిగెత్తుకుంటూ డాక్టర్ వద్దకు వచ్చి "డాక్టర్ గారూ! డాక్టర్ గారూ! వెయిటింగ్ రూమ్ లో ఓ అదృశ్య వ్యక్తి కూర్చున్నాడు" అంది రొప్పుతూ. "అయితే అతనిని నేను చూడనని చెప్పు" అన్నాడు డాక్టర్.

అదే హాస్యోక్తిని నా భాషలో నేను ఇలా చెప్పసాగాను : "ఒక నర్సు- ఆమె పేరు రమ - వెయిటింగ్ రూమ్ లో ఎవరో ఉన్నట్లు భ్రమించి, తాను కూర్చున్న బల్ల పైనుండి గభాల్న లేచింది. కుర్చీని ప్రక్కకునెడుతూ, ఒక్క పరుగుతీసి డాక్టర్ గదితలుపు తట్టింది. సమాధానం లేదు . డాక్టర్ గారు ఎక్కడకు వెళ్ళారు? అంటూ ఆలోచిస్తూ హాలులోకి వచ్చింది. అక్కడ గోడకు వేలాడుతున్న ఓ గొప్ప కళాఖండాన్ని చూస్తూ ఆనందించింది...." నా హాస్యోక్తిని వినలేకనో ఏమో, వివరణ ఇక్కడదాకా వచ్చేటప్పటికి చాలామంది శ్రోతలు వెళ్ళిపోయారు. అయినా పట్టువీడని విక్రమార్కునిలా హాస్యోక్తిని కొనసాగించాను. "డాక్టర్ గదిలోకి దూసుకుంటూ వెళ్ళి 'డాక్టర్ గారూ! డాక్టర్ గారూ!' అని పిలిచా. అన్నట్లు ఆ డాక్టర్ శస్త్రచికిత్సా నిపుణుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి పట్టా పుచ్చుకున్నాడు. స్వర్ణపతకాన్ని కూడా పొందాడండోయ్ !...." ఇంక నా హాస్యోక్తిలోని ప్రధాన భాగాన్ని చెబుదామని నేను ఉవ్విళ్ళూరుతుంటే... నిజం చెప్పొద్దు శ్రోతలలో ఒక్కడైనా మిగిలితే ఒట్టు.

హాస్యోక్తిని చెప్పడం ఒక కళ అయితే, దానిని చక్కగా విని ఆనందించగలగడం కూడా ఒక కళనే. ఈ హాస్యోక్తిని మా మామయ్య ఎలా గందరగోళపరుస్తాడో చూడండి!

"అవును, వైద్యుడు అతనిని ఎందుకు పరీక్ష చేయనన్నాడు?"

"ఎందుకంటే... ఆయన అదృశ్యంగా ఉన్నాడు గనుక!"

"మరి అతనిని నర్సు చూసిందా?"

"లేదు. అతను అదృశ్యంగా ఉన్నాడని ఆమె చెప్పింది."

"మరి అతను అక్కడ ఉన్నట్లుగా ఆమెకు ఎలా తెలుసు?"

ఇలా సాగుతుంది మా మామయ్య ప్రశ్నలపరంపర.

---

హాస్యంలో అత్యంత బలహీన రూపకం వ్యంగ్యం.- మన్రో డి.హెచ్.

దిక్కుమాలిన వ్యంగ్యం అర్థం కాకపోతే తిక్క ఎక్కిన చందంగా గంతులేస్తాము. మగమహారాజును తిట్టలేక, మహారాణులను ధైర్యంగా సమర్థించలేక ప్రముఖ రచయిత, 'పద్మశ్రీ' అవార్డు గ్రహీత గోపాల్ ప్రసాద్ వ్యాస్ వ్యంగ్య రచనలో ఓ భాగం చూడండి:

**"గాడిద అనే జంతువు భారతీయ గృహిణి వంటిది. తిండి, నీళ్ళు లేకున్నా రోజంతా చాకిరీ చేస్తుంది. అయినా గాడిద బ్రతుకు పిసరంత నయం. గృహిణి ఆమె బాధను పైకి చెప్పుకుంటే ఇంక ఆమెకు పుట్టినిల్లే దిక్కు. గాడిద, ఆడది రెండూ చచ్చినట్లు తమ యజమానికి విధేయంగా పడివుంటాయి".**

ఇదొక అద్భుత వ్యంగ్యం. మగమహారాజుల పై ఇదొక నిశ్శబ్ద తిరుగుబాటు. అయితే, మహిళలను గాడిదలతో పోల్చడం సహించలేని రాజస్థాన్ మహిళలు ఇంతెత్తున తిరుగుబాటు చేశారు. మహిళల స్థితిగతులను మెరుగుపరచాలన్న ఆ రచయిత సంకల్పం మహిళా ఉద్యమాన్ని చూసి ఎంతగా జాలిపడిందో! రాజస్థాన్ ఎడ్యుకేషన్ బోర్డ్ ప్రచురించిన 9వ తరగతి హిందీ పాఠ్యపుస్తకంలో ఒక అధ్యాయంలోగల ఈ పాఠాన్ని తొలగించాలన్నది ఆ ఉద్యమకారుల వాంఛ!

హాస్యానికి నటించడం చేతకాదు. మనం దేవదూతలం కాదని, సామాన్య మానవులమని గుర్తుచేయడమే హాస్యం బాధ్యత. అది మన నిజమైన భావాలకు ముసుగు వేస్తుంది. మన వింత ఆనందానికి ప్రకటన అది. మన వ్యంగ్య విశ్వాసం యొక్క వ్యక్తీకరణ అది. ఈ రెండింటికీ యదార్థంగా పునాదులు లేవన్న మన గుర్తింపుకు నిదర్శనం అది". పెనవేసుకొని ఉంటాయి. ఉత్తమ మానవుణ్ణి తయారుచేయడంలో హాస్యం తనవంతు కృషి చేస్తుంది. ఆ కారణంగానే ప్రతి తరం హాస్యనిర్మాణంలో తనవంతు పాత్ర పోషిస్తుంది. అందువల్లనే హాస్యోక్తులను అందంగా పేల్చడం అందరం అలవరచుకోవాలి. ఇంక హాస్య స్వభావం గురించి తెలుసుకుందామా?

---

హాస్యం వాక్యనిర్మాణంపైన, పదాల పొందికపైన నిలబడుతుంది.– బెర్గ్‌సన్

అధ్యాయం 4

# హాస్య స్వభావం

**"వెంకట్రావు** నిరాహారదీక్ష చేస్తూ శల్యావశిష్టులైపోయారు" అని పత్రికలో ప్రచురించటం చూసిన పిచ్చిబాబుకు వెర్రెత్తింది. "ఆయన ఎంత గొప్పవాడైనప్పటికీ శల్యుడు, వశిష్టుడులాంటి పురాణ పురుషులతో పోల్చడం బాగాలేదండి" అంటూ పత్రికా సంపాదకునికి ఓ సుదీర్ఘ లేఖ ఘాటుగా వ్రాసిపారేశాడు.

ఒక సర్దార్జీ మేజిస్ట్రేట్ వద్దకు వెళ్ళి ఆరుమాసాల క్రితం అరవిందరావు తనను దారుణంగా అవమానించాడని ఫిర్యాదు చేశాడు.

**మేజిస్ట్రేట్** : ఆయన నిన్ను ఆరు మాసాల క్రితం అవమానిస్తే, ఇప్పుడు ఫిర్యాదు చేస్తున్నావేమిటి?

**సర్దార్జీ** : నన్ను దారుణంగా అవమానించినట్లుగా నాకు ఇప్పుడే తెలిసింది.

**మేజిస్ట్రేట్** : అదెలా? ఆయన నిన్ను ఏమని తిట్టాడు ?

**సర్దార్జీ** : అతడు నన్ను చిన్న క్షీరద జంతువు (Slender loris) అని తిట్టాడు. ఇప్పుడే నేను ఆ జంతువును చూశా!

మనం ఎందుకు బాధపడతామో, అలానే ఏడుపు, పశ్చాత్తాపం, కోపం, సిగ్గుపడటం ఎందుకు జరుగుతాయో మనకు తెలుసు. అయితే, మన భావోద్రేకాలలో ఇప్పటికీ మనకు కొరకరాని కొయ్యగా మిగిలింది నవ్వు. కొందరు వ్యక్తులు, కొన్ని ఆలోచనలు లేదా సంఘటనలు విచిత్రంగా కన్పిస్తూ అసంకల్పితంగా ఎందుకు నవ్వు తెప్పిస్తాయో నేటికీ మనిషికి పూర్తిగా అంతుపట్టకపోవడంలోనే నవ్వు ప్రత్యేకత కన్పిస్తుంది. అంతే కాదు. ప్రపంచంలోని ఊహాజనిత భయాలు, బాధలు, ఆందోళనలనుండి విముక్తి పొందడానికి సాయపడేది నవ్వు. అలానే భిన్న పరిస్థితులు, సంబంధాలు, సంఘటనలు, ప్రవర్తనలను మనసారా ఆస్వాదిస్తూ వాటికన్నా అధికులమన్న ఆలోచనలతో ఆనందించడానికి మనిషికి ప్రకృతి ప్రసాదించిన అద్భుత వరం నవ్వు. సమాజంలోని చెడును తొలగించే శక్తి మనకు లేనప్పటికీ, దానిని ఓ అసమర్ధ అవిటితనంగా కించపరుస్తూ, ఆనందించడానికి అవకాశం కల్పించే గొప్పసాధనం నవ్వు.

"బుగ్గలలోను, పొట్టలోను ఏర్పడిన ఆకస్మిక పరిణామం ఫలితంగా నవ్వు జనిస్తుంది". నిజానికి చాలా నవ్వులు ఆనందంతో కూడి ఉన్నప్పటికీ నరాల బలహీనత

---

రాబందు ముక్కులాంటిది వ్యంగ్యం. – జార్జి మెరెడిత్

మూలంగాగాని, హింసాత్మకమైన ఎగతాళి కారణంగాగాని, నైట్రస్ ఆక్సైడ్ (లాఫింగ్ గ్యాస్) మూలంగాగాని వచ్చే నవ్వులు కృత్రిమంగా ఉంటాయి. అంటే ఇక్కడ హాస్యంతో సంబంధం లేకుండా నవ్వు జనిస్తుందన్నమాట!

నసరాజు అదొక కళాశాల. అందులో ఒక గది. సమయం సరిగ్గా ఉదయం 10.30 గంటలు. బోడిగుండుతో కళ్ళజోడు ధరించిన ఆచార్యులవారి ప్రసంగాన్ని వినడానికి గడ్డాలు, మీసాలుగల స్థూలకాయులైన విద్యార్థులు అక్కడ ఆసీనులై ఉన్నారు. ఆచార్యులవారు ఒక పాయింటర్‌ను తీసుకొని గోడకు వేలాడదీసిన చార్టీలోని కామిక్ చిత్రాన్ని చూపిస్తూ ప్రసంగం చేస్తున్నాడు: "నసగాడు అంటే ఎవరో తెలుసా?" అని ప్రశ్న వేసి తానే సమాధానం ఇచ్చాడు. శ్రోతగా ఉండవలసినవాడు మాట్లాడటం మొదలెడితే, అతణ్ణి నసగాడు అంటారు (యాంబ్రూస్ బియర్స్). మరి నస గురించి అంత స్పష్టంగా, ఏకపక్షంగా చెప్పగలిగితే అది నస అని ఎందుకు అనిపించుకుంటుంది చెప్పండి? దానిని గురించి మరొకాయన "ఓ గదిలో పదిమందితో కూర్చొని కబుర్లు చెప్పేవ్యక్తి నిష్క్రమించినప్పుడు అక్కడ ఒకరు తగ్గినట్లుగాక, ఒకరు పెరిగినట్లుగా భావిస్తే, అతనే అసలుసిసలైన నసగాడు" అన్నాడు. "ఇలా నస పై ఎంతోమంది నసోత్తములు వ్యాఖ్యానించారు" అనడంతో అందరూ విరగబడి నవ్వసాగారు. అలా వాళ్ళు నవ్వుతూ ఉంటే, ఇంతకూ వాళ్ళు తన హాస్యోక్తి విని నవ్వుతున్నారా లేక, తనను చూసి నవ్వుతున్నారా అన్న అనుమానం ఆచార్యులవారికి వచ్చింది! ఎటొచ్చీ....ఆ విద్యార్థులు తన పేంట్ మీద 'నసగాడు' అన్న లేబుల్ అంటించిన విషయం పాపం ఆచార్యులవారికి తెలియదు! హాస్యాన్ని గురించి ప్రసంగించే ఆచార్యులవారు ఈ విధంగా తానే హాస్యోక్తిలో ఒక భాగమవడం విశేషం. .

కొన్ని సందర్భాలలో నవ్వు లేకుండా హాస్యం చోటుచేసుకోవచ్చు. నవ్వడానికి ముందు పాఠకులకు/శ్రోతలకు ఆ హాస్యోక్తిలోని. అక్కడ హాస్యంతో కూడిన సందేశం అర్థమవ్వాలి. అసంబద్ధత లేదా పదకేళిలోని హాస్యాన్ని చూడగలగాలి. ఆ తర్వాత అది వాళ్ళకు వినోదం కల్పించాలి. ఆ హాస్యోక్తి కొందరికి అతి సున్నితంగా కన్పించవచ్చు. శ్రోతల మానసిక స్థితి అంత ఉత్సాహంగా లేకపోవచ్చు లేదా తమకు ప్రీతిపాత్రమైన వ్యక్తి/అంశం పై హాస్యోక్తులు విసరడం మూలంగా వారు స్పందించకపోవచ్చు. ఈ విధంగా అనేక కారణాల వలన కొందరు నవ్వకపోవచ్చు. మరో విషయం. నవ్వును, హాస్యాన్ని జతపరచలేనట్లే, వాటిని ప్రేరణ, ప్రతిక్రియ సంబంధంగా కూడా చిత్రీకరించలేము. ఉదాహరణకు, ఓ చిన్నారికి

---

చక్కిలిగింతలు పెట్టినప్పుడు అక్కడ ప్రేరణ ఫలితంగా నవ్వు (ప్రతిక్రియ) జనిస్తుంది. అయితే, అనేక సందర్భాలలో నవ్వు (ఆనందం) జనించడానికి ఒక మధ్యవర్తి ఉండాలి.

నీరు, ఇతర ద్రవాల సమ్మేళనమే మానవుడు అని, ఆ ద్రవాలను సమపాళ్ళలో కలిగి ఉండటమే మంచి ఆరోగ్యానికి, మంచి ప్రవృత్తికి మూలం అని మధ్యయుగంలో ప్రజలు విశ్వసించారని తెలుసుకున్నాం కదా! ఆ తరువాత హాస్యోక్తులను వ్యంగ్య .. చిత్రాలద్వారా హాస్యకారుడు సృష్టించే మనోభావాన్ని, ఆనందాన్ని హాస్యం అన్నారు. మరి ఈనాడో? హాస్య భావనలు కలిగించడానికి ఉపయోగపడే ఉత్తేజం/ప్రేరకాన్ని హాస్యం అంటున్నారు. అయితే, ఈనాటికీ హాస్యానికి సంబంధించిన ఒక ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. హాస్యం ప్రేరణ ఫలితమా? లేక ప్రతిక్రియ ఫలితమా? అది వ్యక్తిగత మా? వస్తుగతమా?- ఈ ప్రశ్నలకు భిన్న రచయితలు భిన్న సమాధానాలు ఇచ్చారు.

**హాస్యం ఎలా జనిస్తుంది?** హాస్యం ముక్కాలుపీట వంటిది. అదెలా జనిస్తుందో, ఎలా ఫలిస్తుందో నాలుగు శీర్షికల క్రింద పరిశీలిద్దాం.

**1. ప్రేరణ – ఆనందం - నవ్వు** : హాస్యోత్పత్తికి ప్రథమంగా ప్రేరణ (ఉత్తేజం) ఉండాలి, ఆనందం ఉండాలి. వాటి ఫలితంగా హాస్యం జనిస్తుంది. ఈ విభజన చాలా ఉపయోగకారిగా ఉంటుంది. పాఠ్యాంశానికి సంబంధించినంతవరకు స్పష్టత ఏర్పడుతుంది. హాస్యం సర్వవ్యాపకం, సర్వజనీనం అయినప్పటికీ అది అంత సులువుగా అవగాహన కాదు. అందువల్లనే హాస్యకారులను, హాస్యాభిమానులను కేంద్రంగా పెట్టుకొని ఈనాడు దాని పై విస్తృత స్థాయిలో అధ్యయనం జరుగుతుంది. వ్యక్తి స్థాయిలోనేగాక, సమాజ స్థాయిలో కూడా దానిపై విశ్లేషణలు జరుగుతున్నాయంటే హాస్యం సంక్లిష్టత అర్థమవుతుందికదూ! -

"అందం ఆనందించేవారి నేత్రాలలో ఉన్నట్లుగానే, తిలకించేవారి కంటిలో హాస్యం ఉంటుంద”ని కొందరు రచయితలు చమత్కరించారు. ప్రముఖ నాటక రచయిత షేక్ స్పియర్ చెప్పినట్లు **"హాస్యకారుని ఖ్యాతి వినేవాని చెవుల్లో ఉంటుంది కాని, చెప్పేవాని నోట్లో ఉండదు".** వీరి ప్రకారం హాస్యం వ్యక్తిగతమైనది.

ఇంక వస్తుగత భావనను తీసుకుందాం. “నటన ద్వారాగాని, మాటలు, రచన, చిత్రాలు లేదా సంగీతం ద్వారాగాని చిరునవ్వు లేదా నవ్వు పుట్టించడానికి పంపబడే సందేశమే హాస్యం” అన్నారు బ్రెమర్, రూడ్బెర్లు.

“మీకు ఈ వార్త ఎవరు చెప్పారండి?” ప్రశ్న. “ఫలానా వ్యక్తి నాకు ఆ సంగతి చెప్పాడు" అంటే అందులో నీరసంతప్ప ఏ రసం ఉంటుంది చెప్పండి? అలా కాకుండా మా

---

గొప్ప బౌద్ధిక భావావేశ శక్తిగలది సరసోక్తి. – బ్రూస్ మికెల్సన్

సహోపాధ్యాయుడు కృష్ణశాస్త్రిగారి ఫక్కీలో "ఆ వార్త ఎవరు చెప్పారంటారా? ఆ వార్త .....గంగవీటి సుబ్బారాయుడు చెప్పాడని అప్పలనరసయ్య చెబితే, అదివిన్న మోహన్ అమాంతం కృష్ణబాబుకు చెబితే, కృష్ణబాబు రంగయ్యకు చెబుతున్నప్పుడు విన్నానని రామమోహన్ జగదీష్ కు చెప్పేటప్పుడు విన్న సురభి లతతో చెబుతుండగా, ఆ దారిన పోతున్న నాకు విన్పించింది" అని చెబితే ఎవరికైనా నవ్వురాక చస్తుందా? అందుకే నవ్వడానికి ఒక ప్రేరణ ఉండాలి. అది ఆనందానికి దారితీమడంలో నవ్వు జనిస్తుంది. "అసంబద్దత ఆసక్తికరంగా ఉన్నప్పుడే హాస్యాన్ని ఆనందించగలం" అన్నది జాన్ మోరెల్ ఉవాచ. తెలుగులో శ్రీ మునిమాణిక్యం నరసింహారావు సుతిమెత్తని, ఆరోగ్యకరమైన హాస్యాన్ని అందించారు.

ఒకరోజు భార్యాభర్తలిద్దరూ ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. చివరకు ఆ సంభాషణ వారి పెళ్ళినాటి ముచ్చట్ల వద్దకు చేరింది. ఇంతలో మునిమాణిక్యం గారు "మీ నాన్న తెలివితక్కువపని చేశాడే కాంతం! ఎవడైనా శుద్ధ అప్రయోజకుడూ, చెపల వాజమ్మా, సున్నపు పిడతా, మొద్దు రాచిప్పా ఏవంవిధ లక్షణాలున్న ఓ బడుద్ధాయిని నీకు మొగుడుగా వెతకవలసింది" అన్నారు. కాంతం నిశ్చింతగా, తాపీగా "వెతికాడు" అంది.

"మరి వెతికి ఊరుకున్నాడేం?" "ఊరుకోలేదు......నన్నిచ్చి పెళ్ళి చేశాడు" అంటూ నవ్వుతూ వెళ్ళిపోయింది!

ఏతావాతా ఈ వివరణతో ఆనందంతో కూడిన నవ్వు మాత్రమే హాస్యంగా పరిగణించబడుతుందని, దానికి ప్రేరణ ఉండాలని స్పష్టం అయింది. అంటే ఇతర రకాల నవ్వులు హాస్యం క్రిందకు రావన్నమాట. మరో విషయం. ఏ సందర్భంగా పాఠకుడు/శ్రోత హాస్యానుభూతి పొందింది, హాస్యం యొక్క ప్రభావం గురించి ఇది ఉపేక్షిస్తుందని కొందరు విమర్శిస్తే, హాస్యం ఫలితాలకు, ప్రభావాలకు ఇక్కడ చోటు లేకుండా పోయిందని మరికొందరు ఆక్రోశిస్తారు. కనుక హాస్యోత్పత్తిని మరింత స్పష్టంగా వివరించే వివరణను చూద్దాం.

**2. సందర్భం- ప్రేరణ ఆనందం నవ్వు- ఫలితాలు** : కొందరు రచయితలు పరిస్థితులకు, పరిసరాలకు ప్రాధాన్యం ఇస్తారు. ప్రముఖ రచయిత పోల్లియో హస్యం పై క్షేత్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ సామాజిక భద్రత (నవ్వడం మూలంగా ఎలాంటి ప్రమాదం రాదన్న విశ్వాసం), ఉల్లంఘించడానికి వీలుగల నిరీక్షణ మొదలైన వాటిని నవ్వుకు నేపథ్య అంశాలుగా పరిగణించారు. నవ్వులో విజ్ఞానానికిగాని, భావోద్రేకానికిగాని చోటు లేదంటూ,

---

కవితా వైభవానికి అత్యున్నత పరిపూర్ణత్వం హాస్యం.- కార్లయిల్

అది సమకాలీన పరిస్థితులకు దర్పణంగా నిలుస్తుందంటారు. దీనిమూలంగా నవ్వుకు కారణాలు (Inputs), క్రియ (output) అర్థమవుతాయి.

రష్యా రాజధాని మాస్కోలో ఉత్తమ హాస్యోక్తులకు గొప్ప బహుమతులు ఇస్తామని ఒక ప్రకటన చేశారు. ఆ పోటీలలో ప్రథమ బహుమతి క్రింద విజేతలకు15 సం||ల ఏకాంత వనవాసం, ద్వితీయ బహుమతిగా 10 సం||ల కఠోర పరిశ్రమ, తృతీయ బహుమతిగా5 సం||ల సాధారణ జైలుశిక్షతో పాటు వారివారి ఆస్తులను స్వాధీనం చేసుకుంటామని తెలిపారు. స్టాలిన్ కాలంలో రష్యాలో నెలకొన్న నియంతృత్వం గురించి తెలియందే ఈ హాస్యోక్తి (సందర్భం)ని ఆనందించలేము కదా! -

**లోపాలు** : ఈ వివరణ కూడా అసంపూర్ణమైనది అనడానికి రెండు కారణాలు చెబుతారు. 1. ఆనందానికి కారణమైన హాస్య ప్రేరణ యొక్క ఆంతరంగిక ప్రవృత్తిని ఇక్కడ అశ్రద్ధచేయడం జరిగింది. హాస్యప్రేరణ జనించకముందు హాస్యోక్తిలో ఏమి చెప్పారో ముందుగా తెలియాలి. 2. హాస్యోక్తిలోని అసంబద్ధత, మెలిక అర్థమైన తర్వాతనే దానిని ఆనందించగలం. ఒక సంఘటనతో ఉత్తేజం, ఆనందం పొందడానికి ముందు దాని ఆంతరంగిక ప్రక్రియను అర్థం చేసుకోవాలి. అంటే (i) స్పష్టమైన సమాచారం ఉండాలి. (ii) దానిని జాగ్రత్తగా వినాలి. (iii) ఏ సందర్భంలో ఆ విషయం చెప్పబడిందో తెలుసుకోవాలి. (iv)హాస్యకారుడు నేర్పుతో విషయాన్ని వివరించాలి. (V) ప్రేక్షకుడు/శ్రోత హాస్యానుభూతిని కలిగివుండాలి. అంటే హాస్యాన్ని అందించడానికి శ్రోత మానసిక స్థితిని కూడా తెలుసుకోవాలన్నమాట.

ఇందులో మొదటి అంశం అంటే, సందర్భం అన్ని రకాల సందేశాలకు అవసరమే. అది హాస్యం యొక్క ప్రత్యేకత కాబోదు. మిగిలిన రెండు లక్షణాలు ప్రేరణ, ఆనందం హాస్యం యొక్క విశిష్ట లక్షణాలుగా కన్పిస్తాయి. కనుక హాస్య లక్షణాలలో వాటిని స్పష్టంగా పేర్కొనాలి. దీనిలో మరొక లోపం ఉంది. ఇక్కడ సందర్భం ఒక స్థిర లక్షణంగా పేర్కొనబడింది. నిజానికి సందర్భం క్లిష్టమైనది. ఏ సందర్భమూ స్థిరమైనది కాదు. అలానే, ఒకానొక వాతావరణంలో హాస్య ప్రేరణ జరిగినప్పుడు ఆ ప్రేరణ మూలంగా సందర్భం మారుతుంది. హాస్య సంఘటన మూలంగా జనించే ఫలితాలు సందర్భం మూలంగా ఎంతవరకు ఉంటాయో, హాస్య ప్రేరణ మూలంగా కూడా అంతవరకు ఉంటాయి. అంటే సందర్భం నమూనా మొత్తానికి ఒక ఆధారంవంటిది కనుక నమూనా మార్పు చెందే కొద్దీ

---

మనమెరిగిన హాస్యం మరణించింది.- జార్జిమైక్స్

సందర్భం కూడా మార్పు చెందుతుందన్నమాట! ప్రేరణతో ప్రజలు భిన్నరకాలుగా స్పందించినప్పుడు సందర్భం కూడా మరలా మారుతుంది. ఈ వివరణనుబట్టి హాస్యం రూపం ఇది:

**3. ప్రేరణ — సత్యగ్రహణం — వేదన (అభిప్రాయం /భావావేశం) - నవ్వు** : దీని ప్రకారం అప్పటికే నెలకొన్న ఒక సందర్భం ఉంటుంది. దాని ఆధారంగా హాస్యప్రేరణను అవగాహన చేసుకొని అది గిలిగింతలు పెట్టే అంశంగా చూడగలగాలి. హాస్యం సక్రమంగా పని చేయాలంటే ఆ ఆనందాన్ని పంచుకోగల భావన అవసరం. మనం సాధారణంగా ఒకానొక వ్యక్తిని (సుబ్బారావు అనుకుందాం) చూసిగాక, అతనిలోని ఒకానొక హాస్యాస్పద అంశాన్ని చూసి నవ్వుతాము. అతను పెద్ద పిసినారి అనో, చీరాలలో చలికి తట్టుకోలేక హిమాలయాలకు వెళ్ళిన విచిత్ర ప్రవృతిగల వ్యక్తి అనో, డంబాచారి అనో నవ్వుకుంటాము. అలానే అతనిది కీచుగొంతు అనో, బాన పొట్ట అనో, అతని పేరును తిప్పివేసి 'వురాబ్బా సు' గానో - ఏదో ఒక లక్షణాన్ని తీసుకొని నవ్వుతాము కాని 'సుబ్బారావు' గా నవ్వము కదా! కొన్ని సమయాలలో ఒకానొక సంస్థ చేసే పనులను చూసి నవ్వుకుంటాం. “అది ఆలోచనలే” అని ఆనం దిస్తాం. ఈ విధంగా వ్యక్తులను, వ్యవస్థలను దృష్టిలో ఉంచుకొని చేసే హాస్యం అంతా ఈ విభజన క్రిందకు వస్తుంది.

ఒకరు హాస్యోక్తిని ప్రయోగించడంతోనే సందర్భం మారినట్లే కదా! అయితే ప్రతి హాస్య సంఘటనలోను ఆ త్రిమూర్తులు - ప్రారంభకుడు, విషయం, ప్రశంసించేవాడు - విధిగా ఉండవలసిందేనా? ఈ కొత్త నేపథ్యంలో రెండు విభిన్న హాస్య ప్రక్రియలు ప్రారంభమయ్యాయి. 1.హాస్యాన్ని స్వీకరించే వాడు ఆ హాస్యోక్తిలోని హాస్యాన్ని గ్రహించగలిగాడు / గ్రహించలేకపోయాడు. 2.హాస్యాన్ని స్వీకరించేవాడు ఆ హాస్యోక్తి పై ఇష్టం చూపాడు / చూపలేదు. ఉదాహరణగా ఒక ఛలోక్తి చూద్దాం :

మణి ఎకడుంటె ఏం? ఆంధ్రదేశంలో శతావధానాలు జరుపుతూ సాహితీ చైతన్యాన్ని కలిగించిన ప్రముఖులు తిరుపతి వేంకట కవులు. వారిలో ఒకరు చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి. ఆయన ఎంత రసహృదయుడో, అంత కొంటె కోణంగి. ఆయన మండపేట వెళ్ళినప్పుడు ఓ అందాల భరిణ ఆయన సాన్నిధ్యంలో అద్భుతంగా నాట్యం చేసింది. ఆమె ఒక వేశ్యామణి. ఆమె పేరు మణి. శాస్త్రిగారు ఆమెను అభినందిస్తూ కొంటెగా “మణి మామూలుగా ఉండేకన్నా కడియంలో ఉంటే మరింత శోభ చేకూరుతుంది” అని శ్లేషతో పలికారు. ఆయనది కడియం. “నువ్వు అక్కడికి రా!” అని ఆయన ఉద్దేశ్యం. ఆమె ఎంత

---

చతురోక్తులు విసిరేవాడు పొరపాటు అంగీకరిస్తాడు. - ఇటలీ సామెత

సొగసరినో, అంత గడుసరి కూడా. “మహాకవులైన మీకు తెలియంది ఏముంది? స్వచ్ఛమైన మణి కడియంలో ఉంటే ఏమిటి? పేటలో ఉంటే ఏమిటి?” అన్నది ఆమె నవ్వుతూ.

ఇక్కడ 'పేట' అంటే మండపేట అని, బంగారు గొలుసు అని రెండు అర్థాలు స్ఫురించేటట్లు శ్లేషగా మాట్లాడింది. అంతేకాదు. నేను వృత్తిరీత్యా వేశ్యను కాను, నీ వశము కాను అని తెలపడానికే 'స్వచ్ఛమైన మణి' అని ప్రయోగించింది.

ఈ హాస్యోక్తిలో 1.శాస్త్రిగారి శ్లేషలోని మర్మాన్ని మణి ఇట్టే గ్రహించింది. ఇది పాఠకుణ్ణి నవ్విస్తుంది. 2.ఆ శ్లేషకు అంతకంటే అందమైన మరొక శ్లేషతో ఆమె గడుసరిగా సమాధానం ఇవ్వడమేగాక, ఆయన వ్యూహం పారదని హెచ్చరిక చేసింది. దాంతో పాఠకుడు మరొక పర్యాయం ఆనందపరవశుడవుతాడు. హాస్యచక్రం పూర్తి కావాలంటే ఇవన్నీ అర్థమవ్వాలిగా! ఈ హాస్యోక్తిలో శాస్త్రిగారి శ్లేషతో ఉల్లాసం ప్రవేశించి సందర్భాన్ని మార్చింది. అయితే, మణి శ్లేషలోని అర్థాన్ని ఆనందిస్తున్నట్లుగా చిరునవ్వులు చిందిస్తూనే, ఘాటైన రీతిలో చురుక్కుమనిపించేలా దానికి సమాధానం చెప్పింది. మరి ఇంతకూ శాస్త్రి మాటలు ఆమెకు వేదన కలిగించడంతో భావావేశంతో ప్రత్యుత్తరం ఇచ్చిందా? లేక తన జ్ఞానాన్ని భావావేశంతో జోడించి సమాధానం చెప్పిందా? లేక ఆ రెండింటిని కలిపి తన ప్రావీణ్యాన్ని చూపిందా? అన్నది నవ్వుల శాస్త్రంలో దిట్టలు నిర్ణయించాలి.

అయితే, హాస్యం యొక్క క్రమంగా బలపడే హాస్య పరంపర లక్షణాలను గుర్తించనిదే ఈ రెండవ హాస్య సంఘటన ఫలితాలు అవగాహన కావు. రాబర్ట్ లట్టా (ప్రక్రియ సిద్ధాంతం (1998), రాబర్ట్ ప్రొవైన్లు తమ శాస్త్రీయ కృషి ఫలితంగా హాస్య ప్రక్రియలో నవ్వు మరింత ప్రధాన భూమిక వహిస్తుందని నిర్ధారించారు. సిగ్మన్ ఫ్రాయిడ్, స్వెన్ స్వెబాక్, క్రైగ్ లన్‌డన్‌బర్గ్ వంటి ప్రముఖ రచయితలు "హాస్యోక్తి బహు సభ్యుల నమూనా వంటిది” అన్నారు. అయితే రచయితలు డ్వైర్, టెడ్ కాప్లో రూపొందించిన త్రికం సిద్ధాంతాన్ని (హాస్యోక్తిలో ముగ్గురు భాగస్వాములు ఉంటారని) అన్వయించాడు. ఆయన ప్రకారం ఇక్కడ ఒక ప్రారంభకుడు, ప్రేక్షకుడు కలసి లక్ష్యానికి వ్యతిరేకంగా ఒక సమాఖ్యను ఏర్పరుస్తారు. అయితే, ఈ సమాఖ్యలో ఎవరికి వ్యతిరేకంగా ఎవరు చేరతారో ఊహించడానికి హాస్య బంధువుల అధికార పరిమితులను కూడా నిర్దేశించడం విశేషం.

దీని ఆధారంగా ఇప్పుడు హాస్య రూపాన్ని మరొక రకంగా చిత్రించవచ్చు. హాస్యంలో ముఖ్యంగా మూడు అంశాలు ఉంటాయి. 1. నవ్వదగిన, అర్థరహితమైన ఒక వ్యక్తి లేదా ఒక

---

తత్వశాస్త్రంలో ఒక సమస్య హాస్యం. – జార్జి మైక్స్

విషయం. 2.హాస్యోక్తిని చెప్పేవాడు, హాస్య సన్నివేశాన్ని వివరించేవాడు. 3.అది హాస్యభరితమైనదని అంగీకరించేవాడు (ప్రశంసకుడు). ఈ రూపాన్ని ఇలా వివరించవచ్చు.

**4) ప్రారంభకుడు — విషయం ప్రశంసించేవాడు :** దీని ప్రకారం 1) ముగ్గురు వ్యక్తులు లేనిదే హాస్యం జనించదు. 2) ఇది వ్యక్తి కేంద్రంగా ఉన్న హాస్యోక్తికి, హాస్యోక్తిని సంధించిన వస్తువుకు, పరిహసించబడే వ్యక్తికి మాత్రమే వర్తిస్తుందని భావిస్తుంది.

నిజానికి కొందరు వ్యక్తులు తమ పైన తామే హాస్యోక్తులు విసురుకోవచ్చు. స్నేహితులు విసిరే చతురోక్తులను, వేధింపులను కొందరు నింపాదిగా స్వీకరించవచ్చు. అంటే ఇక్కడ పరిహాసపాత్రుడే ప్రశంసకుడుగా మారతాడన్నమాట! కొందరు ప్రబుద్ధులు ఇతరుల పై హాస్యోక్తులు విసిరి, ఇంటికి వెళ్ళి నింపాదిగా వాటిని పునశ్చరణ చేసుకుంటూ ఆనందిస్తారు. **“మల్లె చెట్టుపై మూత్రం విసర్జిస్తున్నావేమయ్యా?" అని అడిగితే, “అయ్యో! ఇది మల్లెచెట్టా? పొరపాటున తులసిచెట్టు అనుకున్నాలే”** అన్న ఓ ప్రబుద్ధుడు ఊరగాయ పెట్టడానికిజాడీలను తాకట్టు పెట్టాడట! 'ఆమరణ నిరాహారదీక్షనా? ఆఫ్టరాల్... దాందే ముంది? అలాంటి దీక్షలు నేను అవలీలగా అరవై పైనే చేశా' అన్నాడు మరో ధీరో దాత్తుడు. ఇలాంటి హాస్యోక్తులను గుర్తుచేసుకుంటూ మా పీకేరావు (పసుపులేటి కామేశ్వరరావులెండి) ఒంటరిగా కూర్చొని పడిపడి నవ్వుతుంటాడు. పైన పేర్కొన్న ఉదంతా లలో ఇద్దరు లేదా ఒక్కడు పైన పేర్కొన్నట్లుగా మూడు పాత్రలూ పోషించ వచ్చన్నమాట! మరొక విషయం. పరిహాసపాత్రుడు (లక్ష్యం) ఒక వ్యక్తి కాకపోవచ్చు. ఇతరులలోని బలహీనతలను చూస్తూ మనం నవ్వుకోవచ్చు. ఆ లక్ష్యం భావాలు కావచ్చు, సంస్థలు కావచ్చు లేదా కొన్ని వస్తువులు కూడా కావచ్చు. దీనినిబట్టి హాస్యమాడటానికి ముగ్గురు వ్యక్తులు ఉండాలని కాని, అదొక సామాజిక సంఘటన అని కాని చెప్పలేమేమో!

అయినా మొత్తంమీద ఈ వివరణ సంతృప్తికరంగానే కన్పిస్తుంది. సామాజిక సంఘటనలకు, ప్రైవేటు హాస్యోక్తికి కూడా అది వర్తించడం విశేషం. బాగుంది. మొత్తం మీద హాస్యాన్ని ఆనందించడానికి ఏదో ఒక సంఘటన / వస్తువు / ఆనందించేవాడు అవసరం.

అయితే, హాస్య లక్షణాలన్నీ ఈ వివరణలో వస్తాయా అన్నది ముఖ్యమైన ప్రశ్న. కొన్ని సందర్భాలలో ప్రారంభకుడు లేకుండానే మనం నవ్వవచ్చు. శారీరక రుగ్మతల కారణంగా కొందరు, అకారణంగా కొందరు నవ్వవచ్చు. ఇక్కడ మరొక చిక్కు కూడా ఉంది. ఎవరైతే హాస్యాన్ని ప్రారంభిస్తున్నట్లు కన్పిస్తారో, వారు అసలైన హాస్యకారులు కాకపోవచ్చు. వారి వెనుక ఉన్న సిబ్బంది సంభాషణలు, చిత్రాలు, వాక్యాల రూపంలో వాటిని

---

తనను ఎక్కడ బాధిస్తుందో కామెడీ బోధిస్తుంది. – జార్జి మైక్స్

వ్యక్తపరుస్తుండవచ్చు కదా! కేతిగాడు (తోలుబొమ్మలాటలో) లేదా హాస్యనటుడు తన హాస్య సంభాషణలతో, చతురోక్తులతో ప్రేక్షకులను కడుపుబ్బా నవ్విస్తాడు. వాటిని విన్న ప్రేక్షకులు ఆనందంతో చప్పట్లు కొట్టినప్పుడు ఆ ఆనంద ప్రకటన బఫూన్‌కు చెందాలా? అతనికి సంభాషణలు వ్రాసి పెట్టిన రచయితకు చెందాలా? లేక నటించడం నేర్పిన దర్శకునికి చెందాలా? అంటారు కొందరు. అలానే, రచయిత ఎంత గొప్పవాడైనా తన నటనతో, హావభావాలతో ఆయన వాక్యాలకు జీవంపోసే నటుడు అవసరమే కదా! ఒకవేళ ఆ నాటక రచయిత తెర పైకి వచ్చి అదే పాత్రను పోషిస్తే హాస్యనటునిలా ప్రేక్షకులను మెప్పించగలడా? అతిగా ఆలోచించే కొద్దీ మన బాధ్యతలు అనుమానాలుగా మారతాయని ప్రముఖ రచయిత ఎడ్మండ్ బర్క్ పేర్కొన్నది ఇందుకేనేమో! అందుకే ఈ విమర్శలను ఇక్కడ క్షేమంగా వదిలేద్దాం.

భిన్న భావాల సమాహారం నవ్వు. దానిలో అహంకారం, అతిశయం, మమకారం, భేషజం, అలక్ష్యం, తెగువ, టెంపరితనం మొదలైన పెక్కు భావాలు కన్పిస్తాయి. నవ్వు పై వందలాది నిర్వచనాలు ఉన్నప్పటికీ, ఏ ఒక్కటీ అందరి ఆమోదం పొందలేకపోయింది. ఈ సంక్లిష్టతను వివరించడానికి ఏ సిద్ధాంతాలు ప్రతిపాదించబడ్డాయో తరువాయి అధ్యాయంలో తెలుసుకుందాం.

---

హాస్య భావనను అభ్యాసం ద్వారా సాధించాలి. – ఎర్‌స్కెన్

అధ్యాయం 5

# హాస్య సిద్ధాంతాలు

**"అందరికీ ఆమోదయోగ్యమైన హాస్య సిద్ధాంతం ఇప్పటికీ లేదనడం హాస్యోక్తి కాదు." - మారెల్**

**సైకిల్ కొనడానికి కూడా** ఇష్టపడని పీనాసి శశి అంత ఖరీదైన బైక్ ఎలా కొన్నాడా అని అతని మిత్రబృందం ఆశ్చర్యపడింది. ఆ తరువాత బైక్ వెనుకవున్న కథను విన్న ఆ మిత్రులు మరింత అచ్చెరువొందారు. అందమైన ఓ యువతి బైక్ మీద వస్తూ స్లిప్లయి అటువైపే నడుస్తూ వస్తున్న శశిమీద పడిందట! దాంతో బెదిరిపోయిన ఆమె వెంటనే బైక్‌ను అలాపడేసి, దుస్తులనువిప్పి అతనితో ఏం కావాలో అవితీసుకో' అందట.

''......... అంటే ఆమె దుస్తులు నీకు సరిపోయి ఉండవు. అందుకే బైక్ ఒక్కదానినే తెచ్చుకొని ఉంటావు" అని మిత్రులు విసిరిన వ్యంగ్య బాణాలు అర్థం కాక "అవున్రా" అన్నాడు శశి అమాయకంగా!

**తనకా** ఏ డిగ్రీకాని, ఉద్యోగం కాని లేదు. గేటు వద్ద ఒక అందాల నేమ్ ప్లేట్ పెట్టించమని వేధించే భార్య పార్వతి పోరుపడలేక భర్త మదన్ తీవ్రంగా యోచించాడు. "ఎన్.మదన్ HOP" అని మర్నాడే బోర్డు తగిలించాడు. తన భర్త హోదా ఏమిటో ఇరుగుపొరుగు అమ్మలక్కలకు అర్థం కాక మదనపడటం పార్వతికి మహదానందం కలిగించింది. ఎవ్వరికీ అర్థంకాని ఆ డిగ్రీ ఏమిటో తనకైనా చెప్పాల్సిందేనని ఒకరోజు మంకుపట్టు పట్టిన భార్యతో మదన్ "పిచ్చిదానా! నీకేమో నేమ్ ప్లేట్ కావాలాయే. నాకేమో ఏ డిగ్రీ లేకపోయే. అందుకే నీ మొగుణ్ణి అని చెప్పుకుంటున్నా" అన్నాడు నవ్వుతూ. ఆశ్చర్యంగా మొహం పెట్టిన భార్యనైపు చూస్తూ " ఏంలేదే HOP అంటే.. హజ్బెండ్ ఆఫ్ పార్వతి. అంతే" అన్నాడు ఆ భార్యావిధేయుడు.

**"ఏమండీ!** స్వర్గంలో కూడా మనిద్దరం భార్యాభర్తలుగా ఉంటామా?" గోముగా అడిగింది శార్వాణి. "అక్కడ కూడా మనం భార్యాభర్తలుగా ఉంటే... అది స్వర్గం ఎలా అవుతుంది?" కొంటెగా అన్నాడు భర్త.

నవ్వు అందరకూ ప్రీతిపాత్రమే! మనిషి ఎందుకు నవ్వుతాడో వివరించడానికి దాదాపు వంద సిద్ధాంతాలు వ్యాప్తిలో ఉన్నాయంటే, నవ్వు స్వరూపం మనకు స్పష్టంగా తెలియదన్నమాట! అంతటితో ఆగితే నవ్వు కథలో నవ్వులాట ఏముంటుంది! హాస్య

---

హాస్యం ముసుగులో మనుషులందరూ శత్రువులే. – లెగ్ మాన్

సిద్ధాంతాలపై ప్రత్యేక పరిశోధన గావించిన డి.హెచ్. మన్రో వాటిని మూడు వర్గాలుగా (అసంబద్ధ, ఆధిక్య, ఉపశమన సిద్ధాంతాలు) విభజించగా, అంతే ఖ్యాతి గడించిన పాట్రీషిమ కీత్ – స్పైగలోలు దానిని ఎనిమిది భాగాలుగా (జీవ, ఆధిక్య, అసంబద్ధ, ఆశ్చర్యకర, అస్పష్ట ఉపశమన, బాహ్యరూప, మనోవిశ్లేషణ సిద్ధాంతాలు) వర్గీకరించారు!

**1. ఆధిక్య సిద్ధాంతం :** మనిషి ఎందుకు నవ్వుతాడు? అన్న ప్రశ్నకు ఈ సిద్ధాంతం ఏం చెబుతుందో చూద్దాం. **నవ్వేవాడు అధికుడు, ఉన్నతుడు అని, నవ్వబడేవాడు అధముడు అన్నది ఈ సిద్ధాంత భావన.** కడుపారా నవ్వించే హాస్యోక్తికి ప్రధానంగా ఆధిక్యత, వ్యంగ్యం, పిడిగుద్దులాంటి వక్రోక్తులు ఉండాలని, అలానే తన ప్రత్యర్థిని చిత్తుచేసినవానిని చూసి మనం హాయిగా నవ్వుకుంటామని, హేళన చేయ బడేది ఓ వ్యక్తి కావచ్చు లేదా అది ఒక భావన, రాజకీయ సంస్థ లేదా గౌరవం, హోదా కలది ఏదైనా కావచ్చు (అలెగ్జాండర్ బెయిన్) అని ఇది వివరించింది.

ఈ సిద్ధాంతం రచయితలను ఎంతగా ఆకర్షించిందంటే ఆధిక్యతా భావన లేని హాస్యోక్తిని ఒక్కదానినైనా చూపగలరా అని సవాలు విసిరారు ఆచార్య చార్లెస్ గ్రూనర్. అందుకేనేమో ఇంగ్లండ్ లో అత్యంత ప్రజాదరణ పొందిన హాస్య పత్రికకు 'పంచ్' (పిడిగుద్దు, హాస్యకాడు) అని నామకరణం చేశారు.

పరిహాసమైనదానిని చూసి లేదా ద్వేషభావంతో నవ్వుతామని ప్లేటో భావించగా, వికారమైనదానిని చూసి, అసందర్భపు మాటలు విని గేలి చేయడానికి, ఇతరుల లోని అల్పత్వాన్ని చూసి, వాళకు కించపరచడానికి లేదా పొరుగువారి ప్రవర్తనను సరిదిద్దడానికి మనిషి నవ్వుతాడని రచయితలు పేర్కొన్నారు. నిజానికి ఈ రచయి తలకు నవ్వు అంటే అంత గౌరవభావం లేదేమో అనిపిస్తుంది. నవ్వే దేవుళ్ళు అంటే అధికారాన్ని కోల్పోయిన దైవాలు కనుక అలాంటి చిత్రాలను నిషేధిం చాలన్నంతవరకు వెళ్ళాడు ప్లేటో.

**సిద్ధాంత ప్రకటన :** "ఇతరులలోని బలహీనతలను చూసిగాని లేదా మనలోని బలహీనతలతో వాటిని పోల్చుకొనిగాని, మనలో కన్పించిన ఒకానొక ఆధిక్యతాభావం ఫలితంగాగాని ఉద్భవించిన ఆకస్మిక కీర్తికాంక్షయే 'నవ్వు' అనే ఆవేశం" అంటారు ఆధిక్య సిద్ధాంత ప్రవక్తగా హాబ్స్. నవ్వు బలహీనుల సాధనమేకాని, పరిపూర్ణుల లక్షణం కాదన్నది ఆయన సిద్ధాంతం.

హాబ్స్ ప్రకారం నవ్వు ముఖ్య లక్షణాలు మూడు: 1. హఠాత్తుగా, ఆశ్చర్యంగొలిపే రీతిలో జరిగిన కార్యం వలన హాస్యం జనిస్తుంది. ఈ సిద్ధాంతం అహానికి, కీర్తికి, ఆధిక్యతకు,

---

హాస్యం దృష్టిలో వ్యక్తిగతమైన అమాయకులు ఉండరు. – జీన్ పాల్ రిక్టర్

పోటీతత్వానికి ప్రాధాన్యమిస్తుంది. "మానవునిలోని రాక్షసత్యానికి విశ్వసనీయమైన సూచిక నవ్వు" అని బాడెలేర్ పేర్కొనడానికి ఇదే కారణం కావచ్చు.

2. అర్థరాహిత్యం నవ్వుకు కారణభూతమవుతుందని చెబుతూ,ఇది ఆధిక్యత మూలంగా జనిస్తుందంటారు.

3. ఈ సిద్ధాంతం వ్యక్తులలోని అర్థరాహిత్యానికేగాని, అరూప (abstract) అంశాలకు ప్రాధాన్యం ఇవ్వకపోవడం గమనార్హం.

**ఐరిష్** దేశస్తుడు ఒకడు ఓ బార్‌కు వెళ్ళి మూడు గ్లాసులలో మూడు బీర్లు ఆర్డర్ ఇచ్చాడు. నింపాదిగా తీసుకొని, బేరర్‌ను మరో మూడు గ్లాసుల బీరు తీసుకురమ్మన్నాడు.

**బేరర్** : "సర్......ఒకటి పూర్తి చేసిన తరువాత మరొకటి తెస్తానండి. లేకుంటే కూలింగ్ తగ్గుతుందండి" అన్నాడు నమ్రతగా.

**అతను**: అలాకాదు బేరర్.... మేము ముగ్గురు సోదరులం. ఒకరు అమెరికాలో, మరొకరు ఆస్ట్రేలియాలో ఉన్నారు. ప్రతి శనివారం సాయంత్రం మేం ముగ్గురం ఒకేసారి బీర్ సేవించాలని నిర్ణయించుకున్నాం. అందుకని మూడింటిని ఒకేసారి తెమ్మన్నా' అన్నాడు ఆయన.

బేరర్ కూడా ఇది అద్భుత సంప్రదాయం అని ఆనందించాడు. ఇలా ప్రతి శనివారం ఆయన రావడం, 3 బీర్లు సేవించి వెళ్ళడం రివాజు అయింది. కొంతకాలమైన తరువాత అతను ఒక శనివారంరోజున రెండు బీర్లే తెప్పించుకొని తాగుతుంటే, బేరర్కు విషయం అర్థమైంది.

**బేరర్** : "ఎంతో ఆప్యాయంగా ఉండే మీ సోదరులలో ఒకరు పోయారా సార్!" అంటూ విచారం వ్యక్తపరచాడు.

**అతను** : "అదేమీ లేదయ్యా! మా సోదరులందరూ క్షేమం. ఎటొచ్చీ ఈ వారం నుండి నేను డ్రింక్ మానదలచుకున్నా!" అన్నాడు ఆ కస్టమర్ నవ్వుతూ. అర్థరహిత హాస్యోక్తికి ఇదొక ఉదాహరణ.

ప్రమాదానికి గురైన ఒక ఓడను కస్టమ్స్ అధికారులు ధైర్యంతో ఎంతో కష్టపడి కాపాడారు. నావికులు ఒడ్డుకు చేరడంతోనే ఓ అధికారి "అవును! మీవద్ద నిషిద్ధ వస్తువులు ఏమైనా ఉన్నాయా?" అని ప్రశ్నించాడు! విషాదకర పరిస్థితులలో కూడా వృత్తిరీత్యా పాటించాల్సిన విధులను గుడ్డిగా పాటించే వ్యక్తిని చూడటంతో పగలబడి నవ్వుతాము. ఇక్కడ

---

హాస్య దృష్టిలేని మనసు సువ్యవస్థాపితమైనది కాదు. – సెయింట్ కోలరిడ్జ్

మనం ఆ అధికారులలోని అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని చూస్తూ మన విజ్ఞతను,ఆధిక్యతను తలచుకుంటూనే కదా నవ్వుతాము!

**సిద్ధాంత పరిధులు - లోపాలు**: అయితే, 'హాస్య ఆధిక్య సిద్ధాంతాన్ని' ముగించేముందు కొన్ని విషయాలను మనం గుర్తుంచుకోవాలి. మనం ద్వేషించేవారిలోని అనాకారితనం, అజ్ఞానం, బలహీనతలను చూసి గేలిచేస్తామేకాని, మనం ప్రేమించేవారి లోని బలహీనతలను గేలి చేయలేము. అంటే, ప్రతివ్యక్తి తన ప్రత్యర్థులకు, అపరిచితులకు జరిగే అవమానాలను చూసి ఆనందిస్తాడే కాని, ఆప్తుల విషయంలో అదే సూత్రం వర్తించదంటారు ఉల్స్ మొదలగు రచయితలు. అలానే, మహిళలపై పురుషులు విసిరే హాస్యోక్తులను పురుషులు ఆనందించినంతగా మహిళలు ఆనందించరు!

ప్రజలు కొన్ని వర్గాలుగా ఏర్పడి కొన్ని అనుబంధాలను పెంచుకున్నప్పుడు (నా కులం, నా మతం, నా భాష, నా ప్రాంతం మొదలైనవి) ఏర్పడిన ఏకతాభావం మూలంగాను, దాని ఫలితంగా పంచుకున్న ప్రేమానురాగాల కారణంగాను తనవారిని గేలి చేయడాన్ని తమను గేలి చేసినట్లుగానే భావిస్తూ బాధపడతారు. దీనినే తాదాత్మ్య వర్గం (Identification Class) అని పిలుస్తారు."

దీని సారాంశం ఇది : 1. గేలి చేయబడే వ్యక్తి పైన, వర్గం పైన మనకుగల వ్యతిరేక భావ తీవ్రత పై మన హాస్య స్పందన ఆధారపడుతుంది. 2. అలానే, గేలి చేయబడే వ్యక్తి పైన సానుకూల భావం ఎంత అధికంగా ఉంటుందో, అతనికి సంబంధించిన విషయాలలో హాస్య స్పందన అంత తక్కువగా ఉంటుంది.

ఈ వాదన కూడా పూర్తిగా దోషరహితం కాకపోవచ్చు. ఒకానొక గుర్తింపు వర్గం లోగల ఇద్దరు మిత్రులమధ్య ఏదైనా ఒక విషయంపై తీవ్ర భేదాభిప్రాయం ఏర్పడిందను కుందాం. అప్పుడు వారిలో ఒకరికి ఇబ్బందులు ఎదురైనప్పుడు అతనిపై ప్రయోగించిన హాస్యోక్తులను వింటూ రెండవ వ్యక్తి ఆనందిస్తాడు కదా!

ఫ్రాయిడ్ చెప్పినట్లుగా ఒక మంచి హాస్యోక్తి మనిషికి చక్కని ఆనందాన్నిస్తుంది. ఆ హాస్యోక్తిలోని ఆలోచన, విషయం, హాస్యోక్తి లక్షణాలలో ఏది మనకు ఆనందాన్నిస్తుందో, మనము ఎందుకు నవ్వుతున్నామో ఆలోచించకుండానే కొన్ని సమయాల్లో మనం నవ్వుతాము. న్యాయనిర్ణయం చేయడంలోగల ఈ అనిశ్చిత స్థితియే హాస్యోక్తికి మూలంగా తోడ్పడుతుంది. నిజజీవితంలో తటస్థపడే సంఘటనలలో ప్రతి అంశంలోను హాస్యకర్త

---

కన్నీటి ప్రియురాలు హాస్యం. – థాకరే

మనసులోకి దూరి ఇది ఆధిక్య భావంతోనో, ఘర్షణ భావంతోనో ఉద్భవిం చిందా అని చెప్పడం కష్టం.

అబ్రహం మాస్లో వంటి రచయితలు ఈ సిద్ధాంతం మానసిక వామనులకు వర్తిస్తుందని, ఉన్నతులకు, సంస్కారులకు చక్కని హాస్యభావన ఉంటుందని వాదించినప్ప టికీ, హాస్యనిర్మాణంలో ఆధిక్యభావం కీలకపాత్ర వహిస్తుందన్నది అతిశయోక్తి కాబోదు.

**2. అప్రస్తుత, నిరుత్సాహ నిరీక్షణ సిద్ధాంతం :** చాలాకాలం నుండి బాగా వ్యాప్తిలో ఉన్న హాస్య సిద్ధాంతాలలో ఇది ఒకటి. మనకుగాని, ప్రకృతికిగాని వస్తువుల అనుపాత రాహిత్యం మూలంగా నవ్వు వస్తుందని సిద్ధాంతీకరించారు సర్ ఫిలిఫ్ సిడ్నీ, ఊహకు, యదార్థానికి మధ్య ఉన్న తీవ్రమైన అప్రస్తుతాన్ని, వ్యత్యాసాన్ని హఠాత్తుగా గుర్తించడమే నవ్వుకు ప్రధాన కారణం అంటారు ప్రముఖ రచయితలైన హెర్బర్ట్ స్పెన్సర్, థియోడర్ లిప్సలు. అతిముఖ్య విషయాల నుండి మన దృష్టిని అతిసామాన్య విషయాలవైపు మరల్చిన ఫలితంగా నవ్వు జనిస్తుంది అని చాటిచెప్పే ఈ సిద్ధాంత అవగాహనకు సాయపడే ఈ హాస్యోక్తులు చదవండి. -

ముగ్గురు జైలర్లు ఒక ఖైదీతో కలసి పేకాట ఆడుతున్నారు. అయితే, ఆ ఆటలో నిష్ణాతుడైన ఆ ఖైదీ జైలర్లను ఆటలో అలవోకగా మోసగించసాగాడు. రెండు మూడు రౌండ్లు ముగిసిన తరువాత జైలర్లకు విషయం అర్థమవడంతో అతనిని బాగా తన్ని, జైలునుండి బయటకు తోసివేశారు!

ఇందులో రెండు సాంప్రదాయ నియమాలు;1.దోషులను కారాగారంలో బంధించాలి. 2. మోసగాళ్ళను తన్ని తరిమివేయాలి - ఉన్నాయి. స్వతంత్రంగా చూసినప్పుడు దేనికది స్వయం స్థిరత్వంగల సూత్రమే. అయినప్పటికీ ఒకానొక సందర్భంలో ఆ రెండూ ఘర్షణ పడటంతో హాస్యం ఏర్పడింది. -

ఈ విధంగా ఆశ్చర్యాన్ని కలిగించే అప్రస్తుత విషయాలు, ఒక భావానికి, మరొక భావానికి మధ్యగల వ్యత్యాసం, అప్రస్తుతం నవ్వుకు కారణం ఔతాయి.

గొప్ప శిక్ష **:** అదొక ఇంజనీరింగ్ కళాశాల. ఫస్ట్ ఇయర్ చదువుతున్న మాధవి, మనోహర్ ప్రేమ వ్యవహారం ముదిరి పాకాన పడుతుందని గ్రహించిన ప్రిన్సిపాల్ వారిద్దరికీ బుద్ధివచ్చేలా పనిష్మెంట్ ఇవ్వదలచాడు. సాయంత్రం 6 గంటలనుండి ఉదయం 8 గంటలదాకా వారిద్దరూ లాబ్ గదిలోనుండి బయటకు రాకుండా తాళంవేసి, దేనికైనా మంచిదని ఆ తాళంచెవిని తనవద్దనే భద్రంగా అట్టి పెట్టుకున్నాడు.

---

1. విద్యను విసర్జించి ఇతర వ్యాపకాలలో పడుతున్న విద్యార్థినీ విద్యార్థులను శిక్షించాలి.

2. జీవితంలో పెద్ద తప్పు చేసినట్లు గుర్తించేలా చేయడానికి కొన్ని గంటల సేపు గదిలో బంధించడం మంచిదే. ఇవి గొప్ప ఆలోచనలే. అయితే, ఆ రెండు ఆలోచనలను కలిపి ఓ యువజంటను గదిలో బంధించడం - అందులోనూ రాత్రంతా - వారికి గొప్ప శిక్ష అవుతుందా లేక అదొక అద్భుత వరంగా మారుతుందా!

**3. అసంగత హాస్య సిద్ధాంతం :** సిగ్మండ్ ఫ్రాయిడ్, చార్లెస్ బెర్నార్డ్, జాన్ డ్యూయే ప్రభృతులు "సఫలీకృతమైన కృషికి సంకేతం చిరునవ్వు" అన్నారు. నిషేధించబడిన ఆలోచననుండి మానసిక శక్తికి స్వేచ్ఛ లభించినప్పుడు నవ్వు వస్తుంది అంటుంది ఈ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని ప్రప్రథమంగా ఫ్రెంచి తత్వవేత్త, శాస్త్రజ్ఞుడు బ్లెయిసే పాస్కల్ 1600వ సంవత్సరంలో ప్రతిపాదించారు. మనం ఊహించినదానికి, వాస్తవంగా చూసినదానికి మధ్య ఆశ్చర్యకరమైన వ్యత్యాసం ఉన్నప్పుడు హాస్యం జనిస్తుంది అంటారు ఆయన. స్కాట్లండ్ తత్వవేత్త ఫ్రాన్సిస్ హట్సెసన్, థామస్ హాబ్స్ ఈ సిద్ధాంతాన్ని వ్యతిరేకించాడు. మానవాకృతిలో ఉన్న జంతువులను చూసి మాత్రమే మనిషి నవ్వుతాడుగాని, అల్ప జీవులను చూసి నవ్వడు. మనం ఊహించిన దానికి భిన్నంగా మన కళ్ళ ఎదుటే హఠాత్తుగా జరిగిన సంఘటనలోని అసంబద్ధతను చూసి మనం నవ్వుతామేకాని, కాలుజారి పడుతున్న దురదృష్టవంతుణ్ణి చూస్తూ అతనికన్నా మనం చాలా అధికులమనో లేదా అతడు అధముడనో మనం నవ్వం అని వారు స్పష్టంచేశారు. జర్మనీ తత్వవేత్త ఇమ్మానుయేల్ కాంట్ మానవుని ఊహలు తారుమారైనప్పుడు అతనిలో ఒకానొక మేధోసంబంధమైన నిరాశ వ్యాప్తి చెంది, అది క్రమంగా ఆశ్చర్యంగా మారిన ఫలితంగా నవ్వు వస్తుందని సూత్రీకరించాడు.

**భర్త** : (అసహనంగా) చూడు! ఆ గోడగడియారం ఒక్క క్షణంలో నా తలమీద పడేది!

**భార్య**: ఆ పాడుగడియారం అన్నిట్లోనూ నెమ్మదేనండి! -

**భార్య** : పూర్వం ఆశ్రమాలలో పులులు - మేకలు, పాములు - ముంగిసలు కలిసి జీవించేవట. అదెలా సాధ్యమండి?

**భర్త** : ఎప్పుడో ఎందుకు? ఇప్పుడు మనం కలసి జీవించడంలా!

భార్యాభర్తలు వాస్తవాన్ని బహిరంగంగా చెప్పలేక ఆడుకునే దోబూచులాటలివి. భర్త బాధపడాలన్న కోరిక మొదటి హాస్యోక్తిలో, కుటుంబ జీవనం ఎంత భయంకరంగా

---

హాస్యం ఒక అసలుసిసలైన రహస్యం. – రాబర్ట్ లట్టా

సాగుతుందో రెండవదానిలో మనకు కన్పిస్తాయి. సామాజిక ఆంక్షలు సహజీవనానికి కారణభూతాలైనప్పటికీ, అణచుకున్న ఉద్రేకాలను హాస్యోక్తుల రూపంలో బహిర్గతంచేస్తూ ఆనందించే రూపాలివి..

ధనుంజయ్ గొప్ప సంపన్నుడు. అతని అంత్యక్రియలను ఘనంగా నిర్వహించదల చాడు అతని వారసుడు సంజయ్. వందలాదిమంది అభిమానులచే సంతాపం ప్రకటింప జేయదలచి, వారు మరింత దుఃఖంతో కన్పించేటట్లు చేయడానికి వారికి పెద్దమొత్తంలో పారితోషికం అందజేశాడు. విచిత్రమేమంటే పారితోషికం మొత్తాన్ని పెంచే కొద్దీ వారు మరింత సంతాపాన్ని కాక, మరింత ఆనందాన్ని ప్రకటించడంతో సంజయ్ అమితంగా బాధపడ్డాడు! ఇలాంటి అసంగతంలోని వక్రోకి సహజంగానే నవ్వు తెప్పిస్తుంది.

**4. అసంబద్ధ (Incongruity) హాస్య సిద్ధాంతం:**

**హాస్యోత్పత్తిలో అసంబద్ధత యొక్క విశ్లేషణ ప్రధాన భూమిక వహిస్తుందని కొందరు భావించగా, హాస్యోక్తిలోని ప్రత్యేక వివరణల యొక్క ఉపలక్షణాలు ముఖ్యమని, వాటిలో తమకు నచ్చినవాటిని ఎంపిక చేసుకొని శ్రోతలు నవ్వుకుంటారని** మరికొందరు చెబుతారు. ఇంతకూ అసంబద్ధత అంటే ఏమిటి? 'ఊహించనిది, సామరస్యంలేని కుతర్కంతో కూడిన, సముచితం కాని అసహజత్వమే అసంబద్ధత" అన్నారు కరేన్ డబ్ల్యు. గల్లోబ్. ఆచరణలో ఒకరికి అసహజంగా కన్పించినది మరొకరికి అలానే కన్పించక పోవచ్చు.

**ఫోన్ లో ఒక కంఠం** : మీ అత్త చచ్చిపోయింది. పూడ్చమంటారా? దహనం చెయ్యమంటారా?

**కోడలు** : దేనికైనా మంచిది. రెండూ చేయండి

**శాన్‌ఫ్రాన్సిస్కో** నివాసి ఒకడు తన తాతగారి సమాధిపై పుష్పగుచ్ఛం ఉంచుతుండగా, ఆ దగ్గరలోవున్న మరోసమాధిపై ఒక చైనా దేశస్తుడు బియ్యపు పాత్ర ఉంచడాన్ని చూసి నవ్వుకున్నాడు. “మీకు ఎందుకు నవ్వు వచ్చిందో తెలుసుకోవచ్చా? " అనుమా ' వంగా అడిగాడు చైనావాసి. "ఆ పాత్రలోని ఆహారాన్ని మరణించిన ఆ వ్యక్తి ఎలా స్వీకరిస్తాడని మీరనుకుంటున్నారు?” అన్న అమెరికన్ ప్రశ్నకు చైనీయుడు నిట్టూరుస్తూ “ఆ సమాధిలోని వ్యక్తి మీరు అందించిన పూలలోని సుగంధాన్ని ఎప్పుడు ఆస్వాదిస్తాడో, అప్పుడే మా తాత ఈ ఆహారాన్ని స్వీకరిస్తాడు!" ప్రశాంతంగా సమాధానం ఇచ్చాడు.

శంకర్‌ను పరీక్షించిన డాక్టర్ “నీ మెదడులో కణితి ఉందయ్యా' అనడంతోనే శంకర్ ఆనందంతో గెంతసాగాడు. అతని ప్రవర్తనతో విస్తుపోయిన వైద్యుడు “ఏమయ్యా! నేను

---

హాస్యం ఒక యదార్థ మర్మం, అద్భుతం, రహస్యం. – రాబర్ట్ లట్టా

చెప్పింది నీకు అర్థమైందా?' అని ప్రశ్నించగా, శంకర్ నవ్వుతూ 'డాక్టర్ గారూ! నాకు బాగా అర్థమైందండి. ఇప్పటిదాకా నేనొక మెదడులేని మొద్దునని, మూర్ఖుణ్ణని మా అమ్మానాన్నలు గోల పెడుతుంటారు. నా మెదడులో కణితి ఒకటి ఉంటే, నాకు మెదడు ఉన్నట్లేకదండి! అంటూ కొడుకు గెంతుతుంటే, అతని తల్లిదండ్రులకు నవ్వాలో,ఏడ్వాలో అర్థం కాలేదు.

ఆర్థర్ షోపెన్ హార్ తన హాస్య గ్రంథం (1907)లో "మాటలలో కాని, చేతలలోకాని మన ఊహలకు భిన్నంగా జరిగిన సంఘటనలు లేదా విరోధాభాసం మూలంగా హాస్యం జనిస్తుంద"న్నారు. అసంబద్ధత నిజానికి హాస్యోక్తికి కారణం కాదని, ఒకానొక ఉదంతంలోని సామాజిక అంతస్సూచనలు మనకు నవ్వు తెప్పిస్తాయని అన్నారు. ఈ విధంగా ఆధిక్య భావానికి, అసంబద్ధతకు మధ్యగల సన్నిహిత సంబంధాన్ని మిగిలిన సిద్ధాంతాలకన్నా ఇది మరింత స్పష్టంగా వివరించింది.

అత్తగారి ఉదంతంలో అత్త ఎలాంటి పరిస్థితులలోనూ తిరిగిరాకూడదన్న జాగ్రత్త కోడలు తీసుకుంది. అత్తల పై కోడళ్ళకుగల ఆగ్రహాన్ని తెలిపే గొప్ప ఉదంతం ఇది. ఇంక రెండవ ఉదంతం మరింత విచిత్రంగా కన్పిస్తుంది. "నీకు మెదడు లేదయ్యా" అని అందరూ ఎద్దేవా చేసే వ్యక్తిని సాక్షాత్తు వైద్యుడే "నీకు మెదడులో కణితి ఉంద"ని ధృవీకరించినప్పుడు తన జబ్బుకన్నా, అప్పటిదాకా అందరూ తనని దెప్పిపొడిచిన తీరు (సామాజిక అంతస్సూచన) రోగిని ఎక్కువగా బాధించిందని ఈ హాస్యోక్తి ద్వారా తెలుస్తుంది!

హాస్యం పై ప్రప్రథమంగా సుదీర్ఘరచన చేసిన ఘనత అరిస్టాటిల్‌కే దక్కుతుంది. ఆయన ప్రకారం మనిషి పలు కారణాల మూలంగా నవ్వుతాడు. మనం ఉపయోగించే శైలి లేదా శబ్దసంపద, భిన్న అర్థాలుగల శబ్దాల ప్రయోగం, పర్యాయపదాలు, వదరుబోతు మాటలు, అర్థంలేని పలుకులు, చిన్నపిల్లలను అనుకరించడం, అహంకారంతో మాట్లాడటం, శబ్ద క్రీడ, అల్పార్థ సూచకపదాల ప్రయోగం, వ్యాకరణ సూత్రాలను అధిగమిస్తూ మాట్లాడటం మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. అలానే వస్తువులు, వ్యక్తులు, వారి చర్యలు అబద్ధాలు చెప్పడం, అసాధ్యాలు పలకడం, ఆశ్చర్యోక్తి, నీచ పదాల ప్రయోగం, తర్కరహిత వాదన, మొదలైన కారణాలు ఆనందం కలిగిస్తాయి అంటూ మనిషి నవ్వడానికి కారణాలు తెలిపే ఒక పెద్ద జాబితాను ప్రథమంగా ఇచ్చాడు అరిస్టాటిల్. "సగటు మనుషులకన్నా అధములను, అధమాధములను అనుకరించడమే హాస్య నాటక లక్ష్యం. వికృతి జాతికి చెందినది పరిహాసాస్పదం అనడమే ఒక పొరపాటు. అదొక కురూపము, అదొక నింద, మేధావుల

---

తన వైరుధ్యాలపై సాధించిన విజయమే సుఖాంత రూపకం. – హెగెల్

ప్రేలాపన. అయితే, పరిహాసాస్పదం ఇతరులకు బాధ కలిగించకుండా, వినాశకారి కాకుండా ఉండాలి" అంటాడు అరిస్టాటిల్.

**5. అరిస్టాటిల్ హాస్య సిద్ధాంతం :** భీమ్ సింగ్ గొప్ప మల్లయోధుడు. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో ఎన్నో బహుమతులు పొందిన అతనిని ఒకనాడు ఎవరో ఒక అనామకుడు చితగ్గొట్టాడు. రక్తం కారుతూ ఇంటికి చేరిన భర్తను చూసి "మల్లయోధుడైన మిమ్మల్ని ఎవరు కొట్టారండీ? అయినా అలా కొడుతుంటే మీరెలా ఊరుకున్నారండి?" అంటూ ఆమె వలవల ఏడ్చింది. "నా ఫీజు లక్షరూపాయలని నీకు తెలుసుగా భారతి! ఏ పందెం లేకుండా అతనితో నేనెందుకు పోరాడాలి?" అన్నాడు ఆ వీర అమాయకుడు!

ఇతరులను నిందించేది హాస్యం కాబోదు. అలానే,ఎవ్వరికీ బాధకలిగించని వ్యంగ్యసూచన మాత్రమే హాస్యం అనిపించుకుంటుంది. ఈ వాక్యాలను భిన్న కోణాలనుండి విశ్లేషించవచ్చు. ఇతరులలోని లోపాలను చూసి మనిషి నవ్వుతాడు అని చెబితే, అది ఆధిక్య సిద్ధాంతం క్రిందకు వస్తుంది. హాస్యం ఉద్రిక్తతను సడలిస్తుంది అంటే, అది విముక్తి సిద్ధాంతం (Release Theory) క్రిందకు వస్తుంది.

**6. ప్రేరణ, ప్రతిక్రియ హాస్య సిద్ధాంతం:** ప్రేరణ ఉంటే ప్రతిక్రియ ఉంటుందని, ఉత్తేజం ఉంటే జవాబు వస్తుందన్న కార్యకారణ సంబంధంలాంటిది ఈ సిద్ధాంతం. ప్రవర్తనను నేర్చుకోవచ్చు లేదా ప్రేరణ, ప్రతిక్రియల ఆధారంగా దానిని అవగాహన చేసుకోవచ్చు అంటారు మేరి రోత్ బార్ట్, స్టేన్లీ షాక్టర్ మొదలగు సిద్ధాంతకర్తలు.

కొన్ని భావోద్రేకాలు మనకు జన్మతః సంక్రమించగా, మరికొన్నింటిని మనం నేర్చుకుంటాము. ఉదాహరణకు, ప్రేమ మనం నేర్చుకునేదే. అంటే జన్మతః సంక్రమించని కొన్నింటిని మనం నేర్చుకొని అభివృద్ధిపరచుకుంటూ మన ప్రవర్తనను మనకు నచ్చిన రీతిలో తీర్చిదిద్దుకోవచ్చు అంటుంది ఈ సిద్ధాంతం. యదార్థాన్ని, సత్యాన్ని ఆ విధంగా చూడటం నిజానికి మనం నేర్చుకున్నదేకదా! ఈ విధంగా ఇది విధివాదం లేదా కర్మ సిద్ధాంతానికి వ్యతిరేకం.

డాక్టర్ : (పేషెంట్ తో) ఏమిటి నీ బాధ?

వెంకటయ్య: బాధ నాకు కాదండి... ఆ బల్లమీద కూర్చున్న నా భార్యకండి.

డాక్టర్ : ఆమె బాధ ఏమిటి?

---

మనోవిజ్ఞాన క్షేత్రంలో ఏర్పడిన ఆనందదానుభూతి హాస్యం. – మొరియల్

వెంకటయ్య : వారం రోజులనుండి రోజూ రెండు చేతులూ పక్కకి ఎత్తడమూ, కొక్కొరకో అంటూ ఇంటిచుట్టూ పరిగెత్తడమూ..... అదేమిటని అడిగితే తాను కోడి పెట్టనని అనడమూ మొదలు పెట్టిందండి.

డాక్టర్ : అయితే, ఈ వారం రోజులనుండి ఎందుకు ఊరుకున్నావ్?

వెంకటయ్య : ఏంలేదండీ! గుడ్డు పెడుతుందేమోనని ఆశగా ఎదురుచూస్తూ ఆగా......

డాక్టర్: అరవై సంవత్సరాలు దాటాయంటున్నారు. ఆ కాస్త కాలునొప్పికే అంత కంగారు పడతారెందుకు? ముసలితనం వచ్చాక ఏ నొప్పీ రాకుండా ఉంటుందా!

పంతులు: డాక్టర్ గారూ! కుడికాలికి అరవై ఏళ్ళొచ్చాయి, నొప్పి వచ్చింది. ఎడమకాలికీ అన్నేళ్ళే వచ్చాయికదా! మరి దానికే నొప్పి రాలేదేం?

విమర్శ:

1. కార్యకారణాలే అన్నింటికీ మూలం అని చెప్పడమే ఒక గొప్ప అస్పష్టతగా కన్పిస్తుంది. ఇదంతా మన ఆలోచనాసరళిపై ఆధారపడి ఉంటుందేకాని, నిజానికి ప్రకృతిలో అలాంటి సూత్రం ఏదీ కన్పించదు.

2. ప్రవర్తనావాదులు భాష, సమీక్ష మొదలైనవాటికి తమ సిద్ధాంతంలో అంతగా ప్రాధాన్యం ఇవ్వరు. డబ్బు కొరకు మనిషి ఎంతైనా కష్టించి పనిచేస్తాడన్నది ఎంత సత్యమో, అన్ని పనులు డబ్బుతోనే జరుగవు అన్నది కూడా అంతే సత్యం. దానిని గురించిన మన మదింపు ముఖ్యమైనదే అయినప్పటికీ, కొన్ని సమయాలలో మన మదింపులే ప్రేరణగా పనిచేయవచ్చు. ఉదాహరణకు, హాస్యాన్ని మనం సృష్టించవచ్చు, అభివృద్ధిపరచవచ్చు. అలానే, గంభీరంగా ఉండే ప్రజలకు, పరిస్థితులకు హాస్యంతో మనం చక్కగా స్పందించవచ్చు. ఈ విధంగా కేవలం పరిసరాలకు ప్రతిస్పందించడమేకాక, మదింపులను మన ప్రవర్తనకు మార్గదర్శకంగా ఉంచుకోవచ్చు.

శాస్త్రీయ పద్ధతి అధ్యయనంలో పరిశీలన, ప్రవర్తనలకన్నా భాషతో ప్రారంభించాలన్న సత్యాన్ని వారు విస్మరించారు. నిజానికి భాష కూడా ఒక విధమైన ప్రవర్తనయే. అంటే భాషాసంబంధమైన మదింపులతోనే మానవ ప్రవర్తనను అవగాహనచేసుకోగలము, ప్రేరణగురించి యోచించేటప్పుడు ఒకే అంశం సరిపోదు. భల్లూకంలా వాటేసుకోవడం, ప్రేమతో కౌగిలించుకోవడం- ఈ రెండూ భౌతికంగా ఏకరీతిలో కన్పించినా, భావనలో వాటిమధ్య ఎంత వ్యత్యాసం ఉంటుంది!

---

బాధలేని వైరుధ్యమే హాస్యం. – కియర్కే గార్డ్

**నేను** ఇంటర్ చదివే రోజుల్లో ఓ లెక్చరర్ ఉన్నాడు. పాండిత్యంలో ఆయన ఎంత గొప్పవాడో, ప్రవర్తనరీత్యా అంత విచిత్రంగా కన్పిస్తాడు. ఒకరోజున ఆయన సైకిల్ నడిపించుకుంటూ హడావుడిగా పోతుండగా "నమస్కారం సార్!" అన్నాను. "త్వరగా పోవాలయ్యా! ఆ.....నమస్తే" అంటూ సైకిల్ ను వేగంగా నడిపిస్తూ దానితోపాటు పరుగె త్తడం చూసి నాకు ఆశ్చర్యం వేసింది. "సార్ సైకిల్ ఎక్కి పోవచ్చుగదా!" అన్నా. "చూశావా! నాకు ఆ ఆలోచనే రాలేదయ్యా. థ్యాంక్స్, థ్యాంక్స్" అంటూ రయ్ మని సైకిల్ పై దూసుకుపోయాడు!

ఈ విధంగా ఒకానొక సంఘటన భౌతిక ప్రేరేపణకు దారితీస్తుంది అనడంకన్నా సంఘటనను చూసే పద్ధతి, దానిని మదింపు చేసుకునే విధానం పై ప్రేరేపణ ఆధారపడు తుంది అన్నది యదార్థం. దీనికి అంతర్బుద్ధి కారణం కాదు.

7. రెండు అసంబద్ధ లేదా వైరుధ్య భావాల మధ్య ఘర్షణ మూలంగా హాస్యం జనిస్తుంది. ఒకే లక్ష్యంలో, ఒకే కాలంలో, ఒకే వ్యక్తిలో ఉన్నతుడు, సామాన్యుడు, ప్రేమ - ద్వేషం, ఆనందం - దుఃఖం వంటి విరుద్ధ భావాలు నెలకొని ఉండటం దీనికి మూలం అంటారు మీనన్, గ్రెగ్, ఫ్రాయిడ్, కోస్లర్ మొదలైన సిద్ధాంతకర్తలు. దీనిని ఆవేశ ఆధారిత సిద్ధాంతం, భావోద్రేక అర్థరహిత సిద్ధాంతం అని కూడా పిలుస్తారు. ఈ సిద్ధాంతం కాంట్ ప్రతిపాదించిన 'తాత్విక నిరర్థకత దగ్గరగా ఉంటుంది.

అత్తగారింట్లో సుష్టుగా భోంచేసి పండువెన్నెలలో పడుకొని ఆకాశాన్ని అలానే పరిశీలిస్తున్న అల్లుణ్ణి చూసిన మామగారికి ఆనందం ఆగలేదు. "అల్లుడుగారూ! చాలా సేపటి నుండి అలా దీక్షతో ఆకాశంవైపు చూస్తున్నారు.... దేనిని గురించి ఆలోచిస్తున్నారు?" అని ఆసక్తిగా ప్రశ్నించాడు. "ఏమీలేదు మామగారూ! రాత్రి మా ఊర్లో కన్పించిన చంద్రుడు ఇంతదూరంలో ఉన్న మీ ఊరికి అప్పుడే ఎలా వచ్చాడా అని ఆలోచిస్తున్నా. అంతే" అన్నాడు ఆ అల్లుడు! తన అల్లుడు ఓ అరుదైన వ్యక్తి అని మురిసిపోయే మామకు అతను ఒక బండరాయి అని స్పష్టమవడంతో ఎంత బాధకలుగుతుందో, పాఠకులకు అంత నవ్వు తెప్పిస్తుంది!

1. భావోద్రేకం అంటే ఏమిటో వివరించకుండా, భావోద్రేక హాస్య సిద్ధాంతాన్ని వివరించబూనడం వింతగా కన్పిస్తుంది.

2. ప్రేమను ద్వేషంగా, మంచిని చెడుగా చిత్రీకరించినప్పుడు నవ్వు రావచ్చు అన్నది నిజమే కాని, కొందరు తమకున్న అభిమానాన్ని దాచాలన్న ఆలోచనతో అయిష్టంగా ఉన్నట్లు

---

బాహ్యంగా పోలికలేని వస్తువుల మధ్య సంబంధమే హాస్యం.- జీన్ పాల్ రిక్టర్

నటిస్తే, మరికొందరు తమ ద్వేషాన్ని లోలోన దాచుకుంటూ కృత్రిమ నవ్వులను ఒలకబోస్తూ మాట్లాడవచ్చు. మరి ఇలాంటి నటనను ఎలా వర్ణించగలము?

కోస్లర్ మరొక అడుగు ముందుకువేసి "భావోద్రేకాలు ఉప్పొంగినప్పుడు భావాలు త్వరితగతిన మారడంతో హాస్యం జనిస్తుంది" అంటారు.

రష్యా, క్యూబా, అమెరికా వ్యాపారవేత్తలు, ఒక అమెరికా న్యాయవాది ఐరోపాలో బస్సులో ప్రయాణం చేస్తున్నారు. రష్యా వాణిజ్యవేత్త ఒక పెద్ద ఓడ్కా సీసా తీసి, తలాకాస్త ఇచ్చి మిగిలిన సీసాను పారవేయడంతో "అదేంటి! అందులో ఇంకా చాలా ఓడ్కా ఉందిగదా?" అన్నారు మిగిలినవారు. "మా దేశంలో అది అతి తక్కువ రేటుకు దొరుకుతుందిలేండి" అన్నాడు ఆయన నవ్వుతూ. ఆ తరువాత క్యూబా దేశస్తుడు చుట్టలకట్ట తీసి, తలా ఒకటి ఇచ్చి మిగిలినవి కిటికీలోనుండి పారవేస్తూ "ఇవి మా దేశంలో కారుచవగ్గా లభిస్తాయిలేండి" అంటుండగా, కూర్చున్న న్యాయవాదిని బలవంతంగా ఎత్తి కిటికీలో నుండి క్రిందకు తోసివేశాడు నింపాదిగా!

ఈ విధంగా "తార్కిక మూల ఉద్దేశ్యాన్ని విస్మరించిన ఆలోచనారహిత ఆవేశమే నవ్వు అవుతుంది" అంటారు కాస్లర్. అంటే హేతుబద్దతను కోల్పోయిన ఉద్రిక్తత నవ్వు రూపంలో బహిర్గతమవుతుందన్నమాట.

1. అయితే, భావోద్రేకం, విజ్ఞానం సాహచర్యం చేయలేవు అనడం అయోమయంగా కన్పిస్తుంది. 2.అలానే ఈ సిద్ధాంతంలో 'ఆలోచన', 'ఆవేశం' అన్న పదాలను గురించి సరియైన అవగాహన కన్పించదు.

**8. సమగ్రాకృతి సిద్ధాంతం :** ఒకానొక సంఘటన జరిగినప్పుడు హఠాత్తుగా ఆలోచనలు రావడంతో అయోమయ స్థితి నుండి అవగాహనా దశకు చేరుతాము అంటారు దీని సిద్ధాంతకర్తలైన మాయర్, పి.షిల్లర్లు. ఉదాహరణకు, క్రాస్ వర్డ్ పజిల్‌ను చూసినప్పుడు మొదట అయోమయంగా ఉంటుంది. నెమ్మదిగా సమాధానాలు రావడం తో మనకు ఆనందం వేస్తుంది. క్రమంగా దానిని పూర్తిచేసి ఎంతో తృప్తి చెందుతాము.

హాస్యాన్ని ఆనందించడానికి భావాత్మకంగా మనం దానికి కొద్ది దూరంలో ఉండాలి. అలానే, హాస్యోక్తి అవగాహనకు కూడా ఆ అంశంలోని విరుపు అర్థమవ్వాలి. అంటే సమిష్టిగా ఏర్పరచిన దానినుండి ఒక్కొక్క ప్రత్యేక భాగం ప్రతి ఒక్క ఇతర భాగంలోనూ మార్పు కలుగజేస్తుంది. హాస్యోక్తిలోని విరుపు అర్థమైనప్పుడే హాస్యోక్తి మొత్తం మనకు అర్థమవుతుంది. అందుకే దీనిని సమగ్రాకృతి హాస్య సిద్ధాంతం అన్నారు.

---

వైరుధ్యం హాస్యస్ఫోరకం. – కియర్కే గార్డ్

తిరుపతి వేంకట కవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రికి కథాచక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి అంటే అస్సలు గిట్టదు. సుబ్రహ్మణ్య శాస్త్రి 'శ్మశాన వాటిక' అని ఓ నవల వ్రాశారని తెలుసుకున్న వేంకట శాస్త్రికి ఒక కొంటె ఆలోచన తట్టింది. “శాస్త్రిగారూ! మీ 'శ్మశాన వాటిక ' చూశాను " అని ఒక మిత్రుడి ద్వారా అందజేసిన కబురు అతనిని బాధ పెట్టింది. బాధపడుతూ ఊరుకుంటే ఆయన సుబ్రహ్మణ్య శాస్త్రి ఎలా అవుతాడు? చెళ్ళపిళ్ళవారిది కడియం. ఆ గ్రామానికి వెళ్ళే ఒక మిత్రుని ద్వారా “ఆ శ్మశానం నిర్మించింది నేనే. అయితే, దాని ఎడల ప్రత్యేక శ్రద్ధాసక్తులుగల మీబోటివారు దాన్ని స్వేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు!” అని కబురు పంపాడు!

**9. వృత్తాకార హాస్య సిద్ధాంతం :** ప్రజలకు చేరువయ్యే పథకంలో భాగంగా కొత్తగా ప్రవేశపెట్టిన టోల్ గేట్ దాటిన ప్రతి నూరవ ప్రయాణీకుడికి వెయ్యి నూటపద హార్లు బహుమతిగా ఇద్దామని నిర్ణయించింది పోలీసుశాఖ. ఇంతలో ఒక మారుతీకారు వచ్చింది. ఆ కారుని ఆపిన పోలీస్ డ్రైవింగ్ సీటులోవున్న మధుకు పుష్పగుచ్ఛం, వెయ్యి నూటపదహార్ల చెక్కు ఇచ్చి శుభాకాంక్షలు చెబుతూ “అనుకోకుండా వచ్చిన ఈ డబ్బుతో మీరేం చేయబోతున్నారు?” అని అడిగాడు. అందుకతను “డ్రైవింగ్ లైసెన్స్ కొంటా” అన్నాడు హుషారుగా! ఉలిక్కి పడిన పోలీసును చూసిన మధు భార్య “మా ఆయన తాగినప్పుడు అలాగే మాట్లాడతాడు, పట్టించుకోకండి” అంది. వెనుక సీటులో కునికిపాటు పడుతున్న చెవిటి తాతగారు ఈ హడావుడికి నిద్రలేచి, పోలీసును చూచి భయపడుతూ " మావాడికి చెబుతూనే ఉన్నానండి. కొట్టేసిన కారుతో ఎక్కువ దూరం వెళ్ళలేంరా. పోలీసులు మధ్యలోనే పట్టేసుకుంటారా” అని అన్నాడు!

ఈ విధంగా, హాస్యాస్పదంగా, వింతగా, అర్థరహితంగా ఉన్న విషయాలు మనకు నవ్వు తెప్పిస్తాయి.

హలీనా ప్రఖ్యాత పశువుల డాక్టర్. అయితే ఆయనకు మతిమరుపు ఎక్కువ. ఆపరేషన్ చేసిన జంతువు పొట్టలో ప్రతి పర్యాయం కత్తెరనో, మరొకదానినో వదిలి పెడుతూంటాడు! ఒకరోజున చావుబతుకుల్లో ఉన్న ఒక పెద్ద ఏనుగుకు ఆపరేషన్ చేస్తుండగా, నర్సు ఆయనకు సాయం అందిస్తూ “సార్! ఈసారి దీని కడుపులో ఏమీ వదలకండి. ఈ ఆపరేషన్లో మీకు మరింత పేరు వస్తుంది” అని చెబుతూవుంది. ఆపరేషన్ అయిపోగానే " సక్సెస్ సిస్టర్” అంటూ డాక్టర్ ఆనందంగా అరిచినా ఆ నర్సు ఎక్కడా కన్పించలా!

---

"ఆలోచనాపూర్వకమైన నవ్వు తెప్పించేది, బాధను కలిగించనిదే అసలైన సుఖాంత రూపకం, గంభీరంగా తీసుకొనని పొరపాటును మదింపు చేయడమే హాస్యోక్తి " అంటాడు హాస్యాన్ని నూతన దృష్టికోణం నుండి వివరించిన స్వాబే. అలాంటి సంఘటనలను ఆనందించడంలోనే హాస్యం ఉంటుంది. వినోదాన్ని కల్పించేది, ఆనందాన్నిచ్చేది హాస్యం. అదొక ఆనందమయమైన మానసిక స్థితి. అంటే హాస్య భావన లేనివారికి అది కన్పించదన్నమాట! ఈ వ్యాఖ్యానాలను పరిశీలిస్తుంటే విషయాన్ని తిప్పిచెప్పడమే వృత్తాకార హాస్యంగా కన్పిస్తుంది. "వానలు ఎందుకు కురవడంలేదు?" అని అడిగితే, "వర్షాలు పడనందున" అన్నట్లుగా ఉంటుంది ఈ సిద్ధాంతం. అందుకే దానికి వృత్తాకార హాస్యసిద్ధాంతం అని పేరుచ్చింది.

**10. అసహజత్వ సిద్ధాంతాలు :** ఈ సిద్ధాంతాలు అసహజత్వానికి లేదా ఆశ్చర్యానికి ప్రాధాన్యమిస్తాయి. హాస్యంలో ఆశ్చర్యం సర్వవ్యాప్తంగా కన్పించినప్పటికీ, అనేక సందర్భాలలో ప్రజలు హాస్యాస్పద చిత్రాలు చూస్తున్నప్పుడేగాక, ఆశ్చర్యకర అధ్యాయం ముగిసిన తరువాత కూడా ఆనందిస్తారని మనకు తెలిసిందే. పిల్లలు మిక్కీమౌస్ చిత్రాలు పదే పదే చూసి అదే రీతిలో ఆనందించడం ఎంత ఆశ్చర్యం గొలుపుతుందో, పెద్దలు కూడా కొన్ని విషయాలలో అలానే వ్యవహరించడం మనకు మరింత ఆశ్చర్యం కలిగిస్తుంది.

వికెర్, తొరెల్లి, బెరాన్, పాండర్ మొదలైన రచయితలు అసహజత్వం హాస్యానికి ప్రధానాంశం అంటారు. దీని పై అనేకమంది 15 ప్రయోగాలు జరిపి చిన్నపిల్లలు అతి సాధారణ అసహజత్వాన్ని చూసి నవ్వినప్పటికీ, పెద్దవాళ్ళు మాత్రం అసహజత్వానికి తోడు కొంత ఆశ్చర్యంగొలిపే అంశం కూడా లేనిదే నవ్వరంటారు టామ్ షుల్జ్.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శాసనసభలో ఆహార సమస్య మీద శాసనసభ్యుడు కట్టమంచి రామలింగారెడ్డి ఆవేశంతో చేతులు ఊపుతూ ప్రసంగిస్తున్నాడు. సభాపతి ఆయన దూకుడును తగ్గించాలన్న ఉద్దేశ్యంతో "నోరు కదిపేటప్పుడు చెయ్యి కదపాల్సి న అవసరం లేదేమో!" అన్నాడు నవ్వుతూ. దానికి కట్టమంచి "అదెలా సాధ్యం? ఇది ఆహార విషయం. నాకొక్కడికే కాదు, మనుష్యులందరికీ తిండి దగ్గరికి వచ్చేటప్పటికి నోరు కదలాలంటే చెయ్యి కదలాల్సిందే. అయితే, మనిషినైన నేను, ఇతర జీవాల అనుభవాలను ఎలా కాదనగలను?" అన్నాడు నింపాదిగా! తిండి విషయంలో నోరొక్కటే కదిలేది నీలాంటి జంతువులకే అన్న చురక, సమాధానంలోని గడుసరితనం ఎవరినైనా నవ్విస్తుంది.

---

దిశమార్పు లేదా పొరపాటు మూలంగా హాస్యం జనిస్తుంది. – బడిలైర్

ఈ సిద్ధాంతాలు హాస్యం, ఉత్తేజాల యొక్క సర్వవ్యాపకత్వాన్ని వివరిస్తాయేకాని, అసహజత్వంలోని సౌందర్యాన్ని కాని, అది జనింపజేసే మధురానుభూతితో కూడిన ప్రతిస్పందననుకాని పరిగణనలోకి తీసుకోవు. కనుక, అవి ఆమోదయోగ్యమైన సిద్ధాంతాలు కావు అంటారు కుల్క్, రాబర్ట్ లట్టా మొదలైన రచయితలు.

**11. ఫ్రాయిడ్ హాస్య సిద్ధాంతం :** ఫ్రాయిడ్ తన ప్రఖ్యాత రచన Jokes and their relation to the unconscious లో తన హాస్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. **బాధనుండి ఆనందంగా మారేది హాస్యం అని, అది తేనె పూసిన చేదు మాత్ర వంటిదని ఆయన సిద్ధాంతం.** ఇతరులకు బాధ కలిగించేది లేదా శృంగార సంబంధ చేష్టలు హాస్యోక్తులు అని ఆయన నిశ్చితాభిప్రాయం. చిన్నవయసులో మనిషి తన ఆనందం, అనుభూతుల వ్యక్తీకరణలో కొన్ని ఆంక్షలకు లోనవుతాడు. ఆచారాలు, లైంగిక విషయాలు, మతం, పెద్దల నియంత్రణ మొదలైన అనేక అంశాల గురించి విమర్శించకూడదన్న కొన్ని నిబంధనలు అతని ఆనందానుభూతికి అడ్డుగోడలుగా నిలుస్తాయి. వీటినే 'అవరోధాలు' అంటారు ఫ్రాయిడ్. నిజమైన ఆనందానుభూతిని పొందడానికి అలాంటి అవరోధాలను తొలగించాలి. అనాదిగా వస్తున్న కొన్ని ఆలోచనలు, అనుభూతులు, స్వర్గం, నరకం, పాతాళలోకం గురించిన నమ్మకాలు ఇందుకు ఉదాహరణలు. అలాంటి అవరోధాలను తొలగించడానికి కొంత శక్తి అవసరం అవుతుందని చెబుతూ, ఆ శక్తి నవ్వు రూపంలో బయటకు వస్తుంది అంటారు ఫ్రాయిడ్. మన అహాన్ని (super ego) మోసగించడంలోనే హాస్యం ఉంది. నిషేధం ద్వారా పొదుపు చేయబడిన శక్తి సరసోక్తి రూపంగా బహిర్గతమవుతుంది. ప్రమాదరహిత హాస్యోక్తులు ఆనందాన్ని, గొప్ప అనుభూతులను కలిగిస్తాయి. అర్థరహితం, పదక్రీడలు మనకు ఎలా నవ్వు తెప్పిస్తాయో సంక్షిప్తత, పదాలను విరవడం కూడా హాస్యాన్ని అందిస్తాయి.

**12. స్వాభావిక ప్రవృత్తి సిద్ధాంతం ::**

ఈస్ట్ మన్, మాగ్డాగాల్, గ్రెగ్, కోస్లర్, డార్విన్ ప్రభృతులు స్వాభావిక ప్రవృత్తి లేదా సహజ బుద్ధి హాస్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. నవ్వు ప్రకృతిసిద్ధంగా జనించిన లక్షణం అన్నది ఈ సిద్ధాంత సారాంశం. 'స్వాభావిక ప్రవృత్తి ' అంటే ఏమిటి? దీనికి నాలుగు రకాల సమాధానాలు చెప్పవచ్చు. 1) నేర్చుకోకుండానే స్వాభావికంగా ఏర్పడిన ప్రవర్తన అని ఒక అర్థం. 2) మారడానికి వీలుకాని ప్రవర్తనను ప్రత్యేక కృషితో హాస్య ప్రవర్తనగా మనం మార్చుకోవచ్చు అని అందరకూ తెలిసిందే. 3) వంశపారంపర్యంగా వచ్చిన లక్షణం. 4) హేతుబద్ధతతో సంబంధంలేని ప్రవర్తన అన్నది మరొక వివరణ.

---

వందమంది చెయ్యలేని పనిని ఒక హేళన కార్యం చేస్తుంది. - శ్రీ శ్రీ

భార్య : (విసుగ్గా ఉన్న భర్త వద్దకు వచ్చి) ఏమండీ ఏం కూర వండమంటారు?

భర్త : నా తలకాయకూర వండు

భార్య : ఇగురు పెట్టమంటారా? పులుసు పెట్టమంటారా?

“మీ దేశంలో ప్రజలు డబ్బుకోసం, రాజ్యాలకోసం, అందమైన అమ్మాయిలకోసం యుద్ధాలు చేస్తారు. మా దేశంలో గౌరవమర్యాదల కోసం యుద్ధాలు చేస్తాం” భుజాలు ఎగురవేస్తూ గొప్పగా చెప్పుకున్నాడు ఓ అమెరికన్. “మీరు చెప్పింది నిజం. ఎవరైనా తమకు లేని వాటికోసమేకదా యుద్ధాలు చేసేది” అంటూ చురకవేశాడు భారతీయుడు.

విమర్శ: ఇలాంటి హాస్యోక్తులనుగాని, శ్లేషనుగాని అవగాహన చేసుకోవడానికి కొంత తార్కిక శక్తి అవసరం అన్న విషయాన్ని ఇది విస్మరిస్తుంది. .

1. ఒక హాస్యోక్తిలోని వైరుధ్యాన్ని చూసి నవ్వడం మానవుని సహజ లక్షణం అని చెప్పడం ఒక సిద్ధాంతం అన్పించదు. నవ్వడం మన సహజ లక్షణం అంటే మనం నవ్వుతాము గనుక నవ్వుతాము అని చెప్పినట్లే ఉంటుంది.

2. ఉద్రిక్తతను తొలగించడానికి దోహదం చేసే ప్రవర్తనా పద్ధతి ఇది అని వివరిస్తే అది స్వాభావిక ప్రవృత్తి సిద్ధాంతం కాక, పలాయన హాస్య సిద్ధాంతం క్రిందకు వస్తుంది.

3. ఈ సిద్ధాంత నిర్మాణంలో ఎలాంటి వివరణ లేకపోవడమే బహుశా ఈ సిద్ధాంతం ప్రత్యేకతలా కన్పిస్తుంది.

4. స్వాభావిక ప్రవృత్తి అను పదమే అయోమయానికి దారితీస్తుంది. ఈ విధంగా మన జ్ఞానంతో ఆ సంఘటనకు సంబంధించి ముందుగా తయారుచేసుకున్న మదింపు పై మన స్పందన ఆధారపడుతుంది అని ఆర్.లాజరస్ భావించగా, చివరకు ఇది అసంబద్ధ సిద్ధాంత విశ్లేషణగా కన్పిస్తుందే కాని, ప్రేరేపణ సిద్ధాంతం కాబోదు అని మరికొందరు విశ్లేషించారు.

13. ఉపశమన సిద్ధాంతాలు (Relief Theories) : ఒత్తిడికి లేదా బాధలకు లోనయ్యేవారు హఠాత్తుగా ఒక్క పర్యాయం వాటినుండి విముక్తి పొందినప్పుడు “హమ్మయ్య" అంటూ నవ్వుకోవడం సహజం. అయితే, అసహజత్వం, ఆధిక్యభావన హాస్యానికి కారణం కాదని, ప్రతిబంధకం లేదా నిర్బంధం తొలగడంతో జనించిన ఉపశమన భావన ముఖ్యం అని అంటారు ఫ్రాయిడ్ మొదలైన రచయితలు. ప్రకృతిసిద్ధమైన మన ఉద్వేగాలకు కళ్ళెం వేయకుండా మనల్ని నిరోధించే మనలోని ఆంతరంగిక సంక్షోభాలకు ఫ్రాయిడ్ పెట్టిన పేరు

చూసేవాని కళ్ళల్లో హాస్యం ఉంటుంది. – సూక్తి.

ఆంక్ష లేదా నిషేధం (censor). కామసంబంధ కోర్కెలు, ద్వేషపూరిత ఉద్వేగాలను, ప్రేరణలను మనం ఇలానే అణచి ఉంచుతాము.

ఈ విధంగా ఫ్రాయిడ్ అసభ్య హాస్యం, హాస్య పాత్రలు మనల్ని ఎలా ఆకర్షిస్తాయి అనేగాక, ఆధిక్య సిద్ధాంతాలు ప్రముఖంగా పేర్కొనే హాస్యంలోని ద్వేషపూరిత అంశాన్ని గురించి కూడా వివరణ ఇచ్చారు. ఆంక్షల్ని ఎలాగైనా మభ్య పెట్టడం లేదా నిరాయుధుణ్ణి చెయ్యగలిగితే మనం హాయిగా నిషిద్ధ ఊహలలో విహరించవచ్చు. సంప్రదాయ ప్రకటనను చేస్తూ దానిలో చిన్న మార్పులు ప్రవేశపెట్టడం ద్వారా విభిన్న భావాలను వ్యక్తపరచవచ్చు. నిషేధాన్ని మభ్యపెట్టడంలో కలలు కూడా సాయపడతాయి. ఇక్కడ శ్రామిక వర్గం హాస్యోక్తి ఒకటి చూద్దాం.

సోవియట్ యూనియన్లోని ఒక ఫ్యాక్టరీకి అమెరికా నాయకులు కొందరు వెళ్ళి "మీ ఫ్యాక్టరీలో పని పరిస్థితులు ఎలా ఉన్నాయి?" అని ఒక శ్రామికుణ్ణి ప్రశ్నించారు. "ఇక్కడి పరిస్థితులు ఇలానే ఉంటాయి. అధికారులు మాకు జీతాలు చెల్లించినట్లు నటించగా, మేము కూడా పని చేసినట్లు నటిస్తాము" అని సమాధానం వచ్చింది.

పదాలతో ఆడుకుంటూ కొన్ని సమయాలలో 'ఆంక్షల'కు చక్కిలిగింతలు పెట్టొచ్చు. నిషేధాలు, ఆంక్షలతో ఆడుకుంటూ వీలైతే వాటిని తుంగలో తొక్కవచ్చు.

14. తార్కిక అసంగతము : హాస్యోక్తిని ఆనందించడం దాని నిర్మాణం, రచనా శైలి పైననేగాక, ఉపన్యాసకుడు దానిని సమర్పించే తీరు, అతని హావభావాల పైన, స్వరం పైన ఆధారపడుతుంది. హాస్యోక్తిలో శ్లేష ఉన్నప్పుడు ఆ మెలికను అవగాహన చేసుకోవడం పైన, శృతి సంబంధిని గుర్తించడం, విమర్శనాదృష్టి కలిగి ఉండటం ద్వారా మన ఆనందం బహిర్గతం అవుతుంది.

ఒక వ్యక్తిని ఉరి తీసేముందు "నీ ఆఖరి కోరిక ఏమిటి?" అని అడిగాడు ఇన్ స్పెక్టర్. "ఒక ఖరీదైన సిగరెట్ కాల్చాలని ఉంది" అన్నాడు ముద్దాయి. "సిగరెట్టా! సిగరెట్ పొగ పీల్చడం నీ ఆరోగ్యానికి హానికరం అని తెలుసా?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

బాధితుడు : (ఫోనులో) మునిసిపాలిటీ హెల్త్ డిపార్టుమెంటా? మా ఇంటి ముందు ఒక కంచర గాడిద చనిపోయింది. వెంటనే దానిని తీసివేయించండి!

గుమస్తా : (వ్యంగ్యంగా) దాని దగ్గరి బంధువులు ఇంకా ఎవరూ రాలేదా?

బాధితుడు : వారికేగా ఇప్పుడు నేను ఫోను చేసింది! ఉరితీయబడే వ్యక్తి ఆరోగ్యం గురించి ఆలోచించడం తార్కికంగా ఎంత అర్థరహి తం! గాడిద బంధువులు రావడం ఏమిటి

---

హసితులకు రసజ్ఞత కావలె. – మునిమాణిక్యం నరసింహారావు.

అని ఆలోచిస్తే, హాస్యోక్తిలోని ఆనందం పోయి నీరసం చోటుచేసుకుంటుంది. కొన్ని హాస్యోక్తులకు భిన్న వివరణలు, విశ్లేషణలు ఉండవచ్చు. రాజకీయ, మత, జాతి మొదలైన అంశాల పై ఆ విశ్లేషణ ఆధారపడటంతో ఆసక్తి గలవారిలో హాస్యానుభూతి ఎక్కువగా, అది లేనివారిలో అతి తక్కువగా ఉండవచ్చు. అందుకే, హాస్యోక్తిని పాఠకుడు స్వీకరించే పద్ధతి పైన దాని హాస్యం ఆధారపడుతుంది అంటారు కొందరు రచయితలు. ఈ విధంగా హాస్యంపై పరిశోధనలు గావించిన సిద్ధాంతకర్తలు తమకు నచ్చిన ఒక అంశాన్ని (అసంబద్ధత, వైరుధ్యం, అప్రస్తుతం, ఆధిక్యతాభావం మొదలైనవి) నవ్వుకు కారణంగా రచనలు గావించారేకాని, ఏ రచయితా దాని విశ్వరూపాన్ని సందర్శించలేకపోయాడనిపిస్తుంది. కొన్ని సిద్ధాంతాలైతే హాస్యాన్ని అపహాస్య చేశామా అని బాధవేస్తుంది.

అందుకే మనం ఇంక హాస్య చరిత్రలోకి తొంగి చూద్దాం.

---

అధ్యాయం 6

# నవ్వు చరిత్ర

ఆస్ట్రేలియాలో ఓ భయంకర తుఫాను ప్రజాజీవితాన్ని అతలాకుతలం చేసింది. దానిని చూసిన విదేశీయులు బెంబేలెత్తగా, అలాంటి ప్రకృతి వైపరీత్యాలకు అలవాటు పడిన ఆ దేశ ప్రజలు మాత్రం "దీని దుంపతెగ అంత భయంకరంగా ఉరిమిందేమిటి? అంత దారుణంగా వర్షం పడిందేమిటి?" అంటూ నవ్వుకున్నారట! ఈ విధంగా ప్రకృతి సృష్టించిన బీభత్సాన్ని చూసి నవ్వుకోవడం మనిషికి కనీసం 35 వేల సంవత్సరాల క్రితమే అలవాటైంది!

ప్రపంచంలోని మొదటి హాస్యోక్తి నిజానికి హాస్యోక్తి కాదని, అదొక చిక్కు ప్రశ్న అని అంటారు కొందరు రచయితలు. ఇంతకూ ఆ చిక్కు ప్రశ్న (Riddle) ఏమంటారా? "ఉదయం నాలుగు కాళ్ళ పైన, మధ్యాహ్నం రెండు కాళ్ళ పైన, సాయంత్రం మూడు కాళ్ళపైన నడిచే జీవి ఏది?" దీనికి సమాధానం "మనిషి" అని మీకు తెలిసే ఉంటుంది.

చరిత్రలో మొదటి పేరడి క్రీ.పూ. 400 సం||లో కన్పిస్తుంది. కప్పలు, ఎలుకల మధ్య జరిగిన ఓ చారిత్రక పోరాటం గురించిన ఉదంతం అది. అయితే, చరిత్రలో ప్రప్రథమ కామెడీ పుస్తకం Philogeos (నవ్వుల ప్రేమికుడు) క్రీ.శ. 350లో వెలుగు చూసింది. అమాయకులపై హాస్యోక్తుల పేరుతో క్రైస్తవ సన్యాసులు గావించిన ఆ రచనలో కన్పించే హాస్యోక్తులు పాఠకుని పెదవుల పై చిరునవ్వులు చిందిస్తాయేకానీ, నవ్వులు కురిపించలేకపోవడం గమనార్హం. అందులోని కొన్ని హాస్యోక్తులను చూద్దాం.

ప్రాచీన హాస్యోక్తులు : సోమయ్య వద్ద ఓ గాడిద ఉంది. అది బండ చాకిరీ చేస్తూ యజమానికి ఎంతో లాభం గడించి పెడుతూంది. అయితే, సోమయ్యకు ఒక్కటే బాధ. అది అమితంగా తిండి తినడం తనకు ఎంతో నష్టం అనిపించింది. అది తిండి మానేసి పనిచేస్తుంటే, ఎంత బాగుంటుందో అని ముచ్చటపడి తిండి పెట్టడం మానేశాడు. అలా నాలుగు రోజులు గడిచాయి. అది ఉసూరుమంటూ పనిచేయసాగింది. తిండిని మానుకోవడం అది నెమ్మదిగా అలవాటు చేసుకుంటున్నదని మహా ఆనందించాడు. అలా మరో మూడు రోజులు గడిచాక అది గుటుక్కుమంది! అదేమిటో తిండి మానేయడం నేర్చుకున్న తరువాత పుటుక్కున చచ్చింది. అయినా, చెప్పా పెట్ట కుండా చచ్చి, నాకు చాలా నష్టం కలిగించింది అంటూ సోమయ్య లబోదిబోమన్నాడు. ఇది 2500 సం||లనాటి హాస్యోక్తి.

---

హాస్యం ప్రభావం ప్రసన్నత. దాని ముగింపు తృప్తి. – కె.చంద్రశేఖరన్

ప్రపంచంలోని అతి ప్రాచీన నాగరికతలలో 'మాయ' నాగరికత (ఈనాటి మెక్సికో, దక్షిణ అమెరికాలోని కొన్ని ప్రాంతాలు) ఒకటి. వాళ్ళు క్యాంజోబల్ భాష మాట్లాడతారు. హాస్యోక్తులకు పెట్టింది పేరుగా విరాజిల్లిన సంస్కృతి అది. అందులో ఒకహాస్యోక్తి చూద్దాం.

ఓ కొండగుహ దగ్గర నిలబడిన కుందేలుతో నక్క "ఏం చేస్తున్నావు అక్కడ?" అంది. "త్వరలో ఆకాశం కూలబోతుంది. వెంటనే ఇటు వచ్చి ఈ రాయి పట్టుకుంటే, నేను నెమ్మదిగా లోపలికి వెళ్ళి ఓ కర్ర తెస్తా. దాని సాయంతో మనం ఆ రాయి పడకుండా నిలిపి, దాని కింద మనం నిలబడదాం. ఇంక ఆకాశం పడినా మనకు భయం ఉండదు" అంది కుందేలు. "సరే" అంటూ బుద్ధిగా రాతిని పట్టుకు నిలబడింది నక్క. ఎంత సేపటికీ ఆ కుందేలు బయటకు రాకపోవడంతో విసుగెత్తిన నక్క, ఆ రాతిని వదిలి వెళ్ళిపోయింది. అది అలా అడవిలో తిరుగుతుండగా కుందేలు కనిపించడంతో, కోపంతో ఊగిపోయింది. అది గమనించిన కుందేలు "చూశావా! ఈ కొలను కింద ఎంత జున్ను ఉందో" అనడంతో నక్కకు నోరూరింది. "నీళ్ళ కింద తెల్లగా కనిపిస్తుందే అదంతా కోవానే" అన్న కుందేలు మాటలు ఆకలితో ఆవురావురుమంటున్న నక్కకు విందు భోజనం పెట్టినట్లుగా అనిపించాయి. "అయితే ఇప్పుడు ఏంచేయాలి? ఆ కోవా తినేది ఎలా?" అని ఆత్రంగా ప్రశ్నించింది. కుందేలు నవ్వుతూ "నీ పొట్ట నా పొట్టకన్నా చాలా పెద్దది కదా! నాకెలానూ అలవికాదు కనుక, నెమ్మదిగా ఈ రోజున కొలనులోని ఆ నీళ్ళన్నీ తాగెయ్యి. రేపు వచ్చి ఇద్దరం సరదాగా ఆ జున్ను తిందాం..... నాకు కొంచెం పని ఉంది. అలా వెళ్ళి వస్తా" అంటూ కుందేలు వెళ్ళిపోయింది. ఇంక పాపం..... ఆ నక్క నీళ్ళు తాగి, తాగి కడుపు ఉబ్బి ఏడుస్తూ పోయింది!!

ఇప్పుడు ప్రాచీన కాలానికి చెందిన మరొక రకం హాస్యోక్తులను చూద్దాం.

ఓయజమాని తన వందలాది బానిసలతో పడవలో ప్రయాణం చేస్తున్నాడు. ఇంతలో హఠాత్తుగా తుఫాను రావడంతో బానిసలు భయాందోళనలకు గురి అయ్యారు. వారి ఆందోళనను గమనించిన యజమాని "బానిసలారా! మీరు ఆందోళన చెందకండి. నా తదనంతరం మీ అందరకు విముక్తి కలిగించాలని నా వీలునామాలో వ్రాశాను. ఇప్పుడు ఆనందమేనా?" అన్నాడు నవ్వుతూ.

ఇంటికి అతిథివస్తే బయటిదాకా వెళ్ళి వీడ్కోలు చెప్పడం మర్యాద సూచిక అయితే, ఆ ఇంటి యజమాని ఏకంగా అతిథి ఇంటిదాకా వెళ్ళి సెలవు తీసుకున్నాడు. మరి ఆ అతిథి మాత్రం తక్కువ తిన్నాడా! ఇంటి యజమానిని గౌరవంగా సాగనంపడానికి అతిథి యజమాని

---

హాస్యం యొక్క బహిరంగ రూపమే హాసం.- మునిమాణిక్యం నరసింహారావు.

గృహందాకా వచ్చాడు. అలా ఆ మర్యాదస్తులు ఇద్దరూ రాత్రంతా అలా తిరుగుతూనే ఉన్నారు!

ఈ హాస్యోక్తులలో రెండు ప్రత్యేకతలు కన్పిస్తాయి. 1.ఇవన్నీ మేధావులకు లేదా బానిసల యజమానులకు సంబంధించినవే. 2.ఇవి ప్రపంచంలోని అతి ప్రాచీన హాస్యోక్తులు అవడం మరొక ప్రత్యేకత.

పురాతన కాలంలో నవ్వులు హాస్యోక్తుల రూపంలోనే కాక శిల్పాలు, చిత్రాల రూపంలో కన్పించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఉదాహరణకు, ప్రపంచంలో అత్యంత ప్రాచీన నాగరికతగల దేశాలలో ఒకటైన ఈజిప్టును తీసుకుందాం. పిరమిడ్లు, దేవాలయాల పైన శిల్పాలలోనే కాక, పాపిరస్ (కాగితం)ల పైన కూడా నాటి ప్రజలు హాస్యం చిందించడం విశేషం. ఒక దేవాలయంలోని శిల్పంలో బొద్దుగా ఉన్న రాణి చిత్రం ప్రక్కన బక్కచిక్కిన గాడిద బొమ్మవేసి "రాణిగారిని మోయవలసిన గాడిద ఇదే" అని వ్రాయ డం, సింహం, దుప్పి, చదరంగంలాంటి ఆటలు ఆడుతున్న చిత్రం, మనిషి కాళ్ళతో తయారుచేసిన మట్టి పిడతల బొమ్మలు, ఎలుకలు, పిల్లులు మనుషుల్లా ఆటలు ఆడే చిత్రాలు ప్రాచీన మానవులలోని హాస్యచతురతకు అద్భుత ఉదాహరణలుగా నిలుస్తాయి. ఈ విధంగా హాస్యం మానవ నాగరికత అంత పురాతనమైనదిగా కన్పిస్తుంది.

ముఖ్య విద్య: ఇప్పుడు ప్రాచీన చైనాలో జరిగిన ఓ ఉదంతం. వైద్యం వికటించి రోగి మరణించడంతో ఆతని బంధువులు వైద్యుని పై దాడికి దిగారు. ఆ ప్రమాదం నుండి తప్పించుకోడానికి ఆ వైద్యుడు పరుగెత్తి, పరుగెత్తి ఓ నదిలో దూకాడు. చచ్చిచెడి ఈదుకుంటూ ఇంటికి చేరిన ఆయన వైద్యవిద్యకు సంబంధించిన పుస్తకాలు చదువుతున్న కుమారుణ్ణి చూచాడు. "బాబూ! అతి ముఖ్యమైనవి ముందు, సామాన్యమైనవి ఆ తర్వాత, చేయాలని నేర్చుకో..... అన్నట్లు ముందు ఈదడం నేర్చుకో, ఆ తర్వాత వైద్యవిద్య నేర్చుకుందువుగాని" అంటూ సలహా ఇచ్చాడు!

నవ్వు పుట్టుపూర్వోత్తరాలు : ప్రాచీన హాస్యోక్తులను, ఆనాటి శిల్ప సంపదను గురించి తెలుసుకున్న తరువాత, ఇప్పుడు నవ్వు పుట్టుపూర్వోత్తరాలను పరిశీలిద్దాం. మనిషి నవ్వు మూలాధారాలు జంతువులలో కన్పిస్తాయి. ఆనందం, బాధ, కోరికలు మనిషిలో ఎంతగా ఉంటాయో, క్షీరదాల (Mammals)లోనూ అంతగా ఉండటం విశేషం. ఎలుకలు విన్పించే chirping, పిచుకలు చేసే ధ్వనిలో మనిషి నవ్వుకు బీజాలు దర్శనమిస్తాయి. చింపాంజీ భాష పాంట్. ఆ పాంట్ మనిషిలో హ! హ!గా మారింది. నవ్వుకు కారణం మనిషికిగల

శ్వాసశక్తి. అసంకల్పితంగా జరిగే శ్వాసక్రియ మనిషి ఆధీనంలో ఉండదని మనకు తెలుసు. మాటలను అదుపులో ఉంచుకున్నట్లుగా నవ్వును అదుపులో ఉంచుకోలేము కనుకనే కొన్ని సందర్భాలలో పొట్ట ఉబ్బేలా నవ్వి, నవ్వి అలసిపోతాము! మానవ మనస్సు ఎదిగే కొద్దీ మనిషి ముందుగా నవ్వడం, ఆ తరువాత మాట్లాడటం నేర్చుకున్నాడు. నెలల పాపలు కూడా ముద్దుగా నవ్వడం అందరికీ అనుభవమే కదా!

ఆటవిక స్త్రీ తన జట్టులోని మనిషి ఏదైనా మృగాన్ని వధించడాన్ని గుహలోనుండి చూస్తూ నవ్వుతూ ఆనందిస్తుంది. ఆ ఆనందానుభూతిని తన మనస్సులో పదిలపరచి దానిని ఇతరులకు సంకేతాలు, మాటలు, చిత్రాల ద్వారా తెలిపి ఉండవచ్చని, తన ఆనందాన్ని నవ్వు ద్వారా ఆమె వ్యక్తపరచిందని మోరెల్ భావన. ఆ విధంగా నవ్వు మానవభాషలో ఒక భాగం అయింది అంటారు ఆమె. ముఖం మనస్సుకు సూచిక వంటిది. జానిస్ పోర్ట్ ప్రకారం చిరునవ్వులు, నవ్వులు, మాటలు, తెలివితేటలు ప్రగతికి చిహ్నాలుగా నిలుస్తాయి. అందుకే మనిషికి నునిషికి మధ్య సుదీర్ఘకాలం నవ్వు ద్వారా జరిగిన మౌఖిక సందేశాల ఫలితంగానే మాటలు, భాష అభివృద్ధి చెందాయని ఆమె సిద్ధాంతీకరించారు. ఇదే అంశాన్ని పౌరాణిక కోణం నుండి చూద్దాం. పార్వతీదేవి శివుని ప్రేమలో పడటంతో, వారి స్థితి గాంచిన ఆమె సఖులు పరాచికాలాడారట! ఆ హాసమే హాస్యరసం అయిందని, ఆ విధంగా శివపార్వతుల శృంగారంవల్ల హాస్యం జనించిందన్నది పురాణగాథ.

సమాజంలో హాస్యం స్థానం:నవ్వు మనిషి నైతికతకు, కళకు, మతానికి కళంకం తెస్తుంది కనుక నాగరిక మానవుడు అలాంటి ప్రవర్తనకు దూరమవ్వాలి అన్నారు అరిస్టాటిల్, సిసిరో మొదలైన రచయితలు. గ్రీసు తత్వబోధకుడు గార్జియాస్ “నీ ప్రత్యర్థి చిత్తశుద్ధిని హాస్యంతోనూ, వారి హాస్యాన్ని చిత్తశుద్ధితోనూ ఆమోదించాలి” అన్నాడు. అరిస్టాటిల్ మహాశయుడు తన రచన 'రిటారిక్'లో నవ్వు గురించి కొన్ని మార్గదర్శక సూత్రాలు ఇవ్వగా, దుర్మార్గులను గురించి, పేదరికాన్ని గురించి, తమకు ప్రీతిపాత్రులైన వారిని గురించి చతురోక్తులు విసరకూడదు అని సిసిరో అన్నాడు. అయితే, ఇక్కడ ఒక విచిత్రం కన్పిస్తుంది. రాజుల ఆస్థానాలలో మాత్రం హాస్యకారులకు ప్రత్యేక స్థానం కల్పించబడింది.

ఏకంగా ఏడు శతాబ్దాల కాలం హాస్యకారుడు రాజుల ఆస్థానాలను ఏలుతూ శాశ్వతత్వాన్ని పొందాడు. భూస్వామ్య వ్యవస్థలో హాస్యకారుడు వినోదంకన్నా పరిహాసాన్ని అధికంగా కల్పించేవాడు. ఆనాటి కులీనులు (Barons) హాస్యకారులలో మందమతుల కన్నా, మందమతులలో హాస్యకారుణ్ణి ఆదరించారు. తెలివిగా చతుర వచనాలు పలికేవాడు,

---

స్త్రీలు, పిల్లలు, అమాయకులు హాస్యాన్ని ఆనందచచేస్తారు. – అబినవ గుప్తుడు

ప్రత్యుత్తరం ఇచ్చేవాడు, కాలక్షేపానికి నవ్వించగలిగేవాడు వారికి అవసరమ య్యాడు. గ్రామంలోని మూర్ఖుడు హాస్యకారుడుగా ఆదరణ పొందేవాడు. జమీందారు ఇంట్లో ఏ గదిలోకైనా ప్రవేశించడానికి, వారితో కలసి భోజనం చేయడానికి అతనికి స్వాతంత్ర్యం ఉండేది. తన విపరీత అలవాట్లు, చేష్టలతో అందరినీ నవ్వించగలగడమే ఆతని ప్రత్యేక అర్హతగా పరిగణింపబడేది.

భూస్వామ్య వ్యవస్థ రాజరిక వ్యవస్థకు చోటివ్వడంతో హాస్యకారుని స్థితిలో కొద్ది మార్పు వచ్చింది. రాజు ఆస్థానంలోని హాస్యకారుడు మూర్ఖుడు కాడు. అతను మూర్ఖుడుగా నటించాడు. మూర్ఖుని పాత్ర పోషించాడు. ఆవిధంగా హాస్యోక్తులతో ఉత్సాహాన్ని సృష్టించే వ్యక్తిగా అతను ఎదిగాడు. హాస్యం ముసుగులో నవ్వించడానికేగాక, కవ్వించడానికి, విమర్శించడానికి, సూచించడానికి, కొద్దిగా గేలి చేయడానికి కూడా క్రమంగా అతనికి స్వేచ్ఛ లభించింది. కొన్ని సమయాలలో అతని చేష్టలు, వాక్కులు రాజును ఆలోచింపజేసేవి. తెనాలి రామకృష్ణుడు, బీర్బల్ చరిత్రలే ఇందుకు ఉదాహరణలు. కన్నులవిందు కలిగించే వివిధ వర్ణాలుగల దుస్తులను - ముఖ్యంగా పసుపుపచ్చ రంగుగల దుస్తులను - ఆయన ధరించేనాడు. అన్నట్లు పసుపుపచ్చ రంగు మందమతికి చిహ్నం!

3వ ఎడ్వర్డ్ చక్రవర్తికి ఆస్థాన హాస్యకారుడు ప్రతి ఒక్కరిలో మూర్ఖుడు ఉంటాడని జ్ఞప్తి చేస్తూ మనకు నమ్రత నేర్పాడు. వివేకి తన తప్పిదాలను చూసుకుంటూ తానే నవ్వుకునేలా చేశాడు. (మరిన్ని వివరాలకు అధ్యాయం 34 చూడండి) ఈ విధంగా నవ్వుల చరిత్ర మనకు ఎంతో ప్రీతిపాత్రమవుతుంది.

ఇంక నాటక రంగంలోకి తొంగి చూద్దాం. ప్రాచీన గ్రీకు నాటక సాహిత్యంలో కామెడీ నాటక రచన అరిస్టోఫేన్స్ (448 బి.సి. - 380 బి.సి.) తో ప్రారంభమైంది. ఇటలీలో 15వ శతాబ్దిలోనే 'Commedia Dell Arte' రచన పూర్తిగా హాస్యంతో నిండివుండటం ఒక విశేషం. (పూర్తి వివరాలకు చూడండి:నాటకరంగం-హాస్యరసం, అధ్యాయం 27)

ప్రాచీన రోమ్ లో నటులు, జోకర్లు దిగువ తరగతుల నుండి వస్తారని, ఉపన్యాసకులు ఉన్నత వర్గాలకు చెందివుంటారన్న స్పష్టమైన వర్గీకరణ జరిగింది. అందుకే ఏ ఉపన్యాసకుడూ నటుడిగా మారడానికి అంగీకరించలేదు. ఉన్నత ఉపన్యాస కుడు నీచ నటుడు అన్నది ఆనాటి సూక్తి. ప్యూరిటన్స్ హాస్యాన్ని పూర్తిగా నిషేధించగా, బోధనలు చేసేటప్పుడు హాస్యానికి చోటుండకూడదంటారు ప్రొటెస్టెంట్లు.

---

స్త్రీలు, పిల్లలు, అధములు హాస్యాన్ని తిలకిస్తారు. – భరతుడు.

అద్భుత పరిణామం : అప్పటిదాకా నిషిద్ధ అంశంగా పేరొందిన హాస్యం ఎప్పుడు ప్రజాదరణ పొందిన విషయంగా మారిందో మనకు స్పష్టంగా తెలియదు. రోమ్ దేశానికి చెందిన మేధావి క్వింటిలియన్ 1వ శతాబ్దంలోనే హాస్యానికి సంబంధించిన సరైన సిదాంతం లేదని వాపోయాడంటే హాస్యం ప్రాధాన్యత తెలుస్తుంది. నాటి ఐరోపాలో ఎన్నో హాస్యకథలు, హాస్యోక్తులతో కూడిన సంకలనం 'Facetiae' ఆవిష్కరించబడటం ఆనందించదగిన పరిణామం. అనంతరం పునరుజ్జీవనం, మత సంస్కరణోద్యమాలు జరగడంతో లాటిన్ భాష ఆధిపత్యం తగ్గి, ఆయా ప్రజల మాతృభాషల ప్రాధాన్యం పెరిగింది. 1400 ప్రాంతంలో ప్రొగియో బ్రాసియొలిని హాస్య చతురోక్తుల సంకలనం

**ప్రాచీన ఈజిప్ట్ లో హాస్య భావన.... నడిచే మూకుడు, బాతులను తోలుకు పోతున్న పెద్దపులి, జింకతో చదరంగం ఆడుతున్న సింహం.**

చేశాడు. అలానే ఎరాస్మస్, ఫ్రాన్సిస్ బేకన్లు కూడా విదూషకులు, హాస్యకారుల గురించి కొన్ని రచనలు చేశారు. సెయింట్ పాల్స్ క్రాస్ చర్చిలో పశ్చాత్తప్తుడైన వానిని ఒక వేదికపైన నిలబెట్టి, అటూఇటూ తిప్పుతూ అక్కడ చేరినవారంతా హేళన చేసేవారు. అలాంటి సమయంలో జనావళిని అదుపులో ఉంచడానికి హాస్యకథలు ఉపయోగపడేవి.

బెన్ జాన్సన్ (1599) మానవ బలహీనతలను, సామాజిక లోపాలను సరిదిద్దడంలో హాస్యం తోడ్పడుతుందని ప్రప్రథమంగా ప్రకటించారు. మోలియర్, స్విఫ్ట్ మొదలైన మేధావులు సామాజిక రుగ్మతలను వ్యంగ్యం ద్వారా వ్యక్తీకరించడంలో ఎంతగానో తోడ్పడ్డారు. గొప్ప హాస్య పరిశోధకుడు అయిన గెర్షాన్ లెగ్ మన్ అనేక హాస్య రచనలు చేశారు. అయితే, వాటిని నీచాతినీచ ( Nasty Nasties) హాస్యోక్తులుగా, వినేవారికి వాంతి, వికారం కలిగించడం ఆ హాస్యోక్తుల ప్రత్యేకతగా లెగ్ మన్ వర్ణించగా, పోస్టుద్వారా బూతు పుస్తకాలను పంపుతున్నాడన్న అభియోగంతో 1952లో తపాలాశాఖ ఆయన ఉత్తరాల బట్వాడాను నిలిపివేసింది.

తత్వవేత్తలలో కూడా హాస్య చతురులు లేకపోలేదు! ప్రాచీన గ్రీకు తత్వవేత్త డెమోక్రిటస్ నవ్వే తత్వవేత్తగా కీర్తి గడించడం విశేషం. చతురోక్తుల రవ్వలను విసరడం నైట్కేకి సరదా. ఆధునిక కాలంలో బ్రిటన్‌కు చెందిన కియర్కేగార్డ్ హాస్యానికి ఒక మచ్చుతునక. ఆయన తన తత్వశాస్త్రంలో హాస్యానికే కేంద్రస్థానం ఇస్తూ ముగింపుగా “నేను వ్రాసినదానిలో ఒక భాగాన్నికాని, పూర్తిగాకాని రద్దు చేయవచ్చన్న ప్రకటన ఉన్నదని గుర్తుంచుకోండి. ఈ పుస్తకానికి ఉపసంహారమే కాదు, అదనంగా ఖండన కూడా ఉన్నది”

---

హాస్యం అంటే కర్మ, నవ్వు దాని తాలూకు ఫలం. – నండూరి పార్థసారథి.

అని పేర్కొన్నారు! హెగేలియన్ "తాత్వికుల దృష్టిలో హాస్యం ఒక సరసమైన ఎగతాళి వంటిది" అని చెబుతూ హాస్యానికి, వక్రోక్తికి మధ్యగల వ్యత్యాసాన్ని వివరించారు.

గత రెండు దశాబ్దాలలో హాస్యం పై అసంఖ్యాక పరిశోధనలు జరగడం విస్తరిస్తున్న దాని ప్రాధాన్యానికి ఒక ఉదాహరణ. 1879లోనే ప్రపంచంలో ప్రప్రథమంగా Wundt మనోవిజ్ఞాన ప్రయోగశాలను నెలకొల్పారు. 20వ శతాబ్దంలో సిగ్మండ్ ఫ్రాయిడ్ తన మనోవిశ్లేషణ సిద్ధాంతాలతో నవ్వు పై ఆంక్షలకు తెరదించారు అధస్సూచి. ఆ తరువాత నేటిదాకా రూష్, జేమ్స్), హాల్, ఎలిన్, హైమ్ మొదలగు రచయితలు హాస్యం, ఆనందం, ఆవేశం, విశ్రాంతి, హేళన, జ్ఞాపకం మొదలైన అంశాలపై ఎన్నో పరిశోధనలు గావించారు; వ్యక్తిత్వ సిద్ధాంతం ఆధారంగా హాస్యాన్ని గురించి అధ్యయనం చేశారు.

ఈ విధంగా ప్రపంచ దేశాలలో హాస్యకళ లేని సంస్కృతి కన్పించదు. బంగ్లాదేశ్ లో రసం అంటే హాస్యరసమే. హాస్యవాఙ్మయాన్ని రస సాహిత్యమని పిలుస్తారు. విశ్వమానవ లక్షణం అయిన నవ్వు క్రమంగా ఎదిగి అరూపభాషలో ఒక భాగంగా వికాసం చెందింది. హాస్యరూపం ధరించి ప్రజాదరణ పొందింది. ఈనాడు అదొక పరిశ్రమగా ఎదగడంతో ప్రజలు హాస్యాన్ని ఆరాధనా దృష్టితో చూడసాగారు. తమలో హాస్యభావం లేదని ఎవ్వరూ అంగీకరించని స్థాయికి హాస్యం ఈనాడు ఎదగడం ముదావహం. 1937లో జరిగిన పరిశోధనలో తమలో హాస్యప్రవృత్తి లేదని ఒక ప్రాంతంలో 6 శాతంమంది, మరొక ప్రాంతంలో 1.4 శాతం మంది మాత్రమే అంగీకరించడం ఇందుకు ఉదాహరణ. చిత్రమేమంటే, అంత ప్రధానమైన అంశం పైన ఇప్పటికూడా అంతగా పరిశోధనలు జరుగలేదు!

రెండు ఆధునిక హాస్యోక్తులతో ఈ చర్చను ముగిద్దాం.

భార్య : ఏమండి! వంటగదిలో చప్పుడవుతుంది. దొంగెవడో ఇంట్లో దూరాడండీ.....

భర్త : అబ్బ..... నీ వంట తిన్నాక కూడా వాడు ఎక్కడికి పోతాడులేవే.....పడుకో! ప్రొద్దున్నే పట్టుకోవచ్చు.

"మనుషులకంటే జంతువులు చాలా గొప్ప విరా" అన్నాడు రఘు.

"ఎలా?" అన్నాడు గోపి.

"పాతిక గుర్రాలు పరుగెత్తితే అరవై వేలమంది మనుషులు చూస్తారు. పదిమంది జనం పరుగెత్తితే ఒక్క గుర్రం కూడా చూడదు మరి!" అన్నాడు రఘు.

ఇంక హాస్యతత్వం గురించి తెలుసుకుందాం.

---

అతిగా నవ్వేవాడు నిష్ఠదరిద్రుడు. – జీన్‌పాల్ రిక్టర్

అధ్యాయం 7

# హాస్య తత్వం

గోపాల్ ఇంటికి వెళ్తుండగా దారిలో .హఠాత్తుగా పెద్దవర్షం మొదలైంది. త్వరగా ఇల్లుచేరాలన్న ఆత్రంతో వేగంగా నడుస్తూ కాలుజారి కిందపడ్డాడు. ఒళ్ళంతా ఖరాబైంది. ఇంతలో ఆకాశంలో ఓ మెరుపు మెరవడంతో "ఓరి భగవంతుడా! నాతో వేళాకోళం ఏందయ్యా స్వామి! బురదలో తోసేసింది చాలక ఫోటో కూడా తీస్తావా?" అంటూ ఏడవసాగాడు గోపాల్!

గణేష్, సురేన్లు లారీ డ్రైవర్లు. మ్యూజియం చూద్దామని ఆ ఇద్దరు అమరావతి వెళ్ళారు. అక్కడ ఒక అస్థిపంజరం, దాని క్రింద బి.సి. 1560 అని వ్రాసివున్న బోర్డు కన్పించింది,

గణేష్ : ఏరా సురేష్! ఇది లారీ క్రిందపడి చచ్చినోడి కళేబరంలా ఉంది కదూ!

సురేష్ : ఔన్రా! దీనిక్రింద లారీ నంబర్ కూడా ఉందిరోయ్!

రాము, సోములు పడవ షికారు చేస్తుండగా, మధ్యమధ్య ఆ పడవ బాగా ఊగడం చూసిన రాము "బోటు మునిగిపోతుందేమోరా!? సోము" అన్నాడు భయంభయంగా...... "ఆ బోటు యజమానిగాడు దీని అద్దెక్రింద బోలెడు డబ్బులు గుంజాడు. మునిగితే మునగనీ వెధవబోటు...... అప్పటికిగానీ వాడికి బుద్ధిరాదు" అన్నాడు సోము కసిగా నవ్వుకుంటూ..!

అందమైన అమాయక హాస్యోక్తులకు కొన్ని ఉదాహరణలు ఇవి. జీవితంలో ప్రతి ఒక్కరూ ఆనందాన్ని అన్వేషిస్తారు. ఆనందదాయక విషయాలను వినడం లేదా చెప్పడం ద్వారా మనిషి ఆనందానుభూతిని పొందుతాడు. అందుకే ఆనందాన్ని అందించే హాస్యోక్తులు అందరకు అత్యంత ప్రీతిపాత్రం అవుతాయి. సాధారణంగా ప్రతిహాస్యోక్తికి ఒక ఉద్దేశ్యం, ఒక లక్ష్యం ఉంటుంది. హాస్యోక్తులలో అమాయక, వైరభావ, అసభ్య భావనా సంబంధమైన అనేకరకాల హాస్యోక్తులు ఉన్నాయి.

బాధ ఉన్నచోట ఆనందానికి చోటుండదు. అలాంటి పరిస్థితులలో చింతలన్నింటిని అధిగమించి ఆనందో బ్రహ్మ అంటూ చాటిచెప్పేది హాస్యం. అది హాస్యస్ఫోరకం (Comic) గాని, సరసోక్తి (wit) గాని కల్గించేంత తీవ్రస్థాయిలో ఆనందాన్ని కల్గించలేదు. దాని ఉద్దేశ్యం బోధనకాని, ఆనందం కాదు. నిజానికి హాస్యం ఒక అల్ప హాస్యోక్తిలాంటిది.

---

నవ్వు మట్టిబుర్రకు చిహ్నం. –గోల్డ్‌స్మిత్

వ్యక్తిలోని వీరఅహం (Super ego) బాధ నుండి అహం (ego) ను కాపాడటానికి ఆనందం కలిగించే యత్నం మూలంగా హాస్యం జనిస్తుంది అన్నది ఫ్రాయిడ్ సిద్ధాంతం.

హాస్యోత్పత్తికి కారకాలు తెలుసుకునే ముందు హాస్యతత్వం గురించి తెలుసు కుందాం. తత్వం అంటే యదార్థం, సత్యం, సృష్టికి ప్రప్రథమ అవయనభూత మగు ప్రకృతి మొదలగు పదార్థం అని అర్థం. హాస్య తత్వం అంటే హాస్యరస సమాలోచన లేదా హాస్యాన్ని గురించిన సత్యపరిశీలన అన్నమాట!

హాస్యోక్తికి ఉక్తి అవసరం: అనాదిగా అత్యంత భద్రంగా, ప్రీతిపాత్రంగా పోషించుకుంటూ వస్తున్న విశ్వాసాలను అమాయకంగా, ఎవ్వరికీ బాధ కలిగించని రీతిలో సవాలు చేయడంలోనే హాస్యం నేర్పు ఉంది. చెప్పదలచింది నేరుగా చెప్పకపోవ డంలోనే దాని ప్రత్యేకత ఉంది. విషయాన్ని సాధారణ జనం పరికించే కోణం నుండి గాక, భిన్న కోణం నుండి చూడటానికి ఇతరులను ఉసిగొల్పడం లేదా దారి తప్పించగల నేర్పులోనే హాస్యశక్తి ఇమిడివుంది. ఈ విధంగా హాస్యోక్తి వేయడానికి కొంత తెలివితేటలు కావాలి. హాస్య తత్వం పరిశీలనలో ఇదోపార్శ్వం .

అలానే, తత్వవేత్తలు జనసామాన్యం ఆలోచించలేని, యోచించని కోణం నుండి ఒక సాధారణ విషయాన్ని వివరిస్తూ సృష్టి యదార్థాన్ని బయట పెడతారు! ఇలాంటి అభ్యాసాలకు సృజనాత్మకత, మేధాసంపత్తి అత్యంత అవసరం కనుక తత్వవేత్తలు తమతమ ప్రత్యేక లోకంలో ఉండిపోతారు. చిత్రం ఏమంటే, వారు అతి గంభీర విషయాలను కూడా అతి సామాన్య సంఘటనలుగా చిత్రీకరిస్తారు. అలానే, వారిముందు ఒక హాస్యోక్తిని పేలిస్తే, ఆ హాస్యోక్తి ఎందుకు నవ్వించగలుగుతుంది, దాని ప్రత్యేకత ఏమిటి అని వేదాంతిలా యోచిస్తారేకాని, వారుమాత్రం నవ్వరు. ఈవిధంగా హాస్యం తత్వ శాస్త్రానికి దగ్గరవుతుంది.

ప్రపంచం ఒక శూన్యం. ఆ శూన్యం నుండి సృష్టి జనిస్తుంది అంటుంది తత్వశాస్త్రం. సంపద, భార్యాబిడ్డలు, కీర్తి ప్రతిష్టలు, వ్యా మోహం అంతా ఒక భ్రమ, మిధ్య అని, దైవం ఒక్కటే శాశ్వతమని బోధిస్తుంది భగవద్గీత. అలానే, నిజానికి జీవితంలో ఏమీ లేదన్న యదార్థాన్ని గుర్తింపజేస్తుంది హాస్యం. ఈ సత్యాన్ని ఎంతో సరదాగా, సులువుగా తెలియజెప్పే ఈ హాస్యోక్తి చూడండి.

ముట్నూరి కృష్ణారావు కృష్ణా పత్రిక సంపాదకునిగా ఎంత కీర్తి గడించాడో, తన పై తానే ఛలోక్తులు విసురుకోవడం ద్వారా అంతకన్నా పేరు గడించాడు.

---

సిద్ధాంతకర్తల ప్రకారం మనిషి నవ్వకూడదు. – పైథాగరస్

అనారోగ్యంతో బాధపడుతున్న ఆయన అవస్థనుచూసి భార్య తట్టుకోలేక కళ్ళనీళ్ళు కుక్కుకోసాగింది. జీవిత భాగస్వామి మరణశయ్య పై ఉన్నప్పుడు భార్య దుఃఖించడం సహజమే. అయితే, భార్యను చూసిన కృష్ణారావుకు నవ్వు ఆగక "ఏమిటి అప్పుడే రిహార్సల్సు మొదలెట్టావా?" అంటూ ఓ ఛలోక్తి విసిరాడు!

భర్త మరణశయ్య పై ఉండటాన్ని తట్టుకోలేక ఆ ఇల్లాలు కళ్ళనీళ్ళ పర్యంతం అవుతుంటే, ఆయన దానిని అవలీలగా కొట్టిపారేస్తూ భార్యామణిలో ఉల్లాసాన్ని తీసుకురావడానికి ఎంతగా ప్రయత్నించాడో చూడండి! -

పిడివాదం వద్దు : ఇతరులను నవ్వించాలన్న ఆసక్తి, ఆ ఉత్సాహం హద్దుమీరి ఇతరులను నవ్వులపాలు చెయ్యాలన్న తపనకు మూలం మనిషిలోని అహం. ఈ అహం మనం వాడుకభాషలో అనుకునే అహంకారం కాదని, వ్యక్తి తననుతాను ప్రేమించుకోవడానికి, అభిమానించడానికి, హితులను, సన్నిహితులను అభిమానించ దానికి, దుర్మార్గులు, వక్రబుద్ధులను ద్వేషించడానికి సాయపడే ఒకానొక విలక్షణ విశేషం అంటాడు భోజుడు. ఈ అహమే మానవజాతి మనుగడకు మూలం అంటాడు ఆయన. దానిని శృంగారం అని కూడా పిలిచాడు'. ఇతరులను నవ్విస్తూ, తాను నవ్వుతూ జీవించేవారిని శృంగారులు అన్నాడు భోజుడు. హాస్యరసానికి లేదా శృంగారానికి మూలం ఇదేనన్నాడు.

మరొక విషయం. నేటి సంక్లిష్ట సమాజంలో నేను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అని, నేను చెప్పిందే యదార్థం అన్న పిడివాదంతో గిరిగీసుకొని కూర్చోవడం ఆరోగ్య దాయకం కాదు అని బోధిస్తుంది హాస్యం. హాస్య తత్వంలోని ప్రత్యేకత ఇదే.

కందుకూరి వీరేశలింగం సంఘసంస్కరణోద్యమకారుడిగా అత్యంత కీర్తి గడించాడు. కామినీకచకుచ సంభోగాది వర్ణనలతో నిండియున్న ప్రబంధములను పరిహసించడానికి ఆయన 'అభాగ్యోపాఖ్యానము' రచన చేశాడు. బాల్యవివాహాలు, ముక్కు పచ్చలారని బాలికలను పండు ముదుసళ్ళకు కట్టబెట్టే వివాహాలు మహిళలపాలిటి శాపాలుగా మారాయని ఆయన ఆవేదన చెందాడు. వాటిలోని లోపాలను జనసామాన్యానికి అర్థమయ్యేరీతిలో వివరించడానికి సామాజిక సమస్యలను చక్కని హాస్యంతో మేళవించి, హృదయానికి హత్తుకునే రీతిలో ఎన్నో ప్రహసనాలను రూపొందించాడు. పెద్దయ్యగారు చచ్చిపోయాక నవయౌవనవతియైన అతని భార్య స్వతంత్రురాలైంది. లోపల ఒక్కతే ఉండలేక తరచుగా వీధిగుమ్మంలో ఉంటూ చాలామంది మొగస్నేహి తులను సంపాదించుకొని, రాత్రిళ్ళు భయంచేత డబ్బిచ్చి అయినా ఎవరైనా ఒకణ్ణి లోపల తనతో కూడా పడుకోవడానికి

నవ్వు అన్నది మూర్ఖుల వెక్కిళ్ళు. – జాన్ రే

సహాయం తెచ్చుకుంటూ "పరోపకారార్థ మిదం శరీరమ్" అనే వాక్యాన్ని మరువకుండా ప్రవర్తించేది ". ఇక్కడ ఎంత వ్యంగ్యం ఉందో, బాల్యవివాహ వ్యవస్థ పై అంత అవహేళన ఉంది.

ఇంక నేటి విషయానికి వద్దాం.

భండారు పర్వతాలరావుగారి అద్భుత వ్యంగ్య రచన చదవండి.

"కులరహిత సమాజ స్థాపనకై
కొత్త సంఘం స్థాపించా
మంచిదిలే ఎందుకైనా అని
మనవాళ్ళవరకే చేర్పించా"

భారతీయ సమాజాన్ని పట్టిపీడిస్తున్న పెనుభూతం కులం. దానిని బహిరంగంగా అందరూ కొరడాలతో ఎంత చితకబాదుతారో, రహస్యంగా దానిని అంత ప్రేమతో పట్టుపరుపుల పై పండుకోబెట్టి మేపుతుంటారు. మన సమాజంలో ఈనాడు కులం ప్రవేశించని ప్రదేశమేదీ లేదనడం అతిశయోక్తి కాబోదు. అభ్యుదయవాదుల్లా ఫోజు పెట్టే గొప్ప సంస్కర్తలలో, వేదికల పైన హితోక్తులు పలికే అత్యధికులలో ఈ జాడ్యం మరింత హెచ్చుగా కన్పిస్తుంది!

బడా ఉద్యోగులు, రాజకీయనేతల మాటల్లో SC అన్న పదప్రయోగం మొదట అర్థంకాని నాకు SC అంటే Same Caste (మన కులస్తుడే!) అని తెలుసుకున్న తర్వాత ఆశ్చర్యపోవడం నావంతు అయింది. అందుకే 'మేధావుల' ద్వంద్వనీతి, హిపోక్రసి అర్థం కానిదే వాస్తవ సమాజం మనకు అర్థం కాదు.

ఈ విధంగా సమాజంలో నెలకొన్న అడ్డుగోడలను - అతను బ్రాహ్మణుడు, ఇతను అంటరానివాడు; అతను గొప్ప అధికారి, ఇతను సామాన్యుడు; మైనారిటీ నాయకుడు, సాదాసీదా వ్యక్తి, అధికారపార్టీ కులస్తుడు, బలహీన కులస్తుడు; పవిత్రత, మతాధికా రులు, పెద్దల ఎడల గౌరవం, భీతి మొదలగు పదాల వెనుకగల డొల్లతనాన్ని ప్రజానీకానికి అర్థం అయ్యేలా వివరించగలిగినప్పుడే హాస్య లక్ష్యం నెరవేరుతుంది. భారతీయ సమాజంలోని ఈ డొల్లతనాన్ని అవగాహన చేసుకోకుండా నేటి మన రాజకీయ, సామాజిక వ్యవస్థలను అర్థంచేసుకోబూనడం ఎండమావుల్లో సేద తీర్చుకున్నట్లే అవుతుంది.

ఫ్రాయిడ్ - హాస్యతత్వం: చిన్నతనం నుండే మనిషిలో కొందరి ఎడల కొన్ని వ్యతిరేకభావాలు, ప్రేరకాలు అభివృద్ధి చెందుతాయి. ఈ ఉద్వేగాలను నియంత్రించడా నికి

---

అత్యధికంగా ఉన్న భావావేశశక్తికి విముక్తి కలిగించడమే నవ్వు. – ఫ్రాయిడ్

సంస్కృతి మనమీద కొన్ని నైతిక ఆంక్షలను విధిస్తుంది. మనం కొన్ని సందర్భాలలో కలవరపడటానికి, అసహ్యించుకోవడానికి కారణం ఇదే. గుడ్డిబిచ్చగానికి సాయం అందించకపోగా, అతని పళ్ళెంలోని చిల్లర డబ్బులను తస్కరించేవాడినిగాని, మనం నమ్మిన దేవుళ్ళు, నాయకుల చిత్రాలను బుద్ధిపూర్వకంగా అగౌరవపరచే వారిని చూసినప్పుడుగాని మనలో అసహ్యం, కోపం చోటుచేసుకుంటాయి కదా! అయితే, ఇలాంటి ఉద్వేగాన్ని, వ్యతిరేకతను క్షేమంగా బహిర్గతం చేయడానికి ఉపయోగపడే ఉత్తమ మార్గం హాస్యోక్తులు. చక్కని హాస్యోక్తులను పేల్చడం ద్వారాగాని, హాయిగా వినడం ద్వారాగాని పెద్దగా నవ్వుతూ మనలోని వ్యతిరేకతను, అసహ్యాన్ని, కోపాన్ని బహిర్గతం చేయవచ్చు. సాధారణంగా అభేద్యంగా కన్పించే మార్గంలో హాస్యం అనే ఆయుధం ద్వారా సునాయాసంగా ప్రవేశించి శత్రువులోని బలహీనతలను నిర్భయంగా హేళనచేస్తూ ఆనందించవచ్చు. హాస్యోక్తి ద్వారా పొందే ఆనందం అవరోధాలను కొనసాగించడం మూలంగా పొదుపు చేయబడిన శక్తికి సంబంధించి ఉంటుంది. అందుకే హాస్యోక్తిని "అవరోధాల పై ఖర్చులో పొదుపు" (economy in expenditure upon inhibition) గా వర్ణించాడు ఫ్రాయిడ్.

ఆలోచించడం మానవ నైజం. అయితే, మనిషి ఆలోచనలు అతని విజ్ఞానం, అనుభవం, ఆర్థికస్థితి మొదలైన స్థాయిల పై ఆధారపడతాయి. ఆలోచనలవల్లనే మనం చైతన్యవంతులమవుతాము. చైతన్యవంతుడైన మానవునికి జీవితమే ఆనందమయం అవుతుంది. అయితే, ఇక్కడ ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. హాస్యం ఆనందాన్ని గురించేకాక, బాధలను గురించి కూడా గుర్తుచేస్తుంది. నిజానికి మనం అనుభవించే ఆనందం, ఎదుర్కొనే సమస్యలు అన్నీ మనవేకాకపోవచ్చు! ఇతరుల ఆనందాన్ని, బాధలను గురించి కూడా హాస్యం మన దృష్టికి తెస్తుంది. అదే దాని ప్రత్యేకత!

ఫ్రెంచి విప్లవ స్ఫూర్తి ప్రదాత రూసో చెప్పినట్లు "విజ్ఞానం పెరిగే కొద్ది మనలో సామాజిక స్పృహ అధికం అవుతుంది. దయ మానవ నైజం అయినప్పటికీ, ఆలోచనతో దానిని చైతన్యపరచనప్పుడు అది నిశ్చలంగా ఉండిపోతుంది.

ఫలానా వ్యక్తి ఎంత బాధపడుతున్నాడో అని మనం ఎంత తీవ్రంగా ఊహిస్తామో, ఆమేరకే మనంకూడా వ్యధ చెందుతాము. నిజానికి ఆ బాధ మనది కానప్పటికీ, తోటి వ్యక్తిలోని బాధను చూసి మనం బాధపడతాము. ఈ విధంగా మననుండి మనం దూరంగా జరిగి బాధితునితో తాదాత్మ్యం చెందినప్పుడే మనం దయతో స్పందించగలం అన్నమాట!

---

రెండు అభిన్న చట్రాలు హఠాత్తుగా మార్పు చెందడమే హాస్యం. – ముల్కే

అయితే, ఏ ఆలోచనా లేనివాడికి దయ, న్యాయం, జాలి తెలియవు. అలాంటివాడికి తానొక్కడే తనకు తెలిసి ఉంటాడు కనుక జనసంద్రంలో ఆతను ఏకాకి అవుతాడు! అలానే, పంచుకున్నకొద్దీ ఆనందం పెరుగుతుంది కనుకనే ఆర్దర్ కోస్లర్ హాస్యానికి అత్యున్నత స్థానం కల్పించారు. హాస్యోక్తి (Witticism) అనే పదం సృజనాత్మకత, చాతుర్యం (wit) నుండి ఉద్భవించిందని చెబుతూ విదూషకుడు, జ్ఞాని ఇద్దరూ బుద్ధి, వాక్చాతుర్యం పైన జీవిస్తారని కొనియాడారు. విదూషకుని ప్రహేళిక (చిక్కు ప్రశ్నలు) సృజనాత్మకమైన మౌళికతకు, ఆంతరంగిక కర్మాగారంలో ప్రవేశానికి దొడ్డిదోవలా పనిచేస్తుందని చెబుతూ ఆయన జ్ఞానికి, విదూషకునికి మధ్యగల సంబంధాన్ని అద్భుతంగా వివరించారు.

అలానే, మనిషిలో హాస్యరసానుభూతికి గల కారణాలను వినూత్న రీతిలో విశ్లేషించిన బెన్ జాన్సన్ హాస్యం వినోద సాధనం మాత్రమే కాదని, అది మానవునిలోని దురాశ, అహంకారంలాంటి దుర్లక్షణాలను తరిమివేయగల ఆయుధం అని ఉద్ఘాటించారు.
ఇంక హాస్యోత్పత్తి కారకాల గురించి తెలుసుకుందాం.

హాస్యోత్పత్తి కారకాలు : హాస్యోక్తుల లక్ష్యం ఆనందానుభూతి అని తెలుసుకున్నాం. హాస్యోత్పత్తిలో ప్రధానంగా సంక్షేపణ, స్థానభ్రంశం, పరోక్ష రూపకల్పన, విచారణాంశం, నిరర్ధకత (మూఢత) అనే ఐదు ప్రక్రియలను ఉపయోగి స్తారు అంటారు ఫ్రాయిడ్. ఇప్పుడు వాటిని గురించి తెలుసుకుందాం.

1. సంక్షేపణ : ప్రసంగాలలోగాని, స్పెల్లింగ్ లో గాని చేసే ఒకానొక తమాషా ఇది. పొంతనలేని రెండు మాటలను కలిపి, వాటిని పిసికి ఒక నూతన పదాన్ని సృష్టించడాన్ని సంక్షేపణ అంటారు. పెద్ద వాక్యాన్నిగాని లేదా ఒక పదబంధాన్నిగాని కుదించడం ద్వారా కూడా హాస్యోక్తి జనిస్తుంది. వ్యాకరణ సంబంధమైన ఒకానొక నైపుణ్యం అది. “హాస్యానికి అందాన్నిచ్చేది సంక్షిప్తత" అన్నారు షేక్ స్పియర్.

పీ.కే.రావు: నేను హైస్కూలులో చదివేరోజుల్లో మా క్లాసులో తమాషాగా మాట్లాడుతూ అందరినీ నవ్వించే పేరాల కుటుంబరావు ఉన్నాడు. అర్ధసంవత్సరం పరీక్ష పేపర్లు ఇస్తూ మా టీచరు మా మిత్రుని పేరు సంక్షిప్తపరుస్తూ పి.కె.రావు అని పిలిచాడు. అంతే! .... క్లాసు గొల్లుమంది! ఒక్కసారి ఉలిక్కి పడ్డ టీచరు వెంటనే తేరుకొని నవ్వుతూ “ఏరా! మాటలతో నవ్వించడమేగాక, పేరులోని ప్రత్యేకతతో కూడా అందర్నీ నవ్విస్తున్నావే” అనడంతో క్లాసు మరొక్కమారు నవ్వులలో మునిగిపోయింది. అలానే మా క్లాసులోని

---

నాగరికులు చిరునవ్వులు చిందిస్తారే కాని ఎన్నడూ నవ్వరు. – లార్డ్ చెస్టర్ ఫీల్డ్

జి.గురుమూర్తిని 'జిగురుమూర్తి' అని, కోవెల తిలకను 'కోతి' అని, గోడమీది పిల్లిని గోపి అని పిలిచి ఆనందించేవాళ్ళం. అలానే, సుబ్బారావు పేరును తిప్పి 'వురాబ్బాసు'
అని, రాంబాబును 'రాంబాంబు' అని, పంకజ దినేషునుపంది' అని పిలుస్తూ ఆడుకునే వాళ్ళం. సంతోషం సగం బలం అన్నట్లు సంక్షేపణ సంపూర్ణ ఆనందానుభూతిని మిగులుస్తుంది.

2. స్థానభ్రంశం: ఇక్కడ ఒకే పదాన్ని భిన్న అర్థాలతో ప్రయోగించడంతో హాస్యం జనిస్తుంది. సంక్షేపణలో కొన్ని పదాలు లేదా అక్షరాలు అంతర్ధానం అయితే, స్థానభ్రంశంలో అక్షరాలు తారుమారై వింత అర్థాలనిస్తాయి. ఇదొక రకమైన వాక్చ మత్కృతి. ఆధునిక కాలంలో హాస్యాన్ని పండించడానికి ఒక వినూత్న అవకాశం ఏర్ప డింది. ఈనాడు కొన్ని గంటలలో దినపత్రికలను ముద్రించవలసి ఉండటంతో ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా,సహజంగా జరిగే పొరపాట్లు మనకుచక్కని హాస్యాన్ని పండిస్తాయి.

'విశాల బ్యాంక్ లో పరపతి సౌకర్యం కల్పించబడును' అన్నది పతాక శీర్షిక. కంపోజర్ పొరపాటున 'పరపతి'కి బదులు 'పరసతి' అని ముద్రించాడు! ఆ ప్రెస్ యజమాను రాలు అందమైన యువతి. కంపోజర్‌వైపు తీక్షణంగా చూస్తూ " నీ ఆలోచనలు ఎప్పుడూ ఇలాంటి వక్రమార్గానే నడుస్తాయేమయ్యా! అందుకే నీ చూపు ఎప్పుడూ 'సతి' పైనే ఉంటుంది" అని చివాట్లు పెట్టడంతో ఆ కంపోజర్ నిశ్చేష్టుడయ్యాడు. వెంటనే తేరుకొని “మేడమ్! మీ చూపు ఎప్పుడూ 'పతి' పైనే ఉంటుందా?” అనడంతో ఆ పదంలోని విరుపు ఆమెకు అర్థమైంది!

"Minister for Irrigation" కంపోజర్ పుణ్య మా అని "Minister for Irritation" అయ్యారు అని 'పద్మశ్రీ' తుర్లపాటి కుటుంబరావు గారు ఒక ప్రసంగంలో ఉదహరిస్తూ నవ్వించారు. "క్షామ పీడితులకు విశేష సహాయం ” అన్న పతాక శీర్షిక ముద్రణా రాక్షసం మూలంగా “కామ పీడితులకు విశేష సహాయం” అయి పాఠకులకు ఖర్చు లేకుండా చక్కని హాస్యాన్ని అందించింది. ఒక పత్రికలో “ఒకానొక కేంద్రం... ప్రారంభోత్సవానికి అందరూ ఆహ్వానితులే” అన్న ఆహ్వానంలో 'ప్రా' ఎగిరిపోవడంతో అది ఏమైందో చూడండి! 'మధ్యాహ్న పథకం' అచ్చులో 'మిధ్యాన్న పథకం'గా మారితే ఆచరణలో అది పనిచేసే తీరుకు దర్పణం పడుతూ నవ్వులు కురిపిస్తుంది కదూ!

మరో ఉదాహరణ “రాజశేఖర్ రెడ్డి, కె.రోశయ్య, చంద్రబాబు నాయుడు ప్రభృతులు సామాజిక రుగ్మతల గురించి నాటి సభలో అద్భుతంగా ప్రసంగించారు”. అయితే, ప్రింటింగ్

---

క్షుద్ర విజయాలకే మనం విరగబడి నవ్వుతాము. – పాల్ కారస్

లో 'ప్రసం గించారు' కాస్తా 'ప్రసవించారు'గా రూపాంతరం చెందితే ఎలా ఉంటుంది? ఒక పదంలోని అక్షరాలను మనఃపూర్వకంగా తారుమారు చేస్తే వాక్చమత్కృతి అవుతుంది. ఆ అక్షరాలు ప్రింటులో వాటంతట అవే మారిపోతే ఏమవుతుంది?

ఇప్పుడు ఆంగ్లంలో ఒక ఉదాహరణ తీసుకుందాం. "Opportunities for Dead Children" అని ఒక ఆంగ్ల పత్రిక ప్రచురించిన వార్తను చూసిన ప్రతి పాఠకుడు "పరలోకంలోగల సౌకర్యాల గురించి ఈ పత్రికా విలేకరికి ఎలా తెలిసిందబ్బా!" అని ముక్కున వేలేసుకున్నాడు. చివరకు అది 'Dead Children' కాదు, 'Deaf Children' అని తేలడంతో కథ మరింత రక్తి కట్టింది.

3. పరోక్ష రూపకల్పన: ద్వంద్వార్థాలు, పరోక్షంగా, వ్యంగ్యంగా ఉదహరించడం, ఒకే పదాన్ని ఒకరు శాబ్దిక అర్థంలో, మరొకరు అలంకారికంగా అర్థం చేసుకోవడం ఇందుకు ఉదాహరణలు. మార్క్ ట్వెయిన్, ఆయన మిత్రులు కలసి ఒక ప్రదర్శనశా లకు వెళ్ళగా, అక్కడ గైడ్ వారికి మృతదేహం (Mummy) చూపిస్తూ "అయ్యా! ఇది మమ్మీ! మమ్మీ!" అన్నాడు. ఆ బృందంలో ఒక మిత్రుడు "అయ్యా! ఈ పెద్దమనిషి పేరేమిటన్నారు?" అని ప్రశ్నించాడు. "అది మమ్మీ అండి" అని గైడ్ అనడంతో అతను "అవునా! అది ఇక్కడే పుట్టిందా?" అని ప్రశ్నించాడు. "లేదండి. ఇది ఈజిప్టు దేశపు మమ్మీ" అన్నాడు ఆ గైడ్.

ఇక్కడ ప్రధానంగా అవగాహనా లోపం మూలంగా ఒక పదం అర్థంతో ఆటలాడారు. అలానే, భోజనం చేస్తూ 'సైంధవం' తెమ్మంటే, 'గుర్రం' తెస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి!

4. విచారణాంశం : ఇది ప్రధానంగా ఒక అంశానికి, కాలానికి ప్రాధాన్య ఇస్తుంది. గత రాజకీయ నాయకులకు, గత సంఘటనలకు సంబంధించిన హాస్యోక్తులు ఆ నాయకులు, ఆనాటి చరిత్ర తెలిసినవారికేగాని, అందరకు అర్థంకావుగదా!

సామ్యవాద వ్యవస్థకు, పెట్టుబడిదారీ వ్యవస్థకు మధ్య పొంతన కుదరదు. అవి రెండూ రెండు ధ్రువాల వంటివి. ఒక పర్యాయం అమెరికాకు చెందిన పత్రికా విలేకరి ఆనాటి చైనా ప్రధాని చౌ ఎన్ లేని కలిశాడు.

"రెండవ ప్రపంచ యుద్ధకాలంనాటికి, ఇప్పటికి మీ దేశం ఎంతో మారింది" అన్నాడు విలేకరి. కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చాక దేశం ఎంతో ప్రగతి పథంలో నడిచిందని ఆయన చెబుతాడన్న భావంతో "మీరు ఎలాంటి తేడాను గమనించారు?" అని ఉత్సాహంగా ప్రశ్నించాడు చౌ ఎన్ లే. "ఆనాడు అందరి ముఖాలలో చిరునవ్వులు చిందేవి.

---

ఎందువల్లనోగాని.....ఈనాడు మీ దేశంలో ఆ నవ్వులు కరువయ్యాయి" అన్నాడు ఆ రిపోర్టర్ చప్పరిస్తూ. ఆ మాటలు విన్న ప్రధాని ముందు నిర్ఘాంతపోయినా, వెంటనే తేరుకొని "బాగుందండి....మంచి పరిశీలన చేశారు. గతంలో సగటు చైనీయుని జీవితం దుర్భరంగా ఉండటంతో, ఆ కష్టాల కడలి నుండి బయటపడటానికి వారికి హాస్యం ఒక చక్కని సాధనంలా ఉపయోగపడింది. మరి.....ఈనాడు పరిస్థితులు పూర్తిగా మారాయి. ఇప్పుడు మాకు కృత్రిమ ఆనందంతో, ప్లాస్టిక్ నవ్వులతో అవసరం లేదు. చక్కగా ఎవరి పనులు వారు చేసుకుంటూ హాయిగా జీవితాన్ని గడపడం మా ప్రజలు నేర్చుకున్నారు" అన్నాడు. ఆ సమాధానంలోని గడుసుతనం తెలిసిన ఆ ఇద్దరూ గట్టిగా ప్లాస్టిక్ నవ్వులు నవ్వుకున్నారు!

సమాధులు బాడుగకు ఇప్పుడు ఫ్లోరెన్సు నగరంలోని ప్రముఖుల సమాధుల గురించి మార్క్ ట్వెయిన్ వర్ణనను పరికిద్దాం. "శాంత క్రాస్ చర్చిలో డాంటే సమాధిని తిలకించాం. అయితే, ఆ సమాధిలో ఆయన శరీరం లేదని తెలుసుకొని ఆనందించాం. ఆ మేధావిని బహిష్కరించి, చిత్రహింసలకు గురిచేసిన ఆ విశ్వాసఘాతుక నగరం అతని దేహాన్ని అక్కడ సమాధి చేసి గొప్ప గౌరవం తెచ్చుకుంటుందని మనం విశ్వసించనవసరంలేదు. మేము శాంత క్రాస్ కు తరచుగా వెళ్ళి మైకెలాంజిలో, రాఫెల్, మాకియవెల్లి మొదలైన మహనీయుల సమాధుల ముందు కూర్చొని కన్నీళ్ళు కార్చేవాళ్ళం. ఆ ప్రముఖులను అక్కడే సమాధి చేశారని నా భావన. అయితే, ఇటలీ దేశం ఆచారం ప్రకారం ఎవరైనా తమ సమాధులను ఇతరులకు బాడుగకు ఇచ్చి వారు మాత్రం ఇతర ప్రదేశాలలో నివసిస్తూ ఉండవచ్చు!"

ఇంక దీనిని వివరంగా పరిశీలిద్దాం. సమాధిలో శరీరం లేదన్న యదార్థాన్ని తెలుసుకోవడం ద్వారా ఆనందం కలుగుతుందనుకోవడం మూర్ఖత్వం, అర్థరహితం అయితే, మరణించిన వ్యక్తులు తమ సమాధులను అద్దెకిస్తారనడం అంతకన్నా మూర్ఖత్వం అవుతుంది. సమాధిని మాత్రం నగరంలోనే ఉంచి, డాంటేని అక్కడ నుండి నెట్టివేసిన ప్రముఖులు ఇతర ప్రదేశాలలో నివసిస్తారనడం మరొక అర్థరాహిత్యం .

ఇవాన్ : పాట్! ఈమధ్య ములిగినను చూశావా?

పాట్ : వెల్! నేను కలిశాను......లేదు లేదు....కలవలేదు.

ఇవాన్ : నువ్వేమి చెబుతున్నావో నాకు అర్థమవడం లేదు పాట్!

పాట్ : బాగుంది! అయితే విను. నేను అచ్చం ములిగలాంటి వ్యక్తినే చూశా. ఆయన కూడా నాలాంటి వ్యక్తినే చూశాడట! తీరా....ఆరా తీస్తే ఆ ఇద్దరిలో మేమెవరిమీ కాదని తేలింది!

---

మనిషి నవ్వు దైవాన్ని సంతృప్తిపరుస్తుంది. – జాన్ వైజ్

ఇక్కడ నిరర్థకమైన, మూర్ఖపు విషయాలను అంతకన్నా అర్థరహితమైన, మూర్ఖమైన అంశాలతో వివరించడంతో హాస్యం జనించింది. ఇందులోని అర్థరాహిత్యం మనకు దిగ్రమ కలిగిస్తుంది. దాని అర్థం తెలుసుకోవడానికి మనం ఎంత తార్కికంగా ఆలోచించినా అందులోని అర్థరాహిత్యం కొట్టివేస్తుంది!

ఇంక ఆమాయక హాస్యోక్తులలోకి వద్దాం. అమాయక హాస్యోక్తి అంటే ఇతరులెవరి పైనా గురి పెట్టకుండా, తన పైన తానే గురి పెట్టుకునే హాస్యోక్తి. ఈ అంశం పై మరింత వివరంగా ఆలోచించేముందు అమాయక, ఉద్దేశ్యపూర్వక హాస్యోక్తులలో విమర్శనాత్మక తర్కం పాత్ర గురించి తెలుసుకోవాలి. బిడ్డ తన తల్లి పలికే మాటలను వాటి అర్థాలతో సంబంధం లేకుండా అనుకరిస్తూ పలకడంతో, ఆ పలుకులు పెద్దలకు ఎంత ముద్దుగా కన్పిస్తాయో అందరకూ తెలిసిందే.

అర్థరాహిత్యంలో కూడా కొంత అర్థం ఉన్నప్పుడే దానికొక గుర్తింపు ఉంటుంది. పసివానిలోని ఆనందం విమర్శనాత్మక అవరోధాన్ని ఎదుర్కొన్నప్పుడు అతనిలో ఆ ఆనందానుభూతికి ప్రత్యామ్నాయాన్ని పెద్దలు కనుగొనాలి. ఆ ప్రత్యామ్నాయమే హాస్యోక్తి. అర్థరాహిత్యంలో అర్థాన్ని ఇరికించడమే దాని ప్రక్రియ. ఆ విధంగా అర్థం (మేధాసంబంధమైన ఆలోచన) అర్థరాహిత్యం (రూపం) నుండి జనించినప్పుడు అమాయక హాస్యోక్తి దర్శనమిస్తుంది. ఈ హాస్యోక్తిలో హాస్య ప్రక్రియలన్నీ కన్పిస్తాయి.

ఇప్పుడు మార్క్ ట్వెయిన్ పేర్కొన్న ఒక ఉదంతాన్ని చూద్దాం. ఆ యువకుడు ఒక అమాయక తక్రవర్తి. మిత్రుడు అతనికి ఒక కొండను చూపించి, దాని ఎత్తు 800 అడుగులు, పొడవు 1100 అడుగులు అని, దానిగుండా ఒక పెద్ద సొరంగం - 2000 అడుగుల పొడవు, 1000 అడుగుల వెడల్పుతో - ఆ కొండ ఈ మూలనుండి ఆ మూలదాకా పోతుందని చెప్పాడు. అతను అది నిజంగా నిజమని నమ్మాడు!

ఇక్కడ హాస్యోక్తిని, దాని అంతస్సూచనలను అవగాహన చేసుకోడానికి మానసిక శక్తిని ఉపయోగిస్తాం. కొండను మించిన సొరంగాన్ని సృష్టించి, అది కొండకు ఆ చివరనుండి ఈ చివరిదాకా పోతుందనడం ఏమాత్రం పరిజ్ఞానం ఉన్నవారికైనా విడ్డూరంగానే కన్పిస్తుంది. ఆ లక్షణాలుగల దానిని సొరంగం అనడం కూడా అర్థరహితం. ఆ కట్టుకథను విశ్వసిస్తారనుకోవడం మరొక కాకమ్మకథ అవుతుంది. అయితే.... ఇందులో అవసరానికి సరిపడిన అర్థం ఉందన్న తృప్తి కలుగుతుంది. మన  కథానాయకునికి చదువుగాని, లోకజ్ఞానంగాని లేదు కనుక అది అతనికి అర్థరాహిత్యం క్రిందకు రాదు. ఆయన దానిని

---

ప్రగతికి కూర్పువంటిది నవ్వు. – బెర్నార్డ్ షా

పూర్తిగా విశ్వసిస్తాడు. ఈ విధంగా హాస్యోక్తి విమర్శ నాత్మక తీర్పును మనిషి మెదడు నుండి తోసివేస్తుంది.

విశ్వకవి రవీంద్రుడు చెప్పినట్లుగా హాస్యోక్తిలో పిసరంత యదార్థం ఉన్నా ప్రజలు నిరసన తెలుపుతారు. అంతా సశాస్త్రీయంగా, సాధికారికంగా కావాలంటే అది శాస్త్రం అవుతుందిగాని హాస్యం అని ఎలా అనిపించుకుంటుంది? అందుకే అమాయక హాస్యోక్తులను విన్నవారెవ్వరూ పగలబడి నవ్వరు. తృప్తి చెందిన భావన, చిన్న చిరునవ్వు వారిలో స్పష్టంగా కన్పిస్తాయి. అయితే, ఉద్దేశ్యపూర్వకంగా విసిరిన హాస్యోక్తులు మనల్ని హాస్య సముద్రంలోకి తోసివేస్తాయి కనుక పగలబడి నవ్వుతాము. అంటే హాస్యోక్తిని ఆనందించడానికి మనలో గూడుకట్టుకున్న కసి ఒక కారణం కనుక పగలబడి నవ్వుతాము. ఉద్దేశ్యపూర్వక హాస్యోక్తులనిండా ఆనందం నిండివుంటుంది. వైరిభావంతో చెప్పిన హాస్యోక్తులు కూడా దీని క్రిందకు వస్తాయి.

మనిషి తనప్రత్యేకతకు పదిమందిలో  చాటుకోవడం మానవనైజం. దశాబ్దాలుగా విదేశీయులకు ఆసక్తిగొల్పే విషయాలను చూపుతూ, వారి ఆశ్చర్యాన్ని, పారవశ్యాన్ని తిలకిస్తూ ఆనందించడానికి అలవాటుపడిన ఆ గైడ్ తన వృత్తిని ఒక అవకాశంగా, ప్రత్యేక అధికారంగా భావించడం సహజం. యదార్థాన్ని తెలుసుకోవడంలో ఆటంకాలు అడ్డుగా నిలుస్తాయనుకున్నప్పుడు హాస్యోక్తి, ఎగతాళి ద్వారా ఆనందం పొందుతాము. మనకు అడ్డుగా నిలిచినదానిని ఎదుర్కో వడంలోను, మనలోని పశుబుద్ధిని (అంతః ప్రేరణను) తృప్తి పరచడంలోను హాస్యోక్తి తోడ్పడుతుంది. అలానే, ట్వెయిన్ మిత్రులు కూడా గైడ్ ను ఆటపట్టించడంలో ఆనందం పొందారు.

ఎత్తిపొడుపు : ఎత్తిపొడుపు ప్రతికూల హాస్యోక్తిలాంటిది. ఇదొక అపహాస్యం. ఇదెంతో కటువుగా ఉంటుంది. మార్క్ ట్వెయిన్ ఎత్తిపొడుపుకు పెట్టింది పేరు. కాన్స్టాంట్ నోపి లోని వ్యాపారులు అవిశ్రాంతంగా శ్రమించి, టక్కుటమార విద్యలైన అబద్ధాలాడటం, మోసం చేయడం మొదలగు రంగాలలో ఎంత ప్రావీణ్యం సంపాదిం చారో, తాము ప్రశంసించే వ్యక్తిని అంత గొప్పగా "ఓహ్! ఆయన మనోహరమైన మోసగాడు" అనో, "మనోరంజకుడైన అబద్ధాలకోరు" అనో అభివర్ణిస్తారు అని పేర్కొన్నాడు. ఇక్కడ అణచి పెట్టబడిన వైరం కన్పిస్తుంది. బహిరంగంగా గొప్ప విలువలను ప్రకటిస్తూ దానికి భిన్నంగా వ్యవహరించేవారిని ఎండగట్టడమే మార్క్ ట్వెయిన్ లక్ష్యం. అలాంటివారికి నైతికత అంటూ

---

నువ్వు జోక్స్ ను సృష్టిస్తే, నేను వాటిని తిలకిస్తా. – జి.కె. చెస్టర్ టన్

ఏదీ ఉండదని ఎద్దేవా చేశాడు; వారు నాగరికులుగా ఉండటానికి అనర్హులని తూర్పారబట్టాడు. ఈ విధంగా ఉద్దేశ్యపూర్వక హాస్యోక్తులు కడుపుబ్బ నవ్వు తెప్పిస్తాయి.

అందుకే ఇంక మనం హాస్య దృక్పథం గురించి తెలుసుకుందాం.

---

నవ్వుతూ ఆనందంగా జీవించండి. –జాన్ మేస్ ఫీల్డ్

అధ్యాయం 8

# హాస్యం – దృక్పథం

ఒక పెద్ద తుఫాను వచ్చి ఎన్నో ఇళ్ళు కొట్టుకుపోయాయి. మొదటి అంతస్తులో ఉండే ఒకామె "ఇక్కడనుండి మారడం ఎలాగూ తప్పదు....... ఎటొచ్చీ మనం వస్తువులను ప్యాక్ చేసుకునే పనిలేకుండా పోయింది" అని నవ్వుకుంది.

దీనినే మరొక రచయిత "ఏ సమస్యకూ బహుమతి లేకుండా పోదు. మనకు బహుమతులు కావాలంటే సమస్యలు కోరుకోవాల్సిందే" అన్నాడు. అననుకూలత నుండి అనుకూలతను పొందడం అన్నది ఒక పాఠం. మనం పాఠం పైన (బహుమతి పైన) దృష్టిని సారించాలేకాని, నష్టాలను గురించి యోచించకూడదు. -

దృక్పథం : హాస్యం అన్నది ఒక దృక్పథం (Attitude), అదొక దృష్టి మార్గం, దృష్టి భావం, అదొక వైఖరి, ఒక కళ. దానిని అభివృద్ధిపరచుకుంటే ప్రతి సంఘటననూ ఆనందించగలుగుతాము. ఎటొచ్చీ ఆ దృక్పథాన్ని మనం ఎలా అలవరచుకోవాలన్నదే ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానం తెలుసుకునే ముందు దృక్పథం స్వరూపాన్ని, స్వభావాన్ని పరిశీలిద్దాం

. మానవ జీవితంలో దృక్పథం ప్రధాన పాత్ర వహిస్తుంది. రాజభోగాలను అనుభవిస్తూ నే కొందరు అశాంతికి లోనవుతుంటే, అష్టకష్టాలను భరిస్తూనే కొందరు ఆనందాను భూతిని పొందుతారు. మనం ఉపయోగించే కంటి అద్దాల రంగునుబట్టి మన చూపు మారుతుంది. నల్ల కళ్ళద్దాలు ధరించేవానికి అంతా చీకటిగా ఉన్నట్లు కన్పిస్తే, గులాబి అద్దాలు ధరించేవానికి అంతా ముస్తాబైనట్లుగా, అందంగా దర్శనమిస్తుంది. పరిసరాలకు, పరిస్థితులకు తలవంచి కొందరు నిరంతరం ఆవేదనలకు, ఆక్రందనలకు గురవుతుంటే, మరికొందరు ఆ బాధాకర పరిస్థితుల పైన కళ్ళాపినీళ్ళు చల్లి, చక్కగా రంగవల్లులు పెట్టి గొబ్బెమ్మలతో అలంకరించి ఆనందిస్తుంటారు.

ఒక గొప్ప శిల్పకళానిలయ నిర్మాణం జరుగుతున్న ప్రదేశానికి ఓ కథా రచయిత వెళ్ళి అక్కడ పనిచేస్తున్న కూలీని "అయ్యా! ఏమి చేస్తున్నావు?" అని అడిగాడు. అందుకు ఆ కూలీ చిరాకుగా "నేను ఏమి చేస్తుందీ కనబడటంలేదా? పనికిమాలిన పరికరాలతో ఈ బండరాళ్ళకు ఒక ఆకృతిని తేలేక చచ్చిపోతున్నా. మా మేస్త్రీ చెప్పినట్లు చెయ్యడమే నా పని" అన్నాడు. ఆయన రెండవ కూలీ వద్దకు వెళ్ళి అదే ప్రశ్న వేయగా, ఆ కూలీ "యజమాని ఇచ్చిన ప్లాన్ ప్రకారం ఈ రాళ్ళకు ఒక ఆకృతిని తెచ్చి వాటిని వరుసగా పేర్చడం నా పని.

---

నవ్వు భౌతికం. దాని కారణాలలో ఒకటి హాస్యం. – సుసాన్ లాన్ గర్

ఇది కష్టమైన పని. ఇదే పనిని మరల మరల చేస్తుండాలి. దీనికి నాకు రోజూ కొంత కూలి ఇస్తారు. నా భార్యాబిడ్డలను పోషించడానికి ఇది అవసరం. ఇదే లేకుంటే నా పని ఏమౌతుందో!" అన్నాడు బాధగా. ఆ సమాధానంతో కొద్దిగా ఉత్సాహపడిన ఆ రచయిత మూడవ కూలీ వద్దకు వెళ్ళి "బాబూ! ఏమి చేస్తున్నావు?" అని అడుగగా, ఆ కూలీ ఆకాశంవైపుకు నిటారుగా చెయ్యి ఎత్తిచూపుతూ "చాలా పెద్ద ఆలయాన్ని కడుతున్నా" అన్నాడు ఆనందంగా.

ఒకే పని చేసేవారిలో ఒకరికి ఆనందం, మరొకరికి తృప్తి, ఇంకొకరికి విషాదం అంటే ఇదేనేమో! జరిగే సంఘటనలను మనం నియంత్రించలేకపోయినప్పటికీ, వాటిని వీక్షించే పద్ధతిలో మనకు సంపూర్ణంగా స్వాతంత్ర్యం ఉంటుంది. ప్రతి పనిలో కొందరు కష్టాలను, నష్టాలను, బాధలను మాత్రమే చూస్తే, మరికొందరు అదే సంఘటనలో హాస్యాన్ని, ఆనందాన్ని పొందుతూ నవ్వుకుంటారు.

జార్జి బెర్నార్డ్ షా ఒక రోజు అమెరికాలో ప్రసంగిస్తూ "అమెరికాలో 50 శాతం మంది అజ్ఞానులే" అనడంతో సభలో కలకలం ప్రారంభమైంది. వెంటనే తేరుకున్న షా జరిగిన పొరపాటుకు చింతిస్తూ "అమెరికాలో సగంమంది మేధావులే" అని ప్రశంసించడంతో అందరూ సంతృప్తిగా చప్పట్లు కొట్టారు.

దృక్పథం అంటే ఇదే. విషయాన్నిగాక, దాన్ని చూసే దృక్కోణానికి ప్రాధాన్యం ఇవ్వాలన్నది దీని సారాంశం. ఒక ప్రదేశంలో ఆస్కార్ వైల్డ్ నాటక ప్రదర్శన జరుగుతుండగా, ఆయన మిత్రుడొకడు వైల్డ్‌ను "నాటక ప్రదర్శన ఎలా ఉంది?" అని అడిగాడు. అందుకు ఆ రచయిత నవ్వుతూ "ఓ...నాటకానికేం...అది బ్రహ్మాండంగా ఉంది. ఎటొచ్చీ ప్రేక్షకులే....అంత ఉత్సాహంగా.... లేరు" అన్నాడు.

అకుంఠిత ఆత్మవిశ్వాసం : హాస్యకారునిలోని మర్మాన్ని బహిర్గతపరచడంలో ఫ్రాయిడ్ గావించిన కృషి అనన్యసామాన్యమైనది. ఉరిశిక్షకు గురిఅవుతూ కూడా ఎలాంటి మనోవేదనకు, విషాదానికి గురికాకపోవడమేగాక, హాస్యం ఆధారంగా ఆ తీవ్ర ఒత్తిడి నుండి నైతికావేశం పొందుతూ ఉద్ధరింపబడాలన్నదే ఫ్రాయిడ్ సిద్ధాంత సారాంశం.

కొందరు తమ హాస్య ప్రవృత్తిని ఇతరుల పై ప్రదర్శించి ఆనందిస్తే, మరికొందరు దానిని తమ పైనే ప్రయోగించుకొని ఆనందిస్తారు. అయితే, హాస్యాభిమానులు మాత్రం ఇరువర్గాలలోని చోద్యాన్ని తిలకించి ఒకేరకమైన ఆనందానుభూతిని పొందుతారు. మరి ఈ ఆనందానికి కారణం ఏమిటి? అహం (ego) పొందిన విజయం , ఆనంద సూత్రం,

---

నేను ఏడ్వలేను కనుక నవ్వుతున్నాను. – బుమార్కెస్

ప్రతికూల పరిస్థితులలో కూడా వ్యధలకు ఏమాత్రం తలవంచని ఆత్మసై ర్యం, మొక్కవోని ఆత్మాభిమానమే అన్నది ఫ్రాయిడ్ సిద్ధాంతం. ఆ వైఖరి పరిస్థితుల తీవ్రతను తగ్గించలేదన్నది యదార్థమే. అయితే, ఆ సంకట పరిస్థితులను వినోదంగా, క్రీడాధోరణిలో స్వీకరించగలగడంలో దాని ప్రత్యేకత ఇమిడి ఉంది అంటారు ఆయన.

మన కష్టాలను చూసి మనం నవ్వినంత మాత్రాన అవి దూరమవుతాయని అర్థం కాదు. మన సమస్యలకు, మనకు మధ్య కొంత దూరం ఉంచాలన్నదే మన ప్రయత్నం కావాలి. ప్రతి చిన్న సమస్యను ఒక విపత్తుగా. దురదృష్టంగా భావిస్తూ బెంబేలెత్తి పోకూడదు. ఆవు గడ్డిని వెతుకుతూ పోతుంది. వరుసగా నాలుగైదు ఎండిన చెట్లను చూసి అది ఆందోళన చెందదు. అలా అది గడ్డి దొరికిందాకా ముందుకు సాగిపోతూంది. మానవుడు జంతువులనుండి నేర్చుకోవలసిన పాఠం ఇదే. అమెరికాకు చెందిన మనోవిజ్ఞాన శాస్త్రవేత్త ఎమెట్ మిల్లర్ “బాధలు పడనిదే మానవాళికి బాధ్యతలు తెలియవు. ఏ సమస్యలూ లేకుండా గారాబాల బిడ్డలుగా ఎదిగినవారు నిష్ప్రయోజకులుగా మారతారని అనుభవపూర్వకంగా తెలుసుకున్నా” అన్నారు.

జీసస్, సోక్రటీస్ వంటి ఎందరో మహాశయులు ధైర్యంగా నియంతృత్వాన్ని, నాటి పాలకులను ఎదుర్కోవడంవల్లనే ప్రజాస్వామ్య వ్యవస్థ బలపడిందన్నది చారిత్రక సత్యం. ఆ మహనీయులెవ్వరూ అధికారానికై అర్రులు చాచలేదు, బెదిరింపులకు తలొగ్గలేదు. ఆవిధంగ,అననుకూల పరిస్థితులను అనుకూలంగా మార్చుకోవడంలోనే మన విజయం, నైపుణ్యం కన్పిస్తాయి.

నవ్వును ఏడిపిస్తే ... హాస్య దృక్పథాన్ని పెంపొందించుకోడానికి మార్గాలను అన్వేషించబోయే ముందుగా ఒక ఉదంతాన్ని చూద్దాం. మన కథానాయకుడు సాగర్. నాయిక ఆయన భార్య లలిత. సానుకూల ఆలోచనలు అంటేనే ఎరుగని సాగర్ ప్రతి పనిలో తప్పులెన్నడం తన వృత్తిగా, ప్రవృత్తిగా స్వీకరించాడు. లలిత ఇడ్లీ చేసి పెడితే " దోసె అయితే బాగుండేది కదా” అంటూ పైకి చూస్తాడు. బ్రెడ్ ను కాల్చి పెడితే “ప్లెయిన్ గా ఉంటే రుచిగా ఉండేదే” అని, కోడిగుడ్లు ఉడకబెట్టి ఇస్తే “ఫ్రై అయితే భేషుగ్గా ఉండేది కదా!” అంటూ నస పెడతాడు. సార్థకనామధేయురాలైన లలిత ఎంతో ఓపికతో భర్త సణుగుడును భరించేది. ఒకరోజు ఆమె తెలివిగా ఒక గుడ్డును వండి, మరొక గుడ్డును ఫ్రై చేసి అతని ప్లేట్లో వడ్డించి, అతని మెప్పుకై ఆశగా, ఆత్రుతగా ఎదురుచూసింది. సాగర్ ఆ రెండు గుడ్లను అటు ఇటు చూస్తూ "లలితా! నువ్వు ఒక పొరపాటు చేశావు. వండిన గుడ్డును కనుక ఫ్రై చేసి ఉంటే

---

మనలోని నీచత్వానికి, కురూపితనానికి ఆటపట్టు నవ్వు. – సిసిరో

ఎంతో బాగుండేది" అనడంతో ఆమె విస్తుపోయింది! నవ్వును కూడా ఏడిపించగల సమర్థులైన ఇలాంటి వ్యక్తులు జీవితంలో అరుదుగా కన్పిస్తారు. అలాంటివారు నిజానికి జడ పదార్థాల క్రిందకు వస్తారు. కనుక మనం' సగటు మనుషుల కోసమే మార్గాలను అన్వేషిద్దాం.

చక్కని మార్గాలు - సులువైన పద్ధతులు :

1. సానుకూల దృక్పథం : ఒక గ్లాసులో సగం నీరు ఉంటే, నిరాశావాది ఖాళీగా ఉన్న భాగాన్నే చూడగా, ఆశావాది నీరు ఉన్న భాగాన్నే చూసి ఆనందిస్తాడు. సానుకూల దృక్పథం అంటే ఇదే! అందుకే ఎప్పుడూ సానుకూలంగానే ఆలోచించు. మన ఊహలే మన సామ్రాజ్యాధినేతలు. కనుక నిరంతరం ఉన్నతంగా ఆలోచిస్తే నిక్కచ్చిగా ఉన్నతంగా ఎదగగలము. మనస్ఫూర్తిగా విశ్వసించింది కార్యరూపం ధరిస్తుంది. "యద్భావం తద్భవతి" అని మన పెద్దలు ఏనాడో చెప్పారు. నెపోలియన్ హిల్ తన ప్రముఖ రచనలలో ఒకదానికి 'ఆలోచించు-సంపన్నంగా ఎదుగు' (Think and Grow Rich) అని నామకరణం చేశారు. సానుకూల దృక్పథాన్ని అలవరచుకోడానికి మనం కొంత కృషి చేయాలి. ఉదయం నుండి సాయంత్రం వరకు మనకు నవ్వు తెప్పించిన విషయాలను ప్రతిరోజు ఒక నోట్‌బుక్ పై వ్రాసుకుంటూ వారం అయిన తరువాత ఒకరోజు ఆ హాస్యగుళికలను చదువుతూ ఆనందించడం ఒక మంచి ఆచారం.

2. కలలు కనండి : ప్రతి వ్యక్తి కలలు కనాలి. భవిష్యత్తు ఎలా ఉండాలని ఊహిస్తావో, ఎలాంటి భార్య, పిల్లలు, ఇల్లు కావాలని కోరుకుంటావో.....అలాంటి ఆలోచనలన్నింటిని చక్కగా ఒక నోట్‌బుక్ పై ప్రతిరోజు వ్రాయాలి. నీకు నచ్చిన కార్టూన్లు, హాస్య చిత్రాలను గదిలో ఉంచుకొని ఆనందించడం మరొక మంచి ప్రయత్నం.

3. ఊహలకు మనోరూపం : మనసులో మెదిలే మధురమైన ఆలోచనలకు ఒక చక్కని మనోరూపాన్ని కలిగించి, సాకారంగా మార్చుకోగలగాలి. ఒక ఉద్యానవనంలో విహరిస్తున్నట్లుగా ఆలోచించారనుకోండి. అక్కడ ఎన్నో చెట్లు, రకరకాల పుష్పాలు ఉన్నట్లుగా, అవి సువాసనలు వెదజల్లుతున్నట్లుగా ఒక సుమనోహర దృశ్యాన్ని ఊహించుకోవాలి. అంతేకాదు. ఆ తోటలో చల్లని పిల్లవాయువులు వీస్తున్నట్లుగాను, అందమైన పుష్పాల సువాసనలను ఆ పిల్లతెమ్మెరలు మోసుకొస్తున్నట్లుగాను భావిస్తూ, ఆ వాసనలతో పులకించగలిగితే ఇంక ఊహలకు మనోరూపం కలిగించినట్లే! అలానే ప్రతిరోజు "నేను నవ్వాలి, ఆనందించాలి" అనుకోవాలి. శ్వాస పైన ధ్యాస ఉంచుతూ మధురాతి మధురమైన గాలిని పీల్చుతున్నట్లు, అందమైన భావాలు లోపలికి వెళ్తున్నట్లు, అవి ఎంతో

---

నవ్వు రాక్షస లక్షణం, పతనమైన మానవాళికి చిహ్నం. – బడెలైర్

ఆనందాన్ని కలిగిస్తున్నట్లు, శరీరంలోని ప్రతి భాగం స్పందిస్తున్నట్లు ఒక్కమారు నిజంగా - మనస్ఫూర్తిగా - సానుకూలంగా ఊహించగలిగితే అద్భుతమైన ఫలితాలు లభిస్తాయి, అందమైన అనుభూతులు కలుగుతాయి.

4. జ్ఞాపికలు పదిలపరచుకోవాలి : జ్ఞాపికలు మనకు ఊతంగా నిలబడే గొప్ప శక్తి సాధనాలు. అందమైన పరిసరాలు, అలంకారపూరితమైన సన్నివేశాలు మనకు ఆనందం కల్పించినట్లుగానే బాధాకరమైన పరిస్థితులు, భయానక దృశ్యాలు భీతిని కలిగిస్తాయి. బ్రిటన్లోని ఒక కళాశాల ఇదే అంశంపై పరిశోధన జరిపి, హాస్య వాతావరణంలో నివసించేవారు ఆనందంగా జీవిస్తారని తేల్చిచెప్పింది. హత్యలు, మోసాలు, కొట్లాటలు మొదలగు గందరగోళాలనుండి మనిషికి ఉపశమనం కలిగించగలిగే శక్తిని మనం సృష్టించుకోవాలి. అందుకే జోక్స్, కార్టూన్ల పుస్తకాలను తరచూ చూస్తూ మన మనస్సును హాస్యోక్తులతో నింపుకోవాలి. బాధాకర సన్నివేశాలలో ఆ హాస్యపురవ్వలను జ్ఞప్తికి తెచ్చుకొని ఆనందించడం నేర్చుకోవాలి.

5. సృజనాత్మకత: ఊహకు ఊతమిస్తే చిత్రమైన అంశాలనెన్నింటినో మనం సృష్టించవచ్చు. కష్టాల కడలిలో కూడా వాటిని చూసి మనం నవ్వుకోవచ్చు. మిత్రునికి తెలియకుండా అతని చొక్కా పై 'నేను డబ్బాను' అని, ఇంకొకడి వీపుమీద 'దడిగాడు వానసిరా' అని (తిప్పి చదివితే 'రాసినవాడు గాడిద'), - ఇలాంటి చిత్ర విచిత్ర వాక్యాలు వ్రాసినట్లు ఆనందించవచ్చు. మా మిత్రుడు సుబ్బారావు తన జేబులో ఎప్పుడూ గద్దముక్కుగల బొమ్మను అట్టిపెట్టుకుని. స్నేహితు లెవరైనా తనను గట్టిగా తిట్టినప్పుడు జేబులో బొమ్మను జేజేల బొమ్మగా చూసుకుంటూ నవ్వుకునేవాడు.

6. అందమైన సూక్తులు సేకరించు : “ఈ ఇంటికి నేను యజమానిని. అలా చెప్పడానికి మా ఆవిడ అనుమతి నాకు ఉంది” అని ఒక ఇంట్లో బోర్డు. ఒక హోటల్ యజమాని తన హోటల్ లో ఇలా వ్రాశాడు - "కాఫీ కప్పులలో సిగరెట్ పొడిని వేయడం మీకు అలవాటైతే మేము ఆపలేము. అయితే, యాష్ ట్రేలో కాఫీ ఇచ్చే మా సర్వర్ను మాత్రం మీరు కోపగించుకోకండి!” ఒక మంచి ఫొటో స్టూడియోకి వెళ్ళి చిన్నారుల ఫొటోలను చూడండి. ఎన్ని చిత్రమైన ఫోజులు, వింతైన హావభావాలు కన్పిస్తాయో! అలానే దినపత్రికలలో, వారపత్రికలలో మీకు నచ్చిన కార్టూన్లు, చిన్నపిల్లల చిత్రాలు సేకరించి వీలైనప్పుడల్లా వాటిని చూస్తూ నవ్వుకోగలిగితే ఎంత ఆనందంగా, హాయిగా ఉంటుందో!

---

నవ్వు పుట్టించే లక్షణాలలో వికారం ప్రధానమైనది. – ఫ్రాన్సిస్ బేకన్

ఇంటికొక్క పువ్వు ఈశ్వరునికొక్క మాల అయినట్లే, గంటకొక్క నవ్వు జీవితానికొక్క హారం అవుతుంది.

7. ఆటగా మార్చుకో : పిల్లలు ప్రతిదానిని ఒక ఆటగా, వినోదంగా మార్చి ఆనందిస్తారు. వారి చుట్టూ ఉన్న వాతావరణాన్ని ఉత్సాహభరితంగా, వినోదాత్మకంగా మార్చడం ప్రకృతి వారికి అందజేసిన వరం. పెద్దలు కూడా తమ జీవితాలను ఒక క్రీడగా మార్చుకోగలిగితే ఎంత అందంగా ఉంటుంది! ఆటలు ఆడటంతో మనలో ఒక ఉత్సాహం జనిస్తుంది. అందుకే పోట్లాటలు మాని ఆటలాడటం నేర్చుకోండి అంటారు విజ్ఞులు.

పిల్లలతో మనందరం సరదాగా ఎన్నో ఆటలు ఆడుతుంటాము. పిచ్చివానిగా మాట్లాడుతూ, పిల్లి కూతలు కూస్తూ, బల్లిలా పాకుతూ - ఇలా చిన్నారులతో ఆడుకుంటూ వారితోబాటు మనం కూడా ఆనందిస్తూనే ఉంటాము. మరి ఆ ఆనంద మైన సంఘటనలను పెద్దలతో మనం ఎందుకు పంచుకోలేకపోతున్నాము? యోగ శిక్షణా తరగతులలో ఇలాంటి చక్కటి ప్రయోగాలు జరుగుతాయి. అక్కడ శిక్షకులు ఎలాంటి జంకు, గొంకు లేకుండా వ్యవహరిస్తారు. అవే పద్ధతులను మన దైనందిన జీవితంలో ప్రవేశ పెట్టగలిగిననాడు.

ఆనందో బ్రహ్మ అవుతుంది. అంతా ఒక వినోదంలా కన్పిస్తుంది.

ఇప్పుడొక పిల్లల ఆటను చూద్దాం. ఆనందరావు బాస్ పేరు అడ్డాలరావు (అసలు పేరు మనోహర్ లెండి). ప్రతిదానికి అడ్డంగా మాట్లాడటం ఆయన లక్షణం కనుక బాస్ అంటే ఎవ్వరికీ గిట్టదు. అయితే, కళావతి భోజన సమయంలో అన్నం ముద్దచేసి “ఇదుగో బాస్” అంటూ నవ్వుతూ దానిని మింగేస్తుంది. దాంతో మిత్రుల ఆలోచనాసరళి మారుతుంది. అంతా అయిన తరువాత అందరూ నవ్వుకుంటూ స్పూన్‌ని ఎత్తిపట్టుకొని “అడ్డాలరావు జిందాబాద్” అని చిన్నగా అరిచేవారు. (పెద్దగా అరిస్తే బాస్ కి వినిపిస్తుందేమోనన్న భయం లేకపోలేదు) మధుసూదన్ మాత్రం “ముర్దాబాద్” అనడంతో అందరూ ఆనందంగా నవ్వుకునేవారు. చిత్రం ఏమంటే ఆఫీలో బాస్ పైన ఎవరికి కోపం వచ్చినా జేబులో ఉన్న స్పూన్ ని తీసి టేబుల్ పైన నిల్చోబెట్టడంతో అందరూ బాస్ ని గుర్తు తెచ్చుకొని నవ్వుకునేవారు. ఇక్కడ స్పూన్ బాస్ కు సంకేతం.

జుట్టు ఊడిపోతున్న మరిదిని చూస్తూ అతని వదిన “మా చెల్లెలు నిన్ను చూసి ఎవరో ముసలాయన అని హాస్యమాడుతుందేమో!” అని ఆటపట్టించగా, అతను మాత్రం నింపాదిగా “అదికాదు వదినా! గతంలో నేను బోడిగుండ్లను బాగు చేసే నిపుణుణ్ణి. దాంతో అన్ని గుండ్లు కోపగించుకొని నా తలను శుభ్రం చేశాయి” అంటూ నవ్వాడు. ఇలాంటి సంఘటనలు ప్రతి

---

నవ్వుకు కారణం ఆనందం. – థామస్ హాబ్స్

ఒక్కరి జీవితంలో ఎన్నో వస్తుంటాయి. వాటిని మెరుగుపరచడం నేర్చుకుంటే సమాజం ఎంతో అందంగా రూపొందుతుంది.

హెలెన్ కెల్లర్ పుట్టుకతోనే గ్రుడ్డిది, చెవిటిది. అయినా ప్రపంచం గర్వించదగిన వనితగా ఎదిగింది. అలానే అబ్రహాం లింకన్, థామస్ ఆల్వా ఎడిసన్ వంటి ప్రముఖులు కూడా ఈ కోవకు చెందినవారే. టామ్ సులివాన్ పుట్టుకతోనే అంధుడు. అయితే, ఆయన ఒక నటుడుగా, క్రీడాకారుడుగా, గారడీవానిగా పేరుగాంచాడు. "ప్రతి ఒక్కరికి ఏదోఒక బలహీనత ఉంటుంది. అది అవిటితనం కావచ్చు, వార్ధక్యం కావచ్చు, జబ్బు కావచ్చు, సిగ్గు కావచ్చు, ఆత్మన్యూనతాభావం కావచ్చు, మతిమరుపు కావచ్చు" అంటాడు టామ్.

10. విశ్వాసం, హాస్యం : జెరాల్డ్ కాఫీ ఒక గొప్ప నావికా కెప్టెన్. అతనిని యుద్ధ ఖైదీగా 7 సంవత్సరాలు బంధించారు. ఖైదీగా అతనిని పెట్టిన గదిలో ఏవైపునైనా నడవడానికి 3 అడుగుల జాగా మాత్రమే ఉంది. అయినా అతను ధైర్యాన్ని కోల్పోలేదు. ఖైదీగానే ఫ్రెంచి భాష నేర్చుకున్నాడు. కిప్లింగ్, షేక్ స్పియర్ రచనలు చదివాడు. స్వంతంగా గేయాలు వ్రాశాడు. వీటన్నింటికీ మించి హాస్యాన్ని ఒక కళగా మార్చాడు. కష్టాల కడలినుండి విముక్తి పొందడానికి విశ్వాసం, హాస్యం ఎలా ఉపయోగపడతాయో ప్రఖ్యాత సంస్థలలో ఈనాడు ఆయన బోధిస్తున్నాడు. ఇదే విషయాన్ని ఒక కవి "అగ్నికి నా ఇల్లు ఆహుతి అయిన తర్వాత ఉదయించే చందమామను చక్కగా చూడగలుగుతున్నా" అని వ్రాసుకున్నాడు!

ఆనందాన్ని అనుభవించడమే కాదు, బాధలను అధిగమించడం కూడా నేర్చుకోవాలి. అందుకే మనం హాస్యంతో చెలిమి చెయ్యాలి, నవ్వును నేస్తంగా మార్చుకోవాలి, ఆనందాన్ని ఆత్మీయుడుగా మలచుకోవాలి. హాస్య దృక్పథం అంటే ఇదే అని తెలుసుకున్నాం కనుక ఇంక హాస్యం నైతికత గురించి అధ్యయనం చేద్దాం.

---

నవ్వు అంటే మనసు తుమ్మడం. – ఎస్కార్సిట్

అధ్యాయం 9

# హాస్యం -నైతికత

అది ఎన్నికల సమయం. ఒక సమావేశంలో ప్రతిపక్ష నాయకుడు ప్రసంగిస్తూ "ప్రియ సోదర సోదరీమణులారా! ఈ పర్యాయం మీరందరూ తప్పనిసరిగా మా పార్టీకే ఓటు వేయాలని నా ప్రార్థన. గత ఎనిమిదేళ్ళుగా పాలకపక్షం మిమ్మల్ని దారుణంగా మోసగించింది. ఈ పర్యాయం ఆ అవకాశం మాకు ఇవ్వండి"అంటూ ముగించాడు.

హాస్యం నైతికతను బోధిస్తుందా లేక అనైతికతను వరిస్తుందా? అసలు హాస్యానికి, నైతికతకు సంబంధం ఉందా? లేక అవి రెండూ రెండు లోకాలా? ఇదొక ముఖ్యమైన అంశం అంటారు హార్వే మైండెస్. అమెరికాలోని ఆంటియోక్ విశ్వవిద్యాలయంలో ఆచార్యునిగా పనిచేస్తున్న హార్వే ఈ అంశం పై సుదీర్ఘ అధ్యయనం చేశారు.

బాపూజీ చెప్పినట్లు అహింసాయుత పోరాటంలో విజేత, పరాజితులు అంటూ ఉండరు. అక్కడ వ్యక్తి మనస్సును మార్చడానికి కృషి జరుగుతుందే కాని, తలలు తీయడానికి ఎలాంటి ప్రయత్నాలు జరుగవు. అదొక ప్రేమ సామ్రాజ్యం అంటారు గాంధీజీ. నిజానికి హాస్య ప్రపంచం కూడా అలాంటిదే. హాస్యం ద్వారా సమాజంలోని బలహీనతలను సరిదిద్దడానికి కృషి జరుగుతుందేగాని, వ్యక్తిగతంగా ఎవ్వరినీ కించపరచడానికి గాని, నొప్పించడానికిగాని ఎలాంటి ప్రయత్నం జరగదు. ప్రేమరాజ్యంలో, నవ్వులరాజ్యంలో హేళనకు, దూషణకు అవసరం ఉండదు కదా!

మనోవిజ్ఞాని అయిన ఒక వైద్యుడు రోగిని పరీక్షిస్తూ తన చేతి గడియారాన్ని చూస్తున్నాడు. అయితే ఆ గడియారం డయల్ పైన డాట్ గుర్తులు ఉన్నాయే కాని, నిమిషాల గుర్తులు లేవు!

సమున్నత సమాజ స్థాపన : ప్రతి శాస్త్రానికి ఒక లక్ష్యం ఉంటుంది. హాస్య శాస్త్రం ఎవ్వరినీ నొప్పించకుండా అందరినీ ఆనందపరుస్తూ హాస్యోక్తులు ద్వారా మానవ మనస్తత్వాన్ని మార్చడానికి, సమాజాన్ని సమున్నతంగా తీర్చిదిద్దడానికి కృషి చేస్తుంది. అయితే, హాస్యం మానవ నైతికతను సమర్థిస్తుందా లేక బలహీనపరుస్తుందా! అసలు నైతికతను గురించి పట్టించుకోకుండా తటస్థంగా ఉంటుందా? అన్నవి మౌళిక ప్రశ్నలు. కొందరు రచయితల ప్రకారం హాస్యం ప్రధాన ఆశయం సమాజ సంస్కరణ కనుక అమాయ

---

తత్త్వశాస్త్రంలోని అపరిష్కృత సమస్యలలో నవ్వు ఒకటి. –మన్రో

కుల పై, బలహీనుల పై ఛలోక్తులు విసరడం గర్హనీయం. అయితే హాస్యం ఎలాంటి నైతిక ధర్మాలను బోధించదు.

హాస్యం ఎప్పుడూ మంచితనంతోనేగాక, ప్రకృతితో, పరిపూర్ణతత్వంతో మైత్రి చేస్తుంది. అందువలన అది నైతికంకాదు, అనైతికం కాదు. అది ఆ రెండూ కావచ్చు; ఆ రెండింటికన్నా భిన్నమూ కావచ్చు. అందుకే అది మంచి, చెడు తెలియని అమాయకపు పసిపాప వంటిది అంటాడు హార్వేమైండెస్.

అలానే, మన పుట్టుక, కుటుంబం, పరిసరాలు, ఆర్థికశక్తి మొదలైన అనేక అంశాల పైన మన నైతిక విలువలు ఆధారపడి ఉంటాయి. అవి విద్యతో అబ్బేవి కావు. అవి హృదయ ఔన్నత్యం, మంచితనం, సమానత్వంలో విశ్వాసం పై ఆధారపడతాయి. అది ప్రకృతి సిద్ధంగా లబించే తత్త్యం. అందువల్లనే ఆ విలువలు మనతోపాటు పరిణామం చెందుతూంటాయి. మరొక విచిత్రమేమంటే మన నైతిక భావన, దాని అభివృద్ధి సాధారణంగా మన హాస్యప్రవృత్తితో కలసి ఉంటుంది. పసితనంలో అర్థరహితమైన హాస్యం చిన్నారులకు అమితానందాన్నిస్తుంది. కార్టూన్లు, కాకమ్మ కథలు పిల్లల్ని కదలకుండా కూర్చోబెడతాయి. పసితనపు అమాయకత్వానికి అది సంకేతం. వయస్సు పెరిగే కొద్దీ మనిషి అర్థరహితమైన హాస్యాన్ని వదిలి పెట్టి, పసందైన హాస్యంతో చెలిమిచేస్తాడు.

ఓ పిల్లవాడు కాలుజారి నదిలో పడ్డాడు. దానిని చూసిన ఒక సిపాయి ఆ బాలుణ్ణి రక్షించి, తల్లికి అప్పజెప్పాడు. నాలుగురోజుల తర్వాత ఆ బాలుని తల్లి సిపాయి వద్దకు వచ్చి “మీరేకదా మా బాబుని రక్షించింది?” అని అడిగింది. ఆ సిపాయి నమ్రతతో "అవునండి" అన్నాడు. వెంటనే ఆమె “ఆరోజున మా బాబు కొత్త టోపీ పెట్టుకొచ్చాడు. అదేమైంది?” అని ప్రశ్నించడంతో ఆ సిపాయి నిశ్చేష్టుడయ్యాడు. పుణ్యానికి పోతే పాపం ఎదురైంది అంటే ఇదేనేమో!

సామాజిక నియంత్రణ : "ఎగతాళి ద్వారా సామాజిక నియంత్రణ గావిస్తూ వ్యక్తిలో మార్పులు తీసుకురావచ్చు" అంటారు కె.సింగ్. “ఇతరులలోని బలహీనతలను బయట పెడుతూ నవ్వడాన్ని ఎగతాళి అంటారు. సామాజిక విలువలలో శిక్షణ ఇవ్వడానికి అనాదిగా ఎగతాళి, హేళనలు హాస్యంలో భాగంగా పనిచేశాయి. అందుకే రాజుల ఆస్థానాలలో విధిగా విదూషకులు ఉండేవారు. ఎగతాళి, గేలి సాయంతో చరిత్రలో కొందరు రాజులు కొన్ని సమస్యల పరిష్కారానికి ప్రయత్నించారు” అంటారు సింగ్.

---

నవ్వు ముట్టడి ముందు ఏ శక్తి ఎదురు నిలబడలేదు. – మార్క్ ట్వెయిన్

ప్రతి సామాజిక సంస్థ తన పరిధిలో మానవ ప్రవర్తనను క్రమబద్ధం చేయడానికి కృషి చేస్తుంది. ఆ కార్యక్రమంలో ఎగతాళి ఒక ఆయుధంలా పనిచేస్తుంది. అదంటే భయపడుతూ ఎవరికి వారు తమ ప్రవర్తనను సరిదిద్దుకోడానికి ప్రయత్నిస్తారు. ఈ విధంగా అది మానవ ప్రవర్తనను సరిదిద్దుతూ వ్యక్తి వికాసానికి సాయపడుతూంది. ఈ మార్పు మూడు మార్గాల ద్వారా జరుగుతుంది.

1) రచనల ద్వారా : కవులు, రచయితలు, పత్రికా విలేకరులు తమ రచనలద్వారా సమాజం పై గట్టి ఒత్తిడి తెస్తారు. మేధావి, ధనిక వర్గాలను అదుపులో ఉంచడానికి ఈ రచనలు తోడ్పడతాయి. పూర్వకాలంలో ఈ పని నాటకాల ద్వారా జరిగేది. "ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్ళకు కదలిక" అని మహాకవి కాళోజి, "వెయ్యి తుపాకు లకంటే ఒక్క ప్రతికూల పత్రిక అంటే నేను భయపడతాను" అని నెపోలియన్, "నా కలమే నా ఖడ్గం" అన్న జర్నలిస్ట్ కోటంరాజు రామారావు గార్ల అభిప్రాయాలు ఇక్కడ గుర్తుంచుకోదగినవి.

2) జానపద వ్యంగ్యం: బాకుల్లాంటి మాటలతో జానపద గేయాలు జనసామాన్యం లో మార్పుతెస్తాయి.

పట్టణంలో చదువులు వెలగబెట్టే మధు వేసవి సెలవలు గడపడానికి తన గ్రామం చేరాడు. పట్టణ వాతావరణంలో పెరిగిన అతనికి పల్లె వాతావరణమంతా తమాషాగా కన్పించింది. ప్రతిరోజు తెల్లవారు జామున ఠంచనుగా నాలుగు గంటలకు కోడిపుంజు అరుపు విన్న అతను "ఆ కోడి నిన్నా అరిచింది, ఈ రోజూ అరిచింది. రోజూ అది ఎందుకలా గోల చేస్తుంది?" అని తండ్రిని అడిగాడు. తండ్రి నవ్వుతూ "ఏమీలేదు బాబూ! ఆ పుంజు పెట్ట (ఆడకోడి) లెగవకముందే తాను చెప్పదలచుకున్నది చెబుతున్నది. ఆ తరువాత ఎలాగూ అరవడానికి దానికి అవకాశం ఉండదుకదా!" అన్నాడు. పట్టణవాసుల అజ్ఞానాన్ని, తెరవెనుక ఉంటూనే అధికారాన్ని చెలాయించే 'అబల' నిజస్వరూపాన్ని ఈ జానపద కథ ముద్దుగా బయట పెడుతుంది.

సామెతలలో భాషాపరంగా ఒంపులు, సొంపులు దాగివున్నట్లే, సందేశాత్మకమైనవి, సమాజం పై చురకలు వేసేవి ఎన్నో కన్పిస్తాయి. మనిషి అవసరాల, సమస్యల, ఆనందాల, అనుభవాల సంకలనమే సామెతలు. సగటు మానవుని ఆలోచనాసరళిని మార్చగల నైపుణ్యం, సామాజిక అలవాట్లకు తూటాలు పొడవగల శక్తి వాటికి ఉంది. కొన్ని ఉదా హరణలు చూడండి :

'అఆ'లు రావుకాని, అగ్ర తాంబూలం మాత్రం కావాలి.

---

నియంతలతో పోటీ పడకూడదు. వాళ్ళను ఎగతాగి చెయ్యాలి. – బెర్టాల్ బ్రెక్

అధికారి భార్యపోతే అందరూ మూగుతారు. అధికారేపోతే ఒక్కడూ రాడు.

ఆకలి లేకుండా నీకు మందు చెబుతా, ముందు నాకు కాస్త గంజి నీళ్ళు పొయ్యమన్నాడట!

అల్పుడికి ఐశ్వర్యం వస్తే అర్ధరాత్రి గొడుగు పట్టమన్నాడట.

ఒకనాటి భోగం ఆరునెలల రోగం.

జగడమెట్లా వస్తాది లింగమయ్యా అంటే, బిచ్చం పెట్టవే బొచ్చుముండా అన్నాడట.

3) కార్టూన్లు : శంకర్స్ వీక్లీ, పంచ్ పత్రికలంటేనే కొంతమంది హడలెత్తుతారు. ఈ విధంగా సామాజిక రుగ్మతలను తొలగించడంలో హాస్యం ప్రముఖపాత్ర వహిస్తుంది.

మరి ఈ మార్పు ఎలా జరుగుతుంది? దీనికి సమాధానంగా 3 సిద్ధాంతాలు ప్రతిపాదించబడ్డాయి.

1) అధిక శక్తి సిద్ధాంతం : స్పెన్సర్ ప్రకారం వ్యక్తి తనవద్దగల అపార జ్ఞానాన్ని (శక్తిని) సమాజాన్ని తీర్చిదిద్దడానికి ఉపయోగిస్తాడు. అలా జరుగనినాడు వ్యక్తి తన శక్తిని వక్రమార్గాలకు, సమాజ వ్యతిరేక ప్రయోజనాలకు ఉపయోగించవచ్చు. దీనికే అధిక శక్తి సిద్ధాంతం అని  పేరు పెట్టారు.

2) సింహావలోకన సిద్ధాంతం : జాన్ ఫిట్స్ ప్రకారం మనిషి సామాజికంగా ఒక స్థాయి నుండి మరొక స్థాయికి ఎదుగుతాడు. విభిన్న స్థాయిలలో పురోగమనానికి ఎగతాళి ఒక మార్గం అంటుంది ఆయన సింహావలోకన సిద్ధాంతం.

3) సామాజిక క్షాళన: శిక్షణ ద్వారా వ్యక్తిత్వాన్ని క్రమబద్ధం చేసుకోడానికి, ఆవిధంగా సామాజిక ఆరోగ్యం బాగుపడటానికి గేలి తోడ్పడుతుంది. ఈవిధంగా గేలి ఒక పరికరంగా, ఒక సాధనగా సామాజిక క్షాళనకు ఉపయోగపడుతుందన్నమాట!

ఆర్థిక అసమానత్వానికి కారకులైనవారి దోపిడీ, అవినీతి చర్యలను గేలి చేయడం ద్వారా వారి పద్ధతులను సరిదిద్దడంలో ఇది చేయూతనిస్తుం ది. ఈ విధంగా గతి తప్పిన సామాజిక ప్రవర్తనను సరిదిద్దుతూ సామాజిక సమతౌల్య స్థాపనకు హాస్యం తోడ్పడుతుంది.

శ్రీకృష్ణదేవరాయలవారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలను జయించడానికి వచ్చిన ఉద్దండ పండితులకు తెనాలి రామకృష్ణుడు తన చతురోక్తులతో, హాస్యంతో గుణపాఠం నేర్పిన సంగతి పాఠకులకు తెలిసిందే. తెలుగు, సంస్కృత సాహిత్యాలలోని అన్ని రచనలను చదివానని విర్రవీగిన ఒక కవిని రామకృష్ణుడు "తిలకాష్ఠ మహిష బంధనం చదివావా?" అని ప్రశ్నించడంతో అతను బెంబేలెత్తిపోయాడు. "ఇంతకూ ఆ గ్రంథ రచయిత ఎవరు?" అని

---

తాత్వికుల దృష్టిలో నవ్వు ఎప్పుడూ నేరమే! – రాబర్ట్ ఇంగర్ సాల్

ప్రశ్నిస్తే, "తిలకాష్టం అంటే నువ్వుల గడ్డి, బంధనం అంటే తాడు.... ఇంతే"నని తనవద్ద ఉన్న కట్టను విప్పి చూపిస్తూ అందరినీ నవ్వించాడు. అలానే, మరొక కవిని "మేకతోకకు మేక తోక" అంటూ ఒక పద్యాన్ని చెప్పి అర్థం వివరించమని నిలదీశాడు. హాస్యంతోగాక, మరొక విధంగా ఇలాంటి విజయాలు సాధించడం అసాధ్యం కదా! అలానే అశ్లీల, అహంకార ప్రవర్తనను, డంబాచారలను, దురాచారా లను ఎండగట్టడానికి వక్రోక్తి తన కొరడాను ఝుళింపించవలసిందే.

నైతిక హద్దులు ఉండవా? : సమాజం స్థిరంగా, సమతౌల్యంగా ఉండాలని హాస్యం కోరుకుంటుందేగాని, దానికి మంచి, చెడు, నైతిక హద్దులు, పవిత్ర ప్రదేశాలు మొదలైనవి ఉండవు. ఆనందించడానికి, ఇతరులను ఆనందపరచడానికే గాక, సామాజిక కందెనలాగా జీవనాన్ని కొనసాగించడానికి ఉపకరించే సాధనం అది. ఒక - ప్రసిద్ధ హాస్యకారుడు ఆల్ కాప్ చెప్పినట్లు " మానవునిలోని అమానుషత్వాన్ని ఆనందంతో బయట పెట్టడానికి ఉపయోగపడే సాధనం సుఖాంత నాటకం..

మరి ప్లేటో, అరిస్టాటిల్, థామస్, హాబ్స్ మొదలైన రచయితలు, మతాధిపతులు హాస్యం నైతికంగా నిషిద్ధమైనదని ఎందుకు నిర్ధారించారు? "మనం ఎవరిని చూసి నవ్వుతున్నామో, ఆ వ్యక్తులు తమను చూసి ఇతరులు ఎందుకు నవ్వుతున్నారో తెలుసుకోవడానికి ప్రయత్నించకపోవడమే దీనికి కారణం అంటాడు జాన్ మోరెల్.సమాజంకాని, తోటి మనుషులుకాని మనం ఎలా ఉండాలని భావిస్తామో, దానికి భిన్నంగా కన్పించినప్పుడు మనం నవ్వుతాము; వాళ్ళ ప్రవర్తనను చూస్తూ ఆనందిస్తాము.

అసంగత విషయాలను చూసినప్పుడు వ్యతిరేక భావోద్రేకాలతో కాక, ఆనందంతో, వినోదంతో స్పందించడాన్ని మన పూర్వీకులు గర్షించారు. అరటి తొక్క పై కాలు పెట్టి జారిపడిన దురదృష్టవంతుణ్ణి చూసి బాధపడాలి కాని, నవ్వడం మానవ త్వం అనిపించుకోదు. అందుకే అలాంటి నవ్వును గర్షించాలి; అనైతికంగా భావించాలి. ఆక్షేపించదగిన దృక్పథం ఏవిధంగానూ సమర్థనీయం కాబోదు. అందుకే సివార్డ్ మహాశయుడు "నవ్వు అంటే ఆనందంతో కూడిన బాధ్యతారాహిత్య భావన" అని ప్రవచించాడు. బాధ్యతారాహిత్యం కూడా ఒక విధంగా అనైతికమే కదా! ఇతరుల పై దయ, సానుభూతి చూపలసిన సమయంలో నవ్వడం అభిలషణీయం కాదన్నదే హాస్యం నైతికతకు ప్రధాన సూత్రంగా చెప్పవచ్చు.

---

భీషణమైనది ఏదైనా నాకు నవ్వు తెప్పిస్తుంది. – చార్లెస్ లాంబ్

ఉద్దేశ్యపూర్వకంగ ఇతరులను అవహేళన చేయడానికో, బాధించడానికో, పది మందిలో తన ఆధిక్యతను చాటుకోవాలన్న తాపత్రయంతోనో ఉపయోగించే హాస్యం నిజానికి విషపూరిత హాస్యం అవుతుంది. ఒక జాతిని లేదా వ్యవస్థను లేదా వర్గాన్ని కించపరచడం దీని ఉద్దేశ్యం. ప్రతీకారాన్ని, కోపాన్ని, ద్వేషాన్ని దాచుకోవడంలో ఇది నేర్పరి అంటాడు ఆచార్య రాబర్ట్ ఎల్.వీస్. ఈ ధోరణి అనేక దుష్పరిణామాలకు దారి తీయొచ్చు. అది వ్యక్తి నైతిక స్థాయిని దిగజారుస్తుంది. పరిశ్రమలలో, కార్యాలయాలలో అలాంటి హాస్యోక్తులు విసిరేవారిపై ప్రతీకార ధోరణి పెరిగి ఉత్పత్తి మందగించే ప్రమాదం లేకపోలేదు. అందు వల్ల మేనేజర్లు ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపుతూ విషపూరిత హాస్యోక్తులకు చోటులేకుండా జాగ్రత్తపడాలి అంటారు ఆచార్యులవారు.

నైతిక హాస్యం : పచ్చి శృంగారం పైన, జాతుల పైన అసూయతో, అహంకారంతో విసిరే హాస్యోక్తులు అభిలషణీయంకాదు. ఇటీవల చైనాలో జరిపిన ఒక సర్వేలో అనారోగ్యకరమైన హాస్యోక్తులు యువత నైతికతను దెబ్బతీస్తూ వారిని పెడతోవన పట్టిస్తాయని 90 శాతం మంది అభిప్రాయపడగా, 73 శాతం మంది సంప్రదాయ సంస్కృతిని తూలనాడడాన్ని తప్పుపట్టారు. మరొక ఆసక్తికరమైన అంశమేమంటే 63 శాతం మంది మతాన్ని విమర్శించే హాస్యోక్తులను ఏవగించుకుంటూ మతం జోలికి హాస్యం పోరాదని అభిప్రాయపడ్డారు. అయితే అతిప్రాచీన కాలంలోనే భారతదేశంలో చార్వాకులు, గ్రీసులో అరిస్టోఫేన్సు, సోక్రటీస్, ఐరోపాలో ఎరాస్మస్ ప్రభృతులు హాస్యోక్తులను మత మౌఢ్యంపై బలమైన ఆయుధాలుగా ప్రయోగించిన మాట నిజమే. మత విశ్వాసాలలో కొన్ని బలహీనతలు ఉన్నమాట యదార్థమే అయినప్పటికీ ఆ లోపాలనే బూచులుగా చూపిస్తూ, వాటిలోని మంచిని విస్మరించడం విజ్ఞత కాబోదు. అలానే కంకణం కట్టుకుని మతాన్ని విమర్శించడం అధునాతనత్వం అనిపించుకోబోదు.

హాస్యోక్తులు మంచివే. ఆనందానికి అవి అవసరమే. అయితే హాస్యోక్తుల పేరుతో మనం యువత మనస్సును కలుషితం చేయకూడదు. మనం సాధిస్తున్న అద్భుత ప్రగతికి ఆరని చిచ్చు పెట్టినట్లు అవుతుంది. హాస్యం గురించి భిన్న కోణాల నుండి తెలుసుకున్న తర్వాత ఇంక మనం దాని మనస్తతత్వం గురించి కూడా తెలుసుకోవాలి కదా!

---

నిజమైన సరసోక్తి నవ్వు తెప్పించలేదు. – లార్డ్ చెస్టర్ ఫీల్డ్

అధ్యాయం 10

# నవ్వు - మనస్తత్వం

నవరసాలను ఒలికించగల ఏకైక రసం నవ్వు. ప్రశాంతంగా, కళాత్మకంగా నవ్వగలగడం ఒక అదృష్టం. అదొక అద్భుతం. ముఖానికి ఎన్ని స్నోలు పూసినా, ఎంత పౌడరు అద్దినా అవి చిరునవ్వు శోభలతో సరితూగలేవు. మనసారా నవ్వితే మీ శరీరంలో ఎండార్ఫిన్లు విడుదలయి. మీ చర్మం సహజసిద్ధంగా మెరుగులు దిద్దుకుంటుంది. మీ ముఖంలో వెలుగు వస్తుంది అని శాస్త్రం చెబుతుంది. ఎవరి నవ్వు వారిదే, ఎవరి అనుభూతి వారిదే కనుక నవ్వును అరువు తెచ్చుకోలేము. నవ్వులో అద్భుత ఆకర్షణ శక్తి ఉంది; దానిలో ఆత్మీయత ఉంది; ఆప్యాయత ఉంది; మనిషి ఆత్మ దాగివుంది.

కొందరు క్లుప్తంగా, అతి క్లుప్తంగా నవ్వితే, కొందరు నవరత్నాలు రాలిపోతాయేమో నన్నంత భయం భయంగా నవ్వుతారు. మరికొందరు నోరంతా తెరిచి 70ఎం.ఎం. సినిమాలా నవ్వితే, ఇంకొందరు అతి భద్రంగా నోరు తెరుస్తారు. ఉరుములు, మెరుపుల్లా కొందరు నవ్వితే, సెలయేరులా మరికొందరు నవ్వుతారు. ప్రమోషన్ కోసమో, స్వీయప్రయోజనం కోసమో కొందరు నవ్వితే, అలాంటివారిని చూసి హేళనగా నవ్వుతారు ఇంకొందరు. కొందరు నవ్వుతూ కూడా నవ్వనట్లే కన్నిస్తే, మరికొందరు నవ్వకున్నా నవ్వినట్లే ఉంటారు. కొందరు ఏడ్చినా నవ్వినట్లు ఉంటే, మరికొందరు నవ్వినా ఏడ్చినట్లే ఉంటుంది. కొందరు నవ్వితే కోడి కొక్కిరించినట్లుంటే, మరికొందరు నవ్వితే వెక్కిరించినట్లుంటుంది.

ఏ నవ్వు వెనకాల ఏముందో: పసిపాప నవ్వులో అమాయకత్వం ఉంటే, దుర్మా రుని నవ్వులో కుటిలత ఉంటుంది. కొందరు తమ నవ్వు వెనుక ఎన్నో వ్యధలు, గాథలు దాచుకుంటే, మరికొందరు తమ అమాయకపు చిరునవ్వుతో అందరి హృదయా లను దోచుకుంటారు. ఈ విధంగా నవ్వు నవ్వులో తేడా ఉంటుంది. అందుకే ఏ నవ్వు వెనకాల ఏముందో తెలుసునా అంటూ పాడుకోవాల్సివస్తుంది. ఆనందానికి, వినోదానికి భౌతిక ప్రకటన నవ్వు. అందుకే నవ్వగలిగే తత్వం, ఆనందించే శక్తి మనిషికి ఉండాలి.

రోజు చూస్తూ... హాసం, మందహాసం, అట్టహాసం, వికటాట్టహాసం - ఇలా హాసం ఎన్నో రకాలు అని చెబుతూ, రాజు తామర్లేన్ ఒక పర్యాయం వికటాట్టహాసం చేశాడు. ఆ నవ్వును భరించలేని ఆస్థాన విదూషకుడు నసీరుద్దీన్ రాజు గారి ముందు అద్దం ఉంచాడు. అద్దంలో తన ముఖాన్ని చూసుకున్న రాజు తక్షణం వికటాట్టహాసం మాని బోరున

అమ్మాయి అతిగా నవ్వితే ముసలి మొగుడు వస్తాడు. – నేపాల్ సూక్తి

ఏడ్వసాగాడు. మరి రాజు ఏడిస్తే సభికులంతా ఏడ్వాలి కదా! ఆ తరువాత కొంత సేపటికి రాజు రోదనను ఆపగా, సభికులు కూడా ఏడ్వడం ఆపారు. అయితే, నసీరుద్దీన్ మాత్రం నేలమీదపడి దొర్లుతూ, పొర్లుతూ ఏడుస్తుండటంతో రాజు ఆగ్రహించి "ఏం.... ఇంకా ఆపలేదు?" అని గద్దించాడు. అందుకు నసీరుద్దీన్ 'క్షమించండి జహాపనా! మీరు ఒక్కసారి మీ ముఖాన్ని చూసుకొని అంతగా దుఃఖించారే! మరి రోజూ మీ ముఖం చూసే మేము ఎంతగా రోదించాలో చెప్పండి!" అన్నాడు మరింత పెద్దగా ఏడుస్తూ.

వర్గ కరణ: మన చుట్టూ కన్పించే ముఖాలను నాలుగు విధాలుగా - క్రూర ముఖాలు, నవ్వుకు నోచుకోని ముఖాలు, ఉదాసీన ముఖాలు, బహిరంగ ముఖాలు - వర్గీకరించి, ఆ ముఖాల సోయగాల గురించి తెలుసుకుందాం.

i) క్రూర ముఖాలు : కొన్ని ముఖాలను చూడటంతోనే 'అబ్బ' అనిపిస్తుంది. ఆ ముఖాలలోని కాఠిన్యాన్ని, క్రూరత్వాన్ని చూసినవారెవరికైనా వారు గొప్ప విలన్లు అనిపిస్తారు. ఆ ముఖాలకు చిరునవ్వులు అంటిద్దామన్నా అంటకపోవడం విశేషం. ఇలాంటివారు సాధారణంగా నవ్వరు. దురదృష్టవశాత్తు నవ్వితే, జనసామాన్యం "ఆ భయంకర శబ్దాలకు పెట్టు స్టాపు" అని వేడుకోవడం తథ్యం. ముజాహిదీన్ నవ్వు, తామర్లేన్ నవ్వులు ఈ కోవకు చెందినవే. అలానే నేలబారు నవ్వులు, వెకిలి నవ్వులు నవ్వే వారికి మనం దూరంగా ఉంటూ, నిండుగా మనసారా నవ్వే వారితో మనసు విప్పి మాట్లాడతారు. కడుపారా నవ్వగలిగేవాడు రసజ్ఞుడు (మునిమాణిక్యం) అయితే, పెద్ద నవ్వుల వెనుక పెద్ద భయాలు, పెద్ద నిస్పృహ లు దాగివుంటాయి అంటారు అనుభవజ్ఞులు. ఈ విధంగా నవ్వు మనిషికి చిరునామాలా పనిచేస్తుందన్నమాట!

ii) నవ్వుకు నోచుకోని ముఖాలు : అసహనం, చిరుకోపంతో సర్వదా నాట్యమాడుతుండే ఈ ముఖాలు "నా లోకం నాది, ఇతరులతో నాకేం పని" అన్నట్లుగా తిరుగుతుంటాయి. వీరికి ఎవ్వరి సంగతీ పట్టదు. స్వయం నిర్మిత లోకంలో విహరించే విచిత్ర విహంగాల వంటివారు వీరు.

iii) ఉదాసీన ముఖాలు: ఈ ముఖాలలో ఎలాంటి భావాలు కన్పించవు. తమచుట్టూ ఏమి జరిగినా తమకేమీ పట్టనట్లు ఉంటాయి. ఒకవిధంగా ఇవి రాతి ముఖాలవంటివి. మానవమాత్రుల ముఖాలనుండి ఆనందంగా ఉన్నప్పుడు చిరునవ్వులు, బాధలలో ఉన్నప్పుడు కన్నీళ్ళు రావడం సహజం. కాని ఈ ముఖాలకు కన్నీరుగాని, కడగండ్లుగాని తెలియవు. కోపతాపాలకు, చీకు చింతలకు, చిరాకులు పరాకులకు ఇక్కడ చోటుండదు. అవొక

---

ఇష్టంలేని వ్యక్తి ఏమి చెప్పినా నవ్వం. – కార్లయిల్

భావరహిత స్థితిని కలిగి ఉండటంతో ఆ ముఖాల వెనుక ఏమి దాగుందో ఎవ్వరికీ అర్థం కాదు.

iv) బహిరంగ ముఖాలు: ఇవి సహజసిద్ధమైన ముఖాలు. మానవతా దృక్పథం ఈ ముఖాలలో తొణికిసలాడుతుంది. ప్రతి సమస్యకు వీరు సహజసిద్ధంగా స్పందిస్తారు. అందుకే వీరు అందరికీ సన్నిహితులుగా ఉంటారు. మన చుట్టూ కన్పించే అత్యధిక సంఖ్యాకుల ముఖాలు ఇలాంటివే. చిరునవ్వులు చిందించే ముఖాన్ని, ప్రతి విషయానికి స్పందించే ముఖాన్ని మనం కోరుకోవడం సహజమే కదా! మానవత్వపు లక్షణాలకు ప్రతీక ఈ ముఖం. ఇదొక రకంగా ఆత్మసై ర్యాన్ని పెంచుతుంది. పదిమందినీ కలవడా నికి వీరు వెనుకాడరు. అలానే పదిమందీ ఇలాంటివారిని కలవడానికి ఆసక్తి చూపుతుం టారు. అందుకే దీనిని ఉత్తమ ముఖం అని పిలుస్తారు.

నవ్వు - వ్యక్తిత్వం: జన్మనక్షత్రాన్ని బట్టి జ్యోతిష్యులు ఆ వ్యక్తి భవిష్యత్తును చెప్పినట్లే, మనిషి నవ్వునుబట్టి అతని / ఆమె వ్యక్తిత్వాన్ని తెలుసుకోవచ్చంటారు పరిశోధకులు. చిన్నగా, సన్నగా నవ్వేవారికి రొమాంటిక్ వ్యక్తిత్వం ఉంటుందట. వారు పెదవులు తెరిచీ తెరవకుండా నవ్వుతారు. ఆ నవ్వులో సమ్మోహనశక్తి ఉంటుంది. వారి మనసులో ఏముందో ఇతరులకు తెలియదు కాని, వారు మాత్రం ఇతరులను ఇట్టే ఆకర్షిస్తారు. వారికి ఆత్మసైర్యం ఎక్కువ. కొద్దిగా గర్వంపాలు కూడా ఉండొచ్చు. అందుకే వారి తల ఎప్పుడూ నిటారుగానే ఉంటుంది. కొందరు నవ్వితే పొట్టంతా కదులుతుంది. అలాంటివారికి చక్కని నిర్ణయాలు తీసుకోగల శక్తి ఉంటుంది. వారు చాలా సెన్సిటివ్ గా ఉంటారు."

మరికొందరి నవ్వులు చక్కిలిగింతలు పెట్టినట్లుగా ఉంటాయి. వారు ఎంత చురుకుగా ఉంటారో, అంత ఎక్కువగా శ్రమపడతారు. వారు కళారాధకులు. అందరినీ నవ్విస్తూ హాయిగా జీవిస్తుంటారు. కొందరు కళ్ళతో నవ్వుతారు. వారు గొప్ప ఆలోచనాపరులు. వారిలో దయ, సానుభూతి అధికం. వారు ఎలాంటి సమస్యనైనా సులువుగా ఎదుర్కొంటారు. కొందరికి బిగ్గరగా నవ్వడం అలవాటు. వీరు ఆశావాదులు. కల్లాకపటం తెలియనివారు. వీరిలో ప్రేమపాలు అధికం. కొందరు కిలకిలా నవ్వుతారు. వీరిలో ఆత్మవిశ్వాసం హెచ్చు. కొందరు పకపకా నవ్వుతారు. తల నిటారుగా పెట్టి నవ్వేవారి కళ్ళలో మెరుపు కన్పిస్తుంది. మరికొందరు పైపళ్ళు కన్పించేలా చిన్నగా నవ్వుతారు. వీరు స్నేహశీలురు. నవ్వేటప్పుడు తల కొంచెం పక్కకు వంచడం వీరికి అలవాటు. వీరిలో ఓర్పు అధికం.

---

నవ్వు పవిత్రమైనది, శుభప్రదమైనది. – నీత్సే

ఏమైనా గోరంత జోక్ కు కొండంతగా స్పందించడం ఆనందించడం మనం నేర్చుకోవాలి. మనిషికి మంచి మందు మందహాసం అయితే, నవ్వులన్నింటిలో అందమైన నవ్వు చిరునవ్వు. అమెరికాలోని కాలిఫోర్నియాకు చెందిన మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు మనుషులు ఎందుకు నవ్వుతారో తెలుసుకుంటే, మనుషుల మధ్యగల వ్యత్యాసాలను ఇట్టే తెలుసుకోవచ్చు అంటారు. హాస్యంలో అసంగత్వ సిద్ధాంతం పేర్కొనేది ఇదే. ఈ విధంగా నవ్వు ద్వారా మనిషి వ్యక్తిత్వాన్ని తెలుసుకోవచ్చన్నమాట!

నవ్వు మనస్తత్వంపై ప్లేటో : ప్లేటో హాస్యాన్ని మేధస్సుచే గుర్తించబడిన అసందర్భ భావనల సామీప్యంగా పరిగణించాడు. ఆకలిగొన్నప్పుడు మనం పరస్పర విరుద్ధమైన భావజాల మిశ్రమాన్ని ఏకకాలంలో అనుభవిస్తాము. కడుపు కాలుతున్న బాధతోపాటు త్వరలో తీసుకోబోయే ఆహారాన్ని గురించిన ఆనందానుభూతి కూడా మనకు కలుగుతుంది. అలానే నవ్వు కూడా. నవ్వదగిన అంశం కన్పించినప్పుడు నవ్వుతో కలిగే ఆనందం, ద్వేషంతో పాటు కలిగే బాధల మిశ్రమ అనుభూతిని ఏకకాలంలో పొందుతాము. ఉదాహరణకు ఒక అజ్ఞాని మన పొరుగువాడు పనికిమాలినవాడు అన్న వార్తను మనకు అందజేశాడనుకోండి.... మనకు కూడా పొరుగువానిని గురించి అదే అభిప్రాయం ఉన్నప్పుడు మన ద్వేషపూరిత ఆలోచనలకు ఆయన వంత పలికాడు కనుక అతని ఆలోచనను మనము స్వాగతిస్తాం. ఈ విధంగా మనలోని ద్వేషభావాన్ని, మనోవికలతను సమతౌల్యం చేయగల శక్తి నవ్వుకు ఉందన్నమాట. అంతేకాదు. ఆత్మకు ఆరోగ్యం చేకూర్చడంలో దోహదపడుతుంది కనుక నవ్వు హర్షణీయమైనదే అంటాడు ప్లేటో.

అయితే, నవ్వుతో ఒక చిక్కు ఉంది. ఆహారం, త్రాగుడువలె నవ్వు విషయంలో కూడా సంయమనాన్ని పాటించడం కష్టం కావచ్చు. దానికి ఎలాంటి కొలమానం లేదు కనుక మనస్సును, శరీరాన్ని ఒకానొక ఆనందమయ స్థితికి తీసుకువచ్చేంతవరకే నవ్వాలనడం ఆచరణలో అసాధ్యం కావచ్చు. అందుకే “అతి సర్వత్ర వర్జయేత్" అన్న నానుడిని మనం గౌరవించాలంటాడు ప్లేటో. నవ్వు శారీరక ఆనందాన్ని ఇస్తుంది. ఇతరుల దురదృష్టాన్ని చూసి సంతోషించాలన్న మన ఆలోచనల ఫలితంగా జనించే బాధను అది ఉద్రేకపరుస్తుంది. ఆ విధంగా నవ్వు ఎప్పుడూ బాధతో కలసి ఉంటుంది కనుక అది ఎప్పుడూ 'అతి'గానే ఉంటుంది. ఈ 'అతి'కి బఫూన్లను ఒక ఉదాహరణగా పేర్కొన్నాడు ప్లేటో.

ప్లేటో దృష్టిలో నవ్వు వేరు, హాస్యం వేరు. నవ్వు భౌతిక సంబంధి కాగా, హాస్యం మేధాసంబంధి. అసంగతాన్ని గుర్తించడానికి మేధ కావాలి కదా! సముచితమైన, సముచితం

---

నవ్వే జంతువు, ఏడ్చే జంతువు మానవుడే. – విలియం హాజ్లిట్

కాని అంశాలను, చిత్రాలను కలపడంతో నవ్వు జనిస్తుంది. ఉదాహరణకు పురుషగీతాలకు స్త్రీ స్వరం కూర్చినప్పుడు, మనుషులు జంతువుల్లా సంచరించినప్పుడు వాటిని చూసినవారెవరైనా నవ్వుతారు కదా! -

త్రిగుణాల సమ్మేళనం: ప్లేటో ప్రకారం ప్రతివ్యక్తిలోను త్రిగుణాలు (హేతువు, ధీరత్వం, ఇచ్ఛ) ఉంటాయి. అయితే, ఒక్కొక్కరిలో ఒక్కొక్క గుణం ప్రముఖంగా, ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. తాత్వికుడు మేధకు (హేతువు), సిపాయి విజయానికి, కీర్తి ప్రతిష్ఠలకు (ధీరత్వము), సామాన్యుడు సంపదకు (ఇచ్ఛ) ప్రాధాన్యమిస్తాడు.

ఎవరైనా కుర్చీలో కూర్చోబోతుంటే, దానిని అవతలకు లాగి అతను క్రిందపడటాన్ని చూసి ఆనందించడం సగటు మనిషి లక్షణం. అయితే, తాత్వికుడు అలాంటి వంకర టింకర, పిచ్చి పనులను హర్షించడు. కనుకనే పరిశోధకులకు, తాత్విక చింతనాపరులకు భాష కొన్ని సందిగ్ధాలను సృష్టిస్తుంది. తాత్వికులు తమ మేధాసంపత్తిచే ఆ సందిగ్గాలను గుర్తించి ఆనందిస్తారు. సోక్రటీస్ తన జీవితకాలం మొత్తంలో ఒకే ఒక్క పర్యాయం నవ్వినట్లు ప్లేటో పేర్కొన్నాడు. ఇంతకూ ఆయన ఎందుకు నవ్వాడు? తాను మరణించిన తరువాత తనను ఎలా పూడ్చి పెట్టాలని శిష్యుడు క్రీడో ప్రశ్నించినప్పుడు సోక్రటీస్ నవ్వాడట! మహా మేధావి అయిన సోక్రటీస్ దృష్టిలో ఆత్మ వేరు, శరీరం వేరు. అందువలన తనను పూడ్చి పెట్టడం అన్నది ఒక అసంగత ప్రశ్న. ఆత్మ, శరీరం వేరైనప్పుడు తాను మరణించిన తరువాత తాను ఎలా ఉంటాడు? అని యోచించే ఆ మహాజ్ఞానికి క్రీటో సందేహం నవ్వు తెప్పించడం సహజమేకదా!

ఇచ్ఛ ప్రధానంగా గలవారికి (సగటు మనుషులు) సుఖసంతోషాలే సర్వస్వం అవుతాయి. అవే వారికి మధురానుభూతిని కలిగిస్తాయి. ఆర్థిక ప్రయోజనం చేకూరని ఏ కార్యం పైనా వారు తమ దృష్టిని కేంద్రీకరించరు. అందుకే వారు నిరుపయోగమైన తత్వ విచారణ పై రాత్రింబవళ్ళు గడిపే తాత్వికులంటే జాలిపడతారు, నవ్వుకుంటారు.

సైనికులను ధీరత్వానికి ఉదాహరణగా పేర్కొన్నాడు ప్లేటో. వారికి కీర్తికాంక్షలే సర్వస్వం. థేల్స్ అనే తాత్వికుడు ఆకాశంలోని నక్షత్రాలను పరిశీలిస్తూ ప్రక్కనే ఉన్న మురుగు కాలువలో పడ్డాడు. ఎదురుగా ఉన్న మురుగుకాలువను కూడా చూడలేని అతని అజ్ఞానానికి చింతిస్తూ ఒక మహిళ విరగబడి నవ్వింది. ఈ విధంగా అనేక విషయాలలో సామాన్యుల వెక్కిరింతలకు గురయ్యేటంత వికృతంగా తాత్వికులు వ్యవహరిస్తుంటారు.

---

ప్రతి నవ్వు విరోధాభాసాన్ని అవకాశంగా తీసుకుంటుంది. – షోపెన్ హార్

ఒక వ్యక్తి హాస్యధోరణి అతని ఆత్మ యొక్క ఆరోగ్యస్థితికి దర్పణం పడుతుంది. తర్కభావ సంబంధ సమస్యలను ఆనందించే వారిలో క్రమబద్ధమైన, ధర్మబద్ధమైన ఆత్మ ఉన్నదని, ఇతరుల బాధలను ద్వేషంతో, హేళనతో చూసేవారి ఆత్మ అక్రమ రీతిలో, అధర్మరీతిలో ఉన్నదన్న ప్లేటో తర్కంతో మనం ఏకీభవించలేకపోవచ్చు. అయితే, హాస్యాన్ని నైతిక కోణం నుండి పరికించాలన్న ఆయన సూచన హర్షణీయ మైనదే. క్లుప్తంగా మనిషిలో హాస్యధోరణి ఉండటం తప్పుకాదు కాని, దానిని దుర్వి్ని యోగపరచడాన్నే ప్లేటో వ్యతిరేకించాడు.

గొప్ప అధ్యయనం: నవ్వు పై అధ్యయనాలు ఎంతగా జరిగినప్పటికీ, మనిషి వ్యక్తిత్వానికి, నవ్వుకు మధ్యగల సంబంధాన్ని నిజజీవితంలో మీరే ప్రత్యక్షంగా పరిశీలించి, ఆ పరిశోధనా ఫలితాలు ఎంతవరకు నిజమో నిర్ధారించండి. కొందరు నవ్వును నటిస్తే, మరికొందరు నవ్వుకే నవ్వు తెప్పిస్తారు. అమాయకపు నవ్వులు వెలగబోస్తూ నిలువునా ముంచేవారు కొందరైతే, చిరునవ్వులతో స్వాగతించేవారు, స్నేహాన్ని పంచేవారు, పెంచేవారు ఎందరో ఉంటారు. ఏమైనప్పటికీ చక్కని అధ్యయ నానికి ఉత్తమ శీర్షిక నవ్వు. అందుకే అందరూ నవ్వాలి. తాము నవ్వుతూ నవ్వేవారి వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవాలి. నవ్వు స్వభావాన్ని అవగాహన చేసుకోవాలి.

చివరగా ఒక్క విషయం. నీ వ్యక్తిత్వం నీది అయినట్లుగానే నీ నవ్వు కూడా నీదే కనుక నీ నవ్వును ఎన్నడూ ఇతరుల నవ్వుతో పోల్చుకోకు. అది నీ సొంతం. అయితే, నాగరికత పెరిగే కొద్దీ ఈనాడు నవ్వు కూడా ఒక నటనగా మారింది. ఫలితంగా ప్లాస్టిక్ నవ్వులు, ఎలక్ట్రానిక్ ఎకసక్కెం సర్వసాధారణం అయ్యాయి. మనసారా హాయిగా నవ్వగలిగేవాడు నాగరికులమధ్య నవ్వులపాలవుతున్నాడు. దాంతో నవ్వు నవ్వు కొరకే, నవ్వు ఆనందం కొరకే అన్న సత్యాన్ని గుర్తించే వ్యక్తులు ఈనాడు అరుదు అయ్యారు. ఆలోచనాచట్రం నుండి మనం బయటపడలేకపోతున్నాం.

ఎలాంటి ఒత్తిడి లేకుండా హాయిగా, ఆనందంగా జీవించే వ్యక్తి, శాంతియుతంగా జీవించే వ్యక్తి ప్రపంచశాంతికి తోడ్పడే ఒక శక్తిలాంటివాడని మనం గ్రహించాలి. “హాయిగా నవ్వు, ఆనందంగా జీవించు” అన్నది మన నినాదం కావాలి. “నవ్వు నవ్వు కొరకే” అన్నది మన విధానం కావాలి. “నవ్వుకు దగ్గరగా వస్తే, వైద్యునికి దూరంగా వెళతారు” అన్నది మన జీవన సూత్రంగా మారాలి. నవ్వుల శాస్త్రం మనకు బోధించేది అదే.

---

మందబుద్ధి నవ్వుకు మాతృక.- జాన్ క్లిమాకస్

నవ్వు - మనస్తత్వం గురించి తెలుసుకున్నాం కనుక ఇంక మతంలో హాస్యభావన గురించి తెలుసుకుందాం.

---

అతిగా నవ్వేవాడు తీవ్ర మనస్తాపానికి గురి అవుతాడు. – జీన్ పాల్ రిక్టర్

అధ్యాయం 11

# మతం - హాస్యభావన

మూడు మతాలకు చెందిన ముగ్గురు విద్యార్థులు ఒకచోట కూర్చొని తమ మతం గొప్పదంటే తమదే గొప్పదని వాదించుకుంటున్నారు. ఆ వాదన ఎంతకూ ఎడతెగకపోవ డంతో అటే వెళ్తున్న ఒక వృద్ధుని దగ్గరకు వెళ్ళి విషయాన్ని వివరించి ఆయన అభిప్రాయాన్ని కోరారు. "చూడండి పిల్లలూ! మీ ముగ్గురు చెప్పింది బాగానే ఉంది. ఈ నగరానికి మూడు దారులు ఉన్నాయి. ఒకటి దగ్గరదారి, ఒకటి దూరపు దారి, మరొకటి బురదదారి. ఒకామె మొక్కజొన్న పొత్తులు తీసుకొని పట్టణంలోకి అమ్మకానికి వచ్చింది. అటు తిరిగి, ఇటు తిరిగి ఆమె చివరకు మీ వద్దకే వచ్చింది. మీరు ఆ  మొక్కజొన్న పొత్తులు కొనుక్కొని తింటూ "ఇవి ఎంత బాగున్నాయి" అంటారా, లేక "ఈ పొత్తులను ఏ దారినుండి తెచ్చావమ్మా? అని ప్రశ్నిస్తారా?" అని అడిగాడు. అంతే! ఆ ముగ్గురు చటుక్కున  జారుకున్నారు.

మతం హాస్యాన్ని ప్రభావితం చేస్తుందా? మతాన్ని పరిమిత స్థాయిలోనైనా హాస్యంతో జతపరచవచ్చా? నిజానికి చరిత్రలో మనకెక్కడా మతం హాస్యాన్ని చేరదీసిన సందర్భా లు కన్పించవు. ఉదాహరణకు జీసస్ క్రీస్తు బైబిల్ లోని లూకా సువార్తలో "ఇప్పుడు ఏడ్చేవారు రక్షింపబడుదురుగాక. ఆ తరువాత వారు నవ్వుతారు"...... అన్నాడు. జీసస్ ఎప్పుడూ నవ్వలేదని చెబుతారు. నిజానికి ఏ దైవం కూడా - హిందూ దేవతలు కాని, బుద్ధుడు కాని, మరే దేవుడైనా - నవ్వు ముఖంతో కన్పించడు.. "ప్రసిద్ధ పురుషులు చిరునవ్వులు చిందిస్తారే కాని ఎప్పుడూ నవ్వరు" అంటారు లార్డ్ చెస్టర్ ఫీల్డ్, సిద్ధాంత రీత్యాను, అనుభవపూర్వకంగాను హాస్యానికి చేరువైన వ్యక్తిత్వ లక్షణాలను మతం ఎలా స్వీకరిస్తుందో పరిశీలిస్తే హాస్యానికి, మతానికి మధ్యగల వైరుధ్యం బహిర్గతం కావచ్చు అంటారు వాసిలస్ సారగ్లొ. సాధారణంగా హాస్యాన్ని, మతభావనను వ్యక్తిత్వ లక్షణాలుగా మనం పరిగణిస్తాము కనుక ఈ పోలిక సమంజసం అనిపిస్తుంది. ఇప్పుడు మతం, హాస్యం దృక్పథాలను తెలుసుకుందాం.

హాస్యం : అసంబద్ధతలో, అర్థరాహిత్యంలో, అస్పష్టతలో ఆనందం పొందేది హాస్యం. మానవ జీవితంలోని వైరుధ్యాలను ఒక వేడుకగా మార్చుకోవడమే, ఆనందించడమే. దాని తత్వం. మనిషికి, అతని జీవితానికి మధ్య అంతర్లీనంగా ఉన్న వైరుధ్యాన్ని అది ప్రస్తుతిస్తుంది. ఈ విధంగా మానవునికి ఒక అసాధారణత ఏర్పడింది. దాంతో అతనికి ప్రపంచం

---

శుక్రవారం నాడు నవ్వినవాడు శనివారం నాడు విలపిస్తాడు. – రాసిన్

అర్థవంతంగా, అర్థరహితంగా, సుపరిచితమైనదానిగా, వింతైనదిగా, నిరోధిం చేదిగా, బహిర్గతమైనదిగా ద్యోతకమవుతుంది. ఈ పదాల అర్థాల పరిమితి, అస్పష్టతలే హాస్యానికి ఆలవాలమయ్యాయి. అందుకేనేమో హాస్యంలో వివేక విశిష్టత, సూత్రాల ఉల్లంఘన ప్రాధాన్యతను అధ్యయనం చేసిన ఫ్రాయిడ్ ప్రతి హాస్యోక్తి అర్థరహితమైన దేమో అంటాడు. డెమోక్రిటస్, కుందెరాలు కూడా అలానే భావించారు.

మతం : మతం ప్రధానంగా విశ్వసృష్టికి మూలం గురించి, జీవితం యొక్క అర్థం, పరమార్థం గురించి యోచిస్తుంది. అది సంప్రదాయానికి, ఆచరణకు, విధేయతకు ప్రాధాన్యం ఇస్తుంది. అక్కడ విశ్వాసం ముఖ్యం, విధేయత ప్రధానం. అయితే, అది అయోగ్యతను సమర్థించదు. హృదయానికి అందించే తాత్కాలిక మత్తుమందులాంటి హాస్యం అనాసక్త విషయాలలో చోటుచేసుకుంటుంది. అది ఎప్పుడూ తాత్కాలికం, క్షణికమే కాని, శాశ్వతం కాదు. శాశ్వతంగా ఉండాల్సిన జీవశక్తి, ప్రాణశక్తి దానిలో లేదు. అయితే, మతం శాశ్వత విలువలను, నిత్యసత్యాలను బోధిస్తుంది.

భిన్న కోణాలు : ఈ విధంగా మతం, హాస్యం స్వరూప స్వభావాలలో, దృక్పథాలలో ఎంతో వ్యత్యాసం ఉంది.

1) మతం ఆధ్యాత్మికత గురించి ఆలోచిస్తే, హాస్యం ఆనందం గురించి యోచిస్తుంది. ఒకటి పరానికి, మరొకటి ఇహానికి ప్రాముఖ్యమిస్తాయి.

2) మతం నైతికత, దైవం, ప్రేమ, ధర్మబోధ గురించి పరిశీలిస్తే, హాస్యం నవ్వు, సంతోషం, సరసోక్తుల గురించి పరికిస్తుంది.

3) ఒకటి అంతశ్శుద్ధి గురించి ఆలోచించగా, మరొకటి ఆనంద ప్రకటన గురించి యోచిస్తుంది.

4) మతం ప్రధానంగా విశ్వాసం పైన ఆధారపడితే, అర్థరాహిత్యాన్ని ఆనందించేది హాస్యం .

5) భావావేశంతో కూడిన ఆశ్చర్య ప్రకటన మూలంగా మనిషి తాత్కాలికంగా నియంత్రణను కోల్పోతాడు. నవ్వు అలాంటి ఆవేశం వంటిదే. అయితే, మతం వెనుక నిగూఢ ఆలోచన, సిద్ధాంతపటిమ చోటుచేసుకుంటాయి. అందుకు

6) తాత్వికతపై ఆధారపడే మత సిద్ధాంతాలుగాని, దాని తత్వంగాని సామాన్య మానవునికి అందుబాటులో ఉండవు. అయితే, హాస్యం ప్రధానంగా సగటు మానవునికై ఉద్దేశించబడింది. ఈ విధంగా వాటి స్వరూప స్వభావాలలో మౌలిక వ్యత్యాసాలున్నాయి.

---

ఆత్మజ్ఞానం లేనివాడు నవ్వుతాడు. – ప్లేటో

ఈవిధంగా సృష్టి మూలాలు, ముక్తి మార్గాలు, ఆధ్యాత్మిక విలువలు మొదలైన గంభీర విషయాల గురించి యోచించే మతం పాఠ్యాంశం, ఆలోచనాసరళి అంతా తాత్విక సంబంధంగా, ధార్మిక ప్రధానంగా ఉంటుంది. అలాంటి చింతనలో, అధ్యయనం లో అతి సామాన్యమైన హాస్యానికి, చతురోక్తులకు, కాలక్షేపపు కబుర్లకు స్థానం ఉండదు కదా!

సత్యం, మానవత్వం, ప్రేమ, సహనం అనే అద్భుత పునాదుల పైన నెలకొల్పబడిన మహోన్నత సౌధం మతం. ఆచరణలో కొన్ని సందర్భాలలో అది రెటమతంగా, ద్వేషాలకు, రోషాలకు నిలయంగా మారడం దురదృష్టకరం. "మతం మన ఆలోచనాశక్తిని, మనస్సును చంపుతుంది" అని నెహ్రూ భావించగా, "అది మత్తుమందులాంటిది" అంటాడు కారల్ మార్క్స్. మతం మనుషులను విడదీయవచ్చు కాని, నవ్వు మాత్రం మనుషులను దగ్గరకు చేరుస్తుంది. నిజానికి ఆ రెండూ మనిషి ఆనందాన్ని గురించే - ఒకటి ఆధ్యాత్మిక, మరొకటి భౌతిక ఆనందం గురించి - ఆలోచిస్తాయి. మతంలేని దేశం ఉండవచ్చు కాని, నవ్వులేని దేశం ఉండనట్లే, మతాన్ని ద్వేషించేవారు ఉండవచ్చు కాని, నవ్వును ద్వేషించేవారు ఉండరు. ప్రపంచంలో భిన్న మతాలు ఉన్నప్పటికీ నవ్వు మాత్రం ఒక్కటే అవడం విశేషం. మానవ ప్రగతికి మతం ఎంత అవసరమో, నవ్వు కూడా అంతే అవసరం అవుతుంది.

యూదుల మత గురువును బెరోకా అంటారు. ఆయన ఎలిజా అనే జ్యోతిష్యుణ్ణి కలసినప్పుడు "ఈ అంగడిలో స్వర్గానికి అర్హులైన వారు ఎవరైనా ఉన్నారా?" అని ప్రశ్నించాడు. "ఎవ్వరూ లేరండి" అని సమాధానం ఇస్తుండగానే ఇద్దరు వ్యక్తులు అక్కడకు రావడాన్ని చూసి, "వీరిద్దరూ స్వర్గం చేరడానికి అర్హు లేనండి" అన్నాడు ఎలిజా. అప్పుడు బెరోకా "మీరేమి చేస్తుంటారు?" అని వారిని ప్రశ్నించగా "మేము విదూషకులం. బాధలలో ఉన్నవారిని ఉత్సాహపరుస్తూ, ఘర్షణ పడే వారి మధ్య సఖ్యత కుదురుస్తూ ఆనందంగా జీవించేట్లు చేస్తుంటాం" అని వారు సమాధానం ఇచ్చారు. "ఇలాంటి వ్యక్తులు అవసరం" అంటూ ఆయన వారిని స్వర్గానికి చేర్చాడట!

ఒక పర్యాయం అతి చాదస్తుడు ఒకడు బాపూజీ దగ్గరకు వచ్చి "బాపూజీ! రెండు మూడు మణుగుల బరువుగల శరీరాలతో మనం భూమిమీద నడుస్తుంటే మన కాళ్ళ క్రిందపడి ఎన్ని జీవులు నశించిపోతున్నాయో పాపం!" అన్నాడు బాధగా. ప్రక్కనే కూర్చున్న సర్దార్ వల్లభాయ్ పటేల్ అందుకొని "దీనికి ఇంతగా ఆలోచించాల్సిన పని ఏముంది?ఎంచక్కా కాళ్ళు నెత్తిన పెట్టుకు నడిస్తే సరి" అన్నాడు నవ్వుతూ.

---

కడుపారా నవ్వడం చక్కని ఆరోగ్యానికి రాచబాట. – మైఖేల్ మిల్లర్

చిత్రాతి చిత్రం : సాదాసీదాగా, స్వచ్ఛంగా, నిర్మలంగా సాగే ఇలాంటి హాస్యం మనకు కొండంత బలాన్ని ఇస్తుంది. ఏ మతంవారూ తమ ఆచారాల పై, దైవాల పై హాస్యోక్తులు విసురుకోరని తెలిసిందే. అయితే, హిందువులు తమ ఆరాధ్య దైవాల పైననే హాస్యోక్తులు విసరడం, విమర్శించడం ఒక ప్రత్యేకత. “పార్వతి చాలు గంగను విడువుము” అని ఒకరు శివుణ్ణి ప్రార్థిస్తే, "నల్లి బాధ పడలేక బ్రహ్మదేవుడు పద్మంలో, విష్ణువు పాలసముద్రం పైన, శివుడు కొండమీద మకాం పెట్టారు” అని మరొకాయన హాస్యోక్తి విసిరాడు. వినాయకచవితి సందర్భంగా వార్తాపత్రికలు గణనాధుని పైన ఎన్నో హాస్యోక్తులు ప్రచురిస్తాయి. పెట్రోల్ ధర పెరిగిందన్న వార్త విన్న ఒక భక్తుడు వినాయ కుణ్ణి "తమకు ఉన్నట్లే నాకు కూడా పెట్రోలు అవసరంలేని వాహనాన్ని అనుగ్రహించండి స్వామి” అని మొక్కడం ఇందుకు ఓ బుల్లి ఉదాహరణ. ఇంక యముని అమాయ కత్వాన్ని గురించిన హాస్యోక్తులకు కరువేలేదు. ప్రపంచంలో బహుశా ఏ మతంలోనూ భక్తులు దైవంతో ఈ విధంగా పరాచికాలాడరేమో!

అందరూ దేవుని బిడ్డలే అని అన్ని మతాలు ఘోషించినప్పటికీ ఒక మతం మరొక మతాన్ని, ఒక మతస్తులు ఇతర మతస్తులను, వారి విధానాలను, వారి దైవాలను తూలనాడటం గొప్ప ఆధ్యాత్మిక హాస్యోక్తిగా కన్పిస్తుంది.

ఒక క్రైస్తవ ఫాదర్ ప్రసంగం విన్న తరువాత ఒక భక్తురాలి ఆర్తనాదం : “వారంలో ఆరు రోజులు ఆయన కన్పించడు. ఏడవ రోజున ఆయన చెప్పిందేమిటో అర్థం కాదు”.

నిజానికి ఐర్లండ్ కు చెందిన హాస్యోక్తులన్నీ ఆ దేశ ప్రజలకు చెందినవి కానట్లే, క్రైస్తవ హాస్యోక్తులన్నీ ఆ మతానికి, ఆ వ్యక్తులకు సంబంధించినవి కావు. హిందూ మతంలో కూడా శైవులకు, వైష్ణవులకు మధ్య అనేక ఘర్షణలు జరిగాయి. వారు ఒకరి పై మరొకరు విసురుకునే హాస్యోక్తులు కొన్ని సందర్భాలలో ఆ మతం బోధించే ప్రాథమిక సూత్రాలకే వ్యతిరేకంగా కన్పిస్తాయి.

నవ్వు - ఆటంకాలు: గంభీరంగా ఉండటం గౌరవసూచకమని, దైవత్వానికి చిహ్నమని కొందరు భావిస్తే, నవ్వు రాక్షసుల లక్షణమని దుయ్యబడతారు మరికొందరు. ఎందువల్లనోకాని 'నవ్వు' అభ్యుదయానికి నోచుకోలేదు. అది నిరుపయోగమైనదని, అదొక నిషేధాజ్ఞ అని కొందరు భావిస్తారు. “గంభీరంగా ఉండు, లేదా గేటు దాటిపో" అని చెప్పడంతో పెద్దల దృష్టిలో నవ్వు అనుచితమైనదన్న భావన వ్యాప్తి చెందింది.

---

నవ్వు అంటే ఆనందంతో కూడిన బాధ్యతారాహిత్య భావన. – సివార్డ్.

నవ్వితే అవివేకులుగా భావింపబడతాం అనే సంకోచం లేదా హాస్య సమాధానం అవివేక సమాధానంగా పరిగణింపబడి ఇతరుల దృష్టిలో చులకనవుతామన్న భయం, ఆందోళన మనల్ని పట్టిపీడిస్తున్నాయి. నిజానికి కొన్ని సందర్భాలలో అవివేకుల, అజ్ఞానుల ప్రేలాపనలలో కొన్ని వినూత్న సత్యాలు బయటపడతాయి.

దీనికి భిన్నంగా యోచించేవారు కూడా లేకపోలేదు. మానవశాస్త్రం లేదా మానవ జాతుల శాస్త్రీయ వర్ణన అధ్యయనాల ప్రకారం ప్రపంచవ్యాప్తంగా హాస్యం మతంతో సన్నిహిత సంబంధం కలిగి ఉందని నిర్ధారించబడింది అంటారు హెంపల్మన్. నిజానికి నిషిద్ధ అంశాలే అత్యధికంగా హాస్యాన్ని సృష్టిస్తాయి. అణగదొక్కబడిన శక్తులు నవ్వు ద్వారా బహిర్గతమవడమే దీనికి కారణంగా చెబుతారు. ఈ నిషిద్ధ అంశాలలో ముఖ్యంగా శృంగారం, అశుభ్రమైన ఆహారపు అలవాట్లు మొదలైన అంశాలు ప్రధానంగా కలసి ఉంటాయి. క్రైస్తవ మతానికి సంబంధించిన హాస్యోక్తులలో లైంగిక అంశాలు ప్రధానపాత్ర వహిస్తాయని ఆయన పేర్కొనడం గమనార్హం.

ఈవిధంగా మతం, హాస్యభావన బహిర్గతంగా ఉత్తర, దక్షిణ ధృవాలుగా కన్పించి నప్పటికీ, లోతుగా చూచినప్పుడు వాటిమధ్య సన్నిహిత సంబంధం కన్పిస్తుంది. అవి రెండూ మానవ అభ్యున్నతికి కృషి చేస్తాయి. అయితే, ఇక్కడ ముఖ్యంగా ఒక విషయం గమనించాలి. గంభీరంగా ఉండే తన భావాలను, విలువలను సామాన్యునికి సులువుగా అర్థమయ్యేలా చేయడానికి మతానికి హాస్యం సాయం ఎంతైనా అవసరం. అందుకే స్వామి చిన్మయానంద కాని, క్రైస్తవ మత ప్రవక్తలు కాని చిట్టిపొట్టి కథలతో, హాస్య ఉదంతాలతో క్లిష్టమైన భావాలను సగటు భక్తునికి అర్థమయ్యేలా వివరిస్తారు. “మతం పాడి ఆవులాంటిది. అది ఎన్ని తన్నులు తన్నినా లెక్కచేయవద్దు. అది చాలా పాలు ఇస్తుందన్న సత్యాన్ని గుర్తుంచుకో” అన్న స్వామి వివేకానంద మాటలలో, “నీ మతం, నా మతం అనేవారు అసలు మతేలేనివారు” అన్న సత్యసాయిబాబా సందేశంలో హాస్యం ఎంతగా ఉందో, ప్రవచనం అంతకన్నా ఎక్కువ ఉందికదూ! “విశ్వాసానికి  ప్రారంభం హాస్యం, ప్రార్థనకు ప్రారంభం నవ్వు” అని రీస్ హోల్డ్ నైబర్ ఉద్ఘాటించింది కూడా ఇందుకే! వెనుకటికి ఎవరో ఒక కవి అన్నాడట “గబ్బిలం సరిగ్గానే వేలాడింది. ఎటొచ్చీ లోకమే తిరగబడింది” అని. అందుకే మన దృక్కోణం సరిగ్గా ఉంటే అంతా సవ్యంగానే కన్పిస్తుంది.

ఒక రైతు తన బ్యార్న్ పైన "దైవమే ప్రేమ” అని ఒక బోర్డు కట్టాడు. అది గాలికి అటుఇటు తిరగడంతో చూసేవారికి విచిత్రంగా కన్పించింది. ఆ దారినపోతున్న ఒక

ఆచార్యుడు ఆ రైతుతో "ఏమయ్యా! దానిని గోడ పైన అలా కట్టావు.... దేవుని ప్రేమ ఎప్పుడూ అలా తిరుగుతూ ఉంటుందని నీ అభిప్రాయమా?" అని అడిగాడు. అందుకు రైతు "అదికాదు స్వామి....ఏ మూలనుండి చూసినా దేవుడు ప్రేమమయుడేకదా!" అని బదులిచ్చాడు.అందుకే 'ఆనందో బ్రహ్మ' అంటారు కనుక ఇంక ఆ లోకంలోకి ప్రవేశిద్దాం.

అధ్యాయం 12

# ఆనందోబ్రహ్మ

భగ్గుమంటున్న వేసవి ఎండలు. దానికి తోడయ్యాయి వేడిగాల్పులు. హఠాత్తుగా ఒకరోజు కోటయ్య ఇల్లు అగ్నికి ఆహుతి అయింది. భార్య కోటమ్మ లబోదిబోమంటూ ఏడుస్తుంటే, ఏదో వింతను చూస్తున్నట్లు నవ్వుతున్న భర్తను చూసి "ఏమయ్యా! ఇల్లు కాలి బూడిదవుతుంటే ఏమిటా ఆనందం" అంది ఆశ్చర్యంగా. "ఓసి పిచ్చిదానా! ఈ రోజు నుండి మనకు ఎలుకలగోల, చెదలబాధ పోయింది. ఇంక మన దరిద్రం వదిలింది. అదే నా ఆనందం" అన్నాడు కోటయ్య నింపాదిగా. "

మా మనవరాలు శ్రీలేఖ్య అమెరికా నుండి వచ్చీ రావడంతోనే తెలుగు నేర్చుకోవడంలో ప్రత్యేక శ్రద్ధ చూపింది. "అక్క అన్నం తిన్నది" అని ఆమె కష్టపడి నేర్చింది. ఆ తర్వాత మరికొన్ని మాటలు నేర్చింది. ఒక రోజు సరదాగా మాట్లాడుతూ "అక్కను అన్నం తిన్నది" అనడంతో అందరూ నవ్వారు. తాను తెలుగు బాగా మాట్లాడినందుకు అందరూ నవ్వుతున్నారని ఆమె కూడా గట్టిగా నవ్వడంతో కథ మరింత రసవత్తరమైంది.

ఆనందం రకరకాలు : సృష్టిలోని ప్రతి జీవరాశి ఆనందాన్ని కోరుకుంటుంది. కడుపునిండా అన్నం తిన్న కుక్క ఎంత తృప్తిగా, ఆనందంగా తోక ఆడిస్తుందో చూడండి! అయితే, వాటికి భౌతికానందం మాత్రమే తెలుసు. సృష్టిలో ఉన్నతుడు మానవుడు. అతనికి ఆలోచనాశక్తి ఉంది. భాష ఉంది. వీటన్నింటినీ మించి విచక్షణా జ్ఞానం ఉంది. అందుకే మనుషుల ఆలోచనలలో, ప్రవర్తనలో భిన్నత్వం కన్పిస్తుంది. కొందరు సంపదకు ప్రాధాన్యమిస్తే, మరికొందరు అందమైన గృహానికి, సంతతికి, కీర్తి ప్రతిష్టలకు ప్రాధాన్యమిస్తారు. భౌతిక సుఖమే ఆనందంగా కొందరు భావిస్తే, ఆధ్యాత్మిక ప్రగతియే ఆనందం అంటారు మరికొందరు. రాజకీయ నాయకునికి పదవి, అధికారం ఆనందా న్నిస్తే, కళాకారునికి గుర్తింపు, కీర్తి ప్రతిష్ఠలు ఆనందాన్నిస్తాయి. మహిళలకు నగలంటే మహా ప్రీతి అయితే, పిల్లలకు చాక్లెట్లు, ఐస్ క్రీమ్ లంటే ఇష్టం. తాగుబోతుకు మత్తుపానీ యాలు ఆనందం అందిస్తే, తిరుగుబోతుకు శృంగారం ఆనందం కలిగిస్తుంది. రోజు కూలీ చేసుకొని బ్రతికేవానికి కూలితో పాటు ఓ పదిరూపాయలు అధికంగా ముడితే మహానందం. యాచకునికి కడుపునిండా భోజనం దొరికితే ఆనందం. ఇలా ఒక్కొక్కరు ఒక్కొక్కరకమైన ఆనందానుభూతిని పొందుతారు. అంటే ప్రతి ఒక్కరూ ఆనందా న్వేషణలోనే ఉన్నారన్నమాట!

---

నవ్వు – లావెక్కు. – సామెత

"ఏది గొప్ప ఆనందం?" అనే అంశం పై మేము 30 మందితో నిర్వహించిన ఒక సర్వేలో 80 శాతం మంది ఇతరులకు సాయం అందించడమే నిజమైన ఆనందంగా పేర్కొన్నారు. సహాయాన్ని పొందిన వ్యక్తుల కళ్ళలో కన్పించే.. వెలుగు, జ్యోతి తమకు పరమానందాన్ని కలిగిస్తుందన్నారు. ముగ్గురు కీర్తికి, ఇద్దరు తృప్తికి ప్రాధాన్యమివ్వగా, ఒకరు సంపద అధిక ఆనందాన్ని ఇస్తుంది అన్నారు. పసిపిల్లలతో గడపడం, నవ్వుకోవ దంలో ఆనందం ఉందని ఇద్దరు భావిస్తే, హాస్యంలో ఆనందం ఉందని మరొక ఇద్దరు భావించారు. లక్ష్యాలు సాధించి విజయాన్ని అందుకోవడంలో ఆనందం ఉందని ఒకరు భావిస్తే, పనిలో ఆనందం ఉందన్నారు మరొకరు.

ప్రతి మతం తన అనుచరులకు ఆనందాన్ని అందించడానికే తపన పడుతుంది. అయితే, మతాచార్యుల దృష్టిలో ఆనందం ఆధ్యాత్మికమైనది. అలానే రాజనీతి సిద్ధాంతకర్తలందరూ తమ సిద్ధాంతాల ద్వారా ప్రజలకు అత్యధిక ఆనందాన్ని అందించడానికే కృషి చేశారు. బెంథామ్ మహాశయుడు ఉపయోగితావాద సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ "ఆనందో బ్రహ్మ" అన్న రీతిలో "అత్యధిక ప్రజానీకానికి అత్యధిక ఆనందాన్నిచ్చేదే అత్యుత్తమ రాజ్యం" అని ఉద్ఘాటించాడు. ఆనందాలు 16 రకాలుగా ఉంటాయని, సంపద మూలంగా కొందరు, అధికారం, సంతృప్తి, విజ్ఞానం, కీర్తి, నేర్పరితనం మొదలగువాటి మూలంగా మరికొందరు ఆనందం పొందుతారు అంటాడు ఆయన. రాజనీతి సిద్ధాంతకర్తలైన చాణక్యుడు, ప్లేటో నుండి అహింసామూర్తిగా కీర్తి గడించిన మహాత్మాగాంధీ వరకు అత్యధిక ప్రజల ఆనందం కొరకే కృషి చేశారు. "ప్రతి కంటిలోని కన్నీటిబొట్టును తొలగించేదే అసలైన సోషలిస్ట్ ప్రభుత్వం" అని ఉద్ఘాటించాడు స్వామి వివేకానంద.

ఈ విధంగా మానవాళిని నడిపించే మహామంత్రం ఆనందాన్వేషణ అనడం అతిశయోక్తి కాబోదు. ఆనందానుభూతి లేనిదే మనిషి నవ్వలేడు. వారి ఆనందంలోగాని, సమస్యలలోగాని పాలుపంచుకోలేడు. అందుకే ఆనందం అంటే?: ఆనంద భావన అద్భుత భావన అంటారు. మనిషికి అత్యంత ప్రీతిపాత్రమైనది ఆనందం అని అందరూ అంగీకరిస్తారు. మరి ఆనందం అంటే ఏమిటో ముందుగా తెలుసుకోవాలికదా! సంతోషాన్ని లేదా సంతృప్తిని వ్యక్తపరచే భావన ఆనందం. నీ ఆనందం నువ్వు ఇచ్చేవాటిలో దాగివుంది. అందుకే "అందమె ఆనందం, ఆనందమె జీవిత మకరందం" అన్నాడు ఓ సినీకవి. అదొక సౌందర్య సాధనం అని కొందరు భావిస్తే, మనిషికి అసలుసిసలైన సంపద ఆనందమే అన్నారు మరికొందరు. ఆనందం ఒక అనిర్వచనీయమైన భావన. వాస్తవాన్ని

---

చిరునవ్వు నిశ్శబ్ధ నవ్వులాంటిది. – సూక్తి.

ఆమోదించడంలో, తృప్తిలో ఆనందం ఉంది. అలా కానినాడు మనిషి ఆలోచనలకు, ఆశలకు హద్దు ఉండదు కనుక అది నిరాశా నిస్పృహలకు దారితీస్తుంది. అది అనారోగ్యానికి దారితీస్తుంది. అందుకే ఆరోగ్యమే ఆనందం అన్నారు వైద్యులు. “మనకు ఎంత ఉన్నది అన్నదిగాక, మనము ఎంత అనుభవిస్తున్నాము అన్నదే ఆనందానికి మూలము” అని స్పర్షియన్ ప్రకటించగా, “ఏదో ఒకటి సాధించడంలో ఆనందం ఉంద"ని హెన్రీ ఫోర్డ్ పేర్కొన్నారు. జీవితంలో మంచిచెడుల విశ్లేషణ తరువాత మిగిలేది ఆనందం అని కొందరు భావించగా, అదొక అంతుచిక్కని రహస్యం అని తేల్చిపారేశారు మరికొందరు. మన లోపలి పట్టరాని పరవశమే ఆనందం. ఆనందం అంటే సంతోషం, సుఖం (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు) అయితే, మరి సంతోషం అంటే ఏమిటి? ఆనందాన్ని అందించేదే సంతోషం అన్న సమాధానంతో ప్రశ్న మరలా మొదటికి వస్తుంది. చిత్రం ఏమంటే ఆనందం అంటే ఏమిటో వివరించడంలో రచయితలు ఎలా ఏకీభవించలేకపోయారో, ఆనందాన్ని పొందే మార్గాల వివరణలో కూడా ఎవరి జాబితా వారిదే.

అష్టసూత్రాలు:

1. అంతశ్శుద్ధి : పూజ్యశ్రీ పరమహంస యోగానంద ప్రకారం ఆనందసాధనలో బాహ్యశుద్ధి కన్నా అంతశ్శుద్ధి మిన్న. బాహ్యంగా ఎంత అందంగా, ఆకర్షణీయంగా కన్పించినప్పటికీ దుష్టబుద్ధులు, దురాలోచనలుగల వ్యక్తిని ఎవ్వరూ గౌరవించరు. “మీ కళ్ళల్లో మీ జీవితం అంతా ఉంటుంది" అంటారు ఆయన. “సత్ప్రవర్తన, సదాలోచనలుగల వ్యక్తి తనలో తాను ఎంతగా ఆనందానుభూతిని పొందుతాడో, ఇతరులు కూడా అతనిని అంతగా గౌరవిస్తారు” అంటారు యోగానంద.

2. విధేయత: విధేయత ఆత్మ లక్షణం. ఇతరుల అభిప్రాయాలను గౌరవించడం ఎంత అభిలషణీయమో, స్వీయ ఆరాధన అంత ప్రమాదకరమైన భావన. తన పై తాను అమిత ప్రేమను పెంచుకోవడమేగాక, ఇతరులు కూడా తనను అలానే ప్రేమించాలని తాపత్రయపడటాన్ని స్వీయ ఆరాధన అంటారు. అది అన్ని అనర్థాలకు మూలం. అలెగ్జాండర్ ప్రపంచ విజేత కావాలని తపించాడు. తన లక్ష్యాన్ని సాధించిన తరువాత అందరూ తనను దైవంగా ఆరాధించాలని ఆశపడటంతో క్రమంగా అది అహంగా మారి అతని పతనం ప్రారంభమైంది. అందుకే మనుష్యులను, వారి అభిప్రాయాలను గౌరవించటం నేర్చుకోవాలి.

3. నువ్వు నీలానే ఉండు : మనలోని మనల్ని మనం కనుగొనాలి. మనం మనలాగానే జీవించాలి కాని, ఎవరినో అనుకరించడం ఎమర్సన్ పండితుని మాటల్లో

నవ్వేది, నవ్వబడేది కూడా మానవుడే. – భమిడిపాటి కామేశ్వరరావు.

“ఆత్మహత్యా సదృశం” అవుతుంది. ఇతరులను అనుకరిస్తూ తన నటనా జీవితాన్ని ప్రారంభించాడు ప్రపంచ ప్రఖ్యాత హాస్యనటుడు చార్లీ చాప్లిన్. అలా అనుకరణతో విసుగెత్తిన ఆయన చివరకు తనదైన శైలిలో హాస్యానికి ఒక వినూత్న అర్థాన్నివ్వడంతో ప్రపంచవ్యాప్తంగా గొప్ప పేరు గడించాడు. “ఇతరులవలె ఉండటానికి ప్రయత్నించ కుండా మీరు మీలానే ఉండండి. ఉన్నతులను చేరలేక, క్రిందివారితో కలవలేక జీవితాన్ని దుఃఖమయం చేసుకుంటున్నవారందరూ గుర్తుంచుకోదగిన, అనుసరించదగిన అద్భుత సూత్రం ఇదే” అంటారు డేల్ కార్నిగే.

4. తోటివారిని గౌరవించు: ఇతరులు నిన్ను ఎలా గౌరవించాలని ఆరాటపడ తావో, అలానే, ఇతరులను నువ్వు అదే రీతిలో గౌరవించడం నేర్చుకో అన్నది మరొక సూత్రం. వేలాది సంవత్సరాల క్రితమే హిందూ మతం బోధించిన సత్యం ఇదే. చైనాలో కన్ఫూషియస్, పర్షియాలో జొరాస్టర్, మధ్య ప్రాచ్యంలో జీసస్ క్రైస్ట్ అందించిన జ్ఞానం ఇదే. ఇచ్చిపుచ్చుకోవడంలో దాగివుండేదే అసలైన ఆనందం. “నువ్వు ఇతరుల ఆనందం కొరకు పరితపించడమే వివేకవంతమైన ఆనందం" అన్న లా బ్రూయరే, “నీ ఆనందం నువ్వు ఇబ్బడిముబ్బడిగా ఇచ్చేవాటిలో దాగివుంది” అన్న స్వామి చిన్మయ సందేశాల సారాంశం ఇదే. అంతేకాక, మనకు సాయం అందించిన వ్యక్తులకు కృతజ్ఞతలు తెలపడం మూలంగా సంతోషం కలగడంతోపాటు శారీరక అనారోగ్యాలు సైతం తగ్గిపోతాయన్నారు. నిస్సహాయులు, నిరు పేదలు, వృద్ధులు, పిల్లల ఎడల చూపే కరుణ, దయ, వారికి చేసే మంచి మనకు అత్యధిక సంతోషాన్ని అందిస్తుందన్నారు మరికొం దరు ప్రముఖులు. అందుకే స్వీకరించడం కాదు, ఇవ్వడం నేర్చుకో, ఏమి ఇచ్చావు అన్నది ముఖ్యం కాదు, ఇవ్వడం నేర్చుకున్నావా లేదా అన్నదే ముఖ్యం అని తెలుసుకో.

5. ప్రేమను పంచుకో : ప్రతి మనిషి కూడు, గూడు, ఆరోగ్యంతో బాటు తన కుటుంబసభ్యుల ప్రేమను కోరుకుంటాడు. పదిమందినీ ప్రేమించే వ్యక్తి అందరి ప్రేమను పంచుకుంటాడు. అందుకే ప్రతి ఒక్కరూ తమ సరదాలను, సేవలను విస్తృత పరచుకోవాలి. “వైవిధ్యమే ఆనందానికి మాతృక" అని డిజ్రాయలి ఉద్ఘాటించడానికి కారణం ఇదే. స్టాంపులు, నాణాల సేకరణ, కలం స్నేహం, యోగా, సేవ మొదలైన సరదాలను అలవాటు చేసుకోవాలి. అయితే, నీకు నచ్చిన పనినే చేయాలని తాపత్రయపడటంలోకన్నా, నీవు చేస్తున్న పనిలోనే ఆనందం దాగివుందని తెలుసుకున్ననాడు నీకొరకు ఆనందద్వారాలు తెరుచుకుంటాయి.

---

అడుగుజాడ గురజాడది, అది నవ్వుకు బాట. – శ్రీ శంకర నారాయణ

బుద్ధుడు, జీసస్, బాపూజీ, మదర్ థెరిస్సా వంటి మహనీయుల జీవితాలు మనకు నేర్పే సత్యం ఇదే!

6. చింత వద్దు:మన జీవిత లక్ష్యం ఆనందసాధన అయినప్పుడు గతించినదానిని గురించి చింతించరాదు. చింతను మాని బంగారు భవిష్యతు కలదని దృఢంగా విశ్వసించాలి. ఆనంద స్వరూపుడైన పరమేశ్వరుడు తన సృష్టి మొత్తం పై ఆనందరస వర్షాన్ని కురిపిస్తున్నాడని గుర్తించినప్పుడు ఈ విశ్వమంతా ఆనందమయంగా మారు తుంది. 'చింత వద్దు, ఆనందం ముద్దు' అంటూ ప్రతి ఒక్కరూ ముందుకు సాగాలి.

7. ఆలోచనా క్రమం : ఆనందం మానసిక సంబంధమైనది. అదొక భావన, ఒక ఆలోచనాక్రమం. ఆ ఆలోచనా క్రమాన్ని మార్చే శక్తి మనిషికి ఉన్నది. యదార్థానికి, గాఢవిశ్వాసానికి మధ్యగల వ్యత్యాసాన్ని గ్రహించే శక్తి నరాలకు లేదు. కనుక ఎంత గాఢంగా, సృజనాత్మకంగా 'నేను ఆనందంగా ఉన్నాను' అని పరిపూర్ణంగా విశ్వసిస్తే, ఊహిస్తే నువ్వు అంత ఆనందానుభూతిని పొందగలవు. ఆనందాన్ని ఎలా పొందాలి అని ఆలోచించాలేకాని, ఆనందం లేదని ఎవరినో నిందించకూడదు. నీ బాధలను సేవకులుగా మార్చుకున్నప్పుడు, నీ పరాజయాలన్నీ విజయాలుగా మారతాయి. నీ ఆనందం నీలోనే ఉందికాని బయట ఎక్కడో లేదన్నదే అన్ని మతాల బోధనలలోని సారాంశం. “ధైర్యం, నమ్మకం, శాంతి, ఆశల సమ్మేళనమే ఆనందం" అంటారు పుల్లర్. శాంతి భావనతో, ఆనందం నావైపే ఉన్నది అన్న విశ్వాసంతో, ఆశతో ధైర్యంగా ముందుకు సాగినప్పుడు ఆనందం నీ వెంటే వస్తుంది.

8. సంతృప్తిలో సంపద : లేనిదానికొరకు ఆరాటపడటంలోకన్నా ఉన్నదానితో సంతృప్తి పడటం ఆనందానికి రాచబాట. ఇదే అసలైన ఆనంద సూత్రం అంటాడు వేమన. మనకు ఉన్నదానితో మనం ఆనందించడం ఒక అదృష్టం. అయితే, సాటివారితో ఆనందం పంచుకున్నప్పుడు ఆ ఆనందం ఇబ్బడిముబ్బడి అవుతుంది. అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలను జయించగలగాలి. కోరిక లేనిదే జీవితం లేదు అన్నది ఎంత సత్యమో, ఆ కోరికలు హద్దులు దాటకూడదు అన్నది కూడా అంతే యదార్థం. బుద్ధుడు ప్రవచించినట్లుగా కోరికలకు కారణం ఆశ. ఆ ఆశకు హద్దులు ఏర్పరచినప్పుడు ప్రతిక్షణాన్ని ఆనందమయంగా మలచుకోగలం. నిజానికి ఆనందం ఉపన్యాసాలలోను, ఉద్గ్రంథాలలోను లేదు. అది మనిషి ఆలోచనారీతిలో ఉంది. అది అతని తృప్తి, స్నేహభావంలో ఉంది. -

ప్రపంచ సర్వే : ఇంక 'ఆనందం' గురించి ప్రపంచ ప్రజానీకం ఏమనుకుంటుందో తెలుసుకుందాం.

---

నవ్వు ఒక ప్రత్యేక భాష. –ఎస్.పి. శర్మ.

ప్రఖ్యాత ఆంగ్ల వారపత్రిక 'ఔట్ లుక్' ప్రత్యేక ఆనంద సంచికలో దేశవిదేశాలలో ఆనందం పై జరిపిన ప్రయోగాల ఫలితాలు అందించింది. 1990 - 2000 సంవత్సరాల మధ్యకాలంలో డచ్ పరిశోధకులు 90 దేశాలలో ఆనందం పై జరిపిన సర్వేలో 2.46 స్కోరుతో భారతదేశం 9వ స్థానాన్ని పొందగా, 3.4 స్కోరుతో ఐలాండ్ ప్రపంచంలోనే అత్యధిక శాతం ఆనందించే ప్రజలుగల దేశంగా గుర్తింపు పొందింది. భారతదేశంలో జనాభా ఎంతగా పెరుగుతున్నా, ఆకలి, నిరక్షరాస్యత, అసమానత్వం అధికంగా ఉన్నప్పటికీ, భారతీయులు ఆనందానుభూతిని పొందడంలో ప్రపంచంలోనే 9వ స్థానాన్ని ఆక్రమించడం విశేషం. .

అలానే 65 దేశాలలో 1999 - 2001 సంవత్సరాలలో నిర్వహించిన 'ప్రపంచ విలువల అధ్యయనం'లో ప్రపంచ ఆనంద సూచికలో భారతదేశం 21వ స్థానాన్ని పొందడం గమనార్హం. నైజీరియా ప్రపంచంలోనే అత్యంత ఆనందమయ దేశంగా గుర్తింపు పొందగా, రష్యన్లు, ఆర్మేనియన్లు అత్యంత అసంతృప్తిపరులుగా పేర్కొనబడ్డారు. 2008లో 'వరల్డ్ వాల్యూస్' సర్వే ప్రకారం ప్రపంచంలో అత్యధిక ఆనందం పొందే ప్రజలు డెన్మార్కు వాసులు కాగా, సంతోషం ఆనవాళ్ళు కూడా కన్పిం చని దేశం జింబాబ్వే. ఇందులో అమెరికా 16వ స్థానం సాధించగా, భారతదేశం మరింత ఉన్నత స్థానం సాధించి ఆనందభైరవి మోగించింది.

ఆనందానికి ఏవి అవసరం: పటిష్టమైన కుటుంబవ్యవస్థ, సామాజిక విలువలు, ఆత్మవిశ్వాసం, వ్యక్తిగత విజయాలు, జాతీయత పై గౌరవం మొదలైన లక్షణాలు కలిగివుండటం మూలంగా భారతీయులు ఆనందమయ జీవితాన్ని గడపగలుగుతున్నా రని అందరూ అంగీకరిస్తారు. ప్రేమ, పని, ఆశ ఆనందానికి నిలయం అన్నది మరొక భావన. దానినే బహిర్గత త్రిభుజం అంటారు. ఇంతకూ ఆనంద కొలమానం ఉందా అన్న ప్రశ్నకు ఉంది అని సమాధానమిస్తారు కోహెన్స్.

పూటే కోహెన్స్ ఆనంద సూత్రం ఇది :

H (Happiness) = P+ (5XE) + (3XH) E- (Existence)

ఇక్కడ P అంటే వ్యక్తిగత లక్షణాలు, జీవిత దృక్పథం, పరిస్థితులకు అనుగుణంగా మార్పు చెందే స్వభావం. E అంటే ఆరోగ్యం, ఆర్థిక స్థిరత్వం, స్నేహం, జీవించడం. H అంటే ఉన్నత శ్రేణి అవసరాలు, ఆత్మాభిమానం, ఆశలు, హాస్యం మొదలైనవి.

---

ఓ రాజుకు జ్వరం పట్టుకుంది. ఎన్నిమందులిచ్చినా అది తగ్గలా. ఒకాయన చెప్పాడు 'రాజుకు ఏమందు మాకు పనిచెయ్యవు. నిరంతరం ఆనందంగ ఉండేవాని చొక్కా తెచ్చి ఆయనకు వేస్తే జ్వరం తగ్గుతుంద'ని. భటులు ఆ నిత్య సంతోషికొరకు వెతకడం ప్రారంభించారు. వెతికి, వెతికి చివరకు అతన్ని పట్టుకున్నారు. చెట్టుకింద పండుకొని హాయిగా పాటలు పాడే అతనివద్దకు వెళ్ళి 'నువ్వెప్పుడూ ఇలానే ఆనందంగ ఉంటావా?" అని అడిగారు. అతను నవ్వుతూ 'ఔను' అన్నాడు. 'నిత్యం ఆనందంగ ఉండే అతని చొక్కాను ధరిస్తే రాజుగారి జ్వరం తగ్గుతుంద'ని చెప్పారు. 'జబ్బుతో ఉన్న మా రాజుగారికి నీ చొక్కా ఇస్తావా' అంటూ ఆత్రంగా అడిగారు భటులు. 'మరి నాకు చొక్కానే లేదే. నేనెలా ఇవ్వగలను?' అన్నాడు అతను సమాధానంగ!

ప్రపంచంలో ప్రతి ఒక్కరు, ప్రతి జీవి ఆనందం కొరకు తాపత్రయపడతారు. ప్రతి మతం అదే చెబుతుంది. ప్రతి బోధకుడు అదే చెబుతాడు. అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో ఆనంద అన్వేషణ హక్కును అతి ప్రధాన హక్కుగ పేర్కొన్నారు. భూటాన్ దేశం తన దేశ సంపదను తలసరి ఆదాయం ఆధారంగగాక, తలసరి ఆనందం ప్రాతిపదికన నిర్ణయించడం విచిత్రంగ వినిపించినా అది యదార్థం.

ఆధునిక కంప్యూటర్ యుగం గురువు దీపక్ చోప్రా ప్రకారం పరిసరాలనుబట్టి ఆనందం లభిస్తుంది. గుఱ్ఱం స్వారీ నేర్చుకున్నట్లే కొంత శిక్షణ ద్వారా ఆనందాన్ని పొందవచ్చంటాడు ఆయన. ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త ఈస్ట లిన్ సంపద పెరిగినంత మాత్రాన ఆనందం పెరగదని ఒక సూత్రం ద్వారా నిరూపించాడు. దానినే ఈస్టర్లిన్ విరోధాభాసం (Easterlin Paradox) అంటారు. సంపన్నులందరూ ఆనందరావులు కారన్నది ఎంత యదార్థమో, ఆనందంగ జీవించడానికి కొంత ప్రశాంతత, నిలకడ ఉండాలన్నదీ అంతే యదార్థం. ఆనందం స్థిరమైనది కాదు. బాలునిగ నీకు ఆనందం కల్గించిన అంశం యువకునిగ కల్గించకపోవచ్చు. దేవుని పై ధ్యాస పెట్టి ధ్యానం చెయ్యడమే అసలైన ఆనందం అని వేదాంతం చెబితే, "ఆనందానికి ప్రత్యేక మార్గం అంటూ ఏమీలేదు. ఆనందమే ఒక మార్గం" అంటుంది జెన్ తత్వం. విచారసాగర మర్దనం చేయండి. అనంత ఆనందం పొందండి. ప్రతి విషయంలో ఆనందాన్ని చూడగలగడంలోనే నిజమైన ఆనందం దాగివుంది. అలా చేయగలిగిననాడు నిజంగ ఆ 'ఆనందరావు' చొక్కాను ధరించినట్లు అవుతుంది (Geeta Padmanabhan, The Hindu 17-1-10).

---

హాయిగా నవ్వుకోవడాన్ని మించిన ఆటవిడుపు లేదు. – మిల్టన్ బెర్లె

సంతోషంపై అధ్యయనం : మనస్సు, శరీరం, సంతోషానికి మధ్యగల సంబంధాన్ని చక్కగా విశ్లేషించిన ఘనత అమెరికన్ మనోవిజ్ఞాన శాస్త్రవేత్తల సంఘం అధ్యక్షుడు సెలిగ్మన్కి చెందుతుంది . అలానే, ఇల్లినాయిస్ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న ఎడ్వర్డ్ డైనర్ 'ఆనందమూర్తి'గా కీర్తి గడించారు. బాధలకు కారణం గురించి బుద్ధుడు యోచిస్తే, సంతోషానికి కారణం గురించి ఆయన అన్వేషణ సాగించారు. స్నేహితులతో, బంధువులతో ఎక్కువ సమయం గడిపేవారు అధిక ఆనందం పొందు తారని వారు ఉద్ఘాటించారు. “అనుమానించడం మానండి. అర్థం చేసుకోవడం ప్రారంభించండి"; "ఆశావహదృక్పథం అలవరచుకోండి. విసుగుకు వీడ్కోలు చెప్పి, ఇంక హాయిగా ఆనందం పొందండి" అంటారు వారు. రోటర్ డ్యామ్ లోని ఎరాస్మస్ విశ్వవిద్యాలయంలో సంతోషం పై అధ్యయనం జరిపేందుకు ప్రత్యేకంగా ఒక పత్రికను (Journal of Happiness Studies) నిర్వహించడం ముదావహం.

ఆనందకొలమానం : ఎడ్వర్డ్ డైనర్ 1980లో రూపొందించిన 'Satisfaction with Life Scale' విధానం మంచి ప్రాచుర్యం పొందింది. ఇందులోని 5 ప్రశ్నలు చదివి ఒక్కొక్క ప్రశ్నకు ఎదురుగా ఇచ్చిన సమాధానాలలో మీకు నచ్చిన ఒకదానిని (నిజం కాదు....కొంతవరకు నిజం.... పూర్తిగా నిజం) గుర్తించండి.

ప్రశ్నావళి:

1. నా ఆదర్శాలకు అనుగుణంగా జీవిస్తున్నాను.
2. నా జీవన స్థితిగతులు చక్కగా ఉన్నాయి.
3. నేను సంతృప్తిగా జీవిస్తున్నాను.
4. ఇంతవరకు నా జీవితంలో నేను కోరుకున్నవన్నీ పొందగలిగాను.
5. నా జీవితం మరలా మొదలైనా ఇప్పటిలాగానే జీవిస్తాను..

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| | | | | | | |

నిజంకాదు కొంతవరకు నిజం పూర్తిగా నిజం

ఇప్పుడు మీరు ప్రతి ప్రశ్నకు మీ సంతోషం స్థాయిని మార్క్ చేయండి. ఆ తర్వాత 5 ప్రశ్నలకు వచ్చిన పాయింట్లు మొత్తాన్ని కలపండి. మీ స్కోర్ ఆధారంగా మీది ఎంత సుఖవంతమైన జీవితమో మీకు మీరే తెలుసుకోండి.

---

జీవిత వృక్షం కొనను పూచిన పువ్వే నవ్వు.- ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

స్కోర్ బోర్డ్:

31-35 పాయింట్లు : మీది పూర్తిగా సంతృప్తికరమైన జీవితం

26-30 పాయింట్లు : సంతృప్తిగా జీవిస్తున్నారు

21-25 పాయింట్లు : కొద్దిగా సంతృప్తిగా జీవిస్తున్నారు

20 పాయింట్లు : అటు సంతోషంగాని, ఇటు అసంతృప్తిగాని లేని జీవితం

15-19 పాయింట్లు : కొద్దిగా అసంతృప్తిగా ఉన్నారు

10-14 పాయింట్లు : అసంతృప్తిగా ఉన్నారు

5-9 పాయింట్లు : పూర్తి అసంతృప్తితో జీవిత రథాన్ని లాగిస్తున్నారు.

ఆనందోబ్రహ్మ: ఈ విధంగా నాటినుండి నేటి దాకా ప్రపంచవ్యాప్తంగా 'ఆనందం' పై ఎన్ని అధ్యయనాలు జరిగినప్పటికీ ఇప్పటికీ ఆనందం ఒక బ్రహ్మపదా ర్థంలా మిగిలిపోయింది. ఇటీవల జరిపిన ఒక అధ్యయనంలో మతం మూలంగా అమెరికాలో 85 శాతం, హాలండ్‌లో 9 శాతం, ఫ్రాన్స్ లో 7 శాతం ప్రజానీకం ఆనందం పొందు తున్నారని తేలింది. గత నాలుగు దశాబ్దాలుగా (1972, 1982, 2006లో జరిగిన అధ్యయనాలు) అమెరికా ప్రజలలో 30 శాతం మంది మాత్రమే ఆనందంగా జీవిస్తున్నా రని తేలడం మరొక చిత్రంగా కన్పిస్తుంది.

మేము సేకరించిన సుమారు పదివేల సూక్తుల పుస్తకంలో 'ఆనందం' పైన అత్యధిక పేజీలు చోటుచేసుకోవడంలోనే దాని విశిష్టత తెలుస్తుంది. వాటిలో మచ్చుకు కొన్ని ఏమి చెబుతాయో చూద్దాం.

ఆనందంగా ఉండాలంటే మూడు విషయాలు అవసరం - మంచి బ్యాంక్ అకౌంట్, మంచి వంటవాడు, మంచి జీర్ణశక్తి (రూసో);

ఆనందం మనలోనే ఉంది కాని వస్తువులలో లేదు (మోర్గాన్);

సమదృష్టి ఆనందానికి మూలం (బ్రహ్మకుమారీస్);

ఏదీ శాశ్వతం కాదు అని తెలుసుకోవడంలోనే గొప్ప ఆనందం ఉంది (జిడ్డు కృష్ణమూర్తి);

ఖాళీ సమయం లేనివాడే ప్రపంచంలో అత్యధిక సంతోషి (జాన్ ఇ.గిబ్బన్).

ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ఆనందసాధన పై అసంఖ్యాక పుస్తకాల ప్రచురణకు, అనేక శాస్త్రీయ పరిశోధనలకు, నవ్వుల క్లబ్‌లు, వర్క్ షాపుల స్థాపనకు కారణం ఏమిటి? ఆనందంగా జీవించేవారు అత్యధిక సంఖ్యలో స్నేహితులను ఆకర్షిస్తూ, అధిక మొత్తాలలో

---

నమ్మకు నవ్వలేని వాడిని, పువ్వులు చిదిమే వాడిని. – ఆధునిక కవి తిలక్

సంపాదిస్తూ సృజనాత్మకంగా, ఆరోగ్యంగా జీవించడమే దీనికి కారణం అంటారు పరిశోధకులు. కుటుంబ స్థితిగతులు 10 శాతం మాత్రమే ఆనందానికి దోహదం చేస్తే, మిగిలిన 40 శాతం భాగాన్ని నీకుగా నువ్వు నిర్మించుకోవచ్చు అంటారు వీరు. ఖరీదైన కారు, అందమైన ఇల్లు, జేబునిండా డబ్బు ఇత్యాదులు తాత్కాలిక ఆనందాన్ని స్తాయేకాని, అసలుసిసలైన ఆనందం అందించలేవంటారు.

అంకితభావంతో, అమితోత్సాహంతో పనిచేయడంలో అమితానందం లభిస్తుంది అంటారు విల్ ఫీసన్. మధురగీతాలు వింటూ, నాట్యం చేస్తూ ఆనందించడం, పెద్దగా నవ్వడం - ఇవన్నీ దీని క్రిందకే వస్తాయి. ప్రశాంతంగా పడుకొని విశ్రాంతి తీసుకుంటూ మిత్రులతో, ఆప్తులతో గడిపిన మధురక్షణాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఆనందాన్ని నిర్మించవచ్చు అంటారు ఆయన.

**పంచ సూత్రాలు :** చివరగా ఆనందం పై ప్రాచీన, అధునాతన రచనలలోని సారాంశాన్ని ఇక్కడ పాఠకులకు అందించదలచాము.

1. ఆనందాన్ని వెతుకుతూ కాలం గడపకు. అది నీలోనే ఉందన్న సత్యాన్ని గ్రహించు.

2. పొందడంలో ఆనందం లేదు. ఇవ్వడంలో, సంతృప్తిగా జీవించడంలోనే ఆనందం ఉంది.

3. కుటుంబసభ్యులతో, మిత్రులతో అధిక సమయం గడపడంలో అత్యంత ఆనందం లభిస్తుంది.

4. పరిపూర్ణ ఆనందం పొందాలంటే నిజంగా నిన్ను నువ్వు ప్రేమించుకోవాలి. నీపైన నీకు గౌరవం ఉండాలి.

5. చక్కని హాస్యోక్తులు చదువుతూ, హాస్యోక్తులు విసురుతూ జీవించు. పొందిన ప్రయోజనానికి కృతజ్ఞతలు చెప్పడం నేర్చుకో అన్ని కళలు ఆనందం కోసమే. మనిషి పుట్టుక, మనుగడ కూడా ఆనందం కోసమే. ఆనందం యొక్క బహిర రూపమే హాస్యం. ఇది ఆనందం యొక్క విశ్వరూపం. ఇది దాని నిజస్వరూపం. మరి దానిని కొలిచేదెలా? ఇంక పేజీ తిప్పండి.

---

చక్కని హాస్యభావన జీవశక్తికి మూలం: సర్వశ్రేష్ఠతు మార్గం. – హార్వే మైండెస్

అధ్యాయం 13

# హాస్య కొలమానం

పూసపాటి మహారాజుతో ప్రముఖ విద్వాంసుడు నడిమింటి సంగమేశ్వరశాస్త్రి ఏదో విషయమై సంభాషిస్తున్న సమయమది. హఠాత్తుగా మహారాజావారు నవ్వుతూ "శాస్త్రి గారూ! మీ ఇంటి పేరు నడిమిల్లు అనడం విచిత్రంగా ఉందండి. అది ముందు ఇల్లు కాదు, వెనుక ఇల్లు కాదు, ఈ నడిమిల్లు ఏమిటండి?" అని ప్రశ్నించారు ఆశ్చర్యంగా. దానికి శాస్త్రిగారు వినయంగా "మహారాజా! నడిమిల్లు అంత విలువైనది కాకపోయినా కనీసం పూస...పాటి కూడా చెయ్యదంటారా!" అనడంతో మహారాజావారు నిరుత్తరు డయ్యారు.

కొందరు గట్టిగా నవ్వితే, మరికొందరు మెల్లగా నవ్వుతారు. ఎవరు ఏ మోతాదులో నవ్వుతున్నారో ఒక కొలమానం ద్వారా చెప్పగలమా? ఈ వాక్యాలు చదువుతుంటేనే నవ్వు వస్తుందా? అయినా......... శాస్త్రవేత్తలు హాస్య సూత్రాన్ని కనుక్కున్నారు. ఆ సూత్రం ఇది : X= (f1+no)1p

అయితే, వాస్తవంగా హాస్యాన్ని ఇలాంటి గణాంక సూత్రాలతో వివరించగలమా? లండన్‌లో రాయల్ టెలివిజన్ సొసైటీవారు 2003లో నిర్వహించిన హాస్యపోటీలలో అత్యుత్తమ అవార్డును పొందిన జిమ్మీకార్ ప్రకారం "ఈ సూత్రం పూర్తిగా పనికిమాలింది". "నవ్వు ప్రకృతిసిద్ధమైనది. కంప్యూటర్ల సూత్రాలతో దానిని బంధించబూనడం అర్థరహితం". హాస్యోక్తులను గతానికి వర్తించే రీతిలో విశ్లేషించగలం. అందువల్లనే శాస్త్రవేత్తలు ఎప్పుడూ హాస్యాన్ని సృష్టించలేరు కాని, నేను మాత్రం ఆ పని చేయగలను" అన్నారు ఆయన. ప్రఖ్యాత హాస్యనటుడు బెర్నార్డ్ మానింగ్ "హాస్యోక్తి విలువ దానిని చెప్పే పద్ధతి పై ఆధారపడి ఉంటుంది. నిరంతర విద్యార్థిగా 71సంవత్సరాల వయస్సులో కూడా ఇప్పటికీ నేను దానిలోని మెళకువలను తెలుసుకుంటూనే ఉన్నాను. దానికి ఇలాంటి సూత్రాలను రూపొందిం చడం చెత్త, అర్థరహితం " అన్నారు.

విచిత్రమేమంటే బెంథామ్ మహాశయుడు ఆనందాన్ని కొలవడానికి ఆనంద కలన గణితం (Felicific Calculus) అను సూత్రం రూపొందించారు. ఆనందాన్ని, బాధను గుణాత్మకంగా కొలవవచ్చునంటారు ఆయన. ఆనందాలను 16 వర్గాలుగా (సంపద, కీర్తి మొదలగు), బాధను 11వర్గాలుగా (శతృత్వం, ద్వేషం, అపకారబుద్ధి మొదలైనవి) విభజించాడు బెంథామ్.

---

అవివేకమైన హాస్యోక్తి కన్నా హాస్యోక్తి గల అవివేకం మిన్న. – షేక్ స్పియర్

ఈ హాస్య సూత్రాన్ని ప్రపంచంలో గొప్ప హాస్యోక్తికి ప్రయోగిద్దామా? బ్రిటన్లోని లాఫ్ లాబ్ (నవ్వుల ప్రయోగశాల) రిచర్డ్ వైజ్ మన్ నేతృత్వంలో ప్రపంచం నలుమూలల నుండి హాస్యోక్తులను ఆహ్వానించి, అన్నింటిలో ఉత్తమమైన హాస్యోక్తిగా అదేదేశానికి చెందిన 31 సంవత్సరాల వయసుగల మనోవిజ్ఞాన శాస్త్రవేత్త గురుపాల్ గోశాల్ పంపినదానిని ఎంపిక చేసింది. ముందు ఆ హాస్యోక్తి ఏమిటో తెలుసుకొని, ఆ తరువాత దాని ప్రత్యేకతను పరిశీలిద్దాం.

అమెరికాలోని న్యూజెర్సీకి చెందిన ఇద్దరు వేటగాళ్ళు అడవులలోగుండా ప్రయాణం చేస్తుండగా, హఠాత్తుగా వారిలో ఒకరు నేలకొరిగారు. క్రమంగా అతని శ్వాస తగ్గిపోయిం ది. గుడ్లు పీక్కుపోయాయి. దాంతో రెండవవాడు భయంభయంగా తన సెల్ ఫోన్ తీసుకొని ఎమర్జెన్సీ సర్వీస కు ఫోన్ చేశాడు. ఆపరేటర్‌తో ఆందోళనా స్వరంతో “మా - మిత్రుడు చనిపోయాడు. నేనేం చేయాలి?" అంటూ కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాడు. ఆ ఆపరేటర్ మాత్రం ప్రశాంతంగా ఊరడించేరీతిలో “భయపడకు. నేను నీకు పూర్తిగా సహాయం చేస్తా. అయితే, ముందుగా అతను చనిపోయాడో లేదో నిర్ధారించుకుందాం” అన్నాడు. కొంచెం సేపు నిశ్శబ్దం తాండవించింది....ఆ తర్వాత తుపాకీ పేలిన శబ్దం.....వెంటనే వేటగాడు లైన్ లోకి వచ్చి ఆపరేటర్ తో “O.K. ఇప్పుడేం చేయాలి?" అన్నాడు.

ప్రపంచంలో నెంబర్ 1 హాస్యోక్తి. ఇంతకూ ఈ చతురోక్తిలోని ప్రత్యేకత ఏమిటి? ఇది ప్రపంచంలోనే గొప్ప హాస్యోక్తి అని ఎలా నిర్ధారించబడింది? దానికి గురుపాల్ గోశాల్ విశ్లేషణ ఇది : "ఈ హాస్యోక్తిని నేను అమితంగా ప్రేమించడానికి రెండు కారణాలు ఉన్నాయి:

1. దీనిని చదివినవారందరూ ఒక అందమైన అనుభూతిని పొందుతారు.
2. మనకన్నా వెర్రిబాగులవారు ఈ ప్రపంచంలో చాలామంది ఉన్నారని అది గుర్తుచేస్తుంది”.

లాఫ్ లాబ్ ప్రాజెక్ట్ అధినేత ఈ హాస్యోక్తి ప్రత్యేకత గురించి ఇలా తెలిపారు. “ప్రపంచవ్యాప్తంగా మాకు అందిన మొత్తం 40 వేల హాస్యోక్తులలో అత్యధిక శ్రోతలను ఆకర్షించిన హాస్యోక్తి ఇది. హాస్యోక్తికి అవసరమైన ముఖ్యమైన మూడు లక్షణాలు దీనిలో ఉన్నాయి.

1. మూర్ఖుడైన ఆ వేటగాడికన్నా మనం ఉన్నతులుగా భావించుకుంటాము,
2. ఆపరేటర్‌ను అపార్థం చేసుకున్న ఒక అప్రస్తుత అంశం ఇందులో స్పష్టమవు తుంది.
3. మన జీవిత కాలానికి సంబంధించిన ఆందోళనను గురించి నవ్వు వస్తుంది. ప్రజలు హాస్యోక్తిని చదివి నవ్వడానికి ప్రధానంగా 3 కారణాలున్నాయి.

---

నవ్వు అనేది తక్షణ సెలవు వంటిది. – మిల్టన్ బెర్లే.

(i) ఒక హాస్యోక్తిని చదివిన తరువాత ఇతరులకన్నా మనం ఉన్నతులం అన్న భావన కలుగుతుంది.

(ii) భావావేశాన్ని, ఆదుర్దాను సృష్టించే పరిస్థితులకు ఉపశమనం కలిగిస్తుంది.

(iii) హాస్యోక్తిలోని అసంబద్ధత మూలంగా మనకు ఆశ్చర్యం కలుగుతుంది.

ఆ మూడు లక్షణాలు ఈ హాస్యోక్తిలో ఉండటమే దీని ప్రత్యేకత" అంటారు వైజ్ మన్. అయితే, దీనికి రాబర్ట్ ప్రొవైన్ ఇలా భాష్యం చెబుతారు - హాస్యం ఎప్పుడూ నిబద్ధమైన అప్రస్తుతం అనే నిర్మాణం చుట్టూ తిరుగుతూ ఉంటుంది. X కొరకు ఎదురుచూస్తుంటే, Y రావడంతోనే ఆశ్చర్యం కలగడం సహజమే కదా! హాస్యోక్తి అందంగా ఉండాలంటే అది ఆ రెండు కోణాలనుండి చక్కగా చదువదగినదిగా ఉండాలి. ఈ హాస్యోక్తిలోని విచిత్రమేమంటే వేటగాడు అతని స్నేహితుని నాడిని పరీక్షించి ఉండవచ్చు లేదా అతణ్ణి కాల్చివేసి (షూట్ చేసి) ఉండవచ్చు. దీనిని చదివిన తరువాత ఆ వేటగాడు తన మిత్రుని నాడిని పరీక్షిస్తాడని అనుకుంటాం. అయితే, అక్కడ జరిగింది మాత్రం బాధాకరమైన సంఘటన. హాస్యోక్తిలో 'ఈ అప్రస్తుతానికి కొన్ని పరిమితులు ఉంటాయి. ఆ వేటగాడు తన బూట్ల లేసులను విప్పదీశాడనో, చెప్పు ఎత్తాడనో చెబితే అది అప హాస్యం అవుతుంది.'

మహామేధావి అయిన బెంథామ్ సూత్రాలతో ఆనందాన్ని కొలవగలననడం ఎంత హాస్యాస్పదంగా ధ్వనిస్తుందో, హాస్యోక్తి స్థాయిని గణాంక సూత్రాలతో బంధించబూనడం కూడా అంతే హాస్యాస్పదంగా కన్పిస్తుంది. మరి అంతటి మేధావులు తెలిసి తెలిసి ఇలాంటి అసంగత సూత్రాలను ప్రతిపాదించడమే గొప్ప హాస్యోక్తినా!

అధునాతనుల కృషి : మరి అధునాతనుల కృషి ఏమిటో ఇప్పుడు చూద్దాం. జపాన్ శాస్త్రవేత్త ఆచార్య యోజికిమూరా నవ్వుల పై దశాబ్దాలుగా అధ్యయనం చేసిన ఘనాపాటి. మనిషి మెదడులో నవ్వే సర్క్యూట్ ఉందని చెబుతూ, నవ్వులను లెక్కకట్టడా నికి దానిని కొలిచే పరికరం కనుగొన్నారు. కాస్తంత హాయిగా నవ్వడం, మామూలు స్థితికన్నా భిన్నంగా ఉండటం, పూర్తి హాయిగా నవ్వడం, పకపకా నవ్వడం అని నవ్వులను నాలుగు ప్రధాన దశలుగా ఆయన విభజించారు. మనిషి నవ్వులను లెక్క కట్ట డానికి ఆయన పొట్టకు 'స్పెన్సర్లు' అతికించవచ్చన్నారు. ఆ పరికరాన్ని మొబైల్ ఫోన్ సైజులో నిర్మించాలన్నది ఆయన ఆకాంక్ష. ఇవన్నీ తెలుసుకున్న తరువాత మరి హాస్యం శాస్త్ర స్థాయికి చేరిందో లేదో తెలుసుకోవాలి కదూ!

---

మనిషి ఆలోచిస్తాడు. దేవుడు నవ్వుతాడు. – యూదుల సామెత.

అధ్యాయం 14

# హాస్యం శాస్త్రమా?

భర్త : ఈసారి ఏదైనా ఆటంకంవచ్చి మన అమ్మాయి పెళ్ళి ఆగిపోతే ఆరు అంతస్తుల మేడ పైనుండి దూకుతా!

భార్య : ఏమండీ! మన ఊరిలో ఆరు అంతస్తులమేడ లేదుకదండీ!

భర్త : అలా అయితే మూడు అంతస్తుల మేడలు ఉన్నాయి కదా! వాటి పై నుండి రెండుసార్లు దూకుతా. సరేనా?

ఆధునిక యుగం శాస్త్రీయయుగం. శాస్త్రాన్ని మినహా నేటి నాగరిక మానవుడు దేనినీ విశ్వసించలేని స్థితికి ఎదిగాడు. అందుకే ఈ నాడు ప్రతి పాఠ్యాంశం హాస్యంతో సహ శాస్త్రం'గా గుర్తించబడటానికి తహతహలాడుతూంది.

'శాస్త్రం' అనగా 'విజ్ఞానం' అని అర్థం. దాని లక్షణాలు ఇవి: 1. క్రమబద్ధమైన విజ్ఞానం 2. శాస్త్రీయ పద్ధతి 3. నిర్దిష్టమైన సూత్రాలు 4. సరియైన కొలమానాలు కలిగివుండటం 5. భవిష్యత్తును నిర్ధారించి చెప్పగలగడం. ప్రయోగాత్మకంగా నిరూపించడం, నిర్ధారించడం దాని తత్వం. "తర్కము,సాక్ష్యము ఆధారంగా రూపొందించబడిన నిర్దిష్టమైన విజ్ఞానమే శాస్త్రం" అనేది మరొక నిర్వచనం.

'కళ' అనగా నేర్పరితనం. అది సృజనాత్మకమైనది, చలనశీలమైనది. శిక్షణ ద్వారా దానిని అభివృద్ధి చేసుకోవచ్చు. హాస్యం శాస్త్రం కాదు అనడానికి కనీసం 5 కారణాలు కన్పిస్తాయి.

i) హాస్యం నిర్వచనం, అధ్యయన పద్ధతులు, కొలమానాలు, దాని స్వరూపం, స్వభావం మొదలైన మౌలిక విషయాలలో కూడా రచయితలలో ఏకాభిప్రాయం. హాస్యం పై దాదాపు వెయ్యి నిర్వచనాలు ఉన్నాయంటే, దానిని గురించి రచయితలలో ఎంత వైవిధ్యం ఉందో ఇట్టే అర్థమవు తుంది.

ii) హాస్యం అధ్యయన పద్ధతులు అశాస్త్రీయంగా కన్పిస్తాయి. దాని విషయంలో సర్వజన సమ్మతమైన అధ్యయన పద్ధతి లేదు. అది వర్గీకరణ నియమాలకు, సూత్రాలకు భిన్నమైనదని కొందరు ఉద్ఘాటించారు. హాస్యం ప్రధానంగా వ్యక్తిగతమైనది. కొందరికి మొరటు హాస్యోక్తులు ఇష్టమైతే, మరికొందరు నాజూకు హాస్యోక్తులను -ఆదరిస్తారు. ఆరోగ్యకర హాస్యం మంచిదని విజ్ఞులు పేర్కొంటారు.

---

నేలబారు నవ్వుకన్నా నేలబారు విషయం మరేదీ లేదు. – కాటుల్లస్

iii) క్లిష్టమైన మానవ స్వభావాన్ని గురించి, విచక్షణా జ్ఞానంగల మనిషిని గురించి హాస్యం అధ్యయనం చేస్తుంది. ఒకరికి నవ్వు తెప్పించే అంశం మరొకరికి వెగటు పుట్టించవచ్చు. అందుకే ఇక్కడ నిత్యసత్యాలు రూపొందించడానికి అవకాశం తక్కువ. భౌతిక, రసాయనిక శాస్త్రాలలోవలె ఇక్కడ నిర్దిష్ట ఫలితాలు వచ్చేంతవరకు ప్రయోగాలు చేయడానికి అవకాశం లేదు.

iv) జీవ, రసాయనిక శాస్త్రాలకు చక్కని కొలమానాలు ఉన్నాయి. మానవ ఆనందం కొలమానాలకు అతీతం అని అందరకూ తెలిసిందే.

హాస్యోత్పత్తి : హాస్యోత్పత్తి ఎలా జరుగుతుంది? భాష, భావం, విరుపు, పరిసరాలు, చెప్పే పద్ధతి, మానసిక సంబంధాలు మొదలైన అనేక అంశాలు హాస్యోత్పత్తిలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. ఈ హాస్యోక్తులు చూడండి :

లూయీ సింక్లర్ గొప్ప మేధావి. తనకు నోబెల్ బహుమతి వచ్చిందని తెలియడంతో, ఆ ఆనందాన్ని తన భార్యతో పంచుకోడానికి హడావుడిగా ఆఫీస్ నుండి ఇంటికి వెళ్ళాడు. ఆయన ఆదుర్దాను చూసిన భార్య “ఏమైందండి! అప్పుడే ఇంటికి వచ్చేశారేమిటి? అంత హడావుడిగా ఉన్నారేమిటి?” అని ఆదుర్దాగా ప్రశ్నించింది. సంతోషంతో ఉప్పొంగిపోతున్న సింక్లర్. “డియర్! నీకు ఈ వార్త చెప్పడం ఎంతో ఆనందంగా ఉంది. నాకు...... నాకు నోబెల్ బహుమతి వచ్చింది” అన్నాడు ఆమె భుజాలమీద చేతులు వేస్తూ. ఆవిడ మరింత ఆశ్చర్యపోతూ “అదేదో గొప్పవాళ్ళకు... వచ్చే బహుమతి కదండీ....మీకెలా వచ్చింది” అంటూ ఆశ్చర్యాన్ని, అనుమానంతో జోడిస్తూ సాగదీసింది.

అద్దం కొత్తగా ప్రవేశపెట్టబడిన రోజులవి. సుబ్బన్నకు పొలంలో ఓ చిన్న అద్దంముక్క దొరికింది. అందులో చూసేటప్పటికి అతనికి తన తండ్రి కనిపించాడు. అంతే! అతనికి ఎంతో ఆనందం, ఆశ్చర్యం కలిగాయి. ఆ అద్దాన్ని భద్రంగా ఇంటికి తీసుకువెళ్ళి బీరువాలో దాచాడు. రోజూ పొద్దున్నే లేవడంతోనే పదినిమిషాలు ఆ అద్దంలో తన తండ్రిని చూస్తూ ఆనందంతో ఏవేవో మాట్లాడేవాడు. ప్రతినిత్యం జరుగుతున్న ఈ తంతును చూసిన ఆయన భార్య సావిత్రికి అనుమానం వచ్చి భర్త పొలం వెళ్ళిన తరువాత ఆ అద్దం తీసుకొని అందులోకి చూసేటప్పటికి ఓ అందమైన అమ్మాయి కనిపించింది! “అయ్యో ఇంకేముంది. నా కొంప కూలింది. ఎవత్తినో ఒకదాన్ని పట్టుకొచ్చి రోజూ కులుకుతున్నాడు” అని గోల చేసింది. ఇంతలో పొరుగింటి పుల్లమ్మ ఆ అరుపులు విని “ఏమైందే సావిత్రి” అంటూ వచ్చింది. విషయం అంతా విన్న ఆమె అద్దం చూసి ఫక్కున నవ్వింది. “మరీ చోద్యం కాకపోతే

---

సానుభూతికి విరుగుడుగా నవ్వు జనించింది. – విలియం మాగ్డొగాల్

ఏందమ్మా! అంత ముసలిదాన్ని ఎందుకు తెచ్చుకుంటాడు? ఛ... అరవ్వాకు.....ఎవరైనా వింటే నవ్విపోతారు" అంటూ హితబోధ చేసింది.

హాస్యోత్పత్తి అవగాహనకు అంశాల విరుపు, పరిసరాలు మొదలగు అనేక అంశాల విశ్లేషణ అవసరం అవుతుంది. దీనినే మన్రోబియలే 'తార్కిక అసంగత్వ సిద్ధాంతం' (Logical Absurdity Theory) గా అభివర్ణించారు. ఒకానొక అలంకారంలోని రెండు భావాలు, పదాలు భాషాపరంగా అర్థరహితంగా, పరస్పర విరుద్ధంగా కన్పించినప్పటికీ, దానికి ప్రత్యేక అర్థం కనుగొనాల్సిన అవసరం ఉంది. ఆమె "చంద్రబింబానన" (ఆమె ముఖం చంద్రబింబంలా ఉంది.), "గజగమన" అన్న ప్రయోగాలు భాషాపరంగా, బాహ్యంగా అసంబద్ధంగా కన్పించవచ్చు. అయితే, వాటిలోని ఒకానొక మెలికద్వారా ఆ ప్రయోగంలోని ప్రత్యేక అర్థాన్ని శోధించినప్పుడు మొదట వింతగా, అర్థరహితంగా, పరస్పర విరుద్ధంగా కన్పించిన ఉపమానం కవితాత్మకంగా చూసినప్పుడు ఉత్సాహభరితంగా, వినోదాత్మకంగా, హాస్యోక్తిగా ప్రత్యక్షమవుతుంది.

ఈ విధంగా హాస్యం అర్థంలేని తార్కిక అసంగత్యం (నిరరకత) లేదా వైరుధ్యంలాంటిది. దానికి మరొక స్థాయిలో (Level) అర్థాన్ని కనుగొనడానికి తీవ్ర ప్రయత్నం చేసేకన్నా, నవ్వుతో, ఆనందమయమైన శారీరక భావాలతో ప్రతిస్పందిస్తాము.

ఈ హాస్యోక్తులు చూడండి :

మహాభారతంలోని ఒక కథలో తమ ఏకైక సంతానం మరణించడంతో అతనిని స్మశానవాటికకు తెచ్చి తల్లిదండ్రులు, బంధువులు భోరున విలపిస్తున్నారు. అప్పుడు రాబందు, నక్క వారితో ఇలా అంటున్నాయి.

రాబందు : సూర్యాస్తమయం కాబోతుంది. మరణించినవాడు ఎలాగూ తిరిగిరాడు. ఇంక ఇంటికి వెళ్ళండి!

నక్క: రేపు ఎలాగూ చూడలేరు. అందుకని సూర్యాస్తమయం అయ్యేదాకా ఉండండి. రాబందు పగలు, నక్క రాత్రిపూట శక్తిమంతంగా ఉంటాయి కనుక ఆ అబ్బాయిని ఎప్పుడు పూడ్చి పెడితే బాగుంటుందో పరోక్షంగా అవి సలహా ఇస్తున్నాయన్నమాట!

హాలుని గాథాసప్తశతిలోని ఒక గాథ : చీకటి పడటంతో ఓ బాటసారి ఒక ఇంటి తలుపు తట్టాడు. ఓ అందమైన జవ్వని వచ్చి తలుపు తీసింది. "చాలాదూరం పోవాలి. ఇప్పటికే బాగా అలసిపోయాను. ఈ రాత్రికి మీ ఇంట్లో తలదాచుకోనిస్తారా?" అతి మర్యాదగా అడిగాడు. అందుకు ఆమె నవ్వుతూ "బాటసారీ! ఇది సాయం సమయం. వర్షం

---

మన మిత్రుల దురదృష్టాన్ని చూచి మనం నవ్వుకుంటాం. – ప్లేటో

వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. నా అత్తమామలా బాగా వృద్ధులు. అవిటివారు కూడా, నా భర్తేమో దూరదేశానికి వెళ్ళాడు. ఒంటరితనంతో నాకు మన్మథ బాధ ఎక్కువైంది. నీవేమో..... అందమైన....యువకుడివి! మరి.....మా ఇంట్లో ఎలా చోటివ్వమంటావు?" అని నర్మగర్భంగా ప్రశ్నించింది. ఆమె మాటలలోని అంతరార్థాన్ని గ్రహించలేని ఆ బాటసారి మొదట తెల్లమొహం పెట్టాడు. తర్వాత ఆ మాటలను అర్థంచేసుకొని ఆ రాత్రికి ఆమెకు తోడుగా ఉండి, ఆమె కోరిన సుఖాలనిచ్చాడు.

హాస్యం వర్గీకరణ : హాస్యోక్తికి, హాస్యోక్తి కానిదానికి మధ్య తార్కికంగా విభజన రేఖను ఎవరు గీయగలరు? దానికి కారణాలు చూద్దాం.

1.అత్యంత క్లిష్టం : హాస్యం వర్గీకరణ అత్యంత క్లిష్టమైనది, కష్టమైనది. హాస్యం రకాలు కుక్క జాతులవంటిది. "కుక్కలలో ఎన్ని జాతులు ఉన్నప్పటికీ, అన్నింటిలోను కుక్క ఉంటుంది కదా!" అని ఒక రచయిత చమత్కరించాడు. అందువలన ఎంత జాగ్రత్తగా హాస్య వర్గీకరణ జరిగినప్పటికీ, అక్కడ అతివ్యాప్తి (Over lap) చోటుచేసుకుంటుంది. ఒకే హాస్యోక్తిలో రకరకాల హాస్యాలు ఇమిడి ఉండవచ్చు. "అతను గొరిల్లాలా ఉన్నాడు" అనే వాక్యంలో వ్యంగ్యం, అతిశయోక్తి, అర్థరాహిత్యం , భ్రాంతి, వైరుధ్యం ఇలా ఎన్నో వర్గీకరణలు సాధ్యమవుతాయి. అందువల్లనే హాస్యాన్ని వర్గీకరించడం అంటే మనం మాట్లాడే, వ్రాసే భాషానుభవాన్నంతా, ప్రవర్తననంతటినీ వర్గీకరించడమే అవుతుంది.

సిసిరో హాస్యాన్ని 3 రూపాలలో - అలంకార శాస్త్రరీత్యా, రూపకంగా, తర్క విరుద్ధ రూపంగా - వర్గీకరించాడు. హాస్యం కూడా ఆవేశం వంటిదే కనుక ఆవేశాన్ని వర్గీకరించి రీతిలో హాస్యాన్ని కూడా వర్గీకరించవచ్చు. అయితే, దానిలో ఉద్రిక్తత మాత్రం కన్పిస్తుంది.

(i) నిర్ధారిత ఉద్రిక్తత : హాస్యోక్తి, వ్యంగ్యం, అస్పష్టత, ఖండన, అర్థరాహిత్యం , బోళాతనం, వృత్తాకార హాస్యాలు ఇందుకు ఉదాహరణలు.

సోవియట్ యూనియన్ అధినేత నికిటా క్రుశ్చేవ్ సైబీరియాలో పర్యటిస్తూ ఓ శతాధిక వృద్ధుణ్ణి చూసి "అక్టోబర్ విప్లవం తరువాత ఆనందంగా ఉన్నారా?" అని ప్రశ్నించాడు.

వృద్ధుడు : గతంలో నాకు 2 సూట్లు, 2 జతల బూట్లు, 4 ఫర్ కోట్లు ఉన్నాయి. ఇప్పుడేమో నాకు అన్నీ ఒక్కొక్కటే మిగిలాయండి.

క్రుశ్చేవ్ : ఏమీ బాధపడకండి! చైనా, ఇండియా, ఆసియా, ఆఫ్రికాలలో ప్రజలకు అవి కూడా లేవు. వారు దిగంబరులుగా తిరుగుతారని తెలుసా!

వృద్ధుడు : (తలగోక్కుంటూ, కన్నీళ్ళు కుక్కుకుంటూ) 'బహుశా వారికి మనకన్నా ముందుగానే సోషలిస్టు విప్లవం వచ్చి ఉంటుంది' అనడంతో క్రుశ్చేవ్ నిరుత్తరుడయ్యాడు.

(ii) శారీరక స్పందనలతో కూడిన ఉద్రిక్తత : నవ్వు, వెకిలి నవ్వు, చక్కిలిగింత నవ్వు, వ్యంగ్య చిత్రాలు, పలాయన హాస్యం, మానసికానుభూతి, నిరాశాజనక, పరాజిత నిరీక్షణ హాస్యం ఇందుకు ఉదాహరణలు. అవి శారీరక స్థితులలో కొన్ని అనుభూతుల వర్ణనలు మాత్రమే.

ఒక కప్పకు రూపాయి నాణెం దొరికింది. అది దానిని తీసుకువెళ్ళి భద్రంగా కన్నంలో దాచుకుంది. ఒకరోజు ఏనుగు ఒకటి ఆ కన్నం దగ్గరగా నడుస్తుండగా దానిని తన్నడానికి అన్నట్లుగా కప్ప కాలెత్తింది. వెంటనే తేరుకొని “నా తలమీదగా పోవడానికి నీకు ఎంత ధైర్యం” అంటూ కన్నంలో కూర్చొని అరిచింది. డబ్బు మదం ఇలా ఉంటుంది అంటాడు రామకృష్ణ పరమహంస..

(iii) క్రియాశీలక ఉద్రిక్తత : జుగుప్సాకరమైన హాస్యంగల నాటిక, చపలత, ముసిముసి నవ్వు, వేధింపు, అనుకరణ, నయవంచన, ఇకిలింతలు దీని క్రిందకు వస్తాయి.

బ్రిటన్‌కు చెందిన గ్లాడ్ స్టోన్, డిజ్రాయలిలు గొప్ప రాజకీయ నాయకులు. ఒకనాడు వారిద్దరి మధ్య వాదోపవాదాలు తీవ్రస్థాయికి చేరాయి. రెచ్చిపోయిన గ్లాడ్ స్టోన్ “నువ్వు ఉరికంబం మీదనైనా చస్తావు, లేకుంటే భయంకరమైన వ్యాధితోనైనా నాశనమవుతావు” అని డిజ్రాయలికి శాపనార్థాలు పెట్టాడు. అందుకు డిజ్రాయలి నవ్వుతూ “అదంతా నేను నీ సిద్ధాంతాలను ఆచరిస్తానా లేక నీ భార్యను ఆలింగనం చేసుకుంటానా అనేదాని పై ఆధారపడి ఉంటుంది. ఇంక పో” అన్నాడు.

(iv) పరిస్థితుల ఉద్రిక్తత : తమాషా, వ్యంగ్య పరిస్థితులకు సంబంధించిన హాస్యం. సందర్భ వక్రీకరణ, విచలనం ఇందుకు ఉదాహరణలు.

అలెగ్జాండర్ మహా చక్రవర్తి. డయోజనిస్ ప్రముఖ తత్వవేత్త. ఒకరు అహంకారానికి, అధికారానికి ప్రతినిధి కాగా, మరొకరు విజ్ఞానానికి, నమ్రతకు చిహ్నం. ఒకరోజు అలెగ్జాండర్ డయోజనిస్ వద్దకు వెళ్ళి “నా పేరు అలెగ్జాండర్ ది గ్రేట్. మహా సామ్రాజ్యా నికి మహారాజును నేను” అన్నాడు. అందుకు ఆ తాత్వికుడు "అయ్యా! నేను డయోజనిస్.....కుక్కను” అని సమాధానం ఇచ్చాడు. అలెగ్జాండర్ నవ్వుతూ “నీకేం కావాలో కోరుకో” అన్నాడు గర్వం ఉట్టిపడుతున్నట్లుగా, డయోజనిస్ నెమ్మదిగా “రాజా! సూర్యుని ఆవల నిలబడి వెలుగునిస్తారా?” అని ప్రశ్నించడంతోనే రాజుగారి మతి తిరిగిపోయింది.

---

కష్టాలలో మిత్రుని వంటిది నవ్వు. – వివేకానంద కేంద్రపత్రిక

ప్రతి హాస్య భేదాన్ని నిర్దిష్ట ప్రకటనలకు, మదింపులకు అనుగుణంగా కుదించుకోవచ్చు. ఈ సిద్ధాంతం విస్తృత వివరణకు, లోతైన నిర్దిష్టతకు అవకాశం కల్పిస్తుంది.

2. భాషా సంబంధ సిద్ధాంతం: ఈ సిద్ధాంతం ప్రకారం హాస్య విధానం ఒక భాషా క్రీడలాంటిది. ఇక్కడ హాస్యం భాషకు, దార్శనికతకు ప్రాధాన్యం ఇస్తుంది. భాషా క్రీడగా దానికి రెండు ప్రయోజనాలు ఉన్నాయి. 1) అది నిరాశా నిస్పృహలను తొలగించుకోడానికి, ఇతరులను అనునయించడానికి ఉపయోగపడుతుంది 2) అది విశ్లేషణకన్నా క్రియకు ప్రాధాన్యం ఇస్తుంది.

3. రూపకం-హాస్యం: అలంకార భేదాలే హాస్యభేదాలుగా కూడా పనిచేస్తాయి. భాషను సంప్రదాయకంగా, అలంకారంగా వర్గీకరిస్తారు. అందువలన హాస్యాన్ని కూడా అలంకార కోణం నుండి - దాని ప్రధాన విభాగమైన రూపకం నుండి వర్గీకరించవచ్చు. వర్గీకరణలు ఎలా ఉన్నా హాస్యం ఆనందించడానికేగాని, హేళనకు కాదు. అది జనరంజకంగా ఉండాలి. అందుకే చతురోక్తులను విసరడంలో మనం జాగ్రత్త వహిం చాలి. కోపతాపాలను అదుపులో ఉంచుకోవాలి. దీనినే 'హేతుబద్ధ అహం' అంటారు. ఎల్లప్పుడూ హాస్యాన్ని మనం నియంత్రించాలేకాని, అది మనల్ని నియంత్రించకూడదు. హాస్యం ఎంతో విలువైనది, మానసీయమైనది కనుక, అది లేని జీవితం కాని, సమాజం కాని నిస్ప్రాణంగా, నిస్తేజంగా మారతాయి. ఈ విధంగ ఇక్కడా స్పష్టత కన్పించడం లేదు.

ఏ హాస్యం మంచిది? : "లోకో భిన్నరుచి" అన్న సామెతలా కొందరికి మొరటు హాస్యం నచ్చితే, మరికొందరు సున్నిత హాస్యం అంటే మక్కువ చూపుతారు. కొన్ని వర్గాలనో, మతాలనో, జాతులనో విమర్శించే హాస్యం పై కొందరు ఉత్సాహాన్ని చూ పెడితే, మరికొందరికి ఆరోగ్యకర హాస్యం, ఇంకొందరికి వ్యంగ్య హాస్యం ఇష్టం. ఏమైనా కాలమాన పరిస్థితులకు అనుగుణంగా హాస్యం ఉండాలి. అది ఆరోగ్యకర హాస్యం అయి ఉండాలి.

అత్యధిక సర్దార్జీ హాస్యోక్తులు ఇతరులను ఎంతగా కడుపుబ్బ నవ్విస్తాయో, సర్దార్జీలకు అంత బాధను కలిగించవచ్చు. మహిళా సమావేశంలో మహిళల పైన అసభ్యకరమైన హాస్యోక్తులు పేలిస్తే ప్రేక్షకురాండ్రు హాస్యకారుణ్ణి పేల్చేయవచ్చు. అలానే, మేధావులు మెచ్చే హాస్యం సామాన్యులకు నచ్చకపోవచ్చు. అందువల్లనే హాస్యం ప్రధానంగా వ్యక్తిగతమైనదని చెప్పవచ్చు.

---

హృదయ మనోవేదనను వినిపించకుండా చేసే కళ నవ్వు. – కోలరిడ్జ్

హాస్యానికి ఒక నియమావళిని తయారుచేయలేము. కళలానే హాస్యం కూడా అనిర్వచనీయమైనది. ఒక వ్యక్తి మెచ్చే హాస్యోక్తిని బట్టి అతని సంస్కృతి, వ్యక్తిత్వం వ్యక్తమవుతాయి.

హాస్యోక్తి మానవతా దృక్పథం కలిగి ఉండాలి. అంతర్ దృష్టి, ఉన్నతి, ప్రేరణ కలిగించలేని హాస్యం తాత్కాలిక ఆనందం కలిగిస్తుందే కాని, చిరకాలం మనజాలదు.

ఆనందం కలిగించడంతోబాటు అత్యున్నతంగా ఉండేది ఉత్తమ హాస్యోక్తి అంటుంది. మునిమాణిక్యం గారు హాస్యాన్ని సరసోక్తి, ఛలోక్తి, విశేషోక్తి - ఇలా 25 శీర్షికల క్రింద విభజించారు. అందులో పర్యాయోక్తి ఒకటి. ప్రతిదానికి అడిగిన ప్రశ్నలోనే సమాధానాన్ని వెదకడానికి ప్రయత్నించడాన్ని పర్యాయోక్తి అంటారు. ఒక పర్యాయం నెహ్రూ గారికి, పత్రికా విలేకరికి మధ్య జరిగిన సంభాషణ దీనికి మంచి ఉదాహరణ.

పత్రికా విలేకరి : (నెహ్రూ గారిని ఉద్దేశించి) బీహార్ వరదలు ఎలా ఉన్నాయండి?

నెహ్రూ : అంతా జలమయంగా ఉంది.

విలేకరి : అకాల వర్షాలకు కారణం ఏమిటండి?

నెహ్రూ : సకాలంలో వర్షాలు పడకపోవడమే.

ఇదంతా హాస్యం పైన, దాని వర్గీకరణ పైన జరిగిన అనంత అధ్యయన సారాంశం. హాస్య చికిత్స పైన, మనిషి ఎందుకు నవ్వుతాడు అన్న అంశం పైన, ఆనందం పైన ఇటీవల కాలంలో విస్తృతంగా పరిశోధనలు జరుగుతున్నమాట నిజమే అయినప్పటికీ హాస్యం ఇంకా 'శాస్త్రం' స్థాయికి ఎదగలేదని మనం అంగీకరించాల్సిందే. దానిని 'హాస్య కళ' అనడమే సమంజసం. హాస్యం శాస్త్రం కాదని తెలిసికూడా దీని పై ఇంత చర్చ జరపడం ఒక మెగా హాస్యోక్తి అవుతుంది కదూ అంటారా? ఇంక దానిపై ఎలాంటి పరిశోధనలు జరుగుతున్నాయో తెలుసుకుందాం.

---

అవివేకి నవ్వు కుండ క్రింద ఉంచిన ముండ్లు చిటపటలాడినట్లుంటుంది. – బైబిల్

అధ్యాయం 15

# హాస్యంపై పరిశోధనలు

కొత్తగా ఫోన్ పెట్టించుకున్న ఓ ఆసామి చెన్నైలోని తన మిత్రుడికి ఫోన్ చేసి "హలో..... కాంతారావు ఉన్నాడా?" అని అడిగాడు.

"భోంచేస్తున్నట్లున్నాడు..... పిలుస్తానండి. లైన్ లో ఉండండి" జవాబిచ్చింది ఆయన భార్య శ్యామల.

"తల్లీ! ఇక్కడ వందలమందేమీలేరమ్మా.... లైన్‌లో ఉండటానికి... నేనొక్కడ్లే ఉన్నా" అన్నాడు ఆ ఆసామి ఆశ్చర్యంగా.... -

పరిశోధనలు అనడంతోనే కొందరు హాస్యోక్తులు విసురుతారు. వెనుకటికి ఒకాయన ఉల్లిపాయలో భాస్వరం ఉందంటే ఓ డాక్టరేట్ ఇచ్చారట! మరికొంతకాలానికి ఇంకొకా యన ఉల్లిపాయలో భాస్వరం లేదని సిద్ధాంతీకరిస్తే ఆయనకూ డాక్టరేట్ ఇచ్చారట! నిన్న మొన్నటిదాకా పిల్లలు చాక్లెట్లు తినడం మంచిది కాదని వైద్యులు చెబుతుంటే, ఇప్పుడే ఒకాయన ఆరోగ్యరీత్యా అది మంచిదని బల్లగుద్ది చెప్తున్నాడు. అయితే, హాస్యం పై పరిశోధనలు ఎలాంటివో ఈ అధ్యాయం చదివాక మీరే చెప్పండి!

ప్రపంచంలో ఎన్ని రకాల మనుషులు ఉన్నారో, అన్ని రకాల హాస్యోక్తులు కన్పిస్తాయి. పైకి అన్నీ ఉదాహరణలు. మనిషికి అత్యంత ఆత్మీయమైన నవ్వుకు సంబంధించిన అనేక ప్రశ్నలు ఇప్పటికీ చిక్కు ప్రశ్నలుగానే మిగిలాయి. మనిషి ఎందుకు నవ్వుతాడు? ఏయే వ్యక్తులు ఎలాంటి హాస్యోక్తులు వేస్తారు? నవ్వు ఎలా ఆరోగ్యదాయిని? - ఇలాంటి ఎన్నో, ఎన్నెన్నో సమస్యలపై ప్రయోగాలు జరగడం ఆనందదాయకం. ఇంక ఆ ప్రయోగాల గురించి తెలుసుకుందాం.

హాస్యం గొప్ప ఆరోగ్యదాయిని అంటారు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం ఆచార్యుడు నవ్వు మూలంగా మెదడు పనితీరుపై ప్రత్యేక ప్రభావం కన్పిస్తుందని ఆయన సిద్ధాంతీకరించారు. నవ్వించేది ఏదైనా కన్పించడంతోనే మన గుండె కొట్టుకునే వేగంలో మార్పు వస్తుందని, ఆదుర్దా తగ్గుతుందని మరొక వైద్య ప్రముఖుడు నిర్ధారించాడు. హాస్యభావంగల విద్యార్థులకు ఒక టాపిక్ ఇచ్చి - ఉదా!! కెమేరా గురించి - మాట్లాడమంటే, వారి గుండె 80-85 సార్లు కొట్టుకోగా, ఆ భావం లేనివారి గుండె 100 సార్లు కొట్టుకుందన్నది వేరొక పరిశోధన.

---

చిన్నారుల నవ్వును అసహ్యించుకునేవాడిపట్ల జాగ్రత్తగా వ్యవహరించు. –లవటర్

నవ్వు ముఖాలు అందరినీ అలరిస్తాయి, ఆకర్షిస్తాయి కనుకనే, ప్రకటనదారులు ఎప్పుడూ అలాంటి ముఖాలనే ఎంపిక చేస్తారు. అలానే, మానసిక రోగులను బాగా నవ్వించగలిగితే వారి ప్రవర్తనా సమస్యలను కొంతవరకు పరిష్కరించవచ్చంటారు పరిశోధకులు. అంటే, భావోద్రేకాలన్నీ మన నరాల వ్యవస్థ పై ఒకే ప్రభావం కలిగిస్తాయని తెలుస్తుంది. వ్యక్తిత్వ వికాస సిద్ధాంతం పరిశోధనలో హాస్యం పాత్ర గురించి విల్ బాల్డ్ రూష్, హాన్స్‌లు గావించిన కృషి ప్రశంసనీయం. నిజానికి 'హాస్యం - వ్యక్తిత్వం' అధ్యయనానికి పితామహుడు హాన్స్. సుమారు 60 సంవత్సరాల క్రితమే ఆయన హాస్యం పై భావనా సంబంధమైన, క్రమబద్ధ అంశాలను గురించి అనేక నమూనాలను అందించారు.

సామాజిక సందర్భం : నవ్వు, హాస్యం ప్రజలందరి సొత్తు. అది జన్మతః మానవునికి లభించిన వరం.

వ్యక్తుల మధ్య, సమావేశాల లోను సర్వత్రా ప్రత్యక్షమయ్యే హాస్యం గురించిన అధ్యయనానికి ప్రయోగశాలల పై ఆధారపడటం అర్థరహితం.

భాషా శాస్త్రవేత్త హాస్యాన్ని భాషా కోణం నుండి పరిశీలిస్తాడు "పులికి, మేకకు వ్యత్యాసం ఏమిటి? " పులి క్రూరజంతువు, మేక సాధుజంతువు అన్నది భాషాతత్వవేత్త లేదా సామాజిక శాస్త్రవేత్త ఆలోచన. “పులి క్రూరజంతువు, మేక కూరజంతువు" అని వివరిస్తాడు హాస్యకారుడు.

ఆరోగ్యానికి రహదారి నవ్వు :హాస్య ప్రశంసలో హాస్య గ్రహణశక్తి ప్రాధాన్యత పై పీటర్ డెర్క్స్, రోజ్ మెరీ స్టాలే వంటి ప్రముఖులు కృషి చేశారు. అయితే, పెద్దలలో హాస్యోక్తి లేదా కార్టూన్‌ను అవగాహన చేసుకోడానికి అవసరమైన అంతర్బుద్ధి పరిమాణం గురించి స్పష్టమైన నిర్ణాయకపద్ధతిని వారు రూపొందించలేకపోయారు. దీనికిగాను తమ దేశంలో కన్పించని, పొరుగు దేశాలలో సర్వసాధారణమైన హాస్యోక్తుల శ్రేణులు కనుగొనడానికి డెర్క్స్ ప్రత్యేక కృషి గావించారు.

మానసిక స్థితికి(Mood), హాస్యానికి మధ్య గాఢమైన సంబంధం ఉంది. ఒకానొక క్షణంలోని మానసిక స్థితి పై హాస్య గ్రహణశీలత ఆధారపడు తుంది. హాస్యోక్తి లేదా కార్టూన్ మొదలైన అంశాలకు సంబంధించిన సమాచార సత్యగ్రహణం, వాటిని మనం అభినందించే స్థాయి ఆధారంగా మన నవ్వు తీవ్రతను తెలుసుకోవచ్చు. బాధలలో ఉన్నవారి మానసిక స్థితిలో మార్పు తీసుకురావడంలో హాస్యోక్తి ప్రభావం చూపుతుందని, అలానే, సానుకూలస్థితిలో ఉన్నవారిలో అది మరింత ఉత్సాహాన్ని రేకెత్తిస్తుందని ప్రయోగాత్మకంగా

---

నవ్వు పోయిందంటే, రోగం వచ్చిందన్నమాటే. – వెండేర్

తేలింది. అలానే, హాస్యం మానసిక స్థితిలో మార్పు తెస్తుందని తెలియనివారు ఈనాటికీ 66 శాతం ప్రజానీకం ఉన్నారని పరిశోధనల ద్వారా తెలిసింది. అందువల్ల హాస్యం, హాస్యోక్తుల ప్రాధాన్యాన్ని గురించి, వాటి కౌశలాన్ని గురించి జనావళికి చాటిచెప్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

బాధలతో విలవిలలాడే వ్యక్తులను చూసినప్పుడు మన ముఖకవళికలతోబాటు మన ఆలోచనలు కూడా హఠాత్తుగా మారతాయి. మనం ఒకవిధమైన అసహనానికి గురవుతాము. అలానే, నవ్వు ముఖాలను చూసినప్పుడు, కేరింతలుకొట్టే ప్రదేశాలలో తిరిగేటప్పుడు మనం చలాకీగానే కాక, ఆరోగ్యంగా కూడా ఉంటామని అమెరికాలో జరిగిన పరిశోధనలు స్పష్టం చేశాయి. మానసిక ఒత్తిడిని పెంచే చిత్రాలు (సినిమా లేదా టి.వి. ద్వారా) చూసినవారిలో కలిగిన ఒత్తిడి రక్తప్రసరణ వేగాన్ని 35% మందగింపజేస్తే, హాస్యం పండించే, నవ్వు తెప్పించే చిత్రాలు చూసినవారిలో రక్తప్రసరణ వేగం22% పెరిగిందని మేరీలాండ్ విశ్వవిద్యాలయం శాస్త్రవేత్తలు నిర్ధారించారు. దీనినిబట్టి అను కూల భావోద్రేకాలు ఆరోగ్యం పై గణనీయమైన ప్రభావం కలిగివుంటాయని స్పష్టం అవుతుంది. .

రోజూ 15 ని||లు నవ్వు..... గుండె జబ్బులకు దూరం అవ్వు : రక్తనాళాలలోని అంతర్గత కణజాలాన్ని (దీనినే ఎండోథెలియం అంటారు) అభివృద్ధిపరచడంలో నవ్వు దోహదం చేస్తుంది. రక్తనాళాలను నియంత్రించడంలోను, రక్త ప్రవాహం, అందులోని రసాయనాలు, అంటు వ్యాధులు మొదలైనవాటి పై బలమైన ప్రభావాన్ని చూపే ఎండోథెలియంను ఆరోగ్యకరంగా నిర్వహించడంలో నవ్వు సహాయపడుతుంది. అందువల్లనే బ్రిటీష్ హార్ట్ ఫౌండేషన్ ఆచార్యుడు ఆండ్రూ స్టెప్టో "రోజుకు 15 నిమిషాలు నవ్వు - గుండె జబ్బులకు దూరం అవ్వు" అని, "హాస్య ప్రియత్వాన్ని అలవరచుకో, ఆశావహదృక్పథాన్ని పెంపొందించుకో" అని బోధించారు.

పిల్లల హాస్యంపై పరిశోధనలు : దీనిపై డోరిస్ బెర్లిన్ సుదీర్ఘ అధ్యయనం చేశారు. ఇక్కడ హాస్యం పై పరిసరాల ప్రభావం, జన్యు ప్రభావాలు ఏది ఎంతవరకు ప్రభావం చూపుతుందో, పదిమందితో కలసినప్పుడు హాస్యం విషయంలో వ్యక్తిగత వ్యత్యాసాలు ఎంతవరకు కీలకపాత్ర వహిస్తాయో అధ్యయనం చేయాలన్నారు.

ఈ నేపథ్యంలో ఆలోచించినప్పుడు మనం మరికొన్ని అంశాలకు కూడా ప్రాధాన్య మివ్వాలి. జన్యురీత్యా, పరిసరాలరీత్యా కవలల మధ్య వ్యత్యాసం ఉండదు కనుక వారిలో హాస్యోక్తి ఏకరూపంలో ఉంటుందా? మరి కవలల మధ్య హాస్యోక్తిలో వ్యత్యాసం కన్పిస్తే

---

హాస్యంలో జన్యు, పరిసరాల ప్రభావంకన్నా వ్యక్తిగత ఆలోచనకు ప్రాధాన్యం ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. ఏమైనా ఈ విషయంలో మరింత పరిశోధన జరగాలి. కొందరిలో బహిర్వర్తనం (Extroversion) అధికమైతే, మరికొందరిలో అంతర్ముఖత్వం (Introversion) అధికంగా కన్పిస్తుంది. ఇలాంటివారిలో వంశపారంపర్యంగా వస్తున్న ఇష్టా ఇష్టాలకు, హాస్యోక్తికి మధ్య సంబంధం ఉన్నదా? హాస్యం జన్యు సంబంధమైన వ్యక్తిగత లక్షణమా లేక అంతర్బుద్ధికి సంబంధించిన అంశమా? అది జన్యు సంబంధమైన ప్రభావం అయితే, ఆ ప్రభావం ప్రథమంగా ఎప్పుడు ప్రారంభమవు తుంది? ఆ ప్రభావం జీవిత కాలం కొనసాగుతుందా లేక పరిసరాల సంపర్కం మూలంగా క్రమంగా బలహీనపడుతుందా? మొదలైన అంశాల గురించి అధ్యయనం చెయ్యడం అవసరం.

కవి సామ్రాట్ మాత్రమేకాక, హాస్య సామ్రాట్ కూడా అయిన విశ్వనాథ సత్యనారాయణగారికి వేలాది సన్మానాలు జరగడం సహజమే! అయితే, ఒక సన్మానసభలో సభా నిర్వాహకుల పిసినారితనం ఆయనను బాధించడంతో, ఆయన తన ప్రసంగంలో నిర్వాహకులను అభినందిస్తూనే మెత్తగా అభిశంసించారు. "నాకు తరచు సన్మానాలు జరుగుతుంటాయి. అయితే, మీరు చేసిన ఈ సన్మానం మా ఇంటావిడను కూడా సంతోషపెట్టడం విశేషం. అందుకు మీకు ప్రత్యేకంగా ధన్యవాదాలు చెప్పుకోవాలి. వడియాలు పెట్టుకోడా నికి ఇంట్లో సరైన వస్త్రం లేదని తరచు మా ఆవిడ సణుగుతూ ఉంటుంది. ఇప్పుడు మీరు బహూకరించిన శాలువాను చూసి ఆమె ఎంతో మురిసిపోతుంది. నా ప్రతిభను, పలుకుబడిని కూడా ఆమె మెచ్చుకుంటుంది. అందువల్ల నేడు నాకెంతో ఆనందంగా ఉంది...." అన్నారాయన. ఇలాంటి హాస్యం జన్మతః లభించిందా లేక అపార పాండిత్యం మూలంగా / అనుభవ ఫలితంగా లభించిందా?

మరికొన్ని అధ్యయనాలు : ఒఫ్రానెవో, హెయిన్ అహరాన్సన్, తదితరులు హాస్యం పై ప్రేరేపణ, అంతర్బుద్ధి, భావోద్వేగం, సామాజిక ప్రవర్తనా అంశాల ప్రభావాన్ని గురించి ప్రత్యేక అధ్యయనం చేశారు. హాస్యాన్ని కొన్ని నైపుణ్యాల సమూహంగా మనం ఆమోదిస్తే, పిల్లలు, పెద్దలు కూడా వారు ఎదిగే కొద్దీ భిన్నరూపాలలో దానిని అభివృద్ధిపర చుకుంటూ ఇతరులకు కూడా నేర్పాలి. నవ్వు ఒక అద్భుత ప్రక్రియ అయితే, దానిని ఆనందించే విషయంలో కొన్ని సందర్భాలలో కొంత విజ్ఞానం, కొంత లోకజ్ఞానం, కొంత మానసికశక్తి అవసరం అవుతాయి.

భమిడిపాటి కామేశ్వరరావుగారు గొప్ప హాస్యప్రియులు. ఒక పర్యాయం ఆయన ఒక పాఠశాల వార్షికోత్సవంలో ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగిస్తుండగా మధ్యలో వర్షం

---

చిరునవ్వు చిందించే ముఖమే ఉత్తమమైన సిఫారసు పత్రం. – షేక్ స్పియర్

ప్రారంభమై, క్రమంగా పెరిగింది. భమిడిపాటివారు నవ్వుతూ "సంవత్సరానికి ఒక్కసారి వచ్చేది వార్షికోత్సవం. ఇటీవల కాలంలో వర్షం కూడా అలానే వస్తుంది. అందుకే దీనిని వార్షికోత్సవం అని కాక, వర్షకోత్సవం అందాం" అనడంతో సభలో నవ్వుల పువ్వులు పూశాయి. మరొక సభలో ఆయన "కారుచౌక ఏది?" అని ప్రశ్నించారు. సభలోనుండి ఏ సమాధానం రాకపోవడంతో ఆయనే, "పుకారు" అని అనడంతో అందరూ హాయిగా నవ్వుకున్నారు.

"పండితులు కలిస్తే డబ్బాలు కొట్టుకుంటారు" అన్నాడు ఒకాయన, "ఆ.....ముక్కు పొడుం డబ్బాలులే" అన్నాడు మరొకాయన. "ఇవి నగరపాలక సంస్థలా లేక నరకపాలక సంస్థలా?" అన్నాడు యువకుడు.

ఆరోగ్యకర హాస్యం : వ్యక్తిత్వ వికాసంలో హాస్యరూపాలన్నీ మంచివే అన్నది ఒక భావన. అయితే, కొందరు రచయితలు అందరినీ నవ్వించేది ఆరోగ్యకర హాస్యం క్రిందకువస్తే, కులం, మతం, రూపం, జాతిని కేంద్రంగా తీసుకొని హాస్యోక్తులు విసరడం అనారోగ్యకర హాస్యం క్రిందకు వస్తుంది అంటారు. మొత్తంమీద వ్యక్తి స్వభావం, ప్రవృత్తి అవగాహన హాస్య పరిశోధనలో ప్రాధాన్యం వహిస్తాయి. అలానే, ఆరోగ్యానికి, హాస్యోక్తికి మధ్య సంబంధం కన్పిస్తుంది. ఆరోగ్యవంతునివలె వ్యాధిగ్రస్తుడు ఆనందంతో హాస్యాన్ని స్వీకరించలేడు కదా!

ప్రతి మనిషి సగటున రోజుకు 17 పర్యాయాలు నవ్వుతాడట! నవ్వేటప్పుడు ప్రతి 20 మిల్లీ సెకన్ల కాలంలో ఒక పర్యాయం శబ్దం వెలువడుతుందట! నవ్వు మనిషికి ఒక ముఖ్య సాధనం. నోరంతా తెరచి నవ్వితే ఏడాదికి 2.5కిలోల బరువు తగ్గుతారని, ఓ అరగంట నడక పావుగంట నవ్వుతో సమానమని వాండర్ బిల్ట్ యూనివర్సిటీ (అమెరికా) పరిశోధకులు తేల్చారు.

నవ్వు వెనకాల ఇంత గ్రంథం ఉందంటే, సామాన్యులు నవ్విపోతారు! నిజానికి విద్యావేత్తలు, మేధావులు మనిషిలోని వ్యతిరేక లక్షణాలకు - ద్వేషం, కోపం, ఆశ, ఆందోళన, తిరుగుబాటు - ఇచ్చిన ప్రాధాన్యం అనుకూల లక్షణాలకు - ప్రేమ, సానుభూతి, దాతృత్వం, హాస్యం, అవగాహన - ఇవ్వకపోవడం బాధాకరమైన విషయం. స్థూల జాతీయ సంపదకన్నా, స్థూల జాతీయ ఆనందం ముఖ్యమని జిగ్మే సింగ్వే వాంగ్ చుక్ పేర్కొనడం వెనుక ఎంతో అర్థం ఉంది! అందుకే హాస్యం పై పరిశోధనలు మరింత లోతుగా, మరింత విస్తృతంగా జరిగినప్పుడు, ఆ ఫలితాలు మానవాళికి ఇతోధికంగా సాయపడతాయి అన్నట్లు... ప్రాచీన భారతంలో కూడా హాస్యభావన ఉన్నదా? వివరాలకు పేజి తిప్పండి!

---

అవమానాన్ని క్రోధాన్ని ఎదుర్కొగల ఒకే ఒక ఆయుధం చిరునవ్వు. – గాంధీజీ

అధ్యాయం 16

# ప్రాచీన భారతంలో హాస్యభావన

మన ప్రాచీన గ్రంథాలలో హాస్యం ఎందుకు చోటుచేసుకోలేదు? హాస్య స్వరూపాన్ని, స్వభావాన్ని సవిమర్శకంగా, సాధికారికంగా తెలిపిన ఆధునిక రచయితలు ముట్నూరి సంగమేశం, మునిమాణిక్యం నరసింహారావు, వేదవల్లి తాయారమ్మ ప్రభృతులు ప్రాచీన భారతదేశంలో హాస్యం పై ప్రత్యేక రచనలు లేకపోవడానికి, వారు హాస్యరసానికి ప్రాధాన్యం ఇవ్వకపోవడానికి పేర్కొన్న కారణాలు ఇవి:

1. ఇహంకన్నా పరం ముఖ్యం : మన పూర్వీకులు గంభీరులు, వేదాంతులు. వారు ఇహంకన్నా పరాన్ని గురించిన ఆలోచనలకే అధిక ప్రాధాన్యం ఇచ్చారు. నిత్యసత్యాల అన్వేషణలో, సృష్టి మూలసూత్రాలను కనుగొనడంలో దృష్టి కేంద్రీకరించిన ఆ ఆధ్యాత్మికవాదుల రచనలలో నవ్వు, హాస్యంలాంటి అతి సామాన్య విషయాలు ఎలా చోటుచేసుకుంటాయి? ఇదే కారణం వల్లనేనేమో చైనా, గ్రీసు, ఈజిప్టు వంటి ప్రాచీన నాగరిక దేశాలలో కూడా హాస్యానికి అంతగా ప్రాధాన్యం కన్పించదు.

2.సానుభూతికి కేంద్రం : మన సంస్కృతి ప్రధానంగా సానుభూతికి కేంద్రం. అభిమానాన్ని పొందడం, ప్రేమను పంచడం, సానుభూతి చూపడంలో ఉన్న ఆనందం ఆనాటి ప్రజలకు నవ్వించి కవ్వించడంలో లేకపోయింది. రాముడు, కృష్ణుడు, శివుడు మొదలైన మహాత్ములు ఉదాత్తంగా, ఉన్నతంగా కన్పించాలని భక్తులు కోరుకుంటా రేకాని, వారు నవ్వుతూ ఉండాలని భావించరుకదా! గౌతమబుద్ధుడు ఎన్నడూ నవ్వలేదని చెబుతారు. గంభీర భావాల వ్యక్తీకరణలో హాస్యానికి చోటుండదని అందరకు తెలిసిందే. అందుకే సోక్రటీసు, ప్లేటోలాంటి ప్రముఖులు కూడా హాస్యాన్ని గురించి చులకనగానే భావించారు.

3. మేధావులకే పరిమితం : లక్షణ గ్రంథాల్లో కూడా హాస్యం పై లక్ష్యం లేకపోవడం తో అది ఉపేక్షణీయమైంది. నాటి సాహిత్యం జనసామాన్యానికి సంబంధిం చిన సాహిత్యం కాకపోవడం, అది మేధావులకు, రాజుల ఆస్థానాలకే పరిమితం అవడం ఇందుకు కారణం.

4.ఉత్తములే నాయకులు : సంస్కృత రచనలలో ఉదాత్తులు, ఉత్తములే నాయకులు, నాయికలుగా కన్పిస్తారు కాని, సామాన్యులు, సగటు వ్యక్తులు ఆ గౌరవస్థానానికి నోచుకోలేదు. అరిస్టాటిల్ చెప్పినట్లుగా హాస్యరసాన్ని అనుకరించేది సగటు వ్యక్తులు, అతి సామాన్యులే. అభినవగుప్తుని ప్రకారం స్త్రీలు, పిల్లలు, అమాయకులు మాత్రమే హాస్యాన్ని

కష్టాల్లోను, సుఖాల్లోను ఎదుటివారిని నవ్వించగలవాడే ధీరుడు. – చార్లీ చాప్లిన్

ఆస్వాదిస్తారు. అందువల్లనే హాస్యం వికారంలో ఒక విభాగమైంది. భానుడు తన నాటకాలలో ఏ ఒక్కపాత్ర కూడా నవ్వడానికి అంగీకరించక పోవడానికి కారణం ఇదే! –

నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ తల్లిదండ్రి, నాథులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయముగ సుమతీ॥

సభలోపల, తల్లిదండ్రుల ముందు, భర్తతో, పరాయి స్త్రీతో, విప్రులతో నవ్వడం కూడదంటే మరెవ్వరితో నవ్వవచ్చు?

యదార్థం కాదంటే కాదు : అయితే ఈ అంశం పై విశేష కృషి గావించిన మైఖేల్ క్లాస్విన్, హంగ్ లఫలొట్టె, షాంకీ సిద్ధాంత వ్యాసం చదివాక ఈ విషయమై ఈనాడు వ్యాప్తిలో ఉన్న అభిప్రాయాలు మూసబోసిన భావాలుగా కన్పించాయి. ముందుగా ఆ ప్రముఖుల అభిప్రాయాలను క్లుప్తంగా తెలుసుకుందాం.

ప్రాచీన సమాజంలోని ప్రజలు హాస్యానికి దూరం అయ్యారనడం యదార్థం కాదు. అద్భుత అంశాలకు, విలువలకు విశిష్ట స్థానం కల్పించాలన్న భావనతో ప్రాచీనులు వాటికీ దైవత్వం కల్పించి, సామాన్యుల దృష్టిలో కూడా విశేష విలువలుగా రూపొందించ డానికి కృషి చేశారు. వారి దృష్టిలో హాస్యం అల్లరచిల్లర అంశం కాదు. అది ఆరాధనీయమైన అంశం, అదొక దేవత. అందుకే ప్రపంచవ్యాప్తంగా అనేక సంస్కృతులు తమతమ దేశాలలో ఏకంగా హాస్య దేవతలను నెలకొల్పి, హాస్యం పై తమకుగల భక్తిభావాన్ని చాటుకున్నాయి.

హాస్య దేవతలు : వేల్స్, ఐర్లండ్ ప్రజలకు లడ్ (Lud) హాస్య దేవతకాగా, గ్రీకులు పాన్ (Pan), జపాన్ వాసులు ఉనే (Uzne), ఈజిప్టువాసులు బాస్ (Bas) అను హాస్య దేవతలను ఆరాధించారు. భారతీయులకు అధిదైవం వినాయకుడు అని మనకు తెలిసిందే. స్వర్గంలో ఆసీనులయ్యేవారు హాస్యంతో విరాజిల్లాలని బైబిల్ పాత నిబంధన (Old Testament) స్పష్టంచేయగా, నవ్వుకు జన్మస్థానం స్వర్గం అని మార్టిన్ లూధర్ కొనియాడారు. ఈస్టర్, హోలీ పండుగలు సాక్షాత్తు నవ్వుల పండుగలగా పరిగణించారు. ఈ విధంగా హాస్యానికి దైవత్వం కల్పించిన మన ప్రాచీనులు దానిని విస్మరించారనడం సబబు కాదేమో! 'నాట్య శాస్త్రం', 'నాట్య దర్పణం', మొదలగు ప్రఖ్యాత ప్రాచీన రచనలు

---

నవరసాలలో హాస్యం అత్యున్నత రసం అని కీర్తించడం గమనార్హం అంటారు డా|| సూరం శ్రీనివాసులు (Hasya & Prahasana: a critical study, p.78)

ఇప్పుడు కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. బౌద్ధమత గ్రంథాలైన 'వినయ', 'బ్రహ్మజలసత్త', 'బుద్ధ చరిత'లలోను నవ్వు పై ఆంక్షలు విధించారన్నది యదార్థమే. వృద్ధాప్యం , రోగం, మరణం గురించి తెలిసిన ఎవరైనా ఎలా నవ్వగలరు అని బౌద్ధ గురువులు ప్రశ్నించారన్నది వాస్తవమే. అయితే పళ్ళు కనిపించకుండా, పెద్దగాగాక చిన్నగా, పెదవులు మూసుకొని చిరునవ్వులు చిందిస్తున్న (హసితం) బుద్ధుని విగ్రహాలు మనకు అనేకం కన్పిస్తాయి. అంటే బౌద్ధులలో అగ్రశ్రేణి భిక్షకులు హసితంకు, రెండవ శ్రేణివారు అతిహసితంకు దూరంగా ఉండవలసిన పనిలేదనేకదా! అయితే, జెన్ బౌద్ధులు ఒకడుగు ముందుకువేసి 'నవ్వులు చిందించే ముగ్గురు భిక్షకులు' గల చిత్రాన్ని తమ సంకేతంగా ఎంచుకోవడం గమనార్హం. బౌద్ధభిక్షకులు తాము నివసించే ప్రత్యేక వాసాలకు, ప్రధాన పట్టణానికి మధ్యగల వంతెనను దాటడం నిషిద్ధం అన్న విషయాన్ని మరచిన ముగ్గురు భిక్షకులు అలా మాట్లాడుకుంటూ ఆ వంతెనను దాటి వెళ్ళిపోయా రు! ఆ తరువాత వారికి ఆ ఆంక్ష గుర్తుకువచ్చి పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారన్నది ఆ చిత్రానికి వెనుకగల కథనం. ఇంతకూ ప్రాచీన భారతంలో హాస్యం లేదనడం యదార్థమా? అది యదార్థం అయితే దానికి కారణాలు ఏమిటో ఇప్పుడు తెలుసుకుందాం.

1. శృంగారంతో మమేకం : ప్రాచీన కాలంలో హాస్యం ప్రధానంగా శృంగారంలో తేలియాడేది. పాశ్చాత్య భాషలలో నేటికీ లభించే మన ప్రాచీన రచనల అనువాద ప్రతులలో ఈనాడు కొన్ని భాగాలను పూర్తిగా తొలగించడమో లేదా సంపూర్ణంగా లాటిన్ పదజాలంతో అందించడమో జరుగుతుందంటే, ఆనాటి శృంగారస్థాయి ఎంతటిదో తెలుస్తుంది కదూ! అంతేకాదు. ఆ కథలలోని పేర్లు కూడా శృంగార భూయిష్టంగా ఉండటమేగాక, అవి నేటి ప్రభుత్వ చట్టాల ప్రకారం రతిక్రీడల ద్వారా వేధిస్తున్నారన్న నేరాల క్రిందకు రావచ్చుట!

మరో విషయం. భరతముని చెప్పినట్లు "హాస్యో భవతి శృంగారాత్ " (శృంగారం నుండి హాస్యం జనిస్తుంది) అన్న అలంకారోక్తి కాని, " బూతాడక దొరకు నవ్వుపుట్టదు" అన్న కవి చౌడప్ప ఉవాచ కాని ఇదే సత్యాన్ని చాటుతాయి. అయితే, శృంగారమయం కాని పిల్లల, భార్యాభర్తల చతురోక్తులు, హేళనమే ప్రధానాంశంగాగల హాస్యోక్తులు కూడా అధిక సంఖ్యలో ఉంటాయన్న వాస్తవాన్ని మనం విస్మరించకూడదు.

---

2. వేదాంతపరమైన భాష్యం: భారతీయ తాత్వికులు, మేధావులు ఆయా రచనలలోని హాస్యోక్తులకు భాషాంతీకరణ జరుపుతూ వేదాంతపరమైన భాష్యాన్నిస్తూ, -- అవి కనుమరుగయ్యేటట్లు చేయడం దీనికి మరొక కారణం. అలానే కథకు అంతగా ప్రధానం కాని, శృంగార సరిహద్దులను దాటిన భాగాలను తొలగించడం కూడా జరిగింది.

ఉదా||జయదేవుని గీతా గోవిందంలో కృష్ణుడు, రాధ శృంగార క్రీడలలో తేలియాడిన తరువాత ప్రేమ మైకంలో పరస్పరం దుస్తులు మార్పిడి చేసుకోవడంతో రాధ చెలికత్తెలు ఆమె పై చతురోక్తులు విసురుతూ గోలపట్టించారు. అయితే, కొంతకాలం తరువాత వైష్ణవ ఆధ్యాత్మిక వాజ్మయంలో రాధాకృష్ణులు బుద్ధిపూర్వకంగానే దుస్తులు మార్చుకు న్నారని పేర్కొంటూ, ఆ హాస్యోక్తిని రాధాకృష్ణుల ఐక్యతా సంకేతంగా, ఆత్మపరమాత్మల విలీనంగా వివరించడం జరిగింది. ఈ విధంగా ఆ హాస్యోక్తి కాస్తా పారమార్థిక అంశంగా మారింది.

'నలినిక జాతక (బుద్ధుని జాతక కథలు)లో అమాయకుడైన ఓ బౌద్ధభిక్షువు అనుకోని పరిస్థితులలో ఓ దిగంబర స్త్రీని చూశాడు. అదే అతని తొలి అనుభవం అవడంతో ఆమె మర్మావయవం ఏమైందని సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు. "అదేదో తోడేలు కొరికేసినట్లుంది. నువ్వు ఆ గాయం పైన ముద్దిడితే అది బాగుపడుతుందిలే. రా" అంటూ ఆ వగలాడి అతనిని ఆహ్వానించింది. అయితే, పాలిటెక్స్ట్ సొసైటీవారు దానిని ఆంగ్లంలోకి తర్జుమా చేస్తూ ఆ చతురోక్తి స్థానంలో యువసన్యాసి 'అడొ నొమస్'ను ఆకర్షించడానికి శృంగార దేవత విసిరిన వలలా పేర్కొన్నారు.

ఇప్పుడు ప్రాచీనకాలానికి చెందిన కొన్ని హాస్యోక్తులు చూద్దాం.

ఒక జెన్ భిక్షువు అందరికన్నా భిన్నంగా చనిపోవాలని నిర్ణయించుకున్నాడు. తలక్రిందులుగా నిలబడి అంతవరకు ఎవ్వరూ మరణించలేదని తెలుసుకొని శీరాసనం వేసి తుదిశ్వాస వదిలాడు. దానిని చూసిన మరొక భిక్షువు "జీవితకాలంలో ఎలానూ సంప్రదాయాలు పాటించలేదు. మరణ సమయంలో కూడా నిన్ను నువ్వు వెధవాయిలా హాస్యప్రపంచం మార్చుకున్నావా?" అంటూ వ్యంగ్యోక్తులాడాడు. కొందరు భిక్షువులు హాస్యం ద్వారా కూడా బోధన చేశారనడానికి ఇదొక ఉదాహరణ.

'రసిక రంజన'లో ఒక్క భార్యతో ఆనందించేవాడు శుద్ధ వెధవాయి. పరుల భార్యలను సంపాదించి ఆనందించడం అసలైన ఆహ్లాదం అన్నది ఒక హాస్యోక్తి. అనువాదంలో "ప్రతి ఒక్కరు తన అనంత ఆత్మకు బద్ధుడై ఉండాలి. ఆపదలు వచ్చినప్పుడే

---

శివుణ్ణి కొలిచే సాధకుడు నిష్ప్రయోజకుడు" అని మార్చబడింది. అలానే, 'కచ్ఛపజాతక'లో ధ్యానముద్రలో ఉన్న ఒక ముని చెవిలో మగకోతి తన మర్మావయవం దూర్చి గోలచేసింది. ఇంతెందుకు. బంగాళాదేశంలో రసం అంటే హాస్యమే అని పేర్కొన్నారంటే, హాస్యానికి ఎంత ప్రాధాన్యం ఉందో ఇట్టే అర్థమవుతుంది.

క్రీ.పూ.1వ శతాబ్దిలో 10 రకాల నాటకాలు ఉన్నాయని రచయితలు పేర్కొన్నప్పటికీ ప్రస్తుతం మనకు నాలుగు రకాల రచనలే లభ్యమవుతున్నాయి. అయితే, ఆ నాలుగిం టిలో రెండు (ప్రహసన, బాణ) హాస్యప్రధానం అయినవి కావడం విశేషం.

ఉదాహరణకు, 'సన్యాసి- వారాంగణ' నాటకం తీసుకుందాం. వారాంగణ పేరుగల ఒక మహిళ ప్రాణం తీసుకోవాల్సిన యమదూత పొరపాటున మరొక ఆమెను యమలోకానికి తీసుకుపోయాడు. ఇంతలో ఒక సన్యాసి ఆ వారాంగణ శరీరంలోకి పరకాయ ప్రవేశం చేసి శారీరక సౌఖ్యాలు క్షణభంగురాలు అని శిష్యులకు బోధించసాగాడు. ఈలోగా తన తప్పు తెలుసుకున్న యమదూత వెంటనే భూలోకానికి వచ్చి, అక్కడ స్త్రీ దేహం కన్పించకపోవడంతో, అక్కడే పడివున్న ముని శరీరానికి ప్రాణం పోశాడు. దాంతో వారాంగణ మునిలా, ముని వారాంగణలా సంభాషించడం ప్రేక్షకులను నవ్వుల లోకంలో ముంచెత్తుతుంది. చివరకు ఎవరి శరీరంలోకి వారు ప్రవేశించడంతో కథ కంచికి చేరగా, ప్రేక్షకులు హాయిగా ఇంటికి చేరతారు.

'వీధి', 'అంకము' నాటికలు ప్రధానంగా హాస్య, శృంగార నాటికలు. మొదటిది ఏకాంకిక కాగా, రెండవది రెండు అంకములలో నడుస్తుంది. ఇవి వీధి నాటికలు కనుక జనసామాన్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆడతారు. అందుకే ఈ రెండు నాటికలలో అటుహాస్యము, ఇటు శృంగారము కొంచెం హెచ్చు మోతాదులోనే చోటుచేసుకున్నాయి.

పాశ్చాత్య సాహిత్యానికి భిన్నంగా భారతదేశంలో విషాదాంత రచనలు(tragedies) కన్పించవు. వీరోచిత గాథలు, శృంగార రచనలకే ఇక్కడ ప్రాధాన్యం ఉంది కాని, కీర్తి కాంక్షకు, సంక్షోభ సన్నివేశాలకు ఈ రచనలు స్థానం ఇవ్వకపోవడం మరొక విశేషం.

ఇలా ప్రాచీన భారత రచనలలో అనేక హాస్యఘట్టాలు కన్పిస్తాయి. చైనా, ఈజిప్టు మొదలగు దేశాలకు చెందిన ప్రాచీన హాస్యోక్తులను ఇంతకు పూర్వమే మనం చూశాం కనుక ప్రాచీన కాలంలోనూ ప్రజలు హాస్యచతురులని స్పష్టమవుతుంది.

---

మనం నవ్వని రోజులన్నీ ఊరికే వృధా అయినట్లే. – ఆర్.ఎన్. ఛామ్ ఫోర్ట్

వేదాలు, ఇతిహాసాలలో కూడా కొద్ది మోతాదులోనైనా హాస్యం కన్పిస్తుంది. నాట్య శాస్త్రాన్ని సృష్టిస్తూ బ్రహ్మ అధర్వణ వేదం నుండి హాస్యాన్ని తీసుకున్నాడని 'భరతుడు' చెప్పాడు. సంతృప్తిపరునికి అంతా అందంగానే ఉంటుంది, అంతా కాంతివంతంగానే కన్పిస్తుంది. తన బాధలను చూసి కూడా ఆయన నవ్వగలడు. ఋగ్వేదంలో (10-33-2) ఆకలిగొన్నవాని స్వగతం చూడండి : నేను బలహీనమైన ప్రక్కటెముకలతో ఎంతగానో బాధపడుతున్నా. ఇద్దరు భార్యలుగల భర్తను వాళ్లు చెరోవైపు ఎలా నొక్కుతారో, ఆకలి మూలంగా రెండు ప్రక్కటెముకలు నన్ను అలానే నొక్కుతున్నాయి.

ఇప్పుడు వల్లభదేవుని 'సుభాషితావళి'లో ఒక జైన సన్యాసిని గురించిన కథ చూద్దాం . ఇంటి యజమాని పేరు శ్రావక. సన్యాసి పేరు శ్రమణ.

శ్రావక : "ఓ సన్యాసీ! నీ పంచెకు చాలా రంధ్రాలు ఉన్నాయే!"

శ్రమణ : “అవును. చేపలు పట్టుకోడానికి అది ఉపయోగపడుతుంది.”

శ్రావక : మీరు చేపలు తింటారా?”

శమణ : “ఎప్పుడూ తిననులెండి. కొద్దిగా సారా పుచ్చుకున్నప్పుడే తింటాను.”

శ్రావక : “సారా తీసుకుంటారా?”

శమణ : "మామూలుగా తీసుకోనండి. ఏదో..... స్త్రీలతో కూడివున్నప్పుడే.”

శ్రావక : "అయితే, స్త్రీల సాంగత్యం కూడా ఉన్నదా?”

శమణ : “మామూలుగా కాదండి. శత్రువులను నాశనం చేసినప్పుడే!”

శ్రావక : "సన్యాసులైన మీకు కూడా శత్రువులున్నారా?”

శమణ : "......దొంగతనానికని ఇంట్లో దూరినప్పుడు ఉంటారు కదా!"

శ్రావక : "అయ్యో మీరు దొంగ కూడానా?”

శమణ : “లేకుంటే జూదం ఎలా ఆడగలను చెప్పండి?"

శ్రావక : “మీరు జూదరి కూడానా?”

శమణ : “ఎందుకు కాదు. నేను బానిసతల్లికి జన్మించాను.”

సర్వలక్షణ శోభితుడు ఎలా ఉంటాడో, వల్లభదేవుడు మనకు ప్రత్యక్షంగా చూపాడు. అయితే, విద్యానాధుడు 'ప్రతాపరుద్రీయం'లో, భానుదత్తుడు 'రసతరంగిణి'లో “హాస్యం యొక్క ఫలితం వికారం” అన్నారు. దాని అభివృద్ధిలో వికృతి ప్రధానపాత్ర పోషించిం దన్నారు. అందువల్లనే అసంబద్ధ ప్రలాపం, వికృత వాక్కు, వికృత చేష్ట, వికృత వేషం నవ్వుకు కారణాలుగా పేర్కొన్నారు. సహజంగా ఉంటే హాస్యం అనిపించుకోదు కదా!

---

ఒకరి ముఖం మీదికి నవ్వు తెప్పించేదే మంచి పని. – మహమ్మద్ ప్రవక్త

కుంటివాడు కుంటితే హాస్యం ఏముంది?. నాయకుడు కుంటితేనేకదా, ఎవరినో అనుకరిస్తేనేకదా నవ్వు వచ్చేది!

పసందైన హాస్యం : 'కావ్యానుశాసనం'లో హేమచంద్రుడు, 'నాట్యదర్పణం'లో రామచంద్రుడు, గుణచంద్రుడు, 'భావ ప్రకాశన'లో శారదాతనయుడు, 'రసగం గాధర'లో జగన్నాధ ప్రభృతులు "హృదయ ఔన్నత్యాన్ని చాటేది హాస్యం" అని కీర్తిం చారు. వత్సరాజు తన 'హాస్య చూడామణి'లో ఎంతో వివేకవంతమైన హాస్యాన్ని వివరించాడు.

ఇంతెందుకు. హాస్య స్వరూప స్వభావాల పై మనవారు శాస్త్రీయ విశ్లేషణ గావించడం ఇందుకు మరొక తార్కాణం. హాస్యం రంగు తెలుపు అని, దాని అధిదైవం ప్రమధుడు అని మనవారు ఏనాడో సెలవిచ్చారు. హాస్యం పుంలింగమని, హసితం నపుంసకలిం గమని సంస్కృతాంధ్ర నిఘంటువు స్పష్టపరచింది. ఇంకొక్క అడుగు ముందుకువేసి జాతి, మత, కులాలకు అతీతంగా అందరినీ నవ్వించే నవ్వును షఢ్రుచుల సమ్మేళనంగా అభివర్ణించవచ్చు. ఈ విధంగా నవ్వుకు రంగు, అధిదైవం, లింగభేదాలను గురించి శాస్త్రీయంగా విశ్లేషించిన మన ప్రాచీనులకు హాస్యభావన లేదనడం ఓ హాస్యోక్తి కదూ!

చివరగా రెండు ముఖ్య విషయాలను ఉదహరించకుండా ఈ అధ్యాయాన్ని ముగించడం సమంజసం కాదు. హాస్యోక్తులకు అనుభవాలేకాని, సాధారణంగా రచయితలు ఉండరు. సమాజంలో సహజంగా అవి ఒకరినుండి మరొకరికి చేరుతుంటాయి. విద్య అంతగా వ్యాప్తి చెందని నాటి సమాజంలో వ్రాయడానికి కాగితం, కలం కూడా సామాన్యులకు అందుబాటులో ఉండేవి కావు. నాటి ప్రజానీకానికి రేడియో, టి.వి., వార్తాపత్రికలు, సెల్ ఫోన్, అచ్చుయంత్రాలు మొదలైన ప్రచారసాధనాలు తెలియకపోవడమే గాక, ఒకింత తీరుబడి కూడా లేకపోవడంతో హాస్యోక్తులు వ్యాప్తి చెంద లేదు. అంతేకాదు. ఆనాడు అతిపరిమిత ప్రజానీకానికి అందుబాటులో ఉన్న పేపరు మనలాంటి ఉష్ణదేశంలో ఒక దశాబ్దకాలందాటి మనజాలదు! అసౌకర్యలేఖినీలను ఉపయోగించే నాటి విద్యావంతులు సంక్షిప్తీకరణనే కోరుకుంటారు కనుక హాస్యోక్తులు అంతగా వ్యాప్తిలోకి రాలేదని తెలుస్తుంది.

మరొక్క మాట. "హాస్యభావన లేదన్న దేశంలో ఈనాడు అత్యధిక సంఖ్యలో హాస్యోక్తుల పై రచనలు అమ్ముడుపోవడమే గొప్ప హాస్యోక్తిలా వినిపిస్తుంది. ఏమైనా బీర్బల్,తెనాలి రామకృష్ణుడు, గోపాల్ భోరెల వారసత్వం మనల్ని వీడలేదు" (కుష్వంత్ సింగ్). అందుకే హాయిగా నవ్వాలంటే చక్కగా పేజీ తిప్పండి.

---

స్నేహితులను నవ్వించగలవాడే స్వర్గం చేరడానికి అర్హుడు. – ఖురాన్

అధ్యాయం 17

# హాయిగా నవ్వండి : ఆరోగ్యం పొందండి

ఆనందం మూలంగా నవ్వుతాం; నవ్వడం మూలంగా ఆనందం పొందుతాం. -డా|| ఆనె ఉడ్‌హార్ట్

అంతర్జాతీయ దుర్గంధ పోటీ నాగపూర్ లో ప్రారంభించబడింది. భయంకరమైన దుర్గంధాన్ని వెదజల్లే ఒక మకురు దున్నపోతును అన్ని బందోబస్తులతో నిలబెట్టి, దాని ఎదుట మూడు నిమిషాలు నిలబడగలిగినవాడికి రూ. 5 లక్షలు బహుమతిగా ప్రకటించారు. పోటీలో పాల్గొనేవారు తమ బట్టలకు, తలకు ఎలాంటి సెంట్లు వాడకూడదన్న నిబంధనతప్ప నిర్వాహకులు మరే ఆంక్షలు విధించలేదు. మూడు రోజులపాటు జరిగిన ఆ పోటీలో మొదటి రెండు రోజుల్లోను ఆ దున్నపోతుకు ఎదురుగా రెండు నిమిషాలకుమించి ఎవ్వరూ నిలబడలేకపోయారు. అదేం చిత్రమోగాని ఆఖరిరోజున పోటీదారులలో ఎవ్వరూ ఒక్క నిమిషానికి మించి ఉండలేకపోవడంతో, ఆ కార్యక్రమ నిర్వాహకులు బోలెడంత నిరాశకు లోనయ్యారు. ముగింపు సమయం దగ్గరపడుతున్న క్షణంలో ఒక వ్యక్తి ప్రవేశించి, దున్నకు ఎదురుగా దానికన్నా ఠీవిగా నిలబడ్డాడు. అలా రెండు నిమిషాలు గడిచాయి. మరొక అరనిమిషం నిండబో తుండగా.....రెండువైపుల గాటికి గట్టిగా కట్టివేసిన బలమైన తాళ్ళను తెంపుకొని ఆ దున్నపోతు పరుగులంకించుకుంది....అంతే! నిరుత్తరులైన నిర్వాహకులు విజేతకు బహుమతిగా రూ. 6 లక్షలు ఇచ్చిపంపారు!

హాస్యశకటం : ఇలాంటి హాస్యోక్తులు అందరినీ అలరిస్తాయి; హాయిగా నవ్విస్తాయి. అందుకే అంటారు “నవ్వు ఒక దివ్యౌషధం, అది లేని జీవితం నరకప్రాయం” అని. అనారోగ్యాన్ని తరిమివేయడంలో హాస్యరసం అద్భుత పాత్ర నిర్వహిస్తుంది అంటారు డొన్న మెర్మల్. సమాజసేవకు తన జీవితాన్నే అంకితం చేసిన మహిళ ఆమె. చిన్నారులను ఆనందపరవశులను చేయడానికి ఆమె ఒక అద్భుత హాస్య శకటాన్ని (Humor Cart) సృష్టించి, దానికి ధగధగ మెరిసే బొమ్మలు అంటిం చింది. మాస్కులు, కార్టూన్లు, నవ్వులు కురిపించే చిత్రాతిచిత్రమైన బొమ్మలతో ఆ శకటాన్ని అలంకరించింది. వారానికి ఒక పర్యాయం ఆమె తన సహాయకురాలితో కలసి పిల్లల ఆసుపత్రికి వెళ్ళి ఆ చిన్నారులను నవ్విస్తూ, కవ్విస్తూ వారితో ఆడుకుంటుంది. అలా అనేకమంది రోగులకు ఆనందం అందించింది.

---

మానవ స్ఫూర్తి యొక్క ఉత్సవమే నవ్వు. – సబీనావైట్

ఆరోగ్యానికి రాచబాట : "కడుపారా నవ్వడం చక్కని ఆరోగ్యానికి రాచబాట" అని అమెరికన్ కార్డియాలజిస్ట్ మైఖేల్ మిల్లర్ భావిస్తే, కామెడీ పుస్తకాలు చదవమని, హాస్య సినిమాలు చూడమని కెనడాలోని మనోవిజ్ఞాన శాస్త్ర ఆచార్యుడు రాడ్ మార్టిన్ సూచించారు. హాస్యం యాంటీ బయాటిక్ గా పని చేస్తుంది. ఒత్తిడి సమయంలో అది మనిషిలో సంయోగశక్తిని పెంచి అతనిని ఉల్లాసపరుస్తుంది. "మనసారా నవ్వితే కడివెడు ఆనందం ఇస్తా. బాధలను తొలగించే గొప్ప మంత్రాన్ని నేను" అంటుంది నవ్వు. ఉద్రిక్తతను కలిగించే హార్మోనులైన ఎపినెఫైన్, కార్టిజాల్లో సాయిని గణనీయంగా తగ్గిస్తుంది. మనం నవ్వినప్పుడు ఎండార్ఫిన్లు, సెరటోనియమ్ రక్తంలోకి భారీగా ప్రవహించడంతో ప్రశాంతమైన, ఆనందమయమైన మానసిక స్థితి ఏర్పడుతుంది అంటారు వైద్యులు.

రక్షిత వ్యవస్థ : ప్రతి వ్యక్తిలోనూ రక్షణ కవచం ఒకటి ఉంటుంది. మనిషికి శత్రువులైన క్యాన్సర్, ఎలర్జీ, అంటువ్యాధుల నుండి అది కాపాడుతుంది. వైద్య శాస్త్రంలో దానినే రక్షిత వ్యవస్థ (Immune system) అంటారు. నవ్వు తెల్లరక్తకణాల సంఖ్యను పెంచి రక్షిత వ్యవస్థను పటిష్టపరుస్తుంది. ఉబ్బసం, బ్రాంకైటిస్ తో బాధపడేవారు హాస్య చికిత్సమూలంగా ఎంతో ప్రయోజనం పొంద వచ్చు. అందుకే నవ్వుల క్లబ్ సభ్యులకు సాధారణంగా వచ్చే జలుబులు సునాయా సంగా తగ్గిపోతాయి.

హాస్యం మన మానసిక స్థితిని మార్చివేస్తుంది. ప్రఖ్యాత ఫ్రెంచి నాడీ శాస్త్రజ్ఞుడు హెన్రీ రుబెన్ సైన్ "మనిషి మనసారా ఒక్క నిమిషం నవ్వగలిగితే, 45 నిమిషాలపాటు శరీరానికి కావలసిన విశ్రాంతి లభిస్తుంద"న్నారు. నవ్వు ఆకలిని పెంచుతుందని, గుండె కొట్టుకునే వేగాన్ని తగ్గిస్తుందని ధృవీకరించారు. అది మనిషిలోని రక్తనాళాలను వికసింపజేసి, వాటిలో అధిక రక్తాన్ని ప్రసరింపజేస్తుంది . అలా శరీరంలోని అన్ని భాగాలకు అధికంగా రక్తం అందడంవల్ల కణాలన్నింటికి అధికమొత్తంలో ప్రాణ వాయువు చేరి అనేక రుగ్మతలు తొలగిపోతాయని, ఆవిధంగా నవ్వు శారీరక విధులను స్థిరీకరిస్తుందని ఆయన వివరించారు.

ఫ్లొరిడాలో(అమెరికా) శస్త్రచికిత్సలు జరిగినవారి పై జరిపిన ఒక ప్రయోగంలో హాస్య చిత్రాలు చూసినవారికి బాధానివారణ మందుల వాడకం తగ్గిందన్నారు పరిశోధ కులు. అందువల్లనే ఈనాడు బ్రిటన్ వంటి దేశాలలో వృద్ధులను, రోగులను నవ్వించడానికి హాస్య చక్రవర్తులను నియమిస్తున్నారు. కొన్ని సమయాలలో నవ్వు మూలంగా జఠిల సమస్యలకు చక్కని పరిష్కార మార్గాలు లభిస్తాయన్న ఎడ్వర్డ్ డిబోనో (అమెరికా లోని

---

ఏడ్వగలిగినవాడే నవ్వగలడు. – టామీడి పవోలా

మేనేజ్మెంట్ గురు) అభిప్రాయంతో వైద్యులుకూడా ఏకీభవించారు. నవ్వుకు నోచు కోనివారు జబ్బు వాతపడతారని ఒక పరిశోధనా బృందం తెలిపితే, నవ్వినవారి ముఖాల నుండి కోపం, ఆతురత, సంకోచాలు నిష్క్రమిస్తాయని మరొకబృందం తెలిపింది".

పెద్దగా నవ్వుకో : నవ్వు ఆవేదనను తగ్గిస్తుంది. అందుకే సమస్య వచ్చినప్పుడు నవ్వాలి. నవ్వులన్నింటిలోను నిన్ను చూసి నువ్వు నవ్వగలగడం అద్భుతమైనది. అది నీ స్థాయిని, ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది. అయితే ఎలా నవ్వుకోవాలి అంటారా? అది చాలా సింపుల్. చక్కగా తలుపేసుకొని అద్దం ముందు నిలబడు. ఆ అద్దంలో నీ ముఖాన్ని వివిధ భంగిమల్లో - సొట్టబుగ్గలతో, ముక్కు అతుక్కుపోయినట్లు, మెల్లకన్నుతో, నాలుకను బయటకు పెట్టి, దానిని పూర్తిగా పైకినెట్టి చూసుకొని హాయిగా నవ్వుకో. ముఖకవళికలను మార్చుకుంటూ "శుభోదయం" అని చెప్పుకో. "Have a nice Day' అని నిన్ను నువ్వే అభినందించుకో!

ఇదంతా ఏదో కాలక్షేపంగా, మొక్కుబడిగా కాక, మనస్ఫూర్తిగా చెయ్యి. ఆనందంగా - మనసారా ఆనందిస్తున్నట్లు - ఆహ్లాదకరంగా భావించు. ఈ భావనే నీలోని న్యూరో హార్మోన్ల స్థాయిని పెంచి, నీ మనఃస్థితిని మార్చుతుంది. మరొక విశేషమేమంటే నవ్వు తెప్పించే, హుషారునిచ్చే కార్యక్రమాలలో పాల్గొనబోతున్నావని కొన్ని గంటల ముందుగా నీకు తెలిస్తే, నీ శరీరంలోని ఉద్రిక్తతను కలిగించే హార్మోన్లు తగ్గి హాయిగా, ఆనందంగా ఉండే హార్మోన్లు విడుదలవుతాయని ప్రఖ్యాత శాస్త్రవేత్త లైబర్క్ అన్నారు. వాషింగ్టన్ పోస్ట్ ప్రకారం నవ్వు తెప్పించే చిత్రాలు చూస్తే 39% కాజల్ హార్మోన్, 70% ఎండార్ఫిన్ తగ్గుతుందట. హాయిగా ఉంచే హార్మోన్లు 27% దాకా పెరిగి మనిషిలో వ్యాధినిరోధక శక్తిని పెంచుతుందట. అందుకే అద్దం ముందు నిల్చొని బాగా..... పెద్దగా.....నవ్వుకో.

ఆరోగ్యానికి అద్భుత చిట్కా..... నవ్వు : జర్మనీలో చిన్నపిల్లల వైద్యులు బఫూన్ వేషం వేసుకొని పిల్లలను నవ్విస్తూ వారికి చికిత్స చేస్తారు. కడుపుబ్బ నవ్వించడమే ఆరోగ్యానికి అసలైన చిట్కా అన్నది వారి మతం; అదే వారి మంత్రం. వైద్యులు, శాస్త్రవేత్తలు కలసి 'నవ్వుల ప్రాజెక్ట్ ను రూపొందించారు. WWW.RxLaughter.org అనే హోమ్ పేజీని కూడా వారు నిర్వహిస్తున్నారు. జీవితానికి పూసిన పసందైన పువ్వు నవ్వు. దానిని భద్రంగా భద్రపరచుకోండి అంటారు వారు.

బ్లడ్ షుగర్ హాంఫట్ : తినండి హా! హా! తినండి (Eat up Ha! Ha! Eatup!) అను శీర్షికతో పెరేడ్ పత్రిక ఇలా వివరించింది. విసుగెత్తించే నీరస ప్రసంగాలు వింటూ

---

మంచి నవ్వు ఇంటిలో సూర్యరశ్మి లాంటిది. – విలియం హేకరీ

భోజనాలు చేసేవారిలో కన్నా, సుఖాంత నాటికలు చూస్తూ ఛలోక్తులు వింటూ ఆనందిస్తూ, నవ్వుతూ భుజించేవారిలో బ్లడ్ షుగర్ లెవెల్లు బాగా తగ్గిపోతాయని పరిశోధనలో గుర్తించారు. అలానే డిల్లాన్ పరిశోధనలో హాస్య చిత్రం చూడటంతో లాలాజలం పెరిగిందని తేలింది. అందుకే “కామెడీ చిత్రాలు చూస్తూ కడుపారా నవ్వండి. మధుమేహానికి దూరంగా ఉండండి".

నవ్వు జాగింగ్ కన్నా గొప్పది. జాగింగ్ చేస్తే కాళ్ళు, చేతులలోని కండరాలకు మాత్రమే చక్కని వ్యాయామం జరగగా, నవ్వడం మూలంగా శరీరంలోని అన్ని కండరాలూ వ్యాయామం చేసినట్లవుతుంది.

జాగింగ్ మూలంగా శరీరం ఉత్తేజమై తేలికగా తయారైతే, నవ్వు వలన మెదడు స్పందించి చలాకీతనం పెరుగుతుంది. దాంతో శరీరంలో అధికంగా ఉన్న కేలరీలు తగ్గిపోతాయి. వేగంగా నడవడం (Walking) మూలంగా ఎన్ని లాభాలు వస్తాయో, నవ్వు మూలంగా కూడా అన్నే లాభాలు వస్తాయి. ఈ విధంగా అమూల్యమైన ఆనందాన్ని, అపారమైన ఆరోగ్యాన్ని అందిస్తుంది నవ్వు.

సులువైన మార్గాలు : ఆనందమయ జీవితాన్ని గడపడానికి కొన్ని సూత్రాలు చూద్దామా?

1. ఆనందం కలిగించే, నవ్వు తెప్పించే చిత్రాలను చూడండి. 'బ్రతుకు తెరువు' చిత్రంలో జూ॥ సముద్రాల రచించిన “అందమె ఆనందం....ఆనందమె జీవిత మకరందం.... జీవితమే అనురాగమయం”లాంటి పాటలను వినడం అలవాటు చేసుకోండి. చక్కని హాస్యోక్తులు వింటూ హాయిగా నవ్వుకోండి.

2. ఆనందంగా, ఉల్లాసంగా ఉండే వారితో కాలాన్ని గడపండి. హాస్యాన్ని, ఆనందాన్ని పంచుకోవాలన్నా, పెంచుకోవాలన్నా మంచి మిత్రులు ఉండాలి. నిత్య శంకితులు, నిరాశావాదులకు వీలైనంతవరకు దూరంగా ఉండండి.

3. జోక్స్ పుస్తకాలలోని హాస్యోక్తులు చదవండి. చదివినవాటిని ఇతరులతో పంచుకోండి.

4. పిల్లలతో ఆడుకుంటూ, వృద్ధులతో ముచ్చటిస్తూ వాళ్ళను నవ్విస్తూ, వారితోపాటు మీరూ నవ్వండి.

5. నవ్వడం ఆరోగ్య లక్షణం. నవ్వే వారిని చూసి ఆనందించండి. ఇలా నవ్వులను పంచండి; నవ్వులను పెంచండి.

---

నేను ఎవరిని చూసైనా నవ్వేది ఏడవలేకనే. – లార్డ్ బైరన్

ఒక మానసిక వైద్యుని వద్దకు ఒక రోగి వచ్చి "డాక్టర్ గారూ! నాకు మేడమీదనుండి దూకి చచ్చిపోవాలని ఉందండి" అంటూ కూనిరాగం తీశాడు. "అంత పెద్ద సమస్య మీకేమి వచ్చింది?" అంటూ డాక్టర్ చాలా సేపు అనునయించాడు. ఎన్ని చెప్పినా ఆ రోగి వినిపించుకునే స్థితిలో లేడని గ్రహించిన డాక్టర్ చివరకు "బాగుందండి. మంచి ఆలోచన. అయితే, సూట్‌లో దూకదలచారా? లేక ప్యాంట్, షర్టులో దూకదలచారా? అలా దూకడానికి ఉదయం మంచిదో లేక సాయంత్రం మంచిదో పురోహితుణ్ణి సంప్రదించారా? ఏమైనా....జీవితకాలంలో ఒకే ఒక్క పర్యాయం జరిగే సంఘటన ఇది..... బాజాభజంత్రీలు, బాణాసంచా, విద్యుద్దీపాలంకరణ మొదలైనవన్నీ చక్కగా ఏర్పాటుచేసుకొని, బంధుమిత్రులను కూడా పిలవండి" అనడంతో ఆ రోగి బిత్తరచూపులు చూశాడు! ఇంక కథ సుఖాంతమైం దని చెప్పనవసరం లేదుగా!

చక్కని సూచనలు, విలువైన చిట్కాలు : ఈ ఆనందాన్ని అనుభవించడానికి పెగ్ జోర్డాన్ సూచనలు విందాం.

1. ప్రతి సంఘటనలోని హాస్యకోణాన్ని చూడగలగాలి, చూసి నవ్వగలగాలి. పుల్లారావు పుల్లగా ఉండడు, మధు తియ్యగా ఉండదు అనుకుంటూ ఆనందించవచ్చు.

2. హాస్యప్రియులతో కలసి తిరగడం మరొక మార్గం. ఇతరులలోని లోపాలను చూచి, ఎంతగా నవ్వుకుంటామో, నిన్ను చూసి నువ్వు నవ్వుకోవడం అంతకన్నా ఎక్కువగా నేర్చుకోగలగాలి. మౌనంగా, ప్రశాంతంగా కళ్ళుమూసుకొని కూర్చొని నీ బాధలకు, సమస్యలకు పరిష్కారమార్గాన్ని అన్వేషించు. ధ్యానమార్గం ఈ విషయంలో అద్భుతంగా సాయపడుతుంది. ధ్యానం సంతృప్తితోపాటు సంతోషాన్ని అందిస్తుంది. అందుకే అది ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ప్రజాదరణ పొందుతుంది.

ఈ అంశం పై ఆచార్య ఎడ్ డైనర్ ప్రశంసనీయమైన కృషి చేశారు. అమెరికాలో ఆచార్యుడైన ఆయన కోల్‌కతాలోని కొన్ని మురికివాడలలో దుర్భర దారిద్ర్యంలో జీవిస్తున్నవారిని పరిశీలించారు. జీవించడానికి అవసరమైన ఎలాంటి సౌకర్యాలు వారికి లేకున్నా వారు ఆనందంగా ఉన్నారని అతని పరిశోధనలో తేలింది! అష్టైశ్వర్యాలతో తులతూగేవారికి ఆందోళన, అష్టదరిద్రాలలో తాండవించేవారికి ఆనందమయమైన జీవితం! ఏమిటీ వింత? ఇదెలా సాధ్యం ? అని తీవ్రంగా ఆలోచించిన ఆ ఆచార్యుడు " పేదరికం పెట్టే బాధలకు......ఇక్కడ కుటుంబ, సామాజిక, స్నేహసంబంధాలు విరుగుడుగా పనిచేస్తున్నాయి" అని నిగ్గుతేల్చారు!

---

విరగబడి నవ్విన వ్యక్తి కూడా దుర్మార్గుడు కావచ్చు. – షేక్ స్పియర్

ఆరోగ్య సంరక్షణ: అపార్థాలను, వివాదాలను, ఉద్రిక్తతలను హాస్యంతో సునాయాసంగా పరిష్కరించుకోగలవారు, ఇతరులలో సానుకూల భావనలను వ్యాప్తి చేయగలవారు సమాజంలో సత్సంబంధాలను నెలకొల్పుకుంటారు. ఇతరులను ఆకర్షిస్తూ, ఆనందింపజేస్తూ సామాజిక గుర్తింపును పెంపొందించుకోవడంలో నవ్వుకన్నా హాస్యభావం ఇతోధికంగా సాయపడుతుంది. ఆరోగ్యకర హాస్యభావం అంటే ఘర్షణ రహితంగా వ్యక్తుల మధ్య అనుబంధాలు పెంచుకునే పద్ధతి అన్నమాట! ఈ విధంగా సామాజిక కౌశలాన్ని పెంచుకునే శిక్షణలో హాస్యం ఒక సాధనంగా ఉపయోగపడుతుంది.

నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును నవ్వులు చిత్తవృత్తికిన్
దివ్వెలు, కొన్ని నవ్వులెటు తేలవు, కొన్ని విషప్రయుక్తముల్
పువ్వులవోలె ప్రేమరసముల్ వెలిగ్రక్కు, విశుద్ధమైన లే
నవ్వులు సర్వదుఃఖదమనంబులు వ్యాధులకున్ మహౌషధుల్!

ఆశావాదమే ఆనందం : నార్వేలో ఆరోగ్యం, నవ్వుకు మధ్యగల సంబంధం గురించి 65 వేలమంది మీద అధ్యయనం చేశారు. ఆనందంగా జీవించేవారు తమ ఆరోగ్యాన్ని గురించి సంతృప్తి చెందారని, తక్కువ హాస్యభావం గలవారు చీటికిమాటికి తమ ఆరోగ్యం గురించి చిందులు తొక్కుతూ అభద్రతాభావంతో వ్యవహరించారని తేలింది. "నవ్వుతూ నీ బాధలను తరిమివెయ్యి, చిరకాలం జీవించడానికి ప్రయత్నం చెయ్యి" అంటారు ఆరోగ్యం , యోగ్యత విభాగంలో నిపుణుడైన పెగ్ జోర్డాన్." అందుకే హాయిగా నవ్వండి : ఆరోగ్యం పొందండి అంటారు. దాని వలన మరెన్ని ప్రయోజనాలు ఉన్నాయో తరువాతి అధ్యాయంలో తెలుసుకుందాం.

---

అధ్యాయం 18

# హాస్యం ప్రయోజనాలు

వింతలరావుకు విచిత్రమైన జబ్బు వచ్చింది.డా|| విడ్డూరం దగ్గరకు వెళ్ళి "డాక్టర్ గారూ! నేను నడుస్తుంటే ఒక కాలు మరొకదానికన్నా ఎప్పుడూ ముందు ఉంటుంది. ఏంచేయాలో తోచక బోల్డంత భయంగా ఉందండి" అంటూ వాపోయాడు. డా॥ విడ్డూరం అడ్డంగా తలూపుతూ "అయ్యో పాపం" అంటూ సానుభూతి చూపాడు. "ఏం ఫరవాలేదు. తగ్గిపోతుందిలే" అని అభయం ఇచ్చాడు. "నీకు రెండు మాత్రలు ఇస్తున్నా. ఒకటి ఎర్రది, రెండోది నల్లది. ఎర్రదానిని నిద్రపోయిన వెంటనే వేసుకో. నల్లదానిని మేల్కొనే ముందు వేసుకో. నీ సమస్య తీరుతుంది" అన్నాడు డా॥ విడ్డూరం.

ఒక ముసలావిడ బస్సెక్కుతూ కండక్టర్ తో "కొత్తపేట రాగానే చెప్పు నాయనా" అంది. కాసేపయ్యాక ఆ ముసలావిడ "కొత్త పేట వెళ్ళిపోయిందా?" అని అడిగింది. ఆ సంగతే మరచిపోయిన కండక్టర్ జాలిపడి బస్సును వెనక్కి తిప్పించాడు. కొత్త పేట రావడంతోనే ముసలావిడకు చెప్పాడు. ఆ ముసలావిడ తాపీగా టాబ్లెట్ ఒకటి వేసుకొని "ఏంలేదు నాయనా.... మా అబ్బాయి కొత్తపేట రాగానే టాబ్లెట్ వేసుకోమన్నాడు. ఇంక నువ్వు బస్సు పోనివ్వయ్యా" అంది!

చిరునవ్వు ఉద్వేగాన్ని తగ్గిస్తుంది, ఉత్సాహభరిత వాతావరణాన్ని సృష్టిస్తుంది. మనసు తేలికపడితే మందహాసం చిందులు వేస్తుంది. అందుకే ఇలాంటి చతురోక్తులు, హాస్యోక్తులు ఎవ్వరినైనా నవ్విస్తాయి, కవ్విస్తాయి. నవ్వగలిగినవాడు అదృష్టవంతుడు అంటారు ఇందుకే. నవ్వే వ్యక్తిలో అంతరంగిక సంతోషం, ఉల్లాసం, ఉత్సాహం తొణికిసలాడతాయి. ఆత్మకు ఔషధం. అదొక వశీకరణ మంత్రంలా పనిచేస్తుంది

ఏదైనా సమస్యను చూస్తూ మనం నిజంగా నవ్వగలిగితే, ఆ సమస్య నిస్సహాయమవుతుంది; కుదించుకుపోతుంది.

నవ్వు రహస్యం : నవ్వు శరీర ధర్మశాస్త్రానికి అతీతమైంది. నవ్వులోని రహస్యం - మనిషికి తెలియని అద్భుతం అదే. ఆ అద్భుతానికి కారణం ఒక్కటే. ప్రేమ, నవ్వు కలసినచోట ఇంక విమర్శకు చోటుండదు. అక్కడ అపార్థానికి తావుండదు.

---

ఇతరులు నిన్ను చూచి నవ్వే ముందుగా నీవే నవ్వడం నేర్చుకో. – ఎల్సా మాక్స్ వెల్

హాస్యం పై ప్రసిద్ధ రచన 'The Healing Power of Humor' గావించారు. దాంతో అందరూ ఆయనను ఉల్లాస చక్రవర్తిగా (Jollytologist), నవ్వుల రాజుగా కీర్తి గడించారు.

నవ్వుదాం... నవ్వుదాం... పెక్కు ప్రయోజనాలు పొందుదాం: ఇంక మనం నవ్వు ప్రయోజనాల గురించి 8 శీర్షికల క్రింద తెలుసుకుందాం.

1. ఆందోళన వద్దు - ఆనందం ముద్దు : మానవులు తమను, తమ జీవిత స్థితిగతులను మరీ గంభీరంగా తీసుకోవడమే ఉద్రిక్తతకు ప్రధాన కారణం అన్నారు మానసిక వైద్య చికిత్సా నిపుణుడు డ్రైడెన్. రష్యాలోని మానవ హక్కుల పోరాట వీరుడు నతాన్ షరన్స్కి 9 సంవత్సరాలు ఖైదీగా కాలం గడిపారు. సోవియట్ గూఢచారి సంస్థ తరచు అతనిని "కాల్చేస్తాం" అని భయ పెడుతుండటంతో తనకు అత్యంత భయాన్ని కలిగిం చేది భయమేనని తెలుసుకున్నాడు దానిని అధిగమించడానికి కోనీ హాస్యోక్తులను గుర్తు తెచ్చుకొని నవ్వుకోవడంతో భయంకర భయం వెనుక ఉన్న భయాందోళనలు ఇట్టే తొలగిపోయాయి! ఆ విధంగా మనల్ని బాధించే విషయాలను చూసి నవ్వగలిగినప్పుడు మనలో సమతౌల్యం (balance) ఏర్పడుతుందని నిరూపిం చారు ఆయన.

అందుకే కాబోలు అమెరికాలోని ఒజిబా తెగవారు హాస్యకారుల సేవలను రోగుల చికిత్సకు ఉపయోగించేవారు. డా||జేమ్స్ వా కడుపారా నవ్వడం మూలంగా స్పందిస్తుందని, జబ్బును నిరోధించడానికి కావలసిన శక్తిని ఇతోధికంగా అందిస్తుందని వివరించారు. నవ్వు శరీరం మొత్తాన్ని తేలికపరుస్తుంది. ఏదో తెలియని ఆనందం ఆవరింపజేస్తుంది.

2. పరమౌషధం : వర్తమాన సమాజంలో - ముఖ్యంగా ఉన్నత, మధ్యతరగతి వర్గాలలో ఏదోఒక మానసిక ఉద్రిక్తత (టెన్షన్)కు, ఒత్తిడులకు గురికాని వ్యక్తులు అరుదుగా కన్పిస్తారంటే అతిశయోక్తి కాబోదు. ఈనాడు అమెరికాలో మానసిక ఉద్రిక్తత ఓ జాతీయ విపత్తుగా పరిణమించిందంటే,దాని ప్రాధాన్యం అర్థమౌతుంది. ఆధునిక సమాజాన్ని 'ఆందోళన ఉద్రిక్త) సమాజం'గా అభివర్ణించారు.

హార్వే వద్దకు ఒక మహిళ వచ్చి తాను ఎంతోమంది మానసిక చికిత్సకులను సంప్రదించి, వారితో పూర్తిగా నిరాశ చెందానని మానసిక వైద్యుడు " చికిత్సకుల మూలంగా తాము నాశనమయ్యానని నైరాశ్యం ప్రకటించింది. హార్వే నవ్వుతూ " మీరు అదృష్టవంతులు. నా వరకు నేను ఈ వారానికి నాశనంచేసే కోటాను పూర్తిచేశారెండి" అనడంతో ఆమె పగలబడి నవ్వింది. ఒక వైద్యునిగా కాక, మానవతాదృష్టితో తన సమస్యను అవగాహన

---

హాస్యానికి చక్కని ఆలోచన, పటిష్టమైన ప్రేమ అవసరం. – జెర్రీ అండ్ హెలెన్విస్

చేసుకునే మంచి వ్యక్తి వద్దకు వచ్చినందుకు ఆమె సంతృప్తి చెందింది. ఇలాంటి అవగాహన పెరగడంతో ఆమె దృక్పథంలో మార్పు వచ్చి క్రమంగా ఆమె కోలుకుంద న్నారు. ఈ విధంగా చికిత్సా విధానంలో హాస్యంను సందర్భోచితంగా, జాగ్రత్తగా ఉపయో గించాలంటారు హార్వే. నిజానికి మానసిక చికిత్సా శాస్త్రంలో ఎంతో హాస్యం ఉంది. అందుకే అది ఆధునిక ఆందోళన యుగానికి అత్యంత ఉపయుక్తంగా మారి క్రమంగా ప్రజాదరణ పొందుతూంది.

3. చికాకుకు హుష్ కాకి : డా|| వేనే డయర్ నిరంతర చికాకు ప్రియులకు ఒక చిట్కా చెప్పారు. "తరచు నిన్ను బాధపెట్టే, చికాకుపరిచే విషయాల జాబితాను తయారుచేసి ఒక బెలూన్ తెచ్చి ఆ జాబితాను దానికి తగిలించు. అది పైకి ఎగురుతుంటే నీ చికాకులన్నీ గాలిలో ఎగిరిపోయినట్లుగా, నీవు హాయిగా ఉన్నట్లుగా ఊహించుకో" అన్నారు.

ఈ పిచ్చిపట్టిన ప్రపంచంలో మానసిక ఒత్తిడులను తొలగించగల ఏకైక సాధనం నవ్వు'. అదొక అందమైన మత్తుమందు, చిత్రంగా అలరించే దివ్యౌషధం వంటిది. అందువల్లనే అనారోగ్యవంతులు ఒక్క పర్యాయమైనా విధిగా విదూషకుని ఇంటికి వెళ్ళాలన్న నియమం వేలాది సంవత్సరాల క్రితమే గ్రీకు వైద్యులు పెట్టారు. ప్రాచీనకాలంలో ప్రతి రాజుగారి ఆస్థానంలో విదూషకులు ఉండేవారు. క్లిష్టమైన పాలనా సమస్యలతో సతమతమయ్యే రాజు గారిని, ఆయన సహచర బృందాన్ని విదూషకులు నవ్వుల్లో ముంచెత్తుతూ పాలకులచుట్టూ ఆహ్లాదకర వాతావరణాన్ని సృష్టించేవారు. వాల్తేర్ పండితుడు మాట్లలో"ప్రకృతి జబ్బును నయంచేస్తే, వైద్యుడు చెయ్యవలసిన పనిఅంతా రోగిని ఆనందంగా ఉంచడమే" అన్నాడు.

4. వ్యాపారులకు నేస్తం : "హాస్య చక్రవర్తులకన్నా అమ్మకందారుడు (Salesman) ఎక్కువ హాస్యోక్తులు చెప్పగలరు" (జాన్ క్లీస్). అతను మాటలనే అమ్మగల దిట్ట.... అయితే, అతను వస్తువును చూసి ఎప్పుడూ హాస్యమాడడు. హాస్యంతో వస్తువును విక్రయిస్తాడు. అందుకే వాణిజ్య విజయానికి నవ్వు ఎంతో అవసరం అంటారు.

మనోహర్ ప్రఖ్యాత బట్టలషాపుకు వెళ్ళి డ్రస్లు చూస్తూ ఒక సూట్ తీసి "దీని రంగు ఏమీ బాగాలేదే" అన్నాడు. ప్రక్కనే ఉన్న సేల్స్‌మన్ "సార్! మొన్ననే ఐ.ఎ.ఎస్.కు సెలక్టైన ధనుంజయ్ గారు దీనిని చూసి అచ్చం ఇలానే అన్నారండి" అంటూ మరొక సెట్టును చూపిస్తూ "ఇలాంటి డ్రస్సులు ఆయన రెండు సెలక్ట్ చేశారండి. ఇవి మీలాంటి ఉత్సాహవంతులకు బాగా నచ్చుతాయండి" అని ఎంతో వినయంగా అనడంతో మనోహర్ అమితానందపడి ఏకంగా మూడు డ్రస్సులు కొనుగోలు చేశాడు.

---

హాస్యం చతురతలేని వ్యక్తికి ఎక్కడా స్థానం ఉండదు. – హ్యారీ రూమన్

అలానే, చీరెలు అమ్ముతూ ఒక గడుసరి సేల్మ న్ "ఈ చీరె తీసుకోండి మేడమ్... టి.వి. సీరియల్స్ చూసేటప్పుడు ఎంత ఏడ్చినా ఇది ఇట్టే పీల్చేసుకుంటుంది. ప్యూర్ కాటన్ కదా!" అని ఎంతో చమత్కారంగా ఒప్పించాడు.

5. ఆకర్షణీయ వలలు : వేసుకునే హాస్యోక్తులు శ్రోతలకు వినోదంతోపాటు ఆశ్చర్యాన్ని కూడా కలిగిస్తాయి. ఎదుట నిల్చున్న హాస్యకారు డికన్నా తామే గొప్పవారమన్న తృప్తిని, ఆనందాన్ని ప్రేక్షకులకు కలిగిస్తాయి. అందుకే ప్రకటనదారులకు ఇదొక వరప్రసాదినిలా సాయపడుతుంది.

రాముణ్ణి ఆశ్రయించడానికి వచ్చిన విభీషణుడు ఏమన్నాడో చూడండి. "రావణ: అంటే ఏడిపించుకు తినేవాడు అని అర్థం. అలాంటి రావణుడికి నేను సోదరుడను... నేను కూడా చిన్నతనము నుండి దుష్టసాంగత్యము కలవాడినే. పేరైనా మంచిది పెట్టుకున్నాను కాను. విభీషణుడని (మిక్కిలి భయము కలిగించేవాడు) నా పేరు" అంటూ నైచ్యానుసంధానం (తన తక్కువతనాన్ని చెప్పుకోవడం) చేసుకున్నాడు విభీషణుడు'.

భారీ విగ్రహంగల టోటీ ఫీల్డ్స్ గొప్ప హాస్యచతురుడు. "ఈ ప్రాంతంలో జన్మించిన అత్యంత అనాకారిని నేనే" అని చెబుతూ అపారమైన కీర్తి గడించాడు! బెట్సీ బోరన్స్ మరొక అడుగు ముందుకువేసి "సామాజికంగా గొప్ప గుర్తింపు పొందిన మేము బాగా అందంగా కూడా కన్పిస్తే.....ఇంకేమైనా ఉందా! ప్రేక్షక మహాశయులు భయభ్రాంతులకు లోనుకావచ్చు!" అన్నాడు.

ఈ విధంగ 'స్వీయనింద' అనే ఆయుధంతో ఉత్పత్తిదారులు ప్రజలను సులువుగా ఆకర్షిస్తూ తమ ఉత్పత్తులకు మంచి మార్కెట్ తెచ్చుకోవచ్చు.

ఆల్విన్ టోఫ్లర్ చెప్పిన ట్లుగా "పాతపద్ధతులను విస్మరించలేనివారు, వినూత్న విజ్ఞానాన్ని ఆహ్వానించలేని వారే భవిష్యత్తులో నిరక్షరాస్యులవుతారు". నవ్వుతూ పనిచేయడం ప్రగతికి చిహ్నమని, పని ప్రదేశాలను, పరిసరాలను నవ్వుల భాండాగారాలు (Comedy Stores)గా మార్చాలని ఈనాడు అందరూ గుర్తించారు.

ఉపాధ్యాయలకు వరం: ఇజ్రాయిల్ లోని ఆచార్య అవెనర్ జివ్ జరిపిన పరిశోధనలో విద్యాబోధనలో హాస్యాన్ని ఉపయోగించడం మూలంగా విద్యార్థులలో జ్ఞాపకశక్తి పెరిగిందన్నారు''. అయితే, బోధనలో వీలైనంత తక్కువగా ఉపయోగించాలన్నారు. హాస్యోక్తు లు విసిరే ఉపాధ్యాయులు విద్యార్ధులను ఎక్కువగా ఆకర్షిస్తారని, అందుకే వారి పాఠాలను పిల్లలు బుద్ధిగా వింటారని విద్యావేత్తలందరకు తెలిసిందే.

---

బాల్యం యొక్క సహజసిద్ధమైన శబ్దమే హాస్యం. – ఆల్విన్ ష్వాడ్జ్

7. నిర్వహణాశాస్త్రంలో హాస్యం : చిరునవ్వుతో అం దించే సందేశం అత్యంత ప్రీతిపాత్రంగా స్వీకరించబడుతుందని తెలిసిందే. అలానే, హాస్యోక్తులద్వారా పై అధికారి, క్రింది అధికారి అన్న భావనలను తొలగించలేకపోయినా,కుల మత విభేదాలను చాలావరకు తగ్గించవచ్చన్నది యదార్థం.

ఏదైనా ప్రమాదం జరిగితే ఎలా రక్షించుకోవాలో ఎయిర్ హోస్టెస్ ప్రయాణికులకు రసవత్తరమైన పద్ధతిలో అందజేస్తున్నది. "దయచేసి పొగ త్రాగకండి. ఏ ప్రయాణికుడైనా ఆ అలవాటును మానుకోలేకపోతే, సిగరెట్ తాగాల్సిందేనని మొరాయిస్తే. అలాంటివారికి విమానపు రెక్కలపై సీటు వేయిస్తా. ఒకవేళ విమానం నీళ్ళలో దిగితే ఎంచక్కా మీ సీటునే ఒక తెప్పలా ఉపయోగించుకోండి. విమానం దిగేటప్పుడు మీ సామాగ్రినంతటినీ జాగ్రత్తగా దించుకోండి. హాయిగా ప్రయాణం చేయండి. మొహమాటపడకుండా మా ఆతిథ్యాన్ని స్వీకరించండి" అంటూ అందంగా ఆమె విషయాన్ని వివరిస్తుంటే, ఆనందిస్తూ విషయాన్ని పాటించనివారు ఎవరుంటారు చెప్పండి? నవ్వులతో రంగరించి అందించే సందేశం బలం ఎంత గొప్పదో అనేదానికి ఇదే ఉదాహరణ.

హాస్యోక్తిని ఒక ఆయుధంగా ఉపయోగించగల మేనేజర్ నవ్వుతూనే తన లక్ష్యాన్ని సాధించుకుంటాడు.

కొందరు ఖాతాదారుల ప్రవర్తన బ్యాంకు సిబ్బందికి ఒక సమస్యగా మారింది. ప్రతి నిత్యం ఏవో ఘర్షణలు జరుగుతుండటంతో సమస్యా పరిష్కారానికి ఒక పథకాన్ని సిద్ధం చేశారు. వారాంతంలో ఖాతాదారులందరితో ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారు సమావేశంలో పాల్గొన్న ఖాతాదారు కొన్ని సూచనలు చేశారు. అలా సిబ్బందికి, ఖాతాదారులకు మధ్య అవగాహన పెరిగి సమస్యలు సమసిపోయాయి. అందుకే 2 వేల సంవత్సరాల క్రితమే తమిళ ఋషి తిరువళ్ళువార్ "సమస్య ఎదురైనప్పుడు నవ్వడం నేర్చుకో" అని సలహా ఇచ్చాడు.

నవ్వు క్షమాగుణాన్ని పెంచి, మానవ సంబంధాలను మెరుగుపరుస్తుంది, జీవనస్థాయిని పెంచుతుంది. అహింసాయుత సత్యాగ్రహంలో కార్యకర్త తనను తాను శిక్షించుకుంటూ శత్రువు మనసు మార్చడానికి, తీసుకురావడానికి కృషి చేస్తాడు. ఈ విషయంలో జీసస్, బాపూజీల కృషి ప్రశంసనీయమైనది. అందువల్లనే వారు చరితార్థులయ్యారు. హాస్యం కూడా అలాంటి పాత్ర పోషిస్తుంది. తోటివారిని నవ్విస్తూ, వారిలో హృదయ పరివర్తన తీసుకురావడానికి కృషి చేస్తుంది. హాస్యం ఎప్పుడూ మొక్కలాగా

వంగి ఉంటుందేకాని, మానులాగా ఎదిగి, అహంకారంతో విర్రవీగదు. నమ్రత దాని స్వభావం. ఆనందాన్ని పంచుతూ. సంతోషాన్ని పెంచుతుంది దాని సారాంశం.

ఆంగ్లంలోని చిరునవ్వు (Smiles) అనే పదం చాలా విచిత్రమైనది. అది అత్యంత పొట్టి పదం అయినప్పటికీ ఆ పదంలో మొదటి, చివరి అక్షరాలు తీసేస్తే Mile అవుతుంది కనుక, అది చాలా పొడవైన పదమని చమత్కరిస్తారు! అందరినీ ఆమోదయోగ్యంగా ఆహ్వానించడానికి ఉపయోగపడేది చిరునవ్వు కనుక అది చాలా పొట్టి పదమని, నీ నిరుత్సాహాన్ని క్షణాలలో తొలగించగల శక్తి చిరునవ్వు కు మాత్రమే ఉన్నది కనుక అది చాలా వేగవంతమైన, పొడవైన పదమని కూడా చెబుతారు. ఈ విధంగా Smilesలో ఒక గొప్పతనం ఉంది, ఒక అద్భుత సందేశం ఉంది. మానవ ఔన్నత్యానికి ప్రతీక హాస్యం. అందుకే మనిషికి చిరునవ్వే సింగారం అంటారు.

8. గొప్ప సంస్కర్త : హాస్యం రాజ్యాంగ పాలకునివంటిది కనుక నియంతలు దానిని స్వాగతించరు. “స్వేచ్ఛ ఫలసాయం హాస్యోక్తులు” (జీఎల్). ప్రజాస్వామ్యానికి సంస్కరణలోనేగాని, సంహారంలో విశ్వాసం లేదు. హాస్యం కూడా అలాంటిదే. క్రమశిక్షణ లో పెట్టదలచిన వ్యక్తి మనస్సు నొప్పించకుండా అది అతనిలో మార్పు తెస్తుంది.

అది మంచి ఎండాకాలం. ఒక పెద్ద హాలులో పేరొందిన ఒక ఉపన్యాసకుడు అందరిని నవ్విస్తూ ఆహ్లాదకరంగా ప్రసంగాన్ని కొనసాగిస్తున్నాడు. ఇంతలో హఠాత్తుగా ఫ్యాన్లు ఆగిపోయాయి. అందరూ “అబ్బ” అంటున్నట్లుగా అటుఇటు చూశారు. రెండు నిమిషాల్లో మరల ఫ్యాన్లు తిరగసాగాయి. అలా మూడు నాలుగు పర్యాయాలు జరిగిన తరువాత శ్రోతలలో ఒకరు “ఏమండీ! అసలే ఉక్కపోసి చస్తుంటే, ఎందుకు అలా పదేపదే వాటిని ఆపుతున్నారు? " అని అసహనంగా ప్రశ్నించాడు. ఆ ఫాన్లను ఆపిన వ్యక్తి ప్రక్కనే కూర్చున్న వ్యక్తి “బాబూ! ఆ ఫ్యాన్లను ఇచ్చిన దాత ఆయనే. ఫ్యాన్లన్నీ అలా గిర్రున తిరుగుతూ ఉంటే ఆయన పేరు కనపడదని మధ్యమధ్య లో వాటిని ఆపుతున్నాడు. ఆ ఫ్యాన్ల ఇప్పుడైనా ఆయన పేరును చూడండి సార్" కాలమాన పరిస్థితులకు అనుగుణంగా మారని స్థిరచిత్తులను, సనాతనులను గేలిచేస్తూ వారిలో పరివర్తన తీసుకురావడంలో తోడ్పడుతుంది హాస్యం.

బీర్బల్ కు కొంత పొలం ఇస్తానని ఆశ చూపిన అక్బర్ ఆ తరువాత ఆ సంగతే మరచిపోయాడు. ఈ విషయాన్ని రాజుగారి దృష్టికి ఎలా తీసుకురావాలి అని బీర్బల్ ఆలోచిస్తున్నాడు. ఒకరోజు అనుకోకుండా ఇద్దరూ కలసి పోతుండగా, దారిలో వారికి ఒక

---

మన ఆలోచనా స్వభావాన్ని మార్చగల రసాయనం హాస్యం. – లిన్ యుటాంగ్

ఒంటె కన్పించింది. "బీర్బల్!... ఒంటె మెడ అలా వంకర తిరిగి ఉంటుందేమిటి?" సరదాగా ప్రశ్నించాడు అక్బర్. "ఆ ఏముంది ప్రభూ...పూర్వజన్మలో ఎవరికో దానం ఇస్తానని గొప్పలు చెప్పి, దానిని ఇచ్చివుండదు. అందుకే దానికి ఆ గతి పట్టి ఉంటుంది" అన్నాడు బీర్బల్. బీర్బల్ సమాధానంలోని గేలి అర్థమైన అక్బర్ అతనికి ఇస్తానన్న పొలాన్ని వెంటనే ఇచ్చివేశాడు! ఈ విధంగా మానవునిలోని బలహీనతలను సులువుగా సరిదిద్దుతుంది హాస్యం.

ప్రముఖ రచయిత స్పెన్సర్ ప్రకారం వ్యక్తి తనకున్న అధిక శక్తిని నవ్వు ద్వారా బహిర్గతం చేస్తాడు. మనిషికి నవ్వు అనేది లేకుంటే, ఆ శక్తిని అతను సంఘ వ్యతిరేక, విద్రోహ కార్యకలాపాలకు ఉపయోగించవచ్చు. దీనినే అధిక శక్తి సిద్ధాంతం అంటారు ఆయన. ఈ విధంగా సామాజిక ప్రగతికి అడ్డుగా ఉన్నవాటిని విమర్శిస్తూ పాత, కొత్త విలువలతో కూడిన సంస్కృతిని నిలబెడుతూ సామాజిక సమతౌల్యాన్ని నవ్వు వలన కలిగే కొన్ని ఇతర ప్రయోజనాలను తెలుసుకుంటే మనకు నిజంగా ఆశ్చర్యం కలుగుతుంది.

అ. నవ్వు ద్వారా నేరస్తులను పట్టుకోవచ్చుట! ఒకవ్యక్తి నవ్వునుబట్టి అతని ముఖకండరాలలో వచ్చిన మార్పుల ఆధారంగా అతనిని గుర్తించడం చాలా సులభమని ఇటీవల జరిగిన పరిశోధనల ద్వారా ఆ. గొప్ప కళాకారుడు కావాలన్నా చక్కని నవ్వు అవసరమే! భారతదేశ చలనచిత్ర చరిత్రలో 64 సం||ల (దేశంలో సినిమా పుట్టి 74 సం||లు అయింది.) సుదీర్ఘ కాలం నటునిగా కొనసాగుతున్న ఏకైక ఆర్టిస్ట్ అక్కినేని నాగేశ్వరరావు ను ఒక ఇంటర్వ్యూలో "మీ అభిమాన నటులు ఎవరు?" అని అడుగగా, " నేను అశోక్ కుమార్ ని చూసి ముచ్చటపడే వాణ్ణి. ఆయన నవ్వు, మాట్లాడే తీరు, నటన ఎంతో సహజంగా ఉండేవి" అన్నారు.ఈ విధంగా హాస్యం ప్రయోజనాలు ఎన్నో, ఎన్నెన్నో కన్పిస్తాయి.

నవ్వుల ముగింపు: ఈ విధంగా నవ్వు మనకు ఎన్నో విధాలుగా సాయపడుతుంది. ఎటొచ్చి, అణుబాంబుకన్నా శక్తివంతమైన ఈ ఆయుధాన్ని మనం ఉపయోగించుకునే నేర్పరితనం పైన మన విజయం, ఆనందం ఆధారపడతాయి. ప్రతి సంఘటనలోని హాస్య కోణాన్ని చూస్తూ, ఇతరులు చేస్తున్న పనులను చూసి ఆనందిస్తూ ఆనందంగా జీవించడం నేర్చుకోవాలని హాస్యం మనకు నేర్పుతుంది. అయితే, దీనికి కొంత కృషి, మరింత అభ్యాసం అవసరం కావచ్చు.

---

జీవితాన్ని పునఃధృవీకరించడమే హాస్యం. – బిబెర్రీ

చివరగా ఒక హాస్యోక్తితో ఈ అధ్యాయాన్ని ముగిద్దాం. ముద్దుల కొడుకు రాము రొప్పుతూ రోస్తూ ఇంట్లోకి వచ్చి "నాన్నా నాన్నా నువ్వెప్పుడైనా భూతాన్ని చూశావా?" అని అడిగాడు వార్తాపత్రిక చదువుకుంటున్న తండ్రిని. తండ్రి పత్రిక చదువుతూనే "ఇప్పుడు భూతంతో పని ఎందుకు వచ్చింది బాబూ!" అని ముద్దుగా అడిగాడు. "మా ఫ్రెండ్ రాంబాబు వాళ్ళ నాన్న రాత్రి ఓ పెద్ద భూతాన్ని చూశాట్ట. వాడొచ్చి క్లాసులో వాళ్ళ తండ్రిని గురించి గొప్పలు చెప్పుకుంటున్నాడు" తనకు ఆ అవకాశం లేకుండా పోయిందన్న బాధతో అన్నాడు కుమారుడు. తండ్రి అటు ఇటు చూసి, తన భార్య అక్కడ లేదని నిర్ధారించుకున్న తరువాత "భూతాన్ని చూడటం ఏమిట్రా..... మా నాన్న పదేళ్ళ క్రితమే దానిని ఎంచక్కా పెళ్ళే చేసుకున్నాడని రేపు నువ్వు గొప్పగా చెప్పు...." అంటూ భార్య రాకను గమనించి ముసిముసిగా నవ్వుకుంటూ పత్రిక చదవడంలో మునిగిపోయినట్లు నటించాడు.
ఆయనను అలా నవ్వుకోనిస్తూ మనం మాత్రం నవ్వుల ఆటలు ఆడుకుందామా?

---

హాస్యం అంతరిస్తే నాగరికత అంతర్ధానమౌతుంది. – ఎర్మాబాంబే

అధ్యాయం 19

# నవ్వుల ఆటలు: ఆనంద బాటలు

“అభ్యాసం కూసువిద్య"; "రుద్దగా రుద్దగా బండరాయి అయినా గుండ్రాయి అవుతుంది"; "శోధించనిదే సాధించలేము" అంటారు పెద్దలు. అందుకే సాధన చెయ్యాలి, సాధించి ఆనందించాలి. నవ్వడం ఒక అదృష్టం అయితే, నవ్వించడం ఒక వరం. ఇలాంటి అద్భుత వరాలను ఆటలుగా మార్చగలగడంలోనే ప్రత్యేకత ఇమిడి ఉంటుంది. క్లిష్టమైన అంశాన్ని గొప్ప ఆనందంగా మలచడం ఆట లక్షణం. నవ్వు అంటేనే ఆనందం. మరి దానినే ఒక ఆటగా మారిస్తే.....ఇంక నవ్వులే నవ్వులు. ఈ విభాగంలో కొన్ని అభ్యాసాలు, ఆటలు, చిట్కాలు, హాస్యోక్తులు చూద్దాం.

పీకే రావు నుండి పాకే రావు దాకా : ఇదొక అందమైన ఆట. తెలుగు పేరును ఆంగ్లంలోకి అనువదించడమే ఈ ఆట సారాంశం. దీనికి నామానువాదం అని పేరు పెడదాం. ఆట చాలా సింపుల్ గా నడుస్తుంది. ముదలు చీటీల పైన 1 నుండి 10 దాకా అంకెలు వేసి, ఒక్కొక్కరు ఒక్కొక్క చీటీ తీసుకోవాలి. 1వ అంకెగల చీటీ తీసిన వ్యక్తి రెండవ అంకె చీటీ తీసిన ఆటగానితో ఒక వ్యక్తి పేరు చెప్పమని అడగాలి. అతను “కొండలరావు" అన్నాడనుకోండి. వెంటనే మొదటి వ్యక్తి దానికి ఆంగ్లానువాదం చేయాలి. “
హిల్స్ డోంట్ కమ్" అని ఆయన చెప్పడంతోనే అందరూ చప్పట్లు చరుస్తారు. రెండవ వ్యక్తి ప్రక్కనున్నవానిని పేరు చెప్పమనాలి. అతను “ఏడుకొండలు" అన్నాడనుకోండి..... "సెవెన్ హిల్స్" అని తర్జుమా చేయాలి. ఈ విధంగా “ఉదయ భాస్కర్" అంటే “రైజింగ్ సన్" అని, “సాగర్ కుమార్"ను “ఓషన్ సన్" అని - ఇలా చెప్పుకుంటూ ఆడుకోవచ్చు. ఇక్కడ గెలుపుకన్నా హాస్యం ముఖ్యం. కడుపారా నవ్వుకోడానికి ఇదొక చక్కటి ప్రయోగం.

రోజూ ఒకే రకంగా ఆడితే అందులో మజా ఉండదు కనుక మరునాడు సరదాగా సంక్షిప్తం చేసి చెప్పే ఆట ఆడవచ్చు. ఉదాహరణకు "పగడాల కోటేశ్వరరావు" పేరు చెప్పాడనుకోండి. దానిని సంక్షిప్తపరుస్తూ “పీ.కే. రావు" అని చెప్పడంతో అందరూ గొల్లుమంటారు. అతని పేరు "పాటిబండ్ల కేశవరావు" అయితే, అతను “పా.కే. రావు" అవుతాడు కదా! అదే రీతిలో "అలవాల వెంకటేశ్వరరావు" “ఏ.వీ. రావు" అయితే, “పాములపర్తి కిరీటి" సరదాగా “పాకి"గా మారతాడు. “బాజీ దుర్గారావు"ను సంక్షిప్తపరిస్తే ఏమౌతుంది? “బాదు" అవుతుంది అంటూ ప్రశ్న వేసినవాని వీపు పైన ఒక్కటి ఇచ్చు

---

ప్రపంచాన్ని పాలించదలిస్తే, దానిని వినోదింపజేయాలి.- ఎమర్సన్

కోవచ్చు. అలానే హైదరాబాదులో హైదరా తీసేస్తే ఏముంటుంది? అని అడిగి, వానిని మరొకమారు బాదవచ్చు. మరు నాడు వింత నిర్వచనాలు ఆట ఆడవచ్చు. "మింగడానికి మెతుకు లేకపోయినా, మీసాలకు మాత్రం సంపెంగనూనె". పాత సామెతను కొత్త కాలానికి తగ్గట్లుగా మార్చు.

"బెండకాయ కొనడానికి డబ్బు లేదు కాని, బెంజికారు కొందామన్నాడట!

కొంటె ప్రేయసి అంటే ఎవరు? - "నీ కోసం కొండమీది కోతినైనా తెస్తా" అని ప్రియుడు మారాం చేస్తుంటే, "ఇప్పటికే ఒకదానితో బాధపడుతుంటే, మరొకటి దేనికి?" అని చిలిపిగా ప్రశ్నిస్తూ కొంటెగా చూసే ఆమె..

రాము : అరేయ్ సుబ్బు.... ఈ రోజు నువ్వు అచ్చు అందమైన కోతిపిల్లలా ఉన్నావురా!

సుబ్బు : చాలా సంతోషం. అయితే నా ముఖం బెల్జియం అద్దంలా ఉందన్నమాట!

ఇలా ఒక్కొక్కరోజు ఒక్కొక్క శీర్షిక క్రింద సరదాగా కాలక్షేపం చేస్తూ ఆనంద డోలికల్లో తేలియాడవచ్చు.

భమిడిపాటి రాధాకృష్ణ మంచి హాస్యప్రియులు. ఆయన సినీ నాటక రచయిత కూడా. ఒక పర్యాయం ఒక విలేకరి "ముష్టివాళ్ళందరినీ సైన్యంలో చేర్పిస్తే ఎలా ఉంటుందంటారు?" అని ఆయనను ప్రశ్నించాడు. "తన తుపాకీని పేల్చి పెట్టమని ప్రక్కవారిని అడుక్కున్నట్లు ఉంటుంది" అన్నారు భమిడిపాటి నవ్వుతూ.

దీపాల పిచ్చయ్య శాస్త్రి వద్దకు ఒక సంపన్నుడైన రెడ్డిగారు వచ్చి తాను వ్రాసిన కొన్ని పద్యాల పై ఆయన అభిప్రాయాన్ని చెప్పమన్నారు. శాస్త్రిగారు ఆ పద్యాలు చదివి కొంచెం సేపు ఆలోచించి "బాగున్నాయి" అన్నారు. "అయ్యా! నా మిత్రులు వీటిలో తప్పులు ఉన్నాయంటున్నారే.... మరి మీరు....?" అని ఆయన అనడంతోనే "రెడ్డిగారూ! కవులు మూడు రకాలు : వరకవి - నెరకవి - దొరకవి. మీరు దొరకవులండి. మీ కవిత్వంలో దోషాలుండవు" అన్నారు శాస్త్రిగారు.

భార్య గొప్పదా? బ్రాందీ గొప్పదా? హాస్య సమాధానం ఇవ్వండి.

బ్రాందీ గొప్పది.ఇది తలలోకి మాత్రమే ఎక్కుతుంది. భార్యలాగా తల పైకి ఎక్కదు.

వెధవ అన్నది ఒక తిట్టుపదం. దానిని దీవెనగా మార్చాలి.

వెయ్యేళ్ళు ధనధాన్యాలతో వర్ధిల్లు.

తిడుతూనే గౌరవించే కూరగాయ ఏది?

హాస్యం వావివరసలను కూడ గమనించదేమో! – రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

క్యాబేజీ - క్యా**టే**...........జీ

మోటార్ సైకిల్ కి, మామూలు సైకిల్ కి తేడా?

మోటార్ సైకిలు తొక్కి ఎక్కాలి. మామూలు సైకిలను ఎక్కి తొక్కాలి.

పొడవాటి మనిషి పేరు చెప్పగలరా?

శ్రీరంగం శివగోపాల వీర వెంకట రాధాకృష్ణ సత్యసాయి వరప్రసాదరావు.

మృత్యుంజయ విష్వక్సేన ధన్వంతరి నాగ సేన విరూపాక్ష విఠలాచార్య,

అద్దం అంటే?

నీ గురించి నీకే పచ్చి అబద్ధం చెప్పేది.

బూతు అంటే?

సభ్యత లేనిదేకాని, సరదా అయినది.

వివాహం అంటే?

కట్టుకున్నదానికి, పుట్టబోయేవారికి వాహనంగా ఉపయోగపడే అదృష్టం కల్పించేది.

(ఉంది / లేదు అని మాత్రమే సమాధానం చెప్పాలి అన్నది ఇక్కడి నియమం)

మీకు ఇప్పుడు పిచ్చి ఉందా?

లేదు అంటే గతంలో ఉన్నది అన్న ప్రమాదం లేకపోలేదు. మరి ఉంది అంటే!

లుంగీకి స్త్రీ లింగం ఏమిటి?... లంగా.

నవ్వించకపోతే ఆడదు సినిమా. మరి ఏడ్పించకపోతే ఏది నడవదు?... సీరియల్.

ఇలాంటి సరదాలు సేకరించండి. ప్రతిరోజు సరదాగా నవ్వుకోండి.

హాస్యడబ్బారెడీ చేద్దాం: ఈ ప్రపంచం ఒక గొప్ప హాస్యశాల, హాస్య ప్రయోగశాల. ప్రజలంతా అందులో సూత్రధారులు. నిజానికి ఈ ప్రయోగశాల ప్రతి ఒక్కరిలోను ఉంది. కనుక ప్రతిచోట మనం - అంతర్గతంగా (నిన్ను బాధించే విషయాలు - నీ బాస్ ప్రవర్తన, నీ భార్య నిర్లక్ష్యం, నీ మిత్రుని వెక్కిరింపులు), బహిర్గతంగా (ఆఫీస్, ఇల్లు, మిత్రులు) హాస్యాన్ని ఆస్వాదించగలగాలి. "నవ్వు అంటే విటమిన్ హెచ్ (H) అన్నమాట! అది హాస్యానికే (Humor) కాక, ఆరోగ్యానికి (Health) కూడా సంకేతం. అందుకే అది మన జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తుందని చెబుతారు. "నవ్వనిరోజు అంటే మనం పూర్తిగా కోల్పోయిన రోజు" అన్నది ఫ్రెంచి సూక్తి.

చిత్రవాక్యాలు : మనకు ఆసక్తి ఉండాలేకాని ఇంట, బయట, - ప్రతిచోట హాస్యాన్ని పోగుచేయగలము. అందుకే మనం హాస్యోక్తుల సేకరణగాళ్ళుగా మారాలి.

---

వక్రోక్తులు ఎప్పుడూ అచేతన స్థితిలోనే ఉంటాయి. – శామ్యూల్ బట్లర్

ఒకరోజు అనుకోకుండా రైలుబండి సకాలంలో స్టేషను రావడంతో ప్రయాణీకుల ఆశ్చర్యానికి, ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. కొంతమంది ఉత్సాహంతో పరుగెత్తుకుంటూపోయి డ్రైవర్‌ను అభినందిస్తుంటే, ఆయన నిర్లిప్తంగా 'ఇది నిన్న రావలసిన బండి అండి' అన్నాడట! అందుకు ఓ గడుసరి ప్రయాణీకుడు ఇప్పటికైనా బండిని తెచ్చావనేనయ్యా బాబూ నిన్ను అభినందించేది' అనడంతో అందరూ నవ్వుకున్నారు.

ఒకానొక పార్కంతా కాగితాలతో గలీజుగా ఉంది. ఇంతకూ ఆ కాగితాలు ఏమిటి? 'పార్కును శుభ్రంగా ఉంచండి' అని మునిసిపాలిటీవారు ముద్రించిన విజ్ఞప్తి కాగితాలు అవి!

రాష్ట్ర ప్రభుత్వంవారు 'స్వదేశీ పరిశ్రమలకు ప్రోత్సాహం' అనే శీర్షికపైన పోటీలు నిర్వహించగా, అందులో ఉత్సాహంగా వేలాదిమంది పాల్గొన్నారు. విజేతకు జపాన్ కంపెనీవారి టి.వి. సెట్‌ను బహూకరించారు.....

"యూనివర్సిటీకి ఎలా వెళ్ళాలి?" అని ఒక పోలీసును దారి అడిగితే, ఆయన నవ్వుతూ “డిగ్రీలో మంచి మార్కులు వస్తే యూనివర్సిటీకి దారి దొరుకుతుంది బాబూ!” అని సలహా ఇచ్చాడు.

హాస్య ధోరణిని అలవరచుకోవాలేగాని, ప్రతిచోట మనం వింత మాటలను, విచిత్ర వాక్యాలను వింటూంటాము. మనం ఒక హాస్యడబ్బాను లేదా నవ్వుల పుస్తకాన్ని సిద్ధంచేసుకొని మంచి జోక్స్ అన్నింటినీ ఆ డబ్బాలో పోయడం, ఆ పుస్తకంలో వ్రాయడం అలవాటు చేసుకోవడం నవ్వుల వ్యాప్తికి నాజూకైన మార్గం. .

కమల : "స్త్రీలు లేకపోతే మీ మగాళ్ళగతి అధోగతే. చివరకు మీకు బట్టలు ఉతికేవాళ్ళు కూడా వుండరు” అంది భర్త శ్యామ్ తో.

శ్యామ్ : అవును... స్త్రీలు లేకపోతే మాకు బట్టలతో పనేంటి?

ఇంటి గోడలమీద కాగితాలను అంటించకుండా చెయ్యడానికి మా మిత్రుడు పెద్దన్న 'కాగితాలు అంటించరాదు, ప్రకటనలు వ్రాయరాదు' అని పెద్ద అక్షరాలతో చక్కగా పెయింట్ చేయించాడు. ఒక కొంటె కోణంగి రెండుచోట్ల 'దు' అనే అక్షరాన్ని చెరిపివేశాడు. ఇప్పుడు అది ఏమైంది?

“డబ్బులు లేక చెప్పులు కొనలేకపోతున్నా"-సమస్య ఇది. దానికి శ్రీ శ్రీ ఏమంటారు?.... “చెప్పుకొనలేకపోతున్నా”.

అమెరికాలో 'అమ్మకానికి భర్త-కారు చౌక బేరం' అన్న హెడ్డింగ్' ఒకమహిళ ఏకంగా తనభర్తను అమ్మకానికి పెట్టి పేపర్ లో ఒక ప్రకటన ఇచ్చింది. ఆ ప్రకటనను చూసి

---

ఒక నాణానికి మూడు ప్రక్కలా చూడగలగడమే హాస్యం. – నెడ్ రోరమ్

చాలా జాబులు వచ్చాయి. ఇంతకూ ఆమెకు అందిన జాబుల సారాంశం ఏమిటి? ఎవరికివారు పనిలో పనిగా తమ భర్తలను కూడా అమ్మి పెట్టమని కోరారు!

మాటల గారడి: మాస్టారు : " సన్యాసిని అంటే ఎవర్రా?" అని ఒక విద్యార్థిని ప్రశ్నించగా, ఆ కుర్ర మేధావి " సన్యాసి భార్యండి" అని నింపాదిగా సమాధానం చెప్పాడు.

మా మిత్రుడు మోహనరావు ఈ విషయంలో అసాధ్యుడు. గుడిలో లింగాన్ని గుడిలోనే, కొట్టులోని కొబ్బరికాయను కొట్టులోనే ఉంచి ఖర్చు లేకుండా దైవానికి కొబ్బరికాయ కొట్టి, హారతినిచ్చి, ప్రసాదాన్ని పంచి పెట్టగల నేర్పరి!

కొన్ని పదాలు స్వభావరీత్యానే మృదువుగా, మధురంగా, మనోహరంగా ఉంటాయి. ఆనందం, ప్రేమ, నిర్మలత్వం, ఉత్సాహం మొదలైన పదాలను పలికేటప్పుడు మీరెంత ఆనందాన్ని పొందుతున్నా గమనించండి. అలానే నిరుత్సాహం, విషాదం, బాధ, నిరాశ, దారిద్ర్యం మొదలైన పదాలు మనలో ఒకవిధమైన నైరాశ్యాన్ని కలిగిస్తాయి. అలానే, కొందరి మాటలు ముత్యాల మూటల్లా, మనోహరంగా ఉంటే, మరికొందరి మాటలు అత్యంత నిరాశాజనకంగా, నిరాశా నిస్పృహల కేంద్రంగా ఉంటాయి. ఒక్కొక్క పదం వెనుక ఒక్కొక్క అనుభూతి, ప్రేమ, ఆర్ద్రతలు ఉంటాయి. “మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా?” అని అడగడానికి, “మీ అమ్మ మొగుడు కొంపలో ఉన్నాడా? ” అనేదానికి ఎంత వ్యత్యాసం ఉంటుంది!

ఒక ఇంటాయన భార్యను ఎప్పుడూ చికాకు పెట్టేవాడు, కాఠిన్యంగా ప్రవర్తించేవాడు. గడుసరి అయిన ఆ ఇల్లాలు డైనింగ్ టేబుల్ వద్దనున్న 'No Smoking' బోర్డు తీసి "కటువైన మాటలు వద్దు... మృదువైన మాటలు ముద్దు" అనే బోర్డు పెట్టింది!

జార్జి బరన్స్ తన వయసును గురించి ఎప్పుడూ హాస్యోక్తులాడే వాడు. “మీకు 85వ సంవత్సరం వచ్చింది కదా.....ఎలా ఫీలవుతున్నారు?” అని ప్రశ్నిస్తే, దానికి ఆయన సమాధానం చూశారా? “85 సంవత్సరాలు వచ్చాయని నేను ఫీలైనప్పుడు అది ఎలా ఉందో చెబుతానయ్యా” అన్నాడు! "

చక్కని సంబంధాలకు చిక్కని చిట్కాలు : స్నేహ సంబంధాలను పెంపొందించు కోవడంలో నవ్వు పాత్ర అద్భుతం అంటారు ఎండా జంకిన్స్. భార్యాభర్తలను ఉద్దేశించి ఆమె ప్రతిపాదించిన పంచసూత్ర ప్రణాళిక ఇది.

1. ప్రతిరోజూ ఒకరిని చూసి మరొకరు కనీసం 5 నుండి 10 నిమిషాలపాటు నవ్వుకోండి.

---

హాస్యకర్తలు గంభీరులు. అలా ఉండగలిగేది వారొక్కరే. – మార్క్ వాండొరెన్

2. ఉదయం నుండి సాయంత్రం దాకా చేసిన అర్ధరహిత కార్యాలను గురించి ఒకరు తో మరొకరు చెప్పుకుంటూ ఆనందించండి.

3. నవ్వుల పోటీ పెట్టి, ఆ పోటీలో పెద్దగా, సుదీర్ఘంగా ఎవరు నవ్వగలరో తెలుసుకోండి.

4. శృంగారంతో హాస్యోక్తులను కలపండి.

5. వారానికి కనీసం ఒక గంట ఆటలు, పాటలు, అతిశయోక్తులతో కూడిన కథలతో కాలక్షేపం చేయండి.

ప్రతి ఒక్కరూ నవ్వడాన్ని ఒక అలవాటుగా మార్చుకోవాలి. నవ్వులతో ఆడుకుంటే హాస్యక్రీడా...ఎండా జంకిన్స్ 'ఉదర హాస్యం' అనే క్రీడను ప్రత్యేకించి దంపతులకు అందించారు. ఆ ఆట ఆడే క్రమంబెట్టిదనిన....... భార్యాభర్తలు ఎదురెదురుగా నిలబడాలి. భర్త భార్య ముంజేతిమీద కాని, భుజం పైన కాని ఒక చెయ్యి వేసి, రెండవ చేతిని తన పొట్ట పైన కాని, భార్య పొట్ట పైన కాని ఉంచాలి. ఇద్దరూ ఒకరి కళ్ళలోకి మరొకరు చూస్తూ "మూడు" అనడంతోనే నవ్వడం ప్రారంభించాలి. ప్రారంభంలో అది ప్లాస్టిక్ నవ్వు లేదా కృత్రిమ నవ్వులా కన్పించిన్నటికీ క్రమంగా అది సహజ నవ్వుగా మారుతుంది. నవ్వినవ్వి పొట్టలు కదులుతాయి. నవ్వడం ఆపిన కొన్ని క్షణాల తరువాత ఇద్దరూ తమ అనుభూతులను, భావాలను పరస్పరం పరిశీలించుకోవాలి. పరస్పరం తమ అనుభూతులకు చెప్పుకుంటూ ఆనందించాలి. అనంతరం గాఢ పరిష్వంగంతో ఆ కార్యక్రమాన్ని ముగించాలి!

2. ఈ క్రీడకు పెట్టుబడి లేదు. నాయికా నాయకు లు భార్యాభర్తలే అన్నట్లు కనుక పాత్రధారులను అరువు తెచ్చుకోవలసిన పనిలేదు. కనుక హాయిగా ఆడుకోండి మట్టిబొమ్మలతో ముచ్చటైన ఆటలు : నువ్వు అసహ్యించుకునే బంధువులు లేదా నీ శత్రువుల బొమ్మలను మట్టితో తయారుచేసి, ఒక్కొక్క బొమ్మకు ఒక్కొక్క పేరు పెట్టు. నువ్వు అత్యధికంగా అసహ్యించుకునేవానితో ఫుట్ బాల్ ఆడు. నీ ప్రత్యరి గాలిలో ఎగిరిపోతుంటే, ముక్కలు ముక్కలు అవుతుంటే కడుపారా నవ్వుకో. అంతటితో ఆయనమీద కోపాన్ని తగ్గించుకో. అతనిని మిత్రునిగా స్వీకరించడానికి అంగీకరించు. మరునాడు అతను కన్పించినప్పుడు ఓ చిరునవ్వు చిందించు. ఆ విధంగా నీ శత్రువుల సంఖ్య క్రమంగా తగ్గుతుంది, కోపం చల్లారుతుంది.

ఇంక రెండవ శత్రువు పనిపట్టాలి కదా! ఆ బొమ్మను తీసుకెళ్ళి మరగబెట్టిన నీళ్ళల్లో వెయ్యి. అయినా....... ఇప్పటికే నీ మనస్సును తిన్న ఆ దుష్టునికి (నీ దృష్టిలో) నీళ్ళను

---

వందమంది చెయ్యలేని పనిని ఒక హేళన కార్యం చేస్తుంది. - శ్రీ శ్రీ

పాడుచేసే అవకాశం ఎందుకు ఇవ్వాలి! అందుకే ఆ మట్టి బొమ్మను మండే పొయ్యిలో వెయ్యి. దరిద్రం వదిలిందనుకొని ఆనందించు. ఇంక అతనిమీద నీ కోపం తగ్గించుకొని మరునాడు అతను కన్పించడంతోనే హాయ్ చెప్పు.

మూడవ శత్రువు ఉంటే అతని పేరును నీ బూట్లు/ చెప్పుల అడుగున వ్రాసి. పెంటకుప్పల పైన నడువు. నీ శత్రువును హీనాతిహీనంగా శిక్షిస్తున్నానని ఆనందించు. నవ్వడం ఒక క్రీడగా భావించు.

అయితే, ఇలాంటి హాస్య క్రీడలను ఎన్నింటినైనా సృష్టించుకోవచ్చు. పరోక్షంగా శత్రువును అణచి పెట్టిన తరువాత అతనితో మిత్రత్వాన్ని పెంచుకోవడం చాలా ముఖ్యమైన విషయం. నవ్వుల సిద్ధాంతం మనకు నేర్పే ఏకైక సూత్రం - నవ్వులు పంచు, నవ్వులు పెంచు - ఇదే!

అదొక గ్రామం. 1950 ఆ ఊరు మంటలకు ఆహుతవుతుందీ. నాలుగు ఫైర్ ఇంజన్లు వచ్చి అతి కష్టం మీద మంటలను ఆర్పాయి. ఆ ప్రమాదం నుండి బయటపడిన గ్రామీణులు కొందరు సంతోషంగా ఆ డ్రైవర్లకు తమకు తోచిన డబ్బు ముట్టజెప్పారు. అమితానందం పొందిన డ్రైవరు వెళ్తూ వెళ్తూ వస్తామండి. ఎప్పుడైనా అవసరమైతే కబురు చేయండి" అంటుంటే "మీతో పనితగలకూడదులే నాయనా" అంటూ గ్రామీ ణులు గొణుక్కున్నారు!

ఇలాంటి చతురోక్తులను కొన్నింటిని తయారుచేసుకొని తీరిక వేళల్లో, జ్ఞప్తికి తెచ్చుకుంటూ హాయిగా ఆనందించండి. ఉదయం నిద్ర లేవడంతోనే అద్దంలో చూస్తూ నవ్వడం అభ్యాసంగా పెట్టుకుంటే, బాగా నవ్వగలిగితే ఎంత ఆనందం కలుగుతుందో అనుభవపూర్వకంగా గాని తెలియదు. దీనివలన మరొక ప్రయోజనం కూడా ఉంది. ప్రొద్దున్నే లేచి ఏ దిబ్బ ముఖాన్నో, చూశావో అని, దాని మూలంగా ఏవేవో అనర్థాలు జరిగినా ఆరోజున అన్యాయంగా ఎవరినీ తిట్టిపోయాల్సిన పని ఉండదు! చక్కని ఈ అభ్యాసాన్ని ప్రతిరోజు ప్రాక్టీస్ చేయండి. ఈ విధంగా నీ చుట్టూ ఉన్న హాస్యసంఘటనలను చూసి ఆనందించడం ప్రారంభించు.

ఇక్కడ వయోభేదం లేదు'. దీనిని ముఖ్యంగా సీనియర్ సిటిజన్లు గమనించాలి. మైఖేల్ పిచర్డ్ చెప్పినట్లు "వృద్ధాప్యం మూలంగా నువ్వు నవ్వడం మానెయ్యవు, నవ్వడం ఆపడంవలనే నువ్వు వృద్ధుడవయ్యావు". ఎంత బాగా చెప్పాడు!

---

నిన్ను చూసి నవ్వుకో : నీ తప్పులను చూసి నువ్వు ఎలా నవ్వుకోగలవో, అలానే ఇతరుల తప్పుల ద్వారా వారు నేర్చుకునేటట్లు చేయవచ్చు. ఒక పెద్ద అధికారి తన ఉద్యోగులందరిని ఓ బల్లచుట్టూ కూర్చోబెట్టి కొంత ధనాన్ని అక్కడ పెట్టాడు. ఇటీవల తాను చేసిన తప్పులద్వారా తానేమి నేర్చుకున్నది వివరిస్తూ అందరినీ నవ్వించాడు. “ఇంతకన్నా పెద్ద తప్పులు ఎవరైనా చేసివుంటే వారికి ఈ డబ్బంతా ఇస్తా” అని సవాల్ విసిరాడు. అందరూ ఎవరు చేసిన తప్పులను వారు సరదాగా వివరించడంతో అక్కడ ఎన్నో నవ్వుల పువ్వులు పూశాయి. పెద్ద తప్పు చేసినవానికి బహుమతి లభించడమేగాక, అందరూ అందరితో హాయిగా నవ్వగలిగారు.

తారకరామ్ ప్రసంగం చేస్తూ తడబడ్డాడు. అయినా ఆయన నవ్వుతూ “వ్రాసినదానిని చెరపడానికి రబ్బరు ఉన్నట్లే, ప్రసంగాలకు కూడా అలాంటి రబ్బర్లు ఉంటే ఎంత బాగుండును” అనడంతో సభ గొల్లుమంది. ఇంట్లో ఎప్పుడైనా గందరగో ళంగా ఉంటే “ఏమిటి.... అత్తగారు వచ్చారా?" అనడంతోనే వాతావరణం మారిపోతుంది కదా! ప్రసంగం జరిగేటప్పుడు ప్రేక్షకులు చప్పట్లు కొడుతుంటే “నాకు హింసలో నమ్మకంలేదు బాబూ! నేనింక ముగిస్తా” అంటూ ఒక వక్త ప్రసంగాన్ని ముగిస్తుండగా, “ఇవి అభినందన చప్పట్లండి, అభిశంసన చప్పట్లు కాదు” అన్నారు ప్రేక్షకులు నవ్వుతూ. “వాటి మధ్యవున్న విభజనరేఖ ఎంత సుకుమారమైందో నాకు తెలుసండి" అంటూ మరొక్కమారు నవ్వించి ఆ వక్త తన ప్రసంగాన్ని మరికొంత సేపు సాగించాడు! అందుకే నిన్ను చూసి ఇతరులు నవ్వడానికి ఎవ్వరికీ అవకాశం ఇవ్వకుండా ఆ ఛాన్స్ నువ్వే తీసుకుంటే ఎంత బాగుంటుందో! “చిన్నగా నవ్వేవాడు దొంగ, మాయకుడు. కడుపారా నవ్వగలిగేవాడు రసజ్ఞుడు” అన్నారు మునిమాణిక్యం నరసింహారావు. నవ్వేటప్పుడు ఎప్పుడూ కడుపారా నవ్వండి.

అని ఒక శ్రోతను ఆత్రంగా అడిగాడు. ఆ శ్రోత నింపాదిగా "మీ ప్రసంగంలో చివరి భాగం.... 'ఇంతటితో ముగిస్తున్నాను' అని చెప్పారే! ఆ భాగం నాకు బాగా నచ్చిందండి” అనడంతో ఆ వక్త హతాశుడయ్యాడట!

“నేను వింత కథలను చెప్పనండి, కథలను వింతగా చెబుతాను” అన్నాడు ఒకాయన. అందుకే హాస్యాన్ని నువ్వు సొంతం చేసుకోవాలి.

దొంగ : (ఓ గీతగీసి) "ఇందులో నువ్వు నుంచో. బయటకువస్తే మీ ఆవిడ గొంతు కోస్తా,

---

సామాజిక సంబంధాలలో నవ్వు ఒక పరికరంలాంటిది. – రాబర్ట్ ఆర్. ప్రొవైన్

జాగ్రత్త" అని రాముని దబాయించాడు. రాము మూడుసార్లు గీత దాటినా దొంగ ఏమీ చేయలా! దాంతో రెచ్చిపోయిన రాము దొంగను చితకబాదడంతో ఆయన భార్యకు ఆశ్చర్యం వేసి "మీకు ఇంత ధైర్యం ఎలా వచ్చింది?" అని అడిగింది.

రాము : గీత దాటితేనే నీ గొంతుకోస్తానన్నాడా లేదా? నేను ఆ గీతను మూడుసార్లు దాటినా ఆ వెధవ ఏం చేయలా, అందుకే వాణ్ణి గట్టిగా తన్నా. . !

అధ్యాయం 20

# నవ్వితే నగుబాట్లా?

జాకి జాన్లు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. మాటల మధ్యలో ఇటీవలే తాను శాంజోస్ వెళ్ళానని చెప్పింది జాకి. "అలా అనకూడదు జాకి, శాన్‌హో అనాలి. కాలిఫోర్నియాలో 'జా'ని 'హా'గా పలుకుతారు గుర్తుంచుకో...... ఇంతకూ అక్కడకు ఎప్పుడు వెళ్ళారు?" ప్రశ్నించాడు జాన్. జాకి క్షణం ఆలోచించి "హూన్, హులై మాసాల్లో వెళ్ళాం" అంది.

"మీరు నిరక్షరాస్యులా? చదవడంగాని, వ్రాయడంగాని రాదా? అలా అయితే పూర్తి వివరాలు మాకు వ్రాయండి......సహాయం అందుకోండి". (ఒక దినపత్రికలోని ప్రకటన)

సంక్షోభ సమయంలో నూతన దృక్కోణాన్ని కలిగించడంలో హాస్యం ఒక సాధనంగా తోడ్పడుతుంది. అయితే,ఒక జాగ్రత్త తీసుకోవాలి అలాంటి సమయాలలో విసిరే హాస్యోక్తులు బాధితులకు అవమానకరంగా కన్పిస్తే వారు హాస్యోక్తులు విసిరేవారిని, పాషాణ హృదయులుగా భావించవచ్చు. మరి సంక్షోభ సమయంలో హాస్యం ఎలా ఉండాలి?

తన పైన తానే వేసుకునే హాస్యోక్తులను అందరూ ఆనందంగా స్వీకరిస్తారు. అక్కడ హాస్యోక్తులను విసిరేవాడూ బాధితుడే కాబట్టి అవి ఎవరినీ నొప్పించవు, బాధించవు. అలానే ఒకానొక పరిస్థితికి సంబంధించిన హాస్యం కూడా అందరినీ ఆకర్షిస్తుంది. అది ఏ ఒక్క వ్యక్తి పైనగాని, ఏ వర్గం పైనగాని తన అస్త్రాలను సంధించకపోవడమే దీనికి ముఖ్య కారణం. సంక్షోభంలో చిక్కుకున్నవారు హాస్యాన్ని గురించి వ్యతిరేక కోణంలో యోచించడానికి కారణం ఏమిటి? హాస్యంలో ఒక మొరటు సూత్రం ఉంది. సమస్యకు, వ్యక్తికి మధ్యగల దూరం పెరిగేకొద్ది హాస్యోక్తిని ఆనందించగల శక్తి అధికమవుతుంది అన్నదే ఆ సూత్రం. రైలు లేక విమాన ప్రమాదం జరిగినప్పుడు పేపర్లో చదివి, టి.వి.లలో చూసినవారి స్పందనకు, ప్రమాదం జరిగిన ఆ రైలు, విమానంలో ప్రయాణం చేస్తున్నవారి స్పందనకు మధ్య ఎంతో వ్యత్యాసం ఉంటుంది. అలానే, అదే ప్రమాదంలో తన ఆప్తులు చిక్కుకున్నారన్న భయంకర వార్త విన్నవారికి, ఆ సమాచారాన్ని కేవలం ఒక సాదాసీదా వార్తగా విన్నవారి మానసిక స్థితులలో ఎంత వ్యత్యాసం ఉంటుందో మనకు తెలిసిందే.

ఇక్కడ మరికొన్ని విషయాలను కూడా గమనించాలి. అనుభవానికి దూరంగా ఉండటం అన్నది దేహసంబంధమైనది కావచ్చు, భావోద్రేకమైనది కావచ్చు. దేహసంబంధమైన దూరం అంటే సంక్షోభంలో ఇరుక్కుపోకుం డా దానికి అతి దగ్గరలో దాని

అంచులమీద నిలబడటం అని అర్థం. అయితే, భూకంపం వచ్చిన ప్రాంతం అయినప్పటికీ వ్యక్తిపరంగా, ఆస్తిపరంగా ఎలాంటి నష్టానికి, ప్రమాదానికి గురికానివారు హాస్యోక్తులను హాయిగా ఆనందించవచ్చు కాని, బాధితులు (ఆస్తులను, సంతతిని కోల్పోయినవారు లేదా శారీరకంగా దెబ్బతిన్నవారు) హాస్యోక్తులను స్వీకరించలేరు! అందుకే అంటారు “తనదాకా వస్తేకాని అర్థం కాదు” అని.

భావోద్రేక సంబంధమైన దూరం అంటే బాధితుడు సమస్యను ఏ కోణం నుండి స్వీకరించాడు అని పరిశీలించడం. సాధారణంగా బాధల తీవ్రతను బట్టి మన ఆలోచ నలు ఉంటాయి. దివిసీమ పెనుతుఫానులో నష్టపోయినవారందరూ ఒకే రీతిలో స్పందించరు కదా! ఆస్తిపాస్తులను శాశ్వతంగా కోల్పోయి రాత్రికి రాత్రే నిరు పేదగా మారిన ఒక సంపన్నుడికంటే తాత్కాలికంగా, నామమాత్రంగా నష్టపోయినవాని పరిస్థితి భిన్నంగా ఉంటుంది. అందువల్లనే సంక్షోభ హాస్యం అన్నది దాని తీవ్రత పైన ఆధారపడి ఉంటుంది.

సంక్షోభంలో హాస్యం కాలాన్ని బట్టి, వ్యక్తినిబట్టి మారుతుంటుంది. సమస్యల సుడిగుండంలో కొట్టుకుపోయే వ్యక్తి చతురోక్తుల సాయంతో హాస్యాన్ని ఆలంబనగా చేసుకొని ఆనందించగలిగితే సమస్య తీవ్రత గణనీయంగా తగ్గిపోతుంది. అలానే, మరణం అంటే సగటు మనిషి బెంబేలెత్తిపోతాడు. మేధావి సంగతి వేరు. అంత్యదశలో ఉన్న ఒక మహాకవి చుట్టూ అభిమానులు, బంధువులు చేరారు. "అయ్యా! మీరెప్పుడూ మీ శ్రీమతిగారి పైన కవిత్వం చెప్పలేదు. ఇప్పుడైనా ఏదైనా చెబుతారా?” అని అడిగాడు ఒక అభిమాని. ఆయన నవ్వుతూ హీనస్వరంతో “ఆనాడు..... పెళ్ళైన వెంటనే ........నా వెంట రమ్మంటే ఏడ్చింది. ఈ నాడు.....నావెంట రాలేక ఏడుస్తుంది” అంటూ కన్నుమూశాడు. ఏమైనా, ఇది కవులకు, తత్వవేత్తలకు సాధ్యమేమోకానీ, సామాన్యులకు మాత్రం కాబోదు.

సమస్యకు చేరువగా - హాస్యానికి దూరంగా : సమస్యల సుడిగుండంలో చిక్కుకున్న సగటు మనిషి దానినుండి ఎలా బయటపడాలా అని యోచిస్తాడే కాని, తీరుబడిగా కూర్చుని వాటిని ఎలా ఆనందించాలా అని భావించడు. అయితే, చతురుడు ఆనందిస్తూనే ఆ సమస్య నుండి విముక్తి పొందడానికి ప్రయత్నించవచ్చు అన్నది వేరే విషయం. అందుకే విపత్కర సమయంలో విసిరే చతురోక్తులను బాధితులు సంక్షోభం పై విసిరిన హాస్యోక్తులుగాగాక, వ్యక్తిగతంగా తమ పైన విసిరిన వ్యంగ్యోక్తులుగా భావిస్తూ అసహ్యించుకోవచ్చు. ఏమైనా గాలికిపోయే పేలపిండిని రామార్పణం అనడంలో హాస్యోక్తి ఉండవచ్చుకాని, వరదలలో కొట్టుకుపోయేవారిని చూస్తూ “ఈదే పని లేకుండా ఎంత జల్సాగా, పైసా ఖర్చు కూడా

---

నవ్వు అసలు సిసలైన దివ్యౌషధం. అది లేని బ్రతుకు నరకం. – డొన్న మెర్ మల్

లేకుండా వీళ్ళు ప్రయాణం చేస్తున్నారు" అనడం రాక్షసోక్తి అవుతుంది. తాను నవ్వడం, ఇతరులను నవ్వించడం హాస్యం లక్ష్యాలు కాని పగ, ద్వేషం, పైశాచిక ఆనందం పొందడం దాని తత్వం కాబోదు. అయితే,తుఫాను బాధితుడు ఒకడు పోలీస్ స్టేషన్ కు వెళ్ళి "అయ్యా! మొన్నటి తుఫానులో నా ఇల్లు పునాదులతోసహా కొట్టుకుపోయింది. గుట్టలుదాటి ప్రధాన రహదారిని తప్పుకుంటూ చివరకు సముద్రంలో చేరిందయ్యా" అంటూ ఏడ్చాడు. అంతా విన్న పోలీస్ "ఏం బాధపడకు చిన్నా..... స్థిరమైన చిరునామా లేని ఇల్లు' అని వ్రాసుకుంటాలే" అనడంతో ఆ బాధితుడు అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు.

మొదటి నగుబాట్లు తప్పవు. ఇప్పుడు దేశ విదేశాలలో హాస్యం ఎదుర్కొంటున్న సవాళ్ళను, ఆంక్షలను గురించి చూద్దాం.

దేశవిదేశాలలో హాస్యం స్థితి : **1998** డిసెంబరులో స్వీడన్లో అంతర్జాతీయ నవ్వుల ఉత్సవ సమావేశంలో వక్తలు "మానవజాతి క్రమంగా నవ్వులే తెలియని, నవ్వులేని గుంపుగా మారనుంది" అంటూ బాధపడ్డారు. **1950** దశకంలో మనిషి రోజుకు **18** నిమిషాలు నవ్వితే, ఇప్పుడది **6** నిమిషాలకు కుదించుకుపోయిందట!' **1998**లో జరిగిన సర్వేలో ఆ శాతం బాగా తగ్గిపోయింది. విచిత్రమేమంటే, ఆ సర్వేలో పాల్గొన్న ప్రజల ఆదాయమేగాక, జీవన ప్రమాణం కూడా నాలుగు రెట్లు పెరిగింది! దీనినిబట్టి సంపద సంతృప్తిని, ఆనందాన్ని కొనలేదు అని తేటతెల్లమైంది. ఆర్థిక విజయమే సర్వస్వంగా, సంపాదనే వ్యక్తిత్వ విజయానికి కొలమానంగా పరిగణింపబడే ఈ రోజులలో మనం నేర్చాల్సిన సత్యం ఇది.

నవ్వు నవ్వులపాలు: టెహ్రాన్**లో** పక్షపత్రిక 'ఆర్దినేహ్' సంపాదకుడు తన కుటుంబ సభ్యులతో కలసి ఒక హోటల్ లో విందు భోజనం చేస్తూ. హాస్యోక్తులు విసురుకుంటూ. ఆనందిస్తుండగా ఒక యువకుడు గంభీర వదనంతో వచ్చి "ఏమిటీ ఆ ఇకఇకలు, పకపకలు. అయినా మీకు సిగ్గులేదా? నవ్వితే నరకం పాలవుతారు" అని చీదరించుకు న్నాడు. అంతే! వాతావరణం ఒక్కసారిగా గంభీరంగా మారిపోయింది. ఇంతకూ ఆ నవ్వుల ద్వేషి ఆ దేశ నైతిక రక్షకభట శాఖ ఉద్యోగి అట! మరి పత్రికా సంపాదకునికి కోపం వస్తే ఊరుకుంటాడా! నగరంలో నవ్వడమే పాపమా? కుటుంబ సభ్యులతో ఆనందించడమే తప్పునా? హాస్యాన్ని పెదవుల మధ్య చెరసాలలో బంధించాలా అంటూ పత్రిక ద్వారా ఉరిమాడు, గద్దించాడు. దేశంలోని సనాతన వర్గీయులకు (హార్డ్ లైనర్స్) బాగా కోపం వచ్చింది. అది దేశ అంతర్గత సంస్కృతీ సంప్రదాయాలను, పాలనా విధానాన్ని ప్రశ్నించేదిగా ఉందన్నారు. నాలుగు రోడ్ల కూడళ్ళలో నవ్వితే దేశం ఏకంగా హైరానా పడిపోవాల్సి వస్తుందని ఆవేదన వ్యక్తపరచారు.

---

ఒక్క చిరునవ్వు అసాధ్యమైన కార్యాన్ని సుసాధ్యం చేస్తుంది. – బార్టడోస్ అడ్వకేట్

ఇంక తరుణోపాయంగా ఏకంగా నవ్వునే నిషేధించాలని వాదించారు. చిత్రమేమంటే, న్యాయస్థానం కూడా ఆ విమర్శలకు వంత పలికింది. ఆ వ్యాసాన్ని నిషేధించింది. ఇరాన్లో నవ్వు అలా నవ్వుల పాలైంది.

ఇంక సోవియట్ యూనియన్: రష్యా సంప్రదాయం ప్రకారం నవ్వు నియంతృత్వానికి గొప్ప శత్రువు. కనుక ప్రజలకు నవ్వడానికి కూడా స్వేచ్ఛ ఉండదు. నవ్వు పై నియంతృత్వం మూలంగా బాధితులను అధికారిక హాస్య వస్తువులుగా రూపాంతరం చెందించారు. ఈ విధంగా సమాజమే రోగగ్రస్తమైంది కనుక హాస్యం కూడా రోగగ్రస్తమైంది అంటారు సుబ్రా గుప్త.

భారతీయ హాస్యం - ఆంక్షలు : ప్రఖ్యాత హాస్యరచయిత కుష్వంత్ సింగ్ "మనకు గతంలో బీర్బల్, తెనాలి రామకృష్ణుడు, గోపాల్ భార్, నసీరుద్దీన్లు, ఈనాడు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన శంకర్, ఆర్.కె.లక్ష్మణ్ మొదలైన కార్టూనిస్టు ఉన్నప్పటికీ, మనం హాస్యం లేని జాతిగానే ఎందుకు పరిగణింపబడుతున్నాం? అని ప్రశ్నించారు. మనలో వ్యంగ్యం, వక్రోక్తి ఉంది కాని హాస్య చతురత లేదు. ఈ జాతి తనను చూసి తాను నవ్వుకోలేదు. మన ప్రాచీన సాహిత్యం జనసామాన్యానికి సంబంధించిన సాహిత్యం కాక, అది రాజుల ఆస్థానాలకే పరిమితమవడం ఇందుకు ఒక కారణం. మన హాస్యోక్తులు ప్రధానంగా జాతి సంబంధమైనవి. అవి ప్రధానంగా మార్వాడీలను, సర్దార్జీలను ఆటపట్టిస్తుంటాయి. ఇతరులపై క్రూరమైన హాస్యోక్తులు విసరడంలో మనం ఆరితేరామేకాని, మనల్ని చూసి మనం నవ్వుకునే స్థితికి ఎందుకు ఎదగలేకపోతున్నామో ఆలోచించాలి. అయినా హాస్యపుస్తకాలకు మార్కెట్లో మంచి గిరాకీ ఉండటం గమనార్హం" అంటారు కుష్వంత్ సింగ్.

హాస్యం పై మనకు అనేక నిషేధాలు ఉన్నాయి. అవి పవిత్రమైన గోవులవంటివి. వాటిని పట్టుకుంటే దారుణంగా కుమ్ముతాయి. జాతీయ నాయకుల పై హాస్యోక్తులు విసరడం కుదరదని చెబుతూ, బెంగాల్ లో సుభాష్ చంద్రబోస్, రవీంద్రనాథ్ టాగూర్, సత్యజిత్ రేలును ముట్టుకుంటే బెంగాలీలు కుమ్ముతారు. అలానే సిక్కులు శివాజీ, రాణాప్రతాప్ లను చూసి నవ్వకూడదు. "సర్దార్జీల పై ఎన్నో జోకులు చెబుతానుకాని, చాలా వాటిని ముద్రించను. అలా చేస్తే నా పై దేశద్రోహి ముద్ర వేస్తారు" అని వాపోయారు ఆయన.

అయ్యో హాస్య పత్రికలు! : మృదువైన వ్యంగ్యానికి ప్రపంచవ్యాప్తంగా గౌరవనీయ మైన రూపం అందించింది బ్రిటీష్ హాస్య వ్యంగ్య పత్రిక 'పంచ్' (Punch). ఆ పత్రిక హాస్యంలో కోపతాపాలకు, ఆవేశకావేశాలకు చోటుండదు. వ్యతిరేకతను (అసహ్యతను)

---

సానుభూ తిగా మార్చడంతో బాటు గేలి చేయబడేవాడు కూడా తనను చూసి తాను నవ్వుకునేటట్లు చేయడంలోనే దాని ప్రత్యేకత కన్పిస్తుంది అంటారు మనోజ్ దాస్. సంక్షోభ సమయంలో కూడా హాస్యాన్ని ఆనందించడంలో ఆంగ్లేయులు అగ్రగణ్యులు అని చాటిచెప్పిన పత్రిక అది. దాని నిర్వాహకులలో ఒకరైన రిచర్డ్ డొలే (1824 - 1883) వ్యంగ్య చిత్రాన్ని ఆటవిక స్వరూపం నుండి తెలివైన కళారూపంగా తీర్చిదిద్దగా. ఆయన తరువాత వచ్చిన సర్ జాన్ టెన్నియల్(1820-1914)దానిని సున్నితమైన మానవత్యోరూపంగామ మలచారు. ఈ విధంగా 'పంచ్' హాస్య గ్రంథాలయం 25 సంపుటాలతో వెలుగు చూసింది. ఈనాడు శ్రోతలకు అందమైన హాస్యం రుచి తెలియకుండాపోయింది. ఫలితంగా 'పంచ్' పరమపదించింది అంటారు విమర్శకులు.

మనకు కూడా హాస్యానికి, వ్యంగ్యానికి, వ్యంగ్య చిత్రాల(కార్టూన్) కు ప్రసిద్ధి చెందిన 'శంకర్స్ వీక్లీ', 'దివానా', 'ఇల్లస్టేటెడ్ వీక్లీ' పత్రికలు వచ్చాయి కాని. దురదృష్టవశాత్తు ఆ మూడు పత్రికలు క్రమంగా కాలగర్భంలో కలసిపోయాయి. ప్రస్తుతం పంజాబ్ లో 'మౌజి', తమిళనాడులో 'తుగ్లక్ వంటి వ్యంగ్య హాస్య పత్రికలు దేశంలో ఉన్నాయి. తెలుగులో 'హాసం' (పక్ష పత్రిక) అతి తక్కువ కాలంలో అందరిని ఆకట్టుకుంటూ చక్కని ప్రమాణాలు నెలకొల్పింది. అలాంటి గొప్ప పత్రిక ప్రచురణ ఆగిపోవడం తెలుగువారి దురదృష్టం.

హాస్యంపై అధిక్షేపణ : 20వ శతాబ్దం వాఙ్మయంలోను, తత్వశాస్త్రంలోను హాస్యం పైన ఎదురుదాడి, అధిక్షేపణ అధికం కావడం ఆశ్చర్యంగా కన్పిస్తుంది. నవ్వు అసౌకర్యాన్ని కలిగిస్తుందని, అది మంచిది కాదని హాస్య ధోరణిలో రాగాలాపనతో హాస్య రచయితలే దానిని కించపరిస్తే, ఇంక దానికి రక్షణ ఏది? “నవ్వే మనుషులు ఎంత అసహ్యకరంగా, ఎబ్బెట్టుగా కన్పిస్తారో చూశావా? జీవితంలో అర్థం లేనిది నవ్వు” అని పాల్ బెల్లో అంటే, “నవ్వు నాటికలో కామెడీ మన శత్రువు. అది మనల్ని గందరగోళం చేస్తుంది; కలుషితం చేస్తుంది” అని, “నవ్వు నియంతల మిత్రుడు కనుక కామెడీని రూపుమాపాలి” అని, “దయ్యం ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తుంది” అని సూత్రీకరించారు పీటర్ బార్నెస్. ఈ విధంగా ఏ కోణం నుండి చూసినా హాస్యం నిస్సారమైనది, నిరుపయోగమైనది అని సిద్ధాంతీకరించారు ఈ హాస్యకారులు.

1676లోనే రాబర్ట్ బార్ క్లే అనే తత్వవేత్త నవ్వడం, ఆటలాడటం, తులనాడటం, వ్యర్థ ప్రసంగాలు చేయడం మొదలైన విషయాలలో క్రైస్తవమతం స్వేచ్ఛ ఇవ్వలేదన్నారు. నవ్వు నిరపాయమైనది కాదన్నారు. జర్మన్ తాత్వికుడైన జార్జి ఫ్రెడరిక్ (1794) “ముఖ్య

---

నమ్మకు నవ్వలేని వాడిని, పువ్వులు చిదిమే వాడిని. – ఆధునిక కవి తిలక్

విషయాలను గంభీరంగా మాట్లాడుకోవాలి. అక్కడ నవ్వడం నేరం, అసభ్యకరం" అన్నారు. రిచర్డ్ హర్డ్ (1811) "నవ్వు సత్యాన్ని మరుగుపరుస్తుంది. హృదయాన్ని పాషాణంగా మారుస్తుంది. బుద్ధిమాంద్యాన్ని కలిగిస్తుంది" అని చెప్పగా, ప్రముఖ విద్యావేత్త జార్జి వాసే (1877) "అలవాటుగా నవ్వేవారు మూర్ఖులు. వివేకి, విజ్ఞాని తరచుగా నవ్వుతారు. ఉన్నతులు ఎప్పుడూ నవ్వరు" అని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. "భౌతిక అవసరాలను, జీవితం పై మమకారాన్ని పెంచే హాస్యం పనికిమాలింది" అన్నారు జెర్మీకోలియర్. పి.జి. ఉడ్ హౌస్ హాస్య రచయితల పై ఎన్నో చమత్కారాలు విసిరారు. 50 అంగుళాల ఎత్తు ఉండేవారంతా హాస్యకారులేనని చతుర్లాడారు. హాస్య రచయితలను చిలిపి గాడిదలుగా, తమాషా అయిన పందులుగా దుయ్యబట్టారు. హాస్యకారుడు ప్రమాదకారి కనుక అతనిని దూరంగా తోసేయాలి అని డా|| జాన్సన్ వంటి గొప్ప రచయిత అనడం బాధాకరం కదూ!

ప్రమాదకర నవ్వులు : మనోవిజ్ఞాన విభాగంలో పేరుగాంచిన హెర్బర్ట్ ఎం.లెఫ్ కార్ట్ నవ్వులలో కొన్ని అనారోగ్యకర నవ్వులు ఉన్నాయని, హాస్యోక్తిని క్రూరంగా, జబర్దస్తీగా ఆధిక్యాన్ని చాటుకోడానికి, అగౌరవపరచడానికి కూడా ఉపయోగించవచ్చు అని అంటారు!' భారతదేశంలో కూడా ఇలాంటి సంఘటనలు కన్పిస్తాయి. మయసభలో అద్భుత కళాకౌశలాన్ని చూసి ఆశ్చర్యపోతున్న, ఆందోళన చెందుతున్న దుర్యోధనుణ్ణి చూసి ద్రౌపది నవ్విన నవ్వు ఆ రారాజు మనస్సును తీవ్రంగా గాయపరచి అది మహాభారత యుద్ధానికి ఒక కారణం అయిందని అందరకూ తెలిసిందే. శ్రీరామ చంద్రుని పట్టాభిషేక సమయంలో లక్ష్మణుడు నవ్విన నవ్వు రాముడు, కైకేయి, వాలి - ఇలా ఎందరినో ఆలోచింపజేసింది. వినాయకచవితి రోజున వినాయకుణ్ణి చూసి నవ్వినందుకే గదా చంద్రుడు శాపానికి గురయ్యాడు! అందుకే "నవ్వు నాలుగు విధాల చేటు" అన్న సూక్తి వ్యాప్తిలోకి వచ్చింది.

తెలుగులో కూడా హాస్యాన్ని గురించిన నిశిత విమర్శలూ లేకపోలేదు. అతనిది విషపు నవ్వు అని, నోటితో నవ్వుతూ నొసటితో వెక్కిరిస్తాడని, కుటిల నవ్వు అని నవ్వులోని ప్రమాదాన్ని గురించిన ఎన్నో ప్రయోగాలు మనం వింటుంటాము. అంతే కాదు. నవ్వు సృష్టించే ప్రమాదాలను గురించి రచయితలు ఏమన్నారో చూడండి.

తనలో అంతర్గతంగా దాగివున్న పిశాచాలను శుద్ధి చేయటానికి సమాజం ఉపయోగించే భేది నవ్వు. (క్లిట్జన్ జోలి)

వెకిలి (కొంటె) నవ్వును మించిన వెకిలి పని మరొకటి లేదు. -కాటుల్లస్

---

చక్కని హాస్యభావన జీవశక్తికి మూలం: సర్వశ్రేష్ఠతు మార్గం. – హార్వే మైండెస్

ఇటీవల కాలంలో హాస్యం పేరుతో అపహాస్యం ప్రబలంగా వ్యాప్తి చెందడంతో. దాంతో హాస్యకారులంటే క్రమంగా సమాజంలో గౌరవం తగ్గిపోతూంది. బెన్నీ, ఏస్, ఎలెన్, పార్‌లాంటి గొప్ప హాస్యకారులు ఈనాడు కరువవడానికి కారణం ఏమిటి? ఆనాటిది మేధావి సమాజం కావడం ఒక కారణం కాగా, ఆనాడు పాత్రధారులు చక్కగా అధ్యయనం చేసి తమ పాత్రపోషణ చేయగా, ఈనాడు జనసామాన్యాన్ని ఏదోలా నవ్వించడమే హాస్యం అయ్యింది. ఆనాడు నటులు హాస్యంలో జీవించగా, నేటి నటులకు హాస్యంతో జీవించడం సామాన్యమైంది.

అందుకే, అత్తగార్లను, జాతులను, శృంగారాన్ని అధిగమించి హాస్యం సానుకూలధోరణిలో సాగాలని, ఆ లక్ష్యంతో ఇటీవలనే ముంబైలో నెలకొల్పబడిన నవ్వులషాపు (Comedy Store) పనిచేస్తుందని అంటాడు దాని నిర్మాత, నవ్వుల నావికుడు డానోవార్డ్. బ్రిటన్లో మూడు దశాబ్దాల క్రితం ఉన్నట్లుగా ఈనాడు భారతదేశంలో హాస్యం చిన్న పిల్లల స్థాయిలో ఉందని, దానిని ఉదాత్త స్థాయికి తీసుకురావడానికే ఈ ప్రయత్నం అంతా అంటారు ఆయన! అందుకే నవ్వులండోయ్ నవ్వులు అంటూ ఎలా ఆనందించాలో తరువాయి అధ్యాయంలో చూద్దాం.

---

అవివేకమైన హాస్యోక్తి కన్నా హాస్యోక్తి గల అవివేకం మిన్న. – షేక్ స్పియర్

అధ్యాయం 21

# నవ్వులండోయ్ నవ్వులు: పలురకాల నవ్వులు

నవ్వుల లోకం! నవ్వుల రకాలు : "నవ్వులు 7 రకాలు" అంటారు గైల్స్ & ఆక్స్ఫర్డ్ ఇప్పుడు వాటిని గురించి తెలుసుకుందాం. .

1. హాస్యపూరిత నవ్వు (Humorous Laughter) : హాస్యోక్తి ద్వారా లేదా ఒకానొక విచిత్ర సంఘటన ఫలితంగా కలిగిన ఆనందాన్ని వ్యక్తపరిచే నవ్వు ఇది. నలుగురితో కలసి పంచుకోవడం వలన దాని స్పందన అధికంగా ఉంటుంది. అది ఉద్దేశ్యపూర్వకంగా జరిగిందా లేదా అన్న అంశాలతో బాటు ఇతర సామాజిక కారణాలు కూడా హాస్యోక్తి స్పందనలో కొన్ని మార్పులు తెస్తాయి.

రెండు మేకలు చెరువు గట్టున గడ్డి మేస్తున్నాయి. ఇంతలో "బా" అంటూ ఒకటి అరిచింది. "మే" అంటూ రెండవది అరుస్తూ "మేకలు "మే" అంటాయేకాని, "బా" అనవు" అని మిత్రునికి ఏదో నేర్పబోయింది. అందుకు మిత్రుడు "నాకూ తెలుసు లేవోయ్! అయితే, నీకు తెలియంది ఒకటుంది" అంది రెండవ మేక.

మొదటి మేక : ఏమిటది?

రెండవ మేక : నేను విదేశీ భాష నేరుస్తున్నా......!

2. సామాజిక నవ్వు (Social Laughter) : ఎలాంటి ప్రత్యేక హాస్యస్పందన లేకుండానే సామాజిక గుర్తింపు పొందాలన్న తపనతో ఇది జనిస్తుంది. ఒకానొక సామాజిక వర్గంతో వ్యక్తిని విలీనంచేసే నవ్వు ఇది. వర్గ ఐక్యతను చాటడం, దైనందిన పరిచయం పెంచుకోవడం దీని లక్ష్యం.

అదొక పెద్ద ఆఫీసు. అందులో ఇంజనీర్లు, వైద్యులు, మరెందరో పనిచేస్తున్నారు. కొందరు ఉద్యోగుల పదవీ విరమణ సందర్భంగా ఏర్పాటుచేసిన ఆ సభలో సభాధ్యక్షుడు పదవీ విరమణ గావిస్తున్నవారి సేవలను అభినందించి చివరగా ఒక హాస్యోక్తిని చెప్పాడు.

రైల్లో ఓ డాక్టర్, ఇంజనీర్, రాజకీయ నాయకుడు ప్రయాణం చేస్తూ కబుర్లలో పడ్డారు. మాటల మధ్యలో "ఎవరి వృత్తి అత్యంత ప్రాచీనమైనది?" అన్న అంశం పై చర్చ జరుగుతుండగా, మాదంటే మాదని ముగ్గురూ వాదనకి దిగారు. "ఆడమ్ తన తుంటి ఎముకనుండి ఈ ఎను సృష్టించాడట. అంటే సర్జరీ చేశాడన్నమాట. చూశారా.... వైద్య వృత్తి ఎంత ప్రాచీనమైనదో!" అంటూ వాదించాడు డాక్టర్. దానికి ఇంజనీర్ అడ్డు తగులుతూ

---

నవ్వు అనేది తక్షణ సెలవు వంటిది. – మిల్టన్ బెర్లే.

“అదేం మాట! అసలు ఆడమ్, ఈవ్‌లు రాకముందు లోకమంతా అంధకార బంధురంగా, గందరగోళంగా ఉండేది. దానినంతా చక్కబరచి ఒక దారిలోకి తెచ్చిన తర్వాతే ఆ కథలన్నీ వచ్చాయి. ఇంజనీరింగ్ నైపుణ్యం కాకపోతే ఇదంతా మరేమిటి?” అన్నాడు. రాజకీయ నాయకుడు ముసిముసిగా నవ్వుకుంటూ “అసలా అంధకారాన్ని, గందరగోళాన్ని సృష్టించిందెవరనుకుంటున్నారు? ఆ ఘనత మాదే. అందుకే మా వృత్తినే అత్యంత ప్రాచీనమైనదని చెప్పాలి” అన్నాడు ఢంకా వాయిస్తున్నట్లు.....

3. అజ్ఞానపు నవ్వు (ignorance Laughter) : తన పైన ఒక హాస్యోక్తిని పేల్చారని గ్రహించి నప్పటికీ, దానిని గ్రహించనట్లు, వినిపించుకోనట్లు, అది అవగాహన కానట్లు నటించ డానికి ఉపయోగపడే నవ్వు ఇది. సామాజిక నవ్వులాగానే ఇది కూడా ఒక వర్గం ఆమోదం పొందడానికి ఉద్దేశింపబడింది.

ఇంటర్వ్యూకు హాజరైన ఇద్దరు అభ్యర్థులతో : “మీ ఇద్దరకు వ్రాత పరీక్షలో సమానంగా మార్కులు వచ్చినప్పటికీ రామారావునే ఎంపిక చేశాము” అన్నాడు బోర్డు చైర్మన్. “అదెలా న్యాయం?” అడిగాడు రెండవ అభ్యర్థి వినోద్. “చివరి ప్రశ్నకు ఇద్దరూ తప్పు సమాధానాలే ఇచ్చారు కాని, అందులో ఒకదాని ఆధారంగా మేము నిర్ణయం తీసుకున్నాము” అన్నాడు చైర్మన్. “ఏమిటా సమాధానం?" ఆశ్చర్యంగా అడిగాడు వినోద్. పదకొండవ ప్రశ్నకు “నాకు సమాధానం తెలియదు” అని రామారావు వ్రాస్తే, నువ్వు “నాకు కూడా తెలియదు” అని వ్రాశావు. ఇప్పుడు అర్థమయిందనుకుంటాను. మేము రామారావును ఎందుకు ఎంపికచేశామో!” అని చైర్మన్ చెప్పడంతో వినోద్ ఏమీ అర్థం కానట్లుగా నవ్వాడు!

4. వ్యాకులత నవ్వు (Anxiety Laughter): తీవ్ర ఒత్తిడి, ఆందోళన ముగిసినప్పుడు ఉపశమనంగా జనించే నవ్వు ఇది. ఇదొక అరుదైన నవ్వు. ఒకవ్యక్తి తనలో తాను, తనకు తానుగా నవ్వుకునే నవ్వు ఇది. అంటే ఒకానొక మానసిక పరిస్థితికి స్పందనగా వ్యాకులతతో కూడిన నవ్వు అన్నమాట!

5. ఎగతాళి నవ్వు (Derision Laughter): ఇతరులను హేళన చేయడానికి, ఎగతాళి పట్టించడానికి ఉద్దేశింపబడిన నవ్వు ఇది. చిన్నారులు తమ తోటివారిలోని శారీరక లోపాల గురించి, పిరికితనం, పిచ్చితనంతో కూడిన వారి చర్యలను గురించి గేలి చేయడానికి ఇది ఉద్దేశింపబడింది. స్వీయలోపాలను కప్పిపుచ్చుకోడానికి, పరోక్షంగా, నర్మగర్భంగా, కొన్ని సందర్భాలలో అవమానకరమైన రీతిలో ఎత్తిపొడుపులా దీనిని ఉపయోగిస్తారు.

---

మనిషి ఆలోచిస్తాడు. దేవుడు నవ్వుతాడు. – యూదుల సామెత.

6. వేడుకోలు నవ్వు (Apologetic Laughter): గతంలో చేసిన పొరపాట్లను, క్రియారాహిత్యాన్ని అనుభవ రాహిత్యం , అజ్ఞానం మూలంగా జరిగిందని చెప్పడానికి, భవిష్యత్తులో పొరపాట్లకు ముందుగానే పశ్చాత్తాపం వెలిబుచ్చడానికి ఉద్దేశించబడింది ఈ నవ్వు.

'శ్యామల' పేరుగల చీటీని భార్త జేబులో చూసిన ఉష కోపంగా దానిని భర్తకు అందించింది. భార్య కోపానికి కారణాన్ని ఇట్టే గ్రహించిన గోపాల్ "హాయ్! ఉష. అది మొన్న గుఱ్ఱం పందాల ఆటలో నేను బెట్ కాసిన గుఱ్ఱం పేరు. అన్నట్లు అది ఎంత ముద్దుగా ఉంటుందో!" అంటూ నవ్వాడు. నాలుగు రోజుల తర్వాత శ్యామల నుండి వచ్చిన ఫోన్ ను భర్తకు ఇస్తుంటే "ఎవరినుండి" అడిగాడు గోపాల్. అదే సమయంలో గోపాల్ తండ్రి ఇంట్లోకి ప్రవేశించడంతో ఉష పెద్దగా నవ్వుతూ "మీ పందెపు గుఱ్ఱం నుండి. మురిపెంగా, ముద్దుగా ఉండే ఆ శ్యామల గుఱ్ఱం" అని చెవిలో అంటుంటే "నన్ను కాపాడు ఉషా" అన్నట్లుగా వేడుకుంటూ నవ్వాడు గోపాల్.

7. చక్కిలిగింత నవ్వు (Tickling Laughter) : హాస్యోక్తితో పనిలేకుండా చంకలో, మెడమీద, తొడలు మొదలైన కొన్ని సున్నిత ప్రదేశాల్లో చక్కిలిగింతలు పెట్టడం మూలంగా - అంటే బాహ్య చర్యల ఫలితంగా జనించే నవ్వు ఇది. కొన్ని చక్కని హాస్యోక్తులు కూడా నిజంగా చక్కిలిగింత పెట్టినట్లుగా నవ్వు తెప్పిస్తాయి. భరాగోగారి ఈ హాస్యోక్తి చదవండి'. వెనుకటికి 'ఒకాయన' ఈ ప్రపంచంలోని స్త్రీలందరిలోనూ మా ఆవిడే సుప్రీం అందగత్తె!" అన్నాడట. ఇది విన్న పక్కవాడు మొహం అటుతిప్పి నవ్వు కొని "ఆహా, అలాగా" అన్నాడట! "నువ్వేదో వేళాకోళంగా తీసుకుంటున్నట్లుంది. ఇది నా ఒక్కడి అభిప్రాయం మాత్రమే అనుకుంటున్నావేమో. మా ఆవిడ అభిప్రాయం కూడా అదే! తెలుసా?"

'నవ్వు' వ్యాసరచయిత భమిడిపాటి కామేశ్వరరావు (భకారా) ప్రకారం నవ్వులు పలురకాలు. వాటిలో చిరునవ్వు (దీనికి ఆయన నవ్విక అని పేరు పెట్టారు), సకిలింపు నవ్వు, ఇకిలింపు నవ్వు, ముసిముసి నవ్వు, మూగ నవ్వు, గుడ్డి నవ్వు, పకపక నవ్వు, వెకవెక నవ్వు, అట్టహాసం నవ్వు మొదలైనవి ఉన్నాయి. నవ్వుల పై పరిశోధకులు ఆయా నవ్వులకు ప్రత్యేక నామకరణాలు చేశారు. - తలకాయ నవ్వు - తల గట్టిగా ఊపుతూ, వంచి కళ్ళుమూసుకొని నవ్వడం.

లయధాటి నవ్వు - తాళం వేయడానికి వీలుకల్పించే నవ్వు ఇది.

సోడా నవ్వు - పెదవులను చించుకొని హఠాత్తుగా బయలుదేరే నవ్వు.

---

నేలబారు నవ్వుకన్నా నేలబారు విషయం మరేదీ లేదు. – కాటుల్లస్

కొన ఊపిరి నవ్వు - మాట్లాడి, మాట్లాడి దాదాపు శోషపోయిన సమయంలో అటు మాటకాని, ఇటు నవ్వు కాని రాకుండా నవ్వడం.
కోతి నవ్వు - అది నవ్వేనా అని ఇతరులు భ్రమించే, భయపడే నవ్వు.
దాగుడుమిచ్చి నవ్వు - అధికారి చూడకుండా ముఖాన్ని దాచి పెట్టుకుంటూ నవ్వే నవ్వు.
డోకు నవ్వు - డోకు పుట్టించే నవ్వు. దగ్గు నవ్వు - నవ్వులకన్నా దగ్గులే అధికశాతం ఆక్రమించే నవ్వు.
కొలిమి తిత్తి నవ్వు - మొదట వేగంగా నవ్వుతూ, క్రమక్రమంగా నెమ్మదించే నవ్వు కొలిమి తిత్తిలా అన్పించే నవ్వు.
గూడ్సుబండి నవ్వు - మోత ఎక్కువ, వేగం తక్కువగల నవ్వు.
విషపు నవ్వు - దుర్మార్గాన్ని, ప్రతీకారాన్ని దాచుకుంటూ పైకి చాలా అమాయకంగా, నంగనాచిలా నవ్వే నవ్వు. విషం చిందినట్లు కన్పించే నవ్వు.

తెలుగు భాషకే కీర్తికిరీటాలుగా పేరుగాంచిన 'సాక్షి' వ్యాసాలలో రచయిత పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు ఆరు రకాల నవ్వులను పేర్కొన్నారు: 1. మొలక నవ్వు 2. మొద్దు నవ్వు 3. కిచకిచ నవ్వు 4. కిలకిల నవ్వు 5. వికిలింపు నవ్వు 6. సకిలింపు నవ్వు . విశ్వనాధుని 'సాహిత్య దర్పణం'లో ఆరు రకాల నవ్వులు కన్పిస్తాయి.

1. స్మితము : కొద్దిగా వికసించిన నేత్రాలు, పెదవుల కలయికతో కూడినది స్మితము. ఇది నవ్వీ నవ్వనట్లుగా, ముసిముసి నవ్వులుగా నవ్వే లేత నవ్వు. కనిపించీ కనిపించనట్లు ఉండే స్నిగ్ధదరహాసం.

2. హసితము : ఇక్కడ పెదవుల కదలికతో బాటు కొద్దిగా పళ్ళు (దంతాలు) కన్పిస్తాయి. కాని ఎలాంటి శబ్దము వినిపించదు.

3. విహసితము : పళ్ళు కనబడటమేగాక, ఇక్కడ మధురమైన స్వరం కూడా విన్పిస్తుంది. ఇది మృదు ధ్వనిగల నవ్వు.

4. అపహసితము : తల కదిలిస్తూ నవ్వడాన్ని అపహసితము అంటారు. ఇది వెకిలి నవ్వు, వికృతపు నవ్వు.

5. ఉపహసితము : కళ్ళు పెద్దవి చేసి నోరు తెరచి హృదయపూర్వకంగా పకపకా నవ్వడాన్ని ఉపహసితము అంటారు. ఇది ఎగతాళితో కూడిన నవ్వు. 6.అతిహసితము : అతి ఉత్సాహానికి, ఆనందానికి ఇది ప్రతీక. మనిషంతా ఊగిపోతూ కళ్ళల్లోంచి నీళ్ళొచ్చేదాకా పడీపడీ నవ్వడాన్ని అతిహసితము అంటారు.

---

సానుభూతికి విరుగుడుగా నవ్వు జనించింది. – విలియం మాగ్డొగాల్

ఇంక అత్యాధునిక నవ్వుల్లోకి వద్దాం.. పెద్దవారి దగ్గర పనిచేయించుకోడానికి చిన్నవారు నవ్వే పెదాలకు అంటని నవ్వులివి. నోరు ఈ చివరినుండి ఆ చివరిదాకా సాగదీసే ఈ నవ్వులకు ప్లాస్టిక్ స్మైల్, ఎలాస్టిక్ లాఫింగ్ అని అధునాతన పేర్లు పెట్టారు. ముఖ్యమంత్రి పేషీలోని అధికారుల వద్ద శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు ఈ నవ్వులు చిందిస్తూ ఎంచక్కా పనులు చేయించుకుంటారని ఓ పత్రిక కథనం.

ఇప్పుడు వక్రోక్తి, సందర్భోచిత హాస్యం, శ్లేష, పదనిసలు, సరసోక్తి, మహిళా హాస్యం, లైంగిక హాస్యం, అస్పష్ట హాస్యం, అతిశయోక్తి.. ఇంకా మరెన్నింటినో మనం ఉపయోగించే హాస్యాం విధానాలని గురించి ఆనందిస్తూ చదవండి.

## 1. వక్రోక్తి (Irony)

“తెలుగువాడు దుర్యోధనుడిలాంటివాడు. దుర్యోధనుడు తనకేమీ కావాలని అడగడు. ధర్మరాజుకు మాత్రం ఏమీ ఉండకూడదని కోరుకుంటాడు” అన్నారు భమిడిపాటి కామేశ్వరరావు. అధిక్షేపంలో కూడా ఆయనది అందెవేసిన చేయి.

ప్రేక్షకులకు ఒక అర్థంలోను, ఆ మాటలు ఉద్దేశింపబడినవారికి మరొక అర్థంలోను పదాలను సంధించే పద్ధతిని వక్రోక్తి అంటారు. ఇది వ్యంగ్యమైన హేళన. కొన్ని వ్యంగ్యోక్తులలో పరమ రమణీయమైన హాస్యం చోటు చేసుకుంటుంది. శ్లేషవల్లగాని, కాకువువల్లగాని అన్యార్థకల్పనం జరిగితే అది వక్రోక్తి అలంకారమవుతుంది. సాభిప్రాయంగా ఒక అక్షరాన్ని నొక్కి పలుకటంగాని, తేల్చి పలుకటంగాని, ప్రస్వీకరించటంగాని, దీర్ఘీకరించటంగాని జరుగుతుంది. ఇలా సాభిప్రాయంగా సాగించిన శబ్దవికారాన్ని 'కాకువు' అంటారు.

“రామారావు చాలా గొప్ప రచయిత (చాలా గొప్ప అనే పదాలను నొక్కి పలుకుతూ). అయితే, ఆయన గొప్పతనం తెలియని సంపాదకుడు రామారావుగారి రచనలను వెనక్కు తిప్పి పంపుతూనే ఉంటాడు” అంటాడు సుబ్బారావు సానుభూతి నటిస్తూ,

అదొక అభినందనగాను, సాదాసీదా ప్రకటనగాను చెప్పబడినప్పటికీ, దానిలో అంతర్లీనంగా కసి,  కోపం లేదా కాటు ఇమిడి ఉంటుంది. కొన్ని సందర్భాలలో అదొక దాడిలా కన్పిస్తుంది. అందుకే ఓడిపోయిన జాతులు హాస్యప్రియులకు ఆలవాలంగ మారి నిలుస్తాయంటాడు నోబెల్, పులిట్జర్ అవార్డుల గ్రహీత ఆచార్య సాల్ లో. దీనిని ఆంగ్లంలో Irony అంటారు. వక్రోక్తిని 41 రకాలుగా పలుకవచ్చంటారు కొందరు పరిశోధకులు. దానిని కొందరు నేరుగా చెప్పగా, మరికొందరు విభిన్న పద్ధతులలో ప్రయోగిస్తారు. ఏదో ఒక

---

మన మిత్రుల దురదృష్టాన్ని చూచి మనం నవ్వుకుంటాం. – ప్లేటో

విషయాన్ని చెబుతూ, దానికి వక్రోక్తిని జోడించడంతో శ్రోతకు దాని అసలు అర్థం తెలుస్తుంది. అదొక అలంకారం "వక్రోక్తిని కొలవడం ఎవ్వరికీ సాధ్యం కాదు. జీవితం సరళరేఖ కాదు. చాలా సమయాలలో మనం అనుకున్నది ఒకటి అయితే, జరిగేది మరొకటి అవుతుంది. దీనినే వక్రోక్తి అంటారు.

గొప్ప నాట్యకత్తె అయిన ఇసడోరా డంకన్ ప్రముఖ నవలాకారుడు బెర్నార్డ్ షా వద్దకు వెళ్ళి "మనిద్దరం వివాహం చేసుకుందాం. నా అందం, మీ తెలివితేటలుగల పాప నాకు కావాలి" అంది. అందుకు షా నవ్వుతూ "మీ మాటలు నాకు ఎంతో ఆనందం కలిగించాయి. ఒకవేళ నా అందం, మీ తెలివితేటలుగల బిడ్డ జన్మిస్తే!?" అనడంతో ఆమె విస్తుపోయింది.

ప్రపంచం వక్రోక్తులద్వారా మనకు జీవితాన్ని అందిస్తుంది. ఆ జీవితాన్ని ఎలా ఆస్వాదించాలి, ఎలా స్వీకరించాలి అన్నది మన దృక్పథం పై ఆధారపడుతుంది.

'ఓ హెన్రీ' ప్రముఖ కథారచయి త. ఆయన వ్రాసిన 'The Gift of The Magi' వక్రోక్తికి ఉత్తమ ఉదాహరణ. ఓ కథలోని కథానాయకుడు అందమైన తన భార్య కురులను దువ్వుకోడానికి రెండు అలంకార ప్రాయమైన దువ్వెనలు అప్పు చేసి కొంటాడు. అదే సమయంలో ఆమె అందమైన తన కేశాలను అమ్మి భర్త గడియారానికి మంచి గొలుసు తెస్తుంది! ఇక్కడ బాధ, ఆనందం సమ్మిళితమవుతాయి. పరిమిత ఆదాయాలుగల కుటుంబీకులు తమ కోర్కెలను తీర్చుకోడానికి చేసే త్యాగాలలోని హాస్యాన్ని చూడగలిగితే, అదో హాస్యభరితమైన వక్రోక్తి అవుతుంది. దానినే మరొక కోణం నుండి చూస్తే అదొక బాధాకరమైన సంఘటన అవుతుంది.

అల్లుడు గొప్పవాడు. కనుక అతనికి ఏ బరువైన పనీ చెప్పకూడదు. అయితే, మూడు పనులు మాత్రం చెప్పవచ్చు - ఇల్లు అలకడం, పిడకలు చెయ్యడం, ఎంగిళ్ళు ఎత్తడం.

ఘంటసాల వెంకటేశ్వరరావు కంఠం అంత బాగాలేదన్న కారణంగా రికార్డు కంపెనీ వారు అతనిని ఎంపిక చేయకపోవడం ఒక వక్రోక్తి కదూ!

కాశ్మీరు నుంచి కన్యాకుమారికి వెళ్ళే రైలులో ప్రయాణిస్తున్న శోభన్ జోక్ తర్వాత జోక్ వేస్తుంటే పది **మందీ** అతనిచుట్టూ చేరారు. సర్దార్జీల పై ఒక జోక్ పేల్చాలనుకునే సమయంలో ఏకంగా నలుగురు సర్దార్జీలు అక్కడకు రావడంతో సర్దార్జీ హీరోగా ఉండాల్సినచోట బెంగాలీ బాబు వినోద్‌ను పెట్టి ఆయన ఈ జోక్ చెప్పసాగాడు. "వినోద్ బాబు ఢిల్లీ వెళ్ళి, అక్కడ చాందినీ చౌక్ లో పెద్ద టవర్ పై ఉన్న గడియారాన్ని అలా చూస్తుండే

ఒకతను "అది కావాలా?" అనడంతో "కావాలి" అన్నాడు వినోద్. "అయితే వెయ్యి రూపాయలు ఇస్తే ఈ వీధి చివర్లో ఉన్న షాపు నుండి నిచ్చెన తెచ్చి ఆ గడియారాన్ని దించి నీకిస్తా" అన్నాడు ఆ వ్యాపారి. వెంటనే అతను వెయ్యి రూపాయలు ఇవ్వడం, నిచ్చెన కొరకు అతడు పరుగు లంకించుకోవడం క్షణాలలో జరిగిపోయింది. అలా వెళ్ళినవాడు ఎంత సేపటికీ తిరిగి రాలేదు! దాంతో బాగా కోపం వచ్చిన వినోద్ ఎలాగైనాసరే ఆ మోసగాణ్ణి పట్టుకోవాలనుకొని మరుసటిరోజు అదే ప్రదేశానికి వచ్చి ఆగడియారం వైపే చూస్తూ అలానే నిలబడ్డాడు. కొంత సేపటికి అదే మోసగాడు వచ్చి "అది కావాలా?" అన్నాడు. "అవును" అని వినోద్ అనడంతోనే వెయ్యి రూపాయలు ఇమ్మన్నాడు. వినోద్ నవ్వుతూ "నీకు వెయ్యి రూపాయలు ఇస్తా. అయితే, రెండవ పర్యాయం కూడా మోసపోవడానికి నేనేం అమాయకుణ్ణి కాదు. అందుకని నువ్వు ఇక్కడే నిలబడు. నేనే ఆ షాపుకు వెళ్ళి నిచ్చెన తెస్తా" అంటూ డబ్బు ఇచ్చి నిచ్చెన కోసం వెళ్ళా"ని ముగించాడు. ఆ హాస్యోక్తి విన్న సర్దార్జీలు రెచ్చిపోయి "సర్దార్జీలు ఇంకా బ్రతికే ఉన్నారని మరచిపోయావా? అది సర్దార్జీల జోక్ అని కూడా తెలియదనుకుంటున్నావా?" అంటూ శోభన్‌ను చితకబాదారు! ఎంత గొప్ప వక్రోక్తి ఇది!

ఇంక చమత్కారోక్తి గురించి తెలుసుకుందాం.

## 2. చమత్కారోక్తి (Repartee)

అది బ్రిటీష్ పార్లమెంట్ సమావేశం. ప్రతిపక్ష సభ్యుల ఘాటైన ప్రశ్నలకు చర్చిల్ ధీటుగా సమాధానాలు చెబుతుండగా, ఒక సభ్యుడు లేచి నవ్వుతూ "ప్రధాని గారూ! మీ ప్యాంట్ గుండీ ఊడిందండి" అనడంతో సభ గొల్లుమంది. చర్చిల్ నవ్వుతూ "నీ పరిశీలనా దృష్టికి, అభిమానానికి అభినందనలు. అయినా....చచ్చిపోయిన పక్షి.... గూటిలోనుండి బయటకు రాలేదులే" అనడంతో సభ మరొక్కమారు గొల్లుమంది.

ఇలా తత్‌క్షణం ఇచ్చే చమత్కార సమాధానం, గొప్ప చతురోక్తి శక్తిని చమత్కారోక్తి, 'చతురవచనం', 'చతుర ప్రత్యుక్తి' అని అంటారు.

ఒక సమావేశం జరుగుతుండగా ఓ ప్రేక్షకుడు ఒక చిన్న కాగితంమీద 'వెధవ' అని వ్రాసి అధ్యక్షులవారికి పంపాడు. సభాధ్యక్షుడు దానిని చూసి నవ్వుతూ "సామాన్యం గా శ్రోతలు ప్రశ్నను వ్రాసి, దాని క్రింద పేరు వ్రాస్తారు. అయితే.....ఈ మిత్రుడు తన పేరు మాత్రమే వ్రాసి ప్రశ్న మాత్రం పంపలేదు. 'వెధవ' గారూ ఇంక మీ ప్రశ్న అడగండి" అనడంతో సభ గొల్లుమంది. ఎవరినో గేలిచేయాలని పథకం పన్ని తానే ఎలా హేళనకు గురిఅయ్యాడో చూడండి! -

---

కష్టాలలో మిత్రుని వంటిది నవ్వు. – వివేకానంద కేంద్రపత్రిక

హైదరాబాద్లో బేగం పేటకు వెళ్ళే సిటీబలో ఓ అందమైన యువతి ప్రయాణం చేస్తూండగా, ఆనందరావు ఆమె ప్రక్కనే చేరి “చంద్రుడు రాత్రుళ్ళే కన్పిస్తాడంటారు... ఇవ్వాళ పగలు కూడా కన్పిస్తున్నాడేమిటబ్బా...” అని యథాలాపంగా అన్నట్లుగా ఆమెవైపు కొంటెగా చూస్తూ కవితా ధోరణిలో సాగదీశాడు. “గుడ్లగూబలు రాత్రుళ్ళు కూస్తాయంటారు...ఇప్పుడు పగలు కూడా కూస్తున్నాయేమిటబ్బా...” అని ఆ అందాల భామ మరింత సోయగంగా తన వాడియైన బాణాన్ని సంధించడంతో ఆనందరావు విషాదరావుగా మారి ప్రక్క స్టాపులో దిగి ఉడాయించాడు. చమత్కారోక్తి శక్తి అది!

ఇద్దరు మిత్రుల మధ్య జరిగిన సంభాషణ:

కిరణ్ : నిన్ను చూసి జెంటిల్ మేన్ అనుకున్నా.

ప్రవీణ్ : నేను కూడా నిన్ను గురించి అలానే భావించా.

కిరణ్ : నిజమా?! అయితే నాది నిజంగా పొరపాటే. నువ్వే కరెక్టు.

ఇదొక గొప్ప చమత్కారోక్తి. ఎదుటి వ్యక్తిని సమర్థిస్తూనే, తనది పొరపాటని చెబుతూనే ప్రత్యర్థిని దెబ్బ తీయడం అంటే ఇదే!

ప్రఖ్యాత స్వాతంత్ర్య సమరయోధుడు అషుతోష్ ముఖర్జీ ఒకరోజు అనుకోకుండా ఆంగ్లేయుడు కూర్చున్న రైలు పెట్టెలోకి ఎక్కాడు. ముఖర్జీతో ప్రయాణం చేయడం ఏమాత్రం ఇష్టంలేని ఆ ఆంగ్లేయుడు పది నిమిషాల తరువాత ముఖర్జీ చెప్పునొకదానిని కిటికీగుండా విసిరేశాడు. దానిని గమనించనట్లే కూర్చున్న ముఖర్జీ అరగంట తరువాత ఆంగ్లేయుని టోపీని బయటకు విసిరాడు. “నా టోపీని ఎందుకలా విసిరేశావు? బుద్ధి లేదా?” అంటూ ఆంగ్లేయుడు గద్దించడంతో ముఖర్జీ సౌమ్యంగా “నా చెప్పును తేవడానికి నీ టోపీ బయటకు వెళ్ళిందిలే అంతే....” అన్నాడు. కొంతదూరం పోయాక “రవి అస్తమించని సామ్రాజ్యం మాది. ప్రపంచంలోనే మాకు సాటియైన దేశం మరొకటి లేదు తెలుసా?” విర్రవీగినట్లుగా అన్నాడు. ఆంగ్లేయుడు. అందుకు ముఖర్జీ నవ్వుతూ “భగవంతుడు కూడా మిమ్మల్ని చీకట్లో నమ్మలేడు. అందుకే సూర్యుడు ఎప్పుడూ మిమ్మల్ని చూస్తూనే ఉంటాడు!” అంటూ చురక వేశాడు. ఇలాంటి చురకలు వెయ్యడా నికి గడుసరి సమాధానాలు ఇచ్చే శక్తేగాక, అపారమైన అనుభవం కూడా అవసరం అవుతుంది.

అలెగ్జాండర్ డూమాస్ పేరుగాంచిన రచయిత. ఒక యువరచయిత తన రచనను ఆయనకు పంపుతూ “మనిద్దరం సహరచయితలుగా ఒక పుస్తకాన్ని వ్రాద్దాం” అన్న లేఖను అందులో జోడించాడు. ముక్కూ మొహం తెలియని వ్యక్తి నా అంతటివాణ్ణి సహరచయితగా

---

హృదయ మనోవేదనను వినిపించకుండా చేసే కళ నవ్వు. – కోలరిడ్జ్

ఉండమంటాడా అనుకుంటూ దూమాస్ "మీ పుస్తకం అందింది. మీ లేఖ కూడా చేరింది. అయినా.... ఉత్తమ అశ్వాన్ని గాడిదతో కలపబూనావేమిటి?" అని కొంటెగా ప్రశ్నించాడు. హాస్యంలో కూడా దిట్ట అయిన ఆ యువరచయిత దూమాస్‌కు ప్రత్యుత్తరం వ్రాస్తూ "నన్ను ఉత్తమ అశ్వం అనడానికి మీకెంత ధైర్యం కావాలి?" అని ప్రశ్నించడంతో దూమాస్ దారిలోకి వచ్చి అతను సహరచయితగా ఉండటానికి తన ఆమోదం తెలిపాడు.

ఒక కవిగారి గౌరవార్థం భారీ స్థాయిలో సన్మానసభను ఏర్పాటుచేసి, ఆ సభకు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిని ముఖ్య అతిథిగా ఆహ్వానించారు. దేవులపల్లికి ఆ కవిని పొగడడం ఇష్టం లేదు. అయినా.... ముఖ్య అతిథిగా ముక్తసరిగానైనా సన్మానితుణ్ణి గురించి కొన్ని మంచి మాటలు చెప్పాలి కదా! అందుకని ఆయన తన ప్రసంగంలో "ఈనాటి సన్మానితుడుగారి రచనలను మనం జాగ్రత్తగా వెతికితే అక్కడక్కడా కవిత్వం కన్పిస్తుంది" అంటూ ప్రశంసించారట!

ఈ విధంగా చమత్కారోక్తి ఒకానొక వ్యక్తిలోని చమత్కార వచనా శక్తికి దర్పణంగా నిలుస్తుంది. తాను నవ్వుతూ ఎదుటివారిని కూడా నవ్వించగల నేర్పరితనం అటు వ్యక్తి వికాసానికి, ఇటు సమాజ ప్రగతికి తోడ్పడుతుంది కనుకనే ఈ హాస్యోక్తి బహుళ ప్రజాదరణ పొందింది. చమత్కారోక్తి నుండి ఇంక వ్యంగ్యోక్తిలోకి వెళ్లామా?

## 3. వ్యంగ్యం (Satire)

"ఏమండీ పిన్నిగారూ! పనైపోయిందా?" పక్కింటి తాయారమ్మను అడిగింది ప్రమీల. "ఎక్కడమ్మా.....మీ బాబాయిగారు ఇంకా రాందే!" సాగదీసింది తాయారమ్మ.

ఒక వ్యక్తిలోని బలహీనతలను, లోపాలను హాస్యరూపంలో వివరిస్తూ అతని పై చేసే తీవ్రమైన, నిందాపూర్వక పరిహాస రచన, సంభాషణను వ్యంగ్యం, అధిక్షేపం అని పిలుస్తారు. సమాజంలోని బలహీనతలను, లోపాలను ఎత్తిచూపుతూ ప్రజలను నవ్విస్తూ దానిని సరిదిద్దడానికి ఈ పద్ధతి ఉపయోగపడుతుంది. వ్యక్తిలోని అవగుణాల ను మెచ్చుకునే కథ ఇది. అది విమర్శనాత్మకంగా, సమగ్ర పరిశోధనతో కూడి, ఆడంబర పూర్వకంగా ముందుకు దూసుకుపోతుంది.

చర్చిల్ మాజీ అల్లుడు (ఆయన కూతురుకు విడాకులిచ్చినవాడు) అనుకోకుండా ఒక పార్టీలో ఆతని ప్రక్కనే కూర్చున్నాడు. అవకాశం దొరికినప్పుడల్లా మామను ఏడ్పించడం ఆ మాజీ అల్లుడికి ఒక సరదా. 'నేటి ప్రపంచంలో గొప్ప రాజనీతిజ్ఞుడు ఎవరంటారు?" చర్చిల్ ను ప్రశ్నించాడు అల్లుడు.

---

అవివేకి నవ్వు కుండ క్రింద ఉంచిన ముండ్లు చిటపటలాడినట్లుంటుంది. – బైబిల్

చర్చిల్ : ముస్సోలిని.... అనుమానం లేదు.

అల్లుడు : ఎందుకని?

చర్చిల్ : అతను తన కూతురుని సరిగా చూడని అల్లుణ్ణి నిర్దయగా కాల్చిపారేశాడు.

కూతురుని వదిలేసిన అల్లున్ని నిర్దయగా కాల్చిపారేయాలని మనస్సులో ఉన్నప్పటికీ సామాజిక, రాజకీయ కారణాల దృష్ట్యా అతనెంత నిస్సహాయుడైంది తెలిపే వ్యంగ్యోక్తి ఇది.

ఆదిభట్ల నారాయణదాసు గొప్ప కవి, చమత్కార ప్రియుడు. ఆజానుబాహులైన దాసుగారు వ్యాహ్యాళికి వెళుతుంటే, దారిలో పిఠాపురం రాజుగారు ఎదురై "కవి వృషభులు ఎక్కడికో బయలుదేరారే" అన్నారు వ్యంగ్యంగా. ఆదిభట్లవారు తొణకకుండా "మీరు కవులపాలిట కామధేనువు కదా! అందుకే మీవద్దకే వస్తున్నానండి" అన్నారు దెబ్బకుదెబ్బ తీస్తున్నట్లుగా. 'వృషభం' ఎక్కడకు అన్న ప్రశ్నకు 'ఆవు' దగ్గరకు అన్న సమాధానం ఎంత బాగుంది!

యముని సహోదరుడవైన ఓ వైద్యుడా! నీకు నమస్కారం. యముడికంటే నీవు అధికుడవు. ఎందుకంటే యముడు ప్రాణాలతో సంతృప్తి పడతాడు. నువ్వు మాత్రం ప్రాణంతోపాటు ధనాన్ని కూడా తీసుకుపోతావు.

పూర్వకవి ఒకాయన వైద్యుడికి నమస్కరిస్తూ ఇలా చమత్కరించాడు :

వైద్య రాజ నమస్తుభ్యమ్
యమ రాజ సహోదరా
యమస్తు హరతి ప్రాణాన్
వైద్యః ప్రాణాన్ ధనానిచ!!

"ఇల్లు ఎలా ఉంది?" అనే విషయాన్ని చిలకమర్తి ఎంత వ్యంగ్యంగా వర్ణించారో చూడండి:

"దీపములారిపోయి విస్తళ్ళెగిరిపోవునట్లు హోరున గాలివచ్చు పెద్ద కిటికీలు లేవు గాని మొత్తము మీద జానెడు యెత్తుకు మించకుండ, బెత్తెడెత్తుకు తగ్గకుండ కిటికీలు మాత్రమున్నవి. వేసవికాలములో నీ యింటిలోనికి వాయుదేవుడు వచ్చినను చెమట భయముచేత రెండుమూడు విసనకర్రలు తెచ్చుకొనవలసినదే. రెండు జాములవేళ సూర్యుడాయింట దూరినను చీకటిచే కన్ను కనబడక దీపము తెచ్చుకోవలసిందే. ఇల్లు దొంగలకే గాక దోమలకు గూడ దూరుట కశక్యముగనుండును. లోపలి దోమలు పైకి వచ్చుటకు ను పై దోమలు లోపలికి వెళ్ళుటకును వీలులేదు.

---

చిన్నారుల నవ్వును అసహ్యించుకునేవాడిపట్ల జాగ్రత్తగా వ్యవహరించు. –లవటర్

అలానే బజార్లు కంపు కొడుతున్నాయి. దుర్గంధభరితమై ఉన్నాయి అన్న విషయాన్ని ఎలా వర్ణించారో చూడండి . "మా ఊరిలోని మనుషులు వాటర్ ప్రూఫ్ గొడుగులలాగా వాసన ప్రూఫ్ ముక్కులు చేయవలెనని మావాళ్ళ అభిప్రాయము... దీనిమూలంగా ముక్కు చాలా సేపు మూసుకొని యుండవలసివచ్చును. దానివలన జనులు ప్రాణాయామం జేసి యోగులు కావచ్చును..... జనాభివృద్ధి హద్దు పద్దు లేకుండా అవుతూవున్నది.... ఇటువంటి దుర్వాసన వున్నట్లయితే దీని శక్తి వల్ల జ్వరములు, విషూచి, మశూచి, బోదకాళ్ళు మొదలైన నానా రోగములు పుట్టి జనక్షయమవుతుంది. కొంత క్షయమైతే మిగిలినవాళ్ళు సుఖపడవచ్చును".

ఆత్మస్తుతి పరనింద లేని మహానుభావుడను. తక్కిన అవకతవక నిర్భాగ్యుల వంటివాడను గాను. కొంచె మెచ్చు తక్కువగా బ్రహ్మరథం పట్టించుకోవలసిన వాడను. కాని దీని కడుపుగాల - కలికాలములో మంచివాళ్ళకి గౌరవం చేసేవాళ్ళు లేరు - ఇదొక ప్రత్యేక తరహా వ్యంగ్యోక్తి.

నొప్పించినట్లు కన్పించకుండా నొప్పించగలగడంలో, సుతిమెత్తగా కన్పించినప్పటికీ ఘాటుగా సమాధానం చెప్పడంలో వ్యంగ్యం పాత్ర ప్రముఖంగా కన్పిస్తుంది.

ఆధునిక తెలుగు కవులలో కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ. ఆయనొక సాంప్రదాయకవాది. ఒక పర్యాయం విశ్వనాధ గారికి, జాషువా గారికి ఒకే వేదికమీద గొప్ప సన్మానం జరిగింది. సన్మానానంతరం విశ్వనాధ వారు ప్రసంగిస్తూ "సన్మానాలు చక్కగా చేశారు. అంతా బాగానే ఉంది. అయితే గాడిదని, గుర్రాన్ని ఒకే గాటకి కట్టడం నాకు నచ్చలేదు" అంటూ తన అసం తృప్తిని, అసహనాన్ని ప్రకటించారు. ఆ తరువాత జాషువాగారు ప్రసంగిస్తూ "విశ్వనాధ గారు కవి సామ్రాట్. ఆయన నిజంతప్ప మాట్లాడరు. అందుకే ఆయనతో నేను మనస్ఫూర్తిగా ఏకీభవిస్తున్నాను. నేను మాత్రం గుర్రాన్నే" అంటూ విశ్వనాధవారివైపు తిరగడంతో సభ గొల్లుమంది. మరి జాషువాగారి ఇంటి పేరు గుర్రం కదా!

వ్యంగ్యం ఒక అలంకారమే కాదు, అదొక అందమైన ఆలోచన కూడా. సాధారణంగా అసంగత పదజాలంతో కూడిన తర్కం ఇది.

కోర్టులో ఖైదీతో జడ్జి : నీ తరపున వాదించే లాయర్ లేడా?

ఖైదీ : లేడయ్యా

జడ్జి : మరి నీకు లాయర్ అవసరం లేదా?

---

నవ్వు పోయిందంటే, రోగం వచ్చిందన్నమాటే. – వెండేర్

ఖైదీ : నిజమే చెప్పదలచుకున్నానయ్యా. నాకు ఏ లాయరూ అక్కర్లేదు సామీ! అన్నాడు అమాయకంగా.

ఈ విధంగా దుర్మార్గాన్ని, అజ్ఞానాన్ని, అత్యాశను బయట పెట్టి, సమాజాన్ని దాని నుంచి మళ్ళించడానికి మాటల ద్వారా, రచనల ద్వారా పరిహాసం చేస్తుంది వ్యంగ్యం.

సూటిగా విమర్శించేది తిట్టు ఉదా॥ నువ్వొక పెద్ద వెధవాయివి. అయితే, వంకరగా తిట్టేది వ్యంగ్యం అవును. నువ్వొక పెద్ద మేధావివి గదా!. వ్యంగ్యానికి పదునైన భాషతో పాటు అందమైన వెక్కిరింతను కూడా జోడిస్తే అది అధిక్షేపం అవుతుందంటారు కొందరు. అంటే వ్యంగ్యం ఒకవైపు పదునున్న కత్తి అయితే, రెండు వైపులా పదునున్న కత్తి వంటిది అధిక్షేపం అన్నమాట. అధిక్షేపం అంచులు చూడదలిస్తే ప్రఖ్యాత రష్యన్ రచయిత చెకోవ్ మాటలు చదవాల్సిందే.

"వైద్యులు, వకీళ్ళు ఒకే కోవకు చెందినవారు. అయితే, వకీళ్ళు డబ్బు మాత్రమే దోచుకొని వదిలేస్తే, వైద్యులు ప్రాణాలు కూడా దోచేసుకుంటారు".

## 4. సరసోక్తి (Wit)

సరసోక్తి మేధాపరమైనది. హాస్యం చిరునవ్వును తెప్పిస్తే, సరసోక్తి కడుపుబ్బ నవ్విస్తుంది. చమత్కరించే శక్తి, నవ్వించే కళ ఇది. చార్లెస్ ఆర్.గ్రూనర్ ప్రకారం అది రెండు రకాలు:

1. ప్రమాదరహిత సరసోక్తి : అదొక హాస్యోక్తి. శాబ్దిక తెలివితేటలతో వినోదం కల్పించడం దాని లక్షణం.

ఒక ఇంటికి ఒక అతిథి వచ్చాడు. అది మధ్యాహ్న సమయం. ఇంటావిడ అతనిని భోజనం చేసి వెళ్ళమని కోరింది. ఆమెది అతి సామాన్య కుటుంబం అవడంతో ఆకుకూర మాత్రమే వండి భోజనంలో వడ్డించింది. ఆ అతిథికి నోటితో పొగుడుతూ నొసటితో వెక్కిరించడం అలవాటు. "బచ్చలి కూరను బ్రహ్మాండంగా వండావు తల్లీ! నీ దగ్గర ఆ నలుని లక్షణాలున్నాయి. మా ఇంట్లో మాత్రం.... ఈ బచ్చలి ఆకును గేదెలకే వేస్తాం" అనడంతో ఆమె మనస్సు చివుక్కుమంది. వెంటనే తేరుకొన్న ఆమె "మామూలుగా మేము కూడా... ఈ ఆకులను గేదెలకే వేస్తాం బాబాయి గారూ! ఏదో.... మీరు వచ్చారని....ఇవ్వాళ దీనిని వండానండి" అని ఆమె అమాయకంగా ముఖం పెట్టి, చిన్నగా నవ్వడంతో ఆ అతిథి బిక్కచచ్చిపోయాడు. ఈ విధంగా మెత్తగా, సుతిమెత్తగా హాస్యాన్ని తొణికిసలాడిస్తూనే బుద్ధి చెబుతోంది హాస్యోక్తి.

---

నవ్వు ఒక టానిక్. అది బాధలనుంచి ఉపశమనం కల్గిస్తుంది. – చార్లీ చాప్లిన్

గౌతమ బుద్ధుడు ఒక ఇంటికి భిక్షకు వెళ్ళాడు. ఆయనను చూడటంతోనే ఆ ఇంటావిడ “పోట్లగిత్తలా ఉన్నావు. పని చేసుకోరాదూ!” అంటూ గయ్యిమంది. బుద్ధుడు ఏమీ మాట్లాడక మౌనంగా నిలబడడంతో ఆమె మరింత రెచ్చిపోయి "దీపపు స్థంభంలా ఉలక్కుండా, పలక్కుండా అలా నిలబడతావే?” అంటూ ఏమేమో అంది. అందుకు బుద్ధుడు "తల్లీ! మీరు అన్నం పెట్టబోతుంటే, నేను వద్దమ్మా అంటే ఆ అన్నం ఎవరికి చెందుతుంది?” అని ప్రశ్నించాడు. ఆమె ఆశ్చర్యంతో "నాకే” అన్నది. “మీరు తిట్టిన తిట్లన్నీ నాకు . వద్దు అంటే ఏమౌతుంది తల్లీ" అన్నాడు బుద్ధుడు. ఆమె మారు మాట్లాడకుండా ఇంట్లోకి వెళ్ళి వేడి వేడి అన్నం తెచ్చి పెట్టింది.

2. ఉన్ముఖత్వ సరసోక్తి : ఉన్ముఖత్వ సరసోక్తిలో వ్యంగ్యం ఒక భాగం. హాస్యం పరుషోక్తుల ద్వారా ప్రజలలోని మూర్ఖత్వాన్ని తొలగిస్తూ అక్రమాన్ని శిక్షిస్తుంది (గిల్బర్ట్ హైట్). మానవ దుశ్చర్యలు, దుర్మార్గం పై ఆలోచనాత్మకంగా, వాగ్దాటితో ఇతరులలో కోపాన్ని రేకెత్తించడమే దాని లక్ష్యం. ఇక్కడ “మనం చేసే నింద వినోదంగానే కాక, ఇతరులకు గుణపాఠం నేర్పేదిగా ఉండాలి. విమర్శ దాని ప్రధాన లక్షణం అవ్వాలి” (ఎడ్గార్ జాన్సన్). ఒకప్రక్క వినోదం కల్పిస్తూనే, మరొకప్రక్క ఒక వ్యక్తిని, సంస్థను లేదా వస్తువును వాగ్బాణాలతో గేలి చేయడం దీని లక్షణం. గేలి చేయడంతో బాటు విరోధిని గౌరవప్రదంగా ఎలా అవమానించాలో కూడా పరిశీలించండి.

జార్జి వాషింగ్టన్ అమెరికా ప్రథమ అధ్యక్షుడు. ఆయన యుద్ధరంగంలోనే కాక, రాజకీయ, హాస్యరంగాలలో కూడా ఆరితేరిన నేత. రాజ్యాంగ నిర్మాణ సమావేశంలో ఒకనాడు వాషింగ్టన్ ప్రసంగిస్తూ “మన దేశ సైన్యం 5 వేలలోపే ఉన్నది గనుక ఆ సంఖ్యను పెంచాలని మనం ఒక తీర్మానం చెయ్యాలి” అన్నాడు. మిగిలిన సభ్యులు దానికి అంగీకరించకపోవడంతో కోపగించుకున్న వాషింగ్టన్ తన కోపాన్ని అణచుకుం టూ “అయితే, కనీసం ఈ తీర్మానం అయినా చెయ్యండి” అనడంతో సభ్యులందరూ ఆత్రంగా “ఏమని తీర్మానం చెయ్యాలి?" అని అడిగారు. “మన సైనిక శక్తి 5 వేలకు మించకూడదంటున్నారు కదా! కనుక ఏ దేశమైనా మనమీద దాడి చేయాలనుకున్నప్పు డు 3 వేల సైన్యానికి మించి మా దేశంలోకి తీసుకురాకూడదు అని తీర్మానం చేయండి” అన్నాడు. దాంతో వాషింగ్టన్ కోరికమేరకు సైనిక శక్తిని పెంచడానికి ఆ సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది!

---

చిరునవ్వు చిందించే ముఖమే ఉత్తమమైన సిఫారసు పత్రం. – షేక్ స్పియర్

కమల (భర్తతో) : భర్త ఏదో కోపంతో భార్య జుట్టుపట్టుకున్నాడే అనుకోండి, అంతమాత్రం చేత భార్య భర్త జుట్టు పట్టుకొని పీకాలా ఏమిటి? మహాసాధ్విలా అంది ఆ ఇల్లాలు.
భర్త మోహన్ : పాపం. నీలాగా గొంతు పట్టుకోవడం ఆమెకు తెలిసినట్లు లేదు. ఒకరోజు వెళ్ళి ట్రైనింగ్ ఇచ్చిరా రాదూ!

## 5. అతిశయోక్తి (Hyperbole)

గోరంతలను కొండంతలుగా చెప్పడాన్ని అతిశయోక్తి అంటారు. దీనిని 'అత్యుక్తి' అని కూడా పిలుస్తారు. ఇతరులను పొగడటానికి, ప్రత్యర్థులను ఏడ్పించడానికి యదార్థాన్ని వక్రీకరిస్తూ హాస్యం కోసం కొన్ని సందర్భాలలో పదాలను విరుస్తూ మాట్లాడు తుంటాము. చీమలపుట్టను మహాపర్వతంగా వర్ణించినప్పుడు మనకు కలిగే ఆశ్చర్యమే అత్యుక్తి రూపంలో ఉంటుంది. పంచ తంత్రం కథల్లో జంతువులు మాట్లాడతాయి. పిల్లల కథల్లో కొండలు, చెట్లు అమాంతం నడుస్తాయి, సంభాషిస్తాయి. సర్కస్ లో బఫూన్లు విచిత్ర వేషధారణలతో నవ్విస్తారు. హాస్యోక్తులు అంటే ఇవే. సంకట స్థితి నుండి తప్పించుకోడానికి, ఈతి బాధలు, సమస్యల నుండి బయట పడి హాయిగా నవ్వుకోడానికి అతిశయోక్తి ఒక చక్కని పరికరంగా ఉపయోగపడుతుంది. ఆల్బర్ట్ ఎలిస్, ఫ్రాంక్ ఫెరిల్లీలు దీనినొక ఔషధంగా ఉపయోగించారు.

అతిశయోక్తి ఆనందానికి రాచబాటగా నిలుస్తుందనడానికి ఒక ఉదాహరణ. “మా దేశంలో పండిన క్యాబేజీ క్రింద వందమంది మనుషులు నిల్చోగలరు” అన్నాడు కాలిఫోర్నియావాసి. “మా దేశంలో కాగులు ఎంత పెద్దవని! దాని అంచు మడచడానికి ఒకవైపున వెయ్యిమంది సుత్తెలతో బాదుతూ ఉంటే, రెండోవైపున పనిచేస్తున్నవారికి ఏమీ వినిపించదు” అన్నాడు బ్రిటన్ వాసి. “అంత పెద్ద కాగులెందు కయ్యా?” ప్రశ్నించాడు కాలిఫోర్నియావాసి. “ఆ......మీ క్యాబేజీలు వండటానికే” నవ్వుతూ సమాధానం చెప్పాడు బ్రిటన్ దేశస్తుడు. తమ దేశాల గొప్పతనాన్ని చాటుకుం టూ వారు ఎంతగా ఆనందించారో చూడండి.

కాకి పర్వతాన్ని కదిలించిందంటే ఎవరైనా నవ్వుతారు కదా! రథచక్రం మీద వాలిన ఈగ నేనెంత దుమ్ము రేపానో అనుకుంటుందంటే మనం నవ్విపోమూ! ఊరంత బాండీ పెట్టి ఏనుగంత పూర్ణాలు చేసి పెట్టినా సుబ్బయ్య ఆకలి తీరలేదంటే విన్నవారె వరైనా మూర్ఛపోరూ! ఈ విధంగా అతిశయోక్తికి, హాస్యానికి అవినాభావ సంబంధం ఉన్నదని చెప్పవచ్చు. అతిశయోక్తి మూడు రకాలుగా ఉంటుందని బిల్ డానా సోదాహరణంగా వివరించారు.

---

అవమానాన్ని క్రోధాన్ని ఎదుర్కోగల ఒకే ఒక ఆయుధం చిరునవ్వు. – గాంధీజీ

ప్రథమ రూపం : న్యూయార్క్ లోని ఒక పెద్ద ఆడిటోరియంలో గొప్ప సమావేశం జరుగుతుంది. వేలాదిగా కార్లు అక్కడ నిలిచాయి. మైక్‌లో ఒక ప్రకటన ఇలా విన్పిస్తుంది: “న్యూయార్క్ లైసెన్స్ ప్లేట్ BL 744684 933 590 306 231 450 798725 నెంబర్ గలవారు వెంటనే దానిని తొలగిస్తారా? దయచేసి మరోలా భావించవద్దు. మీ లైసెన్స్ ప్లేట్ ట్రాఫిక్ కు అంతరాయం కలిగిస్తుంది”.

రెండవ రూపం : ఇద్దరు పశువుల కాపరుల మధ్య సంభాషణ : మొదటివాడు రెండవవానికి తమ ఆవులను కట్టివేసే స్థలం వివరాలు చెబుతున్నాడు. క్షేత్రం నెంబర్ బార్ 9, సర్కిల్ Z రాకింగ్ 0, ఫ్లైయింగ్ W, లేజి R, హోపి 2, ఫ్లైయింగ్ నన్ రాంచ్ అని చెప్పి “మీకు కూడా ఎక్కువ ఆవులు ఉన్నాయా?" అని ప్రశ్నించాడు. అందుకు రెండవవాడు “ఇలాంటి పెద్ద పెద్ద ముద్రలు ఆవులమీద వేస్తుంటే అవింక జీవించవు” అన్నాడు నీరసంగా!

మూడవ రూపం : ఇద్దరు ఫుట్ బాల్ ఆటగాళ్ళ మధ్య జరిగిన సంభాషణ : చివరి ఆటలో తాను వీరావేశంతో చేసిన పరుగు గురించి మొదటి ఆటగాడు ఇలా వర్ణిస్తున్నాడు : “నన్ను ఆపడానికి వారు శతవిధాలా ప్రయత్నించారు కాని, వారు కృతార్థులు కాలేదు. ఇంక లాభం లేదనుకొని ఫిరంగి తెచ్చి పేల్చారు. ఆ తర్వాత మెషీన్ గన్లతో విమానాలు క్రిందకు దిగాయి. అయినా వారు నన్ను నిరోధించలేక పోయారు. చివరకు నేను విజయలక్ష్మిని చేపట్టాను". ఇవన్నీ వింటూ...కోపంతో ఉడికిపోతున్న రెండవ ఆటగాడు “ఆనాడు స్టేడియంలో ఉన్న ఎవరైనా ఇదొక కట్టుకథ అని కొట్టిపారేస్తారు” అన్నాడు నిర్మొహమాటంగా. దానికి సమాధానంగా మొదటి ఆటగాడు “స్టేడియంలో ఆనాడు ఎవరైనా బ్రతికి బయటపడితే కదా!” అన్నాడు గర్వం వలకబోస్తూ....

ఈ విషయంలో రచయితలు ఒక ప్రత్యేక పద్ధతిని పాటిస్తారు. పాఠకునికి అర్థంకాని రీతిలో అతిశయోక్తిని క్రమంగా పెంచుకుంటూ పోయానన్నారు జోసఫ్ హెల్లర్ (Catch 22 రచయిత). హఠాత్తుగా సంఘటనను వివరించడంకన్నా, అంచెలంచెలుగా విషయాన్ని పెంచుకుంటూ పోవాలంటారు అనుభవజ్ఞులు. కడెన్ ప్రకారం భౌతికంగా అతిగా వ్యవహరించడం, పరిస్థితులను, స్వభావాన్ని అతిగా చూపడం, అనూహ్యమైన, ఊహించ లేని సంఘటనలు, అర్థరహితమైన పరిస్థితులు, ఆశ్చర్యాన్ని గొలిపే సంభాషణలు మొదలైనవి అతిశయోక్తి లక్షణాలు. పిల్లలకు ఉద్దేశించిన కార్టూన్లలో ఇవి అత్యధిక మోతాదులో కన్పిస్తాయి. నాయకునికి ఒకే కన్ను ఉండటం, చెవి దగ్గర నోరు ఉంచడం, ముక్కు, నోరు కలిపివేయడం, చిత్రమైన జంతురూపంలో మానవాకృతిని తయారు చేయడం మొదలైన

కూర్పులతో మానవాకృతికే విచిత్ర, వినూత్న రూపాన్ని ఇవ్వడంతో ఎవ్వరికైనా నవ్వు రాకమానదు. రాజకీయ నాయకులకు, రాజకీయ సంఘటనలకు సంబంధించిన కార్టూన్లలో కూడా అతిశయోక్తులు అధికంగా ఉండటం సర్వసాధారణం.

ప్రఖ్యాత ఫుట్ బాల్ ఆటగాళ్ళ భార్యలు ముగ్గురు తమ భర్తల గొప్పతనాన్ని గురించి ఎంత గొప్పగా చెప్పుకున్నారో చూడండి.

మొదటి ఆమె : "మా శ్రీవారు బంతిని గాలిలోకి తంతే, అది క్రిందకు రావడానికి నాలుగు గంటలు పట్టింది తెలుసా?"

రెండవ ఆమె : "ఓస్ ఇంతేనా! మా వారు తన్నినబంతి నాలుగు రోజుల తరువాత క్రింద పడింది".

మూడవ ఆమె : "మావారి గొప్పతనం వింటే మీరింకెప్పుడూ నోరెత్తరు. ఆయన తన్నిన బంతి ఆరు రోజుల తరువాత తిరిగొచ్చింది. అంతేకాదు, దాని పైన ఒక చీటీ కూడా అంటించి ఉంది.

"అందులో ఏముంది?" అడిగారు మిగిలిన ఇద్దరూ ఆత్రంగా. "ఈసారి చంద్రుని మీదకు బంతిని వేస్తే ఇంకెప్పుడూ తిరిగి ఇవ్వం అని ఉంది" అన్నది మూడవ ఆమె గర్వంగా చూస్తూ...!

ఇలాంటి జోక్స్ ను బడాయి జోక్స్ అని కొందరు, సొంత డబ్బా హాస్యోక్తులు అని ఇంకొందరు పిలుస్తారు.

ఇద్దరు నటులు తమ అనుభవాలను వర్ణించుకుంటూ ఎంతగా ఆనందిస్తున్నారో చూడండి.

శేఖర్ : నిన్న రాత్రి నేను ఆడిన నాటకంలో చనిపోయే సీనులో నా నటనను చూసిన ప్రేక్షకులు ముందు కంటతడి పెట్టారు. ఆ తరువాత భోరున ఏడ్చారు. మహిళలైతే చీరెలు అడ్డం పెట్టుకొని ఏడుస్తుంటే, వాళ్ళు స్నానం చేసి వచ్చారా అన్నంతగా ఆ చీరెలు తడిసిపోయాయంటే నమ్ము!

వినోద్: అంతేనా! గతవారం నేను అదే సీనులో నటించాను. కాదు కాదు..... జీవించాను. ఎంతగా జీవించానంటే, నేను నిజంగా చనిపోయాననుకొని బీమా కంపెనీవాళ్ళు మా ఆవిడకు ఒక లక్ష రూపాయల చెక్కు కూడా పంపారు తెలుసా అన్నాడు డాబుసరిగా.

---

ఒక పవిత్రమైన రోజును పసిబిడ్డ దరహాసం మరింత పవిత్ర చేస్తుంది. – ఇంగర్ సాల్

6. పదనిసలు

కొన్ని పదాలు వాటి శబ్దాలను బట్టి ప్రత్యేకంగా, విచిత్రంగా, వింతగా ఉంటాయి. ఉదాహరణకు తలుపు కిర్రుమని మ్రోగింది; గంటలు గణగణ మ్రోగాయి. ఆయా వస్తువులు ఎలా మ్రోగుతాయో ఆ పదప్రయోగం ద్వారా అలానే వినిపించడంతో ఒక రకమైన ఆనందం జనిస్తుంది. అవి సంగీతంలా మాధుర్యంగా ధ్వనిస్తాయి. పదనిసలు పలికినట్లు ఉంటాయి. 'సాక్షి'లో ఇలాంటి వాక్యాలు కోకొల్లలుగా లభిస్తాయి. కవిత గురించి చెబుతూ “మొలక తళుకులు బెళుకులు తులకరించు కలికిపలుకుల కులుకుల కవిత"! ఈ వాక్యం చదువుతుంటే అందంగా అలంకరించుకున్న ఓ వయ్యారిభామ, ఒక నాట్యమయూరి నృత్యం చేస్తున్నట్లనిపిస్తుంది. దాని అర్థం తెలియనివారు కూడా ఆ వాక్యాన్ని చదువుతూ ఆనందించగలగడం దాని ప్రత్యేకత.

బారెట్ల అయితేనేం, సాం
బారెట్లా చేయగలడు, భార్యతో
నోరెట్లా మొదలించును
చీరెట్లా బేరమాడు శిరిశిరి మువ్వ. -శ్రీశ్రీ

"మనిషికి కావలసింది అన్నవస్త్రాలే కాని, అణ్యస్త్రాలు కాదు” అన్న మహాకవి శ్రీ శ్రీ మాటలలో కవితా హృదయంతో బాటు గొప్ప మానవతావాదం, భాషాపటిమతో బాటు భావ గాంభీర్యం కన్పిస్తాయి...

హైదరాబాద్ లో నివసిస్తున్న సంగీత దర్శకుడు ఎస్.రాజేశ్వరరావు, రచయిత ఆరుద్ర విమానాశ్రయానికి వెళ్తున్నారు. మార్గమధ్యంలో "ఆరుద్ర గారూ! ఇక్కడ మీకేమైనా స్థలాలు ఉన్నాయా?” అని అడిగారు రాజేశ్వరరావు. అందుకు ఆరుద్ర నవ్వుతూ అక్కడ కన్పిస్తున్న ఖాళీ స్థలాలను చూపుతూ “ఆ రుద్రభూములన్నీ నావే కదండి” అన్నారట.

తెలుగుల తెగులును గురించి భమిడిపాటివారి హాస్యగుళికలు.

“తెలుగు అక్షరాలకు దేని తలకట్టు దానిదే. అవి కలసి చావవు. తెలుగువాడూ అంతే. మన అనైక్యత మన అక్షరాలలోనే ఉంది".

“వాడు పైకొచ్చేస్తున్నాడ్రోయ్ అని గొప్పగా ఏడ్చే అసూయ అతడి సొంతం”.

“అది ప్రశంసాపత్రం కాదు; పరమ హింసాపత్రం”.

“దండయాత్రలు అంటే దండలతో యాత్రలు కాదు".

ఇలాంటివే మరి కొన్నింటిని పెద్దల మాటలలో విందామా......

---

చిరునవ్వుకు ఖర్చులేదు. పైగా దానితో ఎంతో సృష్టించవచ్చు. – డేల్ కార్నేగే

(i) టైమ్ కు రావడం శాస్త్రీయం, టైమ్ కు రాకపోవడం కృష్ణశాస్త్రీయం - శ్రీ శ్రీ -
(ii) ఇప్పుడు మనకు వస్తున్నవి న్యూ చిత్రాలు కావు. - న్యూడ్ చిత్రాలు. - బి.ఎస్.రెడ్డి
(iii) సన్యాసిగాడి పెళ్ళికి జుట్టు దగ్గర నుండి అంతా అరువే.
(iv) పాట వ్రాయడానికి మేము పడేది అక్షరవ్యధ. పరభాషా గాయకులు పాట పాడుతూ చేసేది అక్షర వధ. - గేయ రచయిత కులశేఖర్

ఇటీవల కాలంలో ఈ అలంకారానికి కొందరు తమదైన సరళిలో సరికొత్త దుస్తులు తొడిగారు. తెలుగు వాక్యాలను చిత్రంగా ఆంగ్లంలోకి తర్జుమా చేస్తూ, కొన్ని పదాలకు చిత్రాతి చిత్రమైన వివరణలు ఇస్తూ హాస్యలోకంలో ఒక ప్రత్యేకతను సంతరించి పెట్టారు.

వైఫ్ (Wife) అంటే Worries Invited For Ever. దీనిని మాత్రం మహిళలు అందరూ, చాలామంది పురుషులు కూడా అంగీకరించరు.

సరదాగా ఇంకా కొన్ని కొంటె ప్రశ్నలు, తుంటరి సమాధానాలు చదవండి.

1. రేడియోకి, టి.వి.కి తేడా ఏమిటి? -భార్యాభర్తలు ఇంట్లో పోట్లాడుకుంటే అది రేడియో. బజారులో పోట్లాడుకుంటే అది టి.వి. .

2. పెళ్ళి అయినవాడికి, కానివాడికి తేడా ఏమిటి? - పెళ్ళి అయినవాడు మిస్ ని మిసెస్ చేస్తాడు. కాని వాడు మిసెస్ ని మిస్ చేస్తాడు.

గతంలో మనిషికి, మనిషికి ఒకానొక అనుబంధం ఉండేది. ఆనాటివి మానవ సంబంధాలు, ఈనాటివి మనీ సంబంధాలు. ఈ విధంగా తెలుగు భాష సౌందర్యాన్ని సామాన్యులకు కూడా పంచి పెట్టగల గడుసరివి పదనిసలు. ఇంక ఎత్తి పొడుపు ఎలా ఉంటుందో చూద్దాం.

## 7. ఎత్తిపొడుపు (Sarcasm)

తీవ్రమైన బాధ కలిగించే వ్యాఖ్య ఎత్తిపొడుపు. ఇది వ్యంగ్యంతో కూడి ఉంటుంది. కనుక ఎత్తిపొడుపును, వ్యంగ్యాన్ని విడదీయడం కష్టం. వ్యంగ్యంలో కొంత లాలిత్యం ఉంటుంది. అందులో హేళన, వెక్కిరింత ఉన్నా అది మరీ కటువుగా, గుచ్చుకునేలా ఉండదు. ఎత్తిపొడుపు వ్యక్తిగతంగా కటువుగా, ముక్కు మీద గుద్దినట్లుగా ఉంటుంది. ఇదొక పరుషోక్తి, దెప్పిపొడుపు, అపహాస్యం, వెక్కిరింత. అందుకే ఇది వ్యంగ్యంకన్నా చాలా ఘాటుగా, దాదాపు మోటుగా ఉంటుంది. పేరుకు తగ్గట్లుగా ఎదుటివ్యక్తిని ఎత్తిపొడవడమే దీని ప్రధాన ఉద్దేశ్యం.

మోతీలాల్ నెహ్రూ 1903 జూన్ 7వ తేదీన ఎం.పూర్ నిక్ కు వ్రాసిన లేఖలోని ఒక భాగాన్ని చూడండి:

---

నవ్వు బంధనాలను తొలగించి నూతన స్వేచ్ఛను సృష్టిస్తుంది. – అనిస్ నిన్

"మీ జడమైన మనస్తత్వాన్ని ఈ లేఖ కదిలిస్తుందో లేదో నాకు తెలియదు కాని, ఒక్క విషయాన్ని మీరు తెలుసుకోవడంలో ఆసక్తి కనబరుస్తారని నా భావన. ఆడంబరంతో కూడిన నిరక్షరాస్యునిలా గీకిన అక్షరాలతో మొన్న 27వ తేదీన అసంపూర్తి పోస్టేజితో మీరు పంపిన ఉత్తరం చేరింది. దానిమూలంగా పోస్ట్‌మాన్ ను నేను 1 రూపాయి 3 అణాలు (18 పైసలు) చెల్లించవలసి వచ్చింది. అది మీ వ్యక్తిత్వానికి గొప్ప గుర్తుగా, మీ వైభవో పేతానికి సంకేతంగా నిలుస్తుంది! నా డ్రాయర్ లోని జేబురుమాల నాణ్యతను అభ్యంతర పెట్టడమేగాక, ఆ పరాభవానికి నాచేత రుసుము చెల్లింపజేశారు. అది అసహ్యానికి పరాకాష్ఠ అయ్యింది. ద్వేషాన్ని వ్యాప్తి చేసినందుకు అంతర్జాతీయ స్థాయిలో బహుమతి ఏదైనా ప్రకటిస్తే, భారతదేశం వరకు మాత్రం ఫలితాన్ని గురించి మీరు ఆందోళన చెందవద్దు. ఈ విషయంలో నా పూర్తి మద్దతు మీకే ఉంటుందని గుర్తుంచు కోండి". ఇలాంటి ఘాటైన ఎత్తిపొడుపును నాళిక అంటారు.

విరాటరాజు కొలువులోకి ప్రవేశించిన ద్రౌపదిని ధర్మరాజు వారించినప్పుడు ఆమె "ఈ సభలోకి రావడం మర్యాద కాదంటారా? అయినా....నాకేం మర్యాద! నా భర్త జూదరి. జూదరి భార్యకు గౌరవం ఎక్కడ నుండి వస్తుంది?" అంటూ ఘాటుగా ఎత్తిపొడిచింది. మరొక నాళికను వినండి.

భర్త : ఎప్పుడూ డబ్బు డబ్బు అని గోల చేస్తుంటావు. నీకు నిజంగా బుద్ధి కావాలి, జ్ఞానం కావాలి - డబ్బు కాదు (అంటూ రెచ్చిపోయాడు!).

భార్య : అవి మీదగ్గర ఎలాగూ దొరకవు కదండి. అందుకే డబ్బు కావాలని అడుగుతున్నా (అంది అంతే గట్టిగా!).

జాతీయ రహస్యం : దేశాధ్యక్షుడు ప్రసంగిస్తున్నాడు. ఆయన ప్రసంగం వింటున్న శ్రోతలలో ఒకడు "అధ్యక్షులవారూ! మీరు ఎందుకూ పనికిరానివారండి" అని అరిచాడు. దానికి నొచ్చుకున్న అధ్యక్షులవారు ఆ వివాదాన్ని కోర్టుకెక్కించగా, న్యాయమూర్తి వాదికి అపరాధ రుసుంగా వెయ్యిరూపాయలు విధించాడు. "అయ్యా! అది చాలా పెద్ద మొత్తం. చిన్న తప్పుకు పెద్ద శిక్ష వేశారు!" అంటూ వాది విన్నవించుకోగా, న్యాయమూర్తి "శిక్ష సరైనదే. రూ. 100/- దేశాధ్యక్షుణ్ణి అవమానించినందుకు, ఒక జాతీయ రహస్యాన్ని బయటపెట్టినందుకుగాను రూ. 900/- అపరాధ రుసుంగా విధిస్తున్నా" అన్నాడు గంభీరంగా. దీనిలోని ఎత్తిపొడుపును గమనించండి. దేశాధ్యక్షుణ్ణి అవమానించడంకన్నా,

---

నవ్వేరుగనివారు లోకంలో పగలు కూడా చీకటినే చూస్తారు. – తిరువళ్ళువార్

అతను ఎందుకూ పనికిరానివాడు అన్న జాతీయ రహస్యాన్ని బట్టబయలు చేసినందుకు 9 రెట్లు పెనాల్టీ విధించడం అంటే సామాన్య విషయమా!

ఒక ముద్దు జంట సంభాషణ : "నా సమస్య చాలా క్లిష్టంగా మారింది రమా! దీనికి సరైన సలహాను పొందడానికి హస్తసాముద్రికుని వద్దకు వెళ్ళాలో లేక మైండ్ రీడర్ వద్దకు వెళ్ళాలో అర్థం కావడం లేదు".

రమ : మీకు శుభ్రంగా అరచెయ్యి ఉంది కదండి. హస్తసాముద్రికుని వద్దకే వెళ్ళండి! అంది చిలిపిగా నవ్వుతూ (అంటే ఆయనకు మైండ్ లేదని ఆమె అభిప్రాయం).

విభిన్న గుర్తులు : దీనిని ఏ రకంగా పలుకుతారు? అనే విషయంలో రచయితలమధ్య భేదాభిప్రాయాలున్నప్పటికీ, ఎత్తిపొడుపు విషయంలో మొత్తంమీద స్వరమార్పిడి ఉంటుందని అందరూ అంగీకరించారు. ఈ హాస్యోక్తిని ప్రయోగించేటప్పుడు ముఖకవళికలలో కూడా కొన్ని మార్పులు వస్తాయి. కనుబొమలు ఎగరవేయడం లేదా దించడం, గుడ్లు పెద్దవిచేసి చూడటం, వాటిని అటు ఇటు తిప్పడం, కన్ను కొట్టడం, తల ఊపడం, చిరునవ్వులు చిందించడం, మొదలైన విచిత్ర, వింత మార్పులు వస్తాయని చెప్పారు.

అది 1962వ సంవత్సరం. భారత్ పై చైనా దాడి జరపగా, పార్లమెంట్లో దానిని గురించి వాడిగా, వేడిగా చర్చ జరుగుతుంది. సభ్యుల ప్రశ్నలకు ప్రధాని నెహ్రూ సమాధానం చెబుతూ "మనం లడక్ ప్రాంతంలో పోగొట్టుకున్న ప్రదేశం అంత విలువైనది కాదు. మొక్క కూడా మొలవని నిరుపయోగమైన ప్రదేశం అది" అన్నారు. రామ్ మనోహర్ లోహియా తెచ్చి పెట్టుకొన్న నవ్వుతో "ప్రధానిగారూ! మీ బట్టతల పైన ఏ వెంట్రుకా మొలవదు. అంతమాత్రాన అది పనికిమాలినదని వదిలేస్తారా? పోతేపోయిందిలెమ్మని ఊరుకుంటారా?" అని చురక వేయడంతో ప్రతిపక్ష సభ్యులు బల్లలు చరచగా, నెహ్రూ ఖిన్నుడయ్యారు.

## 8. సందర్భోచిత హాస్యం

సందర్భాన్ని బట్టి ఆడే హాస్యోక్తికి తెలివితేటలు ఎంత అవసరమో, హాస్యచతురత కూడా అంతే అవసరం. అయితే, ఇక్కడ ఎలాంటి ఎత్తిపొడుపుకుగాని, వ్యంగ్యానికిగాని చోటు లేకపోవడం దీని ప్రత్యేకత. హాయిగా మనసు విప్పి నవ్వుకోడానికి అవకాశం కల్పించే ఈ హాస్యోక్తులు అందరినీ నవ్విస్తాయి, మైమరపిస్తాయి.

లండన్లోని ఒక టౌన్‌హాల్ ప్రారంభోత్సవం సందర్భంగా లార్డ్ బిర్కెన్ హెడ్ ప్రక్కనే వేల్స్ యువరాజు ఆశీనుడయ్యాడు. కొండవీటి చేంతాడులా నగర మేయర్ తన ప్రసంగాన్ని కొనసాగించడంతో లార్డ్ బిర్కెన్ చీటీమీద ఏదో వ్రాసి మేయర్‌కు పంపాడు. అంతే!

---

మనం నవ్వని రోజులన్నీ ఊరికే వృధా అయినట్లే. – ఆర్.ఎన్. ఛామ్ ఫోర్ట్

హఠాత్తుగా ఆయన ఉపన్యాసం ఆగిపోయింది. అది చూసి ఆశ్చర్యపోయిన యువరాజు లార్డ్‌ను చూసి నవ్వు ముఖంతో "బిర్కెన్! ఇంతకూ మీరు చీటీమీద ఏమని వ్రాసి పంపారు?" అని ప్రశ్నించాడు. "ఆ..... ఏంలేదు. 'మీ ప్యాంటు జిప్పు ఊడినట్లుంది. సరిచేసుకోండి' అని వ్రాశా" అన్నాడు లార్డ్!

బళ్ళారి రాఘవ సుప్రసిద్ధ రంగస్థల నటుడు. ఒక ప్రదర్శనలో చంద్రగుప్త నాటకంలో చాణక్యుడుగా రాఘవ నటిస్తున్నారు. ప్రేక్షకులతో హాలు క్రిక్కిరిసి ఉన్నది. అది శ్మశానవాటిక దృశ్యం. హఠాత్తుగా ఒక కుక్క వేదికమీదకొచ్చి అటుఇటు తిరగడంతో ఏమి చేయాలో తోచక నిర్వాహకులు నివ్వెరపోయారు.

రాఘవ గొప్ప నటుడే కాదు, మంచి చతురుడు కూడా. ఆయన కుక్కవైపు చూస్తూ "శునకమా వచ్చితివా! ఇటు రమ్ము. ఈ శ్మశానవాటిక నాదే కాదు, నీది కూడా" అనడంతో శ్మశాన వాటిక దృశ్యాన్ని కూడా నిర్వాహకులు ఎంతో ఆలోచనాత్మకంగా తీర్చిదిద్దారని ప్రేక్షకులు ఆశ్చర్య పోయారట. సందర్భోచిత హాస్యం అంటే ఇది!

రాచకొండ విశ్వనాధ శాస్త్రి గొప్ప నవలా రచయిత. ఆయనకు సామాజిక స్పృహ ఎక్కువ. 'కవి సామ్రాట్' విశ్వనాధ సత్యనారాయణ మహా పండితుడు, గొప్ప సంప్రదాయవాది. ఫలితంగా వారిద్దరూ ఉత్తర, దక్షిణ ధ్రువాలుగా వ్యవహరిస్తారు. అయితే, ఇద్దరూ హాస్యశీలురే. ఒక సమావేశంలో రాచకొండవారు "విశ్వనాధ సత్యనారాయణ గారికి నేనంటే వెర్రి అభిమానం" అనగానే ఆహుతులందరూ ఆశ్చర్యపోయారు. "నాపట్ల వారికి ఎంత అభిమానమంటే, నా పేరును ఆయన ఇంటి పేరుగా చేసుకున్నారు చూశారా?" అనడంతో అందరూ ఆయన సమయస్ఫూర్తికి హాయిగా నవ్వుకున్నారు.

హాస్యోక్తిని విసిరేవాడినే కాక, ప్రతివాదిని సైతం మనస్ఫూర్తిగా నవ్వించగలగడం సందర్భోచిత హాస్వం విశిష్టత.

## 9. ఛలం

వాదిని ఎదుర్కోడానికి ఏ యుక్తి  స్ఫురించనప్పుడు ఆయన ఉపయోగించిన పదాలలోనే ఏదో ఒక పదానికి లేదా మాటకు అర్థాంతరం కల్పించి హేళన చేసే ప్రక్రియను ఛలం అంటారు. ఇదొక రకమైన వెక్కిరింపు, పరిహాసం, దీనిలో చాలా చమత్కారం ఉంటుంది కనుక దీని ప్రయోగానికి కొంత నిశిత దృష్టి, మేధాసంపత్తి అవసరమవుతాయి.

---

ఒకరి ముఖం మీదికి నవ్వు తెప్పించేదే మంచి పని. – మహమ్మద్ ప్రవక్త

ఇరుగుపొరుగువారితో మంచిగా ఉండాలి" అని ఒకాయన అంటే, అయితే "ఇంటికి దూరంగా ఉన్నవారితో పోట్లాడవచ్చనేగా మీ అభిప్రాయం" అని వాదించడాన్ని ఛలవాదము అంటారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఐదు కోట్లమంది జనులు గ్రామవాసులు" అనడంతోనే మరొకాయన "అయ్యబాబోయ్ అదేం గ్రామమండి? ఐదు కోట్ల జనం ఉండే గ్రామం ఏమిటి?" అంటూ విస్తుపోయాడు.

ఒక వక్త ఒక ప్రసిద్ధ కళాశాలకు వెళ్ళి 'బుద్ధిహీనుడు' అనే అంశం పై తాను చాలా అధ్యయనం చేశానని, తన ప్రసంగాన్ని కళాశాలలో ఏర్పాటుచేయమని ప్రిన్సిపాల్ గారిని కోరాడు. అందుకు ప్రిన్సిపాల్ ఆమోదం తెలపడంతో సభ ప్రారంభమైంది. ప్రిన్సిపాల్ వక్తను పరిచయం చేస్తూ "నేటి వక్త రాజారావుగారు ఆపదాన్ని నొక్కుతూ బుద్ధిహీనుడు....అనే అంశం పై ప్రసంగిస్తారు. అన్నట్లు వీరు బుద్ధిహీనత పై ప్రత్యేక పరిశోధన గావించారు" అనడంతో విద్యార్థులు పెద్దగా నవ్వగా, వారితోపాటు ఆ వక్త కూడా హాయిగా నవ్వుకున్నాడు. తరువాత వక్త తన ప్రసంగం ప్రారంభిస్తూ "ప్రిన్ని పాల్ గారు గొప్ప సత్యాన్ని చెప్పారు. నేను ఈ రోజున బుద్ధిహీనులను (ప్రిన్సిపాల్ వైపు చూస్తూ 'బుద్ధిహీనులు' అనే పదాన్ని నొక్కి చెబుతూ) గురించే ప్రసంగించదలచాను" అన్నాడు. దాంతో ఒక విపరీత అర్థం ఏర్పడటంతో అందరూ ప్రిన్సిపాల్‌ను చూసి నవ్వారు. "మరొక విషయం . మీ ప్రిన్సిపాల్ గొప్ప మేధావి. బుద్ధిహీనుడు.... గురించి ఆయనకు తెలిసినంతగా నిజంగా నాకూ తెలియదేమో!" అనడంతో సభలో మరొక్కమారు నవ్వుల పువ్వులు విరిశాయి.

అర్జంటు పనిమీద హడావుడిగా అమెరికాలో కారును డ్రైవ్ చేస్తున్న అనురాధను పోలీస్ ఆపడంతో "నేను మరీ వేగంగా పోతున్నానా?" అని అడిగింది. "అబ్బే! లేదు మేడమ్. కొంచెం నెమ్మదిగా విమానం నడిపినట్లుగా పోతున్నారు" అంటూ ఒక టికెట్ ఇచ్చాడు ఆ పోలీస్.

ఒక పదాన్ని ఉచ్చరించే తీరు, విరిచే విధానం, వాక్యంలో ఎక్కడ ఆపితే ఒక పదం అర్థం మారుతుందో, అక్కడ ఆపడం వలన ధ్వనించే హాస్యాన్ని ఎగతాళి నవ్వు లేదా ఛలం అంటారు. నిజానికి సందర్భోచిత హాస్యానికి, ఛలానికి దగ్గర సంబంధం ఉంది. సందర్భోచిత హాస్యంలో ఎవరో విసిరిన హాస్యోక్తులకు సందర్భానుసారంగా హాస్యపూరిత సమాధానం ఇవ్వడం జరుగుతుంది. ఇక్కడ సమయస్ఫూర్తి, చమత్కారోక్తి, కీలకపాత్ర వహిస్తాయి.. ఇంక ఛలం నుండి పేరడీలోకి ప్రవేశిద్దాం.

---

ఇతరులను ఆహ్వానించడానికి అంతర్జాతీయ సంకేతం చిరునవ్వు. – సుసాన్ ఐజక్

## 10. పేరడి

చిత్రలేఖనానికి వ్యంగ్య చిత్రంలాంటిది వాఙ్మయానికి పేరడి. మూల రచనలోని శైలిని అనుకరిస్తూ, అవసరమైతే దానిని కొద్దిగా వృద్ధి చేస్తూ, అధిక్షేపం, హేళన, హాస్యాత్మకంగా పాఠకులను రంజింపజేయడం దీని ప్రధాన ఉద్దేశ్యం. అతి సామాన్య విషయాన్ని మహోదాత్తంగా మలచి కవ్వించడం దీని ప్రత్యేకత. గిలిగింతలు పెట్టడం, గిల్లడం, అవసరమైతే గిచ్చడం దీని లక్షణం. కేవలం అనుకరణ కనుక ఇక్కడ పరిపక్వతకన్నా వ్యంగ్యం, హాస్యం, వికటానుకరణ పద్ధతులలో ఒకదానిని లేదా రెండింటిని కలిపి ఇది పాటిస్తుంది. ధ్వని, పద, శైలి, వ్యస్థాశ్రమంము దలగు తొమ్మిది రకాలుగా పేరడి రచనలను విభజిస్తారు.

హాస్యం, విమర్శ కూడబలుక్కున్న సాహిత్యరూపం ఇది. ఆంగ్ల సాహిత్య ప్రభావం వలన లభించిన హాస్య ప్రక్రియ పేరడి. ఈ పదాన్ని ప్రథమంగా ప్రయోగించిన ఘనత అరిస్టాటిల్ కు, తెలుగు పేరడీకి ఒక సాహిత్య ప్రక్రియగా గుర్తింపు తెచ్చి పెట్టిన ఘనత జలసూత్రం, మాచిరాజు, దేవీ ప్రసాదులకు దక్కుతుంది.

ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం? అన్న శ్రీశ్రీ రచనకు దేవీ ప్రసాదు పేరడీ చూడండి.

| మాతృక | పేరడి |
|---|---|
| ఏ దేశ చరిత్ర చూచినా | ఏ రోడ్డు చరిత్ర చూచినా |
| ఏమున్నది గర్వకారణం? | ఏమున్నది గర్వకారణం? |
| నరజాతి చరిత్ర సమస్తం | రహదార్ల చరిత్ర సమస్తం |
| పరపీడన పరాయణత్వం | ధూళి ధూసర పరిస్యస్తం |

మాతృకలో ప్రశ్న, సమాధానంతో ప్రారంభమైనట్లే పేరడి కూడా ప్రారంభం అయింది. మాతృకలోని వాడి, వేడి, అదే వేగం, అదే తీవ్రత పేరడీలో కూడా చోటుచేసుకోవడం దీని ప్రత్యేకత.

జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి పేరడీ శాస్త్రిగా, సాహిత్య విదూషకునిగా, గొప్ప హాస్య చతురుడుగా కీర్తి గడించారు. నిజానికి ఆయన పేరులోనే హాస్యం కన్పిస్తుంది. "మీ ఇంటి పేరు (జలసూత్రం) తమాషాగా ఉందండి" అని ఎవరైనా అంటే, శాస్త్రిగారు నవ్వుతూ "H,0 సూత్రాన్ని మావాళ్ళే కని పెట్టారట. అందుకే మా ఇంటి పేరు అలా వచ్చింది" అంటారు. నీరు తయారుకావడానికి రెండుపాళ్ళు హైడ్రోజన్, ఒకపాలు ఆక్సిజన్ (H,O) కావాలన్నది సైన్స్

---

స్నేహితులను నవ్వించగలవాడే స్వర్గం చేరడానికి అర్హుడు. – ఖురాన్

ఫార్ములా (అదే 'జలసూత్రం' అన్నమాట). అంతేకాదు. "నా అసలు పేరు కృష్ణశాస్త్రి. కృష్ణశాస్త్రి అనకుండా మా నాన్న బెంగాలీలను పేరడీ చేసి నాకు రుక్మిణీనాధ శాస్త్రి అని పేరు పెట్టారు" అంటారు ఆయన. ఈ విధంగా ఇంటి పేరులోని, తన పేరులోని ప్రత్యేకతను హాస్యపూరితంగా వివరించారు జలసూత్రంవారు. ఇంక ఆయన పేరడి విందాం.

మల్లవరపు విశ్వేశ్వరరావుగారి 'మధుకీల' కావ్యానికి ముందుమాటలో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ఇలా వ్రాశారు.

జలసూత్రం చేసిన పేరడి

సుబ్బారావూ!

నువ్వింక క్షవరం చేయించుకోవాలయ్యా

నీ తల మాసిందయ్యా.

నేను ఎవ్వరితోటీ ఇట్లా అనను

విశ్వేశ్వరరావూ!

నీ రచనలన్నీ పుస్తక రూపంలో రావాలయ్యా

నువ్వు కవివయ్యా

నేను ఎవ్వరితోటీ ఇట్లా అనను,

విశ్వేశ్వరరావు నిజంగా కవి

చిలకమర్తి లక్ష్మీనరసింహం పంచాంగ ఫలితాలను హాస్యం, వ్యంగ్యంను కలుపుతూ ఎంత ప్రత్యేకరీతిలో వికటానుకరణం చేశారో చూడండి.

"ఈ సంవత్సరం చంద్ర గ్రహణము పున్నమినాడు రాత్రియందును, సూర్య గ్రహణము అమావాస్యనాటి పగటియందును పట్టుచుండును... గర్భిణీ స్త్రీలలో కొందరి కాడ శిశువులు, కొందరికి మగశిశువులు కలుగుదురు.... ఈ సంవత్సర ఫలము మిక్కిలి చిత్రమైనది. అదృష్ట హీనుల ..కోరిక నిష్ఫలము, అదృష్టవంతుల కోరిక సఫలము" అంటూ అతి సామాన్య సత్యాలను గంభీర విషయాలుగా మలచారు.

ఒక్కసారి సాహిత్యపుటలు తిప్పి పేరడి రచనకు తెలుగు రచయితలలో ప్రథముడు ఎవరో, దాని చరిత్ర ఏమిటో చూద్దాం. తెలుగులో అగ్రశ్రేణి రచయిత్రి ఆతుకూరి మొల్ల శ్రీకృష్ణ దేవరాయలును ఇలా కొనియాడింది.

అతడు గోపాలకుండితడు భూపాలకుం

డెలమినాతని కన్న నితడు ఘనుడు,

---

మానవ స్ఫూర్తి యొక్క ఉత్సవమే నవ్వు. – సబీనావైట్

..............................

..............................

కృష్ణుడాతండు శ్రీమహా కృష్ణుడితడు.

తెలుగులో తొలి వికట రచన కూచిమంచి జగ్గకవి (1700 - 1760) 'చంద్రలేఖా విలాపం' అని చెప్పినప్పటికీ, అసలైన పేరడీ కవి రామకృష్ణుడు అంటారు. ఈశ్వరునితో ఎద్దును పోలుస్తూ మొల్ల పద్యాన్ని రామకృష్ణుడు ఇలా అనుకరించాడు.

అతడంబకు మగండి తడమ్మకు మగండు
నెలమినాతని కన్న నితడు ఘనుడు
అతడు శూలము ద్రిప్పు నితడు వాలము ద్రిప్పు
..........................................
..........................................
దేవుడాతండు కుడితికి దేవుడితడు
పశుపతియతండు శ్రీమహా పశువితండు.

ఇంక వర్తమానంలోకి వద్దాం. మిమిక్రీ కళాకారుడు పది గొంతులను అనుకరించినట్లు, ఒకే అంశాన్ని తీసుకుని వివిధ రచయితలు ఎలా వ్రాస్తారో ఊహించి ప్రథమంగా గ్రంథస్థం చేసిన చమత్కార ప్రియుడు శ్రీరమణ'. అలానే, పేరడీలను సంకలనం చేసి ప్రచురించిన ఘనత కూడా ఆయనదే.

మరొక విషయం. "తలకట్టులు ఎంచడంలో శ్రీరమణ హాస్యచారిమ మరింత గుబాళిస్తుంది" అన్నారు శ్రీ ఇంద్రగంటి హనుమత్ శాస్త్రి. కారాగారు, టంగుటూరు ప్రహాస్యం, జాయింటుమెంటు, ప'తులు, మేకప్పులో తుఫాను ఇందుకు కొన్ని ఉదాహరణలు. ఇప్పుడు సినిమా పాటకు సంబంధించన ఒక పేరడీని చూద్దాం :

అల్లూరి సీతారామరాజు చిత్రంలోని 'తెలుగువీర లేవరా' పాటకు పేరడి ఇది.

తిండి వీర లేవరా
దండిగాను మింగరా
ఉదరపూజ సేవకొరకు
భోజనానికెళ్ళరా
దారుణ కాటక బాధకు
తల్లడిల్లవద్దురా

---

ఏడ్వగలిగినవాడే నవ్వగలడు. – టామీడి పహోలా

ప్రీతి లేని వంటకాలు
నేటి నుండి రద్దురా
ఆపవద్దు ఆగవద్దు
నింగి నీకు హద్దురా

ఇంక వివాహ విషయాలను ఎలా పేరడి చేస్తారో చూద్దాం. అప్పగింతల సమయంలో “అత్త మామలతో అణకువగా మసలుకో”. పాటకు పేరడి ఎంత అధునాతనంగా మలచబడిందో చూడండి.

నీ మాట వినబడ్డ నిమిషంబునందు
హడలి పోయేటట్లు అతని భయ పెట్టు.
పతి కోపపడినపుడు పడియుండబోక
అంతకు పదిరెట్లు అతని మర్ధించు.
ఇరుగుపొరుగు వారలేమైనా అంటే ఏడ్వక
వెయ్యిరెట్లు దుమ్మెత్తిపొయ్యి.
భర్తను వంచుకోగల భార్య గౌరవమెన్న
రారాజునకునైన రమణిలో లేదు.
ఇవి యెల్ల మరువక ఏమాత్ర మలయక
సుఖపడుచుండుమో సొగసు పూదీవ.

చీకోలు సుందరయ్య 'ఆకలి రాజ్యం'లోని "సాపాటు ఎటూలేదు పాటైనా పాడు బ్రదర్" కు చేసిన
పేరడి ఇది.

సాంబారు ఎటూ లేదు.
కోక్ అయినా తాగు బ్రదర్
బోస్టన్ నగరంలో పిజ్జా, బర్గర్
నీదీ నాదే బ్రదర్....
స్వతంత్ర దేశంలో పిజ్జా కూడా
పెసరట్టే బ్రదర్....
మన తల్లి మైక్రోసాఫ్ట్
మన అన్న పవర్ సాఫ్ట్

మన భూమి సిలికాన్ వ్యాలీరా
తమ్ముడూ
మన కీర్తి సాఫ్ట్ వేరురా - (వెబ్ సైట్ నుండి)

శ్రీ శ్రీ గేయం 'నేను సైతం'కు శ్రీ జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు (సినిమా కవి) చేసిన పేరడి.

నేను సైతం
తెల్లజుట్టుకు నల్లరంగును కొనుక్కొచ్చాను.
నేను సైతం
నల్లరంగును తెల్లజుట్టుకి రాసి దువ్వాను.
యింతచేసీ
యింతక్రితమే
తిరుపతయ్యకు జుట్టునిచ్చాను.

ఇదే గేయానికి జరూక్ శాస్త్రి పేరడి చూడండి.

నేను సైతం
కిళ్ళీ కోట్లో పాతబాకీ ఎగరగొట్టాను.
నేను సైతం
జనాభాలో సంఖ్యనొక్కటి వృద్ధి చేశాను.

మహాప్రస్థానంలోని అన్ని గీతాల కు పేరడీలు వ్రాసిన కాట్రగడ్డ దానికి మహోగ్రతాపం' అని పేరు పెట్టి శ్రీ శ్రీ కి అంకితం ఇచ్చారు.

భగవద్గీతకు పేరడీగా 'కలిగీత' రచించారు చిలకమర్తి. ఇప్పుడు భ.కా.రా. దండకరీతిలో దోమను దేవుడిలా ఎలా స్తుతించారో చూద్దాం.

ఓ మన్మహాదోమ, నీ కుట్టడం మండ నేనోడిపోయాను, నెగ్గింది నువ్వేను ఓ దోమరాజా యటంచుం నిన్నునే పెద్దచేతుం....నిన్ గూర్చి హారతుల్ వెల్లింతు....." ఇలా సాగుతుంది దోమదండకం.

రాయప్రోలు కవిత "ఏ దేశమేగినా ఎందుకాలిడిన ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన" పై పేరడి చూడండి. వ్యంగ్యం, హాస్యం, అధిక్షేపాలతో పాఠకులను ఆకట్టుకున్న రచన ఇది.

ఏ కాలేజీ కేగినా ఎందుకాలిడిన
ఏ మేష్టరొచ్చినా ఎవ్వరేమనిన

చెయ్యరా అల్లరి నిర్భయముగాను
నిలుపరా నీ జాతి వారసత్వమును
ఏ పూర్వపాపమో, ఏ రోగబలమో
జనియించినాడవీ విద్యార్థిగాను
ఏ మంచి పూవులన్ త్రుంచేసినావో
నినుమోచె వాగ్దేవి దుఃఖభారమున
లేరురా నీ వంటి విద్యార్థి లింకెందు' - ఎస్.వి.సత్యనారాయణ

ఈ విధంగా అనుకరణను అధిక్షేపంతో, అభినందనను అభిశంసనతో మేళవిస్తూ వినోదమే గమ్యంగా, చమత్కారమే ఊపిరిగా మలచుకొని మూలరచనను వెటకరిస్తూ అనుకరించేది పేరడి రచన.

## 11. అర్థరాహిత్యం (Nonsense)

ఒకరోజు ప్రఖ్యాత ఆంగ్లకవి వర్డ్స్‌వర్త్, ఆయన మిత్రుడు కలసి ఒక ప్రసంగ కార్యక్రమానికి వెళ్ళారు. ఆనాటి వక్త ప్రముఖ తత్వవేత్త కూలరిడ్జ్. ప్రసంగం తరువాత వర్డ్స్‌వర్త్ మిత్రుడు "నేను కూలరిడ్జ్ అద్భుత ప్రసంగాన్ని విని ఆశ్చర్యపోయాను. అయితే, ఆయన ఉపన్యాసంలోని చివరి భాగం నాకు అర్థం కాలేదు" అన్నాడు.

వర్డ్స్ వర్త్ : ఆయన ప్రసంగం నాకు అసలే అర్థం కాలేదు.
ఆయన మిత్రుడు : నాకూ అంతే..

భార్యాభర్తలు. ఒకనాడు భోజనం చేస్తుండగా, కరెంటు పోవడంతో కొవ్వొత్తి వెలిగించి భోజనం చేస్తున్నారు. భార్యకు చెమటలు పట్టడం చూసిన రాము "రాధీ! నువ్వు చెమటతో తడిసిపోతున్నట్లున్నావ్. ఫ్యాన్ వెయ్యనా?" అన్నాడు గోముగా.

రాధిక : మీ ఉద్దేశ్యం ఏమిటి? నేను చీకట్లో భోంచేయాలనా?
రాము : అలా ఎందుకు అనుకుంటున్నావు?
రాధిక : మీకు ప్రతిదీ అనుమానమే. అనుమానం ముందు పుట్టి, ఆ తరువాత మీరు పుట్టినట్లున్నారు. ఫ్యాన్ వేస్తే కొవ్వొత్తి ఆరిపోదా? అంది కోపంగా...

ఎడ్వర్డ్ లియర్‌ను వివేక హీనతకు మూలపురుషునిగా (Father of Nonsense) పేర్కొంటారు. ఆయన రచించిన గ్రంథం పేరు ' Book of Nonsense.' అందులోని ఒక పద్యం పద సౌందర్యంతో వినసొంపుగా, అందంగా నడుస్తుంది. అయితే, అర్థరాహిత్యం దాని ప్రత్యేకత.

---

మంచి నవ్వు ఇంటిలో సూర్యరశ్మి లాంటిది. – విలియం హేకరీ

దాని అర్థం ఇది.

A flea and a fly in a flue ఒక మిన్నల్లి, ఒక ఈగ
were imprisoned, so what చిక్కాయి వలలో
could they do? అవేమి చేయగలవు?
said the fiealetus fly మిన్నల్లి అంటుంది ఎగురుదాం అని
said the fly let us flee ఈగ అంటుంది పారిపోదాం అని
so they flew through a flaw in the flue ఓ రంధ్రం గుండా ఎగిరిపోయాయి.

created so much of happiness. But died miserably ఆనందించాయి అవి ఎంతో..కాని..ఆ తర్వాత through epilepsy మూర్ఛతో నికృష్టంగా మరణించామ

జీవితం గురించి, జీవితంలోని ప్రతి అంశం గురించి ఆదర్శంగా ఆలోచించడం సబబు కాదు. జీవితంలోని అర్థరాహిత్యాన్ని గురించి తెలుసుకోవడం, ఆనందించడం కూడా ఎంతైనా అవసరం. అయితే, అతిగా వాచ్యార్థాలను తీసుకోవడం కూడా చిలిపిగా కన్పిస్తుంది.

సృష్టిలో ఒక్కొక్కరికి ఒక్కొక్క ఉన్మాదం, వ్యసనం ఉంటుంది. అది ఎక్కువైనప్పు డు 'అతి' అంటాము. ఆ లక్షణాలే మనిషి ప్రవర్తనను, ఆతని సామాజిక సంబంధాలను తీర్చిదిద్దుతాయని తెలుసుకున్నప్పుడు కత్తులు నూరే చూపులతో, విషం కక్కే డైలాగ్ తో అంతగా అవసరం ఉండదు. ఈ విధంగా అర్థరాహిత్యం మన ఆలోచనాసరళిని మారుస్తుంది. మనలో నూతన దృక్పథాన్ని కలిగిస్తుంది. (My Day by Victoria Roberts)

భట్టిగారి గంభీర వ్యాపారం : ఆయన పేరు జస్పాల్ భట్టి. భారతదేశపు నవ్వులరాజు ఆయన. సాధారణ మానవ జీవితాన్ని ఒక అసాధారణ, వినూత్న కోణం నుండి వ్యంగ్య చిత్రకారుడిలా అతను తిలకిస్తారు. విషయాన్ని క్లుప్తంగా హోమియో మాత్రలాగా తియ్యతియ్యగా అందిస్తూ నవ్వించడంలో దిట్ట ఆయన. పత్రికలు, టి.వి. రంగాల నుండి క్రమంగా కార్టూన్ల రంగంలోకి ప్రవేశించి వాటికి ఉల్టా పుల్టా, ఫ్లాప్ షో (పనికిమాలిన ప్రదర్శన) అని పేర్లు పెట్టారు. అర్థరాహిత్యం నుండి అర్థం లభిస్తుందని ఆయన ఉవాచ. అందుకే ఆయన అర్థరాహిత్య లేదా అర్థశూన్య క్లబ్‌లను (Nonsense Club) నెలకొల్పారు. ప్రతి ప్రదర్శనలో కొసమెరుపుగా ఒక సందేశాన్ని అందించడం ఆ క్లబ్ ఉద్దేశ్యం. ముందు నవ్వించడం, ఆ తరువాత ఆలోచింపజేయడమేకదా హాస్యం ప్రత్యేకత!

---

నేను ఎవరిని చూసైనా నవ్వేది ఏడవలేకనే. – లార్డ్ బైరన్

వరకట్న చావులను అరికట్టలేకపోతే ఎంచక్కా కట్నం చావు దినాన్ని ఒక ఉత్సవం లా, ఒక పండుగలా జరుపుకుందాం అంటారు జస్పాల్ భట్టి. అవి కేవలం నినాదాలు కావు. అవి రంపపుకోతలు; నిశిత వ్యంగ్యంతో పదును పెట్టబడిన అస్త్రాలు; సమాజం పై సంధించిన శస్త్రాలు. అందుకే అంటారు జస్పాల్ భట్టి "హాస్యం ఒక గంభీర వ్యాపారం" అని.

చమత్కార నాయకుడు ముళ్ళపూడి వెంకట రమణగారికి డబ్బు అవసరమై ఒక మిత్రునికి ఫోన్ చేసి "నాకు డబ్బు కావాలి" అన్నారు. ఆ మిత్రుడు "ఎప్పటికి కావాలో చెబితే పంపుతాను" అంటే, వెంటనే ముళ్ళపూడి వారు "మొన్నటికి" అన్నారట!

అలానే మరొక ప్రబుద్ధుడికి నెత్తిమీద చిన్న గాయమైంది. దానిని గురించి ఒక మిత్రునితో వర్ణిస్తుంటే, అతను "నీ తల పైన గాయం నీకెలా కన్పించిందిరా?" అని ప్రశ్నించాడు. "కుర్చీ ఎక్కి చూశాలేవోయ్. చెప్పేది విను" అన్నాడు ఆ బాధితుడు.

ఇలాంటి వివేకహీన హాస్యోక్తులలో కొన్ని సందర్భాలలో అమాయకత్వం, మరికొన్ని సందర్భాలలో చమత్కారం కన్పిస్తుందని మనం మరచిపోకూడదు.

ప్రఖ్యాత నటి హెలెన్ వివరించిన ఒక 'అర్థరహిత' ఉదంతం ఇది. భోజనాన్ని తయారు చేస్తూ ఆమె తన కుటుంబ సభ్యులకు చేసిన హెచ్చరిక ఇది: "కోడికూర చేయడం నాకిదే మొదలు. అది బాగా లేకపోతే ఎవ్వరూ గొణగకూడదు. నిశ్శబ్దంగా డైనింగ్ టేబుల్ వద్దనుండి లేవండి. హోటల్‌కు వెళ్ళి కడుపునిండా తినిరండి". 15 నిమిషాల తరువాత ఆమె వంటకాలతో హాలులోకి వచ్చేటప్పటికి డైనింగ్ టేబుల్ చుట్టూ అందరూ కూర్చొని ఉన్నారు - సూటు, బూటు ధరించి బయటకు వెళ్ళడానికి సిద్ధంగా!

"ఏరా రామయ్య! గుండు కొట్టించావు. తిరుపతి వెళ్ళావా ఏంటి?" అని ప్రశ్నించాడు సుబ్బయ్య.

"మా నాన్న పోయాడు" బాధగా అన్నాడు రామయ్య.

"భలేవాడివిరా! మీ నాన్న తిరుపతి పోయివస్తే నువ్వు గుండు కొట్టించుకోవడం ఏమిటి? బాధపడటమేమిటి?" రెట్టించాడు సుబ్బయ్య. ఇక్కడ అర్థరాహిత్యంలో అర్థసంవృత్తం ఇమిడివుంది.

ఈ విధంగా అర్థరహితమైనవి కొన్ని సందర్భాలలో అర్థవంతంగా, ఆనందమయంగా మాఢతాయి. జీవితం అన్న తర్వాత ఏవో సమస్యలుంటాయి. ఆ సమస్యల సుడిగుండం లో పడి కొట్టుకుపోకుండా, ఆ సుడిగుండాన్నే నవ్వుల గుండంగా మార్చుకోగలగాలి. సమస్యలతో మనం ఆడుకోవడం నేర్చుకోవాలేగాని, సమస్యలు మనతో

---

ఈదేశంలో తిరుగుబాటు చేయటానికి మిగిలిన ఒకే ఒక్క రూపం నవ్వు. – లేరీ క్లీన్

ఆడుకోడానికి అవకాశం కల్పించకూడదు. ఆవిధంగా మనం నవ్వుతూ, ఇతరులను నవ్వించగలగడం లోనే జీవన సౌందర్యం ఇమిడివుంది.

ఇప్పుడు ఉల్లాస ప్రేరకం కథాకమామీషు గురించి తెలుసుకుందాం.

## 12. ఉల్లాస ప్రేరకం

హైటెక్ బస్ మాంచి వేగంగా పోతుంది. అలసిపోయిన డ్రైవర్ బండిని ఆపి అలా వెళ్ళి టీ త్రాగి వచ్చాడు. తిరిగి వచ్చేసరికి ఆయనకు గేర్ రాడ్ కన్పించలా. గేర్ రాడ్ ఏమైంది? కండక్టర్, డ్రైవర్ అర్థంకాక అటుఇటు తిరగసాగారు. ఈ హడావుడిని చూసిన ఓ పాసింజర్ ఫకాలున నవ్వి, “ఏం డైవరూ! బస్సెక్కినప్పణ్ణించి చూత్తన్నా. ఆ పుల్లను పట్టుకొని అటూ ఇటూ తిప్పుతూనే ఉన్నావు. దాన్ని విరగొట్టాలని ముందుకి,-- వెనక్కి, పక్కకి లాగుతూ కట్టపడ్డావు. నీకు ఎల్పుచేద్దామని నువ్వు దిగిన తర్వాత దాన్నిరగొట్టి నీ సీటు కిందనే పెట్టా. మీకు నేను సాయం జేత్తే అంత కంగారు పడుతున్నా రేంటి?” అన్నాడు అమాయకంగా.

ఇదొక ఉల్లాస ప్రేరకం, హాస్యస్పోరకం, సరసమైన ఎగతాళి. దీనినొక మేధావుల ఆటగా స్వీకరిస్తే అదే చమత్కారం అవుతుంది. అలాగాక దీనినొక ఆయుధంగా రూపొందిస్తే అది వ్యంగ్యం అవుతుంది. అసంగత్వం లేదా అసంబద్ధత దీని ప్రధాన లక్షణం. పీటర్ ఎల్.బెర్గర్ అనేక శాస్త్రాలను అధ్యయనం చేసి "అసంబద్ధత దీని ప్రధాన లక్షణం. క్రమబద్ధతకు సంబంధించినంతవరకు మానవులు ఉల్లాస ప్రేరక అసందర్భ(Comic Discrepancy) స్థితిలో ఉన్నార”టారు. ఆంగ్లంలో దీనిని కామిక్ (Comic) అంటారు.

పాశ్చాత్య ఏకోపాసన విధానం ఒక విచిత్ర సంప్రదాయాన్ని పవిత్ర అవివేకమును (Holy bolly) ప్రవేశపెట్టింది. “హిజయా దేవదూత 3 సంవత్సరాలు దిగంబరిగా సంచరించగా, క్రీస్తు కొరకు మేమందరం అవివేకులమైనాం” అన్నారు సెయింట్ పాల్. అందువల్లనే మానవుని ఉల్లాస ప్రేరక అనుభూతులలో కొన్ని విచిత్రాలు కన్పిస్తాయి. మన పరిమితులను అధిగమించి సుఖాంతమైన కథలను, సంఘటనలను విన్నప్పుడు మనకు ఎంతో ఆనందంగా ఉంటుంది.

భీముడు రైలెక్కాడు. ప్రక్కన కూర్చున్న ప్రయాణీకుణ్ణి "అయ్యా! నిద్రపోతే నాకింక మెలకువ రాదు. దయచేసి నన్ను విజయవాడ వద్ద లేపుతారా?” అని వినయంగా అడిగాడు. అది విన్న శాంతయ్య "అయ్యా! ప్రయాణంలో నాకు నిద్రపట్టదు. నేను లేపుతాలే. నిశ్చింతగా పడుకో" అని అభయమివ్వడంతో భీముడు సంతోషించాడు. శాంతయ్య చేతిలో 10

---

విరగబడి నవ్విన వ్యక్తి కూడా దుర్మార్గుడు కావచ్చు. – షేక్ స్పియర్

రూపాయలు పెట్టి “మీకు నిద్రవస్తే టీ త్రాగండి...... నన్ను మాత్రం విజయవాడ వద్ద నిద్రలేపండి. ఒకవేళ మీరు లేపినా నేను లేవకపోతే....అవసరమైతే నన్ను బయటకు తోసెయ్యండి” అని చెబుతూ నిద్రపోయాడు భీముడు. రైలు నెల్లూరు దాటి చెన్నై చేరేటప్పటికి భళ్ళున తెల్లారింది. అందరూ రైలు దిగుతుండగా అపర కుంభకర్ణుడికి ఎలానో మెలకువ వచ్చింది. చెన్నై అన్న బోర్డు కనబడటంతో అతని గుండె గుభేలుమంది. రైలు దిగబోతున్న శాంతయ్యతో “విజయవాడ వద్ద నిద్రలేపుతానన్నావుకదా! “బద్మాష్....నీకు టీ త్రాగడానికి 10 రూపాయలు కూడా ఇచ్చానుకదరా.... నన్నెందుకు లేపలేదురా” అంటూ చేయిచేసుకున్నాడు. బిక్కుబిక్కుమంటున్న శాంతయ్య “అయ్యా పొరపాటైంది. విజయవాడ వద్ద నిద్రపోయే ఒక పాసింజర్‌ను గట్టిగా లేపాను. నేనింకా చాలాదూరం పోవాలి' అని అతను అరుస్తున్నా, ఆయన మీరే అనుకొని క్రిందకు తోసేశానండి. పొరపాటైంది బాబూ” అంటూ భీముడి చేతులు పట్టుకున్నాడు!

అంటూ ఒకప్రక్క రాగాలాపన గావిస్తూనే, మరో ప్రక్క ఇదే శాశ్వతం అన్న రీతిలో సంపద, అధికారం, కీర్తి ప్రతిష్ఠల కోసం కుయుక్తులు, కుతంత్రాలు పన్నడం చూస్తుంటే ఈ జగత్తే ఒక ఉల్లాస ప్రేరకంగా, ఒక అద్భుత హాస్య నిలయంగా కన్పిస్తుంది! ఇంక విరోధాభాసం గురించి తెలుసుకుందామా?

## 13. విరోధాభాసం

వాస్తవంగా గట్టి పునాదిగలదైనప్పటికీ పైకి మాత్రం అర్థంలేని లేదా పరస్పర విరుద్ధంగా కన్పించే ప్రకటనను విరోధాభాసం అంటారు. అసంగత వాక్యంగా, పరస్పర విరుద్ధం, నమ్మశక్యం కాని, అర్థరహితం, అసత్యంగా కన్పించే ప్రకటనలు కుప్పించినప్పటికీ అవి యదార్థం కావడంలో విరోధాభాసం ప్రత్యేకత కన్పిస్తుంది. ఆ ప్రకటనలు మన తార్కిక ప్రపంచంలోని ఊహల భగ్నతకు రంగులద్దుతూ మన ఆనందానికి, దిగ్భ్రాంతికి మూలంగా నిలుస్తాయి. ఇంక వివరాలలోకి పోదాం..

గ్రీకు తత్వవేత్తలు విరోధాభాసంతో కుస్తీలు పట్టారు. గ్రీసులో క్రిటన్ ఒక దీవి. ఆ దీవికి చెందిన ఎపిమెండస్ గొప్ప తాత్వికుడు. "క్రీటానులందరూ అబద్ధపుకోరులు” అన్నాడు ఆయన. ఈ ప్రకటన ప్రకారం ఆయన అబద్ధాలకోరు. ఆయన అబద్ధాలకోరు అయితేనే ఆ ప్రకటన యదార్థమవుతుంది. ఆ ప్రకటన యదార్థమైతే అతను అబద్ధాలకోరు కాడు కదా! ఈ విధంగా అదొక చిక్కు ప్రశ్న అవుతుంది! అలానే, యూదుల శాపం ఇలా నడుస్తుంది:

---

హాస్యం చాలా గంభీరమైంది. – విన్ స్టన్ చర్చిల్

"ఎలాగైనాసరే అతన్ని వధించాలి. దేవుడు దానిని నిషేధించుగాక!" ఇలాంటిదే మరొకటి చూద్దాం!

ఈ క్రింది వాక్యం సత్యం కాదు.

పైన పేర్కొన్న వాక్యం యదార్థం.

పారిశ్రామిక విప్లవం, నుండి మొదటి ప్రపంచయుద్ధ కాలం వరకు విరోధాభాసం పై ప్రజలు ఎక్కువ మక్కువ చూపారు. ఒక కవి దానిపై ఒక ప్రత్యేక రచన కూడా చేశాడు. దీని మార్గాలు ఎంత అనూహ్యంగా ఉంటాయో, లోకజ్ఞానాన్ని అది ఎంతగా అపహాస్యం చేస్తుందో లెవిస్ కారల్ ద్వారా తెలుసుకుందాం.

కొన్ని సమయాలలో అల్పాహార విందుకు ముందు కనీసం ఆరు అసాధ్య విషయాలను నేను విశ్వసించాను.

ఈ రోజును అణచిపెట్టు, నిన్నను అణచిపెట్టు. అయితే ఎప్పుడూ ఈ రోజును మాత్రం అణచకు.

చూడు! నువ్వున్నచోటనే నిలబడాలంటే నీ శక్తి కొలది పరుగెత్తాలి. మరొకచోటకు వెళ్ళాలంటే దానికన్నా రెట్టింపు వేగంగా పరుగెత్తాలి.

నిజానికి ఇవి పద క్రీడలు కావు. తత్వ, తర్క శాస్త్రాల అన్వేషణ ఇది. యదార్థ ప్రపంచంలోని పరిస్థితులను, నిరాశలను స్వీకరించే శాబ్దిక మార్గం ఇది. ఈ అలంకారాన్ని ఊహలు, కల్పనలలోకి ప్రవేశపెడితే చిత్రాతిచిత్రమైన ఫలితాలు వస్తాయి. ఉదాహరణకు 'తాతగారి అసత్యాభాసం' తీసుకుందాం : ఇక్కడ కాలం (Time) లో ప్రయాణించగల ఒక యాత్రికుడు కాలం వెనుకకు పరుగెత్తుతూ, తన తండ్రి జన్మించకముందే తన తాతను వధిస్తాడు. ఇదొక చిక్కు ప్రశ్న. తాత ముందుగానే మరణిస్తే తండ్రి ఎలా జన్మిస్తాడు? ఆయన జన్మించకనేపోతే కాలానికి ఎదురీది హత్య ఎలా చేస్తాడు?

ఇలాంటి వాక్యాలు ఆంగ్ల సాహిత్యంలో ఎన్నో కన్పిస్తాయి. ఉదాహరణ : మనం ఒకరినొకరు ద్వేషించుకోడానికి అవసరమైనంత మతం ఉంది కాని, పరస్పరం ప్రేమించుకోడానికి అవసరమైనంత మతం లేదు. (జొనాథన్ స్విఫ్ట్)

దానికి ఏ సమాధానం లేదు. దానికి ఏ సమాధానం ఉండబోదు. ఎప్పుడూ దానికి సమాధానం లేదు. అదే దాని సమాధానం. (టూడ్ సైన్),

నేను ఎదిగిన తరువాత బాలునిగా ఉండదలచాను. (సఫ్ హెల్లర్ )

నువ్విక్కడ లేకుంటే దయచేసి చెయ్యెత్తు. (కల్లీ డెకాస్)

---

నీవు పొందవలసింది పొందలేనప్పుడు వచ్చే నవ్వే హాస్యం. – లాంగ్ స్టమ్ హ్యూగ్స్

మొదటి జేమ్స్ ప్రభువు అత్యంత వివేకంగల అవివేకి.

శాంతి కావాలంటే యుద్ధం చేయవలసిందే.

చెవులు పగిలే నిశ్శబ్దం.

ఒంటరి సమూహం.

తెల్లని చీకటి.

హిమజ్వాల.

జంతువులన్నీ సమానమే - అయితే వాటిల్లో కొన్ని మరింత సమానం' అన్న జార్జి ఆర్వెల్ మాటలు విరోధాభాసకు మచ్చుతునక. బృహదారణ్యకోపనిషత్, ముండకోపనిషత్‌లు, ఈ అలంకారాన్ని సమర్ధవంతంగా వాడుకోవడం గమనార్హం.

మా మిత్రుడు ఆంజనేయులు పద ప్రయోగాలలో ఒకటి సుందర ముదరష్టం. ఇవి పరస్పర విరుద్ధమైన భావాలను వ్యక్తపరచే పదాలు. ఉప్పు, నిప్పు ఇక్కడ కూడా అలాంటి వైరుధ్యమే కన్పిస్తుంది. అయితే, జాగ్రత్తగా యోచిస్తే అందులో గొప్ప అర్థం, కొన్ని సందర్భాలలో పరమార్థం గోచరిస్తుంది.

## 14. నిరుత్సాహోక్తి

ప్రతిదీ నిర్లిప్తంగా, నిర్వికారంగా, నిరసనభావంతో మాట్లాడటం నిరుత్సాహోక్తి తత్వం. ఇది ఆశ్చర్యోక్తికి ప్రత్యర్థి. మనిషి మెదడులో 1200 కోట్ల సెల్స్ ఉన్నాయని డా|| రామమోహన్ చెబుతుంటే, ప్రక్కనే కూర్చున్న సూర్యారావు "అవునండి.... !1200 కోట్లు ఉంటే ఏమిటి? 12 వేల కోట్లు ఉంటే ఏమిటి? దానిపని అది చేసుకోడానికి కావలసినన్ని సెల్స్ ఉండాలికదా! అయినా, అదేమి పనికిమాలిన బ్రెయినండి? అన్ని వేల కోట్ల సెల్స్ ఉంటే కాని అది పనిచేయదా ఏమిటి? దైవం అలాంటిదానిని మనలో ఎందుకు పెట్టాడట!" అని సందేహాల వర్షం కురిపిస్తుంటే నిస్సహాయంగా చూడటం రామమోహన్ వంతైంది.

ఇలాంటి మహనీయుడితో ఒకాయన "టెన్సింగ్ ఎవరెస్ట్ శిఖరం ఎక్కాడట!" అని ఆనందంగా చెబుతూ, రెండు స్వీట్స్ అతని చేతిలో పెట్టాడు. స్వీట్స్ గుటుక్కున మింగేసిన ఆ ప్రబుద్ధుడు "టెన్సింగ్ ఆ శిఖరాన్ని ఎక్కాడే అనుకో..... ఆయన మరల దిగుతాడు కదా! మనిషైనవాడు ఏదో ఒకదానిని ఎక్కుతూ, దిగుతూనే ఉంటాడు. నాకు తెలియక అడుగుతా....దిగేవాడు అసలు ఎక్కడం ఎందుకయ్యా? అదొక పిచ్చా లేక మదమా?" అంటూ తలబాదుకున్నాడట!

---

యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనలకు మించిన హాస్యం ఉండబోదు. – స్టీవే ఎలెన్

## 15. శ్లేష (Pun)

ఒకే పదానికి హాస్యపూరితంగా అనేక అర్థాలు స్ఫురించేటట్లు చేసే చమత్కార పద ప్రయోగం లేదా ఒకే శబ్దంతో పలికినప్పటికీ భిన్న అర్థాలుగల పదాలను ప్రయోగించడాన్ని శ్లేషపూరిత హాస్యం అంటారు ఒకే పదాన్ని, పద బంధాన్ని వ్యాఖ్యానిస్తూనే మనస్సు కనీసం రెండు భిన్న మార్గాలలో పయనించాలి కనుక శ్లేష మూలంగా మనలో ఆనందంతో పాటు ఆశ్చర్యం కూడా కలుగుతుంది. ఇదొక రకమైన పదకేళి, శబ్ద క్రీడ. మనస్సులో ఒక పదం ఉన్నప్పటికీ, మాటల్లో మరొక పదాన్ని వాడటం దీని ప్రత్యేకత. ఆంగ్లంలో దీనిని పన్ అంటారు. ఇది ఇటలీ భాషలోని పన్ టిగ్లియో (సుకుమార బిందువు) నుండి ఉద్భవించింది. అదే ధ్వని కలిగిన మరొక పదాన్ని లేదా ఒకే పదాన్ని హాస్యధోర ణిలో రెండు మూడు అర్థాలు వచ్చే విధంగా ఉపయోగించడాన్ని శ్లేష అంటారు. అందుకే దీనిని ఉభయాలంకారముగా పరిగణించారు.

ఇప్పుడు కొన్ని ఉదాహరణలు చూద్దాం.

రావూరు వెంకట సత్యనారాయణ గొప్ప హాస్య రచయిత. ఆయన ఒకసారి “చంద్రమతి, ఇందుమతి, భానుమతి ఉన్నారా?” అని ఒక ఇంటాయనను అడిగారు. దానికి ఆ పెద్దమనిషి “ఆడవాళ్ళా?” అన్నాడు ఆశ్చర్యంగా. దానికి రావూరు పగలబడి నవ్వుతూ “ఆడవాళ్ళకు కాక, మగవాళ్ళకు మతి' ఎందుకు ఉంటుందయ్యా!” అన్నారు చమత్కా రంగా. ('మతి' అని పేరు చివర ఒక అర్థంలో, మెదడు' అని మరొక అర్థంలో ప్రయోగం ఇది. ఇందులో అర్థ శ్లేష ఉంది.

చమత్కారాలతో చురకలు వేయవచ్చు. ఇదొక ప్రజ్ఞ. దీనికి భాషా పాండిత్యంతో బాటు మానవ స్వభావాన్ని పరిశీలించగల నైపుణ్యం, దానిని ప్రత్యేక తరహాలో వెల్లడించ గల నేర్పు కూడా కావాలి. ఇలాంటిచోట శ్లేష హాస్యాన్ని పండిస్తుంది. సమయస్ఫూర్తిని చాటుతుంది. విద్వత్తును తెలుపుతుంది. ఈ రంగంలో శ్రీశ్రీ తనదైన శైలిని అరుదైన రీతిలో ప్రదర్శించారు. కాకినాడలో తనకు జరిగే సన్మాన సభలో ఆయన ప్రసంగిస్తూ “నన్ను మొట్టమొదట 'అచ్చేసి' దేశం మీదకు వదిలింది పురిపండా” అనడంతోనే సభ నవ్వులలో మునిగిపోయింది. శ్రీ శ్రీ రచించిన మొదటి కావ్యం పేరు 'ప్రభవ'. పురిపండా అప్పలస్వామి ఆ కావ్యాన్ని ముద్రించి రాష్ట్రం నలుమూలలా పంపిణీ చేశారని తెలుసు కున్నప్పుడు శ్రీ శ్రీ మాటలలోని ఆంతర్యం అర్థమవుతుంది. "సృష్టిలో తీయనిది ఏది?" అని శ్రీశ్రీని ప్రశ్నిస్తే, “తీయనిదేదీ లేదు. అన్నీ తీసినవే" అన్నారు ఆయన.భార్యాభర్తల మధ్య సంభాషణ.

మునిమాణిక్యం : అసలు నేను తెలివితక్కువవాణ్ణని నీ అనుమానమా? (అంటాడు పెద్దగా)
కాంతం : నాకు అనుమానం ఏమిటండీ? అనుమానం లేనేలేదు! (అంటూ పకపకా నవ్వింది)

కవి తిమ్మన ఊయలలో కూర్చుండగా, అల్లరి రామకృష్ణుడు చేరి "తాతా ఊతునా" అన్నాడు. "సరే మనవడా" అని తిమ్మన అన్నాడో లేదో తుపుక్కున ఊశాడు రామకృష్ణుడు. ఇదొకరకమైన అసభ్య శ్లేష.

మాటలతో నవ్వించాలి, కవ్వించాలేకాని చేతలతో బాధించడం తగదు. ఈ విధంగా శ్లేష పదాలతో ఆడుకుంటుంది. అయితే, ఇది జన సామాన్యానికి అందుబాటులో ఉండే హాస్యోక్తి కాదు కనుక ఇంక లిఖిత హాస్యంలోకి పోదాం.

## 16. లిఖిత హాస్యం

హాస్యోక్తులు రెండు రకాలు. అవి ఎ.) లిఖితంగా బి.) లేదా శాబ్దికంగా ఉంటాయి. లిఖిత హాస్యోక్తులు రెండు రకాలు.

1. గల్పిక / కట్టుకథ: పరిసరాలు, పరిస్థితితో సంబంధం లేకుండా ఎక్కడ ఎవ్వరు చెప్పినా దీనిని హాయిగా ఆనందించవచ్చు. వెంగలావు తన మిత్రుడు శరత్‌తో కలసి అడవికి వ్యాహ్యాళికి వెళ్ళాడు. శరత్ ఓ సింహాన్ని చూసి దాని మీదకో రాయి విసరడంతో అది గర్జిస్తూ అతని మీదకు దూకబోతుండగా, "చెట్టెక్కు త్వరగా" అన్నాడు శరత్ వెంగళ్రావుతో. "నేనెందుకు ఎక్కాలి? రాయి విసిరింది నువ్వు కాబట్టి, అది నీమీదకే వస్తోంది. కనుక నువ్వే చెట్టెక్కు" బదులిచ్చాడు వెంగళ్రావు! .

2. పరిసరాల హాస్యం : ఇక్కడ స్థలం - దాని పరిస్థితులతో కూడిన పరిసరాల సముదాయం ముందుగా మనకు అర్థమవ్వాలి. డాక్టర్ భార్య హాస్యోక్తిని తీసుకుందాం. మొదటి భాగంలో వివరణ సహజంగా ఉంటుంది. కొసమెరుపువద్ద అది చిత్రంగా మలుపు తిరుగుతుంది. "డాక్టర్ గారు ఉన్నారా?" అని రోగి దగ్గుతూ హీనస్వరంతో ప్రశ్నించడం అతను వైద్య సలహా కోసం వచ్చాడని చెప్పకనే చెబుతుంది. అయితే రెండవ వాక్యంలో "లేరు......లోనికి రండి"అని యవ్వనవతి, రూపవతి అయిన డాక్టర్ గారి భార్య గుసగుసలాడినట్లుగా అన్న మాటలలో మొదటిదానికి విరుద్ధమైన ప్రణయ భాష కన్పిస్తుంది. నిజానికి ఇక్కడ ఉపయోగించబడిన రెండు పదాలు 'యవ్వనవతి,... రూపవతి'... ఈ ఉదంతం స్వరూపాన్నే మార్చివేశాయి. అంత అందమైన వైద్యుని

---

హాస్యానికి చక్కని ఆలోచన, పటిష్టమైన ప్రేమ అవసరం. – జెర్రీ అండ్ హెలెన్విస్

భార్యకు దగ్గుతూ, హీన స్వరంతో బాధపడుతున్న రోగి పైన మనస్సుపడిందా? ఇదొక అవిశ్వసనీయత. సగటు పాఠకునికి సెక్సు పైగల మోజు, హాస్యాభిమానులకు కొసమెరు పుల పై ఉండే వ్యామోహం ఆ ఉదంతం రూపాన్నే మార్చి అందమైన హాస్యోక్తిగా మలచాయి! ఇంక శాబ్దిక హాస్యంలోకి వద్దాం.

బి. శాబ్దిక హాస్యం సృష్టించబడని, వర్ణించబడని, వ్యక్తపరచబడని హాస్యం, పదాలు, ప్రసంగాలతో అవసరం లేని శాబ్దిక, అలిఖిత హాస్యం ఇది హాస్యోక్తి సంప్రదాయబద్ధంగా, స్వాభావికంగా శాబ్దిక శైలి కలిగి ఉంటుందని మనకు తెలిసిందే. కొన్నిచోట్ల దానికి రంగాలంకరణ కూడా అవసరమవుతుంది. .

మేము బి.ఎ. ఆనర్స్ చదివే రోజులు. అర్థశాస్త్రం ఆచార్యులవారికి విద్యార్థిని ప్రశ్నిస్తూనే "అఫ్ కోర్స్ ఐ నో" (నాకు తెలుసు) అనే ఒక విచిత్రమైన అలవాటుంది. ఒకరోజున బహదూర్ అనే విద్యా ర్థిని లేపి "మిస్టర్ బహదూర్! "What is the difference between a donkey and an ass?" అని ప్రశ్నిస్తూ అలవాటు ప్రకారం "Of course I know" అన్నారు. ప్రొఫెసర్ గారి ప్రశ్నకు సమాధానంగా బహదూర్ "ఆ జంతువులకే వాటి మధ్యగల వ్యత్యాసాలు తెలుస్తాయికాని, నాకెలా తెలుస్తాయండి" అనడంతో క్లాసు గొల్లుమంటే, గతుక్కుమనడం ఆచార్యులవారి వంతైంది!

హాస్యోక్తి చెప్పడం ఒక కళ. దానిని వివరించే పద్ధతి, ఉపయోగించే భాష, స్వరం, ఉచ్చారణ, నిలబడే తీరు, హావభావ ప్రకటన, ఆరోహణ అవరోహణల సాధన మొదలైన వి ఇక్కడ కీలకపాత్ర వహిస్తాయి. అందువల్లనే కొందరు హాస్యోక్తులు చెబుతుంటే,
గొప్పగా పేలడంతో జనం పగలబడి నవ్వితే అవే హాస్యోక్తులు మరికొందరి నోళ్ళలో పడి తుస్సుమంటాయి.

ముక్కుపొడుంపై మనసుపడిన సన్యాసిరావు "కొండలరావు గారూ! నాకు కొంచెం పొడుం ఇవ్వండి" అన్నాడు. కొండలరావుకు దర్పం ఎంత ఎక్కువో, కొంటెతనం అంతకన్నా ఎక్కువ. "సన్యాసిరావు గారూ! మీరు పౌరోహిత్యం వదిలి కవిత్వంలో పడ్డా, పాత అలవాటు ఉందే - అదే చెయ్యి జాపడం - మానలేదు కదా!" అన్నాడు. "నిజమేనండి. ఇన్నాళ్ళ నుండి మీ స్నేహం చేస్తున్నా, ఇప్పటికింకా సొంత డబ్బా అలవాటు కాలేదు" అని ఆయన అనడంతో కొండలరావుకు నషాళం అంటింది! ఇక్కడ సొంత డబ్బా అంటే తాను ప్రత్యేకంగా ఒక పొడుంకాయను పెట్టుకోవడం కావచ్చు లేదా స్వడబ్బా కొట్టుకోవడం కావచ్చు. ఇదొక శ్లేష

సర్దార్జీలు, తెనాలి రామకృష్ణుడు, ఐర్లండ్, పోలెండ్ దేశీయుల హాస్యోక్తులంటే మనకు తెలియకుండానే నవ్వు వస్తుంది. దానికితోడు మూర్ఖత్వాన్ని మరింత స్థాయిలో జోడించినప్పుడు ఆ నవ్వు ఇబ్బడిముబ్బడి అవుతుంది. ఇంక మౌఖికంలోకి పోదాం.

## 17. మౌఖిక హాస్యం

పూర్తి లేక పాక్షిక అర్థ సంబంధం కలిగి అతి వ్యాప్తి చెందిన రెండు రచనల్లోని వైరుధ్యం మౌఖిక హాస్యంలో సర్వసాధారణంగా కన్పిస్తుంది" అంటారు అలెగ్జాండర్ బ్రాక్ ఆ వైరుధ్యం అరూపమైన వాస్తవ, అవాస్తవ విషయ సంబంధి కావచ్చు లేదా స్థూలమైన జీవన మరణానికి సంబంధించినది లేదా శృంగార, శృంగారేతర విషయమైనది కావచ్చు. ఇవి భాషాశాస్త్ర సంబంధమైన విషయంలో ముఖ్య సాధనాలు కావచ్చు.

మాంటి పైథాన్స్ ఫ్లయింగ్ సర్కస్ వారు ఇచ్చిన ఒక ఉదంతాన్ని తీసుకుందాం. దారి తప్పిన ఐదుగురు నావికులు దిక్కుతోచక 33 రోజులుగా సముద్రంలో అలా ప్రయాణం చేస్తున్నారు. వారి ఆహార నిల్వలు ఐదు రోజులకు మాత్రమే సరిపోవడంతో ఆరవ రోజునుండి క్షుద్బాధ వారిని పీడించసాగింది. అలా ఒక నెల పైగా సాగాయి. 33వ రోజున దాదాపు అందరూ డీలాపడిపోవడంతో కెప్టెన్ "వినండి పిల్లలు.....ఇంక నా పని అయిపోయింది. అసలే నా కాళ్ళలో ఒకటి అవిటిది. నా వయస్సు కూడా పైబడింది. నేనింక గమ్యం చేరలేను..... మీలో కొందరైనా....నన్ను తినేయండి" అన్నాడు బాధగా, అవిటి కాలుగల వానిని తినకూడదని కొందరంటే, సన్నటి మాంసం అంటే ఇష్టం అని ఒకరు, జాన్సన్‌ను (ఒక నావికుడు) తిందామని మరొకరు - ఇలా కీచులాడుకున్నారు. ఇంతలో రెండవ నావికుడు ఒక రాజీమార్గాన్ని చూపాడు. ఇంక వారి మాటల్లోనే విందాం.

**రెండవ నావికుడు** : చూడండి... జాన్సన్‌ను భుజించడానికి ఎవరైతే ఇష్టపడరో, వారంతా నా కాలును భుజించవచ్చు. ఆ తరువాత కెప్టెన్ గారి సంగతి చూద్దాం. అనంతరం జాన్సన్ గారిని మధ్యాహ్న భోజనంగా తీసుకుందాం అనడంతో "చాలా బాగుంది" అన్నాడు మొదటి నావికుడు.

**నాలుగవ నావికుడు** : ముందు మనం అత్తి పండ్లు పూర్తి చేద్దాం (అత్తి పండ్ల టిన్ తీసుకుంటాడు).

**మూడవ నావికుడు** : ఇప్పుడు బేరీ పండ్లతో ప్రారంభిద్దాం (అని రెండు బేరీ పండ్లు తీసుకుంటాడు).

---

బాల్యం యొక్క సహజసిద్ధమైన శబ్దమే హాస్యం. – ఆల్విన్ ష్వాడ్జ్

**మొదటి నావికుడు** : కాపలాకాసే ఆమె వచ్చింది (ఆమె ప్రవేశిస్తుంది). హాడ్జెస్ కాలును భుజించుదామని మనం నిర్ణయించుకున్నాం కనుక ఇంక ప్రారంభిద్దాం. . ఈ చర్చ ఇలా కొనసాగుతుంది.... ఇదొక హాస్యోక్తిగా కాకుండా ఒక సంక్లిష్ట విభాగంగా కన్పించడం దీని ప్రత్యేకత. ఇక్కడ విపత్తు, భోజన ప్రీతి ఒకవైపు, అంత విపత్తులో కూడా మాంసాన్ని అత్తి పండుతో లేక బేరీ పండుతో కలిపి తీసుకోవాలా అన్న ఆలోచన/ఆశ, రుచి పై మోజు మరొకవైపు ఈ హాస్యోక్తి పరాకాష్టకు సంకేతంలా నిలుస్తాయి. ఒకవైపు స్వజాతి భక్షణం, మరొకప్రక్క సిద్ధంగావున్న ఆహారం (tinned food) ఒక గొప్ప అసంబద్ధత. అలానే అధికార హోదా (కెప్టెన్, సాధారణ ఉద్యోగి), నావికుల యొక్క అతిశయంతో కూడిన అసంబద్ధ ప్రవర్తన, అవసరాల అధికార పరంపరలో స్థానాల మార్పిడి వలన ఏర్పడింది. విషయ వివరణలో భాషాపరమైన యుక్తి ఇది అంటారు హాస్యోక్తి రచయిత అలెగ్జాండర్ బ్రాక్.

ఇహం మిధ్య, సంపద మిధ్య, తనువు మిధ్య, సర్వం మిధ్య అని ప్రబోధించే స్వామీజీ తన మఠాన్ని సర్వసదుపాయాలతో తీర్చిదిద్దుకోవడమేగాక, ఎడా పెడా దాని ఆస్తిపాస్తులు పెంచడానికి తీవ్ర కృషిగావించడం చూస్తుంటే ఏది మిధ్యనో అర్థంకాక సాధారణ మానవులు సంకట స్థితిలో పడతారు. ఇదే విషయాన్ని పై ఉదంతంలో అలెగ్జాండర్ బ్రాక్ మరొక కోణం నుండి విశ్లేషించడం జరిగింది.

## 18. సంక్షిప్తతలో సౌందర్యం

ప్రాచీన గ్రీసు దేశంలో ఏథెన్సువాసులు సుదీర్ఘ ప్రసంగాలకు, ఆడంబర పదప్రయోగాలకు పెట్టింది పేరు. కాగా, వారి పొరుగునే ఉన్న స్పార్టా, లకోనియావాసులు సంక్షిప్తతలోనే సౌందర్యం ఉందంటారు. నిజానికి ఆంగ్లభాషలోని లకోనిక్ (Laconic-సంక్షిప్తత) అనే పదం లకోనియా దేశస్తులనుండే తీసుకోబడింది. స్పార్టాకు చెందిన ప్లూటార్కు, ఎరాస్మస్ మొదలైన ప్రముఖ చరిత్ర కారులు హాస్యోక్తికి, సంక్షిప్తతకు మారు పేరుగా ప్రసిద్ధి చెందారు.

అలెగ్జాండర్ తండ్రి ఫిలిప్ గ్రీసును జయించిన తరువాత స్పార్టాకు ఒక సందేశం పంపుతూ "మిత్రునిగా రమ్మంటారా, వైరిగా రమ్మంటారా?" అని ప్రశ్నించగా, "ఏ విధంగానూ రాకండి" అని క్షణాలలో సమాధానం వచ్చింది. .

ఎథీనియా దేశంలో ఎన్నికల ప్రచారంలో ఒక అభ్యర్థి గంటల తరబడి ప్రసంగిస్తూ అందమైన ప్రతిజ్ఞల వర్షం కురిపించాడు. ఆ తరువాత అతని ప్రత్యర్థి లేచి, "మీరంతా నన్ను

---

ఎన్నుకుంటే, ఇంతకుముందు వక్త చేసిన వాగ్దానాలన్నింటిని తు.చ. తప్పకుండా అమలుపరుస్తా" అంటూ సుదీర్ఘ హర్షధ్వానాల మధ్య క్లుప్తంగా తన ప్రసంగాన్ని ముగించాడు.

అయితే, 'లెస్ మిజరబుల్' రచయిత విక్టర్ హూగో 'సంక్షిప్తం'లో చరిత్ర సృష్టించాడు. ఆయన తన ప్రచురణకర్తకు ఒకే ఒక్క సంకేతం .......?"తో లేఖ వ్రాయగా, దానికి "!" అని సమాధానం వచ్చింది.

రామాయణ కల్పవృక్షం గురించి నాలుగు మాసాలు బుద్ధిగా హరికథ విన్న సుబ్బమ్మ రామాయణ కథను పేరమ్మకు చెబుతూ "ఆ.......రామాయణంలో ఏమీలేదు పేరమ్మక్కా. కట్టె-కొట్టె-తెచ్చె...అంతే" అని వివరించిందట!

చిన్ని చిన్ని మాటల ఈటెలతో కవిత్వాన్ని కొత్త పుంతలు తొక్కించిన 'ఆరుద్ర సరదాలు' అయిన కూనలమ్మ పదాలలో ఎంత గొప్ప హాస్యాన్ని ఇమిడ్చారో చూడండి.

నూతిలోపలి కప్ప
పాత ఘనతలు తప్ప
మెచ్చరితరుల గొప్ప.

పరుల తెగడుట వల్ల
బలిమి పొగడుట వల్ల
కీర్తి వచ్చుట కల్ల.

ఈ పదమ్ముల క్లుప్తి
ఇచ్చింది సంతృప్తి
చేయనిమ్ము సమాప్తి
ఓ కూనలమ్మ.

బ్రహ్మానందం బట్టల షాపును ప్రారంభిస్తూ "ఇక్కడ అందమైన బట్టలు అమ్మబడును"అని ప్రత్యేక తరహాలో తయారుచేయించిన బోర్డును విద్యుద్దీపాలతో అలంకరించాడు. మిత్రుడు పుల్లారావు వచ్చి "అంతా బాగుందిరా. ఆ బోర్డులో "ఇక్కడ అందమైన బట్టలు అమ్మబడును" అని వ్రాయించావు కదా! ఇక్కడ కాక మరెక్కడైనా అమ్ముతావా ఏంటి?" అంటూ బోర్డులోని 'ఇక్కడ' అనే పదం పై ఓ కాగితం అంటిం చాడు. రెండు రోజుల తర్వాత అప్పారావు వచ్చి"అందమైన బట్టలు అమ్మబడును" అని వ్రాయించావేమిటి? అందమైనవి కాక చినిగినవి, మాసినవి అమ్ముతావా ఏంటి?" అంటూ 'అందమైన' అన్న అక్షరాల పై మరో కాగితం అంటించాడు. నాలుగు రోజులు గడిచిన తరువాత మరొక మిత్రుడు కృష్ణారావు

---

మన ఆలోచనా స్వభావాన్ని మార్చగల రసాయనం హాస్యం. – లిన్ యుటాంగ్

వస్తూనే "అరేయ్ బ్రహ్మం! బట్టల షాపులో బట్టలుకాక కుక్కలు, నక్కలు అమ్ముతావా ఏంటి?" అంటూ 'బట్టలు' పై ఇంకొక కాగితం అంటించాడు. 'అమ్మబడును' అన్న బోర్డును చూసినవారంతా "ఏమండీ! షాపు అమ్ముతారా?" అని ప్రశ్నించడంతో బ్రహ్మానందంకు పిచ్చెక్కినట్లైంది! సంక్షిప్తతలోని సౌందర్యం అంటే ఇదికాదు సుమా!

సంక్షిప్తత అవసరమే కాని, సంక్షిప్తత పేరుతో విషయాన్ని వధించడం సమంజసం కాబోదు. శబ్దాడంబరం ఎంత నవ్వు తెప్పిస్తుందో, కొన్ని సందర్భాలలో సంక్షిప్తత కూడా అలానే నవ్వు తెప్పిస్తుందంటాడు అరిస్టాటిల్ మహాశయుడు.

ఇంక జిట్సు హాస్యం గురించి తెలుసుకుందాం.

## 19. జిట్సు హాస్యం

నీపైన విసిరిన బంతిని అంతకన్నా బలంగా దానిని విసిరినవాడి పైన పడేటట్లు చేయడమే అసలుసిసలైన హాస్యం. దీనినే జిట్సు (Jitsu) హాస్యం అంటారు. అన్నట్లు జపాన్ దేశస్తుల యుద్ధకళా కౌశలాన్ని ఆ పేరుతో పిలుస్తారు.

రక్షకభటుల ను కెప్టెన్లుగా పదోన్నతి గావించడానికి ఒక మౌఖిక పరీక్ష జరుగుతోంది. అందులో ఒక రక్షకభటుణ్ణి "నీ కారు అమిత వేగంతో పోతుంది. హఠాత్తుగా ఒక పెద్ద యుద్ధనౌక ఎదురుగా వచ్చి ఆటంకం కలిగిస్తుంది. అప్పుడు ఏమి చేస్తావు?" అని ప్రశ్నించారు.

రక్షకభటుడు : దానిని ముంచేస్తాను

అధికారి : (ఆశ్చర్యపోతూ) ఎలా ముంచేస్తావు?

రక్షకభటుడు : (ఏమాత్రం తడుముకోకుండా) నా జలాంతర్గామితో ముంచేస్తా!

అధికారి: (మరింత ఆశ్చర్యపోతూ) నీకు జలాంతర్గామి ఎక్కడనుండి వస్తుంది?

రక్షకభటుడు : (ఆలోచించకుండానే) మీకు యుద్ధనౌక ఎక్కడనుండి వచ్చిందో, అక్కడినుండే నాకు జలాంతర్గామి వస్తుంది. అని తన చివరి పాచికను విసిరాడు. అంచెలంచెలుగా జరిగే ఈ ప్రక్రియలో ప్రతి మెట్టువద్ద అభ్యర్థి తన కౌశలాన్ని ప్రదర్శించడం ఆతని విజ్ఞతకు తార్కాణం.

యూదుల గురువు స్వర్ణకంఠంతో జనరంజకంగా ప్రసంగాలు చేస్తుండటంతో ఏ పట్టణానికి వెళ్ళినా వందలాదిమంది ఆయనను పూలమాలలతో, బహుమతులతో సత్కరించేవారు. దీనిని చూసిన అతని డ్రైవర్‌కు ఒక విచిత్రమైన ఆలోచన కలిగింది. "గురువుగారూ! ప్రతిచోట ప్రజలు మీకు బ్రహ్మరథం పడుతున్నారు కదా! మీ ప్రసంగాన్ని

---

బట్టీపట్టి ఒక పట్టణంలో అచ్చం మీలాగే చెబుతాను. మీరు అనుమతించి మీ దుస్తులు కూడా ఇచ్చి జీవితంలో ఒక్క పర్యాయం అందరిచేత కొనియాడబడే అవకాశం, అదృష్టం కల్పించండి" అంటూ ప్రాధేయపడగా గురువు నవ్వుతూ సరేనన్నాడు.

ఆ మరునాడు శిష్యుడు గురువు దుస్తులు ధరించి అచ్చం తనలాగే చక్కగా ప్రసంగించడంతో దానిని చూచిన గురువుగారు తన డ్రైవర్ కౌశలాన్ని మనసులోనే అభినందించాడు. ప్రసంగం పూర్తయిన తరువాత ప్రేక్షకులలో ఒకరు ఒక ఇబ్బంది కరమైన ప్రశ్న వేయడంతో శిష్యుడు ఏమి చెబుతాడోనని ఆసక్తిగా చూస్తున్న గురువుగారి కి మరింత ఆశ్చర్యం కలిగించే రీతిలో శిష్యుడు "ఎంతో మేధావులైన మీరు ఇంత చిన్న ప్రశ్న ఎలా అడిగారో నాకు అర్థం అవడం లేదు. అల్ప ప్రశ్నలకు నేను సమాధానం చెప్పేకన్నా మా కారు డ్రైవర్ చేతనే సమాధానం చెప్పిస్తా" అంటూ "డ్రైవర్ ! ఇక్కడకు వచ్చి ఈ ప్రశ్నకు సమాధానం చెప్పవయ్యా!" అనడంతో గురువు తన సహజధోరణిలో సమాధానం ఇచ్చాడు. మేధావి అయిన ఆ గురూజీకి జిట్సు హాస్యోక్తులు తెలిసివుంటే అమాయకంగా ముఖం పెట్టి "గురూజీ! ఈ ప్రశ్న నా చిన్ని బుర్రకు అంతుపట్టడం లేదండి" అంటే ఏమవుతుంది?

జిట్సు హాస్యోక్తిలో మంచి వార్త, చెడువార్త సూత్రం ఆధారంగా ఒక ప్రామాణిక హాస్యోక్తి వినండి. శుభవార్త ఏమంటే లక్ష డాలర్లు విలువచేసే ఫొటో ఒకటి మీ భార్య చేతికి చిక్కింది. చెడువార్త ఏమంటే ఆ ఫొటోలో ఉన్నది మీరు, మీ లేడీ సెక్రటరి! ఇంక అస్వస్థ హాస్యం సంగతి కూడా తెలుసుకోవాలి కదా!

## 20. అస్వస్థ హాస్యం (Sick Humour)

రైలు పట్టాలమీద పడుకున్న సురేష్ ను "ఎందుకు బాబూ ఇక్కడ పడుకున్నావు?" ప్రశ్నించాడు రామయ్య. "రైలు పట్టాలమీద దేనికి పడుకుంటారు, చావడానికి కాక" విరక్తితో అన్నాడు సురేష్. "అది తెలుస్తూనే ఉందయ్యా.... ఇంతకూ ఎందుకు చావాలను కుంటున్నావు?" లాలనగా అడిగాడు రామయ్య. "ఎందుకా....నా జీవితమంతా ఒక దురదృష్ట ఖని. నాకు రావలసిన ఆస్తి పోయింది. అలానే ఉద్యోగం పోయింది. చివరకు నేను ప్రేమించిన అమ్మాయి కూడా మరొకడి సొత్తు అయింది. నేనేమి చెయ్యాలనుకున్నా దురదృష్టం నన్ను వెంటాడుతూనే ఉంది. అందుకనే.... చావాలని నిర్ణయించుకున్నా" బాధతో సమాధానం చెప్పాడు సురేష్, "పాపం.... కొన్ని జాతకాలు అంతే. వాళ్ళకు ఎక్కడా కలసిరాదు బాబు. అన్నట్లు...... ఈ రోజు రైల్వే స్ట్రైక్. రైళ్ళు నడవవు" అన్నాడు రామయ్య జాలిగా.

---

హాస్యం అంతరిస్తే నాగరికత అంతర్ధానమౌతుంది. – ఎర్మాబాంబే

అనారోగ్యం, కురూపితనం, మరణం, అంగవైకల్యం మొదలైన బలహీనతల పై చెణుకులు విసరడాన్ని అస్వస్థ హాస్యం అంటారు (మైండెస్ ఎతాల్). నియంత్రించలేని, ఊహించనలవికాని హెచ్చరికల మూలంగా ఏర్పడే ఉద్రిక్తతల నుండి బయటపడటానికి ఈ హాస్యోక్తులు సహాయపడతాయి అంటారు పరిశోధకులు. ఇలాంటి హాస్యాన్ని ఎవరు ఆదరిస్తారు? ఈ విధంగా ప్రమాదకర వస్తువులు, సంఘటనలు, పరిస్థితులకు మనిషిని దూరంగా ఉంచడం, అన్యోన్యాశ్రయ ప్రాధాన్యాన్ని తెలపడం హాస్య విలక్షణ లక్షణం అంటారు ఆ రచయితలు.ఏమైనా ఇలాంటి హాస్యాన్ని ఆనందించడం ఆయా వ్యక్తుల వ్యక్తిత్వం పై ఆధారపడుతుంది. దీని మూలంగా జనించే ఆనందం కొందరికి భావావేశ అస్థిరతకు చిహ్నంగా కన్పించవచ్చు. దాంతో అది అశ్లీల, ప్రతికూల హాస్యం వలె ద్యోతకం కావచ్చు.

ఇప్పుడు రెండు ప్రసిద్ధ అస్వస్థ హాస్యోక్తులను పరిశీలిద్దాం :

శవ పరీక్ష నిమిత్తం ఒక న్యాయవాది శవ పంచాయితీ కార్యాలయం వద్దకు వెళ్ళి ప్రక్కనే ఉన్న వైద్యుణ్ణి “మరణ ధ్రువీకరణ పత్రం ఇచ్చేముందు ఆ వ్యక్తి నాడిని పరీక్షించారా?” అని ప్రశ్నించాడు. వైద్యుడు : లేదు

న్యాయవాది : అతని గుండె కొట్టుకుంటుందో లేదో చూశారా?

వైద్యుడు : లేదు

న్యాయవాది :అతను ఇంకా గాలి పీలుస్తున్నాడా లేదా అన్న విషయాన్నైనా తెలుసుకున్నారా?

వైద్యుడు : లేదు,

న్యాయవాది: (చిరాకుగా) అంటే మనిషి పూర్తిగా చనిపోయాడో లేదో తెలుసుకోడానికి అవసరమైన పరీక్షలేవీ నిర్వహించలేదన్నమాట!

ఈ ప్రశ్నలన్నీ వింటూ ఓపికగా నిల్చున్న ఆ వైద్యుడు ఆశ్చర్యంగా “అవును..... ఇంతకూ అతని తలకాయ మీకు దొరికిందా?” అని ప్రశ్నించాడు.

యాక్సిడెంట్ : ఆఫీస్ లో పనిచేస్తున్న రమేష్ కు ఫోన్ వచ్చింది. ఫోన్లో అవతలి వ్యక్తి “మీ భార్యకు కారు యాక్సిడెంట్ అయ్యింది.....మీకు ఒక శుభవార్త, ఒక దుర్వార్త చెప్పదలచుకున్నాను. దుర్వార్త ఏమిటంటే ఆమె రెండు చేతులు, రెండు కాళ్ళు పోయాయి.” “ఇది చాలా దురదృష్టకరం. ఎలా జరిగింది? దేవునికి నామీద అంత కోపం ఎందుకు వచ్చిందో” అంటూ ఏడుస్తూ అరిచాడు రమేష్. నెమ్మదిగా తేరుకొని “ఇంతకూ శుభవార్త ఏమిటి?” అని ప్రశ్నించాడు. "శుభవార్తనా....ఇప్పటిదాకా మీతో... హాస్యోక్తులాడుతున్నా .....మీ భార్య..... మరణించింది”.

---

ప్రపంచాన్ని పాలించదలిస్తే, దానిని వినోదింపజేయాలి.- ఎమర్సన్

సగటు మానవుడు అస్వస్థ హాస్యాన్ని ఆదరించలేడు. కనుక, ఇంక ఆశ్చర్యోక్తిలోకి పోదాం.

## 21. ఆశ్చర్యోక్తి

కొన్ని విషయాలను చూస్తున్నా, వింటున్నా మనం ఆశ్చర్యంలో మునిగిపోతాం. అది అమెరికాలోని శాన్ ఫ్రాన్సిస్కోలో కంప్యూటర్ల కేంద్రం. కొన్ని సంవత్సరాల తరువాత విద్యార్థి కష్టించి చదవాల్సిన పని లేదని, ఒక చిన్న చిప్ ను చెవి పైభాగంలో పెట్టుకుంటే ఏ పాఠ్యాంశం కావాలనుకుంటే అది అతనికి పూర్తిగా వస్తుందని చెప్పినప్పుడు మనం ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరవుతాం. అలానే ఇంట్లోనే మరమనిషి సాయంతో అన్నం వండించుకోవచ్చని, ఇంటిని శుభ్రం చేయించుకోవచ్చని, టి.వి. తెర పైన కన్పించే పుష్పాల గుబాళింపులను ఇంట్లో కూర్చునే ఆస్వాదించవచ్చని, బట్టలను పట్టుకొని అవి మెత్తగా ఉన్నాయో, ముతకగా ఉన్నాయో తెలుసుకోవచ్చని - ఇవన్నీ త్వరలో మార్కెట్లోకి రానున్నాయని అక్కడి పరిశోధకులు చెబుతుంటే మనం విఠలాచార్య సినిమాలు చూస్తున్నామా! అన్న భ్రమలో పడిపోతాం;ఆశ్చర్యంలు మునిగిపోతాం!

గందర గోళం: కొత్త ఢిల్లీలోని కనాట్ ప్లేస్ లో సమావేశం. అక్కడ కూర్చున్న మోహన్ ప్రక్కనున్న వ్యక్తితో “ఏమిటోనండి. మన ఎదురుగా ఉన్న వ్యక్తి వేసుకున్న దుస్తులు చూస్తుంటే అమ్మాయో, అబ్బాయో అర్థం కాక గందరగోళంగా ఉందండి”.

రెండవ వ్యక్తి : అది అమ్మాయేనండి. మా అమ్మాయే. ఆమె పేరు మేరీ.

మోహన్ : క్షమించండి. ఆ అమ్మాయికి మీరు నాన్న అని గ్రహించలేకపోయా.

రెండవ వ్యక్తి : “నేను ఆ అమ్మాయి నాన్నను కాదయ్యాబాబూ! ఆమె తల్లిని. నా పేరు మార్గరెట్. తెలిసిందా?" అంది కొద్దిగా కోపంగా. "

మోహన్ : “పొరపాటేనమ్మా! తక్షణం నేనటు వెళ్ళి నేను మగనో, మగువనో తెలుసుకోవలసిందే!” అంటూ పరుగుతీశాడు.

ఓ తెలుగు పండితుని ఇంటికి వెళ్ళిన గణపతి “కొంచెం మంచినీళ్ళు తెప్పిస్తారా?” అని అడిగాడు. పండితులవారు తన కుమార్తె వనజాక్షిని పిలుస్తూ “జలాధి ద్రవ్యాధారక సమర్థక లోహాది పదార్థ నిర్మిత ఘటికా విశేషములో చల్లని శుభ్రమైన పానీయము తీసుకురమ్ము” అంటూ కేకవేయడంతో గణపతి నీళ్ళు నమిలాడు!

---

## 22. లైంగిక హాస్యం

ఆఫీసునుండి ఇంటిముఖంపట్టిన శరత్‌కు దారిలో ఓ చక్కని యువతి పండ్లు అమ్ముతూ కన్పించింది. అంతే! ఆమె వక్షస్థలం వైపు వంకరగా వేళ్ళు చూపుతూ "ఆ రెండు.... జామపండ్లు ఎంత?" అన్నాడు నవ్వుతూ...

మోహన్ అప్పుడే తీయించుకున్న పాస్పోర్ట్ ఫొటో చూసుకుంటూ బస్సెక్కాడు. కండక్టర్‌కు టిక్కెట్ డబ్బు ఇస్తూ, కావాలని తన ఫొటోను ప్రక్కనే నిలబడ్డ ఓ అందాల భామ చీరె దగ్గర్లో జార్చాడు. ఆమెవైపు తిరిగి "మేడమ్! మీరేమీ అనుకోనంటే....ప్లీజ్.....చీరె కొంచెం.....ఎత్తుతారా? ఫొటో(గ్రాఫ్......తీసుకోవాలి" అన్నాడు అమాయకంగా......

కార్యాలయాలలోనే కాదు, దైనందిన జీవితంలో కూడా - అందమైన యువతిని, చూడటంతోనే పురుషపుంగవులు ఏవో కొంటె మాటలతో, వంకర చూపులతో కించపరచడానికే ప్రయత్నిస్తారు. అర్థం: లైంగిక హాస్యం అంటే 'లైంగికము', 'లింగము'కు సంబంధించిన హాస్యంగా రచయితలు అభివర్ణించారు. సర్వసమానత్వ సూత్రాన్ని బహిరంగంగా అందరూ భుజాన వేసుకు తిరుగుతున్నప్పటికీ, ఆచరణలో మాత్రం లైంగిక వివక్షతను పాటిస్తూ పురుషాధిక్యతను చాటుకోవడం ఈనాడు పరిపాటి అయింది. .

చిక్కడు, దొరకడులాంటిది 'లైంగికము'. ఒక కోణంలో అది సర్వత్రా ప్రత్యక్షమైనప్పటికీ, మరొక కోణంలో అది కొలతలకు, పరిశోధనలకు ఎప్పుడూ ఒక అడుగు దూరంగానే కన్పిస్తుంది. అందుకే హాస్యశకటం పై లైంగిక హాస్యోక్తులు అస్పష్టరీతిలో సంధించబడటంతో ఎంతటి నర్మగర్భమైన అర్థాన్నైనా చక్కగా కప్పి పెడుతూ, శుద్ధ అమాయకత్వాన్నే దండోరా వేస్తుంటారు.

లైంగిక హాస్యంలో మరో ప్రత్యేకత ఉంది. ఇక్కడ విరోధాభాసం కన్పిస్తుంది". అబల అంటే అవగాహనకు అతీతమైనది, అంతుపట్టనిది అని ఒక అర్థం. చిత్రమేమంటే అబలకు సంబంధించినంతవరకు హాస్యంలో కూడా ఒక అంతుపట్టనితనం - విరోధాభాసం - కన్పిస్తుంది! సామాన్యంగా హాస్యం ప్రబలమైన ప్రతిరూపం (dominant pattern)ను వ్యతిరేకించడానికి ఉపయోగపడుతుందని తెలిసిందే. అయితే, లైంగిక హాస్యం మాత్రం అమలులోవున్న నమూనాను, పద్ధతిని కొనసాగించడానికే, సమర్థిచడానికే ఉపయోగపడుతుంది! బాహ్యంగా సాదాసీదాగా, ప్రమాదరహితంగా కన్పించే ఆ హాస్యోక్తులు అనేక సందర్భాలలో అమలులోవున్న అధికార చట్రానికి ఆలంబనగా నిలబడటం విశేషం!

---

చెప్పిన జోక్ లో కాస్తంత యదార్థం ఉన్నా ప్రజలు నిరసన తెలుపుతారు. – టాగూర్

అబల స్పర్శ : బ్యాంకు మేనేజర్ల సమావేశం జరుగుతూంది. ఇంతలో మహిళా కార్యదర్శి అధ్యక్షులవారికి అందజేయడానికి కొన్ని పేపర్లతో లోనికి ప్రవేశించింది. పొరబాటున ఆమె కాలు తగిలి సైడ్ ప్రొజెక్టర్ ప్లగ్ ఊడింది. ప్రక్కనే ఉన్న సూపర్ వైజర్ నవ్వుతూ "ఓహ్! అబల స్పర్శ" (Female Touch) అనడంతో పురుషపుంగవులందరు పకాలున నవ్వారు. పైకి పరమ అమాయకంగా, సర్వసాధారణంగా కన్పించే ఈ పదాల వెనుక వ్యవస్థలోని అధికార సంబంధాల ఆలోచనలు దాగి ఉన్నాయని ఆ సంస్థ యజమానురాలు ఇట్టే గ్రహించినప్పటికీ ఏం చేయగలదు?

అమెరికాలో స్త్రీ పురుషులకు సమాన ఉద్యోగావకాశాల కల్పనకై ఏర్పడిన సంఘం (Equal Employment Opportunity Commission - EECC) ఆ సంఘం అప్రియ ప్రవర్తనను 7 రూపాలుగా విభజిస్తూ అందులో "హాస్యోక్తులు, వ్యాఖ్యానాలు లేదా ప్రశ్నలతో కామ సంబంధంగా వేధించడం" అనే అంశాలను ప్రముఖంగా పేర్కొన్నది. సగటు మనిషి శృంగార జీవి కనుక 'కామ సంబంధ', 'లైంగిక హాస్యం' అనే పదాలు ఆచరణలో ఎంతో అయోమయానికి, ఆందోళనకు కారణం అవుతాయి.

ఒకానొక హాస్యోక్తి లైంగిక సంబంధమైన వేధింపా అని హాస్యం పై సుదీర్ఘ రచనలు గావించిన లుండెన్బర్గ్, మరికొందరు మేధావులు, దాని వెనుక దాగివున్న కారణాన్ని విస్మరించడం, దానినొక పరిహాసంగా పేర్కొనడం విశేషం! ఫిట్జ్, షా ఫెర్, రట్టర్, గ్రాఫ్, ఇంకెందరో మేధావులు హాస్యోక్తులు ఎలా వేధింపులుగా పరిణమిస్తాయో అధ్యయనం చేశారు. కాని, లైంగిక హాస్యం, హాస్యోక్తుల వెనుక దాగిన పరమార్థాలను గురించి అధ్యయనం చేయకపోవడం విడ్డూరంగా కన్పిస్తుందంటారు ప్రసిద్ధ రచయిత్రులు బ్రునెర్, కాస్టెల్‌లు.

'అసలు లైంగిక సంబంధ', 'జండర్ హాస్యం' అనే పదాల వెనుక దాగివున్న భ్రమను, క్లిష్టతను మనం అర్థం చేసుకోవాలి. "ఇతరుల చేత/కొరకు లేదా తన కొరకు శారీరక సంబంధమైన భౌతిక కోర్కెలయొక్క సామాజిక అభివ్యక్తీకరణ లేదా సామాజిక సంబంధాలు లైంగికత" అంటారు బురెల్, హేరన్‌లు. మహిళా వేధింపు సమస్యను, పురుషులు స్త్రీలను ఏవిధంగా క్షోభపెడుతున్నారన్న సమస్యను పెక్కు రచయితలు చట్టబద్ధత కోణం నుండి పరిశీలిస్తున్నారే కాని లైంగిక హాస్య కోణం నుండి అధ్యయనం చేయడం లేదు. అంటే పని ప్రదేశాలలో మహిళా వేధింపులు చట్టబద్ధ వేధింపుల స్థాయికి చేరనిదాకా అవి

---

వక్రోక్తులు ఎప్పుడూ అచేతన స్థితిలోనే ఉంటాయి. – శామ్యూల్ బట్లర్

సర్వసాధారణమైనవిగానే పరిగణిస్తారన్నమాట! అందుకే ఇక్కడ చట్టపరమైన మార్పులుగాక, పురుషుని ఆలోచనాసరళిలో మార్పు రావాలంటారు విజ్ఞులు. ఇంక చెత్త జో లోకి ప్రవేశిద్దాం.

## 23. చెత్త జోక్స్

'చెత్త ఉద్యోగాల పై ఎక్కువ మోజు చూపేవారు మీకు కావాలా? అయితే చదవండి. ఒక మునిసిపాలిటీలో చిరు ఉద్యోగి అయిన ఓ తండ్రి తన కుమారుణ్ణి "ఏరా బాబూ! నీకు ఏ ఉద్యోగం అంటే ఇష్టం?" అని అడిగాడు. అందుకు కుమారుడు "మునిసిపాలిటీలో రోజూ మీరు చెత్తను పోగుచేస్తారు కదా! ఆ ఉద్యోగుల మీద సూపర్‌వైజర్ పోస్ట్ ఉంటే ఇప్పించు నాన్నా.....హాయిగా పని చేసుకుంటా" అన్నాడు. తండ్రి : (ఆశ్చర్యంగా) అదేమిట్రా ఇంకేమీ లేనట్లు అలాంటి చెత్త ఉద్యోగం కోరుకుంటున్నావు?

కుమారుడు : ఏమీలేదు నాన్నా! అలాంటి చెత్త ఉద్యోగమైతే నెలకు 2,3 రోజులు తప్ప పని ఉండదు కదా! ఆ ఉద్యోగిని గురించి పట్టించుకునే నాధుడే ఉండడు. అందుకే అదంటే నాకు బహు ఇష్టం.

అసలు చెత్త జోక్స్ అంటే ఏమిటి? చెత్తాచెదారం పైన వేసిన హాస్యోక్తులా లేక మురికి హాస్యోక్తులా? లాలూగారి బీహార్ ప్రభుత్వం చెబుతున్న లెక్కల ప్రకారం ఒక్కొక్క పశువు నెలకు 11 వేల రూపాయల గ్రాసాన్ని తిన్నదట. రాష్ట్రంలోని సుమారు 2 లక్షల పశువులు రూ. 700 కోట్ల విలువైన గడ్డిని కేవలం 3,4 నెలల్లో తిన్నాయన్న లెక్కలు చూస్తుంటే, ఈ గడ్డిని పశువులే మేశాయా లేక ఇంకెవరన్నా మేశారా? అన్న అనుమానం కలుగుతుంది. చెత్త అంటే సామాన్యం కాదు గనుకనే ఓ గొప్ప కేంద్ర మాజీ మంత్రి గడ్డి కుంభకోణంలో ఇరుక్కుపోయాడు!

గాని ఏమైనా పూర్తిగా వ్యతిరేక ధోరణిలో సాగిన పాటలు, హాస్యోక్తులు పదిమందిలో రాణించవు. అందుకే ఇదొకరకమైన అనారోగ్య హాస్యం అంటారు కొందరు.

ఇంక రెండవ అర్థం చూద్దాం. "చెత్త హాస్యోక్తులు అంటే మురికి హాస్యోక్తులా?" అని ప్రశ్నిస్తారు కొందరు. నిజానికి కొందరికి మంచిగా కన్పించే హాస్యోక్తులు, మరికొందరికి చెత్తగా కన్పించవచ్చు. ప్రపంచంలోనే ఉత్తమ మురికి హాస్యోక్తులు చదువుతుంటే కొందరికి సభ్యతగా కన్పించకపోయినా, వాటిని ఆనందించేవారి సంఖ్య ప్రపంచవ్యాప్తంగా బాగా ఉన్నందునేకదా అలాంటి ప్రచురణలు ప్రాచుర్యంలోకి వస్తున్నాయి! ఇక్కడ రెండు ఉదాహరణలు చూద్దాం.

---

ఒక నాణానికి మూడు ప్రక్కలా చూడగలగడమే హాస్యం. – నెడ్ రోరమ్

ఒకానొక రెస్టారెంట్లో ఒక కొత్త ఖాతాదారుడు కళ్ళకు గుడ్డకట్టుకొని తనకు ఇచ్చిన ఏ మద్యాన్నైనా గుర్తిస్తానని సవాలు విసిరాడు. అలా ముగ్గురితో పందెం కట్టి విజయం సాధించాడు. ఆ తరువాత ఒకతను కప్పులో అందించినదానిని రుచి చూస్తూనే కళ్ళకు కట్టిన గుడ్డ తొలగిస్తూ "నువ్వొక రాక్షసుడివి. అది మద్యం కాదు, మూత్రం" అంటూ తగవుకు దిగాడు. అందుకు ప్రత్యర్థి "అది నిజమే. ఇంతకీ అది ఎవరి మూత్రమో చెప్పు?" అని రెట్టించాడు!

ఒక త్రాగుబోతు స్కాచ్ బాటిల్ కొరకు తన భార్యను అమ్మివేసి, రెండు గంటల తర్వాత బోరున ఏడ్వసాగాడు. అది గమనించిన ఒకతను ఆ బాధితుని వద్దకు వచ్చి "భార్యను అమ్మినందుకు చింతిస్తున్నావా? ఆమె ప్రేమను పోగొట్టుకున్నందుకు బాధ పడుతున్నావా?" అంటూ పరామర్శించాడు. "అదేం కాదండి.... ఆమె మరలా నాకు కావాలండి. నాకు మందు తాగాలని గుబులుగా ఉంది. నా నిషా అంతా దిగిపోయింది" అంటూ ఏడ్వసాగాడు ఆ త్రాగుబోతు!

'మురికి హాస్యోక్తులు' పై పరిమిత స్థాయిలో సర్వే జరిపాము. 20 మంది పాల్గొన్న ఆ సర్వేలో పైన వివరించిన రెండు 'మురికి' హాస్యోక్తులు, మునిమాణిక్యంగారి వివరించి తమ ప్రాధాన్యాలను గుర్తించాలని కోరాము. 20 మందిలో 18 మంది మురికి హాస్యోక్తులు బాగాలేవని చెప్పగా, ఇద్దరు మాత్రం మునిమాణిక్యంగారి హాస్యోక్తి బాగుందన్నారు. విచిత్రమేమంటే, మురికి హాస్యోక్తులను వివరిస్తున్నప్పుడు ఎంతో హుషారుగా విన్న శ్రోతలు ప్రాధాన్యాలను గుర్తించమన్నప్పుడు ఎందుకు ప్రవర్తిం చారో అర్థం కాక, అందుకు భిన్నంగా ప్రశ్నావళిని మార్చి "ఏకాంతంగా చదువుకొని ఆనందించడానికి ఏవి బాగున్నాయి, పదిమందిలో చెప్పుకొని ఆనందించడానికి ఏవి బాగున్నాయి?" అని అడుగగా, 18 మందిలో 15 మంది ఏకాంతంగా కూర్చొని చదువుకోడానికి మురికి హాస్యోక్తులు అనువుగా ఉన్నాయని, పదిమందిలో చెప్పుకోడానికి మునిమాణిక్యం హాస్యోక్తి బాగుందన్న అభిప్రాయం వెలిబుచ్చారు! మొత్తంమీద చెత్త అంటే సామాన్య విషయం కాదని, ప్రపంచవ్యాప్తంగానే దానికి అభిమానులు ఉన్నారని తెలిసింది!

## 24. మరుగుజ్జు హాస్యం (Understatement)

గోరంతదానిని కొండంతగా చేసి చెబితే అతిశయోక్తి అయినట్లుగానే, విషయాన్ని అత్యల్పంగా కుదించి చెప్పడాన్ని ఆత్మన్యూనత అంటారు. అదొకరకమైన సంయమనం లేదా నిగ్రహంలాంటిది. "ఏదైనా ఒకటి విరుగుతుందని భావించినపుడు అది కేవలం వంగిపోతే

హాస్యం అందరినీ ఆహ్వానిస్తుంది. అన్ని అంతరాలను రూపుమాపుతుంది. – ఎమర్సన్

నిజమైన హాస్యం జనిస్తుందంటారు" డబ్ల్యు.సి.ఫీల్డ్. ఇది అతిశయోక్తికి వ్యతిరేకమైనప్పటికీ అతిగా తగ్గించి చెప్పడం కూడా ఒక విధమైన అతిశయోక్తి అనిపిం చుకుంటుందేమో!

ఊడీ ఎలెన్ కు మరణానంతర జీవితంలో విశ్వాసం లేదు. అయినా దేనికైనా మంచిదని ముందు జాగ్రత్త చర్యగా మరణ సమయంలో నాలుగైదు డ్రాయర్లను తనవెంట తీసుకు వెళ్తానన్నారు ఆయన!

కొందరికి చిన్ని వస్తువులంటే ఇష్టం. ఓబ్లోనియాన్స్ జాతికి చెందిన గారిజన్ కెల్లర్. "అయ్యా! మాకు చిన్ని వస్తువుల పై మక్కువ ఎక్కువ. పెద్ద బంగాళదుంపలకన్నా, చిన్నవాటినే మేము అధికంగా ప్రేమిస్తా ము. అట్టహాసం, ఆడంబరం మాకు నచ్చదు" అన్నాడు.

నేను మరణించానండోయ్: నవ్వులకే తాత్వికతను మేళవించే నేర్పరి మార్క్ ట్వెయిన్ ఆయన మరణించినట్లుగా పొరపాటున ఒక వార్త ప్రచారంలోకి వచ్చింది. అది విన్న మార్క్ "నా మరణాన్ని గురించిన వార్తలు గోరంతలు కొండంతలయ్యాయి" అంటూ నవ్వాడు. అంతటితో ఆగితే ఆయన నవ్వులరాజు ఎలా అవుతాడు! "అయ్యా! నేను మరణించాను. అందుకని రేపటినుండి నాకు వార్తా పత్రిక పంపకండి" అంటూ పేపరు ఏజెంటుకు కబురు పంపిన చతురుడు ఆయన.

కొందరు పొగరుబోతుతనంతో లేనిపోని డంబాలు పలుకుతూ యదార్థానికి అందంగా రంగులు పూస్తే, ఉన్నదానిని మరింతగా తగ్గిస్తూ..... మరింతగా కుదిస్తూ దానినొక మరుగుజ్జుగా మార్చడం మరికొందరికి ఆనందం కలిగించవచ్చు.

జపాన్ లో ప్రసిద్ధిచెందిన హాస్యోక్తి. అంతర్ధానము, ధ్యానవిలువలను బోధించే మహాయాన బౌద్ధమతస్తులను జపాన్లో జైన్లు అంటారు. గురువు చావో చౌ తన శిష్యుడు వెన్ ఉవాన్ కు ఒక పోటీ పెట్టి, మానవ విలువలలో అత్యంత క్షుద్రమైన వాటిని ఎలా గుర్తింపు చేసుకోగలరు? అని ప్రశ్నవేస్తూ గురువు

చౌ : నేనొక గాడిదను అంటూ చర్చను ప్రారంభించాడు.

వెన్ ఉవాన్ : నేను గాడిద పిర్రలను

చౌ : నేను గాడిద ముఖాన్ని

వెన్ ఉవాన్ : నేను గాడిద మలాన్ని

చౌ : గాడిద మలంలోని ఈగను

వెన్ ఉవాన్ : ఆ ఈగ కాలిని

---

హాస్యకర్తలు గంభీరులు. అలా ఉండగలిగేది వారొక్కరే. – మార్క్ వాండొరెన్

ఆ తరువాత చౌ కు ఏమి చెప్పాలో తెలియలేదు. అందుకని మాట తప్పిస్తున్నట్లుగా "అక్కడ నువ్వేమి చేస్తున్నావు?" అని ప్రశ్నించాడు. వెన్ ఉవాన్ తడుముకోకుండా "వేసవి సెలవులను గడుపుతున్నానండి" అన్నాడు. బాధలను, దారిద్ర్యాన్ని, నైరాశ్యాన్ని కొనితెచ్చుకోవడమంటే ఇదేనేమో! -

## 25. ప్రాంతీయోక్తులు

మన దేశంలో ఒకే రాష్ట్రంలో నివసించే ప్రజలందరూ మాట్లాడేది ఒకే భాష అయినప్పటికీ కొన్ని పదాలు ఉచ్చారణలోనేగాక వాటి అర్థంలో కూడా చాలా విచిత్రంగా, వింతగా, కొన్ని సమయాలలో హాస్యాస్పదంగా ఉంటాయి.

నెల్లూరులో "ఈ చీరె ధర ఎంత?" అనడానికి "ఈ చీరె ఎంతకు ఎత్తావమ్మా?" అంటారు! రాయలసీమ ప్రాంతంలో కేరమ్స్ ఆడుతూ 'ఆ కాయిన్‌ను నూకు', 'ఆ తలుపును నూకు' అంటారు (కాయిన్ వెయ్యి, తలుపు తొయ్యి అనే అర్థంలో). కడపలో నెట్టు అనడాన్ని 'దొబ్బు' అంటారు. మహాకవి పోతన ప్రహ్లాదుని కథలో 'కొండ పైనుండి దొబ్బించె' అని ప్రయోగించాడు. బస్సును దొబ్బు, స్కూటర్‌ను దొబ్బు అనే పదాలను గుంటూరు, కృష్ణా జిల్లాలలో 'దొంగిలించడం' అనే అర్థంలో వాడతారు. అలానే, కొన్ని ప్రాంతాలలో 'తీసుకురా' అనడానికి 'తోలుకురా' అంటారు. మేల్కొనే ఉందా అన్న అర్థంలో విశాఖపట్నంలో 'తెలివిలోనే ఉందా' అంటారు. పనిమనిషి 'సాయంత్రం రానమ్మా' అని చెప్పడానికి తెలంగాణాలో 'పగటికి రానమ్మా' అంటుంది. పప్పులను బేడలు, డబ్బును పైసలు అనడం ఇందుకు మరికొన్ని ఉదాహరణలు.

ఇంక భాషాపరంగా కూడా కొన్ని విచిత్రమైన అర్థాలు స్ఫురిస్తాయి. స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా బిపిన్ చంద్రపాల్ ఆంధ్రా ప్రాంతంలో పర్యటిస్తుండగా ఒక రోజు ఉదయం "పాలు పాలు" అని ఒకామె కేకవేయడం విన్నాడు. "ఇక్కడ నన్నెవరు పిలుస్తున్నారబ్బా?" అంటూ ఆశ్చర్యంగా ప్రక్కనున్న మిత్రులను అడిగారట. "మా భాషలో పాలు అంటే ఆంగ్లంలో మిల్క్ అని అర్థం. ఆమె పాలు అమ్ముకుంటూ అలా కేకవేస్తుంది" అని వారు వివరించడంతో ఆయన ఎంతో ఆనందించారట. మన దేశంలో ఇటీవల కాలంలో ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి పేరు ముండా. ఆ పదం తెలుగువారికి వింత అర్థాన్నిస్తుంది కదా!

మద్రాసు వనితకు నరసరావుపేటలోని ఒక జడ్జిగారితో వివాహమైంది. ఆమె కొత్తగా కాపురానికి వచ్చిన రోజు అది. ఆమెను పలకరించడానికి వచ్చిన బంధువర్గం పిచ్చాపాటి మాట్లాడుతూ ఉంటే, ఏమీ మాట్లాడకుండా కూర్చున్న భర్తను చూసి నవ్వుతూ "అందరూ తెగ

వాగుతుంటే, మీరేంటి అసలేమీ వాగరు?" అనడంతో అక్కడ కూర్చున్నవారంతా పెళ్ళికూతురి మాటలు విని నిశ్చేష్టులయ్యారు! చెన్నైలోని తెలుగువారు మాట్లాడటం' బదులు 'వాగడం' అంటారని తెలియనివారికి చిరుకోపం రావడం ఎంత సహజమో, ఆ విషయం తెలిసినవారికి నవ్వు రావడం అంతే సహజం కదా!

మన దేశం నుండి ఓ సాంస్కృతిక బృందం కొన్ని సంవత్సరాల క్రితం రష్యా వెళ్ళింది. ఆ బృందంలో ఒక భారత యువతి కూడా ఉన్నది. ఆ బృందానికి మంచి చెడలు చూసుకునేందుకు అధికారులతో పాటు ఒక పాతికేళ్ళ అమ్మాయిని నియమిం చారు. తాష్కెంట్ విమానాశ్రయంలో దిగగానే భారత యువతి రష్యన్ యువతితో నవ్వుతూ "అయామ్ రాధా" అనగా, ఆ రష్యన్ యువతి కూడా "అయామ్ ఆల్సో రాధా" అంది. ఆ తరువాత ఒక గైడ్ ఆ బృందానికి ఆ ప్రదేశం, ఈ ప్రదేశం చూపిస్తూ, అందరినీ పరిచయం చేస్తూ "షీ ఈజ్ రాధా, హీ ఈజ్ రాధా, దే ఆర్ రాధా" అన్నాడు. "రష్యా నిండా రాధాలేనా?" అని హిందూ యువతి ఆశ్చర్యంగా ప్రశ్నించడంతో రష్యా యువతి "రాధా అంటే రష్యన్ భాషలో 'సంతోషం' అని అర్థమ"ని చెప్పడంతో హిందూ రాధ మరింత ఆశ్చర్యపోయింది! ఈ విధంగా ప్రాంతీయోక్తులు కొన్ని సందర్భాలలో గొప్ప హాస్యోక్తులుగా నవ్వు తెప్పిస్తాయి.

మనం ఆచారం అనేదానిని ఆంగ్లంలో కస్టమ్ అంటారు. తెలుగులో 'కష్టం' అంటే బాధ కదా! ఇలా భిన్న భాషలలో పదాలను తెలుసుకుంటుంటే ఎన్ని నవ్వుల పువ్వులు పూస్తాయో చెప్పలేము. అందుకే ప్రాంతీయోక్తులలో ఎంత హాస్యం ఉంటుందో, అంతర్ రాష్ట్రీయ, అంతర్జాతీయ యుక్తులలో కూడా అంతే హాస్యం తొణికిసలాడుతుంది. ఎటొచ్చీ ఆహాస్యాన్ని ఆస్వాదించే శక్తి ఉండాలి.

## 26. విధ్వంసక హాస్యం (Subversive Humour)

శక్తిమంతులు తమ ఆధిపత్యాన్ని నిలుపుకోడానికి హాస్యాన్ని ఉపయోగించుకుంటే, దిగువ శ్రేణి అధికారులు తమ పై అధికారులను అదుపులో ఉంచడానికి సామాజికంగా ఆమోదయోగ్యమైన విధానంగా హాస్యాన్ని ఉపయోగించుకుంటారు. కర్మాగారాలు, వర్క్ షాప్లు, కార్యాలయాలు లో అధికారం, శక్తి ఆధారంగా సంబంధాలు నెలకొల్పబడతాయి. అలాంటిచోట ఉన్నతాధికారుల భావజాలానికి భిన్నమైన, వ్యతిరేకమైన, విమర్శనాత్మక మైన సందేశాన్ని అందజేయడంలో హాస్యం అత్యంత ఉపయుక్తమైన సాధనంగా సాయపడుతుంది.

---

ప్రమాదకరమైన దానిని ప్రమాదకరం కాని రీతిలో వ్యక్తపరచడమే హాస్యం. – సిసిరో

మేనేజర్ బెత్ కార్యదర్శి మెరియన్ తో :"మెరియన్! స్వల్ప విషయాల పై మన దృష్టిని సారించాలి కనుక ప్రస్తుతం ముఖ్యమైన విషయాలను వెనక్కు నెడదామా?" అనడంతో అందరూ హాయిగా నవ్వుకున్నారు. బెత్ యొక్క వ్యంగ్య ప్రకటనలో సభ్యులు కాలక్షేపం కబుర్లు కట్టి పెట్టి కార్యసాధనకు సంసిద్ధులవ్వాలన్న సందేశం విన్పిస్తుంది.

మెమో పైన తేదీని తప్పుగా ఇచ్చినందుకు అధికారి విమర్శకు గురౌతాడు శ్యామ్. అయితే, ఆయన హాస్య ధోరణిలో "ప్రతి విషయంలో పరిపూర్ణత్వాన్ని సంపాదించడం నాకు నిజంగా కష్టంగానే ఉంది" అనడంతో ఉద్యోగులందరూ హాయిగా నవ్వారు. క్విప్స్ (Quips) అంటే చమత్కార దూషణం, శ్లేష, శబ్ద చమత్కారం అని అర్థం. వాణిజ్య సమావేశాలలో ఆనాటి చర్చనీయాంశం పై సంక్షిప్తంగా, కొన్ని సమయాలలో హాస్యంగా, వ్యంగ్య ప్రధానంగా చేసే విమర్శలను క్విప్ అంటారు. పై ఉదంతంలో తనను గురించిన విమర్శకు ఎవ్వరూ నొచ్చుకోకుండా అందంగా సమాధానమిచ్చాడు శ్యామ్. అలానే తన పని భారాన్ని గురించి కూడా తెలిపినట్లు కన్పిస్తుంది. ప్రాజెక్ట్ టీమ్ సమావేశాలలో ఇలాంటి విమర్శలు 74 శాతందాకా ఉంటాయంటారు పరిశోధకులు జానెట్ హోమ్స్ & మెరిడిత్ మర్రా.

వాణిజ్య సమావేశాలలో జరిగే చర్చలతో ఏకీభవించలేనప్పుడు ఒకానొక వర్గం చేసిన నిర్ణయాల పై తమ అసమ్మతిని తెలపడానికి హాస్యం ఒక సాధనంగా తోడ్పడుతుంది. సంస్థలో నెలకొన్న యథాతథ స్థితిని సామాజిక ఆమోదం పొందే పద్ధతిలో వ్యతిరేకించడంలో ఈ విధానం ఉపయోగపడుతుంది. అయితే, ఈ విధ్వంసక హాస్య ప్రయోగంలో మనం ఒక్క విషయాన్ని మరచిపోకూడ దు. ఆధిక్యతా భావనలేని పాలనా వ్యవస్థలో క్రింది ఉద్యోగులకు ఉన్న స్వేచ్ఛ, స్వాతంత్ర్యం మిగిలిన వ్యవస్థలలో ఉండదు. ఉదాహరణకు, అమెరికాలో 3 లేక 4వ తరగతి చదివే పిల్లలు కూడా తమ ఉపాధ్యాయులతో "హాయ్" అంటూ కరచాలనం చేస్తారు. ఎంతో స్వేచ్ఛగా వారితో తిరుగుతారు. అదే సంస్కృతిని మన దేశంలో ప్రవేశపెట్టగలమా? సామాజికంగా ఇక్కడ గురుశిష్యులు రెండు వర్గాలుగా విభజించ బడటమే దీనికి కారణం.

అలానే మన కార్యాలయాలలో ఆధిక్యతా భావం అత్యధికంగా కన్పిస్తుంది. కొన్ని కొన్ని శాఖలలో ఉన్నతాధికారి తన క్రింది ఉద్యోగిచే ఇంటిపనులు కూడా చేయించుకుంటాడు. ఉద్యోగం వారికొక స్టేటస్ సింబల్. అలాంటివారితో ఏ ఉద్యోగీ హాస్యధోరణిలో ప్రసంగించే సాహసం చెయ్యడు. పిల్లల హాస్యం అందరకు హర్షణీయమే కనుక దానిని గురించి వివరంగా చూద్దాం.

---

తన వైరుధ్యాలపై సాధించిన విజయమే సుఖాంత రూపకం. – హెగెల్

అధాయం : 22

# పిల్లల హాస్యం

ఉపాధ్యాయుడు : మీకు యుద్ధం అంటే ఇష్టమా? శాంతి అంటే ఇష్టమా?

పిల్లలు : శాంతి అంటేనే ఇష్టం (ముక్త కంఠంతో చెప్పారు)

ఉపాధ్యాయుడు : ఎందుకని?

పిల్లలు : యుద్ధాలు లేకుంటే సంధి, ఒడంబడికలు ఉండవు. చరిత్ర భారం తగ్గుతుంది. మాకు హాయిగా ఉంటుంది సర్!

మూడవ తరగతి చదివే హారికకు ఒకరోజు తల్లిదండ్రులు "త్వరలోనీకు తమ్ముడు పుట్టబోతున్నాడు" అని చెప్పడంతో బోల్డంత ఆనందం వేసింది. ఆ వార్తను క్లాసు పిల్లలందరితోను, టీచర్ తోను హుషారుగా చెప్పింది. “మా తమ్ముడి కోసం బొమ్మలు కొన్నాము” అని ఒక రోజు, “డ్రస్సులు కొన్నాము” అని మరొకరోజు, “బబ్లూ అని పేరు పెడతాము” అని ఇంకొకరోజు - ఇలా ప్రతిరోజు ముద్దుముద్దుగా టీచరకు కబుర్లు విన్పించేది. ఒకరోజు తల్లి హారికను పిలిచి “ఏమ్మా! నా పొట్టలో నీ తమ్ముడు ఎలా కదులుతున్నాడో చూడు!” అంటూ పాప చెయ్యి తన పొట్టమీద పెట్టుకుంది. అలా కొంచెం సేపు గడిచిన తర్వాత బయటకు వెళ్తూ అమ్మవైపు అదోలా చూసింది హారిక.

ఆరోజు నుండి స్కూల్లో చాలా మూడీగా ఉండటంతో ఆమె స్నేహితురాళ్ళకు, టీచరుకు చిన్నారి హారిక ఎందుకు అలా అయిందో అర్థం కాలేదు. ముభావంగా కూర్చుంటున్న హారికను చూసిన టీచరకు జాలి వేసి, ఒకరోజు ప్రేమగా “ఏమైందమ్మా?” అని బుజ్జగించడంతో ఇంక దుఃఖం ఆపుకోలేని ఆ చిన్నారి టీచర్ మెడ చుట్టూ చేతులు వేసి బావురుమంది. విషయం అర్థంకాని టీచర్ ఆశ్చర్యంగా “ఏమైం దమ్మా? ఎందుకు ఏడుస్తున్నావు?” అని లాలనగా అడిగింది. అంతే! హారిక వెక్కి వెక్కి ఏడుస్తూ “ఇంక నాకు తమ్ముడు రాడు. మా అమ్మ వాణ్ణి మింగేసింది టీచర్” అంటూ ఆమె ఒడిలో తలదాచుకుంది!

అమాయకత్వానికి ప్రతిరూపం పిల్లలు. పాలుగారే మోములతో, తేనెలొలికే మాటలతో చిన్నారులు అందరినీ ఆకర్షిస్తారు. వారి రూపం ఎంత ముచ్చటగా ఉంటుందో, వారి మాటలు అంతకన్నా ముద్దుగా, మధురంగా ఉంటాయి. నిజం చెప్పడం వారి సొత్తు. అరమరికలు లేకుండా జీవించడం వారి తత్వం. అందుకే చిన్నారులను దేవుళ్ళతో పోలుస్తారు.

---

విద్యుల్లతలా మెరిసే సరసోక్తిని ప్రతి ఒక్కరూ ప్రశంసిస్తారు. – లార్డ్ చెస్టర్ ఫీల్డ్.

మనిషి వ్యక్తిత్వ వికాసానికి బాల్యమే పునాది. ఆ చిన్నారులు అడిగే ప్రశ్నలకు కొన్ని సమయాలలో తల, తోక ఉండనట్లే, మరికొన్ని సమయాలలో మన బుఱ్ఱ తినగల దిట్టలు వారు. వారి ముద్దు ప్రశ్నలకు తల్లిదండ్రులు ఆనందంగా మురిసిపోతూ సమాధానం చెప్పడం ఎంత సహజమో, ఆ ప్రశ్నలకు సమాధానం తెలియనప్పుడు చిర్రుబుర్రులాడటం కూడా అంతే సహజం!

అయితే, ఈ విషయమై ఒక పర్యాయం అక్బర్ బీర్బల్ తో ససేమిరా ఏకీభవించలేదు. “పిల్లలు అడిగే ప్రశ్నలన్నింటికీ, చక్కగా సమాధానం చెప్పవచ్చు” అన్నాడు అక్బర్. “అది సాధ్యంకాదు” అన్నాడు బీర్బల్. ఆ సమస్యా పరిష్కారానికి ఒకనాడు అక్బర్ తండ్రిగా, బీర్బల్ కుమారుడిగా నటన సాగించారు. “నాకొక ఆవు కావాలి” అన్నాడు బాల బీర్బల్. (ఓస్! ఇంతేకదా అనుకుంటూ) ఒక ఆవును తెమ్మని ఆజ్ఞాపించాడు అక్బర్. “నాకు పాలు కావాలి” అన్నాడు బీర్బల్. క్షణాలలో గ్లాసు నిండా పాలు పిండి ఇప్పిస్తూ....... ఇంత సులువైన ప్రశ్నలు వస్తున్నందుకు అక్బర్ లోలోన మురిసిపోయాడు. “ఈ పాలను మరల ఆవు పొదుగులో పొయ్యాలి” అని బీర్బల్ మారాం చేయడంతో అక్బర్ అయోమయంలో పడ్డాడు. అసాధ్యమైన ఆ కోరికను విన్న తర్వాతగాని పిల్లలంటే పిడుగులు అన్న వాస్తవం అక్బర్ కు అర్థం కాలేదు.

ప్రశ్నలేని జగతి ప్రగతికి నోచుకోదు. అందువల్లనే పిల్లల ప్రశ్నలను పెద్దలు ఆహ్వానించాలే కాని, అణచి పెట్టకూడదు. థాంప్సన్ మాటలలో “పసి ఆలోచనలను పెంచి, అవి ఎలా ఎదగాలో పసివాళ్ళకు నేర్పడం గొప్ప విద్య”. మరీ కష్టమైన ప్రశ్నలకు “నువ్వు ఇంకొంచెం పెద్దవాడివి అయిన తరువాత ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు అర్థమవుతాయిలేమ్మా” అని నెమ్మదిగా వివరించవచ్చు లేదా హాస్యంతో విషయాన్ని మార్చవచ్చు.

అందుకే పిల్లల పుస్తకాలలో హాస్యానికి కార్టూన్లు నీతి కథలకు, అగ్రతాంబూలం ఉంటుంది.. మరొక విశేషం ఏమంటే, పిల్లల పుస్తకాలలో హాస్యోక్తి అతిశయోక్తి రూపంలో ఉంటుంది. చిన్నారులకు ఆనందం కావాలి, సరదా కావాలి, నవ్వు కావాలి. అందుకే వాళ్ళు కార్టూన్ చిత్రాలను అలానే కన్నార్పకుండా చూస్తారు. 1744లో ప్రథమంగా జాన్ న్యూబెరీ ఒక పుస్తకాన్ని ప్రచురించడంతో చిన్నారుల పై ప్రచురణలు ప్రారంభమయ్యాయి.

పిల్లల హాస్యంలో ప్రధానంగా యాక్షన్ ఉండాలి. అక్కడ కదలికలు ముఖ్యం. మాటలకన్నా చేతలు, అభూతకల్పనలు ప్రధాన భూమిక వహిస్తాయి. ఈ రహస్యాన్ని

---

ఆశ్చర్యాన్ని కలిగించే అప్రస్తుత విషయాల మూలంగా నవ్వు జనిస్తుంది. – సిడ్నీ స్మిత్

తెలుసుకున్న వాల్ట్ డిస్నీ తన కార్టూన్ చిత్రాలద్వారా పిల్లలకు ( పెద్దలకు కూడా) అత్యంత సన్నిహితుడయ్యాడు. తాను నిర్మించిన టామ్ & జెర్రీ చిత్రాలు ఎన్ని పర్యాయాలు చూసినా మరొక్క పర్యాయం చూడాలన్న తపన కల్పింపజేయడం డిస్నీ అసాధారణ మేధకు, విజ్ఞతకు ఒక ఉదాహరణ. అక్కడ కన్పించేవన్నీ ఆశ్చర్యాలు, అసాధ్యాలు, అద్భుతాలే. అందుకే అవి ఆనందానికి నిలయాలయ్యాయి, ఆశ్చర్యానికి కేంద్రాలయ్యాయి. పిల్లలకేగాక పెద్దలకు కూడా అవి ప్రీతిపాత్రమయ్యాయి.

"టింకూ! పిల్లి ఎందుకు అరుస్తుంది? దాని తోక తొక్కుతున్నావా?" అని తల్లి అడిగితే, "అది నా కాలిక్రింద తన తోక పెట్టడమేగాక, అలా అరుస్తూనే ఉందమ్మా" అని బుకాయించాడు టింకు.

అమాయకత్వానికి ప్రతీకలైన ఆ చిన్నారులు తమ తల్లిదండ్రులకు ఏమీ తెలియదను కుంటారు. "మా నాన్నకు రోడ్డు దాటాలంటే భలే భయంరా" అన్నాడు రవి. "నీకెలా తెలుసు?" అడిగాడు ప్రసాద్. "మామూలుగా రోడ్డు పైన నడుస్తుంటామా....... అప్పుడు బాగానే ఉంటాడు. రోడ్డు దాటాల్సివచ్చినప్పుడు మాత్రం వెంటనే నా చెయ్యి పట్టుకుం టాడు" అంటూ సన్నగా నవ్వాడు చిన్నారి రవి.

అమాయకత్వం వెనుక దాగిన తెలివితేటలకు మచ్చుతునక అయిన ఒక ఉదంతం : నాలుగవ తరగతిలో టీచర్ లెక్కలు బోధిస్తూ. "గుర్రం గంటకు 27 మైళ్ళ దూరం పోతుంది. 9 గంటలలో ఎంత దూరం పోతుంది?" టీచర్ బెత్తాన్ని ఝళిపిస్తూ మోహన్ దగ్గరకు వచ్చాడు. సమాధానం తెలియని మోహన్ వీపుమీద వాతలు పడటం తప్పదన్న భీతితో బెంబేలెత్తిపోయాడు. "సమాధానం చెప్పవేరా?" అని టీచర్ గదమాయించడంతో ఉలిక్కి పడ్డ మోహన్ "ఆ గుర్రం మధ్యలోనే చచ్చిపోతే ఎలా సార్?" అనడంతో క్లాసంతా గొల్లుమంది.

"నీళ్ళలో రాయి మునుగుతుంది, కప్ప తేలుతుంది. ఎందువల్ల?" అడిగాడు టీచర్. "రాయికి ఈతరాదు కాబట్టిసార్" వెంటనే సమాధానం చెప్పాడు విద్యార్థి.

'పిల్లలు గొప్ప నియంతలు"అని కొనియాడారు ప్రఖ్యాత తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్. "ఊయలలోని పాప ఏడుపు అనే అస్త్రంతో ఎవరినైనా శాసించగలదు, ఏ పనైనా చేయించుకోగలదు! అంటే తన ఆయుధం ఏడుపు' అన్న సంగతి పాపకు తెలుసన్నమాట!" అంటారు ఆయన. అంత అమాయకత్వంలో కూడా ఎన్ని తెలివితేటలో!

---

నవ్వనివారు, సంగీతాన్ని ఆనందిచనివారు ప్రమాదకరమైన వ్యక్తులు. – షేక్ స్పియర్

క్లాసు జరుగుతూంది. టీచర్ ప్రశ్నలు వేస్తూ "ఒరేయ్ ప్రకాష్ వచ్చే జన్మలో నువ్వు ఎలా పుట్టాలనుకుంటున్నావురా?" అని ప్రశ్నించాడు టీచర్. "జిరాఫీగా పుట్టాలన్నది నా కోరికండి" అన్నాడు ప్రకాష్, "ఎందుకని?" అడిగాడు టీచర్. "నన్ను కొట్టడానికి అప్పుడు మీకు నా చెంపలు అందవు కదా!" అనడంతో టీచరుకు నవ్వు ఆగలేదు.

"ఈ ఉత్తరం నా ఫ్రెండ్ కు తొందరగా చేరాలి. దీన్ని వెంటనే పోస్ట్ చేసిరా రమేష్" అంటూ ఓ ఉత్తరాన్ని కుమారునికి ఇచ్చాడు తండ్రి. అరగంట తరువాత ఉత్తరంతో తిరిగి వచ్చిన కుమారుణ్ణి చూసి "ఉత్తరం పోస్ట్ బాక్స్ లో వేయకుండా వెనక్కి తెచ్చావేందిరా?" ప్రశ్నించాడు ఆయన. "ఏ పోస్ట్ డబ్బా చూసినా అన్నిటికీ తాళం వేసివుంది నాన్నా! నువ్వేమో అది తొందరగా వెళ్ళాలి అన్నావు కదా! అందుకే ఏంచెయ్యా లో తెలియక తీసుకువచ్చేశా" అన్నాడు రమేష్ అమాయకంగా.

గడసరితనానికి తార్కాణం : "అలా ఏడవకూడదు బాబూ!" అంటూ మనవడు కిట్టూని ఓదారుస్తుంది మామ్మ తాయారమ్మ. "మామ్మా నువ్వూరుకో. నాన్న దగ్గర అమ్మ ఏడ్చే దొంగేడుపు కాదు నాది....... తెలుసా?" దబాయించాడు కిట్టు. " పేరు పిల్లల్లో సృజనాత్మకత హెచ్చు. ఫ్రిజ్ లో నుండి తీసిన యాపిల్ పండు చుట్టూ ఉన్న నీటి బిందువులను చూసిన పాప "ఈ పండు స్నానం చేసిందా మమ్మీ?" అంటుంది. రంగురంగుల సలాడ్ ని చూసి "ఇది అందమైన దుస్తులు వేసుకుందే!" అని మురిసిపోతుంది. పిల్లలు ఆడుకుంటూ పోట్లాడుకోవడం ఎంత సహజమో, కొన్ని క్షణాలలోనే వాళ్ళు ఆ కీచులాటను అందమైన ఆటగా మార్చడం అంతే సహజం.

చివరగా పిల్లల హాస్యం పై జరిగిన పరిశోధనల గురించి క్లుప్తంగా తెలుసుకుందాం. తల్లిదండ్రుల ముఖాలలోని ఆనందం, నవ్వులు, ప్రేమ పాప ఆనందాన్ని తీర్చిదిద్దుతాయి. ఏమీ తెలియని రెండు నెలల వయస్సులోనే పిల్లలు ముద్దుగా నవ్వడం సృష్టి విచిత్రం. మోకాళ్ళపై కూర్చోబెట్టుకుని ఎగురవేయడం, చక్కిలిగింతలు పెట్టడం, అటుఇటు వంచడం, వేళ్ళతో పొట్టమీద నుండి బూష్, బూష్ అంటూ కదిలించడంలాం టి భౌతిక సంబంధమైన చర్యలు వాళ్ళకు నవ్వు తెప్పిస్తాయి. పాపకు ఆరు, ఏడు మాసాలు వచ్చేటప్పటికి తల్లిదండ్రుల

సంవత్సరం వయస్సు దాటేటప్పటికి పేర్లు పలకడం, వాటికి నూతన రూపాలు ఇవ్వడం జరుగుతుంది. 'పావలా' 'పాలవా'గా, 'ఎగిరిపోయింది' (ఎగిలిపోయింది'గా అవుతాయి. మా పెద్దపాప చిన్నప్పుడు కొబ్బరికాయకు డొబ్బరికాయ అని నామకరణం చేసి అందరినీ నవ్వించేది. మా మనుమరాలు మరీ చిన్న తరగతుల లోని పిల్లలకు భౌతిక

---

హాస్యం చాలా గంభీరమైంది. – విన్ స్టన్ చర్చిల్

అర్థరాహిత్యా లంటే మహా ఆసక్తి. డేవిడ్ మెక్ ఫీల్డ్ తన చిన్నపిల్లల కథల పుస్తకంలో వెంటాడుతున్న వేటగాళ్ళ నుండి రక్షించుకోడానికి ఏనుగు ఇతర అడవి జంతువులైన సింహం, కోతిలాగా ప్రయత్నించి, చివరకు చిలుక ఈకలను నిండుగా కప్పుకొని ఎలా తప్పించుకుందో తెలిపిన తీరు ప్రపంచవ్యాప్తంగా చిన్నారులకు ప్రియాతిప్రియంగా మారింది.

కొద్దిగా వయసు పెరిగేటప్పటికి ఇతర పిల్లలతో కలసి శాబ్దిక హాస్యం నేర్చుకుంటారు.

బాలలపాటలు ఎంత అందంగా వుంటాయో చూడండి.

చిట్టి చిలకమ్మ
అమ్మ కొట్టిందా
తోటకెళ్ళావా
పండు తెచ్చావా
గూట్లో పెట్టావా
గుటుక్కున మింగావా?

ఈ చిలకమ్మ పాట తెలుగు పిల్లల నోట ఎంతగా వ్యాప్తి చెందిందో తెలిసిందే!

మూడవ సంవత్సరం రావడంతో పిల్లల్లో రూపభావన (concept) ఏర్పడుతుంది. కుక్క అనడంతో అదొక ప్రత్యేక జాతి జంతువు అని తెలుస్తుంది. అది "భౌ" అని అరుస్తుందని, ఎత్తు పొడవులలో ప్రత్యేకత ఉంటుందన్న సాధారణ తెలివితేటలు అబ్బుతాయి. 3 నుండి 6 సం||ల వయస్సుగల పిల్లలు మామూలుగా నోరు తెరవమంటే ఏడుస్తారని దంతవైద్యులు కొన్ని చిట్కాలు పాటిస్తారు. "అవును పాపా! నీకు పళ్ళు వచ్చాయో లేదో చూద్దాం. నోరు తెరువమ్మా" అనడంతో పాప బుద్ధిగా నోరు తెరుస్తుం ది. "నీ నోటికి కిటికీలు లేవుకదా! మరి లోపల చూడాలంటే ఏంచెయ్యాలి? బ్యాటరీ లైట్ వేద్దామా?" అంటూ పిల్లలను నవ్విస్తూ ఏడుపునుండి మళ్ళిస్తారు.

అబ్బాయిలు ఘర్షణా ప్రధానమైన హాస్యానికి ప్రాధాన్యమివ్వగా, అమ్మాయిలు గృహ సంబంధ హాస్యాన్ని ఇష్టపడతారని, కార్టూన్ చిత్రాలలో కూడా బాలురు శృంగార హాస్యానికి ఇష్టపడితే, బాలికలు అర్థవంత హాస్యానికి ప్రాధాన్యం ఇస్తారని చెబుతారు. అలానే, బాలురు పదిమంది ఎదుట హాస్యోక్తులు విసరడానికి ఆసక్తి చూపితే, బాలికలు మాత్రం అలాంటి ప్రదర్శనల పై ఆసక్తి కనపరచరు. క్రమంగా ప్రతికూల పరిస్థితుల పైన, పరిసరాల పైన తన

ఇతరులు నిన్ను చూచి నవ్వే ముందుగా నీవే నవ్వడం నేర్చుకో. – ఎల్సా మాక్స్ వెల్

నియంత్రణను నిలుపుకోవడంలో హాస్యం తోడ్పడుతుందని గ్రహిస్తారని ఈ రంగంలో అద్భుత కృషిగా వించిన డా|| పాల్ మాషీ పేర్కొన్నారు'.

చివరగా రెండు విషయాలు గుర్తుంచుకోవాలి. ఎ) పిల్లల హాస్యభావన వారి విజ్ఞాన ప్రగతికి దర్పణం పడుతుంది. బి) హాస్యం వారిలో ఒక క్రీడగా, మాటల క్రీడగా, విజ్ఞాన క్రీడగా ఎదుగుతుంది. వయస్సు పెరిగే కొద్దీ పిల్లల భౌతిక అవసరాలు, విజ్ఞాన సంపత్తి పెరిగినట్లుగా వారి ఆలోచనా సరళిలోనూ, హాస్యోక్తులను ఆనందించడంలోనూ ప్రగతి కనిపిస్తుంది.

తల్లి, కుమార్తె అలా నడుస్తూ పోతున్నారు. దారిలో ఒక చాక్లెట్ కన్పించడంతో కుమార్తె వంగి దానిని తీసుకోబోయింది. అంతలో తల్లి "అలా మట్టికొట్టుకున్న పదార్థాలను తినకూడదు తల్లీ! వదిలెయ్" అంది. "ఎందుకని మామ్?" ముద్దుగా ప్రశ్నించింది చిన్నారి. "అందులో విషక్రిములుంటాయి చిన్నా" తల్లి సమాధానం. "నీకెలా తెలుసు?" ప్రశ్నించింది కుమార్తె. ఏం సమాధానం చెప్పాలో తెలియక తల్లి కొంచెం సేపు మౌనం వహించి, వెంటనే "దేవుడు పంపుతాడమ్మ" అంది... "అయితే ఆ టెస్టులో తప్పినవారు డాడ్ గా పుడతారా?" ఆశ్చర్యంగా అడిగింది చిన్నారి!

ఇంక మహిళల హాస్యంలోకి ప్రవేశిద్దామా!

అధ్యాయం : 23

# మహిళల హాస్యం

ఓ నాజూకైన యువతి ఖరీదైన కారులో పోతూ ఒకావిడకు యాక్సిడెంట్ చేసి తుర్రుమంది. ఇంతలో పోలీసువచ్చి "ఏమ్మా కారు నంబరు, రంగు గుర్తున్నాయా?" అంటూ ప్రశ్నించాడు. "ఆ వగలాడి నన్ను గుద్ది పోయింది. కిందపడి నేనేడుస్తుంటే అవన్నీ నాకెక్కడ గుర్తుంటాయి చెప్పు? అయినా...అదేంటి కానిస్టేబులూ ఎరట్రి లిప్ స్టిక్, ఆకుపచ్చ టిక్లీ బొట్టు పెట్టింది ఆవిడ. ఇదెక్కడి కాంబినేషనయ్యా? అన్నట్లు గులాబీ రంగు చీర...బార్డర్ మీద పచ్చటి హంసల బారు. అవును. ఎక్కడైనా పచ్చటి హంసలుంటాయా చోద్యం కాకపోతే.... అన్నట్లు డైమండ్ నక్లెస్ పెట్టింది. అది భలే మెరుస్తుందిలే. అయినా...అవి ఒరిజినల్ డైమండ్స్ కాదయ్యా....అమెరికన్ డైమండ్స్ నకిలీ సరుకులా ఉన్నాయి. అందుకే అంత బడాయి..... "అమ్మా! కంప్లైంట్ ఏమైనా రాయమం.."పోలీసు ప్రశ్న. "ఉండవయ్యా! ఆమె తలలో ఏ రంగు పూలు పెట్టుకుందో గుర్తొచ్చి చావట్లేదు" అంటుంటే పోలీసుకు నిజంగ పిచ్చెక్కినట్లయింది!

ఆడవాళ్ళు......నిజంగా......అసాధ్యులు. సగటు పురుషునిలో కన్నా సగటు మహిళలో లోకజ్ఞానం అధికం; పరిశీలనా దృష్టి హెచ్చు. ఒక్క వాలుచూపుతో ఓ మహిళ ఎదుటవున్న పురుషుణ్ణి నఖశిఖ పర్యంతం స్కాన్ చేయగలదు. అదే పురుషుడైతే...... మీకు తెలిసిందేగా! వారి హాస్యం కూడా వారిలాగానే సున్నితంగా, చురుకుగా ఉంటుం ది. అయితే, చిత్రం ఏమంటే వారి మనస్తత్వంలాగానే అనేక సందర్భాలలో వారి హాస్యోక్తులలోని అంతరార్థం అంత సులువుగా అర్థం కాదు.

ఒక మహిళ గోల్ఫ్ ఆడుతూ ఆ బంతి కన్పించక దానిని వెతుక్కుంటూ అడవిలోకి పోయింది. అక్కడ ఆమెకు ఆపదలో ఉన్న ఒక కప్ప కన్పించి దీనంగా "నాకు సాయం చేస్తే నీకు మూడు వరాలిస్తా" అంది. దాంతో సంతోషించిన ఆమె ఎంతో ఆదరంతో ఆ కప్పకు సాయం అందించింది. ఆమె సేవలతో సంతృప్తి చెందిన కప్ప ఆమెను మూడు వరాలు కోరుకోమనడంతో, ఆమె ఇలా కోరుకుంది: "ప్రపంచం మొత్తంలో నేనే అందగత్తెను కావాలి". అది విన్న కప్ప "అమ్మా! ఒక్కటి గుర్తుంచుకో. నీవేది కోరుకున్నా దాని ఫలితం నీ భర్తకు 10 రెట్లు అధికంగా వస్తుంది" అంది. "సరే" అంటూ ఆమె "నేను గొప్ప సంపన్నురాలిని కావాలి" అని రెండవ వరంగా కోరుకుంది. కప్ప నవ్వుతూ "అలాగే

---

బాల్యం యొక్క సహజసిద్ధమైన శబ్దమే హాస్యం. – ఆల్విన్ ష్వాడ్జ్

అగుగాక" అంటూ "మరి నీ మూడవ కోరిక ఏమిటి?" అని ప్రశ్నించింది. అందుకు ఆ సుందరాంగి నవ్వుతూ "నాకు తేలికగా గుండెనొప్పి రావాలి" అనడంతోనే ఆ కప్ప ఆశ్చర్యపోతూ "అమ్మో! ఆడవారు అసాధ్యు లే" అంటూ విస్తుపోయింది!

స్త్రీ పురుషుల హాస్యం - వ్యత్యాసాలు : 'పువ్వు పువ్వుకు తేడా ఉన్నట్లే నవ్వు నవ్వుకు తేడా ఉంటుంది" అన్నాడొక కవి. అయితే, స్థూలంగా నవ్వులను స్త్రీ, పురుష నవ్వులుగా విభజిస్తాము. మరి మగువ నవ్వుకు, మగవాడి నవ్వుకు మధ్య వ్యత్యాసం ఉంటుందా? గొంతునుబట్టి సాధారణ భాషలో "అవును" అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఒక హాస్యోక్తిని విని స్త్రీ పురుషులు ఎలా నవ్వుతారు అనే అంశం పై ఐర్లండ్ దేశానికి చెందిన జో అన్నీ బోచోరొవెస్కి బృందం కొన్ని ప్రత్యేక పరిశోధనలు జరిపి మూడు వ్యత్యాసాలు ఉన్నట్లు తెలిపింది.

1. స్త్రీలు సుకుమారంగా, వయ్యారం ఉట్టిపడేలా నవ్వితే, పురుషులు గట్టిగా తుమ్మినట్లో, దగ్గినట్లో నవ్వు తారట!

2. స్త్రీ పురుషులు స్పందించే విషయాలలో కూడా అనేక వ్యత్యాసాలు కన్పిస్తాయి.

అ) హాస్యాన్ని సృష్టించడంలో మహిళలు అసామాన్యులు. కథను రక్తి కట్టించడంలో, హాస్యభరితంగా పోషించడంలో వారికి వారే సాటి. ఇబ్బందులు, సమస్యలు, కష్టాలు మొదలైన విషయాలను గురించి చెప్పినప్పుడు మగవారికి నవ్వు వస్తుంది కాని, మహిళల కు రాదట!

ఆ) స్త్రీలకన్నా పురుషులు హాస్యాన్ని ఎక్కువగా ఉపయోగిస్తారని, వారికి ప్రధానంగా కామ సంబంధ హాస్యోక్తుల పైన (సెక్స్ జోక్స్) మోజు ఎక్కువ.

ఇ) ప్రఖ్యాత రచయిత్రి నాన్సీ వాకర్ "మహిళలకు కథలయందు ఉన్నంత ఆసక్తి చతురోక్తులు విసరడం పై ఉండదు. వారి దృష్టిలో హాస్యం ఒక సందేశమే కాని, ఒక ప్రతిపాదన కాదు. అనుభవాన్ని పంచుకోవడ మే కాని, తెలివితేటలమ ప్రదర్శించడం కాదు" అన్నారు.

ఈ) "మహిళలు మొరటు హాస్యోక్తుల పై ఆసక్తి చూపరు. అలానే వికలాంగుల పై హాస్యోక్తులు చెప్పరు. అయితే, పురుషులు ప్రతి చిన్నదానికి చిన్నపిల్లల్లా హ!హ! అంటూ నవ్వుతారు" అంటారు హాస్యం పై పరిశోధన గావించిన రెజీనా బరెకా.

3. పురుషుల చతురోక్తులు సాధారణంగా అగౌరవంగా, నిందాపూర్వకంగా, మోటుగా ఉండగా, మహిళల హాస్యం స్వీయనిందతో కూడి ఉంటుంది. వారి హాస్యం

---

తెలియని ఆ మెట్లు ఎక్కే పద్ధతిని కనుగొనాలి. ఆ మెట్లే హాస్యం.- జూల్స్ ఫైఫర్

సాధారణంగా స్వీయ సమస్యలకే పరిమితమవుతుంది. హాస్యోక్తి ద్వారా నవ్వించడం అన్నది పురుషునికి ఒక శక్తి, ఒక ఆయుధం పురుష లక్షణాలైన దాడి, ఆధిక్యత, పంతం నెగ్గించుకోవడం ఆ హాస్యోక్తులు కలిగి ఉంటాయి.

4. అంతా మగవారే ఉన్నప్పుడు పరస్పర వినోదం కోసం వారు హాస్యోక్తులు చెప్పుకుంటూ ఆనందిస్తారు. చెత్త జోక్స్ చెప్పడానికి పోటీ పడతారు కూడా. అంతా మహిళలే ఉన్నప్పుడు వారు కూడా హాస్యోక్తులు విసురుతూ ఆనందిస్తారు. అయితే, మగవారు రాగానే మహిళలు నవ్వడం ఆపివేస్తారు.

5. ఆడవారికి తమను నవ్వించే మగవారంటే మహా ఇష్టం. హాస్యప్రియులను వారు ప్రత్యేకంగా అభిమానిస్తారు, ఆదరిస్తారు. అదేవిధంగా తన ఎదుట మనస్ఫూర్తిగా నవ్వే మహిళను పురుషుడు అధికంగా ప్రేమిస్తాడు. విచిత్రమేమంటే నవ్వించడం మగవాడి లక్షణం అయినట్లే, పెత్తనం చేయడం, ఆధిపత్యం వహించడం కూడా ఆతని లక్షణాలయ్యాయి.

సగటున పురుషులకన్నా స్త్రీలు 126% అధికంగా నవ్వుతారని పరిశోధనల ద్వారా తేలింది. అంతేకాదు. హాస్యోక్తులలో అధిక శాతం మహిళల పై పురుషులు సంధించేవే కనబడతాయి. ఏదో విధంగా పురుషాధిక్యతను చాటుకునేవే విన్పిస్తాయి. నవ్వించడం పురుషుని వంతు అయితే, నవ్వడం స్త్రీ వంతు అని చెప్పుకున్నాం కదా! ఈ కారణం వల్లనే కాబోలు పురుషులతో పోలిస్తే మహిళలకు గుండె జబ్బులు తక్కువగా వస్తాయని చెబుతారు.

పురుషుల హాస్యం కలహశీలిగా, ప్రాతికూల్యంగా, నిందా పూర్వకంగా ఉండగా, మహిళల హాస్యం శ్లేషలతో, కథలతో, చిన్న చిన్న హాస్యోక్తులతో కూడి ఉంటుంది. వాళ్ళకు హేళన, ఎగతాళి అంటే అంతగా నచ్చదు. 8. భౌతికంగా పురుషులు బలాఢ్యులు. మహిళలు అబలలు. సరళంగా ప్రవర్తించడం వారి నైజం. అందువలన పురుషునివలె స్త్రీ ప్రతీకార ధోరణిలో నిందాపూర్వకంగా తూలనాడుతూ మాట్లాడలేదు. పదిమందిలో ఉన్నప్పుడు పురుషుడు తన ఆధిపత్యాన్ని చాటుకోడానికి లైంగిక సంబంధమైన, జననేంద్రియాల పై నర్మగర్భంగా చతురోక్తులు విసురుతూ దానిని వంకరలు తిప్పి వ్యంగ్యంగా మహిళ పైకి విసరడంతో, ఆమె ఆత్మరక్షణలో పడుతుంది. సాహసించి మహిళ లైంగిక సంబంధమైన హాస్యోక్తిని చెబితే, పురుషులు ఆ హాస్యోక్తిని వింటూగాక తనను చూసి నవ్వడాన్ని ఆమె భరించలేదు. అందుకే ఆమె లైంగిక హాస్యోక్తుల జోలికి పోదు అంటారు నాన్సీ.

పరిసరాలు - నవ్వు : పరిసరాల ప్రభావం హాస్యం పై అధికంగా కన్పిస్తుందని ప్రయోగాలద్వారా స్పష్టమైంది. పరిసరాలలో మార్పులు ఏర్పడినప్పుడు, దానికి సంబంధించిన

---

విషయాలను హాస్యరూపంలో వివరించేటప్పుడు ఎక్కువగా నవ్వుతారని తన సర్వే ద్వారా తేలిందన్నారు ప్రొవెన్స్. హాస్యోక్తులు చెప్పే వక్తలు శ్రోతలకన్నా 46% అధికంగా నవ్వుతారట! అదే మహిళా వక్తలైతే 126% అధికంగా నవ్వుతారట! మనిషి ఏకాంతంగా ఉన్నప్పటి కన్నా సమూహంలో ఉన్నప్పుడు 30% అధికంగా నవ్వుతాడని తేలింది.

మహిళల్లో హాస్యభావన తగ్గడానికి కారణాలు :

1. సామాజిక ఆంక్ష : పురుషాధిక్య సమాజంలో మహిళలు విరగబడి నవ్వడం, చతురోక్తులాడటం మర్యాద కాదన్న భావనను పురుషుడు బాగా వ్యాప్తిలోకి తెచ్చాడు. ఇదొకరకమైన సామాజిక ఆంక్ష. మహిళ ఒక విదూషకుడులా, జోకర్‌లా నటించడం సామాజిక కట్టుబాటును వ్యతిరేకించినట్లే అవుతుంది కనుక ఆ పాత్రలన్నీ పురుషులకే కేటాయించబడ్డాయంటారు పాల్ మాఫీ. ఒక స్థాయి గలవారే హాస్యమాడాలి. మహిళకు ఆ స్థాయి లేదు కనుక ఆమె హాస్యమాడరాదు అన్న భావన అనాదిగా వ్యాప్తి చెందింది. బహిరంగ చర్చలలో పురుషులు పాల్గొన్నంతగా స్త్రీలు పాల్గొనరు కదా! వారు సామాన్యంగా ఆమోదిస్తారే కాని, వ్యతిరేకించడం జరగదు. అంటే పురుషుడొక నటుడిగా, స్త్రీ ఒక ప్రేక్షకురాలిగా మారారన్నమాట! ఈ లింగ భేదం ఈనాటికీ కన్పిస్తుంది.

2. ఆధిక్య భావం : పేరెన్నికగన్న మహిళా రచయిత్రులు ఉన్నప్పటికీ, పురుషులు వారి రచనలను విస్మరించారు లేదా కావాలని వాటిలో దోషనిర్ణయం చేశారు. ఆంగ్లభాషలో మార్క్ ట్వెయిన్ ప్రముఖ హాస్య రచయిత. అలానే మారిట్టా కూడా హాస్య ప్రపంచంలో కీర్తి గడించిన మహారాణిలాంటిదే. అయినప్పటికీ పురుషులు ఆమె రచనలను గురించి అంతగా పట్టించుకోలేదు. ఫానీ ఫెరన్ 19వ శతాబ్దంలోనే పత్రికలలో అనేక హాస్య రచనలు చేసినా ఆమెకు రావలసినంత గుర్తింపు రాలేదు. ఈ విధంగా స్త్రీలలో హాస్యభావన లేదని నిర్ధారించడానికి పురుషపుంగవులు శక్తివంచన లేకుండా ప్రయత్నించారంటారు.

3. విచిత్ర సిద్ధాంతాలు: మహిళా ప్రాధాన్యతను తగ్గించడానికి పురుష సిద్ధాంతకర్తలు ఎంత హాస్యభరితమైన, రసవత్తరమైన సిద్ధాంతాలను సృష్టించారో తెలుసుకుంటే నవ్వుకే నవ్వు వస్తుందేమో!

1. పురుషులకు విశాలమైన భుజాలు, కురుచవైన తుంటి ఎముకలు ఉన్నందున వారికి తెలివితేటలు హెచ్చు అని, మహిళలకు కురుచ భుజాలు, విశాలమైన తుంటి ఎముకలు ఉంటాయి కనుక వారికి తెలివితేటలు తక్కువ అన్నది మార్టిన్ లూథర్ సిద్ధాంతం.

---

మానవజాతి సారాంశమే హాస్యం. – స్టీవే ఎలెన్

2. ప్రాచీన గ్రీకు రచయితలు కూడా ఈ విషయంలో తక్కువ తినలేదు. ప్రపంచ ప్రఖ్యాత రచయిత, అరిస్టాటిల్ ఎలా వాదించాడో చూడండి: ఈ విశ్వంలో పరిపూర్ణమైనది వృత్తం. అందుకే భూమి, సూర్యుడు, అన్ని గ్రహాలు వృత్తాకారంలోనే ఉన్నాయి. స్త్రీ పిల్లల్ని కంటుంది. అంటే ఆమె గుడ్లు పెట్టే పక్షి జాతికి చెందినదన్నమాట! గుడ్డు ఒక. అపరిపూర్ణ వృత్తం కనుక పురుషునికన్నా స్త్రీకి పళ్ళు (దంతాలు) తక్కువ సంఖ్యలో ఉంటాయి. కనుక (వారి దృష్టిలో) స్త్రీ అసంపూర్ణురాలు! ఆమె రాజకీయాలలో పాల్గొనడానికి అనర్హురాలని ఆయన తేల్చిచెప్పారు! మా భారతీయ సమాజంలో మరొక విచిత్రం కన్పిస్తుంది. స్త్రీ మాతృమూర్తి. "మాతృదేవో భవ" అని పూజించదగిన మహోన్నతురాలు. అందువలన గృహంలాంటి దేవాలయంలో ఆమె ఉండాలేకాని, గందరగోళానికి మారుపేరైన రాజకీయాలలోకి ఆమె ప్రవేశించకూడ దన్నది భారతీయుల భావన. అంటే భౌతికంగా అపరిపూర్ణురాలని చెబుతూ గ్రీకులు మహిళను కించపరిస్తే, ఆమె మహామహిమాన్వితురాలని కీర్తిస్తూ అధికారానికి, సమాజా నికి దూరం చేశారు భారతీయులు! కీర్తిస్తూనే కాటువేయడం అంటే ఇదే అని ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ అభివర్ణించారు. ఈ విధంగా మహిళల ప్రాధాన్యాన్ని తగ్గించడమే పురుషుల ప్రధాన లక్ష్యంగా కన్పిస్తుంది. అయితే ఇవన్నీ ఈనాడు కాలం చెల్లిన సిద్ధాంతాలుగా, బూజుపట్టిన భావాలుగా మారాయని ప్రత్యేకంగా పేర్కొననవ సరం లేదు.

ప్రత్యేక హాస్య ప్రక్రియ: సమసమాజం, ప్రజాస్వామ్యం అని గొప్పలు చెబుతూనే, 140 సంవత్సరాల సుదీర్ఘ కాలం మహిళలకు ఓటుహక్కు లేకుండా చేసిన ఈ సమాజంలో వారికి గుర్తింపు, గౌరవం ఎలా లభిస్తాయన్నది ఒక మౌలిక ప్రశ్న. జనాభాలో సుమారు సగంమంది మహిళలే అయినప్పటికీ పాలనా రంగంలో మహిళలకు సముచిత స్థానం లేకుండాపోవడం, ప్రజాస్వామ్యానికి పెట్టని కోటగా కీర్తి గడించిన అమెరికాలో ఇంతవరకు ఒక్క మహిళ కూడా అధ్యక్షురాలుగా ఎన్నికవలేకపోవడం నేటి తరానికి ఎంత విడ్డూరంగా, పరస్పర విరుద్ధంగా ఉంటుందో, మహిళల హాస్యం కూడా అలానే ఉంటుంది.

ప్రసిద్ధ న్యూయార్క్ ట్రిబ్యూన్ పత్రికలో 'స్త్రీలు మనుషులేనా?' శీర్షిక క్రింద తండ్రీ కుమారుల మధ్య జరిగిన సంభాషణను చూడండి :

నూతన సంస్కృతి : దీంతో మహిళలు ఆత్మన్యూనతా హాస్యాన్ని ఆశ్రయించారు. ఇదొకరకమైన తిరుగుబాటులాంటిదే. ఈ తిరుగుబాటు ఇతరుల పైనకాక, తమ పైన తామే తిరగబడటం. నిజానికి ఇది స్వీయనింద, విధ్వంసక హాస్యంలాంటిది. మైనారిటీ వర్గానికి

---

విశ్వాసానికి ప్రారంభం హాస్యం, ప్రార్థనకు ప్రారంభం నవ్వు. – రీన్ హోల్డ్ నెబర్

(అంటే అణచి పెట్టబడిన వర్గానికి) చెందిన మహిళల నవ్వులో అణగారిన వర్గాల బాధ, కొన్ని సమయాలలో నిస్సహాయత ఇమిడి ఉంటుంది. తన దుర్బలత్వాన్ని తెలుసుకొని, ఆ విజ్ఞానంతో దాని పైన ఆధిప త్యాన్ని చలాయించడానికి మహిళ ప్రయత్నిస్తుంది అంటారు మహిళా హాస్యం పై పరిశోధకురాలు నాన్సీ వాకర్.

ఈ విధంగా 18వ శతాబ్దంలో మహిళా హాస్యం వంట ఇంటికి, పిల్లలకు మాత్రమే పరిమితం కాగా, 19వ శతాబ్దంలో అది వివాహ వ్యవస్థ ఔన్నత్యాన్ని, స్త్రీత్వాన్ని, నమ్రత ను, ఉదాసీనతను ఆదర్శాలుగా తీసుకుంది. అయితే, ఈ ఆంక్షలను ఆమోదించని ఆధునిక యువతి తన బలహీనతనే ఒక సాధనంగా మార్చుకొని, అహింసాయుత పద్ధతులలో తన ఆధిక్యాన్ని చాటుకోడానికి ప్రయత్నిస్తుంది. స్త్రీలను గురించిన నికృష్టార్థక రూపాలను తొలగించడానికి ఆమె శక్తి వంచన లేకుండా కృషి చేస్తుంది. నిజానికి ఇది పురుషాధిక్యాన్ని ద్వేషించే హాస్యం (Humour of Hate) అయినప్పటికి ఆ వ్యతిరేకతను భిన్న హాస్య ప్రవృత్తుల ద్వారా కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తుంది.

పితృస్వామిక వ్యవస్థలో ఇముడుతూనే, తన స్థానాన్ని ఏమాత్రం మరువకుండా హాస్యాన్ని ఒక రక్షాకవచంగా, నియంతృత్వానికి పోటీగా, సృజనాత్మక వ్యవస్థగా తీర్చిదిద్దుతుంది. ఈ విధంగా నిరసన ప్రక్కనే కలయికను జతచేస్తూ మహిళ తన ఎదుగుదలకు కృషి చేస్తూంది.

అధికారం, నియంత్రణ ద్వారా పనులు జరిపించాలని పురుషుడు యోచిస్తే, అవే నాయకత్వ బాధ్యతలు నిర్వహిస్తున్న మహిళ క్రిందివారిని ప్రోత్సహిస్తూ, వారి సహకారంతో అధికారాన్ని పంచుకుంటూ, పాలనా వ్యవస్థ పనితీరులో మార్పుకు యత్నిస్తుంది అని పరిశోధనల ద్వారా తెలిసింది.

ఒక మహిళను మేనేజర్ గా చేసి టీమ్ నాయకత్వం అప్పగించారు. తన పదోన్నతి సహచర సభ్యులలో అసహనం కలిగిస్తుందేమోనన్న భావనతో ఆమె సభ్యులందరకూ మంచి విందు ఏర్పాటుచేసి "దయచేసి నన్ను ఎప్పుడూ మీ బాస్ గా కాక మీ మిత్రురాలి గా........ఎప్పుడూ మంచిని చెప్పే మిత్రురాలిగా భావించండి" అంది. పని చేయించుకో వడంలో నేర్పు అంటే అదన్నమాట!

మరి మహిళామణులు తమ పసందైన హాస్యంతో భర్తలను ఎలా ఆకర్షిస్తారో తెలుసుకుందామా?

---

చెడ్డగా ఉన్న దానిని గూర్చి మంచిగా భావించేవాడే హాస్యచతురుడు.- డాన్ హెరాల్డ్

అధ్యాయం 24

# భార్యాభర్తల హాస్యం

అట్టహాసంగ వివాహమహోత్సవం జరుగుతుంది. దూరంగ కూర్చున్న శేఖర్ ప్రక్కనున్న మోహన్తో "ఏరా! మనవాడు అలా నవ్వుతుంటే ఆ పెండ్లికుమార్తె బిక్కముఖంతో అలా ఉందేమిట్రా?" అనుమానంగ అడిగాడు. "పెళ్ళి అంటే అబ్బాయికి ఆఖరి నవ్వు, అమ్మాయికి చివరి ఏడుపు. అంతేరా!" అన్నాడు మోహన్.

అది మార్గరేట్, పీటర్ వివాహ స్వర్ణోత్సవ సభ. అత్యంత వైభవంగా జరుపుకుంటున్న ఆఉత్సవంలో మార్గరేట్ ముచ్చటగా ముస్తాబై చలాకీగా తిరుగుతుంది. ఒక పత్రికా విలేకరి ఆమెను సమీపించి "ఇంతకాలం ఆనందంగా భార్యాభర్తలుగా వైవాహిక జీవితాన్ని గడిపిన మీ ఇద్దరికి అభినందనలు. అన్నట్లు.......మీ సుదీర్ఘ వైవాహిక జీవితంలో ఏనాడైనా మీవారికి విడాకులు ఇవ్వాలని అనుకున్నారా?" అని ప్రశ్నించాడు.
మార్గరేట్ : లేదండి. అలాంటి భావనే ఎప్పుడూ రాలేదు. అయితే, ఒక్క పర్యాయం మాత్రం..... అతణ్ణి షూట్ చేద్దామనుకున్నా.

ప్రేమకు స్మృతి చిహ్నం, దాని మానవ రూపం వివాహం. 'రెండు శరీరాలను - నిజానికి రెండు హృదయాలను - పెనవేసే పవిత్ర బంధం", "జన్మజన్మల అనుబంధం", "అదెప్పుడూ యుగళగీతంగానో, ద్వంద్వ యుద్ధంగానే ఉంటుంది", "స్త్రీని ఆకర్షణ శక్తి నుండి వికర్ష శక్తిగా మార్చే సంస్థ", "అందులో ఉన్నవారు బయటకు రావాలని, బయట ఉన్నవారు లోనికి వెళ్ళాలని తాపత్రయపడేలా చేసే విచిత్ర సంస్థ" అని వివాహం గురించి పలువురు పలువిధాలుగా భావించినప్పటికీ కుటుంబం అనే అద్భుత సామాజిక సంస్థకు మూలస్తంభంలాంటిది వివాహం. అది అమర ప్రేమకు చిహ్నంగా నిలిచింది. అద్భుత హాస్యానికి నిలయంగా ఎదిగింది.

భార్యాభర్తల హాస్యానికి హాస్య జగత్తులో ఎప్పుడూ ఒక ప్రత్యేక స్థానం ఉంటుంది. ఆ హాస్యోక్తులు నాటినుండి నేటిదాకా ప్రేమికులనేగాక, జనావళినందరినీ నవ్విస్తాయి, కవ్విస్తాయి. దాంపత్య జీవితంలో ప్రేమ, శృంగారం, ఛలోక్తులు, చతురోక్తులేగాక, వ్యంగ్యం, గేలి, అవహేళనలు కూడా చోటుచేసుకుంటాయి. అక్కడ ఎంత సున్నితమైన హాస్యం ఉంటుందో, దాని ప్రక్కనే అంత కటువైన అవహేళన కూడా కన్పించడం ఇందులోని

---

ప్రత్యేకత. అందుకే హాస్య ప్రపంచంలో భార్యాభర్తల హాస్య ఘట్టం నిత్యకళ్యాణం పచ్చతోరణంలా విరాజిల్లుతూ, హాస్యప్రియులకు గొప్ప ఆకర్షణా కేంద్రం గా నిలుస్తుంది.

“ఎన్ని పర్యాయాలు చెప్పానండి మీరు అనవసరంగా శ్రమపడి మాట్లాడవద్దని, ఎప్పుడైనా మీ అభిప్రాయం కావలసివస్తే మీరేమి చెప్పాలో ముందుగా మీకు నేను చెబుతాను కదా!" అంటుంది ముద్దుముద్దుగా ఒక మగువ తన భర్తతో.

వెంకట్ : టి.వి సీరియల్స్ లో మునిగిపోయిన మీ ఆవిడ ఎంతకూ తలుపు తీయకపోతే ఏంచేస్తావురా సోము?

సోము : సింపుల్. చీరలండోయ్ చీరలు. పాతవాటికి కొత్త చీరలండోయ్ అని కేకేస్తా.

ఇలాంటి హాస్యోక్తులను చదువుతున్నప్పుడు ఎవరి అనుభవాలు, అనుభూతులు వారి స్మృతిపథంలోకి వస్తుంటాయి. అందుకే వైవాహిక హాస్యోకులు ఒక దర్పణంలా పనిచేస్తుంటాయి. మొదటి హాస్యోక్తిలో పైకి ఎంత ప్రేమ కన్పిస్తుందో, లోపల అంత కాఠిన్యం ద్యోతకమవుతుంది. "వివాహానికి ముందు ఆమె మాటలు రాని ముగ్గలా ఉండేది. వివాహానంతరం ఆమె నాలుక బాగా పదునెక్కింది” అన్న బెన్ జాన్సన్ మాటలు వెంటనే జ్ఞప్తికి తెస్తాయి. పెండ్లి అయిన కొంతకాలందాకా ఆయన మాట్లా డతాడు, ఆమె వింటుంది. ఆ తరువాత కొంతకాలం ఆమె మాట్లాడుతుంది, ఆయన వింటాడు. మరికొంతకాలానికి ఇద్దరూ మాట్లాడతారు, ఇరుగుపొరుగువారు విని ఆనందిస్తుంటారు అన్నది హాస్యోక్తి. ఇంక రెండవ హాస్యోక్తిలో విసిగి వేసారిన హృదయం కన్పిస్తుంది. ప్రతి విషయాన్ని ఆమె ఒక వాదనగా మారుస్తుండటంతో ఆమె వాగ్దాటికి తట్టుకోలేకపోతున్నానని ఆయన ఆవేదన.

అమ్మోయ్ భార్యలు : 'మంచి భర్తలు కావాలంటే ఎలా' అని రుమేనియావారు ప్రయత్నిస్తుంటే, 'మంచి భార్యలు కావాలంటే ఎలా' అని భారతదేశంలోని కొందరు భర్తలు చేసిన ఓ గొప్ప ప్రయోగం ఎంత దారుణంగ విఫలం అయిందో చూద్దాం.

కొందరు భార్యల దృష్టిలో భర్త అంటే రెండు మూడు పర్యాయాలు చర్మం వలవడానికి వీలైన పెంపుడు జంతువులాంటివాడు. వారికి భర్తలను వేధించడమే గొప్ప సరదా, ఇలాంటి భార్యా బాధితులందరూ కలసి యోచించి ఒక సంఘాన్ని ఏర్పరచారు. తమ భర్తలు భార్యాబాధితుల సంఘాన్ని నెలకొల్పి, దాని వ్యాప్తికి కృషి చేస్తున్నారని తెలుసుకున్న భార్యలు వీరావేశంతో ఇంటివద్ద చండీరూపం ధరించి, అబలలైన అర్ధాంగులకు అన్యాయం చేస్తే మగజాతి మట్టికరచిపోతుందని శాపనార్థాలు పెట్టారట. దాంతో బెంబేలెత్తిన ఆ

కార్యవర్గ సభ్యులు మారుమాట్లాడకుండా తమ సంస్థను విజయవంతంగా మూసివేశారట. ఆ సంఘ అధ్యక్షునికి, అతని భార్యామణికి మధ్య జరిగిన ఈ 'లగేజ్ ఉపాఖ్యానం' చదవండి:

లగేజీని మొయ్యలేక రొప్పుకుంటూ రోజుకుంటూ బాధపడుతున్న భర్త రైల్వే ప్లాట్‌ఫామ్ మీదకు చేరాడో లేదో వారు వెళ్ళాల్సిన రైలు ఉడాయించింది. హతాశుడైన భర్త "చూశావా! నీ మేకప్ కొరకు మూడు గంటలు తీసుకున్నావు. కొంచెం ముందుగా సిద్ధమై ఉంటే ఎంచక్కా రైలెక్కే వాళ్ళం కదా!" అనడంతో భార్యకు రోషం వచ్చింది. "మీకేమో ఏపనీపాటా ఉండదు కనుక పోదాం పోదాం అని ఒకటే గోల చేస్తారు. అయినా మేకప్ చేసుకున్నానని నసుగుతారేకాని అదేదీ లేకుండా చింకి చాపలా, పేడతట్టలా నేను కన్పించాలని మీ ఆలోచనా? అసలు, ఇంటివద్ద నన్ను అనవసరంగా తొందర పెట్టకుండా ఉంటే తరువాత రైలు కొరకు ఎక్కువసేపు ఆగాల్సిన అవసరం ఉండేది కాదుగా! మీకేమో తెలియదు. ఇతరులు చెబితే వినుకోరు. లేకుంటే ఏంటి? అమ్మో! అమ్మో! భార్యాబాధితుల సంఘం పెట్టి దానికి అధ్యక్షుడుగా వెలగబెడతారా? మరి మీ నాన్నగారికి ఆ సంఘంలో ఏ పోస్టు ఇస్తారండి?" అంటూ మాటల ఈటెలను వదులుతుంటే, అతను హతాశుడయ్యాడు.

మరొక ఉదంతం : భార్య : "మీ వ్యవహారం ఏమిటో నాకు బొత్తిగా అర్థం కావడం లేదు. నాలుగు రోజుల క్రితం చిక్కుడుకాయ వండి పెడితే బాగుంద న్నారు. మూడు రోజుల క్రితం అదేమాట చెప్పారు. మొన్న మాట్లాడకుండా ఆకూర తిన్నారు. నిన్నా అంతే! మరి ఈ రోజు బాగాలేదంటారేమిటి?" అంది సాగదీస్తూ.

మునిమాణిక్యంగారి 'కాంతం కథలు' చూడండి. భార్యకు, భర్తకు ఏదో విషయంలో అభిప్రాయ భేదం ఏర్పడి అదొక ప్రణయ కలహంగా మారింది. ఇద్దరి మధ్య మాటామం తీ లేకుండా పోవడంతో ఆమెను ఎలాగైనా ప్రసన్నం చేసుకోవాలని ఆయన తహతహ లాడారు. ఒకనాడు ఆమె మేడ మెట్లు దిగి వస్తుండగా, ఆయన నెమ్మదిగా మెట్లు ఎక్కుతున్నాడు. ఎలాగైనా ఆమెకు దగ్గరవ్వాలన్న ఆశతో ఆమెకు చెయ్యి అడ్డంగా పెట్టి 'నేను ఫూల్స్‌కు దారి ఇవ్వను" అన్నాడు. ఆమె అలానే మెట్లు దిగుతూ అతని చెయ్యి నెట్టివేస్తూ "అయితే, నేను ఇస్తా" అంది నాజూకుగా!

ఇదెంతో సుందరమైన, సుకుమారమైన హాస్యోక్తి. ఇలాంటి హాస్యోక్తులాడటానికి చక్కని విజ్ఞతతోపాటు సంస్కారం కూడా అవసరం. అయితే, చాలా హాస్యోక్తులు కొద్దిగా మొరటుగా, కొన్ని సందర్భాలలో వెగటుగా కూడా ఉంటాయి.

---

హాస్యం ధర్మంతో స్నేహం చేస్తుంది. – అరిస్టోఫేన్స్

శోభకన్నీళ్ళతో హడావుడిగా భర్త దగ్గరకు వస్తూ "ఏమండీ విన్నారా? మన పెళ్ళి చేయించిన శేషాద్రి పంతులుగారు హఠాత్తుగా మరణించారటండి" అంది బాధగా. 'అవును మరి... చేసిన పాపం ఊరికే పోతుందా' అన్నాడు భర్త మధు తాపీగా.

వివాహ విజయానికి హాస్యం: హాస్యాన్ని ఆస్వాదించే లక్షణం భార్యాభర్తలిద్దరి లో ఉన్నప్పుడు ఆ వివాహం మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతుందని, అయితే ఆ శక్తి ఆ ఇద్దరిలో ఎవరికి లేకున్నా, ఆ కుటుంబం సుఖశాంతులకు నోచుకోక పోవచ్చని ఒక సర్వేలో తేలింది. అంశాలు :

1. హాస్య భావన : ఇద్దరి మధ్య ఉన్న సాన్నిహిత్యం , ప్రేమ ఒక అంశమైతే, ఇరువురి మధ్య ప్రధానంగా హాస్యభావన ఉండాలి. లేకుంటే, ప్రతి చిన్న వివాదం చిన్నపాటి కురుక్షేత్రం లా మారుతుంది. "తమలపాకుతో నేనిట్లంటే, తలుపు చెక్కతో తానిట్లంది" అన్న రీతిలో మెలిగేచోట ఎంత చక్కని హాస్యభావన ఉంటుందో ఇంక చెప్పనవసరం లేదు.

2. సర్దుకుపోయే ధోరణి : భార్యాభర్తలలో ఎవరో ఒకరు సర్దుకుపోతుంటే అక్కడ అంతా సజావుగా, సాఫీగా సాగుతుంది. ఒకరోజు విక్టోరియా మహారాణికి భర్తపైన విపరీతమైన కోపం వచ్చింది. ఆమెను చూసి ఆశ్చర్యపోయిన భర్త ఆల్బర్ట్ మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి గడి వేసుకున్నాడు. దాంతో రాణీగారు మరింత రెచ్చిపోయి, "నేనంటే అంత లెక్కలేదా" అని ఉక్రోషంతో ఊగిపోతూ భర్త గది దగ్గరకు వెళ్ళి "ఈ తలుపును తెరవమని నేను ఆజ్ఞాపిస్తున్నా" అని అరిచింది. భర్త నుండి ఎలాంటి సమాధానం రాకపోవడంతో ఆమె మరింత కోపంగా తలుపుమీద తట్టింది. "ఎవరక్కడ?" ఆల్బర్ట్ ప్రశ్న. "ఇంగ్లాండ్ మహారాణిని". తలుపు తెరుచుకోలేదు. కొంత సమయం గడిచాక శాంతించిన ఆమె వేళ్ళతో నాజూకుగా తలుపు కొడుతూ గుసగుసలాడినట్లుగా 'నేనే. నీ భార్యను ఆల్బర్ట్" అంది. అంతే. చిరునవ్వులు చిందిస్తున్న మోముతో ఆల్బర్ట్ తలుపు తీస్తూ ఆమెకు ఆహ్వానం పలికాడు.

ఇచ్చిపుచ్చుకునే ఇలాంటి పద్ధతి ఉత్తమ పద్ధతి. భార్యాభర్తలు మైత్రీభావంతో సరదాగా జీవించాలేకాని జీవనయాత్రలో ఆవేశకావేశాలకు చోటివ్వకూడదు. ఎకసెక్కాలాడుకునేటప్పుడు అంతా మనోహరంగానే కన్పిస్తుంది. కథ అడ్డం తిరిగినప్పుడు ఓర్పు, నేర్పు, కొద్దిగా హాస్యం అవసరమవుతాయి. అలా కాకుండా క్షణికోద్రేకంతో టపాకాయలా పేలితే కొంప కొల్లేరవుతుంది.

---

మానవత్వాన్ని ధ్రువీకరించేది హాస్యం. – మిల్టన్ ఫ్రీడ్ మాన్

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన తత్వవేత్త సోక్రటీస్. అంటే ఎందుకనో అతని భార్యకు అస్సలు గిట్టదు. భర్త పైన కోపం వచ్చినప్పుడల్లా ఒక కుండ తెచ్చి ఆయన నెత్తిమీద కొట్టేది. అయినా సహనానికి మారు పేరు అయిన సోక్రటీస్ “నా భార్య చాలా ఉత్తమురాలు. ఎప్పుడైనా నామీద కోపం వస్తే నా నెత్తిమీద టుపుక్కున కుండలు పగులగొడుందేకాని ఏనాడూ ఆ కుండల ఖరీదు కట్టమని వేధించని మహాసాధ్వి ఆమె” అంటూ భార్య గుణగణాలను కొనియాడేవాడు! విచిత్రం ఏమంటే ప్రపంచంలోని ఎందరో మహనీయులు భార్యాబాధితులే. భార్యాబాధితులంతా గొప్పవారు అవుతారా, గొప్పవారంతా భార్యా బాధితులవుతారా ?!

**3. ప్రణయ కలహం:** భార్యాభర్తల మధ్య అప్పుడప్పుడు చిన్న చిన్న కీచులాటలు జరగాలని, అలాంటి గిల్లికజ్జాల తరువాత భార్యాభర్తలు మరింత సన్నిహితులవుతారని, కొన్ని గంటల ఎడబాటు వారిమధ్య గాఢమైన ప్రేమ బీజాలు నాటుతుందని అనుభవజ్ఞులు చెబుతారు. ఎటొచ్చీ ఆ ప్రణయ కలహం ప్రళయ రూపం ధరించకుండా సర్దుకుపోగలగడంలోనే ఆ క్రీడాస్ఫూర్తి దాగివుంది. ప్రేమలో పంతాలు, పట్టింపులు ఉండవని, గెలుపు ఓటములకు చోటు లేదని భార్యాభర్తలిద్దరూ గ్రహిస్తే, ఆ కుటుంబం ఇంక ఆనందసాగరం అవుతుంది. ఆ ఇద్దరిలో ఏ ఒక్కరు ఈ సూత్రాన్ని పాటించినా జీవితం సాఫీగానే సాగుతుంది.

నవ వధూవరులైన రాధాకృష్ణుల మధ్య మాటామంతీ లేకుండా పోయింది. భార్య మూతి ముడుచుకు కూర్చోవడంతో భర్త అలిగి బయటకు వెళ్ళాడు. అశాంతితో సాయంత్రందాకా అటుఇటు చక్కర్లు కొట్టాడు. భోజన సమయానికి బాగా ఆకలి వేసింది. భార్య లేకుండా భోంచేయడం అతనికి ఇష్టం. “హలో రాధా! డిన్నరకు ఏమి స్పెషల్ చేస్తున్నావు?” ఫోన్ చేశాడు కృష్ణ. “విషం చేస్తున్నా” అంది రాధ కోపంగా. "అలా అయితే, ఒక్క కప్పు మాత్రమే చెయ్యి. నేను రాత్రికి భోజనానికి రావడంలేదు” అన్నాడు కృష్ణ. అంతటితో చల్లబడిన రాధ “సరే! ఒక్క కప్పే చేస్తాను. అదీ మీ కొరకే. తప్పక వస్తారుగా” అంది గోముగా! ఈ విధంగా ప్రేమ కలహాలు ఐసు బొమ్మల్లా త్వరగా కరిగిపోవాలేగాని టి.వి. సీరియల్‌లా అలా సాగిపోకూడదు. భార్యాభర్తలు స్నేహితుల్లా మెలగడం నేర్చుకుంటే ఇలాంటి సమస్యలు ఉత్పన్నం కాకపోవచ్చు. అందుకేనేమో "ప్రేమ లేనందువల్లగాక, స్నేహం లేనందువల్లనే వివాహాలు అసంతృప్తితో మగ్గిపోతున్నాయి” అంటాడు నైటీ, పండితుడు.

---

సృజనాత్మకత ప్రతిరూపమే హాస్యం. – బాబ్ శాంపిల్స్

భార్యతో ఏదైనా ఒక వాదనలో పొరపాటున గెలిచిన తెలివైన భర్త ఏమి చేస్తాడు? అన్న సమస్య పై జరిపిన సర్వేలో వచ్చిన సమాధానాలన్నింటిలో అత్యుత్తమ సమాధానంగా 'క్షమాపణ చెబుతాడు" అన్నదానిని ఎంపికచేశారట! ప్రణయ కలహానికి విజయ సూత్రం ఇదే!

4. సరదాగా పోట్లాట : భార్యాభర్తల మధ్య జరిగే వాదప్రతివాదాలలో ఎవరు గెలిచారన్నది ముఖ్యం కాదు. కాసేపు సరదాగా పోట్లాడుకొని, ఆ తరువాత హాయిగా మాట్లాడుకోవడం వలన గొప్ప ప్రయోజనం ఉంది. వాదప్రతివాదాల పుణ్యమా అని ఇద్దరిలోను ఆలోచనాశక్తి పెరుగుతుంది. అంతేకాదు. ఒకరిపై ఒకరు చతురోక్తులు విసరడానికి అవసరమైన సరంజామాను తయారు చేసుకుంటారు. దాంతో ఇలాంటి కలహాల మూలంగా వాక్చాతుర్యంతో బాటు సమయస్ఫూర్తి పెంపొందుతుంది. మాటల కోటలు కట్టడం నేర్చుకుంటారు. వీటన్నింటికీ మించి నవ్వుతూ, నవ్విస్తూ జీవితాన్ని గడపడానికి చక్కని అవకాశం ఏర్పడుతుంది.

భర్త అంటే ఎవరు? భార్య పెట్టే బాధలను భరించేవాడు. కూలీ లేకుండా ప్రయాణా లలో ఆమె సామానులు మోసేవాడు. ఆమెను కదలకుండా కూర్చోబెట్టి అన్ని సదుపా యాలూ సమకూర్చేవాడు. ఆనందం కోసం అర్రులు చాస్తూ స్వేచ్ఛను పోగొట్టుకున్న పురుషుడు. భార్యకోసం ఓ చట్టాన్ని నిర్మించి, దానికి ఆమె చేసిన సవరణలన్నింటినీ మనస్ఫూర్తిగా అంగీకరించేవాడు. వివాహ సమయంలో సమఉజ్జీగా ఉండి, ఆ తరువాత చిరుపాత్రలు ధరించేవాడు. “పెళ్ళి పుస్తకంలో మొదటి అధ్యాయం పద్యంలోను, మిగిలిన అధ్యాయాలన్నీ గద్యంలోను ఉంటాయ”ని బెవర్లీ నికోలా భావనను అర్థంచిడు కొని అమలు పరచే వాడే అసలుసిసలైన భర్త!

నిజజీవితంలో వారిద్దరూ పడుగు పేకల్లా, వెలుగునీడల్లా కలసిపోయేవారులా ఉంటే ఆదర్శదంపతులు అవుతారు. అందుకే ఒకానొక సంస్థవారు ఆదర్శ దంపతులను ఎంపిక చేసి ఘనంగా సత్కరించదలచి పత్రికలలో, టి.వి.లో విస్తృతంగా ప్రచారం చేశారు. ఎంతోమంది ఆ పోటీలో పాల్గొనడంతో అతి కష్టం మీద న్యాయనిర్ణేతలు ఒక జంటను ఎంపిక చేసి ఘనంగా సత్కరించారు. అనంతరం వారిని “మీ ఆదర్శ దాంపత్యానికి కారణం ఏమిటి?” అని ప్రశ్నించగా, “ఆ......అంత రహస్యం ఏమీ లేదండి. పగలంతా ఆమెకు నచ్చినట్లు ఆమె చేసుకుంటుం ది. రాత్రంతా ఆమె ఏమి చేద్దామంటే నేనూ అలానే చేద్దామంటాను. అంతే!” అని భర్త సమాధానం ఇవ్వడంతో అందరూ మనసారా నవ్వుకున్నారు. ఆ తరువాత అదే

---

నిషేధించిన వాటిని మచ్చిక చేయగలిగే క్రీడ హాస్యం – డేనియల్ జంగ్ట్స్

ప్రశ్నను ఆమెను అడుగగా, ఆమె సిగ్గుపడుతూ మాట్లాడకపోవడంతో మరల భర్త కలుగజేసుకొని "ఆమె విజయ రహస్యం అదేనండి. పదిమందిలో నన్ను హీరోగా నిలబెడుతుంది. అది నాకు ఆనందం. ఇంటికి వెళ్ళిన తరువాత నన్ను జీరోను చేస్తుంది. అది ఆమెకు ఆనందం" అనడంతో సభ మరొక్కసారి గొల్లుమంది! నిర్వాహకులు ఆమెను మరల ఏదో ఒకటి మాట్లాడమని కోరగా, "మావారు నా అడుగుజాడలలో నడవడమే మా సుఖమయ జీవితానికి కారణమండి" అనడంతో సభ మరలా నవ్వులతో నిండిపోయింది.

5. భార్యా విధేయత : అందుకే జీవితం అంటే సర్దుకుపోవడం అని చెబుతారు. దీని వెనుక ఒక రహస్యం ఉంది. ఆ ఒక్క రహస్యం తెలుసుకుంటే వివాహం పూలబాటలా మారుతుంది. అది వినాలని ఉందా? అయితే.... రహస్యంగా విని దయచేసి ఇతరు లెవ్వరికి చెప్పకండి.

పి.వి.రాజమన్నార్ గొప్ప హాస్యప్రియుడు. ఒకనాడు అతని మిత్రుని కుమారుని వివాహ మహోత్సవానికి హాజరై పెండ్లి కుమారునితో "అత్యంత సుఖమయమైన వివాహ జీవితాన్ని గడిపిన అదృష్టవంతుడు నీ తండ్రి. కనుక ఆయన అడుగుజాడలలో నడిస్తే నువ్వెంతో ఆనందంగా జీవిస్తావు" అని అభినందించారు. ఆ తర్వాత భుజం పై చెయ్యివేసి ఆప్యాయంగా అవతలకు తీసుకుపోయి రహస్యంగా "మీ నాన్న గొప్ప భార్యావిధేయుడయ్యా! నువ్వు కూడా అలానే....." అన్నారు ముసిముసిగా నవ్వుతూ. సర్దుకుపోవడం అంటే ఇదే. ఎంత సింపుల్! అలా కాకుంటే....ఇంక...... గుద్దుకు చావడమే!

దాంపత్య జీవితం అందరికీ ఆనందం కలిగించే ఒక మధురమైన కల. అదొక అందమైన క్రీడ కూడా. అక్కడ భార్యాభర్తలు ఇరువురిలో క్రీడాస్ఫూర్తి ఉండాలి. అయితే, సగటు మనిషిలో పంతాలు, పట్టింపులు, పొరపొచ్చాలు అధికంగా కన్పిస్తాయి. కనుకనే అనేక సమయాలలో భార్యాభర్తల మధ్య ఉత్పన్నమయ్యే సమస్యలు - తగాదాలు - వింతగా, విచిత్రంగా, మరికొన్ని సమయాలలో విడ్డూరంగా ఉంటాయి.

అందుకే ఒక ఆరోగ్యకర హాస్యోక్తితో భార్యాభర్తలకు విశ్రాంతినిద్దాం.

"హిప్నాటిజం అంటే ఏమిటి?" అడిగాడు మహేష్ గిరిని. "చాలా సింపుల్. ఎదుటి మనిషిని లోబరుచుకొని మనం చెప్పినట్టల్లా అతనిచేత చేయించడాన్ని హిప్నాటిజం అంటారు. అంతే" అన్నాడు గిరి. "అదేమిటి? దానిని పెళ్ళి అంటారుగా" అన్నాడు మహేష్ అమాయకంగా. అందుకేరా నిన్ను అందరూ First is the first of the first and the last is the first of the last. In between two zeros అంటారురా అన్నాడు

---

మీ బలహీనతల ద్వారా లాభం పొందగలిగే వృత్తి హాస్య వృత్తి. – ఫ్రెడ్ విలియర్డ్

సాగదీస్తూ. అయోమయంగా ముఖం పెట్టిన మహేషను చూసి అప్పుడే వచ్చిన మూర్తి నవ్వుతూ "ఏరా ఫూల్(Fool) ఇంకా అర్థం కాలేదా? నువ్వు అసలే మెర్క్యురీ లైటుకదా. ఇంటికెళ్ళి ఆలోచించుకో" అన్నాడు.

దాంపత్య జీవితం సుఖవంతంగా గడవడంలో హాస్యం ప్రధాన భూమిక వహిస్తుంది. మనిషికి అత్యంత ప్రీతిపాత్రులు పిల్లలు, భార్య/భర్తనే కదా! అందరూ హాయిగా ఛలోక్తులు విసురుకుంటూ, నవ్వుకుంటూ సరదాగా జీవిత రథాన్ని నడిపితే ఎవరికైనా ఇంక కావాల్సిందేమిటి? కుటుంబం అనే బండికి భార్యాభర్తలు రెండు చక్రాలుగా - హాస్యం, అవగాహన అను చక్రాలుగా - ఉన్ననాడు వారు హాస్యానికే చతురోక్తులు విన్పిస్తారు. అందుకే భార్యా భర్తలు దేశవిదేశాలలో హాస్యం ఎలా ఉందో కొంచెమైనా తెలుసు కోవాలి!

అధ్యాయం 25

# దేశ విదేశాలలో హాస్యం

ప్రపంచం ఎంత విశాలమైనదో, హాస్య ప్రపంచం అంతకన్నా విస్తృతమైనది. హాస్యం సమాజంలో ఒక అంతర్భాగం కనుక, హాస్యోక్తులను బట్టి ఆ దేశంలో నెలకొన్న ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను చాలావరకు తెలుసుకోవచ్చు. ఏ రాజకీయ పార్టీ తన విధానాల పై హాస్యోక్తులు విసరనట్లే, ఏ మతం తన ఆచారాలు, విశ్వాసాల పై హాస్యోక్తులు విసరదు. అయితే ప్రతి దేశానికి కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటాయి. ఆంగ్లేయులు గుంభనంగా ఉంటారని, ఫ్రెంచి ప్రజలు శృంగారప్రియులని, చైనీయులు అతి తక్కువగా మాట్లాడతారని, అమెరికన్లు నిర్మొహమాటంగా ఉంటారని వింటుం టాం. లాటిన్ అమెరికా, మధ్య ప్రాచ్యం, ఆసియా వాసులు అతి సమీపంలో నిల్చుండి మాట్లాడుకుంటే, అమెరికావాసులు దూరంగా నిలబడి మాట్లాడటానికి ఇష్టపడతారు. అమెరికా, భారత్ లో అభినందనను చప్పట్లు, ఈలలద్వారా వ్యక్తపరిస్తే, ఐరోపాలో ఈలవేయడం అంటే “ఇంక పో” అని అర్థం. అమెరికా, బ్రిటన్ దేశాలలో చెయ్యి ఊపడం అంటే “గుడ్ బై” చెప్పడం అయితే, అర్జెంటీనాలో అలా ఊపడం “కూర్చోండి” అన్న అర్థం ఇస్తుంది. జపాన్ వాసులకు సమావేశాలలో హాస్యం అంటే అయిష్టంకాగా, ఆస్ట్రేలియన్లకు అదంటే మహా ఉత్సాహం. చూపుడువేలు చూపుతూ పిలవడం మన దేశంలో తప్పుకాదు కాని, హాంకాంగ్, ఇండోనేషియా, ఆస్ట్రేలియాలలో జంతువులను, వేశ్యలను మాత్రమే అలా పిలుస్తారట! అన్నట్లు ఆయా భాషలలోని వ్యంగ్యం, జాతీయాలు అర్థం కానిదే ఆ హాస్యోక్తులు అర్థంకావు. ఎవరి హాస్యశైలి వారిదే!

అద్భుతం: “కోడి రోడ్డు ఎందుకు దాటుతుంది?"- ఈ ప్రశ్నకు ఎన్ని రకాల సమాధానాలు వచ్చాయో వింటే ప్రజలలో ఎంత వైవిధ్యం ఉందో ఇట్టే అర్థం అవుతుంది. కష్టించి పనిచేసే అమెరికా వాసుల నుండి ఉద్యోగాలు ఎగురగొట్టుకు పోవడానికి (పాల్ బుషానన్); వానలో చావడానికి (ఎర్నెస్ట్ హెమింగ్ వే); రోడ్డు దాటడం దాని లక్షణం గనుక (అరిస్టాటిల్); అదొక చారిత్రక అనివార్యత (కార్ల్ మార్క్స్); అదొక ప్రతీకారచర్య కనుక మేం వెంటనే 50 టన్నుల విష వాయువును వదులుతాం (సద్దాం హుస్సేన్); అంటే కోళ్ళకు శృంగార విషయాలలో అభద్రతాభావం ఉందన్నమాట! (ఫ్రాయిడ్); ఇంతకూ కోడి రోడ్డు

---

హాస్యాన్ని ఒక దివ్యౌషధంగా భావించే ప్రజలు దానికై ఆరాటపడతారు. – పాచ్ ఆడమ్స్.

దాటిందా లేక రోడ్డునే కోడి క్రిందగా కదిలిందా? (ఐన్ స్టీన్) - ఈ సమాధానాలు చదువుతూంటే విచిత్రంగా ఉంది కదూ?

ఏ దేశపు హాస్యశైలి ఆ దేశానిదే! అలానే ఏ ప్రాంతపు శైలి ఆ ప్రాంతానిదే! అందుకే ప్రపంచంలోని కొన్ని దేశాల హాస్యశైలిని గురించి ఇప్పుడు స్థూలంగా తెలుసుకుందాం.

అంతా బడాయి: కొన్ని సమాజాల్లో - ముఖ్యంగా అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులలోను, హఠాత్తుగా సంపన్నులైన ఆఫ్రికా, ఆసియావాసుల లోను, దర్పం ప్రముఖంగా చోటుచేసుకుంటుంది. ఇదొక ఆధిక్యభావన, ఎదుటివారిని చులకనగా చూసే అహంకార తత్వం.

సెల్ ఫోన్లు కొత్తగా వచ్చిన రోజులవి. పాట్ (ఒక వ్యక్తి పేరు) కష్టపడి తన కారులో ఒక ఫోన్ ఏర్పాటు చేయించి, మిత్రుడు మైక్ కు ఫోన్ చేస్తూ "హలో మైక్! నా కారులో నుండి మాట్లాడుతున్నా" అన్నాడు. అది విన్న మైక్ న్యూనతాభావంతో, అసూయతో మండిపోయాడు. తన శక్తికి మించినప్పటికీ సెల్ ఫోన్ కు ఆర్డర్ పెట్టి క్షణాలలో దానిని తన కారులో బిగించి మరుక్షణమే పాట్ కు ఫోన్ చేసి "హలో పాట్! ఏమి చేస్తున్నావు? నా కారులోనుండి మాట్లాడుతున్నా" అంటూ గర్వంగా అన్నాడు. దాంతో ఖంగుతిన్న పాట్ వెంటనే తేరుకొని "మైక్ ఏమీ అనుకోకు. ఒక్క క్షణం ఆగు. నా కారులో రెండవ ఫోన్ మోగుతుంది" అన్నాడు!

అమెరికా హాస్యం అవగాహనకు అక్కడి పెట్టుబడిదారీ వ్యవస్థ, అడుగడుగునా కన్పించే ఆధిక్యభావం గురించి తెలుసుకోవడం అవసరం. వారి ప్రవర్తన అంతా ఆ వ్యతిరేక దృక్కోణంలో జనించి, దాని చుట్టూ పరిభ్రమిస్తుంటుంది. ఈ విధంగా హాస్యం అధికార సంబంధాలతోపాటు కాలమాన పరిస్థితులనేగాక, సమాజంలో నెలకొన్న విశ్వాస విధానాలను సైతం (Belief System) ప్రతిబింబిస్తుంది. అది మనోవిజ్ఞాన కోణంలో మన నమ్మకాలను, విశ్వాసాలను ప్రకృతిసిద్ధమైన విధానంగా పటిష్టపరుస్తుంది.

ఆసుపత్రిలో మెదడు (బ్రెయిన్) మార్పిడి చికిత్స జరుగబోతున్న సమయం. రోగితో డాక్టర్ "ఏమండీ! ఇక్కడ రెండు మెదళ్ళు ఉన్నాయి. ఒకటి పోలెండ్ దేశస్థునిది. దాని ఖరీదు రూ. 4 లక్షలు. రెండవది యూదు దేశస్తునిది. అది రూ. 2 లక్షలు. మీరు దేనిని కావాలంటే దానిని సిద్ధం చేస్తాం" అన్నాడు. అందుకు రోగి "డాక్టర్' గారూ! పోలెండ్ దేశస్థుని మెదడుకు అంత రేటు ఎందుకు పెట్టారు?" అని ప్రశ్నించడంతో "అది కొత్త దండి. ఇంతకుపూర్వం ఎప్పుడూ వాడలేదు" అన్నాడు డాక్టర్.

---

అసంబద్ధమైనవాటి మధ్య జరిగే సంఘర్షణ, కలయికలే హాస్యం. – లీహంట్

ఈనాడు ప్రపంచవ్యాప్తంగా శాస్త్రం అనూహ్యంగా అభివృద్ధి చెందడంతో, ప్రాచీన సమాజాలలో ప్రాచీనత పట్టు ఒకవైపు, ఆధునికత ప్రభావం మరొకవైపు స్పష్టంగా కన్పిస్తాయి. దీనినే ద్వంద్వం అంటారు. దీని ఫలితంగా కొన్ని సమయాలలో విచిత్ర పరిస్థితులు చోటుచేసుకుంటాయి.

చైనాలో ఒక రైతు కష్టపడి వాషింగ్ మెషీన్ కొన్నాడు. ఆ వింత పెట్టెను తెచ్చి అట్టహాసంగా ఇంట్లో పెట్టాడు. కొన్ని రోజుల తరువాత కళాశాలలో చదువుకుంటున్న వాళ్ళ అబ్బాయి సెలవలకని ఇంటికి వచ్చాడు. పాత స్టూలు మీద కూర్చొని బట్టలు ఉతుకుతున్న తల్లిని చూసి ఆశ్చర్యంతో "అదేమిటమ్మా! వాషింగ్ మెషీన్ కొన్నారు కదా! హాయిగా దానిని ఉపయోగించుకోక, బండమీద బట్టలు ఉతుకుతున్నావేంటి?" అని ప్రశ్నించాడు. అందుకు తల్లి “ఎంతోకాలం నుండి ఈ పద్ధతికే అలవాటుపడ్డాను బాబూ! నాకు ఇదే బాగుంది” అంది. మనిషిపై సంప్రదాయాలపట్టు ఎంత బలంగా ఉంటుందో ఇలాంటి సంఘటనలు తెలుపుతాయి.

చైనీయుల జానపద కథల్లో చక్కని హాస్యం తొణికిసలాడుతుంది. సగటు మానవుడు ఊహా సౌధాల నిర్మాణంలో ఎలా జీవిస్తాడో తెలిపే ఈ ఉదంతం మింగ్ వంశం పాలననాటిది.

కలలు ...కల్లలు : ఒక పేదరైతుకు బజారులో అనుకోకుండా ఒక కోడిగుడ్డు దొరకడంతో అంతుపట్టని ఆనందంతో ఇంటికి పరుగెత్తాడు. “ఈ గుడ్డు నుండి కోడి వస్తుంది. ఆ కోడి ఎన్నో గుడ్లు పెడుతుంది. అవన్నీ కోడిపిల్లలవుతాయి. ఇలా మన సంపద ఇబ్బడిముబ్బడి అవుతుంది. ఆ సంపదతో అనేక ఆవులు కొంటాను. వాటితో సంపద మరింత పెరుగుతుంది. ఒక లక్ష రూపాయల ఆదాయం రావడంతోనే ఒక సానిని తెచ్చుకుంటా” అంటూ ఊహల పల్లకిలో విహరిస్తూ, ఆశల అలల పై తేలియాడాడు. ఆ మాటలు విన్న అతని భార్య ఉగ్రరూపం ధరించి, కోపంతో గుడ్డును గోడకేసి కొట్టింది. అంతే! సంపద, సౌఖ్యం, శృంగారం గురించి కన్న కలలు ఎలా కల్లలవుతాయో చూపే చక్కని వ్యంగ్య చిత్రం ఇది.

హాస్యం మూలంగానే చైనీయులు కరువుకాటకాలు, భూకంపాలు, అంటువ్యాధులు మొదలైన ప్రకృతి వైపరీత్యాలనుండే గాక, హూణులు, మంగోలులు, జపాన్ దేశీయుల దాడులనుండి తట్టుకోగలిగారని చెబుతారు. .

---

నీలో హాస్యభావం లేకుంటే, ఇంక ఏ భావమూ లేనట్లే. – మేరీ మేక్ డొనాల్డ్

యూదుల హాస్యం : దేశంలో నెలకొన్న రాజకీయ పరిస్థితులకు హాస్యోక్తులు ఎలా దర్పణం పడతాయో చూద్దాం. ఐరోపాలో యూదుల చరిత్ర సర్వస్వం పీడన, దారిద్ర్యం, అణచివేతలాంటి కఠోర అధ్యాయాల ద్వారా నడిచింది. దాంతో ఆత్మవిమర్శ, ఆత్మన్యూనతా భావంతో వారు జీవితాన్ని కొనసాగించడంతో వారి హాస్యంలో వ్యంగ్యం, అసంతృప్తి, పరిత్యాగం కన్పిస్తాయి. ప్రత్యక్షంగా ఎదిరించడానికి వీలుకాని అధికారుల పైన, వ్యవస్థ పైన వారు బాణాలను సంధిస్తారు. అందుకే యూదుల హాస్యం దైవంతో సహా అందరినీ హేళన చేస్తోంది. తమ చుట్టూ ఉన్న పీడనను, వ్యతిరేకతను యూదులు తమ పైకి మళ్ళిం చుకోవడం వల్లనే వారి హాస్యోక్తులు ఆవిధంగా కన్పిస్తాయి. వాటిని చదువుతుంటే "మీరు మమ్మల్ని ఎదిరించాల్సిన పనిలేదు. ఆ పనిని మీకన్నా మేమే బాగా చేసుకొనగల ము అని తమ శత్రువులతో చెప్పినట్లుగా అనిపిస్తుంది" అంటారు విమర్శకులు. అయితే, వారి హాస్యాన్ని నిశితంగా పరిశీలిస్తే దాని వెనుక యూదుల ఆధిక్యతాభావం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది అంటారు విలియం నొవాక్, మోషి వాలాక్...

యూదులు ప్రశ్నతోబాటు సమాధానం కూడా చెబుతారు. నాజీలకు యూదులంటే అస్సలు గిట్టదు. ఒక వృద్ధ యూదుణ్ణి నాజీలు చుట్టుముట్టి ఏవేవో ప్రశ్నలడిగి, చితగ్గొట్టి క్రిందపడేశారు. ఆ దెబ్బలకు తట్టుకోలేక మూలుగుతూ పడివున్న ఆ యూదుణ్ణి "ఏయ్ ముసలిపీనుగా! ఈ యుద్ధానికి కారణం ఎవరు?" అని ప్రశ్నించారు. యూదులు మేధావులు కదా! దానికి ఆ యూదుడు "ఈ యుద్ధానికి కారణం యూదులు, సైకిల్ తొక్కేవాళ్ళు" అన్నాడు! ఆ సమాధానం అంతుపట్టని నాజీ సైనికులు "ఈ యుద్ధానికి సైకిల్ తొక్కేవాళ్ళు ఎలా కారకులవుతారు?" అని గద్దించగా, వృద్ధుడు నింపాదిగా "మరి యూదులు మాత్రం ఎందుకు కారకులవుతారు?" అని ప్రశ్నించాడు.

గొప్ప ఉదాహరణ: వర్తమానంతో పోలిస్తే, జీవితం క్రమంగా మరింత దుర్భరంగా మారుతుందన్నది యూదుల విశ్వాసం. "అబ్బ నొప్పి, అమ్మ నొప్పి" అంటూ బాధపడుతున్న మిత్రుడు మెండెలను చూచి ఆశ్చర్యపోతూ "ఎందుకు బాధపడుతు న్నావు" అని ప్రశ్నించాడు మాంకెల్. "ఈ బాధలన్నింటికి మూలం నా చెప్పులు. అవి నా కాళ్ళకు చాలకపోవడంతో తీవ్రంగా బాధిస్తున్నాయి" అంటూ, "అబ్బ! అమ్మ!" అని మరలా రోదించాడు మెండెల్. "అంత బాధ పెట్టే చెప్పులను వేసుకోవడం ఎందుకు?" అర్థం కానట్లుగా ప్రశ్నించాడు మిత్రుడు. "నీకు నిజం చెబుతా మిత్రమా! వ్యాపారంలో నాకొచ్చిన లాభాన్ని అంతా మా భాగస్వామి కాజేశాడు. మా పెద్దమ్మాయి చెప్పా పెట్టకుండా తన ప్రియునితో లేచిపోయింది.

---

హాస్యగాళ్ళు తరచూ ప్రవక్తలుగా మారవచ్చు. – షేక్ స్పియర్

రెండవ అమ్మాయి పెద్ద అనాకారి కనుక దానికి జీవితంలో పెళ్ళికాదు. నా కొడుకొక పెద్ద సోమరి. నా భార్యకు నన్ను సాధించడంలో మహా మోజు. ఇంటికి వెళ్ళడంతోనే చెల్లించాల్సిన ఎన్నో బిల్లులు ఎదురుచూస్తుంటాయి. ఈ బాధలన్నింటినీ మోస్తూ ఇంటికి వెళ్ళి చెప్పులు విడిస్తే ....ఓహ్! కోటి రూపాయలు పొందినంత ఆనందం వేస్తుంది" అన్నాడు మెండెల్.

పీకపైన కూర్చోవడం ఎలా? : ఆఫ్రికా దేశంలో. ఇగ్బో జాతికి చెందిన ఒక స్త్రీ పొలంలో పనిచేస్తుండగా ఒక పురుషుడు ఆమెను వేధించసాగాడు. దాంతో ఆమె విచిత్రంగా కూతలు కూసింది. ఆ అరుపులు విన్న ఇతర స్త్రీలు ఒక ప్రవాహంలా ఆమె ఇంటి ముందుకు చేరారు. నృత్యం చేస్తూ, బూతుపాటలు పాడుతూ, గోడల మీద చరుస్తూ తమ కోపాన్ని ప్రదర్శించారు. తప్పు చేసిన వ్యక్తి తన తప్పును దిద్దుకుంటానని వాగ్దానం చేసిందాకా ఆ స్త్రీలు అలా నృత్యం చేస్తూనే ఉన్నారు. దీనినే వారు "పురుషుని పీక పైన కూర్చోవడం" అంటారు. ఈ హాస్యోక్తి మహిళల్లో ఐక్యతను పెంచడమేగాక, పురుషుణ్ణి అదుపులో ఉంచడంలో సాయపడుతుందని వారి విశ్వాసం.

జీవితంలో ఒక భాగం : ట్రినిడాడ్లో హాస్యం ప్రజల జీవన విధానంగా మారడం ఒక విశేషం. అక్కడ ఏ భావనగాని, సంఘటనగాని, వ్యక్తిగాని సర్వసాధారణ అంశమైన హాస్యానికి అతీతంగా ఉండవు. అందుకే "అక్కడ హాస్యాన్ని ఆస్వాదించలేకపోతే ఇంక ఆ దేశంలో నీవు జీవించలేవు" అంటారు ఎం.జోన్స్, వి.లివర్‌పూల్. అందుకే ఏ అధికారంగాని, విద్య, హోదాగాని ఏవీ నిన్ను హాస్యంకన్నా ఉన్నత స్థాయిలో ఉంచలేవు. అయితే స్థానిక పరిస్థితులు అవగాహనకానిదే, ఆ హాస్యం లోతుపాతులు మనకు అంతుపట్టవు.

ట్రినిడాడ్ వాసుల దృష్టిలో కత్తికన్నా నోరు శక్తిమంతమైనది. అక్కడి ప్రజలు మాటల తూటాలతో ప్రత్యర్థులను చీల్చి చెండాడుతారు. అందుకే కాబోలు తమ వర్గ ఆధిక్యాన్ని చాటుకోవడమే వారి హాస్య పరమార్థం అంటారు విమర్శకులు. తన శాబ్దిక హాస్యంతో హాస్యగాడు జనసామాన్యాన్ని సమ్మోహితులను చేసే ప్రక్రియను 'పికాంగ్' అంటారు. అదొక హాస్యరూపంగా, వినోద కేంద్రంగా రూపొంది బడుగు వర్గాలను అధికంగా ఆకట్టుకుంది.

"అమెరికా, బ్రిటన్ జానపద గేయాల స్థానిక రూపమే కైసో. బానిస వ్యవస్థ అంతమైన తరువాత ఆ దేశంలో జరిగే ఉత్సవాన్ని కార్నివాల్ అంటారు. ఆ ఉత్సవం తమ ఆధ్వర్యంలోనే జరగాలని జనసామాన్యం భావించడంతో, దానికి ఇష్టపడని ఉన్నత వర్గాలవారు అధిక సంఖ్యలో ప్రజలు పాల్గొనరాదని తీర్మానిం చారు. చివరకు తిరుగుబాటు చేయడంతో అదొక చిరుయుద్ధంగా మారింది. దాని పై కొన్ని పాటలు కూడా వచ్చాయి.

---

ఈ భూలోకంలో ఉల్లాసానికి, హాస్యానికి కరువు ఏర్పడింది. – బిల్ నెల్సన్

అక్కడ చోటుచేసుకున్న దుర్భర ఆర్థిక పరిస్థితులు, అనావృష్టి, అధికార పోరాటాన్ని, నీరసించిన వాతావరణాన్ని కరూసో కిడ్ పాటల తూటాల రూపంలో ఎలా వర్ణించారో చూడండి:

చరిత్రలో దురదృష్టకర సంవత్సరం
వానలే ఎరుగని సంవత్సరం 1973.
భూములు ఎండాయి, పంటలు మండాయి
రైతు ఆక్రోశించాడు.
నదులు క్షీణించాయి, డ్యాములు కురచవయ్యాయి
ట్రినిడాడ్, టొబాగోలో వర్షాలు కరువయ్యాయి
బియ్యానికి కరువు...పంచదారకు కొరత,
ఉప్పుకే అగచాట్లు, గోధుమ మాయం.
అయితే.... గత సెప్టెంబర్ మాసం అద్భుతం తెలుసా?
అప్పుడు ప్రధాని కూడా కరువయ్యాడు!

ఈ విధంగా ట్రినిడాడ్ ప్రజలు హాస్యోక్తులతో ఆడుకోడానికి ఇష్టపడతారు. వారికి టైం పైనకన్నా హాస్యోక్తుల పైన, వ్యంగ్యం పైన, నిందారోపణల పైన మక్కువ ఎక్కువ. అభినందన పైన గాక, అభిశంసన పై వారికి ప్రీతి. వినోదానికి హాస్యం, ఆనందానికి హాస్యం వారి జీవన విధానమైంది. "హాస్యోక్తి అంటే క్రియాశీలక తీర్పు.... సౌందర్య స్వేచ్ఛ....పనిలో కన్నా క్రీడలో ఆసక్తి". తమవారిని ఆహ్వానిస్తూ పరాయివారిని గేలి చేయడమే వారి హాస్యోక్తుల ప్రధాన ఉద్దేశ్యం. అలానే, తమకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటిస్తూ ట్రినిడాడ్ ప్రజలు హాస్యోక్తులద్వారా ప్రత్యర్థుల పైన తమకుగల కసిని తీర్చుకోడానికి కృషి చేశారు.

పశువులకు పచ్చ అద్దాల కళ్ళజోళ్ళు : బల్గేరియా దేశస్థులు మహా చతురులు. 1976లోనే వారు హాస్య, వ్యంగ్య గృహాలను నిర్మించి నవ్వుల పంటలను పండించు కున్నారు. వారికి హాస్యం ఒక ఆట, వినోదం. గుర్రాలకు పచ్చగడ్డి కావాలి. అయితే, అనావృష్టి మూలంగా అక్కడ పచ్చగడ్డి కరువైతే ఏంచేయాలి? గుర్రాలు ఎండుగడ్డిని చూస్తూ పచ్చగడ్డిగా భ్రమించే మార్గం ఏమిటి? అని ఆలోచించి, ఆలోచించి వాటికి పచ్చ అద్దాల కళ్ళజోళ్ళు పెట్టారట! ఇలాంటివే ఎన్నో....ఎన్నెన్నో సరసోక్తులు చెబుతారు.

ఒకతను కోళ్ళు కొనడానికి వెళ్ళి తిరిగి రావడానికి ఒక సొరంగ మార్గాన్ని ఎంచుకున్నాడు. కారణం ఏమిటి? అతను కోడిని తీసుకొని వెలుతురు నుండి చీకటిలోకి

---

మందులో హాస్యం లేదు కాని హాస్యంలో ఎంతో మందు ఉంది. – జోష్ బిల్లింగ్స్.

(పొడవైన సొరంగంలోకి) ప్రవేశించాడు. దానినుండి బయటకు వచ్చేటప్పటికి మరల వెలుగు వస్తుందికదా! అలా రాత్రి నుండి పగలులోకి వచ్చామని భ్రమించిన కోడి అలవాటుగా గుడ్లు పెడుతుందని వారి ఆలోచన! మరొక విశేషం. కోడి పెట్టిన గుడ్డును దాని కళ్ళకు కనబడకుండా చేస్తే తాను 'గుడ్లు పెట్టడమే మరచిపోయాననుకున్న కోడి మరల గుడ్లు పెడుతుందని వారి ఆశ!

వారికి పొదుపు కూడా ఎక్కువే. ఇంటికి వచ్చిన అతిథులు ఎక్కువగా భుజిస్తే నష్టం కనుక అతిథులు అధికంగా నీళ్ళు త్రాగి అల్పంగా ఆహారం తీసుకోడానికి వారొక మార్గం కని పెట్టారు. భోజనంలో ఉప్పుచేపలను వడ్డిస్తే వాటిని తిని అధికంగా నీరు త్రాగిన అతిథులు ఇంక ఏమీ తినలేరు కదా!

వారికి పిల్లుల్ని పెంచడం ఓ సరదా. అయితే ఆ పిల్లులకు పొడవాటి తోకలు ఉండటంతో అవి బయటనుండి లోనికి రావడానికి ఎక్కువ సమయం పట్టేది. అసలే చలికాలం అవడంతో పిల్లులతోబాటు ఇంట్లోకి చలిగాలి అధికంగా దూరి వేడి తగ్గడం వాళ్ళకు పెద్ద సమస్యగా మారింది. కనుక ఏంచెయ్యాలి అని ఆలోచించారు. పిల్లుల తోకలు కత్తిరిస్తే.... వాటికి అసలు తోకలే లేకుంటే.... ఇంకా బాగుంటుందని ప్రక్క దేశం నుండి (Isle of Man) తోకలు లేని పిల్లులను తెచ్చుకున్నారు. అయితే, బల్గేరియా వాతావరణం గిట్టక ఆ పిల్లులన్నీ చనిపోవడంతో కథ అడ్డం తిరిగింది అంటారు బల్గేరియా హాస్య రచయిత గబ్రావో.

ఆస్ట్రేలియా హాస్యం : అద్భుత ప్రపంచం నుండి విసిరివేయబడిన భూభాగంలా కన్పించే ఖండం ఆస్ట్రేలియా. ప్రజలేగాక, ప్రకృతి కూడా ఆ ఖండాన్ని చూసి పరిహసిస్తుందా అన్నట్లు కనికరించని వాతావరణం, పరిమాణంతోపాటు శూన్యత్వంతో నిండినట్లుగా కన్పించే దేశం. ఈ విధంగా పరిసరాల పరుషత్యం నుండి రక్షించుకోడానికి ఆస్ట్రేలియావాసులకు హాస్యం శరణ్యమైంది. “చిరునవ్వును కాదంటే చిత్రహింసే మిగులుతుంది” అని గ్రహించారు. “మానవాళి ఆఖరు ఆశ హాస్యం” అని ఆస్ట్రేలియన్లు నొక్కి వక్కాణించారు.

ఓ ఆస్ట్రేలియా వనిత ఆసుపత్రిలో ప్రసవించింది. ఆమె భర్త ఒక వ్యవసాయ దారుడు. అతను తన బిడ్డను చూడటానికి ఆసుపత్రికి రావడంతోనే నర్సు అతనిని అభినందించింది. ఎనిమిదవ మాసంలోనే కాన్పు జరిగినప్పటికీ అంతా బాగానే ఉందని చెప్పింది. రైతు

---

నిజమైన హాస్యపు జల్లులు పిల్లలనుండి పుట్టుకువస్తాయి. – హాల్ రోష్

ఆనందంతో టోపీ సరిచేసుకుంటూ “నిజమే. ఇలాంటి సీజన్లో నాటిన విత్తనాలు తిరిగివస్తే నిజంగా మనం అదృష్టవంతులమే కదా!” అన్నాడు నవ్వుతూ.

మనిషి మాటల్లో అతని వృత్తి లేదా అతని జీవన విధానం బయటపడుతుంది అనడానికి ఇదొక ఉదాహరణ.

ఆస్ట్రేలియావాసులు తమ పరాజయంలో కూడా విజయాన్ని చూడగల నేర్పరులు. నిరుద్యోగ భీతి, ఆకలిబాధ, పెరుగుతున్న ఉగ్రవాదం, తరుగుతున్న నైతికవిలువలు, మనసారా హాయిగా నవ్వగలిగేవాడే ధన్యుడు అన్నది వారి విశ్వాసం.

మెక్సికో అధ్యక్షుడు మాటివోస్ (1962) లో భారతదేశ పర్యటనలో వాషింగ్టన్ లో జరిగిన ఒకానొక సంఘటనను జ్ఞప్తికి తెచ్చుకున్నారు. తన భార్య కెనడీ చేతి గడియారాన్ని చూసి కొనియాడగా, కెనడీ వెంటనే స్పందిస్తూ “గౌరవ అతిథి కోరింది ఇవ్వాలి” అంటూ తన గడియారాన్ని ఆమెకు బహూకరించారు. మరికొంత సేపటికి మాటివోస్ శ్రీమతి జాక్విలిన్ కెనడీ అందాన్ని అదేపనిగా పొగడటం కెనడీకి కొంచెం ఇబ్బందిగా కన్పించింది. అయినా అతని పొగడ్తలు ఆగలేదు. బాంక్విట్ (దేశాధిపతికి ఇచ్చే పార్టీ) పూర్తి అయిన తరువాత కెనడీ శ్రీమతి మాటివోస్ వద్దకు వెళ్ళి “దయచేసి నా గడియారాన్ని నాకు ఇవ్వండి. దానిని మీకు ఇవ్వలేను" అన్న తర్వాత ఆమె పొగడ్తల ప్రవాహం ఆగిపోయిందట!

జాతుల హాస్యం గురించి ఇంక చూద్దాం.....

---

ఇతరులందరిలోకన్నా ప్రజలలో హాస్యం ఎక్కువగా కన్పిస్తుంది. – డొరోతి పార్కన్

అధ్యాయం 26

# జాతుల హాస్యం

ఐర్లండ్ జాతీయుడైన థామ్సన్ దర్జీ వద్దకు వెళ్ళి రెండు చొక్కాలు కుట్టాలని, ఆ రెండింటిలో ఒకదానికన్నా మరొకటి ఒక అంగుళం పొట్టిగా ఉండాలని మరీ మరీ చెప్పాడు. వారం రోజుల అనంతరం అతను దర్జీ వద్దకు వెళ్ళి చొక్కాల సైజు చూసుకోవడంతో తేడా కన్పించింది. కోపంగా "ఏమయ్యా! నీకు మరీ మరీ చెప్పానుకదా!" అనడంతో అర్థంకాని టైలర్ అయోమయంగా చూశాడు. "ఒక చొక్కాకన్నా మరొకటి ఒక అంగుళం పొట్టిగా ఉండాలని నేను చెబితే, ఒక దానికన్నా మరొకటి అంగుళం పొడవుగా కుట్టావేమిటి?... మొన్నటికి మొన్న చక్కగా ఒక దుప్పటి కుట్టమంటే, అదేమో కాళ్ళవైపు తక్కువగాను, తలవైపు ఎక్కువగాను ఉండేటట్లు చేశావు. ఎలాగయ్యా ఇలా చేస్తే?" అంటూ రుసరుసలాడాడు!

ప్రాచీన ఐరోపాలో నెలకొన్న బానిస వ్యవస్థలో బానిసలు దయనీయ జీవితాన్ని గడిపారు. వారి జీవితాలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు నోచుకోలేదు. చివరకు వారి సంతానాన్ని అమ్మడానికి, వారిని ఇష్టం వచ్చిన రీతిలో ఉపయోగించుకోడానికి కూడా యజమానికి పూర్తి స్వేచ్ఛ ఉండేది. ఎన్ని ఆంక్షలు విధించినా వారికీ మానవ సహజమైన కోపతాపాలు, సుఖదుఃఖాలు ఉంటాయి కదా! అందుకే యజమాని అకృత్యాల పై తమలో రగులుతున్న వ్యతిరేకతను, అసహ్యాన్ని తమ సహచరులతో పంచుకుంటూ ఆ వర్గాన్ని రహస్యంగా గేలి చేస్తూ ఆనందించేవా.

నల్లజాతి హాస్యాన్ని (Black Humor) బానిస విధానం పై ఒకానొక రకమైన తిరుగుబాటుగాగాని, ఓ జీవన ప్రక్రియగాగాని (Survival Mechanism) భావించవచ్చు. అందువల్లనేనేమో వక్రానుక్రమణి, వ్యంగ్యం, వక్రోక్తులు వారి హాస్యంలో ప్రధాన ప్రక్రియలుగా వ్యాప్తిలోకి వచ్చాయి. నల్లజాతి హాస్యం పై డిక్ గ్రిగరి, రిచర్డ్ ప్రియర్, ఎడ్డి మర్ఫి, క్రిక్ ప్రభృతులు మంచి కృషి చేశారు. బానిసలు చాటుగా తమ యజమానులను ఎలా ఎండగడతారో తెలిపే ఉదంతం ఇది.

యజమాని : షాంపే (బానిస పేరు) నేనెలా ఉంటాను?

షాంపే : ఓ యజమానీ! మీరొక ఉన్నతుడుగా కన్పిస్తారు.

యజమాని : నీ ఉద్దేశ్యంలో ఉన్నతుడు అంటే ఏమిటి షాంపే?

షాంపే : ఏముంది యజమానీ! మీరు చాలా ఉత్తముడుగా ఉంటారు.

---

కొన్ని సందర్భాలలో హాస్యం రహస్య కన్నీరు ద్వారా జనిస్తుంది. – జోన్ లివర్స్

యజమాని : ఉత్తముడు అంటే అర్థం ఏమిటి షాం పే?

షాంపే : అంటే.....మీరొక సింహంలా కన్పిస్తారు స్వామి.

యజమాని: అవును! నువ్వు సింహాన్ని ఎక్కడ చూశావు?

షాంపే : మొన్ననే పొలంలో దానిని చూశాను మాస్టర్

యజమాని : అరె వెధవా! అది పెద్ద గాడిద కదరా?

షాంపే : అది గాడిదనా మాస్టర్? అయితే.... మీరు అచ్చుందానిలాగానే ఉంటారండి!.

వివరణ: ఎదుటివారి భాషను, జాతిని, విజ్ఞతను కించపరుస్తూ, హేళన చేస్తూ తన ఆధిక్యాన్ని చాటుకోవడాన్ని జాతుల హాస్యం అంటారు. మతం, దేశం, భాష, జాతి లేక సంస్కృతి ఆధారంగా వర్గీకరించబడిన హాస్యం ఇది. ప్రకృతి ప్రసాదించిన వరం అయిన హాస్యం జాతి, లింగ మొదలైన విచక్షణా, వికృత విధానాన్ని ఎందుకు పాటిస్తుంది? దీని ఆంతర్యం ఏమిటి? ఈ అంశం పై సుదీర్ఘ చర్చ జరిపిన క్రిస్టీ డేవిస్ హాస్య బీజాలు 'పోటీ' లేదా 'జగడాలమారితనం'లో లేవు అని నిర్ద్వంద్వంగా ప్రకటించారు.

స్వీయ హేళన : హాస్యంలో ఇతర జాతులను ఆటపట్టించడం ఒక పార్శ్వమైతే, తమపై తామే చతురోక్తులు విసురుకుంటూ కించపరచుకోవడం మరొక పార్శ్వానికి చెందుతుంది. తమ జాతి లేదా తమ వర్గానికి చెందిన ప్రజలు స్నేహశీలురు, హాస్య ప్రియులన్న బలమైన భావనను, ప్రతిరూపాన్ని సృష్టించడంలో ఇది సాయపడుతుందని, ఇది తమ ప్రగతికి అవసరమని వారు భావిస్తారంటారు డేవిస్. దీనినే స్వీయ హేళన అంటారు. ఇప్పుడు దీనిని గురించి ముఖ్యంగా 3 జాతులకు సంబంధించిన హాస్యాన్ని తీసుకుందాం.

1. స్కాట్లాండ్ వాసుల, యూదుల హాస్యం : స్కాట్లాండ్ దేశస్థుల హాస్యం ప్రపంచంలోనే స్వీయ ఉన్నతికి ఉద్దేశింపబడిందిగా కన్పిస్తుంది. సరదాగా ఆటపట్టిస్తూ పరిహసించడానికి ఈ చతురోక్తులు ఉద్దేశించబడ్డాయేకాని, పోటీతత్త్వంతో ఎదురుదాడి చేయడం వాటి లక్ష్యంగా కన్పించదు. వీరి హాస్యం యూదుల హాస్యంలా ఇతరుల పై సంధించబడలేదు. ఇవి అవమానాన్నే ఆధిక్యంగా గౌరవిస్తాయి!

2. యూదు స్త్రీలు, ఆస్ట్రేలియా పురుషుల హాస్యం : యూదు సమాజంలో మహిళా ఆధిక్యత స్పష్టంగా కన్పించగా, ఆస్ట్రేలియా సమాజంలో బ్రహ్మచారి సంస్కృతి నెలకొన్నది. చాలాకాలం ఆ రెండు దేశాలు కలసి ఉండటం వలన కావచ్చు పోలెండ్ సంస్కృతి యూదుల

---

సందర్భశుద్ధిగల చమత్కారం మందులేని మహావైద్యం వంటిది. – బిర్ టస్

సంస్కృతికి అతి సన్నిహితంగా ఉంటుంది. త్రాగుబోతుల హాస్యం, పదజాలం ఇక్కడ వికటాట్టహాసం చేసినప్పటికీ, ఆస్ట్రేలియాలో కన్పించే అలంకారిక అశ్లీలత ఇక్కడ కన్పించదు.

3. న్యూ ఫౌండ్ లాండ్, అమెరికాలలోని పోలెండ్ జాతీయుల హాస్యం : 20వ శతాబ్దం ద్వితీయ భాగంలో అమెరికాను హాస్య సముద్రంలో ముంచెత్తిన పోలెండ్ పరిహాసాన్ని న్యూ ఫౌంలాండ్ సొంతం చేసుకొని న్యూఫి జోక్స్ గా మార్చుకున్నదని కొందరి భావన. అమెరికాలోని ప్రవాస పోలిష్ జాతీయులకు తమ మాతృదేశ భౌగోళిక స్వరూపం గురించి కాని, సంస్కృతి గురించి కాని అంతగా తెలియకపోవడంతో మాతృసంస్కృతిని గురించి వారు అనాలోచితంగా హాస్యోక్తులు పేల్చడం నేర్చుకున్నారు.

మేరీలాండ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య లారీ మిండ్స్ జాతుల హాస్యం ప్రగతిలో నాలుగు అంశాలను పేర్కొన్నారు.

1. జాతుల హాస్యకారులు మొదటి దశలో ఎదుటి వర్గాన్ని అతిగా విమర్శిస్తారు.

2. ఆత్మన్యూనతా భావంతో తమ పైన తామే హాస్యోక్తులు వేసుకుంటారు.

3. క్రమంగా వారిలో యదార్థ దృష్టి ప్రబలడంతో వైరి వర్గం పైననేగాక, తమ పైన తామే హాస్యోక్తులు విసురుకుంటారు.

4. అణచివేయబడిన అల్పసంఖ్యాక వర్గాలు అధిక సంఖ్యాకుల పైన చతురోక్తులు విసురుతూ తమ ప్రతీకారాన్ని తీర్చుకుంటాయి.

జాతి హాస్యం పూర్తిగా బోధపడాలంటే ఆ జాతిని గురించిన పూర్తి అవగాహన అవసరం. స్వవర్గీయుడు తమలోని లోపాలను హాస్యో క్తులతో ఎత్తిచూపితే సభ్యులలో ఆత్మశోధన ప్రారంభమై, తమ దృక్పథాలను, ప్రవర్తనను సంస్కరించుకోడానికి, సరిదిద్దుకోడానికి ప్రయత్నించవచ్చు. అవే మాటలు ఇతరులు చెప్పినప్పుడు దాని ఫలితం తీవ్రంగా ఉండవచ్చు. కనుక ఒక వర్గం ఆలోచనాసరళిలో అంతర్గత పరివర్తన తీసుకురావడంలో 'స్వీయ విమర్శ', 'స్వీయ నింద' విధానం ప్రముఖంగా తోడ్పడుతుంది.

సెయింట్ పీటర్ కొందరు సందర్శకులకు స్వర్గం చూ పెడుతున్నాడు. మోర్మన్ల దగ్గరకు రావడంతోనే పీటర్ సందర్శకులతో "బాబూ! నిశ్శబ్దంగా, నెమ్మదిగా నడవండి. ఇక్కడ మోర్మన్లు ఉన్నారు. స్వర్గధామంలో తమకొక్కరికే చోటున్నదని వారి విశ్వాసం" అన్నాడు! ఈ విధం గా తమకు తాము ఉన్నతులమని చెప్పుకోవడంలోనే జాతి హాస్య రహస్యం ఇమిడి ఉంది. ఈ హాస్యోక్తి చెప్పింది కూడా మోర్మన్ సంస్థవారవడమే దీని విశిష్టత.

---

హాస్యానికి అందాన్ని చ్చేది సంక్షిప్తత. – షేక్ స్పియర్

ప్రపంచీకరణ ఫలితంగా ఈనాడు మన ఆలోచనాసరళిలో, జీవన విధానంలో అనూహ్యమైన మార్పులు వచ్చాయి. ప్రపంచం ఒక కుటుంబంగా మారి భిన్న వర్గాల, జాతుల మధ్య ఉన్న సరిహద్దులు భాహ్యంగా దాదాపు తొలగిపోయాయి. అయినా వలసదారుల (Immigrants) విషయంలో అంతర్లీనంగావైనా కొంత చులకన భావం స్పష్టంగా కన్పిస్తుంది.

జాతుల హాస్యం లక్షణాలు క్లుప్తంగా ఇవి : 1. ప్రతి ఒక్కరు తమ జాతికి ఒక గుర్తింపు, ప్రత్యేకత, ఆధిక్యతలు కోరుకుంటారు. 2. వక్తకు ఆ జాతిని గురించి ఎంతవరకు తెలుసు? ఆ విషయంతో ఆయన ఎంతవరకు తాదాత్మ్యం చెందుతాడు? అన్నది జాతుల హాస్యంలో ప్రధానమైన అంశం.3. ఒకానొక జాతి పై చతురోక్తులు విసిరేటప్పుడు బయటివారికన్నా, స్వవర్గీయుల సూచనలు, అభిప్రాయాల ప్రభావం సహజంగా అధికంగా ఉంటుంది. జాతి హాస్యం అనడంతోనే ప్రధానంగా మనకు విన్పించేవి ఐరిష్ హాస్యోక్తులు, భారతదేశంలో సిక్కులకు, ఆఫ్రికా వాసులకు చెందిన హాస్యోక్తులు.

ఐరిష్ హాస్యోక్తులు: ఐరిష్ జాతిలో కాలానుగుణంగా వచ్చిన మార్పులకు దర్పణంగా నిలుస్తుంది హాస్యం. 16వ శతాబ్దంలో ఐరిష్ ప్రజలు వ్యక్తికి, కుటుంబ గౌరవానికి, దర్పానికి ప్రాధాన్యమివ్వగా, 19వ శతాబ్దంలో భక్తికి, స్వార్థానికి ప్రతీకలుగా నిలిచారు. సంపన్నులైన వీరు ఆంగ్లేయులకు ఆర్థిక, సాంస్కృతిక విషయాలలో భిన్నంగా ఉంటూ తమ పురాతన వైభవానికి, బిరుదులకు, వంశాలకు ప్రాధాన్యమిస్తూ గొప్పలు చెప్పుకోవడం నేర్చుకున్నారు. అందుకే, ఆంగ్లేయులు ఐరిష్ వారి ని చాలా చులకనగా, గతించిన కాలానికి చెందిన వ్యక్తులుగా చూస్తారు.

ఐర్లండ్ పర్వత ప్రాంతంలో ఒక ఆంగ్లేయుడు గుర్రం పై ప్రయాణం చేస్తుండగా, “సహాయం కావాలి, సహాయం కావాలి” అని దీనాతి దీనంగా వేడుకుంటున్నట్లుగా అతనికి వినబడటంతో “ఎవరు నువ్వు?” అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. దానికి అతను “జన్ కిన్ ఆవ్ గ్రిఫిత్ ఆవ్ విలియం ఆవ్ రీస్ ఆవ్ ఇవాన్” అని మూల్గుతూ సమాధానం చెప్పాడు. “పెద్ద సోమరిపోతులైన ఐరిష్ వారికి కొండ చరియల్లో పచార్లేమిటి? అయినా ఆరుగురు ఉన్నప్పుడు పరస్పరం సహాయం చేసుకోవచ్చుగా” అని చివాట్లు పెడుతూ ఆంగ్లేయుడు తన ప్రయాణం కొనసాగించాడు!

---

హాస్యం ఆత్మస్తుతి యొక్క విజయం. – ఫ్రాయిడ్

ఈ హాస్యోక్తిలో ఐరిష్ ప్రజల ఎడల ఆంగ్లేయులకుగల చులకన భావంతోపాటు మృత్యు ముఖంలో కూడా వెళ్లే జాతీయుడు తన పేరును ఎంత ఆడంబరంగా చెప్పుకుంటాడో తెలుస్తుంది.

నాలుగైదు పర్యాయాల విఫల ప్రయత్నం తరువాత డాయ్ జోన్స్ కౌన్సిల్ కు ఎన్నికయ్యాడు. ఆ సాయంత్రం అంతా వేడుకలతో గడిపి రాత్రి ఇంటికి చేరి తలుపు తట్టాడు. “డాయ్ నువ్వేనా?” అంటూ భార్య బెడ్ రూమ్ లో నుండి ప్రశ్నించింది. “కాదు, నేను కౌన్సిలర్ జోన్‌ను” అన్నాడు గర్వంగా. “అయితే త్వరగా రా, ఒక అర్థగంటలో డాయ్ రావచ్చు” అంటూ ఆహ్వానించింది ఆతని భార్య!

ఒక ఆంగ్లేయుడు, స్కాటిష్, ఐరిష్, వేల్స్ దేశస్థులు విమానంలో ప్రయాణం చేస్తుండగా, మధ్యలో విమానం చెడిపోయింది. అక్కడ మూడు పారాచ్యూట్‌లు మాత్రమే ఉన్నాయని తెలుసుకున్న ఆ ప్రయాణీకులు ఆందోళన చెందుతుండగా తాను లేకుంటే స్టాక్ మార్కెట్ అతలాకుతలం అవుతుందంటూ ఒక పారాచ్యూట్ తీసుకొని కిందకు దిగాడు స్కాట్లాండ్ దేశస్థుడు. ఆ తరువాత ఐరిష్ దేశస్థుడు తానొక గొప్ప రాజకీయ నాయకుణ్ణని చెబుతూ పారాచ్యూట్ కావాలంటూ వేల్స్ దేశస్థుని సహాయంతో అతను కూడా బయటపడ్డాడు. ఆ తరువాత వేల్స్ దేశస్థుడు ఆంగ్లేయునివైపు తిరిగి “మీకొక పారాచ్యూట్ ఇస్తాను. క్షేమంగా దిగండి” అనడంతో ఆశ్చర్యపోయిన ఆంగ్లేయుడు “మరి నీ సంగతి ఏమిటి? నువ్వెలా బయటపడతావు?” అని ప్రశ్నించాడు. “ఐరిష్ దేశస్థునికి ఆహార పదార్థాలు ఉంచుకునే నా కాన్వాస్ సంచి ఇచ్చి క్రిందకు పంపా. అందుకని నాకేం ఫర్వాలేదులే” అన్నాడు వేల్స్ దేశస్థుడు. వేల్స్ వారి టక్కరితనం, ఐరిష్ వాసిని ఎంత నేర్పుగా అతడు మోసం చేసింది ఈ హాస్యోక్తి ద్వారా తెలుస్తుంది.

ఒక ఆంగ్లేయుడు స్నోడాన్ కొండ దిగువన నడుస్తుండగా దారిలో వేల్స్ వ్యవసాయదారుడు ఎదురయ్యాడు.

“ఇది స్నోడాన్ పర్వతమేనా? " ఆంగ్లేయుడు ప్రశ్నించాడు.

“అవునండి” అన్నాడు వ్యవసాయదారుడు.

“ఈ పర్వతాన్ని గురించిన కథ ఏమైనా ఉన్నదా?” అడిగాడు ఆంగ్లేయుడు.

“ఆ.....చాలా కథలున్నాయి. వాటిలో ఖ్యాతిగాంచినది ఏమంటే, “ఇద్దరు ప్రేమికులు ఈవైపు నుండే కొండ ఎక్కి మరల తిరిగిరాలేదు”.

“అయ్యో! వారికేమైంది?" ఆశ్చర్యంగా అడిగాడు ఆంగ్లేయుడు.

"అదా....వారు అటువైపునుండి దిగార!".

స్కాట్ దేశస్థుడు చెప్పే సత్యం సరళరేఖలో ఉంటే, ఐరిష్ దేశస్థుడు చెప్పేది వక్రంగా ఉంటుందంటారు. ఐరిష్ ప్రజల గురించి బ్రిటన్లో, పోలెండ్ వాసులను గురించి అమెరికాలో, బెల్జియం వారిని గురించి ఫ్రాన్స్ లో, సిక్కుల గురించి భారత దేశంలో ఇలాంటి అనేక హాస్యోక్తులు విన్పిస్తాయి. అలానే ఇటలీ దేశస్థులు పిరికిపందలని, జర్మన్లకు యుద్ధవ్యామోహం ఎక్కువని హాస్యోక్తులద్వారా తెలుస్తుంది. భారతదేశంలో జాతుల హాస్యం అనడంతోనే ప్రథమంగా సర్దార్జీలు, ఆ తరువాత నంబూద్రీలు వస్తారు. సర్దార్జీల గురించి రెండు హాస్యోక్తులు:

క్లాసులో ఎంతమంది పిల్లలున్నా సర్దార్జీ కుమారుణ్ణి గుర్తించడం చాలా తేలికట. ఎలా అంటారా? నాలుగవ తరగతిలో టీచర్ పిల్లలకు ఏదో బోధిస్తూ బోర్డు పైన వ్రాశాడు. వ్రాయాల్సింది ఇంకా కొంత మిగిలి ఉండటంతో ఆయన దానిని డస్టర్తో చెరిపి మరల వ్రాయడం ప్రారంభించాడు. క్లాసులోని విద్యార్థినీ విద్యార్థులందరూ మామూలు గా అంతా వ్రాసుకున్నారు. అయితే, సర్దార్జీ కుమారుడు మాత్రం మొదట తాను వ్రాసినదంతా రబ్బరుతో చెరిపివేసి, అదే పేజీలో టీచర్ బోర్డుమీద వ్రాసింది ఎక్కించాడు!

సర్దార్జీల పిల్లల్లోనే కాదు, సర్దార్జీలలోనే ఆ ప్రత్యేకత కన్పిస్తుంది అనడానికి ఈ హాస్యోక్తిని చదవండి. పంజాబ్ లో 80 వేలమంది సరార్జీలతో బ్రహ్మాండమైన సదస్సు జరుగుతుంది. 'సర్దార్జీలు బుద్ధిహీనులు కారు' అన్న పతాక శీర్షికతో ఆ సమావేశం శాంతాసింగ్ నేతృత్వంలో ప్రారంభమైంది. శాంతాసింగ్ లేచి "మనం బుద్ధిహీనులం కాదు అని నిరూపించడానికి ఎవరైనా ఒకరు ముందుకు రావాలి" అనడంతో ఒక సర్దార్జీ ముందుకు వచ్చాడు. "15+15 ఎంత అవుతుంది?" అని శాంతాసింగ్ ప్రశ్నించడం తో అతను అలా కళ్ళు మూసుకొని నింపాదిగా "18" అని సమాధానమివ్వడంతో "ఆయనకు మరొక అవకాశం ఇవ్వండి" అని అందరూ అరిచారు. "80 వేలమంది కోర్కెను ఎలా కాదనగలను" అంటూ శాంతాసింగ్ "5+5 ఎంత అవుతుంది?" అని ప్రశ్నించాడు. తీవ్రంగా ఆలోచించిన వాలంటీర్ "90" అని సమాధానమివ్వడంతో సభ 'మరొక్క అవకాశం ఇవ్వాలి" అని అరిచింది. శాంతాసింగ్ నవ్వుతూ "ఓ.కె. ఆఖరి అవకాశం ఇది. 2+2 ఎంత?" అని ప్రశ్నించడంతోనే సర్దార్జీ కళ్ళు మూసుకుని, ఒక్క క్షణం ఆలోచించి "4" అని సమాధానమిచ్చాడు. అంతే! "ఆయనకు మరొక్క అవకాశం-చివరి అవకాశం ఇవ్వాలి" అంటూ సభ ప్రతిధ్వనించింది!

ఉత్తరాదిన సర్దార్జీలులా దక్షిణాదిన నంబూద్రీలు కూడా వింత చేష్టలకు కీర్తి గడించారు. ఒక పర్యాయం తనకు తెలిసిన కవల పిల్లల్లో ఒకరు చనిపోయారన్న వార్త ఒక నంబూద్రి చెవుల్లో పడింది. ఆ ఇద్దరు ఆయనకు మిత్రులవడంతో వారిలో ఎవరు చనిపోయారో తెలియక ఆయన ఆందోళన చెందాడు. అలా రోడ్డున వెళ్తుండగా, ఆ కవలల్లో ఒకడు ఆ దారినే రావడం చూసిన నంబూద్రి "అవును.... ఇటీవల చనిపోయింది నువ్వా, మీ తమ్ముడా?" అని ప్రశ్నించాడు. ఆ గడుగ్గాయి "నేనేనండి" అనడంతో నంబూద్రి "పాపం! నువ్వు పోయావా?" అంటూ బాధపడ్డాడు.

ఒకానొక నంబూద్రీ శోకగ్రస్తులైన కుటుంబీకులను ఎలా ఓదార్చాలో తెలియక తల్లి సలహా అడిగాడు. "నీ మిత్రుని తల్లి మరణించింది కదా బాబూ! ఆయనతో ఇలా చెప్పు.....మీ తల్లి పుణ్యాత్మురాలు. ఆమె నీకొక్కనికే తల్లికాదు, నాకు కూడా తల్లినే. ఈ వాడవాడకు తల్లినే అని చెప్పు" అంది. నంబూద్రి అవే మాటలు పదిమందిలో చెప్పడంతో అందరూ సంతోషిస్తూ, అందరి అనుభూతులను చక్కగా వ్యక్తపరచాడన్నారు. కొంతకాలమైన తరువాత అతని ప్రియమిత్రుని భార్య మరణించింది. ప్రియమిత్రుణ్ణి పరామర్శిస్తూ నంబూద్రి "నీ భార్య మరణించినందుకు నేనెంతో చింతిస్తున్నా. ఆమె పుణ్యాత్మురాలు. ఆమె నీకొక్కనికే భార్య కాదు, నాకు కూడా భార్యనే. ఈ వాడవాడకు భార్యనే" అంటూ బాధపడ్డాడట!

ఇంక కుల, జండర్ హాస్యంలో కొన్ని ఉదంతాలు చూద్దాం.

అదొక సాహిత్య సభ. అందులో సుప్రసిద్ధ కవులు చింతా దీక్షితులు, త్రిపురనేని రామస్వామి చౌదరి గార్లు పాల్గొన్నారు. దీక్షితులు గారు తమ ప్రసంగంలో "కమ్మకుమ్మర అను పదాల శబ్ద సామ్యాన్ని బట్టి వారిద్దరూ ఏకోదరులు అనిపించుకుంటారు" అని సిద్ధాంతీకరించారు. అనంతరం రామస్వామి గారు ఉపన్యసిస్తూ "అవును దీక్షితులు గారూ! మీ ఉదాహరణనుబట్టి విప్ర, ఉప్పర శబ్ద సామ్యాన్ని బట్టి వారు ఏకగర్భ జనితులుగా అనుకోక తప్పదుకదా!" అనడంతో సభలో హర్షధ్వానాలు మిన్నంటాయి. జండర్ హాస్యం:

ఇంక డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ జాతి సంబంధమైన వివక్షాభావాన్ని ఎలా ఎదుర్కొన్నారో చూద్దామా..... అదొక విందు సమావేశం. ఓ ఆంగ్ల దొర తెల్లజాతిని పొగిడేస్తూ, నల్లజాతుల పై తన ఉక్రోషాన్ని కురిపించాడు. "తెల్లవారంటే దైవానికి కూడా మక్కువ ఎక్కువ. అందుకే మేము తెల్లగా, ఆకర్షణీయంగా ఉన్నాము" అంటూ సగర్వంగా నలువైపులా చూస్తూ తన చతురోక్తులతో ముగించాడు. అనంతరం రాధాకృష్ణన్ పండితు లు తమ ప్రసంగంలో 'దేవుడు-రొట్టె' కథను వివరించారు. "దైవం ఒక రొట్టెను తయారుచేయదలచి

---

ఒక సమస్య యొక్క పరిష్కారం తరచు హాస్యోక్తిలో బయటపడుతుంది. – ఫ్రాయిడ్

దాన్ని కాల్చాడు. ఎందువల్లనో అది కాలీకాలకుండా ఉండి పోయింది. ఆ విధంగా తెల్లజాతి వచ్చింది. రొట్టె సరిగా కాలలేదని దేవుడు మరొక రొట్టెను కాల్చాడు. అది మాడినట్లుగా నల్లగా కాలింది. ఆవిధంగా నీగ్రో జాతులు వచ్చాయి. ఇలా కాదని దైవం మరొక రొట్టెను శ్రద్ధగా కాల్చడంతో అది చక్కగా కాలింది. ఆ విధంగా భారతీయులు వచ్చారు" అనడంతో భారతీయుల ముఖాలు ఎంతగా వికసించాయో, శ్వేత జాతీయుల ముఖాలు అంతగా వెలవెలబోయాయి.

ప్రతి దేశం ప్రపంచ దేశాలన్నింటిలో తానే గొప్ప అని విర్రవీగడం సహజం. అమెరికన్ రచయిత మార్క్ ట్వెయిన్ ఒక పర్యాయం ఫ్రెంచి దేశస్థునితో ముచ్చటిస్తుండగా, ఆయన "మీ అమెరికా వాళ్ళ ప్రవృత్తి చిత్రాతిచిత్రంగా ఉంటుందండి. ఏ పనీ లేనప్పుడు మీవాళ్ళు 'మా తాత ఎవరు?' అంటూ పెద్ద పరిశోధన సాగిస్తారు. అదే మీ ప్రత్యేకత" అంటూ గేలి చేశాడు. అందుకు మార్క్ ట్వెయిన్ నవ్వుతూ "అవునయ్యా! మా నాన్న ఎవరో మాకు తెలుసు కాబట్టి తీరిక సమయాలలో మా తాతను గురించి పరిశోధన చేస్తుంటాము. మరి మీ నాన్న ఎవరో మీకే తెలియదు కాబట్టి తాతను గురించి మీరు పరిశోధనలు చేయలేరు కనుక ఇలాంటివి మీకు గందరగోళంగానే ఉంటాయిలేండి" అంటూ గట్టి చురక వేశారు.

ఆంగ్లేయుల దృష్టిలో స్కాట్లాండ్ వాసులు బుద్ధిహీనులు, దొంగలు. అయితే స్కాట్లాండ్ వాసులకు ఆంగ్లేయులు అంటే అస్సలు పడదు. జాతుల. కొన్ని విషయాలలో సామాన్య ప్రజలు అతిగా భావావేశాలకు లోనవుతారు కనుక, అలాంటి అంశాల పై హాస్యోక్తులు జాగ్రత్తగా విసరలేకపోతే అవి అపనిందగా మారే ప్రమాదం కలదు.. అందువల్లనే వైరివర్గాన్ని తూలనాడుతున్నారన్న భావనకన్నా, ఒక మిత్రునిగా చక్కని సలహాలు ఇస్తున్నారన్న విశ్వాసం శ్రోతలలో కలిగించగలగాలి.

ఆధునికులం అనిచెప్పుకుంటున్న మనం హాస్యాన్ని నెమ్మదిగా జాతుల బారినుండి తప్పించడం ద్వారా నిష్పాక్షికంగా, జాతి, మతాలకు అతీతంగా హాస్యాన్ని ఆనందించడం నేర్చుకోవాలి. అందుకే మనం పరిమితంగా విదేశీ ప్రముఖుల హాస్య గుళికలు తీసుకుందాం.

---

మంచి హాస్యోక్తి మనపైన చెరగని ముద్రవేసి చక్కని ఆనందాన్ని అందిస్తుంది. – ఫ్రాయిడ్

అధ్యాయం 27

# నాటకరంగం - హాస్యరసం

ఓ ప్రఖ్యాత నటి కుటుంబసమేతంగా నాటకాన్ని తిలకిస్తూంది. ఆ కథలో హీరో కొంచెం ముక్కోపి. ఆలోచన తక్కువ, ఆవేశం ఎక్కువగల వ్యక్తి. నాటకం మధ్యలో కథానాయకుడు నాయకిని ప్రతి చిన్న విషయానికి బాధిస్తుంటాడు. ఒక సందర్భంలో కొట్టబోతాడు. ఇదంతా ఆసక్తిగా చూస్తున్న నటి కుమార్తె తల్లితో “ఏందమ్మా! ఆ హీరోయిన్ అలా బాధపడుతుందే కాని నువ్వు డాడీని బాదినట్లు ఒక్కమారైనా బాదదేమిటి?” అని అమాయకంగా ప్రశ్నించింది!

అమెరికాలో ప్రఖ్యాత సినీనటి ఒకామె షూటింగ్ మధ్యలో అనారోగ్యానికి గురైంది. ప్రముఖ వైద్యులు వచ్చి ఆమెను పరీక్షించి. “తక్షణం న్యూయార్క్ తీసుకుపోయి సర్జరీ చేయించాలి. చాలా ప్రమాదకర స్థితిలో ఉంది. ఆలస్యం చేయకండి” అని సలహా ఇచ్చారు. వెంటనే మంది మార్బలంతో విమానాశ్రయానికి బయల్దేరారు. అక్కడ ఫోటోలే ఫోటోలు. క్షణం తీరికలేదు! "అయ్యా! ఏంది ఆలస్యం?” అని పైలట్ ప్రశ్న. “గాలి విపరీతంగా కొడుతుంది. ఆమె గౌరవార్ధం ఎర్ర తివాచీ వేస్తుండగనే అది గాలికి లేస్తూంది. ఏం చెయ్యాలి? అంత పెద్ద నటిని ఘనంగా విమానం ఎక్కించాలిగదా?” నిర్వాహకుల సమాధానం!

“ఈ ప్రపంచం ఒక నాటక రంగం. మనమంతా సూత్రధారులం” అని చమత్కరించాడు మహానాటకకర్త విలియం షేక్స్ పియర్. నిజానికి భిన్న మానవ ప్రవృత్తుల సంఘ ర్షణా కేంద్రం నాటకం. అది కళలకు కాణాచి; వినోదానికి స్థావరం; జాతి కళాభిరుచు లకు తార్కాణం.

'నాటకం' అంటే? “సంభాషణల రూపంలో ఉన్న కథను నటనారూపంలో ప్రేక్షకుల ముందు చూపే ప్రక్రియ” అంటాడు బ్రాండెన్ మాథ్యూస్. "యదార్థ సంఘటనలు యదార్థంగా అసలైన వారికే జరుగుచున్నాయని ప్రేక్షకులను నమ్మించే కళ” అన్నాడు బెర్నార్డ్. నటుడు తన పాత్రలో జీవించడానికి, తన నటనా కౌశలాన్ని ప్రదర్శించడానికి అరుదైన అవకాశం కల్పించే అద్భుత కళారూపం నాటకం. అందుకే అది సినిమా, టి.వి.లకన్నా భిన్నమైనది; అనాదిగా మానవునికి ప్రీతిపాత్రమైనది. ఇంక దాని పుట్టుపుర్వోత్తరాల గురించి క్లుప్తంగ తెలుసుకుందాం.

---

నవ్వని మనిషిని నమ్మకు. – సూక్తి.

నాటకం చరిత్ర : అది క్రీ.పూ 4వ శతాబ్దం . ప్రాచీన గ్రీకులు తమ ప్రియమైన దైవం డయోనిస్ ప్రీతి కోసం జంతు, వృక్ష ముఖాలతో అలంకరించుకుని, ఆటపాటలతో ఆ దేవతను ఆహ్వానిస్తూ ఉత్సాహంగా పండుగలా జరుపుకునేవారు. ఆలాంటి పద్ధతిని 'కోమస్' అని పిలిచేవారని, ఆ పదం నుండి 'కామెడి' అను ఆంగ్లపదం వచ్చిందంటాడు డా||పి.వి.రమణ. మొదట మాటలు లేకుండా మూకాభినయం గావించేవారని, కొంత కాలం తర్వాత వాళ్ళు మేకలలాగా నాట్యంచేస్తూ పాటలు పాడుకుంటూ సాగేవారని, అందుకే దానికి మేకపాట (ట్రాజెడి tragas = goat, ode= song) అని పేరొచ్చిందని తెలుస్తుంది.

ఆనాడు కొందరు గాయకులు, ఎత్తైన వేదిక పైన కూర్చుని దేవతలను స్తుతిస్తూ పాటను గానం చేసేవారు. గాయకులకు విశ్రాంతి ఇవ్వడానికిగాను మధ్యలో ఒక నటుడు చిత్రాతి చిత్రములైన ముసుగులు (మాస్కులు) వేసుకుని, హాస్య సంభాషణలు గావిస్తూ సభికులను ఆనందడోలికలలో ముంచెత్తేవాడు. ఆ తర్వాత మరలా బృంద గానం కొనసాగేది. కాలక్రమేణా బృందగానంలో సంభాషణలు చోటుచేసుకుని నాటక రూపం దాల్చాయని తెలుస్తుంది. గ్రీసులో సోఫికిల్స్, ఏషిలస్ మొదలగు రచయితలు ఆనాడు నాటకరచన గావించారు. ఏషిలస్ రెండవ నటుడుని, యూరుపిడస్ నాంది, భరతవాక్యం పద్ధతిని ప్రవేశపెట్టారు.

నటులను కొందరు తెస్పియనులు అని పిలుస్తారు. సుమారు 2000 సం||ల పూర్వం తెస్పియన్ సంచార నాటక ప్రదర్శకులతోను, క్షణాలలో వేదికగా మార్చడానికి వీలైన సరుకుల బండితోను గ్రీసు మొత్తం సంచరిస్తూ నాటక ప్రదర్శనలు ఇచ్చేవాడు. నటుడు, నాటక రచయిత అయిన అతనిని “రంగస్థల ప్రథమ పురుషుడు" అని కొనియాడారు. క్రమంగా నాటకరంగం అభివృద్ధి చెందింది. ఒక ముఖ్య విషయం. గ్రీసులో విషాదాంత నాటకాలతో ప్రదర్శనలు ప్రారంభమై, 150 సంవత్సరాల తర్వాత అరిస్టోఫెన్స్ (క్రీ.పూ.448-380)తో హాస్య నాటకాలతో కామెడీల యుగం ఆరంభం అయింది. కప్పలు, తూనీగల పేర్లతో ఆయన అధిక్షేప, ఆహ్లాద రూపకాలు రచించి కీర్తి గడించాడు.

క్రీ.పూ. 480లో ఎథెన్స్ పతనం అయింది. ఆ తర్వాత జరిగిన పునర్నిర్మాణంలో నాటకాలకు స్వర్ణయుగం ప్రారంభం అయిందని చెప్పొచ్చు. విషాదాంత కథనాలతో విసుగెత్తిన గ్రీకువాసులను ఆనందపరచడానికిగాను పోటీలకు రచనలు సమర్పించే ప్రతి రచయిత మూడు ట్రాజడీలతో విధిగా ఒక కామెడీ కూడా ఇవ్వాలన్న షరతు విధించడం ఒక

---

విశేషం. ఉదయం నుండి సాయంత్రం దాకా నాటకాన్ని వీక్షించే ప్రదేశాన్ని తియేట్రాన్ (Theatron= చూచే ప్రదేశం) అని పిలిచేవారు. క్రమంగా అది ఆంగ్లంలో తియేటరుగా మారింది. ఆ తరువాత సుమారు 15 సంవత్సరాలలో నాటకశాలకు రంగుల తెరలు రావడంతో నటులు డ్రస్సులు మార్చుకోడానికి చక్కని అవకాశం ఏర్పడింది.

చైనా : క్రీ.పూ.100వ సం||లోనే చైనాలో విచిత్ర వేషాలు కట్టినట్లు, తాంగ్ వంశీయుల కాలంలో వెయ్యిరకాల ఆనందాన్ని ఇచ్చే సంగీత నాటకం ఉందని చెబుతారు. అనంతరం తోలుబొమ్మలాటలు వచ్చాయి. తమాషా ఏమంటే రాత్రిపూట ఆ బొమ్మల తలలు తొలగించకుంటే వాటికి ప్రాణం వస్తుందన్న భీతితో వాటి తలలు తీసి బొమ్మనుండి దూరంగా దాచేవారట! ఆ తర్వాత కొంతకాలానికి సంభాషణ, స్వగతం రూపంలో సుఖాంత నాటకాలు వెలుగుచూశాయి. కువాన్ హాంగ్ చింగ్ 60 నాటకాలు వ్రాసిన ప్రతిభాశాలి. అయితే ఆనాడు చైనాలో నాటకాలు సంపన్నులకు మాత్రమే ఉద్దేశింపబడడం విశేషం.

నాటక రంగానికి ఊయల రోమ్ : ప్రపంచదేశాలలో గ్రీసులో ప్రప్రథమంగా నాటకరంగం ప్రారంభమైనప్పటికీ దానికి జీవాన్ని, వికాసాన్ని అందించిన ఘనత రోమ్ కళాకారులకే దక్కుతుంది. అక్కడ ప్రతి ఇంట్లో యుద్ధ ఖైదీలు బానిసలుగా పనిచేస్తూ, ఇంటి పనులన్నీ వాళ్ళే నిర్వహించడంతో రోమ్ నగరవాసులకు పూర్తి విశ్రాంతి లభించడంతో రోమనుల దృష్టి వినోదంవైపుకు మళ్ళి, నాటక రంగం ప్రారంభం అయింది.

రోమ్ వాసులు గ్రీసు డ్రామాలతో గొప్పగా ప్రభావితులవడమేగాక, చివరకు వాళ్ళ దుస్తులను కూడా అనుకరించడం విశేషం. గ్రీసులోవలె రోమ్ కూడా డ్రామాను మతం నుండి వేరు చేయడం మరొక శుభ పరిణామం. వాగుడు సిపాయి, తెలివైన బానిస పాత్రలు, మూకాభినయం, మిమిక్రి, ప్రహసనాలు అంటే రోమనులకు బహు ఇష్టం. విగ్ ధరించడం, అందమైన బాషలో మాట్లాడడం, నీతి బోధతో నాటకం ముగించడం వాళ్లకు ప్రీతిపాత్రం. మరో విశేషం ఏమంటే విగ్ రంగును బట్టి ఆ పాత్రను గురించి చెప్పవచ్చు. నల్లవిగ్ ధరిస్తే ఆ నటుడు యువకుడని, బూడిదరంగు అయితే వృద్ధుడని, ఎరుపు బానిసకు, పసుపుపచ్చ మహిళకు సంకేతాలు అయ్యాయి.

క్రీ.పూ. 3వ శతాబ్దిలో ప్లాటస్ కామెడీ రచయితగా ఖ్యాతికెక్కాడు. ఇద్దరు ముగ్గురు నటులమధ్య ఆ నాటకాలలో సంభాషణ జరిగేది. సాంఘిక దురాచారాల ఖండన, పడువువృత్తిని తెగనాడుట మొదలగు సామాజిక రుగ్మతలను తొలగించడానికి నాటకాన్ని ఒక సాధనంగా వినియోగించడం రచయిత టెరెన్సీ (క్రీ.పూ.170) ప్రత్యేకత. బానిస అయిన

---

వికృత అర్థాల ద్వారా సత్యాన్ని చూడటమే హాస్యం. – మాక్స్ షుల్ మన్.

ఆయన స్వాతంత్ర్యాన్ని పొంది, ఏకంగా ఆరు హాస్య ప్రహసనాలు వ్రాయగా విషాదనాటక రచయితగా సెనెక పేరు గడించాడు.

ఆ తరువాత రోమ్ పతనం, క్రైస్తవమత వ్యాప్తి, సీజరు చక్రవర్తి తన సామ్రాజ్యంలో నాటకాల ప్రదర్శనను నిషేధించడంతో కళాకారులు దేశద్రిమ్మరులుగా మారారు. చిత్రమేమంటే క్రమంగా క్రైస్తవ మతాధిపతులు తమ మత వ్యాప్తికి నాటకం మంచి సాధనం అని గుర్తించి, దానిని ప్రోత్సహించారు! దాంతో క్రీ.శ. 10వ శ॥ నాటికి బైబిల్ కథలలోకి హాస్యం ప్రవేశించి ప్రేక్షకులను అమితంగా అలరించింది. క్రమంగా విదూషకులు, హాస్యగాళ్ళు నాటకాలలో ప్రధాన పాత్రధారులయ్యారు.

అనంతరం చరిత్ర అనేక అనూహ్య సంఘటనలకు, సాక్షీభూతమయింది.మత యుద్ధాలు, ఐరోపాలో సాంస్కృతిక పునరుజ్జీ వనం, జాతీ యతావాదం వ్యాప్తి మొదలగు పెనుమార్పులు చోటు చేసుకోవడంత,15వ శతాబ్దంలో ఇటలీలో పూర్తిగా హాస్యపాత్రలతో, నవ్వులు చిందించే సంభాషణలతో కమి డియా డెల్ ఆర్ట్ (Commedia Dell. Arte) అనే వినూత్న ప్రక్రియ వ్యాప్తిలోకి వచ్చింది. ఒక హాస్య సంఘటనను తీసుకుని నటీనటులు అక్కడికక్కడే తమకు తామే సంభాషణలు గావించడం దాని ప్రత్యేకత. అలానే,

స్పైన్ లో కుటుంబ నాటక బృందాలు ఏర్పడి స్వదేశంలోనే గాక పెకు దేశాలలో ఆ బృందాలు ఊరూరా తిరుగుతూ చిత్ర విచిత్ర తొడుగులతో, పొడపాటి మీసం, రాగి జుట్టు గొర్రెపోతు పోలికలతో నటులు భిన్న రూపాలతో హాస్యాన్ని అందిస్తూ నాటక రంగానికి నూతన జవసత్వాలు అందించారు.

ఆంగ్ల నాటకరంగం:16వ శతాబ్ది ప్రారంభంలో ఆంగ్ల సాహిత్యంలో నవయుగం ప్రారంభమైంది. విలియం షేక్స్ పియర్ (1564-1616). ప్రపంచంలో కన్పించే రకరకాల వ్యక్తులను సుమారు 750 పాత్రల ద్వారా ప్రత్యేక తరహాలో పరిచయం చేసి, ఆంగ్ల నాటక రచయితలలో  అజరామరుడ య్యాడు. ప్రపంచంలోనే గొప్ప నాటక రచయితగా కీర్తి గడించాడు.

అద్భుత హాస్య పాత్రలతో బాటు ఆలోచనాత్మకము, తాత్వికపరమైన హాస్యంతో నవ్వులు వెదజల్లాడు. షేక్స్ పియర్ అనేక రచనలలో ముఖ్య పాత్ర పోషించిన విదూషకు డు పదాలను విరుస్తూనో, వింత పదాలను సృష్టిస్తూనో, హాస్యాన్ని పండిస్తూ ప్రేక్షకులను ఆనంద డోలికలలో ముంచేస్తాడు. జూలియస్ సీజరు నాటకంలో పరిస్థితుల ప్రభావం వలన ఆంటోనియో ఒకవైపు ప్రత్యర్థులను పొగుడుతున్నట్లు కన్పిస్తూనే, మరొకవైపు మహారాజు

---

ప్రియమైన హాస్యోక్తి నీ మానసిక చేవ్రాలు వంటిది. –ఫ్రాయిడ్

హత్యకు ప్రతీకారంగా కుట్రదారుల పై ప్రజానీకాన్ని ఉసిగొల్పుతూ చేసిన ప్రసంగం ప్రపంచసాహిత్యంలో చిరస్థాయిగా నిలుస్తుంది. ఇలాంటి ఉదాహరణలు షేక్ స్పియర్ రచనలలో అనేకం కన్పిస్తాయి. అలానే, ఆంగ్ల నాటక రంగంలో బెన్ జాన్సన్, క్రిష్టఫర్ మార్లో, వెబ్స్టర్ మొదలగు ప్రముఖులు ఎందరో కన్పిస్తారు.

అదేకాలంలో ఫ్రాన్సు నాటకాలకు స్వర్ణయుగంగా పేరు గాంచింది. 'పీనాసి', 'భార్యల పాఠశాల', 'మానవ ద్వేషి' మొదలగు అద్భుత హాస్య నాటికల ద్వారా ఆ దేశంలో మొలియర్ ఇంటిల్లపాదికీ ప్రీతిపాత్రుడయ్యాడు. ప్రఖ్యాత నాటక రచయితనేగాక, గొప్ప నటుడైన ఆయన తన హాస్య, వ్యంగ్య, అధిక్షేప రచనలద్వారా సమాజంలోని అసమానతలను అంతమొందించడానికి, ప్రజలను చైతన్యపరచడానికి అద్వితీయంగా కృషి చేశాడు.

మన నాటకరంగం : ఇంక మన దేశంలో నాటక రంగం గురించి చూద్దాం. ప్రాచీన భారతీయ రచయితలు వేదాంతాన్ని బోధించడానికి నాటకీయతను ఉపయోగించినంత గొప్పగా ప్రపంచంలో బహుశా ఏ దేశం ఉపయోగించలేదనడం అతిశయోక్తి కాబోదు. చరిత్రలోనే అత్యంత ప్రాచీన గ్రంథాలైన ఉపనిషత్తులను గురుశిష్య సంవాద రూపంలో రచించడం ఒక ఉదాహరణకాగా, యుద్ధభూమిలో రణగొంణధ్వనులమధ్య శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేయడం అద్భుత నాటకీయతకు మహత్తర ఉదాహరణ.

ఇక్కడ సుఖాంత నాటకాలతో నాటక రచన ప్రారంభమవడం శుభ సూచకం. అయితే గ్రీసులో వలెనే ప్రాచీన భారతదేశంలో కూడా హాస్యానికి అంతగా ప్రాధాన్యం ఇవ్వలేదు. నాట్యశాస్త్ర మూల పురుషుడు భరతముని 3500 సం||ల పూర్వమే మొదటి రూపక నిర్మాతగా ఖ్యాతి గడించాడు. క్రీ.పూ. 1వ శతాబ్దంలో అశ్వఘోషుని శారీపుత్ర, క్రీ.పూ. 8వ శతాబ్దంలో రచింపబడిన మధ్యమ వ్యాయోగము మరికొన్ని రూపకాలు. కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలము' (4వ శతాబ్దం), భాసుడు 'స్వప్న వాసవదత్తము' కొన్ని గొప్ప నాటకాలు.

'ది రొమాన్స్ ఆఫ్ థియేటర్' రచయిత ఉమా ఆనంద్ ఇలా పేర్కొన్నారు. సంస్కృత నాటకాలలో, దృశ్య బంధ నిర్మాణానికి, రంగు రంగుల దృశ్యాలకు అట్టే విలువ లేదు. సంస్కృత రూపక సాహిత్యంలో సంభాషణల ద్వారా దృశ్యాన్ని స్ఫురింప చేయడం గొప్ప ప్రక్రియే కాదు, అదొక విశేషం కూడా. ప్రాచీన భారతీయ రూపక సాహిత్యం కళల ద్వారా సమైక్య జీవన సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. (Harmony through arts)

---

మంచితనం, విజ్ఞానాల సమ్మేళనమే మంచి హాస్యం. – ఓవెన్ మెరిడిత్

వికృత రూపంతో, విచిత్ర చేష్టలతో జనసామా న్యాన్ని నవ్వించడానికే ప్రవేశ పెట్టబడిన పాత్ర విదూషక పాత్ర. భరతముని నాట్య శాస్త్రంలో నిర్దేశించిన ఆ అవలక్షణాలను రాజశేఖరుడు, భాసుడు, శూద్రకుడు మొదలగు సంస్కృత కవులందరూ యధాతథంగా అనుసరించడమేగాక, తమ శక్తిమేరా ఆ పాత్రను మరింత చులకన చేశారు. అది హాస్యం అంటే గిట్టని కాలం కనుక రచయితలకు కూడా హాస్యనటులంటే ఒకింత ఏవగింపు, మరింత చిన్న చూపు ఉన్నా మహా రచయిత కాళిదాసు ఆ పాత్రకు జీవం పోసి అతనిని 'ప్రజ్ఞా నేత్రం' గలవాడుగా, జ్ఞానిగా, నాయకపాత్రకు 'నర్మ సచివుడు', గా తీర్చిదిద్దడం ద్వారా హాస్యానికి గౌరవస్థానం కల్పించాడు. ఇంక తెలుగు నాటక రంగంలోకి ప్రవేశిద్దాం.

తెలుగు నాటక జననం : ఆదికవి నన్నయ్య 'కావ్య నాటకములను పెక్కింటిని చూచాననగా, కుమార శ్రీకంఠుడనే నటుడు 10వ శతాబ్దంలోనే 'ఆర్యక్రీడ' అనే నాటకం ప్రదర్శించాడని తెలుస్తుంది. పాల్కురికి సోమనాథుడు ఆనాడు ప్రచారంలో ఉన్న బొమ్మలాట, చీర మరుగుల బొమ్మలాట, ఖండితగతి మొదలగు నాటకరూపాలను గురించి పేర్కొన్నాడు. అన్నట్లు క్రీ.శ. 2వ శతాబ్దంలోనే ఆచార్య నాగార్జునుడు నాగార్జున కొండమీద సువిశాల రంగస్థల నిర్మాణం గావించాడంటే ఆ నాటికే రంగస్థలం ఎంతగా అభివృద్ధి చెందిందో తెలుస్తుంది.

తెలుగులో తొలిరూపకం 'క్రీడాభిరామం'. వీధి రూపక లక్షణాలు కన్పించే ఈ రూపకం రెండు పాత్రలతో, హాస్య శృంగారాలతో నడుస్తుంది. 15వ శతాబ్దం నాటికి బాగా అభివృద్ధి చెందిన యక్షగానం, మరో రెండు శతాబ్దాల తర్వాత వీధి నాటకంగా వ్యాప్తిలోకి వచ్చింది.

కర్ర బొమ్మలాట, తోలు బొమ్మలాట, భామా కలాపము, ముఖ్యంగా కొజవంజి ప్రక్రియలు నాటక ఆవిర్భావానికి ఎంతగానో దోహదం చేశాయి. మొదటి రెండు రూపాలలో కథ మధ్యలో గాంధోళిగాడు, కేతిగాడు, బంగారక్క మొదలగు హాస్యపాత్ర లు ప్రవేశించి చక్కని హాస్య వాతావరణం సృష్టించాయి. ఛాయానాటకం (మనిషి లేదా వస్తువులను కాంతికి, తెరకు మధ్య నిలిపి నడిపే నాటకం), బహురూపకం (ఒకే నటుడు భిన్న పాత్రలు దరించడం) లాంటి ప్రయోగాల ఫలితంగా తెలుగులో నాటక రచన ప్రారంభమైంది.

ఆయన 1880లో విద్యార్థి నాటక సమాజంను స్థాపించి, తాను వ్రాసిన 'ప్రహసనాలు'ను తానే ప్రదర్శింపజేయడం కందుకూరి ప్రత్యేకత. అయితే 1860లోనే క్రమంగా రచయితలు హాస్యాన్ని ఏపుగా పండించారు.హాస్యం పేరుతో ఏదో ఒక కులాన్ని గేళి

---

చేయడం అపహాస్యం, అధమ హాస్యం అవుతుందేకాని హాస్యం కాబోదు. పేరిగాడు (ప్రతాప రుద్రీయం), సుబ్బిశెట్టి (చింతామణి), పెద్దిశెట్టి (సతీసక్కుబాయి) పాత్రలు ఇందుకు ఉదాహరణలు. తర్వాత రచయితలు తమ పంథా మార్చుకుని నక్షత్రకుడు (సత్య హరిశ్చంద్ర), గిరీశం (కన్యాశుల్కం) లాంటి ఉన్నత శ్రేణి హాస్యపాత్రలు ప్రవేశపెట్టడం తెలుగు నాటకరంగ పరిపక్వతకు చిహ్నం.

తొలి తెలుగు హాస్య నాటకం : తెలుగులో పూర్తి స్థాయి హాస్య నాటకం కంఠాభరణం. పానుగంటి లక్ష్మీనరసింహారావు సుబ్బిశెట్టి పాత్ర ద్వారా ఆ నాటకంలో ఆశుకవులను ఎలా చీల్చి చెండాడాడో చూడండి.

సుబ్బిశెట్టి: శాబాసందురో, చీయందురో నేనెఱుగను. కానీ యామాత్రంపబని నేనును జేయగలను. కవిత్వమునకు మీరే సృష్ట్యాది గురువులాయేమి.

చింతపండుదెచ్చి రాచ్చిప్పలో వేసి
నీళ్ళు పోసి, పచ్చిపులుసు చేసి
కాలిన వంకాయ ఆ పులుసులో వేసి
ఉల్లిపాయకారమందు వేసి,
బుట్టలోది కాస్త దానిలోపల జేర్చి
బజ్జీ జేసి తినగ గజ్జి మొలచు.

అలానే పడుపువృత్తిని ఎలా హేళన చేశాడో చదవండి. వారి వ్యాపారమువంటి సుఖమైన వ్యాపారము మఱియొకటిలేదు. రవ్వరట్టు లేదు గదా! అరువు బేరాలు లేవుగదా! పెట్టుబడి లేదుగదా! ఆదాయపు పన్ను లేదుగదా! పైరుపంటలతో నిమిత్తము లేదు గదా! ద్వాదశ వర్షకామము పట్టిననూ వారి వర్తకము జంకదు గదా.... ఎక్కడనో యుద్ధాలు వచ్చినవి. సరుకు లేదు. కాళ్ళు దాచుకొని కూర్చున్నాను. వారికీ బాధ లేదు కదా! దివాలా గొడవ మొదలే లేదు గదా. వారి వ్యాపారమే వ్యాపారము. వారి జన్మనే జన్మము. అదృష్టవంతులు. సుఖజీవినులు. అందుచేత సానులను చూడ నాకు మిక్కిలి ముచ్చట.

సంఘంలోని దురాచారాలను ఎండగడుతూ జనసామాన్యాన్ని నవ్వించడం ఈ రచన ప్రధాన లక్ష్యంగా కన్పిస్తుంది. అన్నట్లు పానుగంటివారి సుబ్బిశెట్టి పాత్ర తెలుగు ప్రేక్షక లోకాన్ని ఇతోధికంగా ఆకర్షించింది.

కాళ్ళకూరి నారాయణరావు గారు తన 'వరవిక్రయం'లో సింగరాజు లింగరాజు పాత్రను పరమలోభిగా సృష్టించాడు. కన్యాశుల్కం విధానంలో వధువును అమ్మడం

---

హాస్యం ఒక సామాజిక దృశ్యం. – హ్యుగ్ సీ

ఆచారంకాగా, వరవిక్రయంలో వరుని అమ్మకానికి పెట్టడం ఘాషనయిందని రచయిత పెండ్లిండ్ల పేరయ్య ద్వారా అందంగా చెప్పించాడు.

'శ్రీకృష్ణ తులాభారము'లో రచయిత ముత్తరాజు సుబ్బారావుగారు నారద పాత్రను అద్భుతంగా మలచి అరుదైన హాస్యాన్ని అందించారు. ఇందులో 'భలేమంచి చౌకబేరము, మించినన్ దొరకదు, సుజనులారా' అనేపాట మరియు "మీరజాల గలడా నాయానతి', పాట గొప్పగా హిట్ అయ్యాయి.

జంబు : మగవాడు కావడం చేత అలానే సతీసక్కుబాయిలో పెద్దిశెట్టి, శంభుశాస్త్రి, ప్రతాపరుద్రీయంలో పెరిగాడు - ఎల్లి పాత్రలు కేవలం హాస్యం కొరకే సృష్టించబడ్డాయి.

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919) తెలుగు నాటక ప్రదర్శనా ప్రక్రియకు ఆద్యులు చక్కని వ్యవహారిక భాషలో, చిక్కని తెలుగులో నాటకాలు వ్రాసి చరిత్ర సృష్టించారు ఆయన. బాల్య వివాహాలు, పిల్ల తల్లి దండ్రుల ధనదాహం, పెళ్ళి బేరాలు - ఇత్యాది సాంఘిక దురాచారాలను బ్రహ్మ వివాహం లో ఘాటుగా విమర్శించాడు. అలానే లంచగొండితనం, అవినీతి మొదలగు సామాజిక రుగ్మతలను తన ప్రహసనాల ద్వారా హాస్య, వ్యంగ్య ధోరణిలో తూర్పారపట్టాడు. మచ్చుకు ఒక ఉదాహరణ.

పుల్లయ్య: ముక్కపచ్చలారని పసిబిడ్డ. ఇప్పుడు పిల్లదాని వివాహమునకేమి తొందర వచ్చింది. మొన్నటి శ్రావణ శుద్ధ నవమికి గదా దానికి రెండేళ్ళు వెళ్ళినవి? -

కామయ్య : (ఆడపిల్ల తండ్రి) అయ్యా! మూడుకాళ్ల ముసలివాళ్లము. తెల్లారి లేచి యేరోజు కారోజు రేపు మళ్ళీ మిమ్మల్ని చూస్తామో లేదోనని భయం వేస్తూ ఉంటుంది. మా రెండు ప్రాణాలు బొందెలతో ఉండగానే పిల్లదాన్ని ఏ అయ్యవళ్ళోనో పెట్టి మా అవశిష్టము లేకుండా తీర్చుకుంటే అవతల ఉభయుల అదృష్టము ఎల్లా ఉంటే అట్లా జరుగుతుంది...... (భార్య చెవిలో) వారు మనకు ఎనిమిది వందల రూపాయలు ఇస్తామన్నాడు. ఇంకో రహస్యం కూడా ఉన్నది. పెళ్ళికొడుకు బహు ముసలివాడు. మహా బ్రతికితే పదేళ్ళు బ్రతుకుతాడు, పన్నేండేళ్ళు బ్రతుకుతాడు. అంతకంటే ఎక్కువ బ్రతకడు.... ఆ ముసలి ప్రాణం కాస్తా గుటుక్కు మనడంతోటే, అవతల అతగాడి ఆస్థి అంతా మనకే దక్కుతుంది.

పురోహితుల దుర్మార్గాన్ని, అజ్ఞానాన్ని ఎలా ఏకి పెట్టాడో చదవండి.

పురోహితుడు : ఈ రోజు మీ తండ్రిగారి తిథి ప్రయోజనం. నిన్నటి రాత్రి నుంచీ మీ కోసం తిరుగుతుంటే మీ దర్శనం అయింది కాదు.

---

విజయ సాధని చిరునవ్వు. – బాబ్ హోప్

రామారావు : మా బంధువుల ఇంట్లో భోజనం చేశాను. అంతగా కావలిస్తే తద్దినం రేపు ఉదయాన్నే పెడదాము.

పురోహితుడు : చిత్తం. నాల్గురోజులలో తూర్పు వెళ్లవలసిన పని ఉన్నది. నాలుగు నెలలు దాకా రానండి.

శ్యామల : ఏమయ్యా బ్రాహ్మడా! నీకు ఊరికి వెళ్ళవలసిన పని ఉన్నదని ఇంత కక్కుర్తి పడతావు. మామగారు పోయింది వైశాఖ మాసమైతే ఈ చైత్ర మాసంలో తద్దినం ఎలాగ వస్తుందయ్యా.

పురోహితుడు : అమ్మగారు కోపం పడకండి. నేను పంచాంగం పొరపాటుగా చూచాను కాబోలు. మళ్ళా వెళ్ళి తద్దినాల జాబితా చూచివస్తాను.

ఆయనకు సంఘసంస్కరణే ధ్యేయం కనుక దానికి ఆయన హాస్యంను ఆయుధంగ ఉపయోగించాడు. అందుకే ఆయనొక పథనిర్ణేత. ఆయన చూపిన దారిలోనే గురజాడ, చిలకమర్తి ప్రభృతులు పయణించడం వీరేశలింగం ప్రతిభకు తార్కాణం. సమాజంలో పాతుకుపోయిన విషబీజాలను పెకలించడానికి ఎంత మొండితనం అవసరమో, అంత మొరటుతనం కూడా అవసరం. కనుకనే ఆయన హాస్యం కటువుగా, మొరటుగా ఉంటుంది. అయితే చిలకమర్తి వారి హాస్యం ప్రధానంగా సున్నితపు, సునిశిత హాస్యం.

మహాశిల్పి చెక్కిన శిల్పం: "సాహిత్యాన్ని... సాహిత్య ప్రయోజనాల గురించి, నాటక ప్రక్రియ... భాష...... మాండలిక వైవిధ్య సహజతను గురించి, నిర్దిష్టము, సమగ్ర మూ అయిన అవగాహనగల ఒక మహాశిల్పి తెలుగులో రచించి చిరప్రాణ ప్రతిష్ట చేసిన ఒకే ఒక్క నాటకం కన్యాశుల్కం" అని గురజాడ అప్పారావును కొనియాడారు డా|| పోరంకి దక్షిణామూర్తి. కడుపుబ్బ నవ్వించే హాస్యం, హృదయానికి హత్తుకునే భాష గురజాడ సొంతం. పునర్వివాహం, కన్యాశుల్కం, వేశ్యావృత్తి నిర్మూలన మొదలగు ఉదాత్త లక్ష్యాలతో జనరంజకంగా సాగిన గొప్ప నాటకం నాటికీ నేటికీ - కన్యాశుల్కం.

'ఇప్పుడు గిరీశం డైలాగ్స్ లో మచ్చుకు ఒక్కటి చూద్దాం.' ఒపీనియన్స్ అప్పుడప్పుడు ఛేంజ్ చేసుకోకపోతే పొలిటీషియన్ కానేరడోయ్. మనం చేస్తే లౌక్యం. అవతలి వాళ్ళు చేస్తే 'మోసం', 'దబాయించడమే కదన్నా పోలీసు డ్యూటీ' - ఇలాంటి సంభాషణలు నిత్యసత్యాలుగా తెలుగువారి నాల్కలమీద నేటికీ నర్తించడం గురజాడ 'గురు' జాడకు తార్కాణం. ఆయన సృష్టించిన గిరీశం చిరంజీవి అయ్యాడు. అలానే మధురవాణి, బుజ్జమ్మ మొదలగు అద్భుత పాత్రలను చూస్తుంటే 'స్త్రీజాతి చరిత్రను తిరగరాస్తుంది' అన్న నానుడిని

---

అనౌచిత్యం హాస్యం యొక్క అంతరాత్మ. – సోమర్ సెట్ మామ్

అక్షరసత్యం చేశాడా అనిపిస్తుంది. గొప్ప నాటక రచయితగనేగాక ప్రఖ్యాత కథకునిగా, గేయ రచయితగా, 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషు లోయ్' అని వేదమంత్రంలా దేశభక్తిని ప్రబోధించిన అద్భుత ప్రతిభాశాలి ఆయన. 'అంధయుగం మీద ఉషస్సులా జ్వలించే శక్తిని అక్షరంలో నిక్షిప్తంచేసిన యుగపురుషుడు గురజాడ' అని పంచామృతం రంగాజమ్మగారు కొనియాడగా, భావితరాలకు 'గురు' జాడగ నిలచాడని కీర్తించారు. ఇంకొందరు.

హాస్యానికి ఆయువుపట్టు తెలిసిన 'హాస్య బ్రహ్మ' శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు ప్రహసనాలకు సాహిత్య గౌరవం కల్పించిన ఉద్దండుడు. రెండే రెండు పాత్రలతో నడిచే ఆయన రచన 'నాటికినేడు', తెలుగు నాటక సాహిత్యంలో ఓ గొప్ప ప్రయోగం అంటారు ఎన్.తారకరామారావు. ఆయన పాత్రలేగాక వాటి నామధేయాలు - పాటయ్య, ఆటయ్య, మాటయ్య, మూటయ్య - ఆఖరుకు నాటికల పేర్లు - పెళ్ళి ట్రైనింగు, మాయలమాలోకం, కచటతపలు, బాగు బాగు - కూడా నవ్వులు పూయిస్తాయి. "

ఇప్పుడు ఆయన నాటకాలలో ఒకదానిని - 'బాగు బాగు'ను - తీసుకుందాం. ఇందులో ప్రధాన పాత్రధారి చిక్కేశ్వరరావు. ఆయన పేరుకు తగ్గట్లుగానే ఆయన మాట్లాడే టెక్స్ట (తెలుగు) అంతా చిక్కులతో కూడి బిక్కుబిక్కుమన్నట్లుగా ఉంటుంది. అది ఆంగ్ల, తెలుగు భాషల మిశ్రమంగా, కలగాపులగంగా కన్పిస్తుంది. ఆయన సృష్టించిన వినూత్న పదజాలంలో కొన్ని : క్వొశ్చన్, ప్రశ్న కలిస్తే క్రొశ్న; ఘోరం, హారిబిల్ల సమ్మేళనం ఘోరిబిల్; కవిత్వం, పొయట్రీల మిశ్రమమే కవిట్రీ. పదబ్రహ్మ చిక్కేశ్వరరావు సృష్టించిన శాబ్దిక చమత్కారాలలో (కవితలు) మచ్చుకు ఒక్కటి.

దస్కై ఈజ్ మబ్బీ
దరోడ్ ఈజ్ దుమ్మీ
మై హెడ్ ఈజ్ దిమ్మీ
లైఫ్, లైఫ్, లైఫ్

ఇవన్నీ శాబ్దిక చమత్కారాలు,

'ఎప్పుడూ ఇంతే నాటకంలో భక్తుడు పర్వతాలు శివుణ్ణి భక్తి శ్రద్ధలతో తదేకంగా ధ్యానించగా, ఆయన భక్తికి మెచ్చిన శివుడు ప్రత్యక్షమై మూడు వరాలు ఇస్తానుకోరుకోమన్నాడు. అందుకు పర్వతాలు తనకు ఎలాంటి దురాశ లేదని, ఒక్క వరం చాలునని "...నా చింత నాకు లేదు. నాకు ఏది ఎల్లా పోయినా ఒకటే నా విషయంలో.

---

పెద్దగా నవ్వడం అంత అనాగరిక, అర్థరహిత చర్య మరొకటి లేదు. – ఫిలిప్ డార్మెర్

నాకెప్పుడూ పరచింతే. అదీ నా స్వార్థత్యాగం. ఆ అక్షయంగాడున్నాడే.... వాడు నిక్షేపంగా ఉన్నాడు. వాడు సుబ్బరంగా కుదిమట్టంలోకి తిరుక్షౌరం అయి పొట్టి సన్యాసి పీనుగు అయిపోయేలాగు నాకు వరం దయ చేయించాలి మహాప్రభో. నాకదిచాలు. నే బాగు పడక్కర్లేదు. దుర్యోధనుడుకీ పై అంతస్తున్నాది. వాడు చేతగానివాడు. ధర్మరాజుకి ఉందనీ, తనకి లేదని, తనకి కూడా కలగాలనీ ఏడిచాడు. నేను, నాకక్కర్లేదు ఇంకొకడికి పోతే చాలనీ!"....అంటాడు. ఇది నికార్సైన ఆంధ్రుని మనస్తత్వంపై పసందైన వ్యాఖ్యానం కదూ!

నాటకాలలో పద్యాలను 'రాగించడం' - అంటే రాగాలతో లాగి లాగి సాగదీస్తూ పాడటం - అనుచితం అని ఆయన వాదన. “రాగపు సవరం పెడితేగాని పునిస్త్రీలాగా కన్పించని పద్యం అసలు బోడిదేనన్నమాట! మరి దాన్ని బోడించడానికి ఎవ్వరూ శ్రమపడనక్కర్లేదు”.

ఇంక నాటకాలలో జరిగే గమ్మత్తులను భకారా 'ఒన్సుమోర్' అనే వ్యాసంలో మనోహరంగా వర్ణించారు. అది సావిత్రి నాటకం. సత్యవంతుడు పాత్రధారి పేరు 'రావు'. ఆయన ఒక కీర్తనను రమ్యంగా పాడి మూర్చిల్లాడు. “జనం ఒన్స్‌మోర్ అని గోలెత్తారు. అనగా, చచ్చినవాడు మాబాగా చచ్చిపోయాడు. లేచి మళ్ళీ చస్తేగాని మాకు తోచకుండా ఉంది!” అని......సత్యవంతుడు లేవలేదు. సభవారు ఇంకా గట్టిగా కూశారు, బుసకొట్టారు, గర్జించారు, ఓండ్ర పెట్టి దరువేశారు. మరేం చేయాలి? నిర్వాహకులు ముందు అంగీకరించకపోయినా, ప్రజాభిప్రాయం కదా! సరేనన్నారు. “రావు లేచి మళ్ళీ పాడి, మళ్ళీ మూర్చిల్లాడు ఖాయంగా”.

మొత్తం 42 నాటికలు వ్రాసిన కొప్పరపు సుబ్బారావు గారి సంచలన నాటిక అల్లీ ముఠాలో రేజర్ అవతరణను ఎలా అవహేళన చేశారో చూడండి.

ఏమి చెప్పం స్వామి తండ్రి

ఎలైన మాదే సీమకత్తులు అవతరించే

ఎవడికతడే మంగలాయె

ఎందుజూచిన క్షౌరమాయే

పులుగుండ్ల రామకృష్ణయ్య గారి 'తుఫాన్' తెలుగు నాటకరంగంలో నిజంగా గొప్ప అలజడిని సృష్టించింది. చిన్న ప్రేమకథను ఓ గొప్ప హాస్య ఉదంతంగా తీర్చిదిద్దబడిన ఈ నాటిక ఆంధ్ర నాటక కళాపరిషత్పు ఉత్తమ రచనగా ఎంపిక చేయబడింది (1948). ఓ

అర్థశతాబ్ది కాలం రాష్ట్రంలో ప్రతినిత్యం ఏదో ఒక ప్రాంతంలో ప్రదర్శింపబడడం దీని ప్రత్యేకత.

కొడాలి గోపాలరావు గారి చైర్మన్‌లో సేవ అన్న ఆకర్షణీయమైన పదాన్ని రాజకీయ నాయకులు తమ స్వార్థానికి ఎలా అందంగా ఉపయోగించుకుంటారో వివరంగా తెలియజెప్పడంతో ఈ నాటిక రాష్ట్రంలో గొప్ప హిట్ అయింది. 'దొంగవీరుడు' నాటకంలో నాగ బసవయ్య అప్పు ఇమ్మని గురవయ్యశెట్టిని అడిగితే లేదు అనకుండానే హాస్యస్ఫోరకంగా ఎలా లేదని చెప్పాడో చూడండి.

శెట్టి : అమ్మతోడు! నా దగ్గర ఎర్రని ఏగానీ లేదు. విషంపుచ్చుకు చద్దామన్నా కానీ లేక కాళ్ళీడ్చుకుంటూ వచ్చా ఇక్కడకు. తమకు లేదంటానా బాబూ! ఉన్నదంతా ఊరిమీద అప్పులిచ్చి చేతులు దులుపుకు కూర్చున్నా. అయినా, బాబుగారూ నాకు తెలియక అడుగుతా, తమకేంచూచి అప్పు పెడ్తారు.....

చెప్పదలచిన విషయాన్ని సూటిగా, నీటుగా చెప్పడంలో శ్రీ యండమూరి వీరేంద్ర నాథ్ ఆయనకు ఆయనే సాటి. హాస్య నాటకాలలో సెన్సేషన్ సృష్టించిన 'డామిట్ కథ అడ్డం తిరిగింది'లో కథ అంతా చీకట్లోనే కొనసాగి ప్రదర్శనా రంగంలో ఒక నూతన ఒరవడి ప్రవేశ పెట్టింది. ఆయన మరో రచన 'పుట్ట'లో కుమారుడు తండ్రితో "నాన్నా! నన్నేమైనా తిట్టు - కానీ గాడిద కొడకా అని మాత్రం తిట్టకు నాన్నా. అది నీకే అవమానం" అన్న మాటలు తెలుగులోగిళ్ళలో గొప్ప హాస్యోక్తి అయింది. .

ఖాళీ రంగస్థలం మీద అన్ని హంగులూ ఉన్నట్లు ఊహిస్తూ నటించడం (మరో మొహంజదారో), ఒకే నటుడు భిన్న పాత్రలు ధరించడం (తరంగాలు), నాటిక మొత్తం తానే అయి తన నటనా కౌశలంతో ప్రేక్షకులకు అన్నీ వివరించడం (అలెగ్జాండర్) మరికొన్ని గొప్ప ప్రయోగాలు. 'కన్యాశుల్కం' తర్వాత అంత గొప్పదిగా కొనియాడబడిన నాటకం 'పడమటిగాలి'. ఇందులొ 45 పాత్రలు, ఏ పాత్రకు ఆ పాత్ర ఒక ఊతపదం ఉపయోగిస్తూ - కోడి పెంట అంజయ్య, ఒంటెలోడు, శ్రీదేవి మొగుడులాంటి వింత పేర్లతో, విచిత్ర నామాలతో - నాలుగు గంటలు నడిచే ఈ గొప్ప నాటకం పాటిబండ్ల ఆనందరావుగారి సృష్టి

"కొడుకు పుట్టాల', 'పావలా', 'లాభం' అను మూడు నాటికలు వ్రాసినందుకు గణేశ పాత్రకు ఆంధ్రదేశం రుణపడి ఉంటుంది" అన్నారు ప్రముఖ పత్రికా సంపాదకులు పురాణం సుబ్రమణ్యశర్మ. ఆయన నాటకాలు ప్రేక్షకులను ఒకవైపు హాస్యడోలికలలో ముంచెత్తుతూనే,

---

చెడ్డ కాలానికి, హాస్యం అభివృద్ధికి మధ్య సంబంధం ఉంది. – డేవిడ్ బ్రిన్నర్

మరోవైపు ఆలోచనలో పడేయడం రచయిత ప్రత్యేకత. 'కొడుకు పుట్టాల'లో ఫకీరు పాత్ర మాటలు వినండి.

ఫకీరు : దిగిపోనాది - మరి దిగిపోయినప్పుడు నీకు చెప్పింది నిజమెలాగౌతది. ఇప్పుడు దిగనేదు. ఇదుగో ఈ కంపెనీ ఇస్కీమీద నాటుసారా జవిళాయించి కొట్టేసి నాను. ఇప్పుడు సెప్పేది కల్తిలేని నిజం, ఔను. అశోకా హోటల్లో మూడో నెంబరు గదిలో.... అసలు బావయా - ఈ భీముడిపట్నం వోలు మొత్తం ఎతుక్కో, ఎక్కడైనా అశోకా హోటేలున్నాదేటో....

అలానే జంధ్యాల రచనలు 'గుండెలు మార్చబడును', 'ఏక్ దిన్ కా సుల్తాన్', ఆర్ వి యస్. రామస్వామి గారి 'పైడిరాజు', అప్పలాచార్యులు గారి 'తులసితీర్థం' మరికొన్ని గొప్ప హాస్యనాటికలు. ఏకంగా రెండు గంటల సేపు తెరవేసే పనిలేకుండా ప్రేక్షకులను నవ్వులలో ముంచెత్తే నాటక రచయిత శంకరమంచి పార్థసారథి. గొప్ప నటుడు, ప్రఖ్యాత దర్శకుడు అయిన శ్రీ తల్లావఝుల సుందరం "ఈ తరం హాస్యరచయితల్లో అతనే అగ్రజుడు... హాస్యానికి ఐఎన్ఏ మార్కులాంటివాడు” అని కొనియాడాడు శంకరమంచి వారిని.

మాట పలుకు లేని దొంగ పాత్ర ద్వారా 'సైలెన్స్ ప్లీజ్' నాటికలో హాస్యాన్ని సృష్టించడం ఓ అద్భుతమైన ప్రక్రియ.

రమ : ఏమిటీ పద్దారా! లేవకండి - మిమ్మల్నే......

రాంబుబు : ఏం దిష్టితీస్తావా?

రమ: అదేం కాదు. ఎట్టాగూ మళ్లీ పడతారుగా అందుకని. అయినా పేపరు గురించి అంత తాపత్రయం దేనికట? హాయిగా పాటలు వింటూ మంచంపై పడుకోక.

రాంబాబు : ఆ పాటలు విని, విని నాకు పిచ్చెక్కిపోయ్యేట్టుంది. అయినా నా అలవాటు నీకు తెల్సుగా. ఉదయంపూట పేపరు చదివితేగాని కడుపులో కదలికరాదు. కడుపులో కదలిక వస్తేగాని మోషన్ కాదు. మోషన్ అవుతేగాని ఆకలికాదు. రెండ్రోజుల్నుంచి పేపరు చదవక లోపలేమిటో శబ్దాలు - సంగీతాలున్నూ.

దేవాడ శరభారావు గారి 'భలేనాటకం' నిజంగా భలే గొప్ప నాటకం. నాటకాల ప్రదర్శన మీద హాస్యోక్తులు విసిరే ఈ నాటిక ప్రేక్షకుల ఆదరాభిమానాలు అమితంగా పొందింది. తెరలోపల జరిగే విచిత్ర సంఘటనలను తెర పైకి ఎక్కిస్తే మరి నవ్వురాక మానుతుందా? కొన్ని డైలాగులు విందాం.

---

స్వగతానికి, సమస్యకు మధ్యగల దూరాన్ని గురించి ఆలోచించేది హాస్యం. – రోలోమే

అప్పారావు : సెట్ సత్తిరాజు అంటే ఆషామాషి అనుకున్నావా? నాటకాన్ని జెండా కొయ్యలాగ నిలబెట్టేది సగం సెట్టింగే. పేకాటలో జోకరు పడితే లైఫ్ ఎలాగో, నాటకానికి సెట్టింగ్ లైఫ్, అంటే గుండెకాయ అన్నమాట.

పైడియ్య : పైకొస్తానో.... పైకే పోతానో.... పెళ్ళి కావలసినోడ్ని.... నేనే దొరికానా ముసలి వేషం నాకంటగట్టారు. తలకుమాసిన వెధవెవడూ దొరకలేదు కాబోలు.

సత్తిరాజు : దొరికితే నీ వరకూ వస్తదేటి.

పైడియ్య : . అంతకంటే దరిద్రగొట్టు ఫేసా నాది. హీరోయిన్ ఫాదర్ వేషం, క్యారెక్టర్ యాక్టరు టైపు, రావుగోపాల్ రావు, ప్రభాకర్ రెడ్డి లెవెల్ లో వేసేదని చెప్పింది ఇందుకేనా? ఈ నాటకానికోదండం. ఈ విగ్గొద్దురా దేవుడా.

వీరభద్రయ్య : ఏంటి సత్తిరాజు వినేది? వళ్ళు చెరుకు రసంలా కుతకుతలాడి పోతుంటేను. మీవి ఫ్యాంటు వేషాలా? మా వాడిచేత ముసలి వేషం వేయించేసి తల ముగ్గుబుట్ట చేస్తారా? రేపొద్దున వీడికి పెళ్ళవ్వద్దూ...... ముసలి వేషాలేస్తే ఏ పిల్ల ముందుకొస్తుందయ్యా చేసుకోవడానికి?

ఆంధ్రనాటక కళాపరిషత్ కృషి ఫలితంగాను, కొప్పరపు సుబ్బారావు, కె.వి.గోపాల స్వామి, కె.వెంకటేశ్వరరావు, భమిడపాటి ప్రభృతుల దీక్షాదక్షతల మూలంగాను సాంఘిక నాటకాలు బాగా వ్యాప్తిలోకి వచ్చాయి. కళాపరిషత్ వారు ఉత్తమ హాస్య నటునికి ఒక బహుమతి ప్రకటనతో రచయితలు తమ రచనలలో హాస్య పాత్రలను ప్రవేశపెట్టడం మరొక శుభపరిణామం. అయితే ముందుగా సినిమా, ఆ తర్వాత నిరంతర సీరియల్స్ టి.వి., నాటకరంగాన్ని బాగా కృంగదీశాయి. ఒక ముఖ్య విషయం. ఈనాడు హాస్యపూ రిత సందేశాత్మక రచనలు గావిస్తున్న మంచి రచయితలు, ఉత్సాహంతో నాటక కళను వ్యాప్తి చేయడానికి ఉవ్విళ్ళూరుతున్న నటీనటులు ఆంధ్ర నాటక రంగానికి ఉన్నారన్నది ఎంత యదార్థమో, రాష్ట్రంలోని భిన్న పరిషత్ ప్రోత్సాహం వల్లనే తెలుగు నాటక రంగం సజీవంగా ఉన్నది అన్నది అంతే వాస్తవం.

---

తనలో అంతర్గతంగా దాగివున్న పిశాచాలను శుద్ధి చేయటానికి సమాజం ఉపయోగించే భేది నవ్వు. – క్లిఫ్ టన్ జోలి

అధ్యాయం 28

# విదేశీ ప్రముఖుల హాస్య గుళికలు

లింకన్ నుండి రూజ్వెల్ట్ దాకా, చర్చిల్ నుండి చార్లీ చాప్లిన్ దాకా, గాంధీజీ నుండి గాలిబ్ దాకా, ఆస్కార్ వైల్డ్ నుండి బెర్నార్డ్ షా దాకా.... ఎందరో మహానుభా వులు........ అందరూ నవ్వుకు నజరానాలు అందజేశారు. అది ఆనందానికి సేతువు, ఆహ్లాదానికి హేతువు అని కొనియాడారు. దాని సాయంతో మానసిక ఒత్తిడి నుండి విముక్తి పొందారు. బాధను మధురగాథగా, ఆవేదనను ఆనందంగా, కన్నీటిని ఆనంద భాష్పాలుగా మార్చుకున్నారు. ఆ విధంగా నవ్వుల నావలో పయనిస్తూ, సమస్యల సుడిగుండాలను చీల్చివేస్తూ, ఆనందాల దీవిలో విహరించారు. చరిత్రలో ఎందరో మహనీయులు ఎన్నో హాస్యోక్తులు విసిరారు. అందులో విదేశీయులకు సంబంధించిన కొన్నింటిని ఈ అధ్యాయంలో చూద్దాం...... .

మానవ జీవితాలను పరికిస్తే వ్యధలు, కన్నీటిగాథల వెనుకనే హాస్యం దాగివున్నట్లు అనిపిస్తుంది. శోకాల మరుగునే సుఖం ఉన్నట్లు కన్పిస్తుంది. ఆయన ఒక నిరు పేద కుటుంబంలో జన్మించాడు. మత్తు పానీయాలకు బాని సైన తండ్రి 5వ ఏటనే కన్నుమూశాడు. కొంతకాలానికి అతని తల్లి పిచ్చిదయింది. ఏరోజూ పట్టెడన్నానికి నోచుకోలేదు. చదువుసంధ్యల గురించి యోచించనే లేదు. ఏడేళ్ళ వయస్సులో లండన్ శివార్లలో దొరికిన పనులతో పొట్ట నింపుకునేవాడు. పేదరికపు పాఠశాలలో చదువుకున్నాడు. సమ్మెటపోటు లాంటి బాధల బాల్యం అతనికి గురువు అయింది. దానితో కళకు కన్నీళ్లు రంగరించాడు. ఆయనే చార్లీ చాప్లిన్,

న్యూయార్క్ లోని 'కీ టో' అనే కార్టూన్ చిత్రాల కంపెనీ ఎట్టకేలకు చాప్లిన్ను ఆర్టిస్ట్ గా గుర్తించడంతో 24వ ఏట (1913లో) ఆతని దశ తిరిగింది. తనకంటే పొడవైన లాగులు, చొక్కాలు, నిలకడలేని టోపీ, సాగిపోయే బూట్లు ధరించి హాస్యానికి ఒక వినూత్న రూపాన్ని, వింత సొగసును చేకూరుస్తూ, క్రమంగా అత్యున్నత స్థాయికి ఎదిగాడు. జనానికి తాను అందించాలనుకున్న హాస్యాన్ని తానే సృష్టించుకోవడం చాప్లిన్లోని విశేషం. విచిత్రమేమంటే తన చిత్రాలలో చార్లీ తన జీవితంలోని దుర్భర దృశ్యాలనే నవ్వుల నవరత్నాలుగా ఏర్చికూర్చాడు. 'గోల్డ్ రష్' సినిమాలో క్షుద్బాధతో ఉడకబెట్టిన బూటును ఆయన ఆహారంగా తీసుకుంటూ ప్రేక్షకులను నవ్వులనావలలో విహరింపజేసినప్పటికీ, అది తన నిజ జీవితంలోని ఒక బాధాకర సంఘటన అని తరచు జ్ఞప్తికి తెచ్చుకునేవాడు. అందుకే ఆయన చరిత్ర

వినేవారు రహస్యంగా ఏడుస్తారు. ఒక్క న్యూయార్క్ నగరంలో ఒకే రోజున 30 సినిమా హాళ్ళలో ఆయన చిత్రాలు విడుదలయ్యాయంటే ఆయన, ఎలాంటి స్థాయికి ఎదిగాడో ఇట్టే అర్థమవుతుంది.'

నటుడిగా, స్క్రిప్ట్ రచయితగా, దర్శకుడిగా సుమారు 3 దశాబ్దాల సినీ సామ్రాజ్యాన్ని ఏలాడు చార్లీ. ప్రపంచదేశాలన్నింటికి ప్రీతిపాత్రుడయ్యాడు. 1995లో జరిపిన ఒక సర్వేలో ప్రపంచ సినిమా చరిత్రలో గుర్తింపు పొందిన ఏకైక నటుడిగా ఎంపికవడం ఆయన విశ్వవ్యాపకత్వానికి ఒక ఉదాహరణ.

హాస్యానికే పర్యాయపదంగా నిలిచిన చాప్లిన్ జీవితంలో ఒక ఉదంతం. ఆయనలా కన్పించడానికి, ఆయనను అనుకరించడానికి, ఉత్సాహపడే వారి సంఖ్య అధికం అవడంతో అమెరికాలో ఒక పర్యాయం చార్లీ చాప్లిన్ లా కన్పించేవారి పోటీని (Charlie Chaplin Look Alike Contest) నిర్వహించారు. ఆ పోటీలో చార్లీ చాప్లిన్ కూడా పాల్గొనడం ఒక విశేషమైతే అక్కడ ఆయనకు రెండవ బహుమతి దక్కడం మరో విశేషం! 'నేనే అసలైన చాప్లిన్నయ్యా" అని ఆయన ఎంత మొత్తుకున్నా ఎవ్వరూ పట్టించుకోకపోవడం దానికి కొసమెరుపు!

లింకన్ స్టైలే వేరు : అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ బాల్య జీవితంలో ఎదుర్కోని ఇబ్బందులు లేవంటే అతిశయోక్తి కాబోదు. అతని ఉద్యోగం పోయింది. వ్యాపారంలో నష్టపోయాడు. శాసనసభకు జరిగిన పోటీలో పరాజితుడయ్యాడు. రెండు పర్యాయాలు అమెరికా సెనెట్‌కు ఎన్నిక కావలసిన అవకాశాన్ని కోల్పోయాడు. ఇవన్నీ చాలవన్నట్లు అతని ముగ్గురు కుమారులు మరణించారు. జీవిత సహధర్మచారిణి స్వర్గస్తురాలైంది. ఎటు చూసినా దురదృష్టమే! అయితే, అతనికి ఆ కారుచీకటిలో నవ్వు ఒక గొప్ప మిత్రుడుగా, ఔషధంగా, సహాయకుడుగా నిలిచింది.

అమెరికాలో ఫ్రెడరిక్ బర్గ్ యుద్ధ బీభత్సం ముగిసిన మరుదినం అది. కాంగ్రెస్ సభ్యుడు ఐజాక్ ఆర్నోల్డు ఆ యుద్ధాన్ని గురించి మాట్లాడదామని అధ్యక్షుని వద్దకు వెళ్లాడు. అదేసమయంలో తాను ఆసక్తిగా చదువుచున్న ఓ హాస్య రచనను లింకన్ నవ్వుతూ ఆర్నోల్డుకు చదివి వినిపించడంతో ఆయన సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు. "అధ్యక్ష మహాశయా! నిన్నటి యుద్ధంలో సంభవించిన భయానక నష్టాలకు దేశం యావత్తు భీతావహంతో వ్యధ చెందుతుంటే, హాస్యోక్తులతో మీరెలా ఆనందించగలుగు తున్నారు?" అని అయోమయంగా ప్రశ్నించాడు. అది విన్న అధ్యక్షుడు తక్షణమే పుస్తకాన్ని మూసి గద్గద స్వరంతో "ఆర్నోల్డ్

---

గారూ! నేను అనుక్షణం మోస్తున్న భయంకర బాధ్యతలనుండి కొన్ని క్షణాల సేపైనా నాకు ఇలాంటి విశ్రాంతి లభించకపోతే నా హృదయం ఎప్పుడో ముక్కలై ఉండేది, నేనెప్పుడో కాలగర్భంలో కలసిపోయేవాడిని" అంటూ బావురుమన్నాడు. .

గాడిద ఉద్యోగం : ప్రభుత్వంలో ఏదో ఒక ఉద్యోగం ఇమ్మంటూ వేధించేవారి బాధలను తట్టుకోలేక ఆయన చెప్పిన కథ ఇది. "ఒకానొక రాజుగారు అడవికి పోతూ "ఈ రోజు వర్షం వస్తుందా?" అని మంత్రిని అడుగగా "ఈ రోజు వర్షం రాదు ప్రభూ" అన్నాడు మంత్రి వినయంగా. రాజుగారు బయలుదేరి వెళ్తుండగా మధ్యలో ఒక గాడిదను ఎక్కి సంచరిస్తున్న ఓ రైతు ఎదురై "మహాప్రభూ! త్వరలో వర్షం పడబోతుంది. ఏలినవారు జాగ్రత్త వహించండి" అంటూ హెచ్చరించాడు. ఆ రైతు చెప్పినట్లుగా వెంటనే వర్షం పడటంతో రాజుకు మంత్రి పై ఆగ్రహం వేసింది. తక్షణమే అతనికి ఉద్వాసన చెప్పి ఆ స్థానంలో రైతును నియమించాడు. "అవును...... వర్షం రాబోతుందని అంత ఖచ్చితంగా ఎలా చెప్పావు?" అని రాజు ప్రశ్నించగా, రైతు "నిజానికి అది నా గాడిద గొప్పతనం ప్రభూ! వర్షం వచ్చేముందు అది తన చెవులు ముందుకు వంచు తుంది స్వామి. అంతే" అన్నాడు. వెంటనే రాజు ఆ రైతును తొలగించి గాడిదను మంత్రిగా నియమించాడు" అని ఒక్క క్షణం ఆగి... ఇక్కడే రాజు ఒక పొరపాటు చేశాడు" అన్నాడు లింకన్. "ఏమిటది?" అని మిత్రులు ప్రశ్నించగా "ఆ.....ఏమీ లేదు. ఆరోజు నుండి ప్రతి గాడిద ఉద్యోగం కావాలని గొడవ చేయసాగింది" అంటూ కథను కంచికి చేర్చాడు లింకన్.

లింకన్ హాస్యోక్తిని ఒక ఉత్సాహభరితమైన ఉదంతంలా, ఓ కథలా వివరిస్తాడు. "నాకొక సంఘటన గుర్తుకువస్తుంది" అంటూ శ్రోతల హృదయాలకు హత్తుకునేటట్లుగా ప్రారంభిస్తాడు. హాస్యోక్తి మధ్యలో ఎవరైనా పరుషంగా మాట్లాడితే, ఓపిట్టకథతో దానికి మంచిమలుపు ఇస్తాడు. "పసందైన కథలో మంచి హాస్యం కూడా ఉంటే మద్యం కోసం ఆవురావురుమంటున్న త్రాగుబోతుకు కావలసినంత విస్కీ ఇచ్చినట్లుంటుంది" అన్నాడు లింకన్. ఆయన హాస్యోక్తులు ప్రధానంగా నిరర్థక వాదనకు దీటైన సమాధానం చెప్పడానికి, ప్రత్యర్థిని చిత్తు చేయడానికి ఉద్దేశింపబడ్డాయి.

లింకన్ భార్య పెద్ద గయ్యాళి. ఒకనాడు "పొగరుబోతు భార్యకు అడ్డుతగలలేని నువ్వు అప్రయోజకుడివి కాదా?" అని ఒకాయన ఎదురుదాడి చేయడంతో లింకన్ నవ్వుతూ "ఇందులో ఏముందయ్యా! ఆమెకు నచ్చింది ఆమెను చెయ్యనివ్వు. ఆమె కొట్టే దెబ్బలు

నన్నంతగా బాధించకపోయినా, ఆమెకు అమితానందాన్ని కలిగిస్తుంది” అని సమాధానం ఇచ్చాడు!

ఒక సమావేశంలో స్టీఫెన్ డౌగ్లాస్ ఆయనను “రెండు ముఖాలుగల నటుడు” అని హేళన చేయగా, “నాకే గనక రెండు ముఖాలే ఉంటే, ఈ వికృత ముఖాన్ని ఎందుకు పెట్టుకుంటానయ్యా”అన్నాడు లింకన్ నవ్వుతూ.

“ఈ ప్రపంచంలోని సమస్యలన్నింటికీ కారణం ఒక్కటే - మూర్ఖులు బల్లగుద్ది చెబుతుంటే, విజ్ఞులు అనుమానంతో ఆలోచిస్తారు”.

ఈ విధంగా లింకన్ హాస్యాన్ని ఆనందదాయినిగా, సమస్యా పరిష్కర్తగా, పదిమందినీ నవ్వించి కవ్వించడానికి ఉపయోగపడే సాధనంగా అద్వితీయంగా ఉపయోగించుకున్నాడు.

కామెడీ జీనియస్ బాబ్ హోప్ : అమెరికా హాస్య చరిత్రలో కామెడీ జీనియస్ గా పేరొందిన వ్యక్తి బాబ్ హోప్. (1903-2003). హాస్యానికి 'గుడ్ హోప్' బాబ్ హోప్. ఆయన శత జన్మదినోత్సవ వేడుకలను అమెరికా గొప్పగా జరుపుకోవడం చరిత్రలో ఒక కళాకారుడు గడించిన అరుదైన కీర్తికి గొప్ప ఉదాహరణ. ప్రపంచ చరిత్రలో సహజ, సజీవ కామెడీకి అద్భుత ప్రతినిధులుగా అలరారే విల్ రోజర్స్, చార్లీ చాప్లిన్, ఫ్రెడ్ ఎలెన్ వంటి అజరామరమైన నవ్వుల వేల్పులతో పోల్చదగిన అరుదైన వ్యక్తి బాబ్ హోప్. ప్రపంచంలోని వివిధ విశ్వవిద్యాలయాల నుండి 54 గౌరవ పట్టాలు, రెండువేలకు పైగా పురస్కారాలు అందుకున్న ఏకైక కామెడీ మాస్టర్ ఆయన.

దాదాపు ఆరున్నర దశాబ్దాల కాలం అమెరికాను నవ్వుల్లో ముంచెత్తిన బాబ్ హోప్ జన్మించింది బ్రిటన్లో. ఆయన అసలు పేరు లెస్లీ టౌన్సె హోప్. ఒక తాపీ మేస్త్రీ ఆరుగురు సంతానంలో ఐదవవాడు ఆయన. చిన్నప్పటినుంచీ కమెడియన్ కావాలని బంగారు కలలు కన్నాడు. డబ్బు కోసం పేపర్లు అమ్మాడు, బూట్ల షాపులో, మాంసం మార్కెట్లో పనిచేశాడు. 1933లో వివాహం రేడియో ప్రోగ్రామ్స్ లో పాల్గొనడం, 1938లో ది బిగ్ బ్రాడ్ కాస్ట్ చిత్రంలో నటించడంతో ఆయనొక 'మహానవ్వుల ప్రవాహం'గా ఎదిగాడు. ఆ తరువాత ఆయన చిత్రాలు బాక్సాఫీస్ రికార్డులను బద్దలు కొట్టాయి. 1955లో టెలివిజన్ ప్రపంచంలోకి అడుగు పెట్టి ఒక గంట కార్యక్రమంలో పాల్గొన్నందుకు ఆ రోజులలోనే రూ. 45 లక్షల పారితోషికం పొందిన కళాకారుడు బాబ్ హోప్.

ఆ హాస్యజీవి పండించిన కొన్ని హాస్యోక్తులు :

---

నవ్వులు సర్వ దుఃఖదమనంబులు, వ్యాధులకున్ మహౌషధుల్. – జాషువా

"నూరేళ్ళ మూడు నెలలు జీవించాలని ఉందిరా"

"పైన ఆ మూడు నెలల కొసరు దేనికి?"

"సన్మానాలూ అవీ ఇవీ ఉంటాయి కదా! ఆ మోజులు, ముచ్చట్లు తీర్చుకొని పోవాలి కదా!" అన్నాడు బాబ్ హోప్.

"మనం ముసలివాళ్ళమైపోతున్నామని ఎప్పుడు అనిపిస్తుంది?" అన్న ప్రశ్నకు బాబ్ హోప్ సమాధానం : "బర్త్ డే కేక్ ఖర్చుకన్నా క్యాండిల్స్ ఖర్చు ఎక్కువై నప్పుడు". "మీ ఫ్రెండ్ ఎలెన్ సినిమాల్లో ఎందుకు నటించలేదు?" ప్రశ్న. "ఫ్రెడ్ ముఖం రేడియోకి మాత్రమే పనికొస్తుందని అన్నారట. అందుకని ఆయన సినిమా తెరపై కన్పించి అందరినీ బాధ పెట్టదలచలేదు" బాబ్ హోప్ సమాధానం. "మరణించిన వారు తిరిగి జన్మిస్తారా?" అని ఆయనను ప్రశ్నించగా, "మీ ఉద్దేశ్యం ఏమిటి? రిపబ్లికన్లలాగానా" (అమెరికాలోని ప్రధాన రాజకీయ పక్షాలలో ఒకటి) అన్నారట!

ఆ మహనీయుడు 2003 మే 29న నిండు నూరేళ్ళు పూర్తి చేసుకొని జులై 7న స్వర్గస్తుడయ్యాడు. ఆమన, మరణంతో హాస్యమే నివ్వెర పోయింది. ప్రముఖ ఆంగ్ల దినపత్రిక 'ది హిందూ' ఆయన మరణవార్తను మొదటి పేజీలో పంచరంగులలో ఫొటోతో ముద్రించిందంటే, ఒక హాస్యకారుని ప్రభావం ప్రపంచం నలుదిశలా ఎలా వ్యాప్తి చెందిందో అర్థమవుతుంది. "హాస్యం ద్వారా, నవ్వడం, నవ్వించడంవల్లనే నేను శాశ్వతంగా యౌవనాన్ని కాపాడుకోగలిగాను" అంటాడు ఆయన. సినిమాలలోనే కాక టి.వి., రేడియో, స్టేజి షో, నిజజీవితంలో - ఇలా ప్రతిచోట ఆయన నవ్వుల జల్లులు కురిపించాడు. పుట్టిన

ప్రముఖుల హాస్యోక్తులు :

ఆల్బర్ట్ ఐన్ స్టీన్ : ప్రపంచంలోని ప్రముఖ శాస్త్రవేత్తలలో ఒకరు ఐన్‌స్టీన్. ఆయన మేథావిగా ఎంత పేరు గడించాడో, మతిమరుపు వీరునిగా కూడా అంతే కీర్తి పొందాడు. అన్నట్లు ఆయన గొప్ప హాస్య చతురుడు కూడా.

స్త్రీ పురుషులు ప్రేమలో పడటానికి భూమ్యాకర్షణ శక్తి కారణం కాదనుకుంటా.

ప్రపంచంలో రెండే రెండు అనంతమైన విషయాలు కన్పిస్తాయి - విశ్వం, మనిషి మూర్ఖత్వం . ఈ రెండింటిలో మొదటిదానిని గురించి నేను అంతగా నిర్దిష్టంగా చెప్పలేను.

వెలిగించిన స్టైపైన మీ చేయి ఒక్క నిమిషం ఉంచితే, అదొక గంట అయినట్లు అనిపిస్తుంది. మరి అందమైన అతివ ప్రక్కన ఒక గంట కూర్చుంటే, అదొక నిమిషంలా గడిచిపోతుంది. సాపేక్ష సిద్ధాంతం అంటే ఇదే.

---

మన శత్రువులను ద్వేషించేవారిని మనం ప్రేమిస్తాము. మరి మనకు శత్రువులే లేకుంటే మనం ప్రేమించవలసినవారు బహు కొద్దిమందే ఉంటారేమో!

ఈ ప్రపంచంలో అత్యంత అగోచరమైన విషయమేమంటే అది గోచరమవ్వడమే.

బెర్ట్రాండ్ రసెల్ : బ్రిటన్‌కు చెందిన రసెల్ ప్రముఖ ప్రఖ్యాత తత్వవేత్తలలో ఒకరు. ఆయన రచనలలో బాగా ప్రసిద్ధమైన వాటిలో ఒకదానికి 'ప్రజాదరణ పొందని వ్యాసాలు' (Unpopular Essays) అని పిలవడంలోనే ఆయన హాస్య తత్వం తెలుస్తుంది.

పురుషులకన్నా స్త్రీలకు తక్కువ పళ్ళు ఉంటాయంటాడు అరిస్టాటిల్. రెండు పర్యాయా లు వివాహం చేసుకున్నప్పటికీ తన భార్యలకు ఎన్ని పళ్ళున్నాయో లెక్కిద్దామన్న ఆలోచనే ఆయనకు రాలేదు.

బెంజమిన్ ఫ్రాంక్లిన్ : ఆయన గొప్ప మేధావి. తన గుర్రాన్ని 9 భాషలలో పిలవగలడు. అయితే, ఆయన ఎంత అమాయకుడంటే స్వారీ చేయడానికి ఎంచక్కా ఒక ఆవును కొనుక్కున్నాడు.

మూడు రోజుల తర్వాత అతిథులు కూడా చేపలవలె కంపు కొడతారు.

నీకు డబ్బు విలువ తెలిసివుంటే ఎంతో కొంత అప్పు చెయ్యి.

పెళ్ళికి ముందు కళ్ళు బాగా తెరచి ఉంచు. వివాహమైన తరువాత సగం మూసి ఉంచడం నేర్చుకో.

ఈ ప్రపంచంలో ముగ్గురు విశ్వసనీయమైన మిత్రులున్నారు-ముసలి భార్య,ముసలి కుక్క, జేబులోని డబ్బు.

ఇప్పుడు ప్రముఖ తత్వవేత్త వాల్తేరును కలుద్దాం. ఒకనాడు ఆయన పై ఫ్రెడరిక్ రాజుగారికి బోల్డంత కోపం వచ్చింది. అంతే! ఆ మహామేధావిని గాడిదగా వర్ణించాడు. “రాజు ఫ్రెడరిక్ ది గ్రేట్ ప్రకటించాడు, వాల్తేరు గాడిద” అని. దానికి ఆ తత్వవేత్త నవ్వుతూ ఆ వాక్యంలోని కామాను ఇలా మార్చాడు. “రాజు ఫ్రెడరిక్ ది గ్రేట్", ప్రకటిం చాడు వాల్తేరు, “గాడిద” అని.

వికటకవి అరిస్టోఫేన్స్ (క్రీ.పూ. 4వ శతాబ్దం) ప్రేమకు ఒక వినూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. “ప్రాచీన కాలంలో స్త్రీ పురుషులు ఇరువురు ఒకే శరీరం కలిగి ఉండేవారు. అంటే అర్ధనారీశ్వరుల న్నమాట! వారికి అద్భుత శక్తి సామర్థ్యాలు ఉండేవి. ఒక పర్యాయం వారు స్వర్గం పై దాడిచేసి దేవతలను ఓడించాలని పథకం పన్నగా, దానిని ముందుగానే పసిగట్టిన స్వర్గాధిపతి జేయూస్ మానవ శరీరాన్ని రెండుగా విభజిస్తే, దానిలోని శక్తి

క్షీణిస్తుందని భావించి, అర్ధనారీశ్వర రూపాన్ని రెండుగా విభజించాడు. అంతే! నాటినుండి గతంలో ఒకటిగా ఉన్న ఆ రెండు శరీరాలు ఏకం కావడానికి నిరంతరం తపిస్తూ ఉన్నాయి. ఆ తపననే మనం ప్రేమ అంటున్నాము".

విచిత్రమేమంటే జొనథాన్ స్విఫ్ట్ అంతటి ప్రముఖ వ్యక్తి తన జీవిత కాలంలో రెండే పర్యాయాలు నవ్వానని చెబితే, పోప్, లార్డ్ చెస్టర్‌ఫీల్డ్‌లు వారికి ఊహ తెలిసిన తరువాత నవ్వనేలేదట! 60వ సంవత్సరం నన్ను మిటకరించి చూడటం తోనే వాక్య నిర్మాణంలో వికారం ప్రారంభమై పేరాలు బిగుసుకుపోయాయి" అంటాడు అమెరికా హాస్యకారుడు జేమ్స్ థర్బర్. "65వ సంవత్సరంలోకి ప్రవేశించాను. సంవత్సరా నికి 15 నెలలే ఉంటే ఎంచక్కా నా వయస్సు 48 సంవత్సరాలై ఉండేది కదా!" అని ఆయన చమత్కరించాడు.

అయన గంభీర వినోదాన్ని (Serious Comedy) అభివృద్ధిపరచాడు. విశ్వతత్వం, ఐహిక జీవనం మధ్య జరిగే ఆకస్మిక కుదుపు యొక్క ప్రత్యక్ష సాక్షి హాస్యకారుడు. హాస్యకారులు' అనడం వికార పదం. అది వారి సందిగ్ధతా స్వభావాన్ని విస్మరించడమే.." ఆయన వ్యంగ్యం సహజసిద్ధమైనది. మధ్యతరగతి మందబుద్ధి, వికారం ఆయన ఇతివృత్తం.

ప్రపంచ నాయకులలో ఎవరి చతురత వారిదే అనడానికి ఒక్క ఉదాహరణ చూద్దాం. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, సోవియట్ అధినేత స్టాలిన్, బ్రిటీష్ ప్రధాని చర్చిల్ కలసి చర్చలు జరుపుతుండగా వారికి ఋషి తుల్యుడైన సెయింట్ పీటర్ ప్రత్యక్షమయ్యాడు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిన ఆ నాయకులు లేచి ఆయనకు నమస్కరించారు. "మీ ముగ్గురూ రెండవ ప్రపంచ యుద్ధంలో మీ మీ దేశాలకు చక్కని సేవలందించారు. సంతోషం. మీకు ఏదైనా కోరిక ఉంటే చెప్పండి. తీరుస్తాను. అయితే, ఒక్కొక్కరు ఒక్క కోరిక మాత్రమే కోరాలి" అన్నాడు పీటర్ . "అమెరికా సర్వనాశనం కావాలన్నదే నా ఏకైక కోరిక స్వామి! దాన్ని తీర్చండి" ప్రార్థించాడు స్టాలిన్. ఆయన ప్రక్కనే నిలబడి ఉన్న ట్రూమన్ రష్యా పతనాన్ని కళ్ళారా చూడాలన్నదే నా చిరకాల వాంఛ" అన్నాడు. ఆ తరువాత పీటర్ "మరి నీ కోరిక ఏమిటి?" అని చర్చిల్‌ను అడుగగా "స్వామీ! వారిద్దరూ పెద్ద నాయకులు.ముందు వారిద్దరి కోరికలను తీరిస్తే నాకూ ఆనందంగా ఉంటుంది. ఆ తరువాత నా కోరిక గురించి ఆలోచిద్దురుగాని" అన్నాడు! చర్చిల్ రాజనీతిజ్ఞతకు మచ్చుతునకగా కొందరు రచయితలు ఈ హాస్యోక్తిని వ్యాప్తిలోకి తెచ్చారు.

పదునైన శైలి, వివరణను వాస్తవాలతో జోడించగల నేర్పు, సామాన్య పాఠకుని మనస్సులోకి తొంగిచూడగల శక్తిగల రచనలే పాఠకుని మనస్సుకు హత్తుకుంటాయి. హాస్యం

---

అనేది సహజంగా ఉండాలేకాని, కృతకంగా కన్పించకూడదు. "సంభాషణలలో హాస్యం సాధించాలంటే రచయితకు భాషలో ఉండే ఒడుపూ, విరుపూ, పలుకుబడి క్షుణ్ణంగా తెలిసివుండాలి". అందుకే హాస్య రచన చేయడం తమాషా కాదు. ఇంక తెలుగు హాస్య గుళికలు రుచి చూద్దామా?

---

గౌరవంకన్నా తృప్తినిచ్చేది, డబ్బుకన్నా విలువైనది, ప్రార్థనకన్నా పవిత్రమైనది నవ్వు. – హేరియట్ రోపిన్

అధ్యాయం 29

# తెలుగు సాహిత్యంలో హాస్యం

మనిషికి ప్రియాతి ప్రియమైనది నవ్వు. ప్రకృతి నవ్వుతుంది. పరిసరాలు నవ్వుతాయి. ప్రపంచ ప్రజలందరికీ అర్థమయ్యే ఏకైకభాష నవ్వు అందుకే అయింది. హాస్యానికి ప్రధానంగా రెండురకాల ప్రవృత్తులు ఉన్నాయి. వాటిని సోదాహరణంగా తెలుసు కుందాం.

1. వైనోదిక హాస్యం : వినోదాన్ని కల్పించడమే హాస్యం యొక్క ప్రథమ విధి కనుక దీనిని వైనోదిక హాస్యం అంటారు.

"అయ్యా! కుక్క కుడి నుండి ఎడమకు పోవడం మంచి శకునమా? ఎడమ నుండి కుడికి పోవడం మంచి శకునమా?" అని ఓ నిత్య శంకితుడు జ్యోతిష్యుణ్ణి ప్రశ్నించాడు. అందుకు ఆ జ్యోతిష్యుడు నవ్వుతూ "కుక్క మీదపడి కరవకుండా ఉండటం ఉత్తమ శకునం" అన్నాడు!

2. అనువర్తిత హాస్యం : ఇక్కడ హాస్యం ఒక భావాన్ని, ఒక విషయాన్ని తీసుకొని అదే తన అసలుసిసలైన వేషం అన్నట్లుగా నటిస్తుంది. అంటే ఇక్కడ హాస్యం తన ప్రధాన లక్షణాన్ని విస్మరించడంతో ఆ భావం లేదా ఆ అంశం యొక్క తీవ్రత పలుచబడవచ్చు.

భయంకర రాక్షసుడైన బకాసురుని కిరాతక చేష్టల మూలంగా ఎన్నో కుటుంబాలు వ్యధ చెందాయి. అలాంటి కుటుంబాలలో విప్రకుటుంబం ఒకటి. తీవ్ర మనోవేదనతో కృంగిపోతున్న ఆ బ్రాహ్మణ కుటుంబీకులను ఊరడిస్తూ కుంతీదేవి వారికి అండగా నిలబడతామని మాట ఇస్తుంది. ఆ సమయంలో కవి నన్నయ్య ఒక బ్రాహ్మణ బాలునితో "ఈ కర్రపుల్లతో దుష్ట బకాసురుణ్ణి నేనే చంపేస్తా" అనిపిస్తాడు. ఈ చతురోక్తితో గంభీరమైన సన్నివేశంలో హాస్యపు జల్లు పడటంతో వాతావరణంలో కొంత మార్పు వచ్చిందని చెప్పవచ్చు.

నవ్వుకు, తెలుగు సంస్కృతికి మధ్య మధురమైన సంబంధం ఉంది. పదమూడు దశాబ్దాల క్రితమే తొలి తెలుగు హాస్య పత్రిక 'హాస్య వర్ధని' శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి సంపాదకత్వంలో 1875లో ప్రచురింపబడడం వీశేషం! 'నవ్వులమూట' మాసపత్రిక (1921) విజయనగరంలో శ్రీ మొక్కరాల సుబ్బారావుగారి సంపాదకత్వంలో 1934 ఆగస్టు 1వ తేదీన బందరులో 'నవ్వులతోట' పక్ష పత్రికల ప్రచురణ జరిగింది. దాని సంపాదకుడు, శ్రీ కోసూరు గురునాధ మూర్తి ఎన్నో హాస్య ప్రక్రియలను ఆంధ్రులకు రుచి

---

పసంగానికి సుగంధ ద్రవ్యం లాంటిది హాస్యోక్తి. – జాకోబ్ ఎం.బ్రాడ్

చూపించారు. అందమైన తెలుగుభాషలో ఆనందానికి చిహ్నమైన నవ్వు పై పలురకాల పలుకుబడులు, సామెతలు, సూక్తులు, నుడికారాలు అందులో చోటుచేసుకున్నాయి. నవ్వులాట, నవ్వుకోలు, నలు గురూ నవ్విపోతారు, నవ్విన నాపచేనే పండుతుంది, నవ్వు నాలుగు విధాల చేటు, నవ్వలేనివాడిని నమ్మకు మొదలైనవి కొన్ని ఉదాహరణలు.

తెలుగు సాహిత్యంలో హాస్యరచనను ప్రప్రథమంగా చేపట్టింది కందుకూరి వీరేశలింగం పంతులుగారు. ఆయన హాస్యాన్ని ప్రధానంగా తన సంఘసంస్కరణోద్యమాన్ని వ్యాప్తి చేయడానికి ఉపయోగించాడు. ఆ తరువాత గురజాడ, చిలకమర్తి, కాళ్ళకూరి మొదలైన రచయితలు కూడా హాస్యాన్ని ఇలానే ఉపయోగించుకొన్నారు. అంటే వీరు ప్రధానంగా అనువర్తిత హాస్యాన్ని పోషించారన్నమాట!

ఆదికవి నన్నయ్య. నన్నయ్య రచనలలో హాస్యంపాలు బహు తక్కువ. చక్కని, చిక్కని హాస్యాన్ని అందిం చడంలో నన్నెచోడుడుది అందెవేసిన చేయి. 'కుమార సంభవం'లోని ఈ పద్యాన్ని చదువుతుంటే ఎంత ఆనందం కలుగు తుందో చూడండి:

చ|| చెలువలు మట్టి మ్రానిపయి జిల్కలు మూవి రమింపవానిము
క్కులుగని మట్టిపండులని కోయగబోయిన వారి హస్తముల్
దవిరులుసావి కీరములు దండడి గుట్టిన ముగ్గలందరున్
గలకొన బారిరోరి యిది గాటుల మ్రాననుచున్ భయంబునన్.

ఒక అందమైన అలంకారంతో - భ్రాంతి మదలంకారం - ఇక్కడ ఆయన హాస్యాన్ని ఎలా పండించాడో చూడండి : ఓ పెద్ద మర్రి చెట్టుపై అనేక చిలుకలు వాలాయి. ఆ చిలుకల ముక్కులను చెలికత్తెలు మర్రిపండ్లుగా భావించి కోయబోగా, ఆ చెలికత్తెల చేతులను చిలుకలు చిగురుటాకులుగా భ్రమించి కొరకడంతో చెలికత్తెలు భయభ్రాంతులకు లోనై అది కాటువేసే చెట్టని పారిపోయారనడంలో ఎంత కవితా విశేషముందో, అంత రమణీయ హాస్యం కూడా ఉంది.

అదే రచనలో తారకాసురుడితో జరిగిన యుద్ధంలో దేవతలు పారిపోతున్న సంఘటనను ఆయన ఇలా వర్ణించాడు.... యమధర్మరాజు వాహనం దున్నపోతు. ఆయన పారిపోతుంటే ఉప్పుబస్తాలా ఉన్నాడు. కుబేరుని వాహనం మనిషి, ఆయన వాహనం ఎక్కి పారిపోకుండా, వాహనాన్నే తన పైన ఎక్కించుకొని పారిపోయాడని కవి చమత్కరించాడు. దేవతలు ఎంతగా భయభ్రాంతులయ్యారో తెలిపే చక్కని ఉదంతం ఇది.

---

మంచి హాస్యోక్తి మనపైన చెరగని ముద్రవేసి చక్కని ఆనందాన్ని అందిస్తుంది. – ఫ్రాయిడ్

నవ్వుల పరిశోధకుడు తిక్కన: ఆదరానికేగాక, అనాదరానికి కూడా చిరునవ్వే పసందైన ఆయుధం అంటాడు మహాకవి తిక్కన.. నవ్వులపై విస్తృత పరిశోధన గావించి 32 రకాల నవ్వులను వివరించడమేగాక, వాటిని స్థూలంగా చిన్న, పెద్ద, గొప్ప నవ్వులని మూడు భాగాలు చేసిన ప్రతిభాశాలి ఆయన. -

విరాట పర్వంలో భీముడు సైరంధ్రివలె అభినయిస్తూ కీచకునితో ఆడిన చతురోక్తులు, హాస్యోక్తులలోని వ్యంగ్యాన్ని 'కవిబ్రహ్మ' తిక్కన ఎలా వర్ణించాడో చూడండి:

కం|| నా యొడలు సేర్చినప్పుడు
నీ యెడలెట్లగునొ దాని నీవెరిగెదు త
న్నే యబలల తోడిదిగా
జేయదలంచితివి తప్పు సేసితికంటే!

'నా శరీరంతో సంపర్కం పొందినపుడు నీ ఒడలు ఎట్లగునో నీవు తెలుసుకుంటావు. ఇక్కడ ఏ స్త్రీ పొందును పొందినప్పుడు కలుగని ఆనందం నీవు పొందుతావు' అని కీచకుడు అర్థం చేసుకుంటే, 'నా శరీరంతో కలసినప్పుడు నీ ప్రాణం పోతుంది' అని భీముని భావన. 'నన్ను ఏ అబలలతో సమానం చేయదలచావు అనడంతో సామాన్య స్త్రీలతో సమానంగా చూసి తప్పు చేశావు. నేను అపురూప సుఖాన్ని ఇచ్చే స్త్రీని' అనేది వాచ్యార్థం. 'నన్ను అంచనా వేయడంలో తప్పు చేశావు' అనడంలో ద్రౌపదిని కోరి ప్రాణం మీదకు తెచ్చుకున్నావు అన్నది ధ్వని. ఈ ఘట్టంలో భీముని వేషం, హావభావాలు హాస్యాన్ని కలిగిస్తుంటే, సన్నివేశంలోని వ్యంగ్య వైభవం ఆ సందర్భానికి గాంభీర్యం చేకూరుస్తుంది.

శ్రీనాధుని హాస్య డోలికలు : అలానే 'కవిసార్వభౌముడు' శ్రీనాధుడు తన చాటు పద్యాలలో చక్కని హాస్యాన్ని అందించాడు. అరవపిల్ల అందాన్ని వర్ణిస్తూ ఆయన ఉపయోగించిన పదాలు, పద్యాన్ని నడిపిన తీరు చూడండి.

మేత కరిపిల్ల పోరున మేకపిల్ల
పారబోతు తనంబున పందిపిల్ల
ఎల్ల పనులను జరుపంగ పిల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యీ యరవపిల్ల

ఆయన పద్యాల్లోని వ్యంగ్యం, చమత్కృతి, అధిక్షేపం, హాస్యం అటు మాన్యులను, ఇటు సామాన్యులను అలరించాయి. 'శృంగార నైషధం'లో నలుడి పాత్రను శృంగార హాస్యరసాల్లో ముంచెత్తాడు. ఈ పద్యం చూడండి ::

---

సచ్ఛీలమైన నవ్వు జనించిన ఆనందంలో ఆరోగ్యంఉంది, మంచితనం ఉంది. – అనామిక

ఓమె యేమే యిదేమె, మెల్మే యెమే
మేఘ పుష్పంబు దేవంచు మేలమాడ
మేమె ఏమేమెలు తఱుచయ్యే మేలు మేలు
మేక మేకని సభవారు మిగులనగిరి
అంటూ పెళ్ళి పెద్దల నీతిబాహ్య వైఖరిని తూర్పారబట్టాడు.

నవ్వుల రాముడు తెనాలి రాముడు : శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో హాస్య కాళిదాసుగా పేరొందినవాడు రామకృష్ణ కవి. కవిగా హాస్యాన్ని ఒక సాధనంగా మలచుకొన్న ఘనత రామకృష్ణునికే దక్కింది. 'వికటకవి' అన్న ఆయన బిరుదులోనే ఒక ప్రత్యేకత - ఆ పదాన్ని ఎటునుండి చదివినా ఒకే రీతిలో ఉండటం - కన్పిస్తుంది. ఆయన పదాలతో నాట్యం చేయించాడు, భాషతో ఆడుకున్నాడు. ఎన్నో హాస్యోక్తులకు, కథలకు మూలకేంద్రంగా భాసించాడు. ఆయన హాస్యం అంతా పద్య కవిత్వం ద్వారానే జరగడం ఒక విశేషం.

ఒక పద్యంలో అల్లసాని పెద్దన 'అమవసనిసి' అంటూ లఘు అక్షరాలతో కూడిన పదప్రయోగం చేశాడు. అది విన్న రామకృష్ణుడు చిర్రుబుర్రులాడి, అసహనంతో ఊగిపోయినా తన కోపాన్ని, ఆక్షేపణను ఎంత అందంగా, రసవత్తరంగా హాస్యం ఉట్టిపడేటట్లు వినిపించాడో చూడండి:

క. ఎమి దిని సెపితివి కపితము
కమమెఱుగక వెట్టి పుచ్చకయదిని సితో
ఉమెత: కయ దిని సెపితో
అమవసనిసి యన్నమాట అలసని పెదనా!

ఈ పద్యాన్ని విన్న పెద్దన అంతటి మహాకవి కూడా రామకృష్ణుని చిలిపితనానికి నవ్వుకున్నాడట! పదాలతో ఆడుకోవడమంటే ఇదేనేమో! పై పద్యంలో రామకృష్ణుడు దీర్ఘాన్ని హ్రస్వం చేసి అమావాస్య నిసి (రేయి)ని అమవసనిసి అనగా, ఆ ప్రయోగాన్ని అనుకరిస్తూ అధిక్షేపించాడు. ఉమ్మెత్తకాయను ఉమెతఃకయ అని, కవిత్వమును కపితము అని, క్రమమెఱుగకను కమమెఱుగక అని, అల్లసాని పెద్దనను అలసని పెదనా అని ఆక్షేపించాడు. అలానే, మరొక చమత్కార పద్యం.

క. బసవనకు బుట్టినప్పుడే,
పసరము గోవిందరాజు పసరం బయ్యెన్
గస వేటికి దిన డనగా

గసవుం దిను శత్రు లాజి గదిసినవేళన్

బసవన్నకు పుట్టినప్పుడే గోవిందరాజు పశువైపోయాడు. అయితే, గడ్డి ఎప్పుడూ తినడు కాని శత్రువులు సమీపించినప్పుడు మాత్రం తింటాడు అంటూ అతని అవినీతిని ఎండగట్టాడు.

ఒకానొక కవి శిఖామణి రాజదర్శనానికి వచ్చి తాను అన్నయ వేమరాజు పై ఒక పద్యం వ్రాశానని, దానికి అర్థం చెప్పగల సామర్థ్యం ఉన్న కవి ఇంతవరకు కన్పించలేదని, మీ అష్టదిగ్గజాలలో ఎవరైనా దానికి అర్థం చెప్పగలరా అని సవాలు విసిరాడు. ఆ పద్యం.....

సీ. రాజనందన రాజ రాజాత్మజులు సాటి,
తలపనన్నయ వేమ ధరణిపతికి ,
(ఇలానే మిగిలిన మూడు చరణాలు)
గీ. భావభవభోగ సత్కళా భావములను
(ఇలానే మిగిలిన మూడు పాదాలు)

దానిని విన్న రాజు, ఇతర కవులు ఆలోచించుచుండగా రామలింగడు లేచి "రాజా! గతంలో నేనొక పద్యాన్ని వ్రాసియున్నాను. దానికి ఈ కవి శిఖామణి అర్థం చెప్పేలోపు ఆయన చెప్పిన పద్యానికి నేను అర్థం చెప్పగలను" అని తన పద్యాన్ని వినిపించాడు:

సీ, మేకతోకకు మేక తోక మేకకు తోక
మేక తోకా మేక తోకమేక
(ఇలానే మిగిలిన మూడు చరణాలు)
గీ. మేకతొకతోక మెక మేక తోకమేక
(ఇలానే మిగిలిన మూడు పాదాలు)

కవి శిఖామణి చెప్పిన పద్యంలోని చివరి పాదము "భావభవభోగ సత్కళా భావములను" చదివి దీని అర్థం ఇంతే కదా! అని విరుస్తూ నేను చెప్పిన పద్యంలో కూడా 'మేక తోక' ఇంతే కదా! అంటారా కవిగారూ?" అనడంతో కవి శిఖామణి అవమానంతో కృంగిపోయాడు. దాని అర్థం ఆలోచించి మరుసటిరోజున మనవి చేస్తానన్న ఆ కవి ఇంక కన్పించలేదు. రామలింగడు ఉదాత్తమైన పద్యం పోకడను అనుకరిస్తూ ఆక్షేపించాడు. ఇక్కడ వాద బలంకన్నా వాది బలం అధికంగా కన్పిస్తుంది. ఇదొక పేరడి. ఎదుటివాని కవిత్వంలో అవలీలగా దోషాలెన్నడమేగాక, తన పదాల గారడీతో ప్రత్యర్థిని ఉక్కిరిబిక్కిరి చెయ్యడం, అధిక్షేపణలతో అతనిని చిత్తు చెయ్యడం రామలింగని అస్త్రాలు.

స్వేచ్ఛ ఫలసాయం హాస్యోక్తులు అయితే, హాస్యోక్తుల ఫలసాయం స్వేచ్ఛ.- జీన్ పాల్

ఎంతటి గంభీర సన్నివేశాన్నైనా జనరంజకంగా, హాస్యభరితంగా తీర్చిదిద్దగల దిట్ట అయిన రామకృష్ణుడు వరూధిని (మనుచరిత్ర), సత్యభామ (పారిజాతాపహరణం), గిరిక (వసుచరిత్ర)లు భిన్న సందర్భాలలో ఎంత అందంగా ఏడ్చారో ఒకవైపు వివరిస్తూనే ఆ నాయికల సృష్టికర్తలైన అల్లసాని పెద్దన (మనుచరిత్ర), ముక్కు తిమ్మన (పారిజాతాపహరణం), భట్టుమూర్తి (వసుచరిత్ర)ల పై మరొకవైపు ఎలా చురకలు వేశాడో చూడండి.

అల్లసాని వాడల్లనల్లన యేడ్చె
ముక్కుతిమ్మన ముద్దుముద్దుగా నేడ్చె
భట్టుమూర్తి బావురుమని ఏడ్చె

అంటూ ఏడుపులను నవ్వులాటగా మార్చిన దిట్ట ఆయన. ఈ విధంగా కవితాపటిమకు హాస్యంకూడా జోడయితే ఎన్ని అద్భుతాలు సృష్టించవచ్చో రామకృష్ణుడు ఆచరణాత్మకంగా నిరూపించాడు. అయితే అంత గొప్పకవి హాస్యాన్ని గురించి ఒకటి రెండు పద్యాలు అయినా వ్రాయకపోవడంతో హాస్య ప్రపంచం అపారంగా నష్టపోయింద నిపిస్తుంది.

భిన్న సాహితీ రూపాలు: తెలుగునాట హాస్యం భిన్న సాహితీ రూపాలలో వెల్లివిరి సింది. జానపద సాహిత్యంలో, యక్షగాన నాటక ప్రదర్శనల్లో, పగటి వేషాల్లో, శతక వాఙ్మయంలో, నాటకాలలోని హాస్యం సామాన్యుడి నుండి అసామాన్యుడిదాకా నవ్విం చింది, కవ్వించింది, మైమరపించింది. ఇప్పుడు కొన్ని రూపాలను తీసుకుందాం.

జానపద సాహిత్యం : సుమారు 2000ఏళ్ళ చరిత్రగలది, జాతిసంపదగా కీర్తింపబడింది జానపదసాహిత్యం . వేదుకూరి గంగాధరంగారి మాటల్లో పల్లె సారస్వతం వేదసారస్వతం వంటిది. ఈ సాహిత్యంలో హాస్యం కోకొల్లలుగా కన్పిస్తుంది. గ్రామీణుల పాటల్లో అసంగత హాస్యం ఎలా ఉంటుందో గమనించండి.

ఏమి సేతు ఏమి సేతర్రో, నేనేమి సేతూ
అట్లనన్నా సావు రాదర్రో, నేనేమి సేతూ
కుమ్మరొల్లాయింటి కోదునా, నేనేమి సేతూ
మొర్రి చిప్ప దెచ్చుకుందునా, నేనేమి సేతూ
దాన్నిండా నీళ్లు పోతునా, నేనేమి సేతూ
బాయనీ దాంట్ల దుంకుదునా?

---

ప్రతి జంటకు పరిణయం చేసే మారువేషంలో ఉన్న పురోహితుని వంటిది హాస్యం. – జీన్‌పాల్

చావడానికి తీర్మానించుకున్న ఒక మహిళ మూకుడులో నీళ్ళు పోసి, అదే బావి అనుకొని దూకాలనుకోవడం గొప్ప చమత్కారం కదూ!

గడసరి కోడలు మర్యాద
అత్తో నీవొచ్చి నేళ
ఆకలేస్తుందని అలిగిపోయావా
మవో నీ వొచ్చి నేళ
మరియాదలేదని మరిసిన్నవోకు
అన్నమెడదామంటే అరిటాకులేదు
పప్పొండుదామంటే పంటలేపోయె
పిట్టొండుదామంటే పిడకలేలేవు
పులుసు సేద్దామంటే పుడకలేలేవు
మవో నీవొచ్చి నేళ
అత్త నీవొచ్చి నేళా

ఇంక యక్షగాన నాటక ప్రదర్శనల్లో సింగి, చోడిగాడు, తోలుబొమ్మలాట ప్రదర్శనల్లో బంగారప్ప, అల్లాటప్పగాడు, కేతిగాడు, జుట్టు పోలిగాడు మొదలగుపాత్రలు ఆట మధ్యలో హాస్య ప్రసంగాలు చేస్తూ శ్రోతలను ఆనందడోలికలలో ముంచెత్తుతారు.

పగటి వేషాల్లో హాస్యం సభ్యతా సరిహద్దులను దాటి పచ్చి శృంగారంలో విహరిస్తుంది. జనసామాన్యానికి ఆనందం కలుగజేయడం దీని లక్ష్యం కనుక, ఇక్కడ హాస్యం కొంత మొరటుగా కన్పిస్తుంది. బోడి బ్రాహ్మణ స్త్రీల వేషం ఇందుకు ఒక ఉదాహరణ.

ఇంక శతక వాఙ్మయంలో ప్రధానంగా అధిక్షేప హాస్యం కన్పిస్తుంది. సుమతీ శతకకర్త బద్దెభూపాలుడు తన పద్యాలను పసందైన లోకోక్తులు, హాస్యోక్తులతో నింపి పాఠకులకు ఆనందంతోబాటు, విజ్ఞానం అందజేశాడు.
కొన్ని ఉదాహరణలు చూద్దాం.

1. గడనుడుగు మగని జూచిన నడపీనుగు వచ్చెననుచునగుదురు

2. దాసి కొడుకైనగానీ, కాసులు గలవాడే రాజు

3. వలపింత సతికి బుట్టక, బలిమిని దమకించి విటుడు పై కొనరాదు

4.వలపు దీబెనని, వనజాక్షియధరంబు ముష్టిరసము, జింతపండు రసము, జీడి రసము బోలు

---

కామెడీ మన శత్రువు. అది మనల్ని గందరగోళం చేస్తుంది, కలుషితం చేస్తుంది. – బార్నెస్

ఆకటికి దొలగు నాచార విధులెల్ల
చీకటికి దొలగు చిత్తశుద్ధి
వేకటికి దోలంగు వెనకటి బిగువెల్ల

శతక వాఙ్మయకర్తలలో శృంగారాన్ని పచ్చిగా, కొన్ని సందర్భాలలో ఘాటుగా, మోటుగా అందించిన కవి, అధిక్షేప హాస్యంతో గిట్టనివాళ్ళను వాగ్బాణాలతో దాడి చేసిన కవి కవి చౌడప్ప.

ఇయ్యగ నిప్పించగల మయ్యలకే గాక
మీసమందరికేలా రొయ్యకు లేదా బారెడు
గుడి సెయు, మంచము, కుంపటి విడియమును పొగాకు
రతికి వెంపరలాడే పడతియు గలిగిన చలి యెక్కడిదప్పా

ప్రజాకవి వేమన: అత్యద్భుత భావాలను అతి సులువైన పదాలతో సగటు మనిషికి కూడా అర్థమయ్యే రీతిలో మలచడంలో అద్భుత శిల్పి వేమన. అర్థంతో పాటు హాస్యాన్ని కూడా మేళవించడం ఆయన ప్రత్యేకతలలో మరొకటి. ఆయన సగటు మనిషి పక్షపాతి. 'ఆటవెలది'లో పదును పెట్టిన పదాలతో గిలిగింతలు పెట్టే హాస్యాన్ని వ్యంగ్యం, చతురోక్తులతో రంగరించిన ఘనుడు ఆయన. తిరుగుబాటు ధోరణిని చతురోక్తులతో కలపగలిగిన గొప్ప భావకుడు వేమన.

కుక్క తోకపట్టి గోదావరిని ఈదగలమా?
మంత్ర జలముకన్న మంగలి జలమెచ్చు
తలలు బోడులైన తలపులు బోడులా?
మేక కుతుకబట్టి మెడచన్ను గుడవంగ ఆకలేల మాను ఆశగాక

ఇలాంటి సత్యాలు జనసామాన్యం పై చెరగని ముద్రవేశాయి.

కందుకూరి :తెలుగులో ఆధునిక హాస్యరచనలు కందుకూరి వీరేశలింగం పంతులుగారితో ప్రారంభమయ్యా యని అందరకూ తెలిసిందే. సమాజంలోని లోపాలను ఎత్తిచూపడానికి ఆయన హాస్యాన్ని ఒక ఆయుధంగా తీసుకున్నారు. నిరసన, విమర్శ ఆధిక్యతను చాటుతుందని, హాస్యం ఆత్మీయతకు చిహ్నమన్న విశ్వాసంతో ఆయన బుజ్జగిస్తూ, లాలిస్తూ, నవ్విస్తూ ప్రబోధం చేశారు.

పీఠాధిపతుల ఆగడాలను నిరసిస్తూ ఆయన అనేక వ్యంగ్యాస్త్రాలను ప్రయోగించారు. పాదపూజల అనంతరం సుష్టుగా విందారగించి విశ్రాంతి తీసుకుంటున్న ఒక పీఠాధిపతిని

---

తనకేదో మోక్షమార్గాన్ని చూపుతాడన్న ఆశతో ఆ ఇంటి ఇల్లాలు "స్వామీ! భగవద్గీత తీసుకురమ్మంటారా?" అని అడిగిందట. "అమ్మా! చాలా భుక్తాయాసంగా ఉంది. కాస్త విశ్రమించి రెండు ఘడియలైన తరువాత తెస్తే పుచ్చుకుంటా" అన్నాడట! భగవద్గీత ఒక పవిత్ర గ్రంథం అని కూడా తెలియని ఆ అర్చకుడు.

నాటి సమాజంలో 'మేధావులు' గా రాణించేవారిలో 'మేతావులు' అధికం అన్నది ఆయన ప్రగాఢ విశ్వాసం. 'వివేకవర్ధిని', 'సత్యసంవర్ధిని', 'సతీహితబోధిని' మొదలైన పత్రికలను నెలకొల్పి, వాటి సాయంతో అవినీతిని, సామాజిక దురాచారాలను ఎండగట్టారు పంతులుగారు. మరో విషయం. ఆనాటి సామాజిక లోపాలను తూర్పారబట్టడానికి లలితమైన హాస్యం నిష్ప్రయోజనమని గ్రహించిన వీరేశలింగం పంతులుగారు సమాజ లోపాలను సవరించడానికి కొన్ని సందర్భాలలో వెగటుగా కన్పించినప్పటికీ కటువైన హాస్యాన్ని ఎంచుకున్నారు.

వీరేశలింగం రచనలలో రాజశేఖర చరిత్ర ఒకటి. చెరువువద్ద బట్టలు ఉతుక్కుంటూ మహిళలు తమ కష్టసుఖాలను ముచ్చటించుకోవడం పల్లెల్లో మామూలే. అత్తపోరు పడలేని ఒక కోడలమ్మ "ఈ లోకంలో అత్తలంతా ఒక్కసారి చచ్చిపోతే సంసారాలకు ఎటువంటి బాధలు ఉండవు" అని ఆక్రోశించిందంటూ అత్త పోరును నిరసించారు.

అలానే కపట వైద్యుల అసమర్థతను, అప్రయోజకత్వాన్ని ఎలా తూర్పారబట్టారో వినండి. "మా గురువులు భానుమూర్తిగారు వేదాంత శాస్త్రమందు నిరుపమానమయిన . ప్రజ్ఞ గలవారు. నాకు మొన్న రోగము వచ్చినప్పుడు పుణ్యలోకము వచ్చుటకు తగిన సదుపాయము చేసి పదిరూపాయలను పట్టుకొని పోయినాడు. ఆ మరునాడే దొంగ వస్తువొకటి ఆయన ఆధీనంలో కనపడటంవల్ల ఆయనను పోలీసులు తీసుకొనిపోయారు" అనడంలో ఎంత ఎద్దేవా ఉందో చూడండి.

కందుకూరి కలంనుండి వెలువడిన 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు' పూర్తిగా హాస్యరచన. అది సంస్కరణ నవల. అందులో ప్రతి హాస్యోక్తి అక్కడ నెలకొన్న పురుషాధిక్యత పైన ఓ పిడిబాకులా కన్పిస్తుంది. సమాజాన్ని హేళన చేస్తూ మహిళాధిక్య సమాజం ఎలా ఉంటుందో రసవత్తరంగా వర్ణించింది. అక్కడ వ్యాప్తిలో ఉన్న పత్నీ వ్రత ధర్మబోధిని' అనే ధర్మశాస్త్ర గ్రంథములో నిరంతరం పత్నీ సేవ చేసేవాడు స్వర్గానికి చేరతాడని, నిద్ర లేవడంతోనే భర్త భార్య కాళ్ళు కడిగి స్త్రీ పాద తీర్థంబు' తాగాలని, భార్యను చూడటంతోనే భర్త లేచి ఒంటికాలు పై నిలబడాలని, పురుషుణ్ణి, గాడిదను నెలకొక్క పర్యాయమైనా చితక గొట్టకపోతే

చెడిపోతారని - ఇలాంటి ఆచారాలనెన్నింటినో వివరిస్తూ వ్యంగ్యంతో కూడిన హాస్యాన్ని అందించారు వీరేశలింగం.

స్త్రీల పై పురుషుల అత్యాచారాన్ని ఎండగట్టడానికి, మరో విశేషం ఏమంటే, తెలుగు సాహితీ రంగంలో ప్రప్రథమ ప్రహసనం వీరేశలింగం పంతులుగారి కలం నుండే జాలువారింది. ప్రహసనం అంటే వ్యంగ్య హాస్యంతో నవ్వించడం అని అర్థం. అలాంటి ప్రహసనాలను ఆయన నూరుదాకా రచించారు. ఆయన వికట కావ్యం పేరు 'అభాగ్యోపాఖ్యానం'. ఆయన కొన్ని పేరడీ రచనలు కూడా చేశారు. ఈ విధంగా హాస్యాన్ని ఒక ఆయుధంగా చేపట్టి సమాజంలోని కుళ్ళును హాస్యరసంతో క్షాళన చేయడానికి కృషిచేసిన సంస్కర్త, ఆదర్శమూర్తి, హాస్యమూర్తి కలసిన త్రిమూర్తి వీరేశలింగం.

హాస్య వాఙ్మయ నిర్మాత : ఆ తరువాత హాస్యరంగంలో పేర్కొనదగిన వ్యక్తి చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు. నాటకాలు, నవలలు, ప్రహసనాలు, కథలు, నవ్వులగని, వినోదములు మొదలైన ఎన్నో రచనలు గావించిన హాస్య వాఙ్మయ నిర్మాత ఆయన. ఒక బిచ్చగాడు లాటరీ టిక్కెట్టును కొంటుంటే, ప్రక్కనే ఉన్న సాంబయ్య ఆశ్చర్య పోతూ "అరే అబ్బీ ! ఈ లాటరీలో ఫస్ట్ ప్రైజ్ రెండు లక్షల రూపాయలు నీకే వస్తే ఏంచేస్తావు?" అని అడిగాడు. అందుకు ఆ యాచకుడు "ఎంచక్కా కారు కొనుక్కొని హాయిగా అడుక్కుంటా" అన్నాడట! మనిషి జీవితంలో అనుకోకుండా ఎన్ని సౌఖ్యాలు లభించినా పాతవాసనలను మానుకోలేడు కదా!

చిలకమర్తి వారి రచనలలో 'గణపతి' గొప్ప హాస్యనవలగా పేరు గాంచింది. విద్యాలయా లు శిక్షణాలయాలుగాగాక, శిక్షాలయాలుగా రూపాంతరం చెందడం ఉపాధ్యాయుడు అయిన గణపతిని ఎంతగానో బాధించింది. "పంతులు పాఠాలు చెప్పనక్కరలేదు, భయం చెప్పాలి. పంతులుగారిని చూడటంతోనే విద్యార్థులు గజగజ వణికి మూర్ఛ పోవాలి" అన్నది గణపతి సిద్ధాంతం. అయినదానికి, కానిదానికి ఉపాధ్యాయుడు పిల్లల్ని ఎంత క్రూరంగా హింసించేవాడో కళ్ళకు కట్టినట్లు చూపారు చిలకమర్తి. గురువుద్వారా కఠినమైన శిక్షననుభవించే విద్యార్థులు జీవితంలో ఇంక ఎలాంటి నేరాలు చెయ్యరని చిలకమర్తి ఎంత వ్యంగ్యంగా వర్ణించారో చూడండి: "వెయ్యేల, దొంగతనము మొదలయిన క్రూరకృత్యములు జేయు మహాద్రోహులను కూడ జెరసాలకు పంపక ఈ బడికి పంపిన వారెన్నడును నేరములు చేయరు" అన్నారు చిలకమర్తి.

---

ఏదైనా ఒకటి విరుగుతుందని భావించినప్పుడు అది కేవలం వంగిపోతే నిజమైన హాస్యం జనిస్తుంది. – డబ్ల్యు.సి.ఫీల్డ్స్

'రాజరత్నం' నవలలో దామోదరయ్యను 'అబద్దాల సముద్రం'గా పరిచయం చేశారు. ఆయన ప్రహసనాలలో సాంఘిక స్థితిలోని వికృతిని చూపారు. శబ్దాశ్రయ హాస్యం ద్వారా అసంబద్ధ సంభాషణను ఎలా సాగించారో చూడండి (వీటిని ఆంగ్లంలో అర్థరా హిత్య జోక్స్ (Nonsense Jokes) అంటారు).

భార్య : కడియాల వారింటికి భోజనానికి వస్తారా?

భర్త : కడియాలు చేయించాలా నీకు? కడియాలు కాదు అందెలు చేయిస్తాను!

భార్య : అందాలా, ముసలిదానికి అందాలెందుకు, నేను సంసారిని.

భర్త : కంసాలిని పిలవమంటావా!

ఇది చెవిటిమేళం చేష్ట కాదు; అసంబద్ధతకు ఒక ఉదాహరణ మాత్రమే.

చిలకమర్తివారికి శ్రాద్ధకర్మలలో నమ్మకం లేదు. వాటిని పరిహసిస్తూ కొన్ని ప్రహసనా లు వ్రాశారు. హాస్యోత్పత్తి ప్రధాన లక్ష్యంగా గలది పేరడీ. “చంద్రగ్రహణాలు పున్నమి రాత్రిలో, సూర్యగ్రహణాలు అమావాస్య పగటిలో పట్టును.....గర్భిణీ స్త్రీలలో కొందరికి ఆడశిశువులు, మరికొందరికి మగశిశువులు కలుగును.....జోడులేని వాళ్ళ కాళ్ళు కాలును. గొడుగులేనివారి నెత్తి మాడును” అని పంచాంగ ఫలితాలు చెబుతూ, వాటిని హాస్యం పట్టించారు. అలానే యక్ష ప్రశ్నలు అనేది మరొక పేరడీ.

మగవాడికి మగడెవడు?

చెప్పినట్టు వినని భార్య.

చిలకమర్తివారి రచనలన్నీ హాస్యంతో నిండి ఉన్నప్పటికీ, ఆయన ప్రముఖ హాస్య రచనలు 'వినోదములు', 'నవ్వులగని'. కొన్ని ఉదాహరణలు చూద్దాం. బెల్లము తనను అందరూ తింటున్నారు, ఈ కష్టము కలుగకుండ చేయుమని బ్రహ్మని కోరిందట. అందుకు బ్రహ్మ ఆ బెల్లముతో "ఓసీ, చాటుననుండి మాట్లాడుము. ఎదుటనుంటివా నాకును నిన్ను తినబుద్ది పుట్ట గలదు” అన్నాడట!

ఆయన దివాలాదేవి వ్రతాన్ని ప్రత్యేకంగా రూపకల్పన చేశారు. ఇది "అప్పారావులకు” అతి ప్రీతిపాత్రమైన వ్రతం. అప్పారావు అంటే “అప్పు” ఇస్తే “రావు” అన్నమాట. ఈ వ్రతం చేసేవారు డాబు, దర్పమును అధికంగా నేర్చుకోవాలి. పెద్ద వడ్డీతో పెద్ద అప్పులు చేయడం, నమ్మకం కలిగించడానికి మొదట్లో టంఛనుగా నెలనెలా వడ్డీ ఇవ్వడం, తరువాత ఎగ్గొట్టడం నేర్చుకోవాలి. ఇళ్ళు, పొలాలు కొని భార్యాబిడ్డల పేరున వ్రాయాలి.

---

రెండు పరస్పర విరుద్ధమైన సందర్భాలలోని అంశాలను జతచేయడమే హాస్యం. – కోస్లర్.

వ్యాపారం తగ్గేకొద్దీ డాబు మరింత పెరుగుతూ ఉండాలి. సిగ్గును, బిడియాన్ని వదిలెయ్యాలి. దొంగ ఏడ్పులు నేర్వాలి. దివాలాదేవి వ్రతం సారాంశం ఇది. ఈ విధంగా చిలకమర్తివారి చేతిలో హాస్యం ఒక వినోదంగా, ఛలోక్తులతోనే సాంఘిక దురాచారాలను ఎత్తిచూపే సాధనంగా ఎదిగింది. "చిలకమర్తి హాస్యం గిలిగింతలు పెట్టి నవ్విస్తే, కందుకూరి హాస్యం గిల్లి బాధిస్తుంది" అంటారు జయంతి రామయ్య పంతులు.

'సాక్షి' ఫేమ్ : "తెలుగు సారస్వతంలో మొదటి నుండి హాస్యం ఆనుషంగికంగా సాగుతూ వచ్చిందే కాని, ఆధికారిక రసం కాలేకపోయింది. అంటే హాస్యం శృంగార రసం చెంగు పట్టుకు తిరిగిందేకాని, అది స్వతంత్ర విహారానికి నోచుకోలేదు. అలాంటి దానికి స్వతంత్ర ప్రతిపత్తిని కలిగించిన ఖ్యాతి పానుగంటి లక్ష్మీనరసింహారావు గారికి దక్కింది. అంతేకాదు. హాస్యరచనకు అద్భుత సాహితీ గౌరవం తెచ్చిన అసాధారణ రచయిత ఆయన. 'సాక్షి'లో ఆయన హాస్యరసవాహిని ఒక మహోద్యమంలా సాగింది. శాస్త్రిగారి భాషలో "'సాక్షి' ఉపయోగించిన కలం కులిశంవంటిది. సరసమూ, మధురమూ అయిన హాస్యం అనుపానంగా చేసి ఆరోగ్యప్రదమైన హితౌషధాన్ని తెలుగు పాఠకులచే సేవింపజేసిన జంఘాలశాస్త్రి పానుగంటివారి అమోఘ సృష్టి". ఆయన వచనశైలి విభిన్నమైనది, విశిష్టమైనది. కవ్వింపులతో పాఠకునికి గిలిగింతలు పెడుతూ, మధ్యలో గిల్లుతూ, ఊరడిస్తూ హాస్యరసంను రంగరించి అందించడంలో అందెవేసిన చెయ్యి ఆయన. అతి సామాన్య విషయం నుండి అసామాన్య హాస్యాన్ని సృష్టించగల దక్షుడా యన. "భాషను ఒక ఉపకరణంగా స్వీకరించి వ్యంగ్య అధిక్షేప హాస్యాన్ని కొల్లలుగా పండించి అజరామరుడయ్యాడు".

'సాక్షి' వ్యాసాలలో తెలుగు భాష వింత సోయగాలు ప్రదర్శిస్తుంది. శబ్దాశ్రయ హాస్యాన్ని తనదైన విలక్షణ శైలిలో కుంభవృష్టిలాగా కురిపించడంతో ఆయన పదాలలోని ఇంపు సొంపులు సామాన్యులను సైతం సమ్మోహితులను గావిస్తాయి. వెగటుతనంకు వ్యతిరేకిగా, పచ్చి శృంగారానికి బద్ధ శత్రువుగా, అద్భుత పరిశీలనా పాటవానికి, అనంత విజ్ఞాన వాహినికి సాక్షిగా ఆయన రచన నిలుస్తుంది. హాస్యానికేగాక, తెలుగుభాషకు కూడా ఒక వినూత్న శోభను చేకూర్చిన 'హాస్యరచనా విదగ్ధుడు', హాస్య పండితుడు ఆయన. "తత్వాభి వ్యంజకమైన అర్థాగత హాస్యంలో పానుగంటికి సాటిలేదు" అన్నారు మధునాపంతులవారు. ఆయన రచనలలో కంఠాభరణం, రాధాకృష్ణ, పాదుక, కోకిల మొదలైన నాటికలు 30 దాకా ఉన్నాయి.

---

సంభాషణలో భిన్న దృక్పథాలను కలపడం మూలంగా హాస్యం జనిస్తుంది. – మన్రో

స్త్రీలకు, అందానికి అవినాభావ సంబంధం ఉన్నమాట నిజమే. మరి వారు అధిక సంఖ్యలో ఒకచోట చేరితే, ఆ సభ ఎంత రమ్యంగా, రమణీయంగా ఉంటుందో, ఎంత ముగ్ధమనోహరంగా కన్పిస్తుందో పాఠకుల కళ్ళకు కన్పించేలానేగాక, చెవులకు విన్పించేలా కూడా పదాలను మలచారు ఆయన.

"ఎక్కడ వినిన గాజుల గలగల, అందెల ఝణఝణ, కాంచీఘంటికల గణగణ, ఎక్కడ జూచిన జెక్కుటద్దముల తళతళ, గబ్బిగుబ్బల ఫెళ పెళ, తారహారముల మిలమిల, వేణీ భారముల జలజల, ముద్దుమొగముల కలకల ఎక్కడకు బోయిన నగరుధూపము ల గమగమ, చందనచర్చల మృగమదలేపముల ఘుమఘుమ.... కొర్నాటి చీరలవారు, బనారసు కోకలవారు, బరంపురపు పీతాంబరములవారు, సన్నకుసుంబా చీరలవారు, గోచికట్లవారు, గూడకట్లవారు, చుట్టు త్రిప్పులవారు, మేలిముసుగులవారు, వ్రేలుముళ్ళ వారు, జడచుట్లవారు, వంకకొప్పులవారు......." - ఇలా సాగుతుంది వారి రచన.

దోమల సమావేశానికి ఎలుకను సభాధ్యక్షునిగా ఎంపిక చేసుకున్నారట. ఆ ఎలుక దోమల గొప్పతనాన్ని, తన అశక్తతను, అల్పత్వాన్ని ఎంత చక్కగా వివరిస్తుందో చూడండి: "మీవలె వ్యోమయాన శక్తిలేని నేను - మత్కుణ సోదరులారా! మీవలె మృదుల శరీరాంతరంగ సౌష్ఠవములేని నేను - మశక సోదరులారా! మీవలె గంఠస్వరమాధురీ పరిపాకములేని నేను - మత్కుణ సోదరులారా! మీవలె శత్రుహింసా పారాయణతలేని నేను - మీ కధ్యక్షుడనై నిలువవలసి వచ్చినది. ఎందువలన? మీమీ యాజ్ఞవలన ....... అధ్యక్షులవారు సామాన్య మానవ వక్తలలాగా స్వోత్కర్షలో పడకుండా సభాసదులను కీర్తించడం ఎంత ప్రత్యేకం! దీనినే విలోమ పేరడి అంటారు.

మానవుల అసమర్ధతను, నిష్ప్రయోజకత్వాన్ని దోమలు, ఎలుకలు ఎంతగా తూలనాడాయో చూడండి: చచ్చు దద్దమ్మలలో మనిషి అగ్రగణ్యుడని, పిరికి పెద్దమ్మల లో ఉద్దండుడని ఎన్నో విసుర్లు విసిరాయి దోమలు. 'తెలంటే భయం, జెర్రిని గాంచితే ఏడుపు, పామును చూస్తే పరుగు, చల్లటిగాలి వీస్తే ఒక రోగం, వేడిగాలి వీస్తే మరొక రోగం.' అలాంటి "వీడేనా వీరుడు వీడేనా సృష్టికి ప్రభుడు" అంటూ మనిషిలోని దుర్బలత్వాన్ని కటువుగా విమర్శించాయి. మానవుని అసమర్ధతను వివరించడంతో బాటు, తమ గొప్పతనాన్ని కూడా చాటాలికదా!

దోమ సందేశం : ఉపన్యాస చక్రవర్తి అయిన ఒక దోమ సర్వప్రగతికి తామే కారణమంటూ ఎలాంటి సందేశం ఇచ్చిందో విందామా! "కవిత్వము, గానము నరుడు

---

సౌందర్య నిర్ణయం చేయగల ఒకానొకప్రత్యేక భావావేశమే హాస్యం. – డి.హెచ్.మన్రో.

దోమలనుండే నేర్చుకున్నాట్ట. భూమిని తవ్వడం - లోహాలు తీయడం అనే జియాలజీని ఎలుకలనుండి అపహరించాట్ట. పిండిమరలకు, ఇతర యంత్రాలకు ఎలుకపండ్లే ఆదర్శమట. పందికొక్కు ఒంటిమీద ఉన్న బొచ్చు చూసి ఉన్నిబట్టలను, కోటులను తయారు చేసుకొన్నాట్ట. దోమకాటువల్ల మలేరియా, బోదకాలు వస్తున్నాయని అపప్రచారం చేస్తున్నారు. ఇది వట్టి అభూతకల్పన. సింహం మొదలు చీమదాకా దోమకాటు తినని జంతువు లేదే! మరి వాటికెందుకు రావడం లేదు వ్యాధులు?" అంటూ ప్రశ్నలను సంధించింది!

సుకుమార-వెక్కిరింపులు: “అజ్ఞానములో, పరిశుద్ధమైన అజ్ఞానములో, స్వయంభవమైన అజ్ఞానములో అధికుడని, అత్యధికుడని అనుకొనుట తప్పు. చెంపమీద తగిలినది చెప్పుదెబ్బ యైనప్పుడు అంబాజీపేట మీసాల జోడా? ఆకుచెప్పు జోడా? అని పాదరక్ష పరీక్షా పాండిత్యముతో. బనియేమి?” అని 'సాక్షి' రెండవ భాగం సముద్రతీర పర్యటనములో ప్రశ్నించారు. తన్నులు తిన్నా పెద్దవారి చేతిలోనే తినాలన్న కొందరి డంబాన్ని ఎంత రమణీయంగా హేళన చేశారో చూడండి. ఆయన హాస్యోక్తులు, వెక్కిరింపులు ఎంత సుకుమారంగా ఉంటాయో మూడు ఉదాహరణలు చూద్దాం:

ఇంగ్లీషు నేర్చి తెలుగు మాట్లాడలేని ప్రబుద్ధులను గురించి వ్రాస్తూ “మ్యావు మనని పిల్లి యెచ్చటనైనా నున్నదా? ఈతరాని కప్ప ఏ దేశమందైనా నుండునా? పుట్టగానే క్యారుమనలేని బిడ్డ చచ్చినదనుటకేమైనా సందేహమా?” అని ఓ సీరియల్ లా ఉదాహరణలు ఇచ్చి చివరకు తెలుగు రాని తెలుగువాడు తెలుగుదేశం లోనే ఉన్నాడని తేల్చారు. “ఆనాడూ, ఈనాడూ హాస్యానికి విలుకద్దు. సాహిత్య సభాంగణాన వ్యంగ్యానిది మొదటి పద్దు”!

తెలుగు పదాలకు గజ్జెలు కట్టి నాట్యం చేయించగలగడంలోనేగాక, రమణీయంగా చతురోక్తులు విసరడంలో కూడా ఆయనకు ఆయనే సాటి. అందుకే ఆయన 70వ జన్మదినోత్సవ వేడుకలను నిర్వాహకులు ఘనంగా జరిపారు. అందుకు ఆయన హాస్యోక్తులతో కృతజ్ఞతలు తెలిపారు. “ఒక మతియుండి అది సరిగా వినకుండిన బాధపడుచుండు నాకు బహుమతు'లనిచ్చి ఏల బాధింతురు?” అనడంలో ఎంత కృతజ్ఞత ఉన్నదో, అంత చమత్కారం కన్పిస్తుంది. తన జీవిత కాలంలో అనంత హాస్యాన్ని పండించిన ఆయన తన అంతిమ దశలో దుర్భర దారిద్ర్యానికి, నిరాదరణకు లోనవడం ఒక పేరడీలా కన్పిస్తుంది. .

గురజాడ 'హాస్య వేదం' : గురజాడవారి 'కన్యాశుల్కం' గొప్ప హాస్యరచన. దాని వయస్సు నూరేళ్ళు దాటినా దానిని 'హాస్యవేదం'గా అభివర్ణించారు విజ్ఞులు. నవ్వుకు బాటగా, సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగా దానిని కీర్తించారు. అందులో హీరో గిరీశం. గిరీశం

---

ఉల్లాసం మూలంగా నవ్వు జనిస్తుందేకాని, అసహ్యం మూలంగా కాదు. – వాల్తేర్

అంటే గుక్కపట్టి నవ్వించే నాయకుడన్నమాట. ఆయనొక గొప్ప రాజనీతిజ్ఞుడు. పూటకూళ్ళమ్మను దోచుకున్నంత దోచుకుంటాడు. ఆ తరువాత అందమైన విడో బుచ్చమ్మ ఆయన కంటబడుతుంది. ఇద్దరూ వితంతువులే! మరి వారిద్దరిలో ఎవర్ని పరిణయమాడాలి? "బుచ్చెమ్మలాంటి బ్యూటీఫుల్ యంగ్ విడోను చేసుకుంటే విడో మ్యారేజ్ అవుతుంది కాని, పూటకూళ్ళమ్మను చేసుకుంటే - అది దండాముండా మ్యారేజి అవుతుంది" అంటాడు. ఉద్యమాన్ని స్వీయప్రయోజనాలకు చక్కగా వాడుకోవడం చాలామంది నాయకులకు నేర్పించాడు గిరీశం. ఎలాంటి విషయాన్ని అయినా నవ్వులాటగా మార్చగల దిట్ట. ఎంతటివారికైనా అందంగా బురఖాలు వేయడంలో దంట.

గిరీశం శిష్యులలో వెంకటేశం ఒక్కడే అమాయకుడు. మిగిలినవారంతా మాయకులే! వారు "గురువును ముంచిన శిష్యులు' అంటారు. గిరీశం ఓ కొటేషన్ చక్రవర్తి. ఆయన మాటలు "స్వర్ణపీఠికలు". "ఎక్కడ పాఠం చెప్పాలో, ఎక్కడ గుణపాఠం చెప్పాలో తెలిసినవాడు" ఆయన. "ఒపీనియన్సు అప్పుడప్పుడు ఛేంజి చేస్తుంటేనేకాని పొలిటీషియన్ కానేరడు" అని రాజకీయ పురుష సూక్తం వినిపించిన మేధావి గిరీశం.

విధవా వివాహాన్ని ప్రోత్సహించిన సంఘ సంస్కర్త గురజాడ. "మనిషిని ముస్తాబు చేసి ఎదుట నిలబెడితే, ఇది 'పునిస్త్రీ', ఇది 'విడో' అని ఎవరు చెప్పగలరు? విడో అనే వస్తువు ఎక్కడుందయ్యా! వెక్కిరించే వెధవల నోళ్ళలో ఉంది" అంటూ గిరీశం ద్వారా సంఘానికి ఒక సలహా ఇప్పించారు. గిరీశం ఉపన్యాసాలన్నీ చాలా చిత్రంగా, విచిత్రంగా ఉంటాయి. ఆయన చెవిలోనే కాదు, తలలో కూడా పువ్వులు పెట్టగల ఘనుడు. ఆయనకు తెలియని శాస్త్రం లేదు. ఆయన ప్రసంగాలు చేయని అంశం లేదు. చుట్ట పైన ఆయన ఎంతో పరిశోధన చేసి, 'పొగతాగనివాడు దున్నపోతై పుట్టున్' అనే ఒక విశిష్ట వినూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

మానవాళి మొత్తాన్ని భ్రష్టుపరచేది మహిళలే! (It is women that seduce all mankind) అంటూ ప్రకటనలు గుప్పిస్తాడు.

"పుల్లు మూను లైటటా
జాసమిన్సు వైటటా
మూనుకన్న
మొల్లకన్న నీదుమోము బ్రైటటా
టా! టా! టా!" అంటూ కవిత్వం చెబుతాడు.

---

హాస్యచతురత కలిగి ఉండటం అంటే మానవ బాధలను, పేదరికాన్ని గురించిన చక్కని అవగాహన ఉండటమే.- మార్టిన్ గ్రోజా

గిరీశం ఏ పని చేసినా బేరీజు వేసి జమాఖర్చు చూసుకొనిగాని నిర్ణయించడు. ఆయన ఎంత నటుడో, అంత గొప్ప విటుడు కూడా. మొత్తం మీద కన్యాశుల్కంలోని ప్రతిపాత్ర నవ్వుల జల్లులు కురిపిస్తుంది, హాస్యరసం పండిస్తుంది. ఈ నాటకంలో నాయిక మధురవాణి. పేరుకు తగ్గట్టుగా ఆమె వాక్కులలో మధుర హాస్యం కన్పిస్తుంది. “మీనాక్షి ప్రవర్తన మంచిదికాదు” అని రామప్పపంతులు అనడంతోనే “మీరు కంటపడ్డ తర్వాత ఏ ఆడదాని ప్రవర్తన తిన్నగా ఉంటుంది?” అంటుంది ఆమె. ఒకపిల్ల చెయ్యి చూసి రామప్పపంతులు “ఆహా ఏం ధనరేఖ! సంతాన యోగ్యత కూడా బాగా ఉంది” అనడంతోనే “మీరు చేపట్టిన తరువాత అందుకు లోపం ఉంటుందా?” అంటూ అతణ్ణి ఏడిపిస్తుంది ఆ వగలాడి.

“చెడ్డవారివల్ల చెప్పుదెబ్బలు తినవచ్చును కాని, మంచివారి మాట కాయడం కష్టం” అని కరటక శాస్త్రి అంటే, “నేను ముసలి వాణ్ణా....వీడి సిగతరగ యాభై ఏళ్ళకే ముసలిటండి!” అంటాడు లుబ్ధావధానులు. అందుకే “కన్యాశుల్కం చదివితే మనకు కలిగే ఆనందమే రసం. ఆ రసం హాస్య స్ఫురణవల్ల కలుగుతోంది అనక తప్పదు” అన్నారు విద్వాన్ వి.జె.సోమయాజి. నాటకం చూసిన ప్రేక్షకులు ఆయా పాత్రలకు పేర్లు పెట్టడం సహజం అయితే, కన్యాశుల్కంలోని పాత్రలు ఒకరికొకరు భుజకీర్తులు తగిలించుకోవడం ఈ నాటకంలోని మరొక అందమైన అంతర్నాటకం అవుతుంది. గిరీశంను కరటకశాస్త్రి “మూర్ఖపు గాడ్దె కొడుకు” అని సత్కరిస్తే, గిరీశం కరటకశాస్త్రికి “రాస్కెల్, స్కౌండ్రల్” అని బిరుదు ప్రదానం చేయడం ఇందుకు ఒక ఉదాహరణ. ఈ విధంగా గురజాడవారి కన్యాశుల్కంలో హాస్యాన్ని అడుగడుగునా ఆస్వాదించవచ్చు. క్షణక్షణం ఆయన పసందైన శైలిని ఆనందించవచ్చు. అందుకే అది “తెలుగులో హాస్య వేదం” అయింది.

మొక్కపాటి : తెలుగు సాహిత్యంలోని హాస్య చక్రవర్తులలో మొక్క పాటి నరసింహ శాస్త్రిగారు ఒకరు. ఆయన రచించిన 'బారిస్టర్ పార్వతీశం' నవల నాటికీ, నేటికీ ఒక గొప్ప హాస్య రచనగా నిలుస్తుంది. పార్వతీశం ఒక పెద్ద అమాయక చక్రవర్తి, ఆ అమాయకత్వాన్ని మొక్కపాటివారు వర్ణించిన తీరు అనితరసాధ్యం. హాస్యరస సిద్ధులు, అసాధారణ ప్రజాధురంధరులు అయిన ఆయనకే అది సాధ్యం.

లిఫ్ట్ కథ : పార్వతీశం లండన్లోని ఒక పెద్ద హోటల్ లో గది కావాలన్నాడు. బంట్రోతు అతని సామాన్లు తీసుకువెళ్ళి ఒక చిన్న గదిలో పెట్టాడు. “ఇంతచిన్న గది ఇచ్చారేమిటి?” అని గొణుక్కున్నాడు. తనను లోకువకట్టి, ఇతరులకు పనికిరాని గదిని తనకు

ఇచ్చాడేమోనని బాధపడ్డాడు. ఆ గదిలోకి రానని మంకుపట్టు పట్టాడు. “నాకా గది అక్కరలేదు. నా సామాను ఇవతల పడవేయమని మళ్ళీ చెప్పాను గుమస్తా తో. ఇంక వాదించి లాభము లేదనుకున్నాడు కాబోలు, నన్ను చేయి పట్టుకొని బలవంతంగా గదిలోకి తీసుకువెళ్ళి తలుపు వేశాడు. వేసివేయడంతోనే గదికి గదీ హఠాత్తుగా అంతరిక్ష మార్గములోకి ఎగిరిపోయింది. నేను హడలిపోయి, కెవ్వుమన్నాను. ఇంతట్లోకే గది ఆగింది. బంట్రోతు తలుపు తీసి బయటికి నడవమన్నాడు. ఇదేమీ నాకర్థం కాలేదు. ఇంకా ఏమి వింతలు జరుగుతాయో అనుకొని ఆశ్చర్యపోతూ ఇవతలికి వచ్చాను. బంట్రోతు సామాను తీసుకొని తనతోటి రమ్మని తిన్నగా ఒక గదిలోకి తీసుకువెళ్ళి ప్రవేశపెట్టాడు. అప్పటికి ప్రాణము కుదుటపడ్డది. ఇందాకటిది, శ్రమ లేకుండా మేడ ఎక్కడానికి ఉపాయము గదా! అని తెలుసుకున్నాను. నన్ను చూసి, వాళ్ళంతా ఎంత నవ్వుకున్నారో గదా! అని సిగ్గుపడ్డాను”. ఇదండి....లిఫ్ట్ ను చూసి బారిస్టర్ గారు రూమ్ అని భ్రాంతిచెందిన తీరు!

మరొక సుందర దృశ్యం. పార్వతీశం ఎడింబరోలో చదువుకునే రోజులు. ప్రథమ ప్రపంచ సంగ్రామం జరుగుచున్న కాలమది. సమయం : ఒకానొక రాత్రి 9 గంటలు. శత్రు విమానాలు వస్తున్నాయని, రోడ్లమీద తిరగవద్దని సైరన్ కూసింది. రోడ్ల మీద కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ, ఆలింగనం చేసుకుంటూ ముద్దు పెట్టుకునే ప్రేమికులు సైరన్ మోత విని తొందర తొందరగా ఇంటిముఖం పట్టారు. ఒక కిటికీ దగ్గర రోడ్డుమీద తన ప్రియురాలిని కౌగిలించుకున్న ప్రేమికుడు కౌగిలి పట్టువిడ వకుండానే పైకి చూచి “తాతగారూ! దయచేసి మీ తలకాయ లోపలికి లాక్కోండి. లేకపోతే మీ బట్టతలమీద పడుతున్న చంద్ర కిరణాలు పరావర్తనమై, విమానాలకు మార్గదర్శకం కాగలదు” అన్నాడు! ఈ విధంగా 'బారిస్టర్ పార్వతీశం' రచన ఆద్యంతం హృద్యమంగా సాగుతూ పాఠకులను నవ్వులలో ముంచెత్తుతుంది.

భకారా: తెలుగు హాస్య ప్రపంచంలో మరొక ధృవతార 'హాస్య బ్రహ్మ', 'పరిహాస పారిజాతం' భమిడిపాటి కామేశ్వరరావు. సుమారు 30 సంపుటాలుగా వెలువడిన ఆయన హాస్యంలో వెక్కిరింత, వెటకారం, వేళాకోళం, వాక్చాతుర్యాలు అధికంగాను, అక్కడక్కడ వ్యంగ్యం కన్పిస్తుంది. అయితే, నిజజీవితంలో ఆయన ఎప్పుడూ గంభీరంగా కన్పించడం ఒక హాస్యోక్తి.

'మేస్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?' అనే వ్యాసంలో ఉపాధ్యాయ వృత్తిని గురించిన ఆయన వెటకారం: "మేస్టరీవల్ల దారిద్ర్యం అబ్బుతుందా......లేక దరిద్రుడైన తరువాతే

మేస్టరీలో చేరతాడా? అని సందేహించారు కొందరు. వెధవ వాళ్ళకి తీర్థపు రాచ్చిప్పలమీద ఆ పేక్ష ఎంచేత? దోమలకి మానవుల చెవులంటే సరదా ఎంచేత? అలానే దారిద్ర్యానికి మేస్టరీ అంటే ఇష్టం. అందులో తెలుగు మేస్టరంటే పరమ ప్రీతి". అందుకే ఏ దిక్కూ లేనివానికి ఉపాధ్యాయ వృత్తే దిక్కు అవుతుంది అంటారు. "ఇందులో పైన ఏమీ దొరకదు......ఎదుగూ బొదుగూ లేదు. ఇది గొర్రె తోకలాంటిది. ఇన్నీసుపేట బ్యాండు లాంటిది..... బంట్రోతులు ఉండరు, పలుకుబడి ఉండదు....." అన్నట్లు.....భకారా గారు తన జీవితాన్ని ఉపాధ్యాయునిగానే ప్రారంభించారు.

అలానే వైద్య వృత్తిని, వైద్యుల మనఃప్రవృత్తిని గురించి ఏమన్నారో విందాం."వైద్యుల సంఖ్య విజృంభించేసరికి అభిప్రాయ భేదాలు కూడా పెరిగిపోయి వీళ్ళల్లో మతాలు ఏర్పడ్డాయి.. హిందు, ముసల్మాన్, కిరస్తానీలాగే ఆయుర్వేదం, యునాని, అలోపతి మాత్రమే కాక, హోమియోపతి, మోనోపతి (అనగా ఒక్కడే), సీతాసతి (అనగా రామనామ స్మరణ) లాంటి వివిధ శాఖలుగా వైద్యం విడిపోయింది....కంటి, పంటి, కాలి, చెవి - మొదలైన వైద్యులున్నారు. వైద్యులంతా కలసి శరీరాన్ని ముక్కలు ముక్కలు చేసేసి ప్రత్యేక సామ్రాజ్యాలు ఏర్పరచుకున్నారు. శరీరానికి అతీతులు భూతవైద్యులు, మత వైద్యులు, ఆత్మ వైద్యులూను". పాఠకునితోబాటు పరిహాసపాత్రుడు కూడా ఆయన వ్యాసాలు చదివి ఆనందించగలగడం కామేశ్వరరావుగారి హాస్యంలోని ప్రత్యేకత. అందువల్లనే 1950, 1960 దశకాలలోని అనేకమంది హాస్య రచయితల పై ఆయన ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది.

చివరగా తద్దినాల గురించి. "బతికున్నన్నాళ్ళు వాణ్ణి ప్రజలు కాల్చుకుతిని.....తీరా వాడు బతకలేక చచ్చిపోయింతర్వాత వాడికి తద్దినాలు పెట్టడానికి ఎగబడతారు......వాడు గతించగానే వాడికి తేజస్సూ, వర్చస్సు, మహత్యం, దివ్యత్వం...." అంటగడతారు. "శుద్ధ అబద్ధాలతో కూడిన కట్టుకథలు కల్పించి, అవి నమ్మనివారికి కళ్ళోతాయని శపిస్తారు". ఈ విధంగా భమిడిపాటివారు హాస్య ప్రపంచంలో వినూత్న ప్రయోగాలు చేశారు. 'నవ్వు' పై 18 పేజీల సుదీర్ఘ వ్యాసం వ్రాసిన ఆయన "నవ్వు మానవ సంఘ వ్యాపారం" అని చాటిచెప్పారు.

భాషచే నవ్వించగల, భావంచే కవ్వించగల దిట్ట భమిడిపాటి. సమకాలీన తెలుగు ప్రజల సాంఘిక దురాచారాలను, ఈర్ష్య, అవినీతి మొదలైన బలహీనతలను ఆయన హాస్యరీతిలో చిత్రించారని, చతురోక్తులకే చక్కిలిగింతలు పెట్టగల నేర్పరి భమిడిపాటి అని కొందరు అభినందిం చారు. ఆయన "మాటలను తూటాల్లా విడుస్తూ చెడుగుడు ఆడించారు. మాటలకు రంగు, రుచీ వాసనా దూకుడూ సత్తువా ఉంటాయన్న సర్ వాల్టర్ రాలియో

---

నవ్వు, ఆనందం వెనుక అసూయ, భయాలు ప్రస్ఫుటంగా ఉంటాయి. – రెనె. డిస్కార్టెస్

పలుకులను అక్షర సత్యాలు చేసి చూపిన ఘనుడు" అంటారు డా|| పోరంకి దక్షిణామూర్తి, అందుకే ఆయనను అందరూ ముద్దుగా 'భకారా' అంటారు. అన్నట్లు భకారా అంటే భలే కామేశ్వరరావు! అని అర్థం చెప్పడం మరింత పసందుగా ఉందికదూ! ఆయన గొప్ప హాస్య నాటక రచయితకూడా. ఆరంగంలో ఆయన హాస్యాన్ని గురించి 'నాటకరంగం - హాస్యరసం' అధ్యాయంలో చదువుకుంటూ ఆనందిద్దాం.

ఇటు మునీ, అటు మాణిక్యం : ఇటు సాంసారిక జ్ఞానానికి మునీ, అటు హాస్యానికి మాణిక్యం, హాస్యం యొక్క విశ్వరూపాన్ని మనముందు సాక్షాత్కరింపజేసిన 'కాంతం కథలు' సృష్టికర్త మునిమాణిక్యం నరసింహారావు. సంసారపక్షంగా ఉండే హాస్యాన్ని పెంచి పోషించిన ఆయన హాస్యంలో సెలయేరు సోయగమే కాని, జలపాతం జోరు ఉండదు. నవ్వు వికృతితో జనిస్తుందని మాత్రమే జనానికి తెలుసు. అయితే, అది ప్రకృతితో, భావంతో జనించే పద్ధతిని తన రచనా చమత్కృతితో చవిచూపారు ఆయన. "ఆనందంగా నవ్వుకుంటూ విహరించడానికి ఒక రమ్య హాస్య మందిరాన్ని నిర్మించి ఇచ్చిన మాణిక్యం శ్రీ మునిమాణిక్యం" అని కొనియాడారు పోలాప్రగడ సత్యనారాయణమూర్తి. ఆయన హాస్యంలో వెక్కిరింపులకు, వెటకారాలకు చోటు లేదు. అందుకే "సహృదయుడు, విజ్ఞుడు, దయామయుడు, నాగరికుడు, సంస్కారి అయిన పాఠకుడు ఆనందించే ఆరోగ్యకరమైన హాస్యాన్ని 20వ శతాబ్దంలో భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం అనే హాస్యత్రయం పాదుకొల్పింది" అన్నారు శ్రీ సుధామ.

దాంపత్య జీవితపు సరస సరాగాల సోయగాలను మధ్యతరగతి భిత్తికపై నిల్పి, గృహమనే స్వర్గసీమను, ఇల్లాలు అనే బంధాన్ని పటిష్టపరచిన రచయిత మునిమాణిక్యం. ఆయన సృష్టించిన 'కాంతం' పాత్ర తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా నిలుస్తుంది. ఆయన భాష మంజులమైన మధుర వాక్కులతో నడుస్తుంది. "అందము, ఆనందము రమ్యహర్మ్యాలలోను, మహోన్నత సౌధాలలోను మాత్రమేగాక రసవిహీనమనుకున్న సామాన్య గృహస్త జీవితంలో కూడా ఉన్నదని చూపడానికి నేను నా జీవితమంతా ప్రయత్నించాను" అన్నారు మునిమాణిక్యం. అందుకే ఆయన హాస్యానికి వేదికలు, కవితలు అవసరం లేదు. క్లిష్టమైన పదజాలం, అందమైన అలంకారాలతో అంతకన్నా పని లేదు. ఆయన హాస్యవేదిక, నాటక ప్రదర్శనానికి అవసరమైన రంగస్థలం కేవలం ఓ మధ్యతరగతి కుటుంబీకుని గృహం. ఇలాంటి సాదాసీదా నేపథ్యంలో, సగటు మనిషి భాషలో సామాన్య, అసామాన్య పాఠకులను

---

వ్యక్తిని వ్యక్తి, సంఘాన్ని సంఘాన్నే మార్చేసి, ఉన్నత జీవిత పథాలకు తీసుకుపోతోంది హాస్యం.
– జలసూత్రం రుక్మిణీనాథ శర్మ.

ఏకరీతిలో అలరించడం ఒక్క మునిమాణిక్యానికే చెల్లుతుంది. అందుకే ఆయన 'నవ్వులరాజు' అయ్యారు.

హాస్య సృష్టికి కీలకమైన ఒక వినూత్న దృష్టి ఆయనది. అందుకే ఆయన రచనలన్నింటిలో తానే నాయకుడుగా, తన భార్య కాంతం (అసలు పేరు శేషగిరమ్మ) నాయికగా జీవించారు, శోభించారు. ఆయన కథా శీర్షికలన్నీ గృహాన్నే స్వర్గసీమగా అందలమెక్కించాయి. 'ఇల్లు-ఇల్లాలు', 'ఇంటావిడతో పోట్లాట', 'ప్రణయ కలహం', 'భార్యను లొంగదీసుకోవడం ఎలా?', 'దాంపత్యోపనిషత్తు', 'కాంతం కథలు' - ఇలాంటి శీర్షికలతో పెక్కు రచనలు గావించారు.

'హాస్య కుసుమావళి'లో కొన్ని పదాలకు ఆయన ఇచ్చిన నిర్వచనాలు వింటే, ఎలాంటివారైనా ఆనంద డోలికలలో ఊగిపోవలసిందే.

గ్రంథకర్త: సమకాలికులను,స్నేహితులను విసిగించడంతో తృప్తిపడక ముందు తరాలవారిని ఏడ్పించడానికి ప్రయత్నించేవాడు.

బ్రహ్మచారి : అందరికీ తెలిసిన భార్య లేనివాడు. పక్కనుండి నిద్ర లేచేప్పుడు ఏవైపునుంచి అయినా దిగడానికి అవకాశం ఉన్నవాడు.

విసిగించే సంభాషణ : నీవు నిన్ను గురించి మాట్లాడాలని అనుకుంటూంటే అవతలి వాడు తనను గురించి ఆపకుండా మాట్లాడటం.

ఆకాలంలో రైలుబండి అతి నెమ్మదిగా కుంటుతూ నడిచేది. రైలుబండి ప్రయాణాన్ని గురించిన అవహేళనను ఎంత గొప్పగా చిత్రించారో చూద్దాం. రైలుబండి మంగళగిరిలో బయలుదేరి గుంటూరువైపు వెళ్తుంది. గుంటూరువైపే నడవలేక నడవలేక ఉసూరు మంటూ కదులుతున్న ఓ వృద్ధురాలిని చూసి డ్రైవరు జాలిపడ్డాడు. రైలు ఆపి అవ్వను అడిగాడు.

“అవ్వా గుంటూరుకేనా?” .

“అవును నాయనా"

“పెద్దదానవు. ఏం నడుస్తావు? రైలు ఎక్కు. గుంటూరులో దింపేస్తాను”

“మంచివాడవు నాయనా. సంతోషమే కాని, నాకు కొంచెం తొందర పని ఉంది నాయనా. ఏమనుకోకే" అన్నదా ముసలమ్మ.

ఇంక సాధింపు గురించి విందాం. “సంగీత శాస్త్రంలో మంద్ర స్వరం ఎంత ప్రత్యేకత కలిగి ఉంటుందో, కలహ శాస్త్రంలో సాధింపు అలాంటిది. సాధింపులో కలహ శక్తి లేత రంగులో ప్రకాశిస్తుంది” అన్నారు మునిమాణిక్యం. ఒక చిన్న పొరపాటును గోరంతలు

---

నవ్వటంలో ఒక సత్యపరిశీలనా దృష్టి, ఒక నీతి బోధ ఉంది. – మునిమాణిక్యం

కొండంతలుగా చూసి, దాని ఫలితంగా జనించబోయే ఎన్నో సమస్యలను ఊహిం చుకుంటూ, వాటన్నింటికీ తన భర్తయే కారణమంటూ బాధపడుతూ భర్తను మరీ గట్టిగా నిందించకుండా ఆయనను మెత్తగా తిడుతూ, గట్టిగా విసిగించడాన్ని సాధింపు అంటారు. దీనికి 'స్త్రీ విద్య' అని పేరు పెట్టి, ఈ శక్తి సమస్త సృష్టిలో ఒక్క స్త్రీకి మాత్రమే ఉందన్నారు మునిమాణిక్యం. .

కొన్ని మధురోక్తులు : "నేను నిజంగా సంఘానికి, లోకానికి ఉపకారం, మేలు చేశాను. నేను ఆ పనిచేసి అధమము ఒక ప్రాణినైనా కాపాడినట్లు లోకం గుర్తించాలి" అన్నాడు భర్త.

భార్య "ఏమిటి ఆ మేలు?".

"ఆ మేలు ఏమిటంటే నేను నిన్ను పెళ్ళి చేసుకోవడమే" అన్నాడు గృహస్తు.

ఉత్కంఠభరితమైన మరొక ఉదాహరణ:

"అసలు నారదుడికి భార్య లేదంటారే" అన్నదావిడ.

"ఎవరు చెప్పారు నీకు?"

"ఎవరు చెప్పేదే మిటి నాకు తెలీదా? మొన్న గుళ్ళో మాఘపురాణం చదువుతున్నప్పుడు కూడా ఆ మాటే విన్నాను".

"ఇంతేకదా! మాఘపురాణం వ్రాసే కాలంనాటికి ఆయనకు వివాహం కాలేదు. దాని తరువాత మత్స్య, కూర్మ, వరాహాది పురాణాలు వ్రాశారు. వాటిలో ఆయన భార్య సంగతి ఉంది" అన్నాడు.

మరొకరోజు కాంతం పెడవాదంతో ఆయన విసిగిపోయారు."పూర్వజన్మలో మనిద్దరం ఉద్దాలకుడు, చండికలుగా జన్మించామనుకుంటా" అంటూ బాధను, కోపాన్ని మేళవించి.... "అందుకే అన్నారు కొంచెం వివేకం ఉన్న ఇంట్లోంచి పిల్లను తెచ్చుకోమని. మీ ఇంట్లో ఒక్కళ్ళైనా వివేకవంతులు ఉన్నారా అని నా అనుమానం" అన్నాడు తీవ్రంగా. "మీ అత్తారి గురించి మీకన్నీ అనుమానాలే. మా అత్తారి విషయంలో నాకు మాత్రం అలాంటి అనుమానం ఏంలేదు సుమండి" అంది సన్నాయి నొక్కులు నొక్కుతూ ఆ గడుసు ఇల్లాలు.

"ఇంటి ఇల్లాలికి సాహిత్య గౌరవం" కల్పించడమేగాక, సంసారం సాగరం కాదని, అదొక ఆనందాల నిలయం అని లోకానికి చాటిచెప్పిన హాస్యమణి మునిమాణిక్యం.

దటీజ్ ముళ్ళపూడి : 'ఇస్కూలులో ఎస్.ఎస్.ఎల్.సి. వరకే ఎలగబెట్టిన' ఆయన నవ్వుల సముద్రంలో పలు నావలు నడిపించిన దిట్ట. చిరుప్రాయంలోనే బ్రతుకు పోరాటం సాగించారు. అన్నం ముట్టినపూట పండుగ చేసుకుంటూ, మిగిలిన రోజులలో 'గాలి' మైత్రితో,

'మంచినీటి' స్నేహంతో కాలం గడిపేవారు. కన్నీటి కథలకు నిర్వచనంగా ఎదిగిన ఆయన నవ్వుల చరిత్రకు ఓ ఉదాత్త ఉదాహరణగా మిగలడం ఒక విశేషం. ఆయన సృష్టించిన 'బుడుగు', 'రాధాగోపాలం', 'అప్పారావు'లలో హ్యూమరసం తొణికిస లాడుతుంది. అప్పు ఆవశ్యకతను గురించి ఓ వ్యాకరణాన్ని తయారుచేయడమేగాక, దానినొక తత్వంగా, శాస్త్రంగా తీర్చిదిద్దిన ఉద్దండుడు. 'అప్పకవీయం' వెలగబెట్టాడని కొందరు చిటపటలాడినా నాకు మాత్రం ఆయన అప్పు రహస్యాలను, దాని విశ్వవ్యాప కత్వాన్ని ఔపోశన పట్టిన కులపతి అప్పారావులా కన్పిస్తారు. ఇంక ఆయన మాటలలోనే విందాం : "పంచభూతాల్లో అప్పు ఒకటి. ఈ భూప్రపంచంలో అప్పులో కాలువెయ్యని వాడు ఉండడు. ప్రపంచంలో ప్రజలనుంచో, ఇతర దేశాలనుంచో అప్పు చెయ్యని దేశమంటూ ఉండదు. మొదటిదానికి తనే ఉదాహరణ, రెండోదానికి మనమే ఉదాహ రణ అంటాడు అప్పారావు. సింహాచలంమీద వెలసిన దేవుడి పేరేమిటి? అప్పలస్వామి. శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసును ఏమనేవాడు? ఖజానా నిండుకోగానే 'అప్పాజీ' అని పిలిచేవాడు. అప్పు చేయడం ఏదో పెద్ద తప్పు చేయడం అనుకుంటారు కొందరు. "ఏం లేదు....వాళ్ళ డబ్బు కాసేపు మన దగ్గర ఉండడం" అన్న పలుకులు ఎవరినైనా ఆలోచింపజేస్తాయి, అందరినీ అలరిస్తాయి. "సునిశితమైన అధిక్షేపణ తగుపాళ్ళలో కలిసిన రచనామృతం అది" అంటారు విహారి .

అటు సంపన్న వర్గాలను చేరలేక, ఇటు నిరు పేదలతో కలవలేక త్రిశంకు స్వర్గంలో ఊగిసలాడుతున్న మధ్యతరగతి హిపోక్రసి, మనోవేదనను ఎంత చక్కగా వివరించారో చూడండి. "సుందరమ్మ నాలుగు వందలు పెట్టి కొన్న పాత కారేసుకొని చీరల దుకాణానికి వెళ్ళి పెద్ద పెద్ద చీరలన్నీ బేరమాడి ఒక జేబురుమాలును రూపాయి పెట్టి కొంది. ఇంకోచోట ఏవో నాలుగు సామానులు కొని కారులో పడెయ్యమంది షాపువాణ్ణి. "ఏ కారులోనండి" అని అడిగాడు అతను. కాంతులీనే పెద్ద పెద్ద కారుల మధ్య ఉన్న తన పాత చిన్నకారుని చూసి సిగ్గువేసింది సుందరమ్మకి. "అదుగో ఆ డొక్కుకారు లేదూ......చిన్నది, అందులో పడెయ్యండి" అంది. మళ్ళీ ఏంతోచిందో...... "ఆ కారు మా డ్రైవరుదిలెండి. మాది రిపేరుకెళ్ళింది......అనేసింది. .

ముళ్ళపూడివారు సృష్టించిన పాత్రలు ప్రతి తెలుగు ఇంట చిరస్మరణీయ మయ్యాయి. అప్పుల అప్పారావు, బుడుగు, సీగాన పెసూ నాంబ, పక్కింటి లావుపాటి పిన్ని,ఆవిడ మొగుడు, రెండు జెళ్ళ సీత ఇందుకు ఉదాహరణలు.. ఆయన 'బుడుగు' చిచ్చులపిడుగులా కొన్ని దశాబ్దాల కాలం ప్రతి ఇంట్లో, ప్రతి నోట్లో స్థానం సంపాదిం చుకున్నాడు. తాను

---

మానవాళికి అత్యంత అధునాతన సౌందర్య పోషక పదార్థం నవ్వు. – మూర్తి.

సృష్టించిన పసందైన పదజాలంతో - "అస్సలు, నిఝంగా, ఘుబుక్కున, ఇంఖా, రష్పించాలని, వింజిను, డికెష్టి, ఖథ, చ్చీన్న పిల్లలు...." అందరినీ ఆకట్టుకున్నారు. "అస్సలు వాడు అబద్దం చెప్పాలన్నా చెప్పలేడు. ఎందుకంటే వాడికి తెలుగు రాదుగా మరి. తెలుగొస్తేనే అబద్ధం చెప్పొచ్చు" అనడంలో ఎంత అవహేళన ఉంది!

అలానే, 'గిరీశం లెక్చర్స్'లో ఆయన సృష్టించిన కొన్ని పదాలు తెలుగు లోగిళ్ళలో తిష్టవేశాయి. కంఠశోషలిజం, కామన్‌ధేనువు, భర్త కంట్రోలు, బ్రిలియంట్ల వెధవ, త్రి టీకాతాత్పర్యాలు, పొగరుమోతుబర్లు - ఇలాంటి ఎన్నో పదాలను ఆయన అందంగా, అర్థవంతంగా, పొందికగా ప్రతిష్టించారు. 'అందాల రాముడు' సినిమాలో "తీతా" అని "తీసేసిన తాసిల్దారు"ను పిలవడంతో అది అందరి నోటా ఒక ఊతపదంలా వ్యాప్తిచెం దింది. 'రాజకీయ భేతాళ పంచవింశతిక' రచనలో "తప్పేనా ఒప్పేలా తప్పులు చేయడం రాజకీయం" అన్నారు. మరికొన్ని ఆణిముత్యాలు : "రాజనీతిజ్ఞుని భాషలా, అవకాశవాది అబద్దాలులా ఆమె కనులు సొగసుగా తీర్చిదిద్ది ఉన్నాయి". "అతను రెడ్డిగారికి బుజ్జింక మీసంలాంటివాడు, చెప్పుల జతలాటివాడు, గొడుగులాటివాడు, లౌడు స్పీకరులాటి వాడు" అని చెప్పడంలో "ఒక్క అతను" ఎలా బహు పాత్రలు పోషిస్తున్నాడో చూడండి.

"వీధిలో చుక్క పరుగెడుతోంది. మధ్యాహ్నపు నిశ్శబ్దంమీద. నిశ్శబ్దపు మధ్యాహ్నం మీద. చుక్క కాళ్ళ కడియాలు, గొలుసులు ఘల్లుఘల్లుమంటున్నాయి. ఒడుదుడుకులుగా పరుగెడుతోంది. సుడిగాలిలా పరుగెడుతోంది. శివాలెత్తినట్టు ఊగిపోతుంది (సాక్షి). ఈ విధంగా ఆయన వచనం వ్రాస్తూ కవిత చెప్పేస్తారు. సున్నితమైన హాస్యం, సుకుమారమైన చమత్కారం, సునిశితమైన అధిక్షేపణ తగుపాళ్ళలో కలిసిన రచనామృ తం అది" అంటారు హరి.

గిచ్చి నోరు మూయగల నేర్పరి ఆయన. బానలతో తెలుగునాట హాస్యం కుమ్మరిం చినా నవ్వును ఏనాడూ నవ్వులపాలు చేయని నవ్వులరాముడు ముళ్ళపూడి. ఆంధ్రుల ఆవకాయలా ముళ్ళపూడి మార్కు నవ్వుల పేటెంట్ కర్త ఆయన. అకాడమీ, నంది మొదలైన అవార్డులతో బాటు, తెలుగు విశ్వవిద్యాలయం (1992లో) గౌరవ డాక్టరేటు గౌరవాలు పొందిన శ్రీ వెంకటరమణ తెలుగునాట నవ్వుల రాజుగా నిలుస్తారు.

హాస్యమతి భానుమతి : ఒక నటిగా, దర్శకురాలిగా, గాయనిగా భానుమతి ఎంత పేరు గడించారో, హాస్య రచయిత్రిగా 'అత్తగారి కథలు', 'భానుమతి కథానికలు', 'నాలో నేను' ద్వారా. ఆమె అంతే పేరు గడించారు. ఎన్నో అవార్డులు పొందారు. అలానే 'చక్రపాణి',

---

పెదవులలోను,పొట్టలోను జరిగే ఆకస్మిక పరిణామ ఫలితమే హాస్యం. – నామ్ హాలెండ్

'వరుడు కావాలి' మొదలైన హాస్యభరిత చిత్రాల నిర్మాణంద్వారా ఆమె హాస్య ప్రపంచంలో తనదైన స్థానాన్ని పొందారు. పల్లెల్లో ఈ నాటికీ వాడే బువ్వ అనే పదం ఆంగ్లంలో బఫేగా మారిందంటారు భానుమతి. పాలవాడు “ఈ పెద్దమ్మ గోరు (అంటే అత్తగారు) నన్ను ఏమీ తెలియని గాడిద కింద కట్టేసింది. ఏ గొడ్డు ఎట్టిదో నాకు తెలుసు. నా సంగతి గొడ్డుకి తెలుసు” అంటే మనం నవ్వు ఆపుకోగలమా?

'అత్తగారూ - అరటికాయ పొడి' కథలో ఒక చక్కని సన్నివేశం: తల్లి ప్రేమతో వడ్డించిన అరటికాయ పొడి ముద్ద నోట్లో పెట్టుకుని, గబుక్కున లేచి వెళ్ళిపోయాడు. నోట్లోంచి గరగర శబ్దం వినిపించింది. తోడికోడలి కొడుకూ అంతే. ఏమిట్రా ఇది అని అడిగింది ఆమె కంగారుగా, అతడు భయం భయంగానే చెబుతాడు: “కక్కీ! దీన్లో పోపుదినుసుల రాళ్ళూ, బొగ్గుల కుంపటిలోని చిన్న బొగ్గు ముక్కలూ పడ్డాయి. నమలగానే గరగర లాడాయి” అని. “ఒరేయ్! రుచి చూద్దామని నేను కొంచెం నోట్లో వేసుకున్నాను. నాకు రానివి మీకెలా వచ్చాయిరా ఇవన్నీ?" అంటుంది. “కక్కీ! నీకు పళ్ళు లేవు కదా! ఎలా కొరుకుతావ్ మింగేసుంటావ్?” అన్నాడు. ఆమె తలదించుకుంటుంది. “పోనీలేరా! రేపు మళ్ళీ చేసి పెడతాలే జాగ్రత్తగా అన్నీ చూసి” అంటుంది ఇంకా అరటికాయలు లోపల ఉన్నాయికదా అన్న ధీమాతో. “ఆమెది ప్రత్యేకమైన శైలి, విశిష్టమైన చమత్కారం, కథ చెప్పే రీతి. ఈ మూడింట్లో ఆమెకు ఆమే సాటి" అంటారు శ్రీమతి శారదా అశోకవర్ధన్.

తన చిన్ననాటి పాఠశాల విషయాలు చెబుతూ, “ఆయన పేరే హనుమయ్య పంతులు"....... “ఎవరో ఆడపిల్లని ఎక్కడో గిల్లాడని, ఆయనవన్నీ కోతి గుణాలే” అని చెప్పడానికే ఆమె ప్రయత్నమంతా.

తెలుగు హాస్వ కవులలో- ముఖ్యంగా పేరడీ రచనలలో శ్రీరమణ పేరు విననివారుండరు'. ఆయన రచన 'హాస్యజ్యోతి' ఇందుకు మంచి ఉదాహరణ. తెలుగు సూక్తికి పర్యాయపదంగా నానుడి అని ఉపయోగిస్తాము. అవి ఆనాటి యదార్ధాలు. మరి ఆధునిక యదార్థాలు? “నేను నాస్తికుణ్ణేగాని, ప్రసాదం పంచుకోవడంలో నమ్మకం ఉన్నవాణ్ణి" అంటారు ఆరుద్ర. అలానే కాలానికి అనుగుణంగా నానుడిలు మారాలిగా! అవే శ్రీరమణ అందించిన న్యూనుడిలు.

అభ్యర్థికి మైకు పిచ్చి - కార్యకర్తలకు కారు పిచ్చి
అవకాశవాదుల సభకు అందరూ అధ్యక్షులే!

---

అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణం సమస్త దురితోపహారం హాస్యరసామృతం, పావనం శుభం. – ఆమళ్లదిన్నె గోపీనాథ్

అపోజిషన్లో పురుగులేదు మొర్రో అంటే, అధికార వర్గం మీద అవిశ్వాసం పెడదామన్నాట్ట.

అర అరసం ఒకడు, వీర విరసం ఇంకోడు

అరసమైనా, విరసమైనా సభకు అధ్యక్షులవారు ఒకరే!

అభిమానుల ఆర్భాటమేగాని హాల్లో పురుగు లేదు

అగ్ని సంస్కారం అయితేగాని సిగరెట్ పొగరెట్ అవదు

ఎన్నికలకు, విధులకంటే నిధులే ముఖ్యం

ఏ జెండా అయినా ఆ తానులోదే! ఏడు పార్టీలు మారినా ఎవరికీ ఎంగిలి లేదు.

ఆధునిక, రాజకీయ, సామాజిక పోకడల పై చురకలు ఇవి. పతనమవుతున్న రాజకీయ సామాజిక విలువలకు దర్పణం ఇవి. యధారాజా తధాప్రజా అన్నది నానుడి. యధాప్రజా తధాపాలన అన్నది న్యూనుడి కావాలి. చెన్నారెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్న రోజులలో కటారుపల్లిలో రూ. 25 లక్షల ఖర్చుతో కవి వేమన సమాధిని నిర్మించడానికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి. అంత పెద్ద మొత్తం అని వినగానే మరోప్రాంతం ఎం.ఎల్.ఎ. గారికి నోరూరింది. “అదేందో మా ఏరియాకి పారేయించండయ్యా, పైగా పాతిక లక్షలు అంటున్నారు” అంటూ మధనపడ్డాడట!

ఇలాంటి విలువలులేని ప్రతినిధులు ప్రజాస్వామ్యపు వలువలను నడి బజారులో విప్పుతారన్నది జగమెరిగిన సత్యం. అయితే, అలాంటి నాయకుల కు అండదండలుగా నిలుస్తున్నది మేధాసంపన్నులైన కులనేతలు అవడం అద్భుత ఆధునిక హాస్యోక్తి.

చిత్రోక్తులద్వారా చక్కని గేయాలను అందించడం శ్రీరమణగారి మరొక ప్రయోగం. ఆయన రచన ఎంత అందంగా ఉంటుందో, దానికి చిత్రాలు గీసిచ్చిన బాపుగారి ఆలోచనలు మరింత అందంగా ఉంటాయి.

విశ్వనాధవి మధ్యాక్కరలు

శ్రీ శ్రీవి మద్యాక్కరలు

కృష్ణశాస్త్రివి మిధ్యాక్కరలు

సగటు పాఠకులను పట్టేసే రంగుల వల

శ్రీమతి సులోచనారాణి న-వల

ఇంక తెలుగు కథా జగత్తులోకి వస్తే హాస్యభరితమైన ఎన్నో రచనలుకన్పిస్తాయి. పరమానందయ్య శిష్యులు, తెనాలి రామలింగడు, మర్యాదరామన్న, భట్టి విక్రమార్క,

---

హాస్యం అనంతంగాను, సర్వవ్యాప్తిగాను, సహస్రరూపంగానూ కనబడుతుంది.— విశ్వనాథ కవిరాజు

శుకసప్తతి, మదనకామరాజు, పంచతంత్రం మొదలగు అనేకానేక కథలలో హాస్యం పుంఖానుపుంఖాలుగా లభిస్తుంది.

మన నాటకాలలో కూడా హాస్యం ప్రముఖ స్థానం ఆక్రమించింది. తారాశశాంకంలో లంబు జంబు, చింతామణిలో సుబ్బిశెట్టి, సతీసక్కుబాయిలో పెద్దిశెట్టి - శంభుశాస్త్రి, పేరిగాడులో విల్లి పాత్రలు హాస్యోత్పత్తి కొరకే కల్పించబడ్డాయి.

ఇటీవల కాలంలో తెలుగులో క్రమంగా హాస్యం ప్రాధాన్యత పెరగడం స్వాగతించదగిన పరిణామం. సుమారు ఒక శతాబ్దంన్నర క్రితం (1856లో) వావిళ్ళ సంస్థవారు తెలుగులో ముద్రించిన రామాయణ, మహాభారతాలను ఏనుగు అంబారీ పై ఉంచి, ప్రముఖులు వెంటరాగా, బ్యాండు మేళాలతో వాటిని మద్రాసు పురవీధులగుండా ఊరేగించారట! తెలుగులో ఏదైనా ఒక హాస్య రచనకు అలాంటి అదృష్టం ఎప్పుడు వరిస్తుందోనని వేచి చూస్తూ ఇంక మన హాస్య నటుల గురించి తెలుసుకుందామా!

---

అతి గంభీర విషయాన్ని వక్రీకరించి, అతి సామాన్య విషయంగా వ్యక్తీకరించడం వల్ల హాస్యం జనిస్తుంది. – కోవెల సంపత్కుమారాచార్య.

అధ్యాయం 30

# ప్రఖ్యాత తెలుగు హాస్య నటులు

ప్రపంచ ప్రజానీకానికి ఆనందం కలిగించాలన్న ఉదాత్త ఆశయంతో మానవాళి విలువలను, పోరాటాలను, వర్తమాన ఆలోచనలను అంతర్జాతీయ కోణం నుండి ప్రకటిస్తూ, ప్రదర్శిస్తూ ఆనందమయ ప్రపంచ నిర్మాణానికి కృషిచేస్తారు హాస్యకారులు. వారు సృష్టించే హాస్యోక్తులలోని ఉద్వేగం ప్రపంచ ఆత్మ యొక్క ఉన్ముఖత్వానికి బలంగా తోడ్పడుతూ మానవ సమాజ ప్రగతికి మార్గదర్శనం అవుతుంది' అంటారు ప్రఖ్యాత రచయితలు ఫ్రై, అలెన్లు.

అల్పత్వాన్ని, అసహజత్వాన్ని, అహంభావాన్ని, రాగద్వేషాలను నమిలి మింగగల విచిత్ర శక్తిగలది హాస్యం. అలాంటి ఆనందాన్ని అందరకూ పంచే తెలుగు సినిమా రంగంలోని కొందరు ప్రఖ్యాత హాస్యకళాకారులను గురించి తెలుసుకుందాం.

కన్నీరుకు, హాస్యానికి సంబంధం : తెలుగు సినిమా గాయకులలో అనుర గాయకుడుగా ఖ్యాతిగడించిన ఘంటసాల వెంకటేశ్వరరావు జీవితం నిజంగా ఓ పెద్ద జోక్ తో ప్రారంభమైంది. సంగీత లోకాన్ని గ్రామఫోన్ ఏలిన ఆకాలంలో హెచ్.ఎం.వి. వారి దృష్టిలో పడటమంటే సంగీత ధామం చేరినట్లేనని గాయకులు భావించేవారు. అయితే, ఆ కంపెనీవారు ఘంటసాల గొంతు వీనులవిందుగా లేదని, మైక్ కు పనికి రాదని ఆయన దరఖాస్తును త్రోసిపుచ్చారు. దాంతో జోలెను అరిగిన భుజాన వేసుకొని పాటలు పాడుకుంటూ, ఆ మహాగాయకుడు నిస్పృహతో నిస్సహాయంగా బజార్లలో తిరిగాడు. దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాడు. కాలే కడుపుకు కన్నీళ్ళు, చెరువు నీళ్ళే శరణ్యం అయ్యాయి. ఆకలికి తాళలేక జోలెలో ప్రొద్దున మిగిలిన నాలుగు మెతుకులను గతుక్కుందామనుకుంటే దానినిండా చీమలు! వాటిని తీసివేసి మిగిలిన మెతుకులు గతకడంతో ఆనాటి భోజనం పూర్తి అయ్యేది! ఈ విధంగా ఆయన జీవితం బాధల నిలయం; వ్యధలమయం అయ్యింది. ఆ బాధలలోనుండే అమర కంఠం వెలువడిందేమో! ఆయన శ్రీమతి ఘంటసాల సావిత్రి కలంనుండి జారిన 'మా మామయ్య ఘంటసాల కథ' చదివితే పాఠకుని హృదయం ద్రవించక మానదు. ఆయనకు అన్ని బాధలలోను ఆనాడు తోడుగా నిలిచినవి నవ్వులు, కన్నీళ్ళు!

అలానే నటి కాంచనమాల ఉదంతం కూడా సినీజగత్తులో గొప్ప హాస్యోక్తిగా నిలిచింది. గూడవల్లి రామబ్రహ్మం తెలుగులో సంచలన చిత్ర నిర్మాతగా పేరుగాంచాడు.

---

మానవాళికి అత్యంత అధునాతన సౌందర్య పోషక పదార్థం నవ్వు. – మూర్తి.

కాంచనమాల సినిమాలో నటిస్తానని ఆయనను అర్థిస్తే, “నీ ముఖంలో జీవం లేదు. నీది ఫొటోజెనిక్ ఫేస్‌కాదు (ఫొటోలో అందంగా కనబడే ముఖం కాదు), సినిమాలకు పనికిరావు” అని తిరస్కరించాడు. కొంతకాలం తర్వాత అదే గూడవల్లి అదే కాంచనమాలను తాను నిర్మించబోయే 'మాలపిల్ల' చిత్రంలో ఏకంగా నాయికగా నటించమని ఆహ్వానించాడంటే ఎవరికైనా ఆశ్చర్యంతోబాటు, నవ్వు కూడా రాకమానదు.

తెలుగులో హాస్యదిగ్గజాలుగా ఆనాడు పేకేటి శివరాం, రేలంగి, రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, హాస్యబాబు రాజబాబు, పద్మనాభం, సుత్తివేలు, సుత్తి వీరభద్రరావు గార్లు కీర్తి గడించారు. ఈనాడు రాజేంద్రప్రసాద్, బ్రహ్మానందం, ఏ.వి. ఎస్., ఎం.ఎస్.నారాయణ, ఎల్.బి.శ్రీరామ్, సునీల్, వేణుమాధవ్, ఆలీ మొదలైన హాస్య నటులు తెలుగు తెరపై నవ్వులు పండిస్తున్నారు. ఇప్పుడు కొందరు హాస్య చక్రవర్తులను గురించి తెలుసుకుందాం..

నవ్వుల చక్రవర్తి రేలంగి పేరు వినని ఆంధ్రుడు ఉండడు. నిజానికి తెరపై ఆయన ఎంతగా నవ్వాడో, నిజ జీవితంలో అంతగా ఏడ్చాడు! 'ఇది నా గోడు... ఇట్లు మీ రేలంగోడు' అంటూ తన పై తానే చతురోక్తులు విసురుకున్న దిట్ట ఆయన. “నవ్వు, ఏడుపు కలిస్తే సినిమా. ఏడుపు, నవ్వు కలిస్తే జీవితం" అని ఆయన నిర్వచనం చెప్పాడు. బ్రతుకు అర్థం తెలుసుకోకపోతే అది వ్యర్థం అని నిర్ధారించాడు. “కాకినాడలోని మెక్లారిన్ హైస్కూల్లో నా చదువు వెలగబెట్టాను. అది నాతో కుస్తీ పట్టింది. నన్ను గెలవలేనని తెలుసుకుంది. అంతే! ఫోర్త్ ఫారమ్ లో ఉన్నప్పుడు నన్ను వదిలి పారిపోయింది” అంటూ తన చదువును గురించి ఎంత అందంగా, వ్యంగ్యంగా వివరించాడో చూడండి.

ఆయన కష్టాలు, కన్నీళ్ళతో చెలిమి చేశాడు. తండ్రి ఆసుపత్రి పాలయితే, భార్య ఇంట్లో మంచాన పడ్డది. చేతిలో చిల్లిగవ్వ లేదు. బజారులో పైసా అప్పు దొరకని స్థితి. జీవితం నిండా బాధలు, మనస్సు నిండా వ్యధలు. కోపంతో దైవాన్ని దూషించాడు. తరువాత పశ్చాత్తాపంతో కన్నీళ్ళు కారుస్తూ క్షమించమని దైవాన్ని అర్థించాడు. జీవితం నేర్పిన పాఠాలతో అన్ని బాధలలోను నవ్వడం నేర్చుకున్నాడు. “జీవితంలో విషాదం ఉండాలి. అది ఉంటేనే నవ్వు విలువ తెలుస్తుంది. నవ్వులోంచి విషాదం పుట్టాలి. నిజానికి ఆ రెండూ ఒక్కటే అన్పిస్తుంది నాకు” అన్నాడు ఆయన. “ఆ రోజుల్లో తిందామంటే అరటిపండుకూడా కొనలేకపొయ్యేవాణ్ణి. ఇవ్వాళ ఇంత సంపద, శక్తి ఉన్నా తింటే అరటిపండుకూడా

---

బుద్ధిమీద చమత్కారాన్ని ఉంచడం, అవసరం పైన అవసరాన్ని ఉంచడమే అవుతుంది. – డిమైంటెనాన్

అరగడంలేదు" అని బాధపడ్డాడు. అయితే తెరపై నవ్వులరాజుగా, రారాజుగా రాణించాడు. అంతకన్నా ఎక్కువగా జనాన్ని ఏడ్పించాడు, ఇంకా ఎక్కువగా నవ్వించాడు.

చిన్నతనంలో తాడేపల్లిగూడెంలో చిల్లర వేషాలు వేస్తూ, ఆ తరువాత కాకినాడలో మహాగురువు గండికోట జోగినాధంగారి శిష్యరికంలో నటనతోపాటు సంగీత జ్ఞానం సంపాదించుకున్న హాస్య శ్రీ రేలంగి వెంకట్రామయ్య 'పాతాళభైరవి', 'మిస్సమ్మ', 'విప్రనారాయణ', తదితర చిత్రాలలో తన పాత్రకు స్వయంగా తానే పాటలు పాడుకు న్న నట గాయకుడు. తెలుగు.సినిమాకు దరహాసం, ప్రేక్షకుడికి పరిహాసంగా సుమారు రెండున్నర దశాబ్దాలపాటు పౌరాణిక, సాంఘిక, జానపద చిత్రాలకు అచ్చుగుద్దినట్లు సరిపోయిన హాస్యనట చక్రవర్తి రేలంగి. ఆయన మాటల్లో, చేతల్లో హాస్యం నాట్యం చేసేది. నవరసాల్లో హాస్యేతరమైన ఏ రసాన్ని ప్రదర్శించినా నవ్వు తెప్పించిన నటుడు రేలంగి. మకుటంలేని మహారాజు, కపటం లేని కళాకారుడుగా జీవితాన్ని కొనసాగించిన ఆయన తన తర్వాతి తరాన్ని కూడా ప్రభావితం చేశాడు. తోటి హాస్యనటులు రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, లంక సత్యం, చదలవాడ, బొడపాటి, నల్ల రామ్మూర్తి,రామకోటి వంటివారికి ఆయన పెద్ద దిక్కుగా ఉండేవాడు. రేలంగి, రమణారెడ్డిలను హాస్యరస దేవతకు రెండు కళ్ళుగా ఆనాడు చెప్పుకునేవారు. శరీరం అనుకూలించని అనారోగ్య పరిస్థితిని సైతం కొత్త తరహా అభినయంగా మార్చుకున్న ధీశాలి ఆయన. అన్నట్లు సినిమా చరిత్రలో పాటలుపాడుతూ మెదటిసారిగా స్టెప్పులు వేసిన ఘనత రేలంగికే దక్కుతుంది.

'నర్తనశాల' చిత్రంలో ఉత్తర కుమారుడుగా నటిస్తూ తిక్కన పద్యం "కౌరవసేన జూచి వడకన్ దొడగెన్ మదితోన మేను" - మదితో మేను వణకటమనేది ఏమిటో, ఎలా ఉంటుందో, తిక్కన కవితా హృదయం ఎటువంటిదో చూపించగలిగాడు. 'చెంచులక్ష్మి'లో నారదుడుగా "నీలగగన ఘనశ్యామా" అంటూ హరినామ సంకీర్తనం చేస్తూ భక్తి భావాన్ని ఉదీప్తం చేశాడు. అలానే 'చింతామణి'లో "చచ్చి బ్రతికినవాడును, సానికొంప జొచ్చి మిగిలినవాడు లేదు లేదు దైవంబుతోడ" అంటూ ఉత్తరీయాన్ని కన్నీటితో తడిపి పిండుతూ పద్యం పాడే దృశ్యాన్ని ఏ తెలుగు ప్రేక్షకుడూ మరచిపోలేదు. తనదంటూ ఒక ప్రత్యేక ఉచ్చారణతో సినిమా హాల్లో ప్రేక్షకులచే ఈలలు వేయించేవాడు. 1953లో పచ్చయప్ప కళాశాల ఆవరణలో చెన్నపురి ఆంధ్ర విద్యార్థి విజ్ఞాన సమితి సన్మానసభలో ప్రసంగిస్తూ "స్కూల్లో మాస్టర్లనీ, వారి మాటనీ, నడకనీ ఇమిటేట్ చేసిన స్టాండప్ ఆన్ ది బెంచ్ గాణ్ణి. కొందరి కంఠస్వరం వారి వారి వృత్తులు, వాటి దైనందిన అవసరాలను బట్టి ఉంటుంది.

---

హాసాన్ని నాగరికంగా ప్రయోగించు, అర్థరహితంగా వినియోగించకు. – జాకోబ్ ఎం.బ్రాడ్

అలానే పాటలాగా మాటకూ శృతి ఉంటుంది. ఇవన్నీ గమనించి సొంతం చేసుకునేవాణ్ణి. అది హాబీగా మొదలై జీవనంగా మారిపోయిం ది. అదే నాకు కాస్త తిండి, మరికాస్త పేరు కూడా తెచ్చి పెట్టింది...." అంటూ వివరించాడు. పక్కింటి అమ్మాయి'లో హీరోగా, 'సామ్రాజ్యం' సినిమా నిర్మాతగా రికార్డు సృష్టించాడు. అగ్రశ్రేణి నటుడి స్థాయిలో హీరోలకు హీరోగా వెలుగొందిన రేలంగి చరిత్ర సినీ పురాణంలో ఒక స్వర్ణ పర్వం. ఆయన ఒక హాసయోగి, హాస్యరసయోగి. అందుకేనేమో యావత్ భారతదేశంలోని హాస్యనటులలో1954లో దేశంలో నే ప్రథమంగా పద్మశ్రీ' అవార్డు పొందిన ఘనత ఆయనకే దక్కింది. ఆయన నటనలో ఎక్కడా అసభ్య హాస్యం కన్పించకపోవడం మరొక విశేషం. అందుకే ఆయన సభ్య హాస్యచక్రవర్తిగా చిరస్థాయిగా నిలిచాడు. ఆవిధంగా చిరస్మరనీయుడు, తెరస్మరనీయుడు అయ్యాడు.

అల్లు రామలింగయ్య ఒక విలక్షణ నటుడు. పుడుతూనే ఏడవడానికి బదులు నవ్వాడో ఏమో తెలియదు కానీ, అల్లు తల్లిదండ్రులు ఆయనకు హాస్యకవి రామలింగడి పేరు పెట్టారు. అందుకేనేమో నవ్వడం, నవ్వించడం అల్లుకే చెల్లు అని చిరువయస్సులోనే అందరిచేత అనిపించుకొంటూ సార్థక నామధేయుడయ్యాడు. నవ్వుకు నిర్వచనంగా, హాస్యానికి అర్థంగా నిలిచాడు; జోకుల పుట్టగా కీర్తిగడించాడు; హాస్యోక్తుల రాజుగా వెలుగొందాడు.

1923 అక్టోబర్ 1న పాలకొల్లులోని ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన రామలింగయ్యకు చిన్నతనం నుండి నటనలో - ముఖ్యంగా హాస్యం పై ఆసక్తి అధికం. అయితే, నవ్వులను అంటరానివాటిగా పరిగణించే ఆ రోజులలో హాస్యనటునిగా ఎదగడం అంటే ఏటికి ఎదురీదడమే అవుతుంది. అయినా ఆ నమ్మకాలను ఆయన వ్యతిరేకించాడు. నాటకాలు ఆడితే తప్పేమిటని ప్రశ్నించాడు. ఒకరోజు పాలకొల్లులో 'భక్త ప్రహ్లాద' నాటకమాడుతున్నారని తెలుసుకున్న రామలింగయ్య క్షణాలలో ఆ నాటకం కాంట్రాక్టరు వద్దకు పరుగెత్తి ఆ నాటకంలో తనకు వేషం ఇస్తే రూ. 35 / - ఇస్తానని, అర్థించడం, ఇంట్లో బియ్యాన్ని దొంగచాటుగా అమ్మి కాంట్రాక్టరు రుణాన్ని తీర్చడంతో ఆ సమస్య సమసిపోయింది. జీవితంలో ఆ సంఘటన మరువలేనిదని, ఆ మూడు రూపాయలే తనను ఒక మహానటుడి స్థాయికి చేర్చాయని ఆయన తరచు చెబుతూ ఆనందించేవాడు.

క్రమంగా హాస్యం రామలింగయ్య విలాసమైంది. "కన్ను తెరిస్తే ఉయ్యాల, కన్ను మూస్తే మొయ్యాల" అన్నది అల్లు నినాదం. స్వయంకృషితో, అకుంఠిత దీక్షతో ఎదిగిన

---

రాసక్రీడ శృంగారానికి రమ్యమైన ప్రాణం. ప్రాసక్రీడ హాస్యానికి పసందైన బాణం. – శ్రీశ్రీ

అద్భుత నటుడు ఆయన. వేషాల కోసం సైకిలెక్కి ఆనాటి మద్రాసు పాండీ బజారులో చక్కర్లు కొట్టిన అల్లు క్రమంగా హాస్యానికే నిర్వచనంగా నిలిచేస్థాయికి ఎదిగాడు. నాటకరంగాన్ని హాస్య రంగంగా మార్చి సినీరంగ ప్రవేశం చేసిన ఆయన పలురకాల హాస్యాలను పండించి, అందరిచేత సెహభాష్ అనిపించుకున్నాడు. ఎదిగిన కొద్దీ ఒదగడం అన్న సూత్రాన్ని మనసా వాచా అమలుపరచడంవల్లనేనేమో చివరకు 'పద్మశ్రీ' (1992) గౌరవం పొందాడు. 'హాస్యనట శిరోమణి', 'హాస్య కళాప్రపూర్ణ', 'నవ్వుకు పెద్దబాలశిక్ష', 'హాస్య పితామహుడు' మొదలైన అనేక బిరుదులు పొందిన రామలింగయ్య మరణవార్త (జులై 31, 2004) విన్న నవ్వుకే ఏడుపొచ్చిందని కొందరు బాధపడ్డారు వెరు హాస్యానికి అచ్చు, హల్లు వంటివాడు అని అల్లుని కొందరు కీర్తించారు, “విలనీలో విశిష్ట హాస్యం, హాస్యంలో నుండి విలనీ సాధించిన హాస్యనటుడు. ఓ అర్ధశతాబ్దిపాటు అప్రతిహతంగా తెలుగువారి లోగిళ్ళలో సరసమైన నవ్వుల పందిళ్ళు వేసి అలరించిన రామలింగయ్య వెయ్యికి పైగా చిత్రాలలో విభిన్న పాత్రలను వినూత్నరీతులలో పోషించి అల్లు మార్కు హాస్యంతో ఆంధ్ర ప్రేక్షకులను పొల్లుపోకుండా నవ్వించగలగడం ఆయనకే చెల్లు” అంటూ రావికొండలరావు అల్లుకు నివాళి సమర్పించాడు.

నవ్వుల బాబు రాజబాబు: ఒకరోజు రాజబాబు, ఆయన మిత్రులు కలసి కారులో మద్రాసుకు వెళ్తున్నారు. ఓ జోక్ చెప్పమని మిత్రులు రాజబాబును పదేపదే అడగడంతో ఆయన “చెప్తాను కానీ.... జాగ్రత్త.....సొరంగం రాబోతుంది.....అర్జంటుగా తలలు వంచుకోండి" అన్నాడు సీరియస్ గా. అంతే! అందరు బుద్దిగా తలలు వంచుకున్నారు..... కారులో కూర్చున్నామన్న సంగతి కూడా మరచిపోయి! -

రాజబాబు స్టైల్ అది. అందుకే ఆయన నవ్వుల రాజుగా పేరుగాంచాడు. కఠోర పరిశ్రమ, నిరంతర కృషి రాజబాబు సొంతం. డైలాగులకు పదును పెట్టి, నగిషీలు దిద్దడంలో ఆయన దిట్ట. డైలాగ్ డెలివరీలో గొప్ప టైమింగ్ ఆయన ప్రత్యేకం. దాంతో షూటింగ్ లో ఆయన నటనచూస్తూ సీనియర్ నటులే థ్రిల్ అయ్యేవారు.

తెలుగు పలుకుబడి మీద గొప్ప పట్టు సాధించిన నిత్యకృషీవలుడు రాజబాబు. 'ప్రేమ నగర్'లో రమాప్రభతో సరసాలాడుతూ ఉపయోగించిన గోదావరి యాస, 'ఇల్లు-ఇల్లాలు'లో 'వినరా సూరమ్మ కూతురు మొగుడా' అనే పాటమధ్య తనదైన శైలిలో “చెప్పుమలీ....తాతయ్య తకతయ్య” అంటూ ఇరికించిన విచిత్ర పదకూర్పులు, అష్టవంకర్లు తిరుగుతూ డైలాగులు ప్రత్యేక ఫక్కీలో చెప్పడంతో ప్రేక్షకలోకాన్ని... ఏదో లోకంలో... విహరింపజేసిన హాస్యమాంత్రికుడు ఆయన.

---

హాయిగా నవ్వడం, ఆనందించడం అంటే ఒక దానిని సరదాగా తీసివేయడమే. – వాల్కాట్

సినిమా రంగంలో కమెడియన్‌గా అలా అలా ఎదిగి ఆయన లేకుంటే సినిమా విజయం కష్టం అన్నంతగా పేరు తెచ్చుకున్నాడు. 'జీవన జ్యోతి' విజయానికి డైరెక్టరు, ఇతర టెక్నీషియన్ల పాత్ర 30 శాతం అయితే, రాజబాబు పాత్ర 70 శాతం అని ఆ సినిమా హీరో శోభన్‌బాబు కొనియాడడం గమనార్హం. ప్రఖ్యాత నటుడు ఎన్టీఆర్‌తో పోటీపడ్డాడు. 'నిండు మనసులు'లో ఆయనకెంత రెమ్యునరేషన్ ఇచ్చారో తనకూ అంతే ఇవ్వాలని డిమాండ్ చేసి మరీ తీసుకున్నాడు రాజబాబు. కొన్ని సినిమాల్లో ఆయన కొరకు ప్రత్యేకంగా పాటలు రాయడం ఇందుకు మరొక ఉదాహరణ. ఒక కమెడియన్ గా దాసరి చిత్రం 'తాత మనవడు'లోను, కె.వి.రెడ్డి 'పిచ్చోడి పెళ్ళి'లోను హీరోగా నటించడం కొసమెరుపు. సినీ రంగంలో అంతగా ఎదిగిన రాజ బాబు బాల్యం ఎలా గడిచిందో, ఆయన కష్టాల కడలిలోనుండి ఈదుకుంటూ ఎలా బయటకు వచ్చాడో చూద్దాం.

బాల్యంలోకి... తొమ్మిదిమంది సంతానంలో అప్పలరాజు ఒకడు. జననం నరసాపురంలో. “నువ్వు పుట్టాక ఆస్తి అంతా పోయిందిరా" అని బామ్మ అంటే, “చూస్తుండు బామ్మా. అంతకు వందలరెట్లు ఆస్తులు సంపాదిస్తా. వేలరెట్లు కీర్తి గడిస్తా" అని అప్పలరాజు అన్నప్పుడు ఆమె తన మనుమడులోని ఆకతాయితనం, పిల్లచేష్టలు చూచి ముక్కున వేలేసుకుని ఉండొచ్చుగాని, అతని ఆత్మవిశ్వాసాన్ని గుర్తించి ఉండకపోవచ్చు!

చిన్నప్పటి నుండి నాటకాలంటే అతనికి మహాపిచ్చి. అయితే, అతని తండ్రికి మాత్రం అవంటే పరమ అసహ్యం, మహా చిరాకు. దాంతో తండ్రికి తెలియకుండా వేషాలు వేయడం, చివాట్లు - అప్పుడప్పుడు దెబ్బలు - తినడం అతనికి అలవాటు అయింది. 'దొంగవీరుడు' నాటకంలో అప్పలరాజుకు మంచి పేరొచ్చింది.మరి నాటకాలతో పొట్టగడవదుగా?

టీచర్ ట్రైనింగ్ చేసి ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు. అ తరువాత మెడికల్ రిప్రజెంటేటివ్ అవతారం ఎత్తాడు. దాంతో కొంచెం ఆదాయం పెరిగింది. “జీవితంలో కొద్దిగా స్థిరపడ్డా” అనుకుంటూ నాటకాలు వెయ్యడం మరలా ఆరంభించాడు. నటుడుగా కొంత పేరు గడించాడు. ఆ తర్వాత సినిమాలో చేరడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు. చిట్టిబాబు సాయంతో మద్రాసు చేరాడు. మద్రాసులో పాండి బజారులో సినిమా కంపెనీల వెంట, దర్శకుల చుట్టూ రోజుల తరబడి ఎక్కేగడప, దిగేగడప అన్నట్లుగా విసుగులేకుండా సంచరించాడు. ఆర్థికంగా నరకం అనుభవించాడు. రోజుకొక పూట టిఫిన్తో నెలలో 15 రోజులు గడిపాడు! అయినా పట్టువీడలేదు, ఆశను చావనివ్వలేదు.

---

శ్లేష అనేది హాస్యంలో అధమ రూపం అని చెప్పినవారికి పద్యం అంటే పాట అని గుర్తు చేయండి. –బాబ్ డేవిస్

విజయపథం: ఒకరోజు ప్రఖ్యాత దర్శకుడు కె.వి.రెడ్డి తన నాటకం చూచి మెచ్చుకున్నట్లుగా తెలుసుకున్నాడు. అంతే. సినిమాలో తనకొక అవకాశం కల్పించమని దర్శకుని చుట్టూ తిరిగాడు. చివరకు 'సత్యహరిశ్చంద్ర'లో కాలకౌశికుని పాత్ర వేశాడు. అలానే రేలంగి చిత్రం 'సమాజం'లో అవకాశం లభించింది. నాటి నుండి క్రమంగా ఎదిగాడు. ఎంత ఎదిగినా తాను మద్రాసు చేరడానికి చిట్టిబాబు అందించిన సాయాన్ని మాత్రం ఆయన ఏనాడు మరువలేదు. “ఆయన సాయమే లేకుంటే సినిమా రంగంలో అడుగు పెట్టలేను” అని చెబుతుండేవాడు అప్పలరాజు, కృతజ్ఞతా పూర్వకంగా తన పేరుకు 'బాబు' తగిలించాడు. అలా రాజబాబు అయ్యాడు.

ఆ తర్వాత రాజబాబుని అదృష్టం వరించింది. ఆయన ఏది చేస్తే అదే కామెడీగా చలామణి అయింది. అలా ఏకంగా 13 సంవత్సరాలు సినీ రంగాన్ని ఏలాడు. ఒక సంవత్సరంలో 32 సినిమాల్లో కాల్షీట్లు వచ్చాయంటే ఆయన స్థానం అర్థం అవుతుంది! హిందీపాట 'హమ్ తుమ్ ఏక్ కమ్ రేమే బంద్ హో'కి పేరడిచేసి 'మంగమ్మా నువ్వు ఉతుకుతుంటే అందం'గా మార్చి, అద్భుతంగా నటించాడు. దాని మూలంగానే ఆ సినిమా వందరోజులు ఆడిందని చెబుతారు. కె.వి.రెడ్డి గారి చిత్రం 'పిచ్చోడి పెళ్ళి'లో నటించినందుకు రాజబాబు ఒక లక్ష తీసుకున్నాడు. దక్షిణ భారతంలో లక్ష తీసుకున్న కమేడియన్ ఆనాడు లేడంటే ఆ నటుని గొప్పతనం అర్థం అవుతుంది కదూ!

మొత్తం 185 చిత్రాలలో నటించిన రాజబాబు నిర్మాతగా మాత్రం అంతగా రాణించలేకపోయాడు. ఆయన మొదటి చిత్రం 'ఎవరికి వారే యమునాతీరే' హిట్ అయితే, తదుపరి చిత్రం 'మనిషి రోడ్డున పడ్డాడు' అక్షరాలా అతనినే రోడ్డుమీదకు ఈడ్చినంత పనిచేసింది. సమాజ సేవ : ఓ నటుడిగా ప్రేక్షకులను నవ్విస్తూ కవ్వించడం ఆయన వృత్తి అయితే, బాధల్లో ఉన్నవారికి అండగా నిలబడడం రాజబాబు ప్రవృత్తి అయింది. తన జన్మదినం అక్టోబరు 20న మద్రాసులోని వాణీమహల్ లో డ్రామాల పోటీలు నిర్వహించడం, గొప్పనటులను సన్మానించడం, కళాకారులను సత్కరించడం ఆయనకు అలవాటుగా మారింది. అలానే, ఎందరినో చదివించాడు. ఎందరికో వైద్యం చేయించాడు. మద్రాసులో వరదలు వచ్చినప్పుడు వేలాదిమందికి రోజులు తరబడి అన్నదానం చేసిన ఆదర్శ నీయుడు రాజబాబు. అన్ని స్టూడియోలలో పనిచేసే లైట్‌బాయ్స్ కి ప్రతి దీపావళికి బట్టలు, భోజనం పెట్టడం ఆయనకు మహాఇష్టం.

---

మరణం ఎప్పుడూ మనతో ఉంటుంది కనుక దానితో జీవించు. దానిని చూసి నవ్వడం నేర్చుకో. – డా॥ రాబర్ట్ లిట్ మన్

సంపద, కీర్తి పెరిగే కొద్దీ దురదృష్ట వశాత్తు రాజబాబుకు ఆరోగ్యం క్షీణించ సాగింది. దానికి ప్రధాన కారణం అతను తాగుడుకు బానిస అవడమే! 1982లో త్రోట్ కాన్సర్ వచ్చింది. ఆసరేషన్ జరిగినా ఫలితం కన్పించలేదు. కొన్ని రోజుల తర్వాత గొంతు పోయింది. క్రమంగా ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. చివరి ఘడియల్లో రాజబాబుకు మరణమృదంగం ముందుగా విన్పించిందేమో! ప్రాణం వదలబోయే ముందు చేతికి కట్టిన సెలైన్ బాటిల్ కనెక్షనను అవతలకు తోశాడు. చక్కగా బట్టలు వేసుకుని నుదుట బొట్టు పెట్టుకున్నాడు. అమ్మ కాళ్ళకు మూడు పర్యాయాలు దణ్ణం పెట్టి, ప్రాణం వదిలాడు. హాస్యం ఉన్నంతకాలం రాజబాబు ఉంటాడు. కామెడీకి గుర్తింపు, గౌరవం దక్కినంతకాలం ఆయన చిరంజీవిగా జీవిస్తాడు.

మ్యాజిక్ రెడ్డి : హాస్యపాత్ర పోషణలో రమణారెడ్డి స్టైలే వేరు. సన్నగా గడకర్రలా ఉండే ఆయన నటనలో ఒక ప్రత్యేకత కన్పిస్తుంది. పదాలను ఉచ్చరించడంలో, వాటిని విరచడంలో ఆయనకు ఆయనే సాటి. అమాయకత్వాన్ని నటించడంలోను, హాస్యాన్ని పండించడంలోను ఆయన ఒక ఒరవడిని సృష్టించాడు. వెండితెరపై తన నటనతో తెలుగు ప్రేక్షకులను హిప్నటైజ్ చేసి సెహభాష్ రమణారెడ్డి అనిపించుకున్నాడు. రమణారెడ్డి కాదు, నటనా రెడ్డిగా కీర్తిగడించాడు. హాస్యకారులు హాస్యోక్తులు పండించడంలో భిన్న మార్గాలు పాటిస్తారు. వీరిలో అధిక సంఖ్యాకులు పద్మనాభంలాంటివారు. వీరు తాము నవ్వుతూ ఇతరులను నవ్విస్తే, రేలంగి, రమణారెడ్డి మొదలైనవారు ఇతరులను నవ్విస్తారే కాని, తాము మాత్రం నవ్వరు.

గిన్నీస్ బుక్ కెక్కిన బ్రహ్మానందం : అదేం చిత్రమోకానీ ఆయన పేరులోనే ఆనందం ఉంది. బ్రహ్మానందం ఉంది. ఆ ఆనందాన్ని తన పేరులో ఇముడ్చుకోవడమే గాక, దానిని పదిమందికీ పంచి పెట్టే ప్రక్రియలో సిద్ధహస్తుడుగా పేరుగాంచుతాడనే కాబోలు ఆయనకు తల్లిదండ్రులు ఆ పేరు పెట్టారు! ఫిబ్రవరి 1వ తేదీ 1956లో గుంటూరు జిల్లా ముప్పాళ్ళ గ్రామంలో జన్మించిన ఆయన అతి కష్టం మీద చదువు సాగించాడు. గుంటూరులో పి.జి. చేసి, 1975లో అత్తిలి కళాశాలలో లెక్చరర్‌గా చేరాడు. లెక్చరర్ గా చేస్తూనే మిమిక్రీ ప్రదర్శనలు ఇచ్చాడు. ఆ ప్రదర్శనలే అతనిని జంధ్యాలకు పరిచయం చేశాయి. ప్రథమంగా 'శ్రీ తాతావతారం' ఆతరువాత జంధ్యాల నిర్మించిన 'సత్యాగ్రహం' సినిమాల ద్వారా సినీరంగానికి పరిచయం అయ్యాడు.'అహనా పెళ్ళంట'లో అరగుండుగా, 'అనగనగా ఒక రోజు'లో మైఖేల్ జాక్సన్‌గా, పట్టుకోండి చూద్దాం'లో కత్తిరాందాసుగా, 'జంబలకిడిపంబ'లో

స్వర్గంలో నవ్వడానికి అనుమతించకపోతే, అక్కడకు వెళ్ళడానికే నాకు ఇష్టంలేదు.—మార్టిన్ లూథర్

కాన్సునొప్పులతో కడుపుబ్బ నవ్వించినవాడిగా మంచి పేరు గడించాడు. 'చిత్రం భళారే విచిత్రం'తో గొప్ప ఆర్టిస్ట్ గా రాణించిన ఆయన 'వినోదం'లో అస్సలు మాటలే లేని పాత్ర ధరించి తన విశిష్టతను చాటుకున్నాడు. 'అతడే ఒక సైన్యం'లో హాస్యానికి ఒక కొత్త ఒరవడిని ఇచ్చిన మేటి. చేతులు, కాళ్ళు కట్టివేస్తే కళ్ళతోనే కామెడీని పలికించగల నేర్పరి అనిపించుకున్నాడు. కుంటివాడిగా ('లారీ డ్రైవర్'), గుడ్డివాడిగా ('వన్ బై టూ'), మూగవాడిగా ('ఊయల'), నత్తివాడిగా ('అహనా పెళ్ళంట') నటించిన చిత్రాలు తనకు ప్రత్యేక గుర్తింపు తెచ్చాయని ఆనందించే బ్రహ్మానందం ఇప్పటిదాకాసుమారు 800 సినిమాల్లో నటించి, రాణించాడు. 5 నంది అవార్డులతో బాటు నాగార్జున విశ్వవిద్యాలయం నుండి గౌరవ డాక్టరేట్ పొందాడు. గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సుకెక్కి హాస్యనటుల కీర్తిని సమున్నత శిఖరాలకు చేరవేశాడు. చార్లీ చాప్లిన్ ప్రపంచ ప్రఖ్యాతి పొందడానికి కారణం ఆయన కామెడీకి లాంగ్వేజి లేకపోవడమే అంటాడు బ్రహ్మానందం. పెదవి విప్పకుండానే ఫక్కున నవ్వించగల నవ్వుల రారాజు బ్రహ్మానందం దృష్టిలో “సంభాషణోచిత హాస్యం, సందర్భోచిత హాస్యం, హావభావయుత హాస్యం - ఇవన్నీ కలిసిందే అత్యుత్తమ హాస్యం” అవుతుంది.

బ్రహ్మానందం స్వతస్సిద్ధంగా మంచి హాస్యప్రియుడు. అది తనికెళ్ళ భరణి వ్రాసిన పరికిణీ' కవితల పుస్తకం ఆవిష్కరణ సభలో. బ్రహ్మానందం ప్రసంగాన్ని అందరూ ఎంతగానో మెచ్చుకున్నారు. “పుస్తకం వ్రాసిన నాకన్నా, ప్రసంగించిన నీకే. ఎక్కువ పేరొచ్చింది” అని భరణి కొనియాడగా, “సబ్బుకంటే నురగ అందంగా ఉండొచ్చు. కాని, సబ్బు లేనిదే నురగ లేదు కదా” అన్నాడు బ్రహ్మానందం నమ్రతతో.

ఆయన మంచి చిత్రకారుడుకూడా. ఆయనకు ప్రాక్టికల్ జోక్స్ అంటే మహా ఇష్టం. ఇప్పుడు ఆయనకు నచ్చిన హాస్యోక్తులలో ఒకటి వింటారా? శ్రీశ్రీ కవితలు చదివిన ఒక మేధావి ఆయనతో “ఈ పాటి కవిత్వం నేనూ వ్రాయగలను” అనగా, అందుకు శ్రీశ్రీ “నేను వ్రాసేది నీలాంటివాడితో కవిత్వం వ్రాయించడానికే” అన్నారట! సెల్‌ఫోన్లో కూడా నవ్వించగల నేర్పరి ఆయన. అన్నట్లు ఆయనకు ఎవరైనా ఫోన్ చేస్తే “అరే నీకేరా ఫోను, అరే నీకేరా ఫోను, అరే.... బ్రహ్మానందం నీకేరా ఫోను” అంటూ వాయిస్ పెరుగుతూ వినిపిస్తుంది. విచిత్రమేమంటే, ఆ ఫోన్లో వినిపించే వాయిస్ కూడా బ్రహ్మానందందే!

నవ్వుల డాక్టర్ రాజేంద్రప్రసాద్:"నీ శక్తిని నువ్వు అనుమానిస్తే నీ అనుమానానికి నువ్వు శక్తినిచ్చినట్లే” అన్న ఆల్ ఫ్రెడ్ కోర్టిస్కీ మాటలు గుర్తుకొస్తాయి రాజేంద్రప్రసాద్ నటనా

జీవితాన్ని చూస్తుంటే. కృష్ణాజిల్లా నిమ్మకూరులో 1956లో జన్మించాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఇంజనీరింగ్ పట్టా పుచ్చుకున్నప్పటికీ, నటుడి గానే జీవితాన్ని కొనసాగించదలచాడు. ఆంధ్రులు గర్వించదగిన గొప్ప కమెడియన్ స్థాయికి ఎదిగిన రాజేంద్రప్రసాద్ హాస్యశాస్త్రం గురించి చక్కని అధ్యయనం చేశాడు. మహానటి సావిత్రి తన హావభావాలను ముఖంలో ప్రత్యేకంగా పెదాలతో ప్రదర్శించినట్లే, రాజేంద్రప్రసాద్ చిక్కని చక్కని హాస్యాన్ని ముఖ్యంగా ముఖంద్వారానే ప్రదర్శించ బూనడం ఆయన నటనా వైశిష్ట్యానికి మచ్చుతునక. అల్లు రామలింగయ్య అవార్డు (2007) అందజేసే సందర్భంగా మెగాస్టార్ చిరంజీవి "ఆరోగ్యకర హాస్యంకు ప్రతీక రాజేంద్రప్రసాద్" అని అవార్డు గ్రహీతను కొనియాడటం గమనార్హం. ఆయన కామెడీలో ఒక బ్యాలెన్స్ కన్పిస్తుంది. దాని వెనుక ఎంతో అధ్యయనం జరుగుతుంది కనుకనే ఆయన నటనలో ఎప్పటికప్పుడు నూతనత్వం కొట్టొచ్చినట్లు ఉట్టిపడుతుంది.

స్నేహం (1956)తో ప్రారంభమైన ఆయన నటజీవితంలో తనదంటూ ముద్రవేసిన అనేక చక్కని చిత్రాలు కన్పిస్తాయి. “ప్రతి సినిమాలో ఒక భిన్నత్వం చూపడమే నా క్రీడ” అన్న ఆయన పలుకుల నుండి యదార్థం తొంగి చూస్తుంది. నవ్వించడం ఒక కళ అయితే, తాను నవ్వకుండా ప్రేక్షకులను నవ్వించగలగడం ఒక అదృష్టంకాగా, తాను నవ్వుతూ ఇతరులను ఏడ్పించగలగడం ఓ గొప్పవరం అవుతుంది. అందుకే ఆయన 'Laughter Doctor'గా పేరొందాడు. నంది అవార్డులతో పాటు ఫిలింఫేర్ అవార్డు, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి గౌరవ డాక్టరేట్ పొందిన రాజేంద్రప్రసాద్ నటచక్రవర్తి, నటకీర్తి, రాష్ట్ర హాస్యపతి, ఆంధ్ర చార్లీ చాప్లిన్ లాంటి ప్రశంసలు పొందాడు. 'లేడీస్ టైలర్' (1985)తో తన అసలైన హాస్యజీవితం ప్రారంభించిన రాజేంద్రప్రసాద్ 23 సంవత్సరాల సుదీర్ఘ నటనా జీవితంలో ఎన్నో అద్భుత పాత్రలు ధరించాడు; ఎన్నెన్నో విజయపరంపరలు సాధించాడు. మేడమ్, రాంబంటు చిత్రాల నిర్మాణం ద్వారా మంచి పేరొచ్చినా, అంతకన్నా అధికంగా నష్టం కూడా వచ్చిందని చమత్కరిస్తాడు ఆయన. హాస్యనటుడుగా రంగప్రవేశం చేసిన రాజేంద్రప్రసాద్ పరిణతి చెందిన హీరోగా నిలబడటం ఆయన నటనా జీవితంలో ఒక మైలురాయి. 'ఆ నలుగురు', 'మీ శ్రేయోభిలాషి' లాంటి చిత్రాలలో రాజేంద్రప్రసాద్ నటన మరింత ఉన్నత శిఖరాలను అందుకోవడం స్వాగతించదగిన విషయం.

ఆలీ : “హాస్యనటులు ఎవరూ ఇతరులకు బోర్ కొట్టించరని, అలాంటి చలాకీ నటులం మేము” అని ఆలీ సగర్వంగా చెప్పుకున్నాడు. “ఇడ్లీ పాత్ర మినహా అన్ని రకాల

---

పాత్రలూ చేశాను" అనడంలోనే ఆలీ మార్కు హాస్యం కన్పిస్తుంది". 650కి పైగా చిత్రాలలో నటించిన ఆలీ తన నటనతో హాస్యాన్ని చెరిగాడు. కమెడియన్ ఒక హీరోగా ఎదగగలడని నిరూపించాడు. తన అభిమాన హాస్యనటుడు బ్రహ్మానందం అని ఆనందంగా చెబుతాడు ఆలీ. రేలంగి పేల్చిన 'జంబలకిడి పంబ' సూపర్ హిట్ అయినట్లే, ఆలీ ప్రయోగించిన "అక్కుంబక్కుం ", "ఎందచేట" పదాలు అందరినీ అమితంగా ఆకర్షించాయి. "వివిధ ప్రాంతాలలోని జనం వాడే పదాలను తీసుకొని వాటికి రంగులు పూసి, పాలిష్ కొట్టి మరల వాటిని జనాల పైకి వదవి రక్తికట్టించడంలోనే కమెడియన్ ప్రత్యేకత ఇమిడి ఉంది. అలానే ఏదైనా ఇతరభాషకు సంబంధించిన పదాన్ని ఊతపదంగా చెప్పామను కోండి....ఆలీగా దేదో కొత్త పదం చెప్పాడని నవ్వుకుంటారు జనం" అంటూ నవ్వుతాడు ఆలీ.

ఇటీవల కాలంలో హాస్యనటులు హీరో పాత్రలు ధరిస్తూ విజయఢంకా మోగించడం శుభపరిణామం. అలానే, 'గజిబిజి'లో హాస్యనటులంతా చేరి. సందడేసం దడి' చేయడం తెలుగు సినీ లోకంలో మరొక మంచి మలుపు. 1970లో అప్పలాచార్య వినిపించిన "వినరా సూరమ్మ కూతురు మొగుడా విషయము చెబుతాను" అన్న పాట ఆద్యంతం హాస్యం, చమత్కారం, సస్పెన్స్ తో కూడి ఉండటం తెలుగు సినీలోకానికే గర్వకారణం. ఇంక వ్యంగ్య చిత్రాలు చూస్తూ నవ్వుకుందామా!

---

బహిరంగంగా నీవు తల గోక్కొనకూడదని సమాజం ఆదేశించినప్పుడు, అది నీకు బహిరంగంగా బాధను కల్గిస్తే హాస్యం జనిస్తుంది. – ఫాదర్ టాం వాల్ష్

అధ్యాయం 31

# వ్యంగ్య చిత్రాలు : కళారూపాలు

కనుముక్కు తీరు సక్రమంగా ఉంటే చిత్రం, అది వక్రంగా ఉంటే కార్టూన్ అంటారు చిత్రకారులు. ఆంగ్లంలోని కార్టూన్ పదానికి తెలుగులో హాస్య చిత్రం, వ్యంగ్య చిత్రం అని అర్థం. పూర్వకాలంలో ఒక వ్యక్తి చిత్తరువునుగాని, ఒక వస్తువు రూపాన్నిగాని ద్విగుణీకృతం చేసిన బొమ్మను కార్టూన్ లేదా వ్యంగ్య చిత్రం అనేవారు. అయితే, గంభీరమైన విషయాన్ని తీసుకొని గేలి చేసేదానిని వ్యంగ్య చిత్రంగా ఈనాడు భావిస్తున్నారు.

ఒక భారీకాయునికి తన బరువు తెలుసుకోవాలని అనిపించింది. రైల్వే స్టేషన్లోని వెయింగ్ మిషన్ ఎక్కి, ఓ రూపాయి నాణెం వేశాడు. చక్రం గిర్రున తిరిగి ఆగిపోయింది. ...... రయ్ మంటూ వచ్చిన కార్డును తీసుకున్నాడు. “ఒకరి తర్వాత మరొకరు ఎక్కండి సార్. ఒకేసారి ఇంతమందా? ఆయ్!” అని దాని మీద ఉన్నదానిని చదివి అవాక్కయ్యా డు. కార్టూన్లలో హాస్యంతోపాటు ఒక సందేశం ఉంటుంది. హెచ్చరికతోపాటు వ్యంగ్యం ఉంటుంది. అదే కార్టూనిజం. .

మత సంస్కరణకు పూనుకున్న మార్టిన్ లూథర్ లార్డ్ జీసస్ బోధనలకు భిన్నంగా నాటి కేథలిక్ చర్చి స్వార్థంతో పనిచేయడాన్ని నిరసిస్తూ, మధ్యతరగతి ప్రజానీకాన్ని చైతన్యవంతులను గావించడానికి ప్రవేశపెట్టిన పోస్టర్లు, కరపత్రాలతో వ్యంగ్య చిత్రాలు - పేషనల్ క్రిస్టీ అండ్ యాంటీ క్రిస్టీ అనే రెండు కార్టూన్లు - ప్రారంభమయ్యాయని తెలుస్తుంది. పాప పరిహార పత్రాలపై పోప్ ఏదో వ్రాస్తూ ప్రజలనుండి డబ్బు తీసుకుం టున్న చిత్రాలు అవి. చిత్రకారుడు లూకాస్ రూపొందించిన ఆ చిత్రాలు మార్టిన్ లూథర్ ఉద్యమాన్ని ప్రజలలోకి సులువుగా తీసుకువెళ్ళాయి. ఆ నిరసన ఉద్యమం క్రమంగా క్రైస్తవాన్ని రెండుగా చీల్చి ప్రొటెస్టెంట్ శాఖ ఆవిర్భావానికి కారణమైంది.

“కలసి ఉంటే కలదు సుఖం; విడిపోతే మరణం తథ్యం”. అమెరికాలోని భిన్న ప్రాంతాలు కలసి జీవించాలని పాల్ రివెరి 1754 మే 9వ తేదీన పెన్సిల్వేనియా గజెట్లో "Join or Die" శీర్షికతో ప్రచురించిన కార్టూన్ అమెరికా దేశపు ప్రథమ రాజకీయ కార్టూన్. ముక్కలైన పాము భాగాలను కలిపితే అది తిరిగి జీవిస్తుందన్న నాటి ప్రజల విశ్వాసానికి చేరువగా ఆ కార్టూనిస్ట్ తన మనోగతాన్ని హృద్యమంగా వివరించాడు. ప్రజలను అమితంగా

---

హాస్యము కళ్ళెం లేని గుఱ్ఱంలాంటిది. కొన్ని సమయాలలో స్నేహితుణ్ణి మరికొన్ని సమయాలలో దాని యజమానిని తన్న గల ప్రమాధకారి అది. – జార్జ్ హెర్బర్ట్

ఆకర్షించిన ఆ చిత్రం ఉత్తర, దక్షిణ అమెరికాలను కలిపి ఉంచడంలో ఎంతగానో సాయపడిందని అబ్రహాం లింకన్ కొనియాడాడు.

పుట్టుపూర్వోత్తరాలు : ఇటలీ భాషలోని 'కార్టోన్' (Cartone), డచలోని 'కార్టన్' (Karton)లు ఆంగ్లపదం 'కార్టూన్'కు మూలం. కార్టూన్ అంటే మందమైన గట్టి కాగితం అని అర్థం. మొద్దు కాగితం పై చిత్రం గీయడం ద్వారా ఆ తరువాత గీసే చిత్రాలకు అది ఆధారంగా ఉంటుందని ప్రజల విశ్వాసం. ప్రముఖ చిత్రకారుడు లియొనార్డొడావిన్సీని ఈ చిత్రాలకు మూలపురుషుడిగా పేర్కొంటారు. క్రమంగా కార్టూన్ కళ బాగా వ్యాప్తి చెందింది. బ్రిటన్‌కు చెందిన 'పంచ్' పత్రిక ప్రథమంగా (1843లో) రాజకీయ కార్టూన్లు ప్రచురించింది. అమెరికాకు చెందిన కార్టూనిస్ట్ పీటర్ ఆర్నో కార్టూన్లకు మూలపురుషుడిగా పేరొందాడు. స్టూఆర్ట్ బ్లాక్స్టన్ 1906లో యానిమేషన్ చిత్రానికి రూపకల్పన చేయగా, పిజ్జర్ దానిని మరింత అభివృద్ధిపరచాడు. వాల్ట్ డిస్నీ టాకీ చిత్రం విల్లీ ప్రదర్శనతో - మిక్కీ మౌస్ ప్రవేశంతో - కార్టూన్ చిత్రాలు ప్రపంచ వ్యాప్తంగా ప్రజాదరణ పొందాయి.

చక్కని కార్టూన్లు గీయడం ఒక గొప్ప కళ, అదొక వరం. ఎందరో కళాకారుల సమూహంలాంటివాడు కార్టూనిస్ట్. వ్యంగ్య చిత్రకారునిలో విమర్శకుడు, ఫొటోగ్రాఫర్, నటుడు, మేకప్ మాన్, చిత్రకారుడు, రచయిత సమ్మిళితమై ఉంటారు. కత్తికన్నా కలం పదునైనదంటారు. నిజానికి కలం పోటుకన్నా కుంచెవేటు ఘాటైనది. నిర్దేశించిన వ్యక్తి అంతరంగంలో గాయాన్ని, ఇతరులకు హాస్యాన్ని పంచుతుంది కార్టూన్. "నవ్వలేని వాడు 'నాలిముచ్చు' కింద జమ. కొంపలార్పేతనానికి మచ్చుతునక" (నెడ్ బెర్క్). అందుకే నియంతలు సైతం తమపై వచ్చిన కార్టును చూసి విలవిలలాడతారు. రెండవ ప్రపంచయుద్ధకాలంలో డేవిడ్ లో కార్టూన్లకు తట్టుకోలేక గిలగిలలాడిన హిట్లర్ ఆక్రోశంతో అతనిని పట్టుకొన్నవానికి ఒక మిలియన్ జర్మన్ మార్కులు బహుమతిగా ఇస్తానన్నాడట!

సమాజంలోని మూఢాచారాలను, పాలకులలోని అవినీతిని వాడియైన రంపంతో వడివడిగా నిట్టనిలువునా కోస్తూనే అందరినీ అందంగా నవ్వించగల అరుదైన ఆర్టిస్ట్ కార్టూనిస్ట్. “నిజమైన కార్టూనిస్ట్ హాస్యాన్ని మాత్రమే సృష్టించడు. ఆయన ఒక సంఘటన యొక్క అంతరార్థాన్ని గ్రహించి తన అమోఘ శక్తితో ఇతరులను ఆకర్షిస్తాడు” అన్నారు జవహర్‌లాల్ నెహ్రూ. వ్యక్తినిగాక, అతని విధానాలలోని లోపాలను సామాన్యంగా సుతిమెత్తగా, అవసరమైతే ఘాటుగా హేళన చేయడానికి పూనుకునే కార్టూనిస్టు అహింసాయుత పోరాటవాదిగా అభివర్ణించవచ్చు. అందరినీ అలరించే విషయం,

---

నవ్వులు చిందించే గృహం దుఃఖపూరిత జీవితానికి నిలయం. – యంగ్ & రోసిన్

ఆలోచనాత్మక వ్యాఖ్యానం, ఆకర్షణీయమైన చిత్రం - ఈ త్రిగుణాల సమ్మేళనమే కార్టూన్‌ను రసరమ్య చిత్రంగా, భావనాత్మక హరివిల్లులా తీర్చిదిద్దుతుంది. కవి అందమైన అక్షరాలతో అరుదైన అద్భుతాలు సృష్టిస్తే, కార్టూనిస్ట్ వయ్యారపు గీతలతో, ఆలోచనాత్మక వ్యాఖ్యతో హాస్యానికి జీవంపోసి పాఠకుల హృదయాలలో గిలిగింతలు పెడతాడు. సమాజంలోని లోపాలను తనదైన శైలిలో ఎత్తిచూపుతూ, దాని కారకులకు సుతిమెత్తగా చురకలు వేస్తూ పత్రికల పేజీలకు చిరునవ్వులు దిద్దే చిత్రకారుడు కార్టూనిస్ట్. చిన్న, సన్నని గీతల క్రింద చిట్టిపొట్టి వాక్యాలతో సామాన్య పాఠకుణ్ణి సైతం ఆలోచింపజేసే, ఆనందపరచే అరుదైన రూపశిల్పి కార్టూనిస్ట్.

కవ్వింపులకు, నవ్వింపులకు, పులకరింతలకు, పలకరింపులకు దర్పణాలు కార్టూన్లు. వ్యంగ్యం, విమర్శ, హాస్యం సమపాళ్ళలో చోటుచేసుకోవడం దాని ప్రత్యేకత. జాతి, మత, కుల, భాష, వర్గాలకు అతీతమైన కార్టూన్ కళ విశ్వవ్యాప్త కళ. కవితా లోకంలోని ప్రయోగాలు కొందరు మేధావులకు, కవులకు మాత్రమే పరిమితంకాగా, కార్టూన్ లోకంలోని ప్రయోగాలు అసామాన్యుని నుండి అతి సామాన్యునిదాకా ప్రభావితం చేస్తాయి, అలరిస్తాయి. అది కొందరిని నవ్విస్తే, మరికొందరిని కవ్విస్తుంది. అందుకే కార్టూన్ జనసామాన్యంలోకి చేరింది.

దేశవిదేశాలలో కార్టూన్ పత్రికలు : పాఠకుల హృదయాలను కేరింతలతో పులకరింపజేసేవాడు కార్టూనిస్ట్. వ్యంగ్య చిత్రాలలో వ్యక్తులుగాక, బొమ్మలు నటించడం ఒక ప్రత్యేకత, అమూర్త భావాలకు మూర్త రూపాలు కట్టగల దిట్ట కార్టూనిస్టు. 19,20 శతాబ్దాలలో పారిస్ నుండి 'చెరివరి', లండన్ నుండి. 'పంచ్', అమెరికా నుండి 'ది లైఫ్', 'ది జడ్జ్' పత్రికలు వ్యంగ్య చిత్రాలకోసమే ప్రచురింపబడ్డాయి. ఆ తరువాత దిన, వార, పక్ష, మాస పత్రికలు కూడా వాటికి ప్రాముఖ్యాన్నివ్వడంతో వ్యంగ్య చిత్రాలు బహుళ ప్రజాదరణ పొందిన కళగా రూపొందాయి. 1902లో రిచర్డ్ ఔట్‌కాల్టె 'బస్టర్ బ్రౌన్' అనే వ్యంగ్య చిత్రకథను, ఒక దశాబ్దం తరువాత 'Bringing of Father' అనే మరొక కథను ప్రచురించడంతో ఆయన పేరు ప్రపంచవ్యాప్తంగా మారుమ్రోగింది. ప్రపంచంలోని అతి పెద్ద వ్యంగ్య చిత్రం- 11 మీటర్ల ఎత్తు, 9 మీటర్ల వెడల్పుగల - న్యూయార్క్ లోని యు.ఎస్.ఎ. బిల్డింగ్ లో ఉంది. వాల్టర్ ఎలిస్ డిస్నీ తన మిక్కీ మౌస్, డొనాల్డ్ డక్ చిత్రాల ద్వారా ప్రపంచ ఖ్యాతినార్జించిన సంగతి అందరకు తెలిసిందే. జోసెఫ్ కెప్లర్ పత్రిక 'పక్' మూలంగా జర్మనీ, ఇటలీలలో కార్టూన్ కళ వ్యాప్తి చెందింది.

---

జబ్బుతో బాధపడుతున్న పాప నవ్వగలిగితే, సగం స్వస్థత చేకూరినట్లే.— జి.డబ్ల్యు. వాలంటైన్

కార్టూన్ ప్రదర్శనలను ఐరోపా, జపాన్లలో తరచు నిర్వహిస్తారు. మన దేశంలో 2000 సంవత్సరంలో ప్రథమంగా అంతర్జాతీయ కార్టూన్ పోటీ జరిగింది. 2002లో 'నీరు' అంశం పైన, మరు సంవత్సరం మహిళల సమస్యల పైన, 2005లో సైబర్ హ్యూమర్ పైన ప్రదర్శనలు జరగడం వ్యంగ్య చిత్రాల వ్యాప్తికి ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చు.

భారతదేశంలో మొదటి పొలిటికల్ కార్టూన్ 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికలో వచ్చిందని చెబుతారు. తెలుగు వార్తాపత్రికలలో 'తెలుగు స్వతంత్ర'లో అవి మొదటిసారిగా చోటుచేసుకున్నాయి. మొదట్లో ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, విశాలాంధ్ర పత్రికలు ఆంగ్ల పత్రికలలోని కార్టూన్లను తెలుగు సంభాషణలతో ప్రచురించేవి. ఆ తరువాత 1955 ప్రాంతంలో వాసు, రాంభట్ల, టి.వి. కార్టూన్లు దినపత్రికలలో చోటుచేసుకున్నాయి. పొలిటికల్ కార్టూనిస్టులుగా మోహన్, శ్రీధర్లు ప్రత్యేక స్థానాలు పొందారు. తెలుగు పత్రికలలో మొదటి పేజీలోనే కార్టూన్లు ప్రచురించడం ఒక విశేషం.

మూలపురుషుడు తలిశెట్టి : 1990 నాటికే కార్టూన్ (వ్యంగ్య చిత్రం) షష్టిపూర్తి చేసుకుంది. కార్టూన్ కళా పితామహుడు తలిశెట్టి రామారావు అంటాడు హెచ్.రమేష్ బాబు'. చదువు పైగల ఆసక్తితో, 'లా' చదివాడు. న్యాయవాదిగా ఎదిగాడు. నెమ్మదిగా బొమ్మలు గీయడం నేర్చుకున్నాడు. ఆ తరువాత ఆ బొమ్మలకు మాటలు కలిపాడు. అలా తెలుగులో కార్టూన్ శకం ప్రారంభమైంది.

నవ్వించడంతోపాటు గిలిగింతలు పెట్టడం, గురి చూసి గట్టిగా మొట్టగలగడం ఆయన ప్రత్యేకతలు. ఆయన గీసిన అతిలోక సుందరికి చంద్రబింబం లాంటి గుండ్రని ముఖం, దొండపండులాంటి పెదవులు, నడుము స్థానంలో తామర తూడు, కళ్ళకు బదులు చేపలు, మెడకు బదులు శంఖం గీసి కవులు ఊహించిన కావ్యసుందరిని ఆచరణలో హాస్యసుందరిగా సాక్షాత్క రింపజేశాడు. అలక్ష్యంగా గీసినట్లుండే లక్ష్యసిద్ధిగల పొదు పైన రేఖలు కొసరి కొసరి నవ్వులు వర్షిస్తాయి అంటారు శ్రీరమణ. భావ, శబ్ద, అర్థ, చేష్టాగత హాస్యాన్ని వేళాకోళం, వెక్కిరింతకు ఉపయోగించడమేగాక, బ్యాలెస్క్ పేరడీ, లీకాక్ వంటి హాస్య ప్రక్రియలను తన కార్టూన్లలో చవిచూపించాడు తలిశెట్టి రామారావు.

ఇంక బాపు ప్రపంచం: ఆంధ్ర ప్రజలను కార్టూన్ ఇష్టులుగా, కొందరిని కార్టూనిస్టులుగా తీర్చిదిద్దిన ఘనత బాపుకే దక్కుతుందని ఒక రచయిత చమత్కరించాడు. కార్టూన్ కళకు జనసామాన్యంలో ఒక గుర్తింపు, గౌరవం తెచ్చి, దానికి ఒక ఒరవడిని, శైలిని ఇస్తూ, దానికొక అందమైన శీర్షికను జోడించి హాస్యరసంలో ముంచెత్తిన మేటి బాపు. గీతల్లో

---

పొదుపు + మాటల పై అదుపు = ఒక రసస్ఫూర్తి కలిగించే చిత్రం. దటీజ్ బాపు! "సాధారణంగా పెయింటర్స్ పెయింటింగ్ లోనే ఉంటారు. రేఖా చిత్రకారులు, కార్టూన్ కళాకారులు వారి వారి ప్రత్యేక ప్రపంచాలలోనే ఉండి ప్రసిద్ధులవుతూ ఉంటారు. అన్ని ద్వారాలు తెరచి, అన్ని లోకాలలోనూ విహరించి, అన్ని రకాల చిత్రాలను వేసి, వేస్తూ, చలనచిత్రాలను తీస్తూ ప్రసిద్ధులైన ఒకరిద్దరిలో బాపు ఇద్దరి పెట్టు. తనమీద, తన చిత్రకళమీద కూడా కఠినాతి కఠినమైన హాస్యోక్తులు వేసుకొని తన గురువింద గింజత్వాన్ని తనే ప్రకటించి హాయిగా నవ్వుకోవడం ఒక్క బాపుకే చెల్లింది. "బాపు చిత్రాలు అక్షరాలా చిత్రరేఖా కవిత్వాలు...... రేఖా ఖండాలు....." అన్నాడు ముళ్ళపూడి. "బాపు రేఖ పండిన తీరు ఓ నిరంతర యజ్ఞఫలం......గీసిన గీతలు, చెప్పే వ్యాఖ్యానాలను మించి బాపు దాచిన గీతలు, చేసే భాష్యాలే ఎక్కువ......బాపు బొమ్మలకు సరళత, స్పష్టత, వాస్తవికత, జాతీయత, క్లుప్తత అన్నవి పంచప్రాణాలు" (ఏటుకూరి ప్రసాద్).

బాపు చిత్రాలలో హాస్యం జనిస్తుంది అనడంకన్నా, హాస్యమే బాపు చిత్రాల రూపు ధరించిందనడం సబబేమో! చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, నీటుగా హాస్యంతో మేళవించి అందంగా చెప్పగలగడం ఆయన ప్రత్యేకత, కార్టూన్లలో ఒకానొక శైలిని, మాధుర్యాన్ని ప్రవేశపెట్టిన ఘనత బాపుకే దక్కింది. పౌరాణిక గాథలకు, సాంఘిక అంశాలకు, కవితలకు బాపు గీతలు వైవిధ్యంగా ఉంటాయి. ఒక కార్టూన్ విశ్లేషణ: ఇంటికి వచ్చిన ఆత్మీయ అతిథికి కమ్మని పాట వినిపించగా, "ట్రాన్సిస్టరా?" అని అడుగుతాడు. "ట్రాన్సిస్టర్ కాదు, నా సిస్టరు" అన్న విచిత్ర జవాబు అందరినీ ఆకర్షిస్తుంది కదూ! 'సరసం' అనే హ్యూమర్ వెబ్ సైట్ ను కూడా ప్రారంభించి, దేశవిదేశాలలో నివసిస్తున్న తెలుగువారు ఆనందించడానికి అవకాశం కల్పించారు బాపు.

బాపు కథాకమామీషు: ఆయన అసలు పేరు సత్తిరాజు లక్ష్మీనారాయణ. ఆయన మద్రాసు హైకోర్టులో లాయర్‌గా నమోదైనా, చిత్రలేఖకునిగానే స్థిరపడ్డారు. కార్టూనిస్ట్ గా, ఆర్టిస్ట్ గా, ఆర్ట్ డైరెక్టర్ గా ఎదిగిన ఆయన 'సాక్షి' సినిమాతో సినీ రంగంలోకి ప్రవేశించారు. తిరుపతి దేవస్థానం ఆస్థాన చిత్రకారునిగా (1979) రాణించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 'కళాప్రపూర్ణ' బిరుదుతో (1982) సత్కరించారు. ఒక కళాకారుడు హాస్యరచయితగా కూడా రాణించగలడని ప్రథమంగా నిరూపించిన ప్రతిభాశాలి బాపు. ఆయన చిత్రాలతో ప్రభావితులైన కొందరు రచయితలు లిమరిక్కులు, చమరిక్కులు, హైకూలు మొదలైనవి వ్రాశారు. ఈ విధంగా తన చిత్రాలద్వారా పాఠకుణ్ణి ఏకమార్గం నుండి ఏవో

---

కొందరు జీవించడానికి నవ్వితే, మరికొందరు పేల్చడానికి నవ్వుతారు. – జీన్ షలిత్

లోకాలకు తీసుకుపోయి అతనిని బహు రహదారుల కూడలిలో నిలబెట్టి నవ్విస్తూ సమ్మోహపరచిన అసామాన్యుడు బాపు. ఇంక మనదేశంలోని మరికొంతమంది ప్రఖ్యాత కార్టూనిస్టులగురించి తెలుసుకుందాం:

ప్రఖ్యాత కార్టూనిస్టులు : ఆర్.కె. లక్ష్మణ్ (Times of India), ఆబూ, మారియో, మిరాండా, బాపు, బాబు, కేశవ శంకర పిళ్ళై (శంకర్స్ వీక్లీ), కాటూరి, బాలి, మల్లిక్, శ్రీధర్ (ఈనాడు), శంకు, జయదేవ్, సాంబు, రామ్మూర్తి, విజయన్, మిక్కీ పటేల్, కుట్టి, ప్రకాష్, ఐక్యరాజ్యసమితి కరస్పాండెంట్స్ అసోసియేషన్ (UNCA) అవార్డు (2002-2003) గ్రహీత విశాలాంధ్ర టి. వెంకట్రావు, కేరళవర్మ, రేవతీ భూషణ్ మొదలైన వారు ప్రఖ్యాతి చెందిన కార్టూనిస్టులు. సినీ డైరెక్టర్ కోడి రామకృష్ణ తన లెటర్ హెడ్లో కోడి, బాణం, ఫ్లాట్ బొమ్మలు గీసి, దాని క్రింద మూవీ డైరెక్టర్ అని వ్రాసుకోవడం చూపరులకు ఎంత ఆహ్లాదకరంగా ఉంటుందో!

ఆర్.కె. లక్ష్మణ్: ప్రముఖ రచయిత ఆర్.కె. నారాయణ్ సహోదరుడు ఆర్.కె.లక్ష్మణ్ మైసూర్ లో (1927) జన్మించారు. డిగ్రీ పూర్తిచేసి “బొంబాయి జె.జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ లో ప్రవేశానికి అప్లికేషన్ పంపితే, బొమ్మలు గీయడంలో నీకు సామర్థ్యం లేద”ని తిరస్కరించారు. చిత్రకారునిగా ఎంతో పేరు గడించాక అదే స్కూలుకు ముఖ్య అతిథిగా వెళ్ళి తన ప్రసంగంలో “ఆనాడు ఈ స్కూల్లో సీటు రాకపోవడం ఒకవిధంగా అదృష్టమేమో!” అని చమత్కరించారు.

1951లో 'Times of India' లో చిరు కార్టూన్ (Pocket Cartoon) 'You Said it' లో సగటు మనిషి (Common Man) గురించి ఓ కార్టూన్ గీశారు. నాటినుండి 54 సంవత్సరాల కాలంలో తన కార్టూన్లలో అతనినే హీరోగా ఉంచడం విశేషం. గాంధీ, ముస్సోలిని, చర్చిల్, నెహ్రూ, వల్లభాయ్ పటేల్ వంటి ప్రముఖుల క్యారికేచర్లు గీశారు. లోకులేకాక, కాకులు కూడా .అతని క్యారికేచర్లలో చోటుచేసుకున్నాయి! టోపీ లేని నెహ్రూ బొమ్మ గీసి ఆయన ప్రశంసలు పొందిన లక్ష్మణ్, కృష్ణ మీనన్, ఇందిరా గాంధీ, మొరార్జీలనుండి అభిశంసలనందు కున్నారు. కొందరు రాజకీయ నాయకులు ఆయనను అరెస్ట్ చేయించినా, ముఖం పై యాసిడ్ చల్లుతామని బెదిరించినా ఆయన తన పంథాను మార్చుకోలేదు. అనారోగ్యం తో బాధపడుతూ ఉన్నప్పటికీ ఉద్యోగ జీవితంలో ఏ ఒక్కరోజు కూడా కార్టూన్లను గీయడం మానలేదు.

1985లో లండన్లో కార్టూన్ ప్రదర్శన ఏర్పాటుచేసిన మొదటి భారతీయుడు లక్ష్మణ్. ఆ తరువాత చెన్నైలో(1987), దుబాయ్ లో (1991) ప్రదర్శనలు ఏర్పాటుచేశారు.

---

నవ్వును సృశించడానికి ఒక పద్ధతి లేక ఏ పద్ధతి లేకపోవడం సరసోక్తి. – జీన్ షలిత్

'న్యూయార్క్ టైమ్స్', 'పంచ్' పత్రికలు కూడా ఆయన కార్టూన్లను ప్రచురించాయి. 'మాల్గుడి డేస్' చిత్రకారుడు ఈయనే. చదవడం రాకముందే వ్యంగ్య చిత్రాల పై ఆసక్తి కనబరచిన లక్ష్మణ్ వ్రాసిన 9 పుస్తకాలలో Through the Eyes of R.K, The Messanger, Servants of India ప్రత్యేకంగా పేర్కొ నదగినవి. ప్రముఖ అమెరికన్ కార్టూనిస్ట్ రనాన్ లూరీ “భారతదేశంలో నెంబర్ వన్ కార్టూనిస్ట్ ఎవరు?” అని ఆర్కేని ప్రశ్నించగా, “మా దేశంలో ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ ప్రఖ్యాత చిత్రకారుడిని నేనే” అన్నారు నవ్వుతూ.

రాజకీయ వ్యంగ్య చిత్రలేఖనంలో ఆరితేరిన లక్ష్మణ్ 1969లో హేర్నిమెన్ బెస్ట్ జర్నలిస్ట్, పద్మభూషణ్ (1971), రామన్ మెగసెసే (1984), పద్మవిభూషణ్ (2005) గౌరవ డాక్టరేట్లు మొదలైన ఎన్నోసత్కారాలు పొందారు. భారతీయ సగటు మనిషిని (Common Man) చిరంజీవిని చేసి, భారత ప్రజానీకానికి ప్రతినిధిగా నిలిపిన ఆ సామాన్యుడి కాంస్య విగ్రహాన్ని 8' 3" సైజులో పూనెలోని అంతర్జాతీయ విద్యాసాంస్కృతిక కేంద్రం ఆవరణలో (2001లో) నాటి రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ చే ఆవిష్కరింపజేయడం, ఒక కార్టూన్ పాత్రకు అంతటి గౌరవం లభించడం ప్రపంచంలోనే ప్రథమం, కార్టూన్ రంగానికే గర్వకారణం.

సుధీర్ తైలాంగ్: 'హిందుస్తాన్ టైమ్స్'లో కార్టూనిస్ట్‌గా పనిచేస్తూ 'పద్మశ్రీ' అవార్డును అందుకున్న సుధీర్ తైలాంగ్ “నవ్వలేనివాడు నిరాశా నిస్పృహలతో బతక్క తప్పదు” అంటాడు. జీవితంలో డాక్టర్ కావాలని ఆశపడ్డాడు కాని, కార్టూనిస్ట్ గా స్థిరపడ్డాడు. 1982లో ఇల్ల స్ట్రేటెడ్ వీక్లీ (బొంబాయి)లో ఉద్యోగం రావడం ఆయన జీవితంలో ఒక మలుపు. “వి.పి.సింగ్ ప్రభుత్వం మాలాంటి కార్టూనిస్ట్ కోసం ఏర్పడింది. దాన్ని నేను ట్రాజీ కామిక్ పీరియడ్ గా అభివర్ణిస్తా” అంటాడు ఆయన. ప్రధానిగా దేవెగౌడ హయాంను 'స్లీపింగ్ బ్యూటీ ఆఫ్ ఇండియన్ పాలిటిక్స్'గా ఆయన అభివర్ణిం చాడు. ఎందరో ప్రముఖుల చిత్రాలను గీసి కీర్తి గడించిన ఆయన కార్టూన్లలోనేగాక, మాటల్లో కూడా వ్యంగ్యాన్ని మిళితం చేయడం ఆయన ప్రత్యేకత. “నవ్వు పుట్టించే ఐడియా కోసం కార్టూనిస్ట్ భవన నిర్మాణ కార్మికునిలా మేధతోపాటు స్వేదాన్ని కూడా చిందించాల్సిన అవసరం ఉంటుంది"; “మన దేశం కార్టూనిస్ట్ పాలిట స్వర్గధామం. మన నాయకులు ప్రజలకన్నా కార్టూనిస్ట కే ఎక్కువగా ఉపయోగపడుతున్నారు” అంటూ పాఠకుల్ని నవ్విస్తాడు సుధీర్'. ఆయన తన వనరులలో కొంత భాగాన్ని సమాజ సంక్షేమానికి వినియోగించడం ముదావహం. కార్టూన్ కళ పై '50

---

ఇయర్స్ ఆఫ్ లిజనోపింగ్' అనే పేరుతో ప్రఖ్యాత భారతీయ కార్టూనిస్ట్ పై నిర్మించిన చిత్రానికి ఆయన దర్శకుడుగా, వ్యాఖ్యాతగా వ్యవహరించడం మరొక విశేషం. ప్రపంచంలోని అన్ని భాషలలో యానిమేటెడ్ ఫీచర్ ఫిల్మ్ తియ్యాలన్నది ఆయన సంకల్పం.

కేశవశంకర పిళ్ళై : భారతదేశంలో మూడు దశాబ్దాల కాలం అత్యంత కీర్తి గడించిన పత్రిక శంకర్స్ వీక్లీ(1948-1975). ఆద్యంతం హాస్యరసంతో సాగే ఈ పత్రికను నెలకొల్పడం ద్వారా ప్రపంచంలో ఏ కార్టూనిస్ట్ చెయ్యని, చెయ్యలేని సాహసం కేశవశంకర పిళ్ళై చేశాడు. అందులోని వ్యంగ్య చిత్రాలు వంకర గీతలతో ఎంత హృద్య మంగా ఉంటాయో, ఆ చిత్రాల క్రింద వ్రాసిన అరకొర వాక్యాలు కూడా అంతగా నవ్వించగలిగేవిగా ఉండటం దాని ప్రత్యేకత. ఆ పత్రికలో తన పై వేసిన కార్టూన్లను చూసి జవహర్‌లాల్ నెహ్రూ "ఈ విషయంలో నన్ను కూడా వదిలి పెట్టకు. నాకూ మినహాయింపు ఇవ్వకు" అంటూ శంకర్ విజ్ఞతను ప్రశంసించాడు.

దేశవిదేశీ నేతల ప్రశంసనీయమైన కార్యాలను అభినందిస్తూ, వారి కుయుక్తులను, అర్థహీన కార్యాలను అభిశంసిస్తూ నాటి భారతీయ రాజకీయ రంగాన్ని ఆ పత్రిక తనదైన శైలిలో ప్రభావితం చేసింది. అందులోని వ్యంగ్య చిత్రాలు జనసామాన్యాన్ని నవ్విస్తూ, కొందరిని కవ్విస్తూ, మరికొందరిని సింహస్వప్నంలా హెచ్చరిస్తూ, ఇంకొందరిని చల్లని మేలుకొలుపుగా ఆదరించాయి. ప్రముఖ బ్రిటీష్ వైస్రాయ్ లిన్ లిత్ గో తన పై శంకర్ గీసిన ఒక వ్యంగ్య చిత్రాన్ని తన పడకగదిలోనే అలంకరించుకోవడం ఒక విశేషం. అయితే, అంతటి ప్రముఖ పత్రిక కనుమరుగవడం భారత సమాజానికే బాధాకరమైన విషయం.

మాయా కామత్ : భారతదేశంలో ఏకైక మహిళా కార్టూనిస్ట్ గా కీర్తి గడించినవారు మాయా కామత్. పాఠకులను తన మాయా జగత్తులోకి తీసుకుపోగల నేర్పరితనాన్ని సొంతం చేసుకున్న ఆమె 16 సంవత్సరాల కాలంలో దాదాపు నాలుగువేల కార్టూన్లను చిత్రించి వ్యంగ్య చిత్ర జగత్తులో తన పేరును చిరస్థాయిగా నిలుపుకోగలిగారు.

మలయాళ మణిదీపం విజయన్: మలయాళీ రాజకీయ వ్యంగ్యచిత్ర కారుడు ఓ.వి.విజయన్, చిత్రాలు రాజకీయ నాయకులను గురిచూసి కొట్టేటంత పదునుగా ఉంటాయి."సమాజం లోని అన్ని రకాల అన్యాయాలను, అవమానాలను, అకృత్యాలను తూర్పారబట్టి రూపుమాపగల చైతన్య దీపాలను వెలిగించిన వ్యక్తి విజయన్" అని అషీష్ నంది అభినందించాడు. "విషాద చిత్రకారుడు థర్బర్ తన శకాన్ని ఏడిపించి నవ్వించగా, విజయన్ మానవీయమైన తాత్విక ధోరణిని, రాజకీయ ధోరణిని సమ్మిశ్రితం చేయడమేగాక విప్లవానికి,

---

ఆధ్యాత్మిక సంపన్నతకు మధ్య సమన్వయం సాధించడానికి ప్రయత్నించాడు" అని ఎ.బి.కె.ప్రసాద్ తన వ్యాసం 'రాజకీయ పరిహాసం'లో వివరించాడు. "గడ్డి తిని బ్రతికే తృతీయ ప్రపంచ దేశాల చంటిబిడ్డల కళ్ళలో ముసలితనం తొంగిచూస్తుంటుంది. అలాంటి విషయాలమీద కార్టూన్లు గీయాలంటే కడుపు మండుతుంది" అంటాడు విజయన్'.

"ప్రేమతో, ప్రార్థనతో బాపూజీ మతమౌఢ్యాన్ని వంచితే, ఓటు బ్యాంకు రాజకీయా లు, లౌకిక విధానం పై సెమినార్లతో మేము పెంచి పోషిస్తున్నాం" అంటూ గర్విస్తారు భారతనాయకులు విజయన్ కుంచె నుండి వెలువడిన ఒక కార్టూన్లో! విజయన్ ఒక అసాధారణ కార్టూనిస్ట్. అతనిలోని చిత్రకారుడు, కవి, రాజకీయ పరిశీలకుడు కలవడం తో ఆతని కుంచె నుండి వెలువడే వ్యంగ్య చిత్రాలు జనావళిని ఆలోచింపజేస్తాయి, ఆక్రోశింపజేస్తాయి. "గాంధీజీ, బోస్, నెహ్రూలాంటి నేతలు ఆంగ్లేయుల వలస పాలన నుండి మనకు విముక్తి కలిగిస్తే, నేటి పాలకులు తమ ప్రజలను వలసపాలితులుగా మారుస్తున్నారు" అన్న విజయన్ మాటలు పాలకులకు తూటాలుగా తగులుతాయి. ఆయన ప్రచురించిన కార్టూన్ల సంకలనంకు Tragic Idiom (2006) అని నామకరణం చేయడంలోనే ఆయన వైశిష్ట్యం కన్పిస్తుంది. .

వ్యంగ్య చిత్రాల ప్రభంజనం: ముఖ్యంగా గత దశాబ్దంలో విన్నీ ది పూ(Winnie the Pooh), డోనాల్డ్ డక్, ఫైట్లు కార్టూన్ చిత్ర రంగంలో సాధించిన విజయాలు అపూర్వమైనవి. కార్టూన్ ప్రపంచంలో సృష్టికి ప్రతిసృష్టి చేసిన అపర విశ్వామిత్రుడు వాల్ట్ డిస్నీ సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. డిస్నీ లాండ్, డిస్నీ స్టూడియోల నిర్మాతగా అటు పిల్లలను, ఇటు పెద్దలను పసందైన హాస్యంతో అలరించిన వాల్ట్ డిస్నీ చరితార్థుడు, కార్టూన్ చిత్ర యుగపురుషుడు.

భారతదేశంలో కూడా కార్టూన్ల పై క్రమంగా మోజు పెరుగుతూంది. టి.వి.లో కార్టూన్ నెట్వర్క్, పోగో వంటి ఛానళ్ళు ప్రజాదరణ పొందడం కార్టూన్ల పై పెరుగుతున్న క్రేజుకు ప్రత్యక్ష సాక్ష్యం. టి.వి.9 తొలిసారిగా 'వికటకవి' యానిమేటెడ్ కార్టూన్లను ప్రసారం చేయగా, టి.వి.5 'రాజకీయ బేతాళం', ఎన్.టి.వి. 'చిన్న ఝలక్ లతో రంగప్రవేశం చేసి రాజకీయ కార్టూన్లకు జీవం పోయడం స్వాగతించదగిన పరిణామం. అలానే మన హాస్య రచనల పితామహుడుగా, 'అమర్ చిత్రకథ' (1967) సిరీస్ రచయితగా, బాలల పత్రిక 'టింకిల్' (1981) సంపాదకుడుగా అనంతపాయ్ ఎంతో కీర్తి గడించారు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తర్వాత దేశంలోని పిల్లలందరిచే 'చాచా' అని అభిమానిం చబడేవాడు

---

మనుషులు నవ్వే విషయాలను బట్టి వారి ప్రవర్తనను స్పష్టంగా తెలుసుకోవచ్చు. – గోథే.

75 సంవత్సరాల అనంతపాయ్. కామిక్ పాయ్ కి Indian Book House (IBH) 2004 సెప్టెంబర్ లో ఘన సత్కారం జరపడం హాస్య ప్రపంచానికే ఆనందదాయ కమైన అంశంగా వక్తలు ప్రశంసించారు. 20 ఏళ్ళుగా కౌంటర్ పాయింటు ద్వారా ఎన్నో కార్టూన్లు వేసిన సుభాని గిన్నీస్ బుక్ లో నమోదు కావడం, 'యుధ్ వీర్' జాతీయ అవార్డు పొందడం అభినందనీయం.

బాపు కార్టూన్లను విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు రెండు సంపుటాలుగా, బాబు కార్టూన్లను రెండు సంపుటాలుగా 'స్వాతి', ఏ కార్టూన్ కు ఆ కార్టూన్ విడివిడిగా కాకుండా ఒక శీర్షిక క్రింద బాబు కార్టూన్లు ప్రచురించడం ఆనందదాయకం. వారి కార్టూన్లలో హాస్యం ఎంతగా ఉంటుందో, సమాజం ఎదుర్కొంటున్న సమస్యలపై అవగాహనను కల్పించే చక్కని హాస్య స్ఫోరకాలు (కామిక్స్) అంతగా కన్పిస్తాయి.

ఒక ఉద్యోగి ఆత్మహత్య చేసుకోబోతుంటే 'సార్ సార్! మీరు ఎక్కడ ఉద్యోగం చేస్తున్నారో చెప్పండి. నేను నిరుద్యోగిని' అని గడ్డాలు, మీసాలు పెంచుకున్న ఒక యువకుడు దీనాతి దీనంగా కోరడం నిరుద్యోగం వికృతరూపాన్ని సాక్షాత్కరింపజేస్తుంది.

కార్టూన్లను కేవలం చిత్రాలకే పరిమితం చేయక బానపొట్ట, బండముక్కు, మొసలి నోళ్ళతో వింత మనుషుల రూపాలను శిల్పాలుగా మలిస్తే సరదాగా ఉంటుంది కదా! శిల్పి రంజన్ కపూర్ ఆ కార్యక్రమాన్ని విజయవంతంగా ఇప్పటికే ప్రారంభించడం కార్టూన్ ప్రగతిలో మరొక ముందడుగు. వీటిని గురించి నవ్వుకోవాలంటే మరి నవ్వుల క్లబ్ లో చేరాల్సిందే.

---

మానవ ప్రకృతిలోని బలహీనతలను చూపుతూ ఎవరికి వారు తన లోపాలను తెలుసుకొని నవ్వుకునేలా చేసేవాడు హాస్యరచయిత. – జాకోబ్ ఎం.బ్రాడ్

అధ్యాయం 32

# నవ్వుల క్లబ్‌లు

రైల్వే మంత్రిగా జగ్జీవన్ రామ్ పనిచేస్తున్న సమయంలో రైలు ప్రమాదాలు ఎక్కువగా జరగడంతో ప్రతిపక్షంలో ఉన్న వాజ్ పేయి ఆ విషయం పై లోక్‌సభలో ప్రస్తావిస్తూ "రైల్వే మంత్రిగారి పేరులోనే ఒక ప్రత్యేకత ఉంది. జగ్ (జగత్తు), జీవన్ (జీవితం) - ఈ రెండింటి వద్ద సెలవు తీసుకొని రామ్ రామ్ అని ప్రార్థించుకుంటూ పోవాల్సిన పరిస్థితిని సృష్టించిన మంత్రి గారు నిజంగా చరితార్థులే" అనడంతో సభ గొల్లుమంది. "

నడుస్తూ పోతున్న గుర్నాధరావు తనవైపే ఒక లారీ వేగంగా రావడాన్ని చూసి త్రుటిలో తప్పించుకున్నాడు. అది వెళ్ళిన తర్వాత కూడా దానివైపే చూస్తూ ఏడుస్తున్న దృశ్యాన్ని చూసిన కొందరు అతని వద్దకు వచ్చి "ఏ ప్రమాదం జరగలేదు కదా! ఎందుకు ఏడుస్తారు?" అని అడిగారు. అందుకు గుర్నాధరావు "ఆ లారీ వెనుక ఏం వ్రాశారో చూశారా? ఫిర్ మిలేంగే' అని ఉంది. వాడెప్పుడైనా వచ్చి నన్ను గుద్దుతాడురా బాబోయ్!" అంటూ మరల ఏడుపు లంకించు కున్నాడు.

నవ్వు అసంగతమైన, అసందర్భమైన అంశాల పై ఆధారపడుతుంది. దానిని తర్కంతో జోడించిగాని, శాస్త్రంతో అన్వయించి విశ్లేషించడానికి గాని ప్రయత్నిస్తే అది అర్థరహితంగా మారుతుంది, అపహాస్యంగా కన్పిస్తుంది. అందువల్లనే హేతువు నుండి, తర్కం నుండి హాస్యాన్ని వేరుచేసి ఆనందింపజేయడానికే నవ్వుల క్లబు ఆవిర్భవించాయి. ఆందోళన నుండి, ఒత్తిడి నుండి మనిషిని కాపాడగల రక్షాకవాటం (Safety Valve) నవ్వు. అలాంటి నవ్వును మనం సద్వినియోగపరచుకోలేకపోతున్నామని డా|| మదన్ కటారియా యోచిం చి, ఒక వినూత్న ప్రక్రియను కనుగొన్నారు. ఏ కారణం లేకుండానే నవ్వే పద్ధతిని రూపొందించి నవ్వుల సామ్రాజ్యంలో ఓ చరిత్ర సృష్టించారు.

మనిషి హాయిగా ఎందుకు నవ్వలేకపోతున్నాడు?' దీనికి సమాధానంగా డా|| కటారియా మనచుట్టూ మనం కొన్ని పొరలను, భ్రమలను, భయాలను, మానసిక ఇటుకలను తయారుచేసుకున్నాము. ఈ స్వయం నిర్మిత ఆటంకాలను, నిర్బంధాలను తొలగించుకున్ననాడు మన పరిసరాలన్నీ హాస్యభరితంగానే మారతాయన్నాడు. సంకోచాలతో నిండిన మనస్సులో హాస్యభావాన్ని కలిగించడమంటే తూముకు బిరడా పెట్టి నీటిని కొట్టినట్లుగా ఉంటుంది. దీనికి మనం చేయవలసిందంతా ఒక్కటే. ఆ బిరడాను, ఆ

ప్రశాంతంగా జ్ఞప్తికి తెచ్చుకున్న ఉద్రేకపూరిత గందరగోళమే హాస్యం. –జేమ్స్ థర్బర్

సంకోచాన్ని తొలగిస్తే మానసిక దౌర్బల్యస్థితులను దాటి ఎలాంటి సమూహాలలోనైనా నవ్వడం నేర్చుకుంటాం అంటారు కటారియా.

మరొక్క విషయం. Neuro Linguistic Programming (NLP) ప్రకారం మనిషి ఊహకు, క్రియకు మధ్యగల వ్యత్యాసాన్ని మానవ శరీరం గుర్తించలేదు. అందుకే మనం నవ్వినట్లు నటించినా, ఆనందంగా ఉన్నట్లు ప్రవర్తించినా శరీరంలో ఆనందమయమైన రసాయనాలు జనిస్తాయని శాస్త్రం చెబుతుంది. అంటే ఆనందాన్ని నటించడం మూలంగా ఆరోగ్యం కలుగుతుంది. అందువల్లనే ప్రపంచవ్యాప్తంగా ప్రముఖ నటీనటులు కొన్ని బాధాకర సన్నివేశాల్లో నటించిన తరువాత అనేక పర్యాయాలు అనారోగ్యానికి గురయ్యారు. శరీరాన్ని క్రియాశీలంగా ఉంచితే, చలనం ఉద్వేగాన్ని సృష్టిస్తుంది (Motion Creates Emotion). ఎటొచ్చీ నవ్వాలన్న ఆలోచన, ఉత్సాహం మనలో ఉండాలి. పరిశోధనల ఫలితంగా మరొక్క విషయం కూడా స్పష్టమైంది. శరీరంలోని నవ్వే కండరాలను తరచుగా సాగదీస్తుంటే, ప్రతి స్వల్ప హాస్యరస సంఘట నకు కూడా కడుపుబ్బ నవ్వుతాము.

హాస్యక్లబ్ ఆవిర్భావం: డా|| మదన్ కటారియా ఈ విషయంలో ఎంతో కృషిచేసి 1995 మార్చి 13వ తేదీన ఐదుగురు సభ్యులతో ప్రప్రథమంగా నవ్వుల క్లబ్ ను ముంబాయిలోని ఒక పార్కు మూలలో నెలకొల్పారు. అది క్రమంగా విస్తరించి ఆ నగరంలోనే 60 క్లబు నెలకొల్పే స్థాయికి ఎదిగింది. ఢిల్లీ, అహమ్మదాబాద్, హైదరాబాద్, గోవా, కోల్ కతా, నాగపూర్ మొదలైన పట్టణాలలోనే కాక, జర్మనీ, అమెరికా, ఆస్ట్రేలియా, స్వీడన్, నార్వే, డెన్మార్క్, ఇటలీ, సింగపూర్, దుబాయ్ మొదలైన 15 దేశాలలో ఈ క్లబ్‌లు వ్యాపించడం విశేషం. స్త్రీ, పురుషులు అన్న వ్యత్యాసం లేకుండా ఎవరైనా ఈ క్లబ్ లో సభ్యత్వం తీసుకోవచ్చు. నవ్వు ఉచితం అన్నది దాని నినాదం కనుక అక్కడ సభ్యత్వ రుసుం లేదు.

డా|| మదన్ కటారియా ముంబాయిలో వైద్యుడు. 'Your Own Doctor' అనే పత్రికను నిర్వహిస్తూ, ఆయన హాస్య యోగాన్ని రూపకల్పన చేశారు. ప్రతిష్టాత్మకమైన నేషనల్ జియోగ్రఫిక్, వాల్ స్ట్రీట్ జర్నల్, లాస్ ఏంజిల్స్ టైమ్స్ పత్రికలలోనే కాక, BBC, CNN, NHK (జపాన్), ఎబిసి న్యూస్ (అమెరికా) మొదలైన మీడియా ద్వారా దీని కార్యక్రమాలు ప్రసారం కావడం ఈ ఉద్యమ వ్యాప్తికి ఎంతగానో దోహదం చేసింది. కేవలం 500 జనాభాగల ఒకానొక కుగ్రామంలో జన్మించిన డా|| కటారియా ప్రపంచవ్యాప్త ఉద్యమానికి మూలపురుషుడవడం గర్వించదగిన పరిణామం."నవ్వు ద్వారా ప్రపంచశాంతి"

అధిక ఒత్తిడికి లోనైనప్పుడు అత్యుత్తమ మార్గం దానిని చూసి నవ్వగలగడమే. – డా|| శామ్యూల్ షెమ్

అన్నది ఆయన నినాదం. ప్రపంచం ఒక కుటుంబంగా మారిన నేటి పరిస్థితులలో ప్రజలందరూ ఒకే మతానికి - నవ్వుల మతానికి - చెంది ఉండాలన్నది ఆయన విధానం. పదిమందినీ నవ్వించాలన్నది ఆయన ఏకైక లక్ష్యం. నవ్వు నేరుగా మనిషి ఆత్మ నుండి రావాలని, ఈ విశాల విశ్వంలో నవ్వు ఒక్కటే నలుగురినీ కలుపుతుంది అన్నది ఆయన సిద్ధాంతం.

నవ్వుల వాతావరణం: యోగాకు, నవ్వుకు మధ్య అవినాభావ సంబంధం ఉంది. సంస్కృతంలో యోగా అనే పదం 'యజ్' నుండి ఉద్భవించింది. మనస్సును, శరీరాన్ని అనుసంధానం చెయ్యడం అని దాని అర్థం. ప్రాణాయామం లేదా గాఢంగ గాలి పీల్చి, వదలడం మూలంగా మనస్సుకు కావలసిన ప్రాణవాయువు అధికమొత్తంలో లభిస్తుంది. ఇది యోగా శాస్త్రంలో ప్రధాన భూమిక వహిస్తుంది. ఈ సూత్రాన్ని ఆధారంగా చేసుకొని డా॥ మదన్ కటారియా కొన్ని అభ్యాసాలు రూపొందించారు. క్రమపద్ధతిలో సభ్యులందరు చేతులెత్తుతూ, క్రిందకు వంగుతూ హో....అని ముక్తకంఠంతో పెద్దగా అరుస్తూ ఉండటంతో అక్కడ ఒక లయ కన్పిస్తుంది. అద్భుతమైన నవ్వుల వాతావరణం ఏర్పడుతుంది. అందరూ బహిరంగంగా హో.....హో................. అని చెప్పడంతో సభ్యులలోని బిడియం, బెరుకుతనం క్రమంగా అంతర్జా నమై, సామూహికంగా ఆనందించాలన్న భావన పెంపొందుతుంది. చేతులు చాచడం, చప్పట్లు కొట్టడం మొదలైన ప్రక్రియల ద్వారా జీర్ణక్రియ మెరుగుపడుతుందని ఆయన పేర్కొన్నారు.

ఈ కార్యక్రమం జరపడానికి ఎలాంటి హంగు, ఆర్భాటంతో పనిలేదు. ఉదయం నడక (వాకింగ్) అయిన తరువాత 6,7 గంటల ప్రాంతంలో 10 మంది కలసి హాస్య యోగాన్ని ప్రారంభించవచ్చు. పార్కుగాని, బహిరంగ ప్రదేశంగాని దీనికి అనువైన స్థలం. నవ్వుతో దినాన్ని ప్రారంభించి నవ్వుతో ముగించడం మంచిది కదా! ఏ కారణం లేకుండానే పిల్లలు హాయిగా నవ్వినట్లే, మనం కూడా అలాంటి ఉత్సాహాన్ని, క్రీడా స్ఫూర్తిని ఎలా పెంపొందించుకోవాలన్నదే హాస్య క్లబ్స్ స్థాపన వెనుక దాగివున్న మూల ఉద్దేశ్యం.

రకరకాల నవ్వులు : గాలిపీల్చే సెషన్‌లో కార్యక్రమం ప్రారంభమవుతుంది. ఆ తరువాత ఓహో హో.... హో.... ఎక్సర్ సైట్‌లు, అనంతరం ప్రేరేపిత నవ్వులు - మనసారా నవ్వడం, సింహం నవ్వు, డాన్స్ నవ్వు, ఊయల నవ్వు - ఇలా ఎన్నో రకాల నవ్వులను ఆయన రూపొందించారు. ఇలా నవ్వడంతో రోజంతా ప్రశాంతంగా ఉండవచ్చని, రాత్రి బాగా నిద్రపడుతుందని, అనేక శారీరక, మానసిక రుగ్మతల నుండి విముక్తి కలుగుతుందని

---

స్వీయ సంతృప్తి చెందిన సునిశిత విజ్ఞాన ప్రకటనయే హాస్యం. – స్టీవార్ట్

ఆచరణాత్మకంగా తెలుసుకున్నారు. నవ్వుకు శత్రువులు అయిన సిగ్గు, భయం, సంకోచాలను కొన్ని వ్యాయామాల ద్వారా తరిమికొట్టవచ్చని నిరూపిం చారు. మంది పెరిగే కొద్దీ నవ్వగలగడం సులభమని గ్రహించి అధిక సంఖ్యలో సభ్యులు సమావేశమవ్వాలని కోరారు. అంతేకాదు. చేతులెత్తి ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకుం టూ నవ్వమని చెప్పడంతో నవ్వు వరదలా వ్యాపించింది. సభ్యులలో సంకోచం అంతరిం చింది. మనం నవ్వేటప్పుడు ప్రక్కనున్నవారి కంట్లోకి చూస్తూ నవ్వితే, అతనికి తెలియ కుండానే అతనిలో ఒక శక్తి ప్రవేశించి అతనిలో కూడా నవ్వు ప్రారంభమైంది. ఆ విధంగా ఆ ప్రాంతమంతా ఉత్సాహభరితమైన, ఆనందదాయకమైన వాతావరణంగా మారింది.

నవ్వు 40 విధాల గ్రేట్ : 'నవ్వు నాలుగు విధాల చేటు' అన్నది నాటి ఆర్యోక్తి. 'నవ్వు 40 విధాల గ్రేట్' అన్నది నేటి యదార్ధోక్తి. సాముదాయక నవ్వు అన్నది ఒక గొప్ప ప్రక్రియ. గాఢంగా గాలిపీల్చి నెమ్మదిగా వదలడంతో మానసిక ప్రశాంతత కలుగు తుంది. అది రక్త ప్రసరణను ప్రేరేపించి, శరీరం మొత్తానికి పుష్టినిచ్చే రక్తాన్ని ప్రసరణ చేస్తుంది. ఈ విధంగా అది శారీరక సమతుల్యతను చక్కగా పరిరక్షించగల ప్రక్రియ అవుతుంది.

నవ్వుకు ఔషధశక్తి : అమెరికా పాత్రికేయుడు నార్మన్ కజిన్స్ వైద్యరంగంలో ఓ సంచలనం సృష్టించారు. తన 'Anatomy of an ilness' అనే రచనలో నవ్వుకు ఔషధశక్తి ఉన్నదని ప్రకటించడంతో ప్రపంచం అచ్చెరువొందింది. దాంతో శాస్త్రవేత్తలు, వైద్యాధికా రులు నవ్వుకు, జబ్బుకు మధ్యగల సంబంధాన్ని గుర్తించారు. అయితే, స్వామి రజనీష్ నవ్వును ఒక యోగ ప్రక్రియగా తీర్చిదిద్దడంతో క్రమంగా అమెరికా, బ్రిటన్, మరెన్నో దేశాలలో నవ్వుల చికిత్సాలయాలు వెలిశాయి. దానిని ఆధారంగా చేసుకొని డా||మదన్ కటారియా హాస్యక్లబ్ ను ప్రారంభించడం నవ్వుల చరిత్రలో సువర్ణాధ్యాయంగా పేర్కొన వచ్చు.

ఇంక నవ్వుల క్లబు ఎలా పని చేస్తాయో చూద్దాం.

1. ఎలా నిలబడాలి?: సభ్యులు వృత్తాకారంగా లేదా అర్థ వృత్తాకారంగా నిలబడాలి. సభ్యునికి, సభ్యునికి మధ్య రెండు మూడడుగుల దూరం ఉండాలి. మధ్యమధ్యలో సభ్యులు తమ స్థానాలు మారుతూ ఉండాలి. అందరూ కలసి లయబద్ధంగా చప్పట్లు కొడుతూ హోహో.....హాహా....అని గట్టిగా అరుస్తూ సెషన్‌ను ప్రారంభించాలి. కొంతసేపైన తరువాత చప్పట్లు మానివేసి చేతులు చాస్తూ, మూస్తూ హోహో....హాహా..... అంటూ పలకాలి.

2. హోహో....హాహా.... : శబ్దాలు నాభి నుండి రావాలి. నోరు సగం తెరచి చెప్పాలి. హోహో......హాహా...అని చెబుతూనే చిరునవ్వు చిందిస్తూ ఉండాలి. అలా ముందుకు నడుస్తూ

ఏడవాలంటే భయం కనుక ప్రతిదాన్నీ చూచి నవ్వడం నేర్చుకున్నాను. – పియర్రే ఆగస్టీన్

సభ్యుల కళ్ళలోకి చూస్తూ నవ్వుతూ పోవాలి. ఆ విధంగా మనలోని శక్తి స్థాయిలు (Energy Levels) పెరుగుతాయి.

3. గాఢ శ్వాస : చేతులు క్రమంగా పైకి ఎత్తుతూ లయబద్ధంగా ముక్కుతో గాఢంగా పొట్టనిండా గాలి పీల్చుకోవాలి. అలా పీల్చిన గాలిని 4 సెకన్లు అలానే ఉంచి పైకి ఎత్తిన చేతులను నెమ్మదిగా క్రిందకు దించుతూ సున్నితంగా, లయబద్ధంగా గాలిని వదలాలి. రెండు పెదవులను దగ్గరకు చేరుస్తూ విజిల్ వేసినట్లుగా గాలిని నోటి ద్వారా వదలాలి. ఇది ప్రాణాయామ ప్రక్రియలలో ఒకటి. గాలిని పీల్చడానికన్నా దాదాపు రెట్టింపు సమయాన్ని దానిని వదలడానికి వినియోగించాలి.

4. నవ్వుల ప్రక్రియలు : ఉత్తేజ లేదా ఉత్సాహ ప్రేరితమైన 14 రకాల నవ్వులను డా|| కటారియా అభివృద్ధి చేశారు. ఇప్పుడు వాటిని గురించి తెలుసుకుందాం :

అ) నమస్తే నవ్వు : దీనిని అభివందన నవ్వు అని కూడా పిలవవచ్చు. సభ్యులు దగ్గరగా వచ్చి రెండు చేతులు జోడించి నమస్తే చెబుతూ, నవ్వు ముఖంతో ఒకరి కళ్ళలోకి ఒకరు చూస్తూ అభినందనలు చెప్పుకోవాలి. ఆ తరువాత 5,6 పర్యాయాలు హోహో..... హా హా.....అని స్మరణ చేస్తూ చప్పట్లు కొట్టాలి. ప్రతి పర్యాయం గాలి పీల్చడం, వదలడం ముఖ్యమని గుర్తుంచుకోవాలి.

ఆ) నిజాయితీ నవ్వు : గ్రూప్ లోని ప్రతి ఒక్కరూ ఒకే పర్యాయం నవ్వడంతో అక్కడ ఒక లయ ఏర్పడుతుంది. ప్రతి ఒక్కరూ చేతులెత్తి హృదయపూర్వకంగా నవ్వుతూ చేతులను నెమ్మదిగా క్రిందకు తీసుకువచ్చి మరల పైకి తీసుకువెళ్ళాలి. ఆ తరువాత 5, 6 పర్యాయాలు హాహా....హోహో..... అని పైన చెప్పినట్లుగా చేయాలి.

ఇ) అభినందన నవ్వు : ప్రతి ఒక్కరూ తమ చూపుడు వేలును బొటనవేలుతో కలిపి ఒక చిన్న వృత్తంలాగా చేస్తారు. అందరివైపు చూస్తూ, మృదువుగా నవ్వుతూ తమ తోటివారిని అభినందిస్తున్నట్లుగా ఆ చేతిని ముందుకు, వెనక్కు తిప్పుతారు. ఆ తరువాత చప్పట్లు, హోహో....హాహా....ఆలాపన మామూలే.

ఈ) ఒక మీటర్ నవ్వు : ఇదొక క్రీడలాంటిది. ఇక్కడ ఒక మీటరను కొలుస్తు న్నట్లుగా చాచిన ఒక చేతి నుండి భుజాలదాకా రెండవ చేతిని వ్యూహాత్మకంగా ప్రతి ఒక్కరూ తీసుకుపోవాలి. విల్లంబును వేసిన రీతిలో ఇక్కడ చేతులు చాపాలి. చేతిని నెమ్మదిగా పైకి తీసుకుపోతూ ఈ..... ........... అంటూ తలను కొద్దిగా వెనక్కు పెట్టి చేతులు చాస్తూ పెద్దగా

---

నీ ప్రత్యర్థి చిత్తశుద్ధిని హాస్యంతోను,వారి హాస్యాన్ని చిత్తశుద్ధితోను అంతమొందించాలి. – గార్జియాస్

నవ్వాలి. ఈ నవ్వు పొట్టలోనుండి రావాలి. ముందు ఎడమవైపు నుండి, ఆ తరువాత కుడివైపు నుండి రెండు పర్యాయాలు కొనసాగించాలి.

ఉ) గిలకరించే నవ్వు : దీనిని Milk Shake Laughter అంటారు. ప్రతి సభ్యుడు తన ఒక్కొక్క చేతిలో ఒకగ్లాసు ఉన్నట్లుగా ఊహించుకొని ఒకదాని నుండి మరొకదాని లోకి పాలుపోస్తున్నట్లు భావించాలి. ఒకగ్లాసులో పోసేటప్పుడు ఏ... అని, దానిని రెండవ దానిలో పోసేటప్పుడు ఏ... అని ఆలపించి, నవ్వుతూ ఆ పాలు త్రాగుతున్నట్లుగా అభినయించాలి. ఇలా 4 పర్యాయాలు చేయాలి. ఆ తరువాత చప్పట్లు, హోహో....హాహా... మామూలే.

ఊ) కిశోర నవ్వు : యోగులు అనుసరించే సింహముద్ర పద్ధతి దీనికి మూలం. ఇక్కడ ప్రతి ఒక్కరూ పూర్తిగా నోరు తెరచి నాలుకను బాగా చాపాలి. కళ్ళు పెద్దవి చేసి సింహం పంజాలాగా చేతులు చాచుతూ, గర్జిస్తూ, పెద్దగా నవ్వాలి. ముఖ కండరాలకు, నాలుకకు, గొంతుకు మంచి వ్యాయామం ఇది. థైరాయిడ్ గ్రంధికి అవసరమైనంత రక్తప్రసరణ జరపడానికి ఇది తోడ్పడుతుంది. గొంతుకు అవసరమైన నిరోధక శక్తిని అందిస్తుంది.

ఋ) నిశ్శబ్ద నవ్వు: ఇక్కడ నోరు బాగా తెరచి ప్రతి ఒక్కరూ ఇతరుల ముఖాల లోకి చూస్తూ భిన్న విధాలుగా అభినయిస్తూ, ఒకరి అరచేతులు మరొకరికి చూపుతూ తలలు, చేతులు ఊపుతూ నిశ్శబ్దంగా పొత్తికడుపు కండరాలు కదిలేటట్లుగా నవ్వాలి. ఇక్కడ అనవసరంగా అధిక శక్తిని ఉపయోగించరాదు.

ఋ) ఝంకార నవ్వు : ప్రతి ఒక్కరూ పెదవులను మూసుకొని కూనిరాగాన్ని తీయాలి. ఈ శబ్దం మన పుర్రెలో ప్రతిధ్వనిస్తుంది. అలానే ప్రతి ఒక్కరూ ప్రక్కవానితో కరచాలనం చేస్తూ ఈ క్రీడను కొనసాగించాలి. ఎప్పుడూ బలవంతంగా నవ్వకూడదు.

ఎ) ఊయల నవ్వు : ఇదొక వినోదాత్మక క్రీడ వంటిది. ఒక్కొక్కరూ రెండు మీటర్లు దూరంగా నిలబడి పెద్ద వలయాన్ని చేయాలి. ముందుకు వస్తూ, ఒకేసారి చేతులు ఎత్తుతూ సుదీర్ఘంగా ఈ..................అంటూ నవ్వాలి. అందరూ మధ్యలోకి వచ్చి చేతులు ఊపుకుంటూ మరల తమ తమ స్థానాలలోకి పోవాలి. రెండవ పర్యాయం ఇలా చేసేటప్పుడు ఓ....అని, మూడవ పర్యాయం ఏ....అంటూ, నాలుగవ పర్యాయం ఓ....అను శబ్దాలతో పెద్దగా నవ్వాలి.

---

హాస్యం అనంతాన్ని ఈ ప్రపంచంతోటి కలిపినప్పుడు అధిక భావంతో కూడిన బాధరూపంలో నవ్వు జనిస్తుంది. – రిక్టర్

ఏ) సెల్ ఫోన్ నవ్వు : మొబైల్ ఫోన్ చేతిలో ఉన్నట్లు అభినయిస్తూ, ఆ గ్రూప్ లో అటుఇటు తిరుగుతూ, నవ్వుతూ ఆనందించాలి. సభ్యులు రెండు భాగాలుగా చీలి ఎదురెదురుగా నిలబడి ఒకరితో ఒకరు ఫోన్లో మాట్లాడినట్లుగా కొద్దిసేపు అభినయించి, ఆ తరువాత ఎదుటివ్యక్తిని చూసి నవ్వుకుంటూ యధాస్థానాలకు చేరాలి.

ఐ) వివాదపు నవ్వు : ఇక్కడ సభ్యులు రెండు వర్గాలుగా ఏర్పడి ఒకరు మరొక రితో పోటీపడ్డట్లుగా చూపుడువేలు చూపుతూ నవ్వాలి.

ఒ) క్షమాపణ నవ్వు : - ఇక్కడ ప్రతి ఒక్కరూ తమ రెండు చేతులతో రెండు చెవులు పట్టుకొని వంగి ఆ చేతులను మోకాళ్ళదాకా తీసుకుపోతూ నవ్వాలి.

ఓ) వాలు నవ్వు : సెషన్ పూర్తి చేయబోయేముందు అందరూ యాంకర్ వద్దకు వచ్చి నిలబడి ప్రతి ఒక్కరూ అందరివైపు చూస్తూ చిరునవ్వులు చిందించాలి. అందరూ తెరలుతెరలుగా నవ్వడంతో ఆ నవ్వుల స్థాయి పెరిగిన తరువాత పెద్దగా నిజాయితీ నవ్వును ప్రారంభించాలి. ఆ తర్వాత దానిని ఒక నిమిషం కొనసాగించాలి.

ఔ) ఆత్మీయ నవ్వు : సెషన్లో చివరి అంశం ఇది. ప్రతి సభ్యుడు ప్రక్కవాని చేతులు పట్టుకొని ప్రేమపూర్వకంగా కళ్ళలోకి చూస్తూ నవ్వుతూ కరచాలనం చేయాలి.

ముగింపు : సెషన్ను ముగిస్తూ ముచ్చటగా మూడు నినాదాలు చేస్తారు. "ఈ విశాల ప్రపంచంలో మేము అత్యంత ఆనందంగా జీవిస్తున్నాము"అని యాంకర్ అనడంతోనే సభ్యులందరూ"అ................" అని, "ఈ ప్రపంచంలో మేమే అత్యంత ఆరోగ్యవంతులం" అని యాంకర్, "అ...వు....ను...." అని సభ్యులు, "మేము నవ్వుల క్లబ్ సభ్యులం" అని యాంకర్, "అవును....." అని సభ్యులు అనాలి. సభ్యులందరూ కళ్ళు మూసుకొని చేతులు పైకెత్తి ఒక నిమిషంపాటు ప్రపంచ శాంతికి ప్రార్థించాలి.

ప్రపంచ నవ్వుల దినోత్సవం: ఈనాడు హాస్యం వ్యక్తి పరిధిని దాటి వ్యవస్థగా రూపాంతరం చెందడంతో ప్రపంచ నవ్వుల దినోత్సవాన్ని అంతర్జాతీయ స్థాయిలో జరుపుకోగలుగుతున్నాం. 2000 జనవరి 9న డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగన్లో జరిగిన మొదటి ప్రపంచ నవ్వుల దినోత్సవంలో దాదాపు 10 వేలమంది పాల్గొన్నారు. . ప్రతి సంవత్సరం మే నెల మొదటి ఆదివారాన్ని ప్రపంచ నవ్వుల దినోత్సవంగా జరుపు కోవాలని నిర్ణయించారు. డెన్మార్క్ లో జాన్ ధిగెసెన్ పాల్సన్ ఆధ్వర్యంలో లక్షా తొంభై వేల లాఫింగ్ క్లబు దేశం నలుమూలలా వ్యాపించాయి. Witty World అనే వెబ్ సైట్ సాయంతో ప్రపంచవ్యాప్తంగా కార్టూన్ల ప్రదర్శనలు ఇస్తున్నాయి. భారతదేశం, అమెరికా, జర్మనీ, డెన్మార్క్, సింగపూర్, నార్వే దేశాలు

ప్రతి సంవత్సరం నవ్వుల దినోత్సవాన్ని నిర్వహిస్తున్నాయి. నవ్వుల ద్వారా ప్రపంచ శాంతికి దోహదం చెయ్యాలని, ఆరోగ్యకర ప్రపంచాన్ని, ఆనందమయ ప్రపంచాన్ని నిర్మించాలన్నది వారి ఆశయం. ఆనందానికి సూచిక, ఆహ్లాదానికి సంకేతం, అందమైన పూబాట నవ్వుల దినోత్సవం.

ఇప్పుడు కొన్ని అంతర్జాతీయ సంస్థలను గురించి తెలుసుకుందాం.

1) అమెరికాహాస్య అధ్య యన సంస్థ(American Humor Studies Association) : 1975లో అమెరికాలోని టెక్సాస్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య జాక్ మిథేనియా అమెరికా హాస్య అధ్యయన సంస్థను నెలకొల్పారు. హాస్యాన్ని గురించి అధ్యయనం చేసే ఈ సంస్థ 'American Humor (అమెరికా హాస్యం) త్రైమాసిక్ పత్రికను ప్రచురిస్తున్నది. దాని నేతృత్వంలో ప్రతి సంవత్సరం అంతర్జాతీయ హాస్య సమావేశం జరుగుతుంది. The International Society for Humor Studies (ISHS) Humor పత్రికను నడుపుతూ ఈ ఉద్యమ వ్యాప్తికి కృషిచేస్తున్నది.

2) అంతర్జాతీయ బనాన క్లబ్, అమెరికా : అరటిపండు తలమీద తొక్క తీసి నవ్వే మనిషి దీనికి మూలపురుషుడు. అరటి తొక్క పై ఎవరైనా కాలు పెట్టి జారిపడితే నవ్వే మనమే, అతనికి దెబ్బ తగిలితే సానుభూతి చూపెడతాం. హాస్యానికి, అరటి తొక్క కుగల అవినాభావ సంబంధం అదే. 1972లో నెలకొల్పబడిన ఈ సంస్థకు మూలపురుషుడు కెన్ బానిస్టర్. అందరినీ నవ్వించడమే దీని లక్ష్యం. "నవ్వు అత్యుత్తమ ఔషధం", "సానుకూల వైఖరిని అలవరచుకోండి" అన్నవి దీని సూత్రాలు. వీరి కార్యక్రమాలన్నీ సంస్థ పేరుకు తగ్గట్లుగానే అరటిపండ్లకు సంబంధించి ఉంటాయి. అరటిపండుతో ఏ ఏ వంటకాలు, మరే పనులు చేయవచ్చో వివరిస్తారు. విజేతలకు అరటి బహుమతులు (Banana Merits) అందజేస్తారు. Masters, Ph.B. Doctorate of Bananistry Degree మొదలైన డిగ్రీలను బహూకరిస్తారు. 27 దేశాలలో వ్యాప్తి చెందిన సంస్థ ఇది.

3) చిరునవ్వుల సంస్థ : ఈ సంస్థ పేరు The Giggles Institute. "మీరు చేసే ప్రతిపనిని గంభీరంగాను, మిమ్మల్ని మాత్రం తేలికగాను తీసుకోండి", "హాస్య వ్యాపారాన్ని మేము చాలా గంభీరంగా తీసుకుంటాము" అన్నవి దీని నినాదాలు, అమెరికాలో ఇటీవల జరిపిన ఒక సర్వేలో 737 మంది CEOల నియామక ప్రక్రియలో హాస్యభావన కలవారికి ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వడం జరిగిందని నిర్వాహకులు తెలిపారు.

---

మన దృక్కోణాలను వివరించేది హేతువు అయితే, వాటిని మార్చటానికి ఉపయోగించే ప్రక్రియ హాస్యం. – ఎడ్వర్డ్ డి బోన్

4) జపాన్లో నవ్వుల నజరానా : జపాన్లో గతంలో హాస్యనటులను వెకిలి వేషగాళ్ళు అని ఆటపట్టించేవారు. మరి ఈనాడో! 'యొషిమోటో కోగ్యో' జపాన్ యువతకు నవ్వులనజరానాలను పంచి పెడుతున్నది.అది అందాలహరివిల్లులా, కేరింతల ఖజానాగా, హాస్య ప్రదర్శనల కేంద్రంగా రూపాంతరం చెందింది. 1912లో నెలకొల్ప బడిన ఈ సంస్థ ఈనాడు దేశంలో ఒక పెద్ద శిక్షణా, ప్రదర్శనాసంస్థగా ఎదిగింది. ఏటా వెయ్యిమంది విద్యార్థినీ విద్యార్థులు దానిలో శిక్షణ పొందుతున్నారు. దాని కేంద్ర స్థానం టోక్యో. అక్కడ తయారైన హాస్య నటీనటులు రంగస్థలం మీదనేకాక, బుల్లితెర, సినీరంగాలలో కూడా పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తున్నారు అంటే అదెంత ప్రజాదరణ పొందిందో అర్థ మౌతుంది. హాస్యాన్నేగాక, క్రీడలను, విద్యను అభివృద్ధి చేయడానికి కంకణం కట్టుకున్న ఈ సంస్థలో లాఫింగ్ (నవ్వు) క్లబ్ లేకాక, క్రైయింగ్ (ఏడుపు) క్లబ్‌లు కూడా ఉన్నాయి. జపాన్ దేశస్తుని సగటు జీవన ప్రమాణం 80 సంవత్సరాలు. నవ్వు, ఏడుపు ఆయుః ప్రమాణాన్ని పెంచుతాయని తెలుసుకున్న జపాన్ వాసులు మనసారా నవ్వడం, కడు పారా ఏడ్వడం కూడా నేర్చుకుంటున్నారు.

5) బ్రిటన్ : "నవ్వించడమే మా వృత్తి" అని చెప్పుకునే ఆ సంస్థ పేరు వర్జిన్ మిర్త్ కామెడీ క్లబ్. ప్రపంచవ్యాప్తంగా బ్రిస్టల్ (బ్రిటన్)లో హాస్యానికి చక్కని ఆదరణ ఉంటుందని దాని విశ్వాసం. 1997లో మెకెల్వీ నేతృత్వంలో నెలకొల్పబడిన ఆ సంస్థ జనావళిని నవ్వుల్లో ఉతికి ఆరేస్తుంది. ఆగడాలకు, జగడాలకు అక్కడ చోటులేదు. వారి ప్రథమ వార్షిక సమావేశంలో విలేకరులకుగాని, ప్రత్యేక ఆహ్వానితులకుగాని చోటివ్వ కుండా బంధుమిత్రులతోనే ప్రదర్శన హాలును నింపివేయడంలో వారి అసలుసిసలైన హాస్య ప్రవృత్తి తేటతెల్లమవుతుంది.

నవ్వడం, నవ్వించడం వృత్తిగా, ప్రవృత్తిగా ఎంచుకున్న ఈ కామెడీ క్లబ్ సభ్యులు సాటివారికి చక్కని సలహాలు ఇస్తూ ముఖం వాచేటట్లు చివాట్లు తిన్నప్పటికీ చిరునవ్వులు చిందిస్తారేగాని కోపం ప్రదర్శించరు. కొత్త నటుల సాయంతో హుషారుగా కామెడీ వర్క్ షాప్‌లు నిర్వహిస్తారు. హాస్యరీతులను విశ్లేషిస్తారు. హాస్య కథనాలు వ్రాసి చూపిస్తారు. టి.వి.ని ప్రధాన వేదికగా ఎంచుకొని, హాస్యరసంపై పోటీలు నిర్వహిస్తూ, ఆనందం వ్యాప్తికి కృషి చేస్తుంది. ఎంపికైన తరువాత ప్రతి విద్యార్థికి తన ప్రతిభను పెంచుకోడానికి అవసరమైన శిక్షణ ఇస్తారు. ఇప్పుడు ఈ సంస్థ వ్యాప్తి చేస్తున్న ఒక జోక్ చూద్దాం.

---

హాస్యం పరుషోక్తుల ద్వారా ప్రజలలోని మూర్ఖత్వాన్ని తొలగిస్తూ, అక్రమాన్ని శిక్షిస్తుంది. – గిల్బర్ట్ హైట్.

తండ్రి కుమారునికి లెక్కలు నేర్పుతూ "తొమ్మిది ఎనిమిదులు ఎంత?" అని ప్రశ్నించాడు. "64" అన్న కుమారుని సమాధానంతో తండ్రి ముఖంలో ఆనందం. అది వింటున్న పక్కింటాయన చికాకుగా "పిల్లోడు పొరపాటు చెబుతుంటే సరిదిద్దాలి కాని, ఆనందిస్తారేమిటి?" అని విసుక్కోవడంతో, ఆ తండ్రి "నిదానమే ప్రధానమండి. కంగారుపడకండి. నిన్న ఇదే ప్రశ్నకు '52' అని సమాధానం చెప్పిన మా అబ్బాయి ఈరోజు '64' అన్నాడు. రేపోమాపో 72' అని చెబుతాడులెండి.... అభివృద్ధి క్రమంగా రావాలికాని, గెంతుతూ రాదండి. నవ్వేజనా స్సుఖినోభవంతు అని గుర్తించాలండి" అంటూ ఆ పక్కింటాయనకు క్లాసు పీకాడు!

6) నవ్వుతున్న జర్మనీ : "బతుకు బండల పాలైంది, అదొక బస్టాండు అయింది. ఎందుకనో జీవితంలో ఆనందానికి చోటులేకుండా పోతుంది" అంటూ జర్మనీవాసులు ఆందోళన చెందుతున్నారు. మనం పొట్టచెక్కలయ్యేలా నవ్వి ఎంతకాలమైంది? కళ్ళల్లో నీళ్ళు తిరిగేలా, ఒళ్ళంతా వంకరలు తిరిగేలా ఎందుకు నవ్వలేకపోతున్నాము? అని మథనపడ్డారు. ఈ మేధోమథన ఫలితంగా ఇటీవలనే అక్కడ అంతర్జాతీయ హాస్య సమావేశం జరిపారు. "నవ్వును మరచిపోవడం ఒక ప్రమాదకరమైన జబ్బు, బిర్రబిగుసుకొని బతకడం మానెయ్యండి" అని మనస్తత్వ నిపుణులు వక్కాణించారు. బడిలో చేరిన పిల్లవానికి వర్ణమాలను నేర్పినట్లే, జీవిత పాఠశాలలో మనం నవ్వులమాలలు కట్టాలంటూ 40కి పైగా లాఫింగ్ క్లబు నెలకొల్పారు. "మీ కొంటెతనాన్ని వదలకండి, నవ్వు వస్తే పగలబడి నవ్వండి" అంటూ ప్రచారం గావించారు. అనేక వెబ్ సైట్లను ప్రారంభించారు.

నవ్వుల పండుగలు: "యూరోలు సంవత్సరాంతంలో ఎత్తిపొడుపులు, దుర్భాషల తో కూడిన పండుగ చేసుకుంటారని, నోటికి వచ్చింది తిట్టడం, హాస్యోక్తులతో పొట్ట చెక్కలయ్యేలా నవ్వడం ఆ పండుగ ప్రత్యేకత" అని అమెరికాలోని రెండు రెడ్ ఇండియ న్ సంస్కృతుల గురించి ఎరిక్సన్ వివరించాడు. హాయిగా ఆనందించడమే ఆ నవ్వుల పండుగ లక్ష్యం. అలానే హెయోకా (Heyoka) వారు కూడా సంవత్సరంలో ఒకరోజును వింతైన, పిచ్చి పనులతో వినోదిస్తారు. అందరికీ పిచ్చిగా కన్పించే ఆ పనులు ఆ రోజున తమకు వింతైన అనుభూతిని, ప్రత్యేక ఆనందాన్ని కలిగిస్తాయని చెబుతారు. భారతదేశంలో కూడా శివరాత్రి రోజున బూతుపాటలు పాడుకోవడం, కవ్వింపు డాన్సులు చేయడం ఒక ప్రత్యేక వేడుకగా సాగుతుంది. అలానే గతంలో రవికల పండుగను జరుపుకునేవారు. ఆ రోజున మహిళలందరూ తమ రవికలను విప్పి ఒకచోట వేస్తే, పురుషులు వచ్చి తమకు నచ్చిన

---

రవికను తీసుకొని ఆ రవిక ఏ స్త్రీది అయితే, ఆరోజు ఆమెతో కలసి ఆనందించడం ఆ పండుగ ప్రత్యేకత. ఒక రోజున యాదృచ్చికం గా ఒక పురుషుడు తన భార్య రవికనే ఎంపిక చేసుకోవడంతో ఆమె అదోలా ముఖం పెట్టి "పండుగ రోజున కూడా పాత మొగుడేనా" అందట!

వేణు క్లాసుకు ఆలస్యంగా రావడంతో ఉపాధ్యాయుడు కోపంగా "ఎందుకు ఆలస్యమైంది?" అని అడిగాడు. "సార్! స్కూలుకు వస్తుంటే ఒకతను 500 రూపాయల నోటు పోగొట్టుకోవడంతో అందరూ ఆయన చుట్టూ మూగారు" నసిగాడు వేణు. "అదిసరే. నువ్వెందుకు లేటుగా వచ్చావు?" సూటిగా ప్రశ్నించాడు ఉపాధ్యాయుడు. "ఆ 500 రూపాయలనోటు నా బూటు కిందనే ఉందండి".

రోగితో వైద్యుడు: ఏమయ్యా! నువ్విచ్చిన చెక్కు బౌన్స్ అయ్యింది. (తిరిగి వచ్చింది) ఇలా చేస్తే ఎలా?

రోగి: నిజమే డాక్టర్ గారూ! నా జ్వరం కూడా మరల వచ్చింది. ఏం చెయ్యమంటారు?

అందుకే వాడవాడలా నవ్వుల క్లబు నెలకొల్పండి. నవ్వుల పువ్వులు పూయించడానికి ఏంచేయాలో తదుపరి అధ్యాయంలో చదవాల్సిందేనండి!

---

నాకు గట్టిగా నవ్వడం ఇష్టం, ఎందుకంటే దాని వల్ల పెదవులే కాదు, హృదయం కూడా తెరుచుకుంటుంది. – విక్టర్ హ్యూగోసయర్

అధ్యాయం 33

# అఖిల మూర్ఖుల ఉత్సవం : ప్రపంచ నవ్వుల దినోత్సవం

ముగ్గురు గ్రామీణులు ఒక విమానాశ్రయానికి వెళ్ళారు. ఒకదాని తరువాత మరొకటి మొత్తం ఐదు విమానాల రాకపోకలను చూసి ఆనందంతో కేరింతలు కొట్టారు. అన్నట్లు ఆరోజు ఏప్రియల్ 1. దూరంనుండి ఇదంతా చూస్తున్న మోహనరావుకు ఒక విచిత్రపు ఆలోచన తట్టింది. వాళ్ళ దగ్గరకు వెళ్ళి గంభీరంగా ముఖం పెట్టి "ఇక్కడ ఏమి చేస్తు న్నాడు?" అని ప్రశ్నించాడు. వాళ్ళుభయపడుతూ "విమానాలు చూస్తున్నామయ్యా!" అన్నారు. "ఒక్కొక్క విమానం చూసినందుకు పదిరూపాయలు కట్టాలి తెలుసా?" అని ఆయన గద్దించడంతో, "మాకేం తెలుస్తదయ్యా....పల్లెటూరోళ్ళం" అన్నారు నెమ్మది గా. "సరే. మీరు రెండు విమానాలు చూశారు కదా! తలా 20 రూపాయలు కట్టండి. అమాయకులని యింతటితో వదులుతున్నా" అంటుండగానే వాళ్ళు తలా 20 రూపా యలు తీసి, భయంభయంగా ఆయనకు ఇచ్చారు. ఆ డబ్బు తీసుకొని మోహనరావు నవ్వుకుంటూ వెళ్ళిన తరువాత గ్రామీణులు ముగ్గురు ఆయనవైపు అదోలా చూస్తూ "మనం ఒక్కొక్కరం ఐదు విమానాలను చూస్తే, ఆయనేమో రెండింటికే డబ్బులు తీసుకున్నాడు. మరీ అమాయకుడిలా ఉన్నాడు పాపం!" అనుకుంటూ నిష్క్రమించారు.

సాధారణంగా ఒక హాస్యోక్తి ఇరుపక్షాలలో ఒక్కరినే నిండుగా నవ్విస్తుంది. అయితే..... ఇరుపక్షాలవారు ఆనందించడమేగాక, పరస్పరం అమాయకులుగా భావిం చడం దీని ప్రత్యేకత. ఆల్ ఫూల్స్ డే ఏప్రియల్ 1ని ఆహ్వానించే అమాయకపు హాస్యోక్తిగా దీనిని పేర్కొనవచ్చేమో!

అసలు ఈ సంప్రదాయం ఎలా వ్యాప్తి చెందింది? ప్రస్తుతం అమలులో ఉన్న క్యాలెండర్‌ను గ్రెగరియన్ క్యాలెండర్ అంటారు. దీని ప్రకారం కొత్త సంవత్సరం జనవరి 1న ప్రారంభమవుతుంది కదా! దీనికి ముందున్న క్యాలెండర్ ప్రకారం కొత్త సంవత్సరం ఏప్రియల్ 1వ తేదీతో ప్రారంభమయ్యేది. అయితే, కొత్త క్యాలెండర్ అమలులోకి వచ్చిన తరువాత కూడా చాలామంది అలవాటు ప్రకారం ఏప్రియల్ 1వ తేదీనే నూతన సంవత్సరం జరుపుకునేవారు. అలాంటి అమాయకులను ఎగతాళి చేయడానికి కొందరు ఏప్రియల్ 1న ఆత్మీయులకు విందు అనో, ప్రత్యేక కార్యక్రమం ఉందనో పరిచయస్తులను ఆహ్వానించి గేలి చేసేవారు. ఖాళీ డబ్బాల పైన "అరుదైన బహుమతులు" అని వ్రాసి పొట్టచెక్కలయ్యేలా

---

నవ్వును స్పృశించడానికి ఒక పద్ధతి లేక ఏ పద్ధతి లేకపోవడం సరసోక్తి. – జీన్ షలిత్

నవ్వుకునేవారు. ఆ విధంగా మెజారిటీ ప్రజానీకం అజ్ఞానం కొందరికి ఒక వరం అయింది. అదే పద్ధతిలో ఈనాటికీ ప్రతి సంవత్సరం అదే తేదీన మూర్ఖుల దినోత్సవాన్ని ముద్దుగా జరుపుకుంటున్నాం.

"ఈ రోజు మీ పరీక్షా ఫలితాలు వచ్చాయి", "ఒక గంటలో మీ ఇంటికి రాబోతు న్నాం", "అరేయ్! నీ చొక్కా మీద బురద పూశారేంటి" - ఇలాంటి తమాషాలతో మిత్రులను, ఆప్తులను వెర్రివెంగళప్పలను చెయ్యడానికి అవకాశం కల్పించే ఏప్రియల్ 1 అందరికీ ప్రియమైన రోజు! "సంవత్సరంలో మిగిలిన రోజుల్లో మనం ఏమిటనేది ఏప్రియల్ 1న గుర్తు చేసుకుంటూ ఉంటాం" అంటాడు హాస్య చక్రవర్తి మార్క్ ట్వెయిన్.

సుందరరావు చదువులో ఎంత దిట్టనో, లోకజ్ఞానంలో అంత మందమతి. ఒకరోజున వాళ్ళ అన్నయ్య అతనిని పిలిచి "తమ్ముడూ! బ్రహ్మానందం మాస్టర్ గారి ఇంటికి వెళ్ళి ఆయన ఉన్నారేమో చూసిరా" అని పంపాడు. సుందరరావు మాస్టర్ గారి ఇంటికి వెళ్ళి, తిరిగివచ్చి "అన్నయ్యా! మాస్టారు ఇంట్లో లేరు" అని చెబుతుండగా, అప్పుడే ఆ ఇంట్లోకి ప్రవేశిస్తున్న మాస్టారు సుందరరావుతో "ఏరా.....నేను నీకు దారిలో కన్పించాను కదా! మరి ఏమీ చెప్పలేదేంటి?" అన్నాడు ఆశ్చర్యంగా. "మాస్టారుగారు ఇంట్లో ఉన్నారో లేరో చూసిరమ్మని అన్నయ్య చెప్పాడు కాని, మీరు దారిలో కన్పిస్తే చెప్పమని నాతో అనలేదుగా" అంటుంటే అందరూ హాయిగా నవ్వుకున్నారు.

చదువురాని నౌకరు యజమాని దగ్గరకు ఓ ఉత్తరం తెచ్చి "ఇంటి నుండి మా ఆవిడ రాయించిందండయ్యా..... కాస్త చదివి పెడుదురూ" అని బతిమాలాడు. "సరే" అన్న యజమాని ఉత్తరం తీసుకొని చదవడం ప్రారంభించాడో లేదో నౌకరు వెనగ్గా వచ్చి యజమాని చెవులు మూయడంతో ఆశ్చర్యపోయిన యజమాని "ఏందిరా ఇదంతా" అన్నాడు నౌకరుతో. "మొగుడూ పెళ్ళాల విషయం గదయ్యా. పరాయోళ్ళు ఇంటే బాగోదు గదా!" అని నవ్వుతూ అతను అంటుంటే యజమానికి ఇంక నవ్వు ఆగలేదు.

నవ్వుల ఆటలు : ఆల్ ఫూల్స్ డే నవ్వుల ఉత్సవం. ఆనాడు ఎలా గేలి చేశాము అన్నది ముఖ్యం కాదు. గేలి చేయడానికి ప్రయత్నించడమే ముఖ్యం. నిజానికి హిందువుల పండుగలలో ఇలాంటి నవ్వుల ఆటలకు, పాటలకు, గేలికి, గోలకు ప్రత్యేక స్థానం కల్పించబడింది. సంక్రాంతి, దసరా, దీపావళి మొదలైన పండుగలకు అల్లుళ్ళు అత్తవారిళ్ళకు వస్తారుకదా! ఆ పండుగలు వచ్చాయంటే ఇంటిల్లపాదికి నవ్వుల పండు గలే. ముఖ్యంగా బావను గేలిచేస్తూ కొంటె మరదళ్ళు పాడే పాటలు జానపద సాహిత్యం లో కోకొల్లలు.

---

బావా బావా పన్నీరు
బావను పట్టుకు తన్నేరు
వీధి వీధీ తిప్పేరు
వీసెడు గంధం పూసేరు

అంటూ మూడు కాళ్ళ కుర్చీ పైన బావను మురిపిస్తూ కూర్చోబెట్టడం, గారెల్లో చింతపిక్కలు, దూది పెట్టడం, నవారు తీసివేసిన మంచం పై కొత్త దుప్పటి వేసి కూర్చోమనడం, తౌడు కలిపి సున్నుండలను తయారుచేయడం, బావగారి చొక్కాలో సాలీడును వదలడం, కిళ్ళీలో కారం కలిపి ఇవ్వడం - ఇలాంటి తమాషాలతో ఆనందించ డానికి అవకాశం కల్పించే నవ్వుల పండుగలు అవి.

పెళ్ళి పాటలు : అలానే హిందూ వివాహ తంతులో భాగంగా నూతన వధూవరులు పలురకాల ఆటలాడటం, వియ్యాలవారు దొంగ చెంబు ఇవ్వడం, వియ్యపురాలుకు బహుమతులు - చిన్న చిన్న గుడ్డముక్కలతో కుట్టిన చీరె, కూరగాయల తొక్కలు, తొడిమలతో దండలు వేయడం, బిస్కెట్లు, స్ట్రా బాల్స్, కూరగాయలతో కిరీటం పెట్టడంలాంటి చిత్రాతిచిత్రమైన బహుమతులు ఇవ్వడం ఇందుకు ఉదాహరణలు.
ఇంక ఆనాడు పాడుకునే పాటలలో ఎన్ని హాస్యోక్తులు ఉంటాయో! మచ్చుకు ఒక్కటి....

పెళ్ళికూతురువైపువాళ్ళు పాడే పాట :
వచ్చిరమ్మా వియ్యాలవారు
అచ్చమైన మర్కటములతీరు
విందు కొచ్చినారు వియ్యాలవారిపుడు
పొందుగానూ వీరు భోంచెయ్యలేరు ||విందు||

పీట వెయ్యగా నల్వాటు లేదన్నారు
నీటుగా ముక్కాలు పీట తెమ్మన్నారు ||విందు||
అప్పడంబులూ ఎప్పుడూ ఎరుగరంట
ఒప్పుగానూ ఒడియం ఒంటికీ పడదంట ||విందు||

---

చమత్కారం చిన్నపొదవంటిది అయితే, న్యాయనిర్ణయం కలప వంటిది, ఒకటి పెద్ద మంటను ఇస్తే, రెండవది నిలకడగల వేడినిస్తుంది. అవి కలిస్తే మంచి మంటను చేస్తాయి.
– ఓవర్ లంగ్

బొబ్బట్లు, పులిహోర వద్దనా చేయిస్తే
కొయ్య చేకోడీలు మాకిష్టమన్నారు ||విందు||
లడ్డూ జిలేబీలు వద్దనా చేయిస్తే
మడ్డి పిండి వంటలు మాకెందుకు అన్నారు ||విందు||

ఈ పాటతో ఎంత అమాయకత్వం ఉంటుందో, అంతకు మించిన వ్యంగ్యం చోటుచేసుకుంటుంది. ఈ పాటలు మన నవ్వుల ఆస్తి. జానపదుల జీవన దోస్తి. ఆనందలక్ష్మికి వారు చెల్లించే కిస్తీ.

పెళ్ళికొడుకువైపువాళ్ళు పాడే పాట :
విందూ చేసిరమ్మ విందూ! వియ్యాలవారి ..
చందాము తెల్పెదము! అందారికానందమౌనౌనూ!
నిన్నగాక మొన్న మేము వియ్యాలవారి
విడిదికి వెళ్ళితిమీ - కూర్చోటానికి కుర్చీ
లేదు, నుంచోటానికి నీడా లేదు ||విందూ||

విస్తరి చూస్తే మట్టి ఆకు - విస్తట్లోకి చూడాగానే
గుండెలు ఝల్లుమనియెనమ్మా ||విందూ||
పప్పు వండలేదు - ఉప్పు వెయ్యలేదూ
వట్టి గంజినీళ్ళు తెచ్చి వడ్డించిరీ మాకు ||విందూ||

కూర చెయ్యాలేదు, పచ్చడి నూరాలేదు
గొడ్డుకారం తెచ్చి మాకు విస్తట్లోనూ వేసి పోయిరీ ||విందూ||
గారె చెయ్యాలేదు, బూరె వండాలేదు - జొన్న
రొట్టెలు తెచ్చి మాకు కొసరి కొసరి వడ్డించీరి ||విందూ||

మనకు ప్రత్యేకంగా నవ్వుల పండుగలు లేనప్పటికీ మన పండుగలన్నీ నవ్వులతో నిండి ఉండటం విశేషం. వియ్యపురాళ్ళ పాటలు, బావా మరదళ్ళ సరసాలు గొప్ప నవ్వుల పండుగలే. ఎటొచ్చీ నాగరికత పేరుతో వీటన్నింటిని నాజూకుగా మూటకట్టి అటకెక్కించాము. అవేవో పిచ్చి పద్ధతులని, అనాగరిక ఆనవాళ్ళన్న బడాయిలు ఇకనైనా

---

మనిషి వ్యక్తిత్వంలోని కొంత భాగాన్ని అతను నవ్వే తీరుని బట్టి తెలుసుకోవచ్చు. – బొవీ

మానదాం. ఈ పండుగలను మరింత పెద్ద మోతాదులో జరుపుకుంటూ రోజంతా హాయిగా ఆనందిద్దాం.

అఖిల మూర్ఖులు దినోత్సవంలోని ఆంతర్యం ఇదే. ప్రతి ఒక్కరం ఇతరులలోని మూర్ఖశిఖామణులను చూడటానికి, చూసి ఆనందించడానికి ఉబలాటపడతామేకాని, అదేం చిత్రమో మనలోని మూర్ఖుణ్ణి చూడటానికి మాత్రం ససేమిరా ఇష్టపడం! ఈ విశాల ప్రపంచంలో నేనొక్కణ్ణి తప్ప మిగిలినవారంతా మూర్ఖులే అని ఆనందించడం వెనుక ఎంత అజ్ఞానం ఉంది! ఎంత వ్యంగ్యం, ఎంత హేళన దాగి ఉన్నాయి! అలాంటి హాస్యగాళ్ళను గతంలో విదూషకులు అని ఎందుకు అనేవాళ్ళో తరువాత అధ్యాయంలో తెలుసుకుందాం.

---

స్వీయ సంరక్షణార్థం ఆత్మ సృష్టించిన ఆయుధాలలో హాస్యం ఒకటి. అది ఏకాంతాన్ని ఇస్తుంది. ఏ పరిస్థితినైనా, కనీసం కొన్ని క్షణాలు అధిగమించగల శక్తినిస్తుంది. – విక్టర్ ఫ్రాంకిల్

అధ్యాయం 34

# విదూషకుడు అంటే తమాషానా?

ప్రపంచవ్యాప్తంగా విదూషకులకు ఎప్పుడూ ఒక ప్రత్యేక స్థానం ఉంది. సరైన సమయంలో సరైన హాస్యోక్తి చెప్పిన వ్యక్తి సామాజికంగా ఎదగడానికి ప్రాచీన కాలంలో చక్కని అవకాశం ఉండేది. అయితే, ఆ హాస్యాన్ని ఏమాత్రం దుర్వినియోగపరచినా, ఆదమరచి ఉపయోగించినా అతనిని సామాజికంగా క్రిందకు తోసివేసేవారు. అందుకే విషయాన్ని హాస్యోక్తిగా వివరించాలేకాని, హాస్యంతో నటించడాన్ని సహించేవారు కాదు. విదూషకుడు అంటే హాస్యగాడు, హాస్యగానిలా ప్రవర్తించేవాడు, పరిహాసకుడు, నాయక సఖుడు. వికృతరూపం, విచిత్ర వేషధారణ, తిండిబోతుతనం, అమాయకత్వం ఇత్యాది వింత లక్షణాలు ఇతడి సొంతం.

రెండువేల సంవత్సరాల పూర్వమే.. : భరతుడు నాట్య శాస్త్రాన్ని సుమారు రెండు వేల సంవత్సరాల క్రితం రూపొందించాడు. సౌందర్య శాస్త్రం పై గొప్పరచన అయిన ఆ గ్రంథంలో ఆయన విదూషకునికి మంచి ప్రాధాన్యమిచ్చాడు. సంస్కృతంలోని 'కుందమాల', 'తాపస వత్సరాజ' మొదలైన విషాదాంత నాటకాలలో కూడా విదూషకుడు ఆద్యంతం ప్రేక్షకుల దృష్టిని ఆకర్షిస్తాడు. సాధారణంగా రెండవ అంకం మొదట్లో నవ్వుతూ స్వాగతించే విదూషకుడు హాస్యంలో ప్రధాన పాత్ర పోషిస్తాడు. నాయికకు నవ్వు తెప్పించేవాడే విదూషకుడంటాడు అభినవగుప్తుడు. అలాగని నవ్వు తెప్పించే పాత్రలన్నీ విదూషక పాత్రలు కాకపోవచ్చు. ఉదాహరణకు, కొన్ని సమయాలలో నారద పాత్రలో కూడా హాస్య లక్షణాలు కన్పిస్తాయి. భానుడు 'ప్రతిమ', 'ప్రతిజ్ఞ యౌగంధ రాయణ'లో, భవభూతి 'ఉత్తరరామ చరిత్ర'లో విదూషక పాత్రకు స్థానం కల్పించకపోయినప్పటికీ, 'నాట్యశాస్త్రం', 'నాట్యదర్పణం' మొదలగు ప్రఖ్యాత రచనలు విదూషకపాత్రను లింగ, ద్విజ, రాజజీవి, శిష్య అనే నాలుగు భాగాలుగా విభజించడమే గాక, నవరసాలలో హాస్యం అత్యున్నత రసం అని కీర్తించాయి.

ఉన్నతులు దిగువ వర్గాలవారి పై చతురోక్తులు విసరకూడదన్న నిబంధన ప్రాచీన కాలంలో ఉండేది. అలా హాస్యోక్తులు విసరడం సామాజిక విచ్ఛిత్తికి దారితీస్తుందని, అట్టడుగు వర్గాలవారు ఉన్నతులను లోబరుచుకోడానికి ప్రయత్నిస్తారని వారి భయం. నిజానికి ఏ సూత్రాలు, నియమనిబంధనలు హాస్యాన్ని నియంత్రించలేవు కనుక ఆచరణలో హాస్యం సులువుగా హద్దులు దాటిపోతుంది. అందుకే అది సంప్రదాయబద్ధమైనది కాదని

---

హాయిగా నవ్వడం, ఆనందించడం అంటే ఒక దానిని సరదాగా తీసివేయడమే. – వాల్కాట్

చెప్పారు. హాస్యాన్ని ఒక క్రీడలా భావిస్తే, దాని నియమాలను అదే అధిగమిస్తుంది కనుక కొన్ని సమయాలలో దానికి అర్థ స్పష్టత లేకుండాపోతుంది.

దేశవిదేశాలలో విదూషకులు : ఐరోపా, మధ్యప్రాచ్యం, ఉత్తర ఆఫ్రికా, చైనా, భారత్, మధ్య అమెరికా, న్యూజిలాండ్ దేశాలలో ఆస్థాన విదూషకులు ఉన్నట్లుగా విలువైన చారిత్రక ఆధారాలు లభిస్తాయి. విదూషకులు సామాన్యంగా మధ్యతరగతి నుండి రావడం, వారిలో ఎక్కువగా మరుగుజ్జులు, గూనివారు ఉండటం ఒక ప్రత్యేకత. నర్మగర్భంగా, వంకరటింకరగా కాక మనసువిప్పి మాట్లాడటం వారి లక్షణం.

పొగడ్తరాయుళ్ళతో నిండిన రాజప్రాసాదాలలో హాస్యోక్తులతోనో, వ్యంగ్య ధోరణిలోనో ప్రజా సమస్యలను పాలకుల దృష్టికి తీసుకువస్తూ పాలనను కొంతవరకు అదుపులో పెట్టగల సమర్థులుగా విదూషకులు కీర్తిగడించారు. ప్రపంచ వింతలలో ఒకటిగా ప్రసిద్ధి చెందిన గ్రేట్ వాల్‌ను చైనా చక్రవర్తి కళ్ళు చెదిరే ఖర్చుతో నిర్మించిన తరువాత దానికి బంగారు పూత పూయించాలన్న ఆలోచనలో పడ్డాడు. అయితే, విదూషకులు తమ నవ్వుల మాటలతో అలా చేస్తే దేశంలో విప్లవం వస్తుందని చెప్పి చాకచక్యంగా ఆ కార్యక్రమాన్ని ఆపగలిగారు. చైనా చక్రవర్తి లిట్టు ఒకనాడు తన ఆస్థాన పండితులను "మనదేశ రాజధానికి దూరంగా వర్షం పడుతుందేగాని, రాజధా నిలో ఎందుకు పడటంలేదు?" అని ప్రశ్నించాడు. "ఇక్కడకు వస్తే పన్నులు విధిస్తారన్న భీతితో వర్షం కూడా బెంబేలెత్తిపోతూంది రాజా! అందుకే మన నగరంలోకి ప్రవేశించడానికి దానికి గుండె చాలడంలేదు" అని ఒక విదూషకుడు వ్యంగ్యాన్ని, హాస్యాన్ని జోడించి హృద్యమంగా సమాధానం ఇచ్చాడు. ఆ మాటలు విన్న రాజు ప్రజల పై పన్నుల భారం అధికంగా ఉన్నదని తెలుసుకొని పన్నులు తగ్గించాడు.

ప్రష్యా రాజు మొదటి ఫ్రెడరిక్ ఆస్థాన విదూషకుని పేరు పస్మాన్. ఆయన చర్చి అధి కారులను ఘాటుగా విమర్శించడంతో వాళ్ళు ఆయన పై కినుక వహించి, చివరకు అతని దహనక్రియలలో పాల్గొనడానికి కూడా వ్యతిరేకించారు. అది తెలుసుకున్న రాజు 'ఇతరులకు బాధకలిగినప్పటికీ పస్మాన్ ఎప్పుడూ సత్యాన్నే పలుకుతాడని, ఆ విషయంలో ఆయన తనను కూడా వదిలి పెట్టలేద'ని స్పష్టంచేశాడు. చర్చి ముందు అతనిని సమాధి చేయమని ఆజ్ఞాపించి విదూషకునిపట్ల తనకుగల ప్రేమను చాటుకున్నాడు.

రష్యా రాజు పీటర్ ది గ్రేట్ తమ దేశస్థులు పాటిస్తున్న మూఢనమ్మకాలను హేళన చెయ్యమని తన ఆస్థాన విదూషకులను ప్రోత్సహించాడు. సంపన్న వర్గీయులు (నోబుల్స్)

---

ప్రతిజంటకు పరిణయంచేసే మారువేషంలో ఉన్న పురోహితుని వంటిది హాస్యం.– జీన్ పాల్

రాజుతో విదూషకుల విమర్శలపై ఆరోపణలు చేయగా, రాజు నవ్వుతూ “వారి విషయంలో నేనేమి చేయగలను? వారు అమాయకులు, అజ్ఞానులు కదా!” అని తేల్చిపారేశాడు.

ఫ్రెంచి రాజు లూయిూ 13 తన ఆస్థాన విదూషకుడు మరాయిస్ కు క్షవరం చేస్తూ ఆనందించగా, క్రాఫ్ పూర్తయిన తరువాత విదూషకుడు రాజుకు డబ్బు చెల్లిస్తూ నవ్వేవాడట! విదూషకునికి రాజుతోగల అసాధారణ పరిచయానికి, రాజుకు ఆయన పైగల అపూర్వ విశ్వాసానికి ఇది గొప్ప ఉదాహరణ. 8వ హెన్రీ చక్రవర్తి ఆస్థాన విదూషకుడు విల్ సోమర్స్ రాజప్రాసాద కాపలాదారుల నియామకంలో కూడా కీలకపాత్ర పోషించే వాడు, ఒక పర్యాయం రాజు నియమించిన రక్షకుల ముఖాల పైన, చేతుల పైన ఉన్న గాయాలను చూసి “రాజా! వీరిని నియమించేకన్నా, వీరిని గాయపరచినవారిని వెతికి పట్టుకొని వారిని నియమించడం రాజ్యానికి మంచిదేమో ఆలోచించండి” అన్నాడు.

బ్రిటన్: ఎలిజబెత్ మహారాణి ఆస్థాన విదూషకుడు టార్లటన్. తన మానసిక ఆందోళనలను, బాధలన్నింటినీ ఆస్థాన వైద్యులందరికన్నా విదూషకుడే చక్కగా నయం చేశాడని రాణి స్వయంగా చెప్పడం విశేషం. పలురకాల విదూషకులు : అన్నట్లు రాజులేగాక, కొందరు సంపన్నులు కూడా విదూషకులను పోషించిన ఉదంతాలు చరిత్రలో కన్పిస్తాయి. పోప్ లియో 10, ప్రముఖ రచయిత థామస్ మూర్లు కూడా విదూషకులను తమ కుటుంబసభ్యులుగా గౌరవించారు. అంతేకాదు. పట్టణ విదూషకులు, సహకార సంఘ (గిల్డ్) విదూషకులు, వసతి గృహ విదూషకులు, సైనిక విదూషకులు - ఇలా ప్రతిచోట పలురకాల విదూష కులు కన్పిస్తారు. 1935లో ఎనిడ్ వెల్ఫోర్డ్ అనే రచయిత్రి బ్రిటన్లో మధ్యయుగం నుండి ఆధునిక సినిమా యుగం ప్రారంభందాకా హాస్యగాడు పాత్ర గురించి సుదీర్ఘ అధ్యయనం చేశారు. ఆనందాన్ని సృష్టించేవాడుగానేగాక, స్వేచ్ఛను కల్పించేవాడుగా కూడా హాస్యగాడు చరిత్రలో, సాహిత్యంలో శాశ్వత స్థానం పొందాడని ఆమె పేర్కొన్నారు . ఈ విధంగా అనాదిగా సమాజంలో హాస్య చక్రవర్తులకు ప్రత్యేక స్థానం ఉందని తెలుస్తుంది. 1940లో జరిగిన ఒక సర్వే ప్రకారం ప్రపంచంలోని 136 సంస్కృతులలో హాస్యగాడు, విదూషకుడు పాత్ర సామాజిక గుర్తింపు పొంది ఉన్నది.

ముసుగు వీరుడు : మరణం ఒక మోసం అనిచెప్పే హాస్యగాడు మనకు గొప్ప ఊరట కలిగిస్తాడు అంటారు ఎనిడ్. బైబిల్ లో కూడా స్వర్గానికి రహదారి మరణం అని పేర్కొనబడింది. 'నేను క్రీస్తు కొరకు జీవిస్తాను. అది కాదంటే మరణమే నాకు లాభదాయకం”

---

హాస్యోక్తి ఒకానొక నింద వంటిది అయితే, సంస్కరింపబడిన అహంకారం సరసోక్తి. – అరిస్టాటిల్

అంటాడు సెయింట్‌పాల్. ఇలాంటి దృఢమైన అంశాలను హాస్య రూపంలో చెప్పగలిగేది విదూషకుడు ఒక్కడేకదా! .

బాహ్య ప్రపంచానికి అతడొక అమాయకుడిగా కన్పించినప్పటికీ విలువలను గురించి బోధించడంలో విదూషకుని ప్రత్యేకత కన్పిస్తుంది. సోమర్స్ జీవిత చరిత్రకారు డు ఆస్థాన విదూషకుల పాత్ర గురించి చెబుతూ "అతను కట్టుకథలు సృష్టించదు. పొగడ్తలకు దూరంగానూ, గుసగుసలకు అతీతంగానూ ఉంటాడు. సమస్యలను సృష్టించడం, వైషమ్యాలను పెంచడం అతని లక్షణం కాదు. ఆయన యదార్థవాది, నిష్కపటి, మృదు భాషి కావడంవల్లనే అందరూ అతనిని అభిమానిస్తారు" అన్నాడు.

క్లాప్ ప్రకారం సామాజికంగా కూడా అవివేకికి ఎంతో ప్రాధాన్యం ఉంది. ఆయన ఒక హీరో, ఒక విలన్‌లాంటివాడు. సామాజిక వ్యక్తి అసలైన వ్యక్తి కాదని, అతనిని ఒక నమూనాగా తీసుకొని ఇతరులు అనుకరిస్తారన్నది ఆ రచయిత వాదన. షేక్స్పియర్ తన నాటకాలలో చిత్రించిన అవివేకి నిజానికి గొప్ప మేధావి అంటాడు ఆయన. అలానే, ప్రముఖ మనోవిజ్ఞాన శాస్త్రవేత్త అబ్రహాం మాస్లో హాస్య ప్రవృత్తిగల వ్యక్తిని అత్యున్నత వ్యక్తిగా వర్గీకరించాడు.

సర్కస్ లో బఫూన్ అందరినీ నవ్విస్తూ కవ్విస్తాడు. అతని వేషభాషలు మనల్ని నవ్వించినా, సర్కస్ ఫీట్లో అతడొక ఆల్ రౌండర్. మాస్టర్స్ చేసే చాలా ఫీట్లు అతను సులువుగా చెయ్యగలడు. విచిత్రమేమంటే అతనేమి చేసినా ప్రేక్షకులు ఒక తమాషాగానే తీసుకుంటారు! అలానే, చీట్ల పేకలో జోకర్ అతి ముఖ్యమైన కార్డు కదా! ఈ విధంగా చరిత్రలో విదూషకులు ఘన చరిత్ర గలవారు; ఘనాపాటీలంతటివారు. హాస్యం వారి వృత్తి. సమాజ ప్రగతి వారి ప్రవృత్తి. నిజానికి విదూషక పాత్ర ఒక ముసుగు; అదొక బురఖా. ఈ విధంగా అవివేకి నైతికతకు భిన్నంగా తనకు అతీతమైనదానిని గురించి నొక్కివక్కాణిస్తూ, తాను భంగపరిచేదానినే భద్రపరచడానికి కృషిచేస్తూ తానొక నియంత్రణా శక్తిగా పనిచేయడంవల్ల ఆ పాత్ర అనుపమానంగా, అద్వితీయంగా కన్పిస్తుంది.

కన్నీరు నుండి పన్నీరు : కష్టాల కడలిలోనుండి హాస్యం జనిస్తుందన్నమాట బీర్బల్ జీవితానికి చక్కగా వర్తిస్తుంది. ప్రఖ్యాత విద్వాంసుడు, పండితుడు అయిన చంద్ర శేఖరుని కుమారుడు బీర్బల్. ఆతని బాల్యంలోనే తల్లి మరణించింది. 18వ ఏట తండ్రి స్వర్గస్తుడవటంతో అతని జీవితం దుర్భరం, దుఃఖమయం అయింది. పొట్టగడవక 20వ ఏట ఢిల్లీ చేరాడు. అదే సమయంలో హాస్యప్రియుడైన అక్బర్ చక్రవర్తి తన చిలిపి కోరికలు

---

సాగుతున్న లోక వృత్తానికి కర్ణధారి కాకపోయినా 'కుంచెధారి' కార్టూనిస్ట్. – ఎ.బి.కె. ప్రసాద్.

తీర్చగల, యుక్తితో సమాధానం చెబుతూ సమయస్ఫూర్తితో ఆనందం కలిగించగల నేర్పరి కొరకు ఎదురుచూస్తున్నాడు. అన్నట్లు..... అప్పుడు అక్బర్ వయస్సు 30 సంవత్సరాలు.

తనకు నిరంతరం హాస్యం అందించే వ్యక్తిని ఎంపిక చేసుకోడానికి అక్బర్ ఒక పోటీ పెట్టాడు. “అచ్చు నాలాగే ఉండే బొమ్మ గీసినవానికి వెయ్యి వరహాలు ఇస్తా” అని ప్రకటించాడు. ఎందరో చిత్రకారులు వచ్చారు. ఎన్నో బొమ్మలు గీసి ఇచ్చినా అక్బరు ఏ ఒక్కటీ నచ్చలేదు. రోజులు గడుస్తున్న కొద్దీ అక్బర్ లో తన కోరిక నెరవేరు తుందా? అన్న అనుమానం పెరిగింది. ఆ సమయంలో బీర్బల్ రంగప్రవేశం చేశాడు.

“చిత్రం గీశావా?” చక్రవర్తి ప్రశ్న. “సజీవ చిత్రం మహాప్రభూ!” బీర్బల్ సమాధానం. “అయితే.... వెంటనే చూ పెట్టు” అంటూ హుకుం జారీ చేశాడు అక్బర్. తెల్లని గుడ్డలో చక్కగా అమర్చిన అద్దాన్ని తీసి చక్రవర్తి ఎదురుగా పెట్టాడు బీర్బల్. అందులో ఏం కన్పించింది? తీవ్రంగా చూస్తున్న అక్బర్ సజీవంగా కన్పించాడు! ఆయన చతురత, యుక్తి, తెలివితేటలు అక్బరు ఎంతో నచ్చాయి. అంతే! నాటినుండి బీర్బల్ హాస్య విజ్ఞానయాత్ర ప్రారంభమైంది. అక్బర్ వేసే ఎన్నో చిక్కు ప్రశ్నలకు ఆయన చక్కని సమాధానాలు ఇవ్వడంతో క్రమంగా చక్రవర్తికి సన్నిహితుడయ్యాడు. యుక్తి + సమయస్ఫూర్తి బీర్బల్ అన్నట్లుగా పేరు గాంచాడు.

ఒకరోజు అక్బర్ కి తాను దైవంకన్నా గొప్పవాడినన్న అహం కలిగింది. సభలో అందరూ ఆసీనులై ఉండగా, “దేవుడికన్నా రాజు ఎలా గొప్పవాడు? భగవంతుడు చేయలేని పనిని నేను చేయగలనా?” అని ప్రశ్నించాడు రాజు. రాజుగారి కుమారుణ్ణి ఎత్తుకున్నా చావే, దించినా చావే కదా! దేవుడికన్నా చక్రవర్తి తక్కువ అంటే ఏ శిక్ష విధిస్తాడోనన్న భయం. మరి రాజు దైవంకన్నా గొప్పవాడని ఎలా చెప్పాలో తెలియక సభలో నిశ్శబ్దం తాండవించింది. ఇంతలో “ప్రభువు దైవంకన్నా గొప్పవాడే ” అని బీర్బల్ అనగానే, “ఎలా?" అన్నాడు అక్బర్. “ప్రభువుకు కోపం వస్తే “నా రాజ్యం నుండి పో" అని శాసించగలడు. మీ రాజ్యం పరిమితమైనది కనుక అతడు మరొక రాజ్యానికి పోగలడు. ఈ విశాల విశ్వమంతా దైవానిదే కనుక ఆయన అలాంటి ఆజ్ఞ జారీ చేయలేడుగా!" అంటూ బీర్బల్ ఆ సమస్యను పరిష్కరించాడు.

తిండిపోతు రాజు : అంతఃపురంలో రాజు, రాణి రేగుపండ్లు తింటుండగా బీర్బల్ ప్రవేశించిన సందర్భం. రేగుపండ్లు తినడం పూర్తయిన రాజు తన ప్లేటులోని విత్తనాలన్నింటినీ నెమ్మదిగా రాణిగారి ప్లేటులోపోశాడు. బీర్బల్ వైపు చూస్తూ 'చూశావా బీర్బల్! మీ రాణి

---

హాస్యం అహం యొక్క విజయమే గాక, వినోదసూత్ర విజయం కూడా. – ఫ్రాయిడ్

ఎంత తిండిబోతో! ఎన్ని రేగుపండ్లు తిన్నదో చూడు' అంటూ పకపకనవ్వడంతో మహారాణి ముఖం సిగ్గు మొగ్గయింది. బీర్బల్ తడుముకోకుండా 'మహారాణిగారి కంటే ప్రభువులే తిండిబోతులుగా ఉన్నారు' అనడంతో అక్బర్ కోపంగా ఏలా?' అని గద్దిం చాడు. 'ఏముంది ప్రభూ! రాణిగారు పండ్లు మాత్రమే భుజించగా, మీరు గింజలుకూడా మిగలకుండా తిన్నారు' అనడంతో 'శెభాష్ బీర్బల్' అంటూ అభినం దించాడు రాజు.

మూర్ఖాతి మూర్ఖుడు : “నా రాజ్యం మొత్తంలో గొప్ప మూర్ఖుడు ఎవరో చూపెట్టండి. వారం రోజులు గడువు ఇస్తున్నా. ఆ పెద్ద మూర్ఖుణ్ణి పట్టుకొచ్చి గొప్ప బహుమతి అందుకోండి” అని ఒకరోజున హుకుం జారీ చేశాడు చక్రవర్తి. అందరూ మూర్ఖుని వేటకై బయలుదేరారు. అలా బయలుదేరిన బీర్బల్‌కు నెత్తి మీద గడ్డిమోపు పెట్టుకొని గేదె పై కూర్చున్న వ్యక్తి కన్పించడంతో ఆశ్చర్యం వేసింది. “మోపును గేదె పైన పెట్టవచ్చు గదా!" అని పశువుల కాపరిని బీర్బల్ ప్రశ్నించగా, దానికి అతను “అయ్యో! ఇది చాలా బలహీనంగా ఉంది. దీని పైన అంత బరువు పెడితే మొయ్యలేక చస్తుంది. అందుకే ఆ మోపును నేనే మోస్తున్నా స్వామీ” అంటూ అతను విచిత్రంగా చూశాడు. ఎనిమిదవ రోజున బీర్బల్ ఆ మూర్ఖ శిఖామణిని రాజదర్బారులో ప్రవేశపెడుతూ ఆనాడు తనకు, ఆ పశువుల కాపరికి మధ్య జరిగిన సంభాషణను రాజుగారికి వివరించడంతో అందరూ బీర్బల్‌ను అభినందించారు.

ఈ విధంగా బీర్బల్ హాస్యంలో యుక్తి ఎంత ఉన్నదో, సమయస్ఫూర్తి అంతగా కన్పిస్తుంది. దేశభక్తి ఎంత ఉన్నదో, ప్రభుభక్తి అంతకన్నా అధికంగా కన్పిస్తుంది. అందుకే అక్బర్ అతనికి ఓ అందమైన ప్రాసాదం కట్టించి ఇచ్చాడు. బీర్బల్ ఎడల ప్రభువుకుగల అభిమానం, ప్రేమకు ఇదొక మచ్చుతునక. ప్రభువును ఎల్లప్పుడు హాస్యపుజల్లులో ముంచెత్తుతూ, అవసరమైనప్పుడు చురకలు వేస్తూ తాను నవ్వుతూ, పదిమందినీ నవ్వించిన విదూషక బీర్బల్ జీవితం ధన్యం.

నేటి ప్రపంచంలో సౌదీ యువరాజు ఈనాటికీ తనవెంట విదూషకుణ్ణి తీసుకువెళ్తాడని చెబుతారు . ఏ ప్రభుత్వ వ్యవస్థలో నైనా పాలనాధికారులను నిరంతరం సవాల్ చేయనిదే, బాధ్యత వహించేటట్లు చేయనిదే ప్రజాజీవనం దుర్లభమవుతుంది. మరి ఆధునిక యుగం కార్పొరేట్ యుగం కనుక ఈనాడు కార్పొరేట్ విదూషకులు అవసరమేమో అని ఆలోచిస్తూ, పేజీ తిప్పి ఇంక అద్భుత హాస్యోక్తులు చదవండి.

---

సమాజ సభ్యునిగా మనం ధరించే దుస్తులలో అతిముఖ్య భాగం మంచి హాస్యం. – హాకరీ.

అధ్యాయం35

# అద్భుత హాస్యోక్తులు

నవ్వుల ప్రయోగశాల (Laugh Lab) వారు ప్రపంచవ్యాప్తంగా నిర్వహించిన హాస్యోక్తుల పోటీలో అత్యుత్తమ హాస్యోక్తి, దాని విశ్లేషణ గురించి తెలుసుకున్నాం కదా! ఇప్పుడు ద్వితీయ స్థానాన్ని పొందిన హాస్యోక్తితో దీనిని ప్రారంభిద్దాం.

షెర్లాక్ హోమ్స్, డా|| వాట్సన్లు ఒక పరిశోధనకై బయలుదేరారు. మార్గమధ్యంలో ఒకచోట సుష్టుగా భోంచేసి మద్యం సేవించి ఒక గుడారంలో నిద్రపోయారు. కొన్ని గంటల తరువాత హోమ్స్ మేల్కొని తన స్నేహితుణ్ణి నిద్రలేపుతూ “వాట్సన్! ఆకాశం వైపు చూసి అక్కడ ఏమి కనిపిస్తుందో చెప్పు” అన్నాడు. “లక్షల లక్షల నక్షత్రాలు కనిపిస్తున్నాయి హోమ్స్” వాట్సన్ సమాధానం. “దీనినిబట్టి నీకేమి తెలుస్తుంది?" వాట్సన్ ఒక్క నిమిషం ఆలోచించి “నాకు ఖగోళ శాస్త్రరీత్యా లక్షలాది పాలపుంతలు, కోట్లాది గ్రహాలు ఉన్నట్లు తెలుస్తుంది. జాతక శాస్త్రరీత్యా శని సింహరాశిలో ఉన్నట్లు అర్థమవుతుంది. గడియారాల నిర్మాణ శాస్త్రరీత్యా రాత్రి దాదాపు 3 గంటల సమయం అవుతున్నట్లుంది. వాతావరణ శాస్త్రరీత్యా రేపటి దినం అందంగా ఉంటుందని అనిపిస్తుంది. ఆధ్యాత్మికంగా దైవం సర్వశక్తివంతుడని, మనమంతా ఈ విశ్వంలో అణువులు, పరమాణువుల వంటివారమని స్పష్టమవుతుంది. మరి......నీకేమనిపిస్తుంది?” అని ప్రశ్నించాడు. ఒక్క క్షణం మౌనం వహించిన హోమ్స్ నవ్వుతూ “పిచ్చి మిత్రమా! మన గుడారాన్ని ఎవరో దొంగిలించారు” అన్నాడు.

ఈ హాస్యోక్తిలో అనేక ప్రత్యేకతలు కనిపిస్తాయి. భిన్న శాస్త్రాలలో అపార పాండిత్యం గల హోమ్స్ తాను నిద్రిస్తున్న గుడారమే దొంగిలింపబడిందన్న వాస్తవాన్ని గ్రహించలేక పోయాడు. శాస్త్రాలన్నింటినీ ఔపోసన పట్టిన ఆ మేధావికి కళ్ళెదుట జరిగిన యదార్థం కన్పించకపోవడమే చిత్రాతి చిత్రం. ఇదే పెద్ద అప్రస్తుతం. “పిచ్చి మిత్రమా!” అనడం తోనే హాస్యోక్తిలోని కొసమెరుపు మనకు అర్థమవుతుంది. ఈ హాస్యోక్తిని బ్రిటన్‌కు చెందిన జివోఫ్ ఆనందప్ప లాఫ్ లా కు పంపారు.

ఎవరి అభిరుచులు వారివే : హాస్యోక్తులను ఆనందించడంలో కూడా దేశాల మధ్య వ్యత్యాసాలు కన్పిస్తాయి. బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మొదలైన దేశాలు పదప్ర

---

నిరంతర సత్యాన్వేషణకు స్వాగతించే హాస్యం మతంకన్నా మహోన్నతమైనది. – ఈస్ట్ మన్

యోగాలకు (Word Plays) ప్రాధాన్యమిస్తాయి. ఉదా : వారంలో ఏ రోజును చేపలు అసహ్యించుకుంటాయి? ఫ్రై డే ని. (Fry అంటే వేపుడు అని అర్థం)

అమెరికా, కెనడా వాసులు ఆధిక్యతా భావానికి అగ్రస్థానమిచ్చే హాస్యోక్తులను గౌరవిం చగా, ఫ్రాన్స్, డెన్మార్క్, బెల్జియం దేశస్థులు అతి వాస్తవ (Surreal) హాస్యోక్తులను అభిమానిస్తారు. ఒక ఆల్సేషన్ కుక్క టెలిగ్రామ్స్ ఆఫీస్ కు వెళ్ళి ఒక ఫారం తీసుకొని “ఊఫ్ ఊఫ్” అని తొమ్మిది పర్యాయాలు వ్రాసింది. క్లర్క్ ఆ పేపర్‌ను తీసుకొని మర్యాదగా “కుక్కగారూ! ఇందులో 9 పదాలే ఉన్నాయి. 10వ పదం “ఊఫ్ ఊఫ్” కూడా కలిపి అదే ధరకు పంపవచ్చు” అనగానే, దానికి ఆ కుక్క “అలా చేరిస్తే ఆ వాక్యానికి అర్థమే ఉండదు కదా!” అంది.

ఏ వర్గానికి చెందిన హాస్యోక్తుల పైనా ప్రత్యేక ఆసక్తి చూపక, అన్ని హాస్యోక్తులను చక్కగా ఆదరించడం జపాన్ దేశస్థుల ప్రత్యేకత. ఐరోపా దేశస్థులు మనకు ఆత్రుత కలిగించే మరణం, అనారోగ్యం , వివాహం మొదలైన విషయాలను సైతం అతి సులువుగా తీసుకొని హాస్యోక్తులను ఆనందిస్తారు.

సందేశాలను పంపడానికి హాస్యం అత్యంత అవసరం. ప్రజల హాస్య ప్రవృత్తిని వారి సంస్కృతి, ఆర్థిక, విద్య, సామాజిక నేపధ్యం ఎలా ప్రభావితం చేస్తాయో అర్థం చేసుకో గలిగితే, వారితో మనం మరింత సమర్థవంతంగా సంభాషిస్తాం అంటారు డా॥ రిచర్డ్ వైజ్ మన్.

లాఫ్ లాబ్ పరిశోధకులు కొందరు స్త్రీ పురుషులకు హాస్యోక్తులు చెబుతూ బ్రెయిన్ స్కాన్ సాయంతో వారి అనుభూతులను పరిశీలించగా, ఆశ్చర్యం గొలిపే హాస్యోక్తులు ఎక్కువమందిని ఆకర్షించినట్లు తెలుసుకున్నారు. పరిశోధకులు అడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానాలు ఇవ్వనివారు సులువుగా, వంకరలు లేని హాస్యోక్తులను ఆనందించారు. అదే విధంగా నిశిత పరిశీలనా శక్తి గలవారు క్లిష్టమైన హాస్యోక్తులను ఆనందిస్తారని స్పష్టమైంది.: ఒక శాస్త్రవేత్తను, తత్వవేత్తను ఆకలిగొన్న సింహం వేటాడుతోంది. శాస్త్రవేత్త గబగబా కొన్ని లెక్కలు వేసి “ఇంక లాభం లేదు. దాని నుండి తప్పించుకొని పరుగెత్తలేము. అది దగ్గరకు వస్తుంది” అనుకుంటాడు. శాస్త్రవేత్తకన్నా కొంచెం ముందుగా పరుగెత్తుతూ “సింహంకన్నా ముందుగా ఎలాగూ పరుగెత్తలేను కనుక నీకన్నా కొద్దిగా ముందు ఉండాలని ప్రయత్నిస్తున్నా. అంతే!” అన్నాడు తత్వవేత్త.

కొన్ని దేశాలలోని ప్రముఖ హాస్యోక్తులు:

---

సమాజ సభ్యునిగా మనం ధరించే దుస్తులలో అతిముఖ్య భాగం మంచి హాస్యం. – హాకరీ.

బ్రిటన్‌లోని బ్రిలియంట్ జోక్స్ : ఒక మహిళ హుషారుగా తన పాపతో బస్సు ఎక్కబోతూంది. బస్సు డ్రైవర్ పాపను చూసి “అబ్బ! ఇంత అనాకారి పాపను నా జీవితంలో చూడలేదు” అనుకుంటూ పొరపాటున పైకే అనేశాడు. ఆమె కోపంతో ఊగిపోతూ బస్సులో కూర్చుంటూ, ప్రక్కనున్న ప్రయాణీకునికి విషయం చెప్పి బాధపడింది. ఆ ప్రయాణీకుడు “మీరు వెంటనే డ్రైవర్‌ను మందలించండి. అంత దాకా.... మీ కోతిపిల్లను నేను పట్టుకుంటాలేండి!” అన్నాడు.

రెండు ముంగిసలు ఒక చెట్టు పైన కూర్చున్నాయి. ఒక ముంగిస రెండవదానితో “రాత్రి మీ అమ్మతో నిద్రించా” అంది. రెండవది పట్టించుకోకపోవడంతో అది మరింత పెద్దగా “మీ అమ్మతో గత రాత్రి నిద్రించా....విన్నావా?” అని అరిచింది. సమాధానంగా రెండవ ముంగిస ప్రశాంతంగా “నాన్నా....ఇంక ఇంటికి వెళ్ళు. బాగా త్రాగిఉన్నావు” అంది.

అమెరికాలో అద్భుత జోక్ : ఇద్దరు మిత్రులు - చార్లెస్, లారెన్స్‌లు గోల్ఫ్ ఆడి ఆడి, చివరకు లాన్స్‌లో విశ్రాంతి తీసుకుందామని అనుకున్నారు. ఇంతలో ఒక శవపేటిక ఊరేగింపుగా రావడంతో చార్లెస్ టోపీ తీసి కళ్ళు మూసుకొని తలవంచి ప్రార్థించాడు. దీనిని చూసిన లారెన్స్ ఆశ్చర్యంగా “మిత్రమా! ఇది నా మనస్సును అమితంగా హత్తుకున్న సన్నివేశం. నిజంగా నువ్వు ఎంతో దయార్ద్ర హృదయుడివి” అనడంతో “అదేం కాదయ్యా బాబూ! 35 సంవత్సరాలు మేము భార్యాభర్తలుగా జీవించాం!" అన్నాడు చార్లెస్ నింపాదిగా.

కెనడాలో టాప్ జోక్: అంతరిక్ష నౌకలో పయనించే వ్యోమగాములు భూమ్యాక ర్షణ శక్తి లేనిచోట బాల్ పెన్నులు ఉపయోగిస్తే, అవి పనిచేయవని అమెరికాలోని నాసా కేంద్రంవారు కనుగొన్నారు. దాంతో శాస్త్రవేత్తలు వెంటనే రంగంలోకి దిగి సుమారు రూ. 4,500 కోట్లు వెచ్చించి తలక్రిందులుగాగాని, నీటిలో పలగాని, గ్లాసు పైనగాని, ఎలాంటి వేడిలోనైనాగాని వ్రాయగల పెన్నులను తయారుచేశారు. మరి రష్యాలో....? అలాంటి సమయాలలో వారు ఎంచక్కా పెన్సిల్ తో వ్రాశారు!

ఆస్ట్రేలియాలో వండర్ జోక్ : ఒక మహిళ బాధతో, ఆదుర్దాతో, ఆవేదనతో డాక్టర్ వద్దకు వెళ్ళి పెద్దగా “డాక్టర్ గారూ! నావైపు చూడండి. ఈ రోజు ఉదయం నిద్రలేచి అద్దంలో చూసుకుంటే జుట్టు రేగిపోయి చిందరవందరగా ఉంది. శరీరం ముడతలుపడి అతుక్కుపోయినట్లుగా, ఎర్రబడిన కళ్ళు ముందుకు పొడుచుకువచ్చి నట్లుగా నేనొక శవంలాగా కన్పించాను. నాలో లోపం ఏమిటి?” అని ప్రశ్నించింది. కొన్ని క్షణాలు డాక్టర్

---

వక్రోక్తి వ్యంగ్యం యొక్క హాస్యం. అది ఆటవికంగా లేదా గంభీరంగా ఉండవచ్చు. – జార్జి మెరెడిత్

ఆమెవైపు ప్రశాంతంగా చూసి "నీ కంటిచూపులో ఏ లోపం లేదని నాకు అనిపిస్తుంది" అన్నాడు.

ఐర్లండ్ ఆశ్చర్యం:

రోగితో డాక్టర్ : నీకు ఒక చెడ్డ వార్త, చాలా చెడ్డ దుర్వార్త చెప్పడానికి బాధపడుతున్నా.

రోగి : డాక్టర్ గారూ! ముందు చెడ్డవార్త చెప్పండి.

డాక్టర్ : నువ్వు జీవించడానికి ఇంక 24 గంటల సమయమే ఉన్నది.

రోగి : ఇది చాలా బాధాకరమైన విషయమే. సరే....దుర్వార్త ఏమిటి?

డాక్టర్ : ఈ విషయాన్ని నీతో చెప్పడానికి నిన్నటినుండి ప్రయత్నిస్తున్నా.....

లాఫ్ లాబ్ హాస్యోక్తులలో విచిత్రాలు : రిచర్డ్ వైస్ మెన్ 2001లో బ్రిటన్‌లో ప్రపంచ ప్రఖ్యాత 'లాఫ్ లాబ్' సంస్థను నెలకొల్పాడు. హాస్యం పై గొప్ప పరిశోధనా సంస్థ అది. ఆ సంస్థ సేకరించిన సమాచారం ప్రకారం 103 పదాలుగల హాస్యోక్తులు ఎక్కువ నవ్వు పుట్టించేవిగా ఉన్నాయి. మరొక చిత్రమేమంటే, ప్రపంచ ప్రఖ్యాత హాస్యోక్తిగా పేరొందిన వేటగాళ్ళ హాస్యోక్తిలో 102 పదాలు ఉండటం గమనార్హం. ప్రఖ్యాత హాస్యోక్తులలో ఎక్కువగా జంతువులకు సంబంధించినవని, వాటిలో బాతులకు సంబంధించిన హాస్యోక్తులు మరింతగా నవ్వు తెప్పించేవిగా ఉన్నాయని తేలింది. కనుక మంచి హాస్యోక్తిని చెప్పాలంటే బాతు హాస్యోక్తినే చెప్పాలన్నమాట!

---

స్కాచ్ ప్రజలకు హాస్యం అర్థం కావాలంటే శస్త్ర చికిత్స చేసి లోపల పెట్టాల్సిందే. వారి దృష్టిలో హాస్యం అంటే అప్పడప్పుడూ వెగటుగా నవ్వడమే! – సిడ్నీ స్మిత్

అధ్యాయం 36

# మరచిపో! మరచిపో!

మన బాధలను, సమస్యలను, నిరుత్సాహాలను ఒక్క చిరునవ్వుతో వదిలించుకోవాలేకాని, వాటిని అలా భారంగా మోసుకుపోతుంటే అవి మన బ్రతుకుల్ని మరింత బాధామయం చేస్తాయి. ఒక్కసారి ఆనందంగా భుజాలను విదిలించు, బాధలన్నింటినీ తొలగించు అన్న సత్యాన్ని మనం ఆచరణలో పెట్టాలి. ఉన్నదానితో తృప్తి చెందడం నేర్చుకోవాలి. అందుకే "మార్చలేని పరిస్థితులను మార్చడానికి ప్రయత్నించేకన్నా వాటిని ఆమోదించడం ఉత్తమం; వాటిని ఆనందించగలగడం ఉత్తమోత్తమం" అంటారు డా॥ బెర్నీ సైగల్. ప్రతి చిన్న సమస్యకు బెంబేలెత్తేకన్నా, 'చూద్దాం ఏమి జరుగుతుందో' అనే దృక్పథంతో ధైర్యంగా నడిస్తే ఆశ్చర్యకర పరిణామాలు లభిస్తాయంటారు ఆయన.

ఇద్దరు ఋషులు ఒక పిల్లకాలువలా ఉన్న నదిని దాటబోతుండగా, ఎదురుగా ఒక మహిళ ఈవలి ఒడ్డుకు చేరడానికి హైరానా పడటం చూశారు. అందులో ఒకాయన ఆమెను ఎత్తుకొని అవతలి ఒడ్డుకు చేర్చి, తోటి ఋషిని కలిశాడు. అలా ఓ అరగంట నడిచాక రెండవ ఋషి "మనం స్త్రీలను ముట్టుకోవడమే తప్పు కదా! నువ్వు ఆమెను ఏకంగా ఎత్తుకోవడం పాపం కాదా?" అని మిత్రుణ్ణి ప్రశ్నించడంతో "నేను రెండే రెండు నిమిషాలు ఆమెను మోసుకుంటూ ఆవలి ఒడ్డుకు చేర్చి దాదాపు అరగంట అయినా ఆమెను నువ్వింకా నీ మనస్సులో మోస్తూనే ఉన్నావా?" అన్నాడు ఆశ్చర్యపోతూ!

ఎప్పుడో, ఎందుకో, ఎవరో మనల్ని ఏదో అన్నారని ప్రతీకార ధోరణిలో సాగితే ఇంక జీవితకాలమంతా వృధా అయిపోతుంది. అలా కాకుండా మనస్సులోనే అతనిని క్షమించి, ఆ విషయాన్ని అంతటితో మరచిపోతే ఎంత మానసిక ప్రశాంతత చేకూరుతుందో ఆ ఆనందాన్ని ఒక్క పర్యాయం అనుభవించండి! చితి, చింత - రెండు పదాలు ఒకేలా ఉన్నా వాటి గుణగణాలు పూర్తిగా భిన్నం. చితి మరణించినవాడినే తగులబెడితే, చింత బ్రతికున్నవాడిని జీవితాంతం దహిస్తూ ఉంటుంది. అందుకే క్షమించడం ఉన్నతం; మరచిపోవడం ఉన్నతోన్నతం.

ఒకానొక కుగ్రామంలో ఒక రైతుకు మంచి గుర్రం ఉంది. ఒక రోజు పొలం దున్నుతూ దున్నుతూ ఆ గుర్రం చచ్చిపోవడంతో అతని మిత్రులు ఎంతో బాధపడ్డారు. అయితే, రైతు మాత్రం "అంతా దైవేచ్ఛ" అన్నాడు. కొన్ని రోజుల తరువాత ఒక బాటసారి

---

నీవు నవ్వితే ప్రపంచం నీతో నవ్వుతుంది. ఏడిస్తే ఒంటరిగా ఏడ్వవలసిందే. – విల్ కాక్స్

అటుపోతూ తన గుర్రాన్ని ఆ రైతుకు బహుమతిగా ఇచ్చాడు. మిత్రులంతా అతని అదృష్టాన్ని కొనియాడుతుండగా అతను మాత్రం "అంతా దైవేచ్ఛ" అన్నాడు. అలా ఓ వారం కూడా తిరక్కుండానే ఆ గుర్రం పారిపోయిందని తెలుసుకున్న మిత్రులు అతనిని ఓదార్చడానికి రాగా, రైతు మాత్రం తన సహజ ధోరణిలో "అంతా దైవేచ్ఛ" అన్నాడు. అలా కొన్ని రోజులు గడిచిన తరువాత తన నుండి పారిపోయిన గుర్రం ఆశ్చర్యంగా జోడీతో రైతువద్దకు చేరింది! "అదృష్టమంటే వాడిదేరా" అని గ్రామస్థులు కొనియాడగా, రైతు మాత్రం "అంతా దైవేచ్ఛ" అన్నాడు. అలా కొంతకాలం గడిచింది. ఒకరోజు ఆనందంగా రైతు, అతని కొడుకు చెరొక గుర్రం వేసుకొని షికారుకు బయలుదేరగా, దారిలో రైతు కుమారుడు గుర్రం మీదనుండి పడి కాలు విరగొట్టుకున్నాడు. "పాపం పిల్లవాడు" అని అందరూ బాధపడుతుంటే, తండ్రి మాత్రం "అంతా దైవేచ్ఛ" అన్నాడు. అలా కొన్ని రోజులు గడిచాయి. ఒకరోజు ఆ గ్రామంలోకి సైనికులు వచ్చి ఆరోగ్యంగా ఉన్న యువకులందరినీ సైన్యంలోకి ఎత్తుకుపోతూ, కాలు విరిగిన రైతు కుమారుణ్ణి వదిలివేయడంతో గ్రామస్థులు అతనిని "అదృష్టమంటే వాడిదేరా" అని కొనియాడుతుండగా, ఆ రైతు మాత్రం "అంతా దైవేచ్ఛ" అంటూ నమస్కరించాడు.

ఇదొక ఆలోచనా సరళి : 'దైవేచ్ఛ,' 'అంతా మన మంచికే,' 'చూద్దాం ఏమి జరుగుతుందో' అని ధైర్యంగా కొందరు, "అంతా కర్మ, ప్రారబ్దం' అని బాధపడుతూ మరికొందరు ముందుకు సాగుతుండటం మనం చూస్తుంటాం. ఒక తండ్రి 'ఆదివారం పరిష్కారం' అనే పుస్తకాన్ని ప్రారంభించి, సోమవారం నుండి శనివారందాకా కుటుంబ సభ్యుల సమస్యలను, బాధలను, ప్రశ్నలను అందులో వివరంగా వ్రాసుకున్నాడు. ఆదివారంనాడు ఆ పుస్తకాన్ని తెరచి అందరి సందేహాలు, సమస్యలు చదువుతూ ఆ వారం రోజులలో అవి ఎలా పరిష్కారమయ్యాయో చూసి నవ్వుకున్నాడు. ఇదొక అనుభూతి.

మనిషికి కాక మానుకు సమస్యలు వస్తాయా - ఒక్కసారి ఆలోచించండి. సంసారం సాగరం అని అనుకుంటూనే సమస్యలు వచ్చాయని ఊరంతా గోల చేసినంతమాత్రాన అవి పారిపోతాయా? నిబ్బరంగా యోచిస్తూ సమస్యలను మనం పారద్రోలాలేకాని, వాటిని చూసి మనం పారిపోవడం ఎంత పరిహాసాస్పదం!

ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞుడు హిల్బర్ట్ కి భౌతిక శాస్త్రజ్ఞుడైన జేమ్స్ ఫ్రాంక్ మంచి మిత్రుడు. ఎప్పుడూ చలాకీగా ఉండే మిత్రుడు ఒకరోజు దుఃఖసాగరంలో మునిగివుండటంతో ఆశ్చర్యంగా కారణం ఏమిటని ప్రశ్నించాడు ఫ్రాంక్. "చూశావా మిత్రమా! నా భార్య మరీ పిసినారి అయిపోతుందన్న సత్యాన్ని అనుకోకుండా ఈ రోజు కనుగొన్నా" అని బాధగా

---

నవ్వుతూ ఉండే వ్యక్తి తన చుట్టూ ఉండేవారిని నిరుత్సాహపరచడు. – అలక్సిస్ డిస్కోల్

అన్నాడు హిల్బర్ట్. విషయం అర్థంకాని ఫ్రాంక్ మిత్రునివైపు ప్రశ్నార్థకంగా చూశాడు. "ఉదయం ఫలహారంలో నా శ్రీమతి నాకు కోడిగ్రుడ్లు ఇవ్వడం లేదు. ఇలా ఎన్ని దినాలనుండి నన్ను మోసం చేస్తుందోగాని నా ఆరోగ్యం మాత్రం పూర్తిగా దెబ్బతిం ది" అంటూ వాపోయాడు హిల బర్ట్!

ప్రముఖ నాటక రచయిత ఆస్కార్ వైల్డ్ మాత్రం తక్కువ తిన్నాడా! ఓ నాటకాన్ని అత్యంత ఉత్సాహంతో తిలకించి, నటీనటులను పేరు పేరునా అభినందించిన తరువాత "చూడండి! మీ ప్రదర్శన చూస్తున్నంత సేపు నేనెప్పుడో వ్రాసిన ఒక నాటకం గుర్తుకొస్తుం ది సుమా" అని ఆలోచనలో పడ్డాడు. ఇంతకీ ఆ నాటకాన్ని వ్రాసింది తనేనన్న సంగతి కూడా మరచిపోయాడు ఆ ఘనుడు.

"సమస్యలతో పోరాటాలు సాగించడంలో కాక, వాటిని అధిగమించడంలోనే జీవిత వికాసం ఉంది" అంటాడు డా॥ నార్మన్ విన్సెంట్ పీలే. నిన్నటి గురించి బాధపడుతూ, రేపటి గురించి భయపడుతూ, ఏనాడో జరగబోయేదానిని గురించి వ్యాకులపడితే ఇంక జీవితంలో ఏం మిగులుతుంది?

భూగోళం మీద ఉష్ణోగ్రత క్రమంగా తగ్గుతుందని, మరో పది లక్షల సంవత్సరాలలో భూగోళం ఒక మంచుముద్దగా మారనున్నదని శాస్త్రజ్ఞులు చెబితే, అది విన్న జ్ఞానేశ్వర రావు ఎప్పుడో పది లక్షల సంవత్సరాల తరువాత జరగబోయేదానిని గురించి ఇప్పుడే బాధపడసాగాడు! బాస్ సెలవు ఇవ్వలేదనో, నీచేత ఒకగంట ఎక్కువపని చేయిం చాడనో, రైలు ఆలస్యంగా చేరిందనో-ఇలా చీటికీమాటికి ఆందోళన చెందడం ఒకవిధ మైన మానసిక రోగంలాంటిది. పిల్లలు గోల చేస్తున్నారని పెద్దగా అరిస్తే, నీకే అశాంతి మిగులుతుంది. పిల్లలు మాత్రం హాయిగా ఆడుకుంటూనే ఉంటారు. అలా కాకుండా ఆ పిల్లలతో కలసి నువ్వు కూడా ఆనందిస్తే, నీతో బాటు వాళ్ళూ ఆనందిస్తారు కదా! అందుకే అంటారు గుర్రం పరుగెత్తదలచినదారిలోనే స్వారీ చేయడం సులువైనపని అని!

సమస్యలను మరచిపోవడం గొప్ప వరం. మతిమరుపు మరింత గొప్ప వరం. మతిమరుపును ఒక బలహీనతగా, శాపంగా భావించేకన్నా, అదొక హాస్య కేంద్రం అని ఊహిస్తే ఎంత సరదాగా ఉంటుందో చూడండి. ఈ అంశం పై ఒక మేనేజర్ ఓ ప్రయోగం చేశాడు. తన కార్యాలయంలో పనిచేస్తున్న వారందరిని సమావేశపరచి తన మతిమరుపును గురించి చెప్పసాగాడు. "ఉదయమే పోస్టాఫీస్ కు వెళ్ళి కొన్ని స్టాంపులు కొన్నా. అక్కడే కొన్ని లేఖలు కూడా వ్రాశా. వచ్చేటప్పుడు పోస్ట్ డబ్బాలో ఉత్తరాలు వేయడానికి బదులు స్టాంపులు

హాస్యోక్తిపై చర్చ జరపడమంత క్రూరమైన హాస్యోక్తి మరొకటి లేదు. – డా॥ ఎస్. రమణి.

వేసి వచ్చా" అనడంతో అందరూ గొల్లుమన్నారు. ఆ తరువాత ఈ విషయంలో ఎవరి అనుభవాలను వారు చెప్పాలని లేదా ఒక గొప్ప మతిమరుపు కథ చెప్పాలని ప్రతి ఒక్కరినీ ఆహ్వానించాడు. అందరికన్నా గొప్ప అనుభ వాన్ని లేదా ఉదంతాన్ని చెప్పినవారికి మంచి బహుమతి ఇస్తానని ప్రకటించడంతో అందరూ ఉత్సాహంగా తమ మతిమరుపు గాథలను వివరించారు. అందులో ఒక ఉదంతం ఇది.

ఆకాశహర్మ్యాలనుండి దూకడంలో నేర్పరి అయిన వీర్ సింగ్ కు ఒకరోజు ఒక టెలిగ్రామ్ వచ్చింది. అందులో తన భార్య చనిపోయిందన్న దుర్వార్త ఉంది. అంతే! పదహారవ అంతస్తు పైన ఉన్న అతని గుండె చెదిరి క్రిందకు దూకాడు! 8వ అంతస్తు దగ్గరకు వచ్చేటప్పటికి తనకు పెళ్ళే కాలేదన్న విషయం గుర్తుకొచ్చి ఆలోచనలో పడ్డాడు! ఇంతలోకి 4వ అంతస్తుకు చేరుతుండగా "అవును మరచిపోయాను. నా పేరు విక్రమ్ సింగ్ కదా! టెలిగ్రామ్ వచ్చింది వీర్ సింగ్ కు కదా" అనుకుంటూ ఒకటవ అంతస్తునుండి ఆనందంతో ఒక్క పిల్లిమొగ్గ వేశాడు. ఆవిధంగా మతిమరుపు బాధను ఆనందంగా మార్చుకున్నాడు!

"వృద్ధ దంపతులు మిత్రుల ఇంటికి విందుకు వెళ్ళారు. భోజనాల తరువాత మహిళలిద్దరూ పూలమొక్కలు చూడటానికి తోటలోకి వెళ్ళగా, పురుషపుంగవులు రామయ్య, జేమ్స్ పిచ్చాపాటీకి దిగారు. "రాత్రి ఒక రెస్టారెంట్ కు వెళ్ళా. అక్కడ ఆహారం ఎంత బాగుందో, పరిశుభ్రత అంతకన్నా బాగుంది. ఫర్నీచర్, ఏర్పాట్లు, సర్వింగ్ ఇవన్నీ మరింత బాగున్నాయి. అందుకే మా మిత్రులందరికి దానిని సిఫార్సు చేయదలచా" అన్నాడు జేమ్స్. "అవును! ఆ హోటల్ పేరేమిటి?" అని సోమయ్య అడగడంతో జేమ్స్ ఆలోచించి, ఆలోచించి పేరు గుర్తురాక తలగోక్కున్నాడు. "అన్నట్లు....మనం బాగా ప్రేమించేవారికి ఒక పుష్పం ఇస్తామే! దాని పేరేమిటి? అది ఎర్రగా ఉంటుంది, ముళ్ళు ఉంటాయి. ఎంతో అందంగా, మృదువుగా ఉంటుంది" అన్నాడు. "మీరు గులాబీ గురించి ఆలోచిస్తున్నారా?" అని సోమయ్య అనడంతో "అవునండి" అంటూ గార్డెన్ వైపు చూస్తూ "రాత్రి మనం వెళ్ళామే....ఆ హోటల్ పేరేమిటి?" అంటూ పెద్దగా అరిచాడు జేమ్స్. భార్య పేరు కూడా గుర్తుండని ఇలాంటి ప్రబుద్ధులకు జీవితంలో ఎలాంటి సమస్యలూ ఉండవేమో!" అంటూ ఆ సమావేశంలో మోహన్ ఈ ఉదంతాన్ని వివరించి ప్రథమ బహుమతి పొందాడు.

అందుకే మరచిపో! మరచిపో! కోపతాపాలు, చీకుచింతలు మరచిపో. హాయిగా వృద్ధాప్యాన్ని కూడా ఎలా మరచిపోవాలో తరువాయి అధ్యాయంలో చూద్దాం.

---

అధిక ఒత్తిడికి లోనైనప్పుడు అత్యుత్తమ మార్గం దానిని చూసి నవ్వగలగడమే. – డా॥ శామ్యూల్ షెమ్

అధ్యాయం 37

# వృద్ధాప్యమా నీకింక సెలవు!

రాము నూరవ జన్మదినోత్సవం శుభసందర్భంగా ఒక పత్రికా విలేకరి ఆయనను ఇంటర్వ్యూ చేశాడు. ప్రశ్న: మీకు పునర్జన్మ ఉంటే ఈ జీవితంలో చేసిన పొరపాట్లనే మరల చేస్తారా?
రాము : (నవ్వుతూ) వాటిని త్వరత్వరగా చేస్తే పోలా.
ప్రశ్న: మీ సుదీర్ఘ జీవితంలో మీకు ఎవరైనా శత్రువులు ఉన్నారా?
రాము : ఆ వెధవలందరికన్నా ఎక్కువ కాలం జీవించానులే. .
ప్రశ్న: అవునండి...మీరు 100 సంవత్సరాలు జీవించడం వెనుకగల రహస్యం ఏమిటి?
రాము :(కొంచెం సేపు ఆలోచించి)ఆ......ఏంలేదు.1905లో జన్మించడంవల్లనే ఇది సాధ్యమైంది.

"ఎన్నటికీ నువ్వు వృద్ధుడుగా ఎదగవు. నిజానికి నువ్వు ఎదగడం మానివేసినప్పుడే వృద్ధుడవు అవుతావు" అన్న జూల్స్ రోస్టాండ్ మాటలు ఎంత విలువైనవి! వృద్ధాప్యం వయసునుబట్టి రాదు. అది నీ ఆలోచనలనుబట్టి వస్తుందంటారు. కొందరు పుట్టుకతో వృద్ధులైతే మరికొందరు వయసుతో సంబంధం లేకుండా నిత్య యౌవనులుగా జీవిస్తారు. మా రామారావును ఎవరైనా "85 సంవత్సరాల వయసు పైబడింది కదా! ఆరోగ్యం ఎలా ఉంది?" అని అడిగితే, "అవును.....ఎవరి పైన పడిందంటారు?" అంటాడు నవ్వుతూ. "వయసును లెక్కించడం కాదయ్యా, దానిని లెక్క చేయకుండా ఉండటం అలవాటు చేసుకో" అంటాడు.

అన్నట్లు... వృద్ధాప్యం వలన కొన్ని ప్రయోజనాలూ ఉన్నాయండి. ప్రభుత్వానికి వృద్ధులంటే వల్లమాలిన ప్రేమ కనుకనే 'సీనియర్ సిటిజన్స్' అంటూ ప్రయాణంలోను, ఆదాయం పన్ను విషయంలోను కొన్ని రాయితీలు ఇస్తారు. (వీళ్ళు తొందరగా పోతే పెన్షన్ బిల్లు భారం తగ్గుతుందన్న ఆలోచన ఉన్నప్పటికీ ఎప్పుడూ పైకి మాత్రం అనరులెండి!) సామాజికంగా కూడా వృద్ధులంటే కొంత గౌరవభావం లేకపోలేదు. వృద్ధులు చెప్పింది వింటారేకాని, సామాన్యంగా వ్యతిరేకించరు. "ఈయనతో నస ఎందుకు?" అని మనసులో అనుకుంటారేమోగాని, బయటకు మాత్రం "మీరు పెద్దవారు, అనుభవజ్ఞులు" అని గౌరవిస్తారు. ఏ కార్యక్రమం జరిగినా ఆశీర్వదించేది ముందుగా వృద్ధులే కదా! అంతకన్నా ఇంకేం కావాలి?

---

చిన్నగా నవ్వేవాడు దొంగ, మాయకుడు. కడుపార నవ్వగలవాడే రసజ్ఞుడు – మునిమాణిక్యం

అయితే యదార్థం వేరు. వృద్ధులు అనుభవానికి చిహ్నాలు, సామర్థ్యానికి సంకేతాలు; వంశానికి కీర్తి కిరీటాలు, ఇంటికి పెద్దలు. సంప్రదాయబద్ధత వారి లక్షణం, సహజీవనం వారి తత్త్వం. వృద్ధాప్యం ఆనందంగా జీవించాల్సిన సమయమేకాని, నైరాశ్యంతో గడపాల్సిన క్షణాలు కాదు. దానినొక అనుభూతిగా, సమీక్షా సమయంగా తీసుకోవాలే కాని, దానిని గురించి బాధపడటం భావ్యం కాదు. అంతా అయిపోయిందని వ్యధ చెందడం ఎందుకు? అయినా వయసు పైబడిన తరువాత కూడా నా మాటే చెల్లాలనడం భావ్యమా? ఒక్క క్షణం ఆలోచించండి.

మా మిత్రుడు జార్జిని ఒక సేవాసంస్థవారు 'వృద్ధాప్యం' అనే అంశంపై ప్రసంగించమని ఆహ్వానించగా, దానిని ఆయన ఆనందంగా స్వీకరించాడు. సభికులనుద్దేశించి ప్రసంగిస్తూ "అటకమీద ఉంచే పనికిమాలిన వస్తువుల వంటివారు వృద్ధులు. అలాంటి పాత వస్తువును మీరేమో అతి గౌరవంగా క్రిందకు దించారు. దుమ్ముదులిపి అలంకా రాలు చేస్తున్నట్లుగా చక్కగా పూలదండలు వేశారు. గొప్పగా గౌరవిస్తున్నట్లుగా పెద్ద శాలువా కప్పి ఇప్పటిదాకా నాలో పేరుకుపోయిన నైరాశ్యాన్ని తొలగించారు" అని ప్రారంభించడంతో సభ చప్పట్లతో మారుమ్రోగింది.

ఆయన తన ప్రసంగాన్ని మరింత ఉత్సాహంతో కొనసాగిస్తూ "ఎందుకోగాని కొందరికి వృద్ధాప్యం అన్న మాట వింటేనే భయం పుట్టుకొస్తుంది, ఒళ్ళు జలదరిస్తుంది. దీనికి సంబంధించిన ఒక కథ చెబుతా. "గతంలో మీ ఆవిడ ప్రతిదానికీ అనవసరంగా ఆందోళన చెందుతూ ఉండేది కదా! ఇప్పుడేంటి ఎంతో ప్రశాంతంగా కన్పిస్తుంది? ఆమెలో ఇంత గొప్ప మార్పు ఎలా వచ్చింది?" అని కృష్ణారావును అతని మిత్రుడు గోపాలరావు ప్రశ్నించాడు. కృష్ణారావు నవ్వుతూ "అబ్బే ఏమీలేదు. మొన్న డాక్టర్ దగ్గరకు వెళ్ళాము. ఆయన మా శ్రీమతి వైపు చూసి నవ్వుతూ "ఏమ్మా! ప్రతిదానికీ ఆందోళన చెందడం అలవాటు చేసుకోదలచావా ఏంటి? ఆందోళన చెందడం వృద్ధాప్య లక్షణం. అందరిచేత గౌరవింపబడాలని నువ్వు కూడా వృద్ధురాలిగా కన్పించదలచావా ఏమిటి?" అనడంతో మా ఆవిడ ఖంగుతిన్నది. "అదేంలేదు డాక్టర్ గారూ!" అంటూ ఏదో చెప్పబోగా, డాక్టర్ నవ్వుతూ "అనవసరంగా ఆందోళన చెందవద్దమ్మా, నవ్వుతూ ఉండమ్మా. లేకుంటే ఈ పర్యాయం నువ్వు మా ఆసుపత్రికి వచ్చేటప్పటికి మా అమ్మనో, మా అక్కనో వచ్చిందని నేను ఆశ్చర్యపోవలసి వస్తుంది సుమా!" అన్నాడు. అంతే! ఆ రోజు నుండి ఆమె పూర్తిగా మారిపోయింది" అంటూ ముసిముసి

---

నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్త వృత్తికిన్ దివ్వెలు. – గుఱ్ఱం జాషువా

నవ్వులు నవ్వాడు కృష్ణారావు. వృద్ధాప్యపు భీతి అంటే అది" అని చెప్పడంతో సభ మరొొక్కమారు కరతాళధ్వనులతో మారుమ్రోగింది.

"చిరకాలం జీవించాలని అందరూ కోరుకుంటారు కాని, ముసలివాళ్ళం అవ్వాలని మాత్రం ఎవ్వరూ కోరుకోరు" అన్నారు జొనథాన్ స్విఫ్ట్. "వృద్ధాప్యం అంటే చెయ్యని నేరానికి శిక్ష అనుభవించడం" అన్నాడు మరొొక విజ్ఞుడు. ఏమైనా వృద్ధుడు అంటే అందరకూ అలుసే. ఆయన ఎప్పుడైనా మాట్లాడితే "నీకెందుకు ఇవన్నీ. హాయిగా ఇంత తిని కృష్ణా రామా .అనుకోక"అని ఒక పుత్రరత్నం అంటే,"ఆ! ఇంక నీ క్లాసు మొదలెట్టావా? అయితే 'కొండవీటి చేంతాడు'ను మడిచినట్లే" అని మరొొక కుమార శ్రేష్ఠుడు జోక్ విసురుతాడు."నిన్నటిదాకా తగుదునమ్మా అని దాష్టీకం వెలిగించి, వృద్ధాప్యంలో కూడా ఆధిక్యం కావాలంటే ఎలా?" అంటాడు మరొొక వంశాంకురం. ఇంతకూ వృద్ధుడు కూడా ఓ మనిషే కదా! అతని నోరు తెరవవద్దంటే ఎలా చెప్పండి? అందుకే నేను ప్రారంభంలోనే చెప్పా. వృద్ధుడు అంటే అటకమీద ఉంచే పనికిమాలిన వస్తువులాంటివాడు అని. ప్రతి ఒక్కరు ఆయన పైన హాస్యోక్తులు విసురుతూ ఆనందిస్తారేకాని ఎవరూ అతనిని పట్టించుకోరు. అతనిని ఎలా గేలి చేస్తారో ఈ పాట వినండి.

"భళీ భళీ మా తాత బల్లెంబు చేబూని పుల్లాకు తూటుగా పొడిచినాడు
ఎలుక ఎదురురాగ ఈటె చేతనుబూని యేడారు బారలు ఎగిరినాడు
ఔర వీని పరాక్రమం బద్భుతంబు"

చూడండి......వృద్ధులంటే ఎంత వ్యంగ్యమో! ఎంత హేళనో!

నిజంగా చెప్పండి. ఎవరి ఇళ్ళల్లో నారీ ప్రతాపం లేదూ? అయినా, ఈ జిల్లా మొత్తానికి మా నాన్న కలెక్టర్ అయితే, మా నాన్నకు మా అమ్మ కలెక్టర్ అన్న అరిగిపోయిన హాస్యోక్తి అందరకు తెలిసిందే కదా! మరి ఇలాంటి విషయాలలోకి కూడా తాత, తాతమ్మలనే ఎందుకు లాగుతారు? చెప్పండి....అయినా జీవనరేఖలలో ఏ వయస్సుకు సంబంధించిన సమస్యలు, ఆనందం ఆ వయస్సుకు ఉంటాయి. జీవితం అంటే ఒక నాటకమని, అందులో మనందరం పాత్రధారులమని జ్ఞప్తికి తెచ్చుకొని హాయిగా నవ్వగలిగినప్పుడు ఎలాంటి బాధలకు, మనోవేదనకు చోటుండదు. శరీరం నాదే కాని, స్క్రిప్ట్ భగవంతునిదే కదా! అనుకుంటూ ఆనందించాలి. అందుకే ఆనందో బ్రహ్మ....కాదు కాదు వృద్ధాప్యమే ఆనందం" అనడంతోనే యువకులు ఉత్సాహంతో కేరింతలు కొట్టారు. "ఇంత మంచి హృదయంగల మీలాంటి వారి ముందు నోరు తెరవడానికి ఇంత అవకాశం ఇచ్చిన మీ అందరకు

అభినందనలు. అన్నట్లు ఇటీవల కాలంలో మా ఆవిడ నా పైన ఒక ఆంక్ష పెట్టింది. అదేమంటారా? మూడు సందర్భాల లోనే నా నోరు తెరవాలన్నది 1) అన్నం తినేటప్పుడు 2) ఆవలించేటప్పుడు 3) తుమ్ముగాని, దగ్గుగాని వచ్చినప్పుడు. అయితే ఆమెతో పోరాడి నేనొక కన్సెషన్ సంపాదించా" అనడంతో అందరూ ఆసక్తిగా "అదేంటో చెప్పండి" అన్నారు. 'చెబుతా. మా ఆవిడ జోక్ వేసినప్పుడు నవ్వడానికి" అనడంతో సభ ఒక్కమారు గొల్లుమంది. ఈలలతో మారుమ్రోగింది. అలా ఆనందంగ సభముగిసింది.

ఎందుకోగాని, చాలామందికి విసుగుకు పర్యాయపదంగా వృద్ధుడు కన్పిస్తాడు. "వృద్ధుల బుద్ధులు సంచలింపవే!" అన్నాడు దుర్యోధనుడు ద్వాపర యుగంలో! వృద్ధాప్యాన్ని గురించి కొన్ని దశాబ్దాల క్రితమే సర్ హెర్బర్ట్ బిట్రీ మహాశయుడు "విసుగు పుట్టించే అతను వృద్ధుడు. అతణ్ణి చూస్తే శ్మశానం కూడా ఉసూరుమని నిట్టూరుస్తూ ఆవలిస్తుంది" అని ఈసడించుకున్నంత పని చేశాడు. "పెద్దల బుద్దులు పెడతల పడతాయి" అని చార్లెస్ డికెన్స్ అంటే, "అందరికీ చివరి అంకం, అద్భుతమైన చరిత్రకు చరమాంకం, మరోసారి వచ్చే బాల్యం, పళ్ళు, కళ్ళు, రుచి వంటివేవీ తెలియని స్థితి వృద్ధాప్యం " అని షేక్స్పియర్ పొగడ్తనో, తెగడ్తనో తెలియకుండా సెలవిచ్చాడు. "ఎవరైనా గత స్మృతులు చెప్పడం ప్రారంభిస్తే, అతడు వృద్ధుడైనట్లు లెక్క" అని బెంజిమన్ డిజ్రాయలి అన్నాడంటే ఏమని? ఎవ్వరూ తమ అనుభవాలు చెప్పకూడదనేగా? అయినా మనలో మాట.... యువకుడు తన గత స్మృతులు చెబితే ఇంక వృద్ధుడయినట్లేనా? ఆనాటి బ్రిటీష్ ప్రధాని డిజ్రాయలి తన మిత్రునితో కలసి వ్యాహ్యాళికి వెళ్తుండగా, దారిలో వారికి ఒక వృద్ధుడు ఎదురయ్యాడు. డిజ్రాయలి అతనికి ఎంతో సాదరంగా శుభాకాంక్షలు తెలిపి, "మీ పాత కంప్లైంట్ ఎలా ఉంది?" అని అతని యోగక్షేమాలు కనుక్కున్నాడు. పులకరించే ఆ పలకరింపుతో ఆ వృద్దుడు నిజంగా కరిగిపోయాడు."రోజు రోజుకి ఆ సమస్య పెరుగుతుందండి. దానికి మరణమే మార్గాంతరమేమో!" అని బాధపడుతూ చతికిలబడ్డాడు. డిజ్రాయలి అతనికి ధైర్యం చెప్పి ముందుకు సాగాడు. మిత్రులిద్దరూ కొంతదూరం వెళ్ళాక "ఇంతకూ ఆ వృద్ధుడు ఎవరు?" అని మిత్రుడు ప్రశ్నించగా, "ఆయనెవరో నాకు తెలియదు" అన్నాడు డిజ్రాయలి. "మరి.... ఆయన యోగక్షేమాలను గురించి ఆరా తీశావు, ఆయనతో ఎంతో పరిచయం ఉన్న వ్యక్తిలా మాట్లాడావు కదా!" అర్థం కానట్లు ముఖం పెట్టాడు మిత్రుడు. డిజ్రాయలి పగలబడి నవ్వుతూ "ప్రతి వృద్ధుడికి ఆరోగ్యరీత్యా ఏదో ఒక సమస్య ఉంటుంది మిత్రమా! దానిని గురించి పరామర్శిస్తే, వారికి ఆనందం.... అంతే" అన్నాడు.

---

జన్మదినం జరుపుకుంటున్న 70సంవత్సరాల వృద్ధునికి ఒకామె ఫోన్ చేసి "ఈరోజు మీ జన్మదినం కదా! మీకన్నా వయసు మీరిన మిత్రుడు మాకు ఒకరున్నారు. ఆయన తన భోజనాన్ని తానే వండుకుంటాడు. మీరు కూడా అలాగే ఆనందంగా ఉండాలని నా ఆకాంక్ష" అని శుభాకాంక్షలు తెలిపింది. ఇది ఆశాపూరిత దృక్కోణం. అదే వ్యక్తికి మరొక మిత్రుడు ఫోన్ చేసి మీకు జన్మదిన శుభాకాంక్షలు. అన్నట్లు.....మీ వయస్సు ఎంత?.....వద్దులేండి.... Have a Nice Yesterday" అంటూ నవ్వుతూ ఫోన్ పెట్టేశాడు. ఇది నిరాశాపూరిత దృక్కోణం. ఆశావాదులు ఇతరులలో ఉత్సాహాన్ని రేకెత్తించగా, నిరాశావాదులు తమలోని నైరాశ్యాన్ని నలుదిక్కులా వ్యాప్తి చేస్తారు. వయసు పెరిగే కొద్దీ వ్యక్తిలో క్షీణించిన నిరుపయోగమైన కణాలు అంతమొంది కొత్తవి తాజాగా వస్తాయని తెలుసుకుంటే ఎంత ఉత్సాహం వస్తుంది! ఈ విధంగా జీవితాన్ని ఆశల పల్లకీగా మార్చుకోవాలి.

ఇక్కడ మార్క్ ట్వెయిన్ ఉదంతాన్ని జ్ఞప్తికి తెచ్చుకుందాం. మార్క్ ట్వెయిన్ వృద్ధాప్యంలో ఎన్ని సమస్యలు ఎదురైనా మొక్కవోని దీక్షతో నిలబడ్డాడు. అయితే, ఆతని 60వ ఏట ఆర్థికంగా క్షీణించాడు. ఆ తరువాత కుమార్తె, అనంతరం భార్య మరణించడం తో మానసికంగా క్రుంగిపోయాడు. తన 70వ ఏట ఒక గొప్పవిందు ఏర్పాటుచేసి, (మరణాన్ని గురించి ప్రసంగించడమే తప్పుగా భావించే ఆ రోజుల్లో) తన వృద్ధాప్యాన్ని గురించి అనేక చతురోక్తులాడాడు. తన అంత్యక్రియలు అందంగా ఎలా జరుపుకోదలచాడో వివరించాడు. సమాధిపై శిలాఫలకాన్ని ప్రత్యేక తరహాలో ఎలా తీర్చిదిద్దాలో వివరించినవారికి, వృద్ధాప్యంలో ఉపయోగపడే అత్యుత్తమ హాస్యాన్ని అందించినవారికి బహుమతులు ఇస్తానన్నాడు. తన మరణానికి రెండు మాసాల ముందుగా 'నా జీవితంలో మలుపు' (The Turning Point of My Life) అనే రచనలో వృద్ధాప్యాన్ని అధిగమించడానికి కొన్ని మార్గాలు సూచించాడు. ఏమైనా హాస్యానికి మారు పేరుగా నిలిచిన ఆయన జీవితంలో చివరి క్షణాలు కూడా అలానే కొనసాగడం ఆయన అదృష్టం.

వృదుడు అంటే క్రుద్ధుడు అని కొందరు గేలి చేసినా, ఆయనొక బుద్ధుడని పరాచికాలాడినా ఎవరేమనుకుంటే మనకేంటి-చివరకు ప్రతి ఒక్కరూ జీవితంలో వృద్ధుడుగా ఎదగాల్సిందే కదా! అందుకే వృద్ధాప్యంను హేళన చేయాలన్న భావనే తప్పు. అలానే వృద్ధులుకూడా "వృద్ధాప్యమా! నీకింక సెలవు" అంటూ ఆనందించాలేకాని, "వృద్ధాప్యం ఓ భయంకర భారం అని వ్యధ చెందటం పెద్ద తప్పు. ఈ చిన్ని విషయాలు గురించి ఆలోచించడం మానివేసి, ఇంక మరణంతోనే పరాచికాలాడదామా?

---

చిరునవ్వులన్నింటిని తిప్పి పంపుదాం అన్నది మన విధానం కావాలి. – జోయల్ గుడ్ మన్

అధ్యాయం 38

# మరణానికి సిద్ధం : అంతా క్రమబద్ధం

కట్టెలు కొట్టుకునే రాములమ్మకు జీవితం పై విరక్తి పుట్టింది. రోజూ ఈ బాధలు పడేకన్నా చచ్చిపోవడం మేలనుకుంది. "ఆ యమధర్మరాజు వచ్చి ఎప్పుడు తీసుకువెళ్తా డో, ఆయనకు నామీద ఎప్పుడు దయ కలుగుతుందో" అంటూ బాధపడుతూ అనుకోకుండానే ఆ మాటలు పైకి అనేసింది. అంతే! యమధర్మరాజు ప్రత్యక్షమై "నీవు కోరుకున్నట్లే నాతో రావడానికి ఇంక సిద్ధంకా" అన్నాడు. ఆయనను చూడటం తోనే రాములమ్మకు ముచ్చెమటలు పోశాయి. ముఖం పాలిపోయింది. నోరు ఎండిపోయింది. క్షణాలలో తేరుకొని ".....స్వామీ! నా కట్టెలమోపు బాగా బరువుగా ఉండటంతో దానిని ఎత్తడానికి ఎవరైనా కావాలని కోరాను కాని...అంతే స్వామి" అంది తడబడుతూ!

అందుకే అన్నాడు 'మహా భాగవతం' కర్త బమ్మెర పోతనామాత్యులు "చచ్చిన వారి కేడ్చెదరు చావని వారల భంగి" అని. 'మరణం' అంటే చాలామందికి చచ్చేంత భయం. అందుకేనేమో దానికి ఎన్నో పేర్లు పెట్టారు. ఆయన మరణించాడు అనడానికి ఆంగ్లంలో 20కి పైగా పద ప్రయోగాలు ఉండగా, తెలుగులో కూడా స్వర్గస్తుదయ్యాడు, పెద్దలలో కలిశాడు, టపా కట్టాడు, భగవంతుని సాన్నిధ్యం చేరాడు, తుదిశ్వాస విడిచాడు, కన్నుమూశాడు, తనువు చాలించాడు, మృతి చెందాడు, పరమపదించాడు - ఇలా ఎన్నో పద ప్రయోగాలు కన్పిస్తాయి.

గొప్ప బోధకుడు: జీవితంలో ఒక అనివార్య భాగం అయిన మరణంనుండి తప్పించుకోడానికి ఎన్ని పథకాలు వేసినా అవి నిరుపయోగం. మరణం తథ్యం అని తెలిసి కూడా దాని గురించే యోచిస్తూ క్రుంగిపోవడం వ్యర్థం. "అంతా నాదే" అని విర్రవీగే మనిషికి "ఏదీ నీది కాదు" అన్న నగ్నసత్యాన్ని బోధించే మరణం గొప్ప బోధకుడులాంటిది. అందరిని సమదృష్టితో చూడటం దాని తత్వం. పుట్టిన ప్రతిజీవిని ఏదో ఒకనాడు సాదరంగా సాగనంపడం దాని లక్షణం. అందుకే విజ్ఞులు మరణాన్ని సమత్వ సాధకశక్తిగా అభివర్ణిస్తారు. మరో విషయం. "మరణానికి సిద్ధమైన వ్యక్తి స్వేచ్ఛగా జీవిస్తాడు" అన్న బాపూజీ మాటలలోని సత్యాన్ని గుర్తించిననాడు, ఈ రహస్యాన్ని తెలుసు కున్ననాడు మరణం పై ఇంక రణం ప్రారంభించాల్సిన అవసరమేల? దానిని చూసి భీతిచెందడం మాని, ఆహ్వానించగలిగితే అదొక క్రీడగా మారుతుంది. మరణం గురించి నిర్భయంగా యోచించగలిగిననాడు అది

---

నవ్వడానికి నీకు ఎప్పుడైతే సమయమేలేదో, నిజంగా నవ్వవలసిన సమయం అదే. – ఆర్గస్

మనకెన్నో విలువైన పాఠాలు నేర్పుతుంది. "మరణ భయంబు నాకు అణుమాత్రము లేదు"అని ఉమర్ ఖయ్యాం, "అది వెలుగుకు దారితీసే ద్వారం" అని ఇంగర్సల్ భావించడానికి కారణం ఇదేనేమో! మరణం నీ గొప్పతనాన్ని బహిర్గతం చేస్తుంది, అది అందరినీ ఆప్తులుగా మారుస్తుంది. అందుకే సంతాపసభల్లో దివంగతుణ్ణి గురించి ఎన్నో తియ్యని విషయాలు చెబుతారు. "నా మరణానికి ముందు నా అంత్యక్రియలు చూడాలన్న గొప్ప తపన నాలో ఉంది" అని మేరియా ఎగ్స్ వర్త్ తపించింది ఇందుకే కావచ్చు.

దైవం ఉనికిని గురించి సందేహించేవారు ఉన్నారుకాని, మరణం ఆస్తిత్వం గురించి అనుమానించే వారే లేరుగదా! సృష్టి రహస్యాలను ఛేదించ ప్రయత్నించే మేధావులు సైతం మరణమూలాలను గురించి తెలుసుకోలేకపోయారు! అందుకే అజేయం, అని వార్యం, తథ్యం అయిన మరణాన్ని మనం ఒక ఉత్సవంగ, వేడుకగా జరుపుకోవాలి అంటారు జైనులు.

భయం వద్దు, ఆనందం ముద్దు : జీవితంలో ఆటుపోట్లు, విపత్తులు రావడం సహజం. మరి విపత్తు సంభవించినప్పుడు దాని పరిష్కార మార్గాన్ని గురించి యోచించాలేగాని, "ఈ బాధలు నాకెందుకు పెట్టావు భగవాన్" అని ఏడ్చి పెడబొబ్బలు పెట్టినా ప్రయోజనం శూన్యం అన్న సత్యాన్ని తెలుసుకున్ననాడు మనిషి దృష్టికోణమే మారిపోతుంది. దాంతో ఆవేదన స్థానంలో హాస్యం చోటుచేసుకుంటుంది. అందుకే ఇప్పుడు కవులు, రాజకీయ నేతలు, శాస్త్రవేత్తలు మరణాన్ని గురించి ఎలా భావించారో, దానికి ఎలా సంసిద్ధుల య్యారో తెలుసుకుందాం. .

చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి శతావధాని. క్రమంగా ఆయన ఆరోగ్యం దెబ్బతినడంతో ఆందోళనలో పడిన శిష్యులు గురువుగారితో కలసి ఓ ఫొటో తీయించుకోవాలని ఉవ్విళ్ళూరారు. ఆయన నడవలేడు కనుక నెమ్మదిగా కుర్చీలో కూర్చోబెట్టి బయటకు తెచ్చారు. ఆ దృశ్యాన్ని చూసిన ఇరుగుపొరుగమ్మలు 'పాపం... ఎప్పుడు జరిగింది?" అని ఏడ్వడంతో శిష్యులు వెంటనే అందుకొని "అదేమీ లేదు... గురువుగారితో కలసి ఫొటో తీయించుకుంటున్నాం' అంటూ ఫొటోగ్రాఫర్ ను సిద్ధం కమ్మన్నారు. ఇంతలో ఆ వార్త బయటకు పొక్కడంతో క్షణాలలో ఇంటిముందు చాలామంది గుమిగూడారు. ఫొటో తీసిన తరువాత శిష్యులు గురువుగారిని లోపలికి తీసుకుపోతుంటే "ఫర్వాలా! నేను పోయానని తెలిస్తే, ఒక వందమందైనా వస్తారన్నమాట!" అన్నారు శాస్త్రిగారు నవ్వుతూ!

"నవ్వుతూ మరణించగలగడం ఉత్తమం" అంటారు బౌద్ధులు, యూదులు. జెన్లు (బౌద్ధమతంలో ఒక విభాగమైన మహాయాన మతం), యూదులు మరణాన్ని ప్రేమతో

---

ఎంత ఎక్కువగా అభ్యాసం చేస్తే, అంత త్వరగా చేరువయ్యేది నవ్వు. – మార్గి ఇన్ గ్రామ్

కౌగిలించుకుంటారు. మరణాన్ని హాస్యం 'ఆపలేదు కాని, దానితో నేస్తం కట్టడంలో హాస్యం ఎంతైనా తోడ్పడుతుంది అన్నది వాస్తవం. "ఆయన గాఢంగా నిద్రపోతున్నా డయ్యా! నిద్రనుండి లేపి ఆయనకు నిద్రమాత్ర వేసి పడుకోబెట్టడం మరచిపోకు" - ఇలాంటి పసందైన హాస్యోక్తులను దగ్గర పెట్టుకుంటే జీవితాంతం హాయిగానే గడపవచ్చు. బాధాకర పరిస్థితులలో ఆనందించడానికి జెన్ మతస్తులు ఆలోచనాత్మక కథలు (వీటిని కోఆన్స్ అంటారు) చెబుతారు. "ప్రతిదీ మరణిస్తుంది కనుక దేనినీ ప్రమాదకరంగా తీసుకోకూడదు" అంటారు.

'కవిసార్వభౌముడు' శ్రీనాధుడు మరణ సమయంలో ఎన్నో బాధలు అనుభవిస్తూ కూడా స్వర్గంలోని కవుల గుండెలు అదిరేటట్లుగా తాను అక్కడికి చేరుతున్నా అంటూ ఎంత గంభీరంగా గుండె దిటవుతో చెప్పాడో చూడండి.......

దివిజ కవివరుల గుండియల్ దిగ్గురనగ
అరుగుచున్నాడు శ్రీనాధుడమరపురికి

మరణాన్ని ధైర్యంగా ఎదుర్కోవడం అంటే ఇదే కదా! "జననం ఒక పెద్ద జబ్బు" (ఊడీ ఎలెన్) అయితే, మరణం అంతకన్నా పెద్ద జబ్బేమో! అందుకే ఆశ, ఆనందం, హాస్యం సమ్మేళనంతో మనిషి మరణాన్ని ఎదుర్కోవాలి. మరణం ఉధృతిని తగ్గించడానికి దానిని భిన్న పార్శ్వం నుండి ఎలా పరికించాలో ఆలోచిద్దాం.

అద్భుత అనుభూతి: మరణానికి సవాలు విసరగలిగినవారు ఇద్దరే ఉంటారు. ఒకరు ఎంతో గుండెదిటవు కలవారైతే, మరొకరు హాయిగా నవ్వగలిగినవారు! "నిరు పేద మరణిస్తే అతని దహనానికి చాలినన్ని కట్టెలు కూడా దొరకకపోవడంతో అతని ఉదరం లోని మంట ద్వారానే దహన సంస్కారాలు జరుపవలసి వస్తుంది. దైవమా! పేదవానికి మరణం లేకుండా చెయ్యి" అన్న ప్రాచీన కన్నడ జానపద గేయం ఎంత గొప్ప అనుభూతిని కలిగిస్తుంది!

బెలాయిస్ మరొక అడుగు ముందుకువేసి "ఒక గొప్ప అనుభూతిని పొందడానికి వెళుతున్నాను. ఇంక తెర దించండి. తమాషా ముగిసింది" అన్నాడు. "ఎంతో ఉత్సాహపడి కష్టింతుమౌరా! మృతియే లేకున్న రుచి ఏది బ్రతుకులోన" అని గాలిబ్ అంటే, పి.బి. షెల్లీ మరింత హాస్య ప్రియత్వంతో "అంత అందమైన ప్రదేశంలో పూడ్చి పెడతారని తెలిసిన తరువాత అయినా మనం మరణాన్ని ప్రేమించాలి కదా" అన్నాడు.

"నాకు మృత్యువంటే జాలి. గెలుపు కోసం ఎన్ని వేషాలు వేసిందో! ఎప్పుడూ ఓటమే"... "మరణం నన్ను వరించి వస్తే ఏమంటాను నేనేమంటాను? పాలుపట్టి, జోలపాడి పడుకోమంటాను" అంటూ కళ్యాణి రాగంలో కమనీయంగా గానం చేశారు డా||

---

నవ్వు అనేది ఒక నరం. దానిని ఉపయోగించకపోతే అది క్రమంగా క్షీణిస్తుంది. – జెలేనో

సి.నారాయణరెడ్డి, “మరణాన్ని చూసి భయపడనేల? జీవితంలో అత్యంత ఆనందదాయకమైన సాహసకృత్యమిది” అని చార్లెస్ ఫ్రొమెన్ దానిని గేలిచేయగా, "మృత్యువుకు భయపడటమంటే జీవితం విలువ అర్థం కాకపోవడమే” అన్నారు బార్బడోస్ అడ్వకేట్. ఈ విధంగా మరణాన్ని ఛలోక్తులతో ఆహ్వానించగలిగిననాడు ఎంతటి క్లిష్ట సమస్య అయినా సుందరంగానే కన్పిస్తుంది.

ఈ ప్రముఖులందరూ చెప్పేది ఒక్కటే. మరణం నిజంగా ఒక గొప్పవరం అని! అందుకే మరణం పై మంచి హాస్యోక్తి చెబితే ముచ్చటగా మూడు లాభాలున్నాయి అంటాడు జార్జి మైక్స్ : 1. ఆ హాస్యోక్తి కలిగించే ఆనందం 2. మరణాన్ని హేళనచేస్తూ వికటాట్టహాసం చేయడం వలన కలిగే తృప్తి 3. మరణాన్ని వంగదీయడం ద్వారా దానితో మిత్రత్వాన్ని పెంచుకోవడం. ఊడి ఎలెన్ మరింత ముందుకుపోయి ఒక నాటికలో మరణం శక్తి గురించి హేళన చేస్తాడు. అది ఎవరినో కాటు వేయడానికి మెట్లు ఎక్కుతూ, ఎక్కుతూ “హే భగవాన్! నా మెడ విరిగినట్లుంది” అంటూ వంగిపో తుంది. అది మానవ సమాజంలోకి రావడంతో బలహీనపడుతుంది. అలా, అలా తిరుగుతూ అలసిపోయి మెట్ల మీదనుండి కాలుజారి కిందపడి ఏడుస్తుంటే హీరో నవ్వుతూ “మరణం పెద్ద చవట” అంటాడు.

ఎవరు ఎన్ని చెప్పినా, ఎంత వద్దనుకున్నా ఆప్తుల మరణం మనల్ని తాత్కాలికంగా ఆలోచనారహిత సంద్రంలో ముంచెత్తుతుంది. ఆ బాధలనుండి తక్షణం మన దృష్టిని మరల్చగలగడంలో నవ్వు చక్కగా సాయపడుతుంది. “బాధలనే పక్షులను నీ తలపై ఎగురకుండా చెయ్యలేము కాని, అవి నీ జుట్టులో గూళ్ళు కట్టుకోకుండా మాత్రం చెయ్యగలం!” అన్న చైనా సూక్తిని మనం గుర్తుంచుకోవాలి.

అందుకే, ప్రపంచంలో కొన్ని జాతులవారు - ముఖ్యంగా పశ్చిమ ఆఫ్రికాలోని కొన్ని తెగలు - దివంగత సభ్యుణ్ణి తలచుకుంటూ అదేపనిగా రోదించడాన్ని అదుపులో పెట్టడానికి హాస్య భాగస్వామి (Joking Partner) సాయం తీసుకుంటారు. యూదులు కూడా ఇలాంటి సందర్భాలలో హాస్యం ప్రాధాన్యతను గుర్తించారు. “గుండె బరువుగా ఉందా?” అని యూదులను ప్రశ్నిస్తే, “గట్టిగా నవ్వే సెయ్” అని సమాధానం వస్తుంది. “అందరి బాధలలో నీ రోదనే అతి తక్కువ బాధాకరమైనదిగా అనిపిస్తుంది” అంటారు వారు.

బాధించకు - ఓదార్చు: బాధలలో ఉన్నవారిని ఓదార్చగలగడం ఒక కళ. సాధారణంగా బాధితుణ్ణి మరింతగా క్షోభ పెట్టడానికే ఎక్కువమంది ప్రయత్నిస్తారు కాని, అతనికి

---

నవ్వుకు ఉన్న పరిమాణపు నిష్పత్తిని బట్టి సమాజంలో గల స్వేచ్ఛ మారుతుంది. – జీర్ మాస్లల్

ఉపశమనం కలిగించడానికి అంతగా ప్రయత్నించరు. అయితే, ఈ విషయంలో ప్రధాన పాత్ర రోగి తీసుకోవాలంటాడు నార్మన్ కజిన్స్.

రాజారావుకు మోకాలు ఆపరేషన్ చేశారన్న వార్తవిన్న బంధువులు, మిత్రులు, అభిమానులు ఎంతోమంది ఆయనను పరామర్శించడానికి ఆసుపత్రికి వెళ్ళారు. డాక్టర్ ఆయనను ఎక్కువగా మాట్లాడవద్దని సలహా ఇవ్వడంతో భార్యతో చెప్పి రాజారావు అక్కడ ఓ చిన్నబోర్డు పెట్టించాడు. “మోకాలు కులాసా, నొప్పి కొద్దిగా ఉన్నది, ఇతర వివరాలకు అప్పుడప్పుడు ఈ బోర్డు చూడండి" అని. దానిని చూసినవారు అతడు 'చిలిపి' అని, 'చమత్కారి' అని, 'పొగరుబోతు' అని ఎవరికి నచ్చిన రీతిలో వారు అక్షింతలు వేశారు!

డాన్ కెల్లర్ తన ప్రఖ్యాత రచన 'హాస్య చికిత్స' (Humor as Therapy) లో ఒక ఉదంతాన్ని వివరించారు. నీరజ ఆరోగ్యం దెబ్బతిని ఆసుపత్రిలో చేరింది. “నన్ను క్యాన్సర్ పట్టుకోవడంతో మనోవేదన పెరిగింది. ఇంక ఆత్మహత్యే శరణ్యమేమో!” అని మిత్రురాలు స్వాతితో చెప్పి బాధపడటంతో “నీరజా! ఇలాంటి పిచ్చి ఆలోచనలు మానెయ్. నీకు అంతా సవ్యంగానే జరుగుతుంది. అయినా నువ్వు మూర్ఖంగా ఆత్మహత్య చేసుకున్నావా.... జాగ్రత్త.....నీ సమాధి పైన ప్రతిరోజు మూత్రవిసర్జన చేస్తా....గుర్తుంచుకో” అని హెచ్చరించిన రీతిలో సలహా ఇచ్చింది స్వాతి. అంతే! తన ఆలోచనాసరళిలో గణనీయమైన మార్పు వచ్చి క్రమంగా మరణవాంఛ తననుండి మాయమైందని ఆమె తెలిపింది.అందుకే కొందరు “నా సంతాపసభను చూసి ఆనందించాలని ఉందయ్యా!” అంటూ చతురోక్తులు విసురుతారు.

మహాభారతంలో గాంధారి కథ మనకు తెలిసిందే. భర్త ధృతరాష్ట్రుడు లోకాన్ని చూడలేడు కనుక తాను కూడా కళ్ళకు గుడ్డకట్టుకొని జీవితకాలం అంధురాలిగానే గడిపింది. చరిత్రలో ఇదొక అద్భుత ఉదంతం, అమర త్యాగానికి ప్రతీక. అలానే అమెరికాలో 'People' పత్రిక వివరించినట్లు మాన్యువల్ గార్షియాకు క్యాన్సర్ మూలంగా జుట్టు ఊడిపోయింది. జుట్టు పోయిందన్న బాధ అతనికి లేకుండా చేయడానికి అన్నట్లుగా ఆయన సహోదరుడు, ముగ్గురు ఆత్మీయ బంధువులు కూడా బోడిగుండ్లు చేయించుకున్నారు. మాన్యువల్ ఇంటికి వచ్చిన తరువాత మరో 50 మంది మిత్రులు, బంధువులు నున్నని గుండ్లతో ప్రత్యక్షమయ్యారు. ఆవిధంగా ఒక్కవారంలో బోడిగుండ్ల సంఖ్య వందకు చేరింది! బోడిగుండు వరకు అనుకరించడం బాగానే ఉంది. మరి మరణాన్ని కూడా అలానే అనుకరించడం సాధ్యమా? -

---

నవ్వుకు ప్రతిధ్వని అంటే పరమానందం. ఒంటరిగా నవ్వడంలో ఆనందం అనుభవించలేవు.

– హెన్రీ బెర్గ్ సన్

మరణంతో ఆటలు: మరణంతో ఆటలు భలే పసందుగా ఉంటాయి. ఆంగ్లంలో అంత్యక్రియల (FUNERAL) గురించి కొందరు పదక్రీడలుచేస్తారు. దాని అక్షరాలలో 5వ స్థానంలో ఉన్న 'R'ను 4వ స్థానంలో పెట్టి ఆ పదాలను తారుమారుచేసి 'నిజమైన ఆనందం' (REAL FUN) పొందుతారు: అలానే అనేక దేశాలలో ఈ క్రీడలు ఎలా సాగు తాయో చూద్దాం. ప్రాచీన రోమ్ లో ఆస్థాన విదూషకుడు రాజుగారి అంతిమయాత్రలో పాల్గొని, ఆ బాధాకర సందర్భం యొక్క గాంభీర్యతను తగ్గించడానికి హాస్య ప్రయోగం చేస్తాడు. అలానే బలినీస్ తెగవారు ఆత్మ శరీరం నుండి విముక్తి పొందడానికి అవకాశం కల్పించేది మరణం అంటారు. మరణాన్ని వారొక గొప్ప పండుగలా భావిస్తూ, శవయాత్ర ను ఓ గులాబీ ఉత్సవంలా జరుపుతారు. అలానే, మెక్సికోలో సంవత్సరంలో ఒక దినాన్ని స్వర్గస్తుల దినంగా పరిగణిస్తారు. నాట్యం చేసే అస్తిపంజరాలు, పంచదారతో కప్పబడిన శవపేటికలు మొదలైనవాటితో మరణాన్ని దూషిస్తూ, అపహాస్యం చేస్తూ ఆరోజంతా నవ్వులతో గడుపుతారు. శవపేటికను తీసుకుపోయేటప్పుడు దుఃఖిస్తూ పోవాలని, తిరుగు ప్రయాణం మాత్రం నవ్వుతూ జరపాలని ఐర్లండ్ రచయిత చమత్క రిస్తాడు. సంతాపసభలో దివంగత వ్యక్తికి ప్రియమైన హాస్యోక్తులను కూడా చెప్పుకోవాలం టారు. తివి(ఆఫ్రికా)లో మరణ భీతి నుండి హాస్యకారుని సాయంతో బయటపడాలం టారు. మరణం, జీవనం వ్యతిరేకం కాదు అంటారు. స్కాట్ ప్రజల దృష్టిలో మృతజీవులు నిజమైన స్వేచ్ఛా జీవులు. వారికి పన్ను కట్టాల్సిన పని ఉండకపోవడమేగాక, మరణంతో బాకీలన్నీ తీరిపోతాయి అని ఆనందిస్తారు. మరణాన్ని శత్రువుగా భావించినంతకాలం జీవితం ఒక పోరాటంలా మారుతుంది. మరి ఆ మరణాన్నే మిత్రునిగా భావిస్తే ఇంక పోరాటంతో పనేంటి? అంటాడు లెవైన్'.

యూదుల చట్టాన్ని టాల్ ముడ్ (Taimud) అంటారు. అదొక గొప్ప పాఠాన్ని మనకు నేర్పుతుంది. రేవునుండి వెళ్ళే పడవకు వీడ్కోలు పలుకుతామేకాని, వచ్చేదానిని గురించి అంతగా పట్టించుకోము. మరి, ప్రయాణీకులందరూ క్షేమంగా తిరిగి వచ్చినందుకు ఆ పడవకు, ప్రయాణీకులకు అభినందనలు చెప్పాలి కదా! ప్రపంచం కూడా అంతే. శిశువు జన్మిస్తే అంతా కోలాహలం, మరణిస్తే అంతా విషాదం. అప్పుడే జన్మించిన శిశువు జీవిత పోరాటంలో ఎలాంటి సమస్యలు ఎదుర్కొనాలో ఎవ్వరికీ తెలియదు. కాని, మరణించిన వ్యక్తి తన జీవనయాత్రను విజయవంతంగా ముగించాడన్న సత్యాన్ని మనం గుర్తించాలి అంటారు వారు.

---

నవ్వుకు వయస్సు లేదు. దానిని పంచుకోగలిగితే తరాల మధ్య అంతరాన్ని తొలగించగలదు. – బాబ్ టాల్బర్ట్

వేదాంతపరంగా అసలు మృత్యువేలేదు. చనిపోవడం దేహ లక్షణమేకాని, ఆత్మ లక్షణం కాదు. నిజానికి ఒక శరీరం నుండి ఆత్మ మరొక శరీరంలోకి మారే ప్రక్రియను మృత్యువు అని పిలుస్తాం. అదొక ఆనందదాయకమైన విషయం అయినప్పుడు మృత్యువును చూసి మనం ఎందుకు బాధపడాలి? చిత్రం ఏమంటే, బస్సులు రావని వినడంతో “చచ్చాం పో" అనికొందరు అంటే, కరెంటుపోతే “చచ్చాం" అంటారు ఇంకొందరు. ఇలా ప్రతిచిన్నదానికి చచ్చాం అనడం చాలామందికి చచ్చినంత సరదా. ఆందోళనతో చావు, భయంతో చావు, ఆకలితో చావు - ఈవిధంగా భిన్న చావుల సమాహారం - చావుల పరంపర - జీవితం కావడం బాధాకరమైన పరిణామం.

కొన్ని మతాలు నరకం అంటేనే జనాలను భీతావహులను గావిస్తున్నాయి. యమభటులు పాపులను సలసలాకాగే నూనెలో ముంచుతారని, భగభగ మండే మంటల్లో వేస్తారని, దోసెల్లాగా రోస్ట్ చేస్తారని - ఇలా నానా రకాలుగా వర్ణిస్తారు. యమలోకంలో అధునాతన పరికరాలు ఉంటాయేకాని భూమిమీదలాగానే కాగే నూనె, మండే పొయ్యి తప్ప సూపర్ న్యూక్లియర్ పరికరాలేవీ ఉండవనడం యమలోకాన్ని, దైవ విజ్ఞానాన్ని హేళన చేసినట్లే అవుతుంది! అందుకే కాలే నూనె, మండే పొయ్యి కథలను ఇకనైనా మనం మరచిపోవాలి.

స్వాగతం, సుస్వాగతం : ఇప్పుడు కొందరు ప్రముఖులు మరణాన్ని ఎంత చక్కగా స్వాగతించారో, ఆనందంగా దానికి ఎలా సంసిద్ధులయ్యారో చూద్దాం......

తాను మరణించబోతున్నానని వారం రోజుల క్రితమే తెలిసిన పరీక్షిన్మహారాజు ఆ వారం రోజులలో శుకమహర్షిచే భాగవతం చెప్పించుకొని జన్మరాహిత్యం పొందిన మహనీయుడు. తాను నిర్వహించదలచుకున్న గొప్ప కార్యక్రమాలన్నింటిని ఆ ఏడు దినాలలో పూర్తిచేసుకొని మరణాన్ని స్వాగతించిన అద్భుత వ్యక్తి ఆయన.

భీష్ముడు తన మరణాన్ని తన అధీనంలోనే ఉంచుకున్నాడు. ఉత్తరాయణం వచ్చేదాకా ఆగాలనుకున్నాడు, ఆగాడు. అది రాగానే మృత్యుదేవతనాహ్వానించి, ఆనందంగా తుది శ్వాస విడిచాడు.

మహోన్నత నృత్యం పేరిణి శివతాండవాన్ని పునరుజ్జీవింపజేసి, ఆంధ్రుల లాస్య నాట్యాన్ని పునరుద్ధరించి, అమరత్వం చేకూర్చిన మహా పరిశోధకులు, నాట్య కళాతపస్వి డా॥ నటరాజ రామకృష్ణగారి కోరిక విన్నారా? “నా మరణానంతరం నాకు ప్రాచీన పద్ధతిలో సమాధి చేయాలి. నా పైన, నా సమాధిలోపల గులాబీలు దండిగా ఉంచి, వాటిపై చక్కని సెంట్లు చల్లి వాటి పై నన్ను పడుకోబెట్టి నామీద కూడా మరిన్ని పూలు చల్లాలి”.

---

ప్రతి ఉదయాన్ని చిరునవ్వుతో ప్రారంభించి, రోజంతా చిద్విలాసంగా గడుపు. – డబ్ల్యు. సి. ఫీల్డ్స్

అమెరికా అధ్యక్షుడురీగన్ గొప్ప హాస్యచతురుడుగా . ఆయన అమెరికా అధ్యక్షుడు అయినప్పటినుండి తన దహన సంస్కారాలను గురించి సన్నాహాలు చేసుకుంటూనే ఉన్నాడు. తన ఉపాధ్యక్షుడు జార్జి డబ్ల్యు.బుష్ Funeral Speech ఇవ్వాలని, సుప్రీం కోర్టులోని మహిళా న్యాయమూర్తి ఫలానా పుస్తకం నుండి ప్రార్ధనా గీతాన్ని ఆలపించాలని కోరాడు. రీగన్ మరణానంతరం ఆయన కోరినట్లుగానే అంత్యక్రియలు ఆయనకు ఉపాధ్యక్షుడుగా పనిచేసిన బుష్ కుమారుడు జార్జి డబ్ల్యు. బుష్ అధ్యక్ష పదవీకాలంలో జరగడం విధి విచిత్రం.

జాక్విలిన్ కెనడీ ప్రపంచ ప్రఖ్యాత సుందరాంగిగా కీర్తి గడించింది. అమెరికా అధ్యక్షుడు జాన్.ఎఫ్.కెనడీ భార్య ఆమె. భర్త మరణానంతరం ఒనాసిస్‌ను వివాహమాడింది. 64 సంవత్సరాల వయస్సులో ఆమెకు బ్రైన్ క్యాన్సర్ వచ్చి శారీరకంగా క్రుంగిపోయింది. తన అంతిమ ఘడియలు దగ్గరకు వచ్చాయని తెలుసుకున్న ఆమె...కుమారుడు జాన్‌కు ఒక లేఖ వ్రాస్తూ కెనడీ కుటుంబం ప్రాభవ వైభవాలను కాపాడమని కోరింది. భర్త కెనడి సమాధి ప్రక్కనే తనను సమాధి చేయమని, సమాధి పైన "నేను అధ్యక్షుని భార్యను” (I was the president's wife) అని వ్రాయమని కోరింది. తన అంపశయ్య పై ఉంచాల్సిన పుష్పగుచ్ఛాలను, తనకు వీడ్కోలుచెప్పే పాటను (Gregarian chant) కూడా తానే ఎంపిక చేసుకుంది. ఇలా మరణానికి ఆనందంగా సిద్ధమవుతుంటే ఇంక మరణ భీతి ఎందుకు?

దాదాపు శత వర్షాలు జీవించిన జార్జి బెర్నార్డ్ షా హాస్యానికి మారు పేరుగా, వ్యంగ్యానికి నిర్వచనంగా పేరు గడించాడు. ఒక అర్ధ శతాబ్ది కాలం ప్రపంచంలోనే అత్యుత్తమ నాటక రచయితగా కీర్తి గడించిన ఆయన తన వీలునామాలో “నా అంతిమ యాత్రలో పాల్గొనేవారు, నా శవ పేటికవెంట వచ్చే వారు విషణ్ణవదనులై ఉండరాదు. నేను శాకాహారిగా జీవితకాలాన్నంతా గడిపినందుకు గౌరవసూచకంగా ఆవుల మందలు, మేకల గుంపులు, పందులు, కోళ్ళ వరుసలు, బారులు తీరిన చేపలు నా వెంట రావాలి. నోవాస్ ఆర్క్ తరువాత ఇలాంటి అద్భుతం జరగలేదని అవి నిరూపిస్తాయి” అని వ్రాశాడు.

తొలి మానవుడు పగలంతా సూర్యకాంతిలో ఆనందిస్తూ, కేరింతలు కొడుతూ కాలం గడిపాడు. ఇంతలో నెమ్మదిగా అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూసి ఇంక ఏం జరగబోతుందోనని భీతి చెందాడు. క్రమంగా ప్రొద్దుగుంకింది. ఆకాశం నిండా అంద మైన నక్షత్రాలు పుష్పించాయి. వయ్యారి భామలా అందమైన చంద్రబింబం చల్లగా ప్రత్యక్ష మైంది. చల్లని పిల్లవాయువులు వాతావరణాన్ని మరింత ఆహ్లాదకరంగా మార్చడంతో, తాను ఎంతగానో

---

ఆనందించిన పగలుకన్నా, ఎంతగానో భీతిచెందిన రాత్రి ఆ తొలి మానవునికి అమృతప్రాయంగా, ఆనందదాయకంగా సాక్షాత్కరించింది. ఎంత అద్భుత దృశ్యం! ....ఇది ఒక ఆంగ్ల గేయం సారాంశం. తెలిసిన పగలు గురించి ఆనందిస్తూ తెలియని రాత్రిని గురించి మనిషి భయపడినట్లే, జీవితాన్ని గురించి తెలిసిన మనం తెలియని మరణాన్ని గురించి అనవసరంగా భయపడుతున్నామేమో! అన్న అద్భుత సందేశాన్ని అందజేసిన రచయిత నిజంగా అభినందనీయుడు!

"నే చనిపోయానన్న వార్త చదువుకొని జనం 'వీడింకా బ్రతికే వున్నాడా!' అను కుంటారు" అన్న సోమర్ సెట్ మామ్ మాటల్లో మరణంలో ఎంత హాస్యాన్ని దర్శిం చవచ్చునో అర్థమవుతుంది.

"చచ్చువారలెవరు? చావని వారేరి?
చచ్చి బ్రతికియుండు జనములెవరు".

మరణ సమ యంలో కూడా సగటు మనిషి ఆలోచనలు ఎంత వింతగా ఉంటాయో తెలిపే ఈ ఉదంతంతో ఈ అధ్యాయాన్ని ముగిద్దాం.

ఆమె మధ్యతరగతికి చెందిన యూదుల యువతి. అనారోగ్యంతో బాధపడుతూ తనకు చివరి ఘడియలు సమీపించాయని గ్రహించి ఒక చిత్రకారుని పిలిపించింది. తన చివరి కోరికగా తన నిలువెత్తు చిత్రం గీయమంది. ఖరీదైన దుస్తులతో, విలువైన ఆభరాణలతో, మణులు మాణిక్యాలతో తనను ఓ మహరాణిలా చిత్రించమన్నది. అంతా విన్న ఆ చిత్రకారుడు "అలానే. అయితే ఒక్క అనుమానం. మీరు ఓ సామాన్య కుటుంబానికి చెందిన...." "అర్థం అయిందయ్యా. అసలు కారణం ఏమంటే నా మరణానంతరం మా వారు మరో స్త్రీని వివాహమాడతారు. అలా వచ్చిన ఆవిడ నా నగలు చూస్తూ ఇవన్నీ ఎక్కడ దాచింది అంటూ వెతుక్కుంటూ ఆవేదన చెందాలి. అందుకే అలా గియ్యి" అంది!

మరి మరణభీతిని తరిమేస్తూ పిసినారుల గురించి తెలుసుకుంటూ మరింతగా నవ్వుకుందామా!

---

అతనికి అవసరంలేని వస్తువులను తయారు చేయటంలో మోజు ఎక్కువ. అవసరంలేని వారికి వాటిని ఇవ్వడంలో ఆయనకు ఆనందం మరింత ఎక్కువ. – ఆంథోని హోప్

అధ్యాయం 39

# జీవన సంగీతపు మధుర రాగాలు

శేఖర్ ఒక డాక్టర్. డాక్టరు పరీక్షలన్నీ పూర్తిచేసుకొని కుమారుడు శంకర్ రావడంతో తన ప్రాక్టీస్ ను అతనికి అప్పజెప్పి నెల్లాళ్ళపాటు తన ఊరికి వెళ్ళాడు శేఖర్. తండ్రి తిరిగిరాగానే "నాన్నా! పదేళ్ళ నుండి కడుపు నొప్పి, అజీర్తి మొదలైన బాధలతో నీదగ్గర మందు పుచ్చుకుంటూ ఉన్న సీతయ్య గారి అజీర్తిని పూర్తిగా నయం చేశా!" అన్నాడు శంకర్ మురిసిపోతూ. "చంపావు కదరా........ఆ అజీర్తి రోగంవల్ల వచ్చిన ఆదాయమేరా ఈ పదేళ్ళ నుండి నీ చదువుని, నీ ఖర్చుల్ని, నా సంసారాన్ని ఆదుకుంది" అంటూ బాధపడ్డాడు డాక్టర్ శేఖర్.

నవ్వు, ఏడుపులు పైకి భిన్నంగా ఉన్నప్పటికీ వాటిమధ్య ఎంతో సామీప్యం ఉండటం ఒక విచిత్రం. వాటి పుట్టుక ఒక్కటే. వాటి రూపు ఒక్కటే పెద్దగా నవ్వుతు న్నప్పుడు, ఏడుస్తున్నప్పుడు శబ్దాలు ఒకేలా ధ్వనిస్తాయి. అందుకే కొన్ని సమయాలలో ఒక వ్యక్తి నవ్వుతున్నాడో, ఏడుస్తున్నాడో అర్థంకాని విచిత్ర పరిస్థితి ఏర్పడుతుంది. అలానే అవి ఒకేరకం కార్యాలను నిర్వహిస్తాయి. అందుకే అంటాడు కలీల్ జిబ్రాన్ కవి.. "ఏ బావిలోనుండి నీ నవ్వు జనిస్తుందో, నీ కన్నీరు కూడా అందులోనే ఇమిడి ఉంటుంది"అని. మనం తరచు "వాడు నవ్వలేక చచ్చాడురా' అంటాము. హాస్య నటులు ప్రేక్షకులను నవ్వులలో ముంచెత్తడం, నవ్వులతో చంపగలగడం ఒక గొప్ప కళగా, ఒక అదృష్టంగా భావిస్తారు. ఉద్రిక్తత, ఒత్తిడులనుండి విముక్తి కలిగించే అద్భుత సాధనాలు నవ్వు, ఏడుపు. అందుకే "నవ్వుకు, ఏడుపుకు మధ్య అవినాభావ సంబంధం ఉంది. అయితే.....నవ్విన తరువాత శుభ్రం చేసుకోవాల్సిన అవసరం ఉండదు కనుక నేను నవ్వుకే ప్రాధాన్యమిస్తా" (కుర్ట్ వాట్).

ఏడుపు + నవ్వు = జీవితం : ఇప్పుడు నవ్వు, ఏడుపు మధ్యగల సంబంధాన్ని, అనుబంధాన్ని గురించి ప్రపంచ ప్రముఖ మేధావులు ఎలా వివరించారో, వ్యాఖ్యానించారో చూద్దాం: "నవ్వించేదేదైనా హాస్యమేగాని, ఉత్తమమైన హాస్యంలో ఒక బొట్టు కన్నీరు కూడా రాలుతుంది" అని జార్జి బెర్నార్డ్ షా భావించగా, "కన్నీటికి అధికారిణి హాస్యం" అన్నాడు థాకరే. "జీవన సంగీతపు మధుర రాగాలు రెండు - అవి కన్నీళ్ళు, చిరునవ్వులు" అని డా|| సర్వేపల్లి రాధాకృష్ణన్ అభివర్ణించగా, "నవ్వు, ఏడుపులు మనకు ఉన్న రెండు ఉత్తమ ఉపశమనాలు" అంటాడు పీటర్మ్యాక్ విలియమ్స్. "నేను ఎవరిని చూసైనా నవ్వేది

---

హాస్యం అంటే జనాన్ని చూసి నవ్వడమే కాని, వారిని తనతో నవ్వించగలగడం కాదు. – ఎడ్గార్

ఏడవలేకనే" అని లార్డ్ బైరన్ వ్యంగ్య బాణం సంధించగా, "కొన్ని సందర్భాలలో హాస్యం రహస్య కన్నీరుద్వారా జనిస్తుంది" అన్నాడు జోన్ లివర్స్. నవ్వుల చక్రవర్తి రేలంగి వెంకట్రామయ్య "నవ్వు, ఏడుపు కలిస్తే సినిమా. ఏడుపు, నవ్వు కలిస్తే జీవితం" అని సినిమా, జీవితం గురించి అద్భుత నిర్వచనం ఇచ్చాడు. అందుకే కాబోలు "ఏడ్వటం చేతకానివారికి నవ్వడం కూడా తెలియదు" అన్నారు గోల్డామేయర్.

అందుకే మనం కన్నీటిని ఆనందబాష్పాలు అని, అశ్రునయనాలు అని పిలుస్తుంటాము. కన్నీళ్ళు అన్నీ ఒక్కటి కాదు. వాటి మర్మాలను కనిపెట్టడం అంత సులభమూ కాదు. దానికి అద్భుత పరిజ్ఞానమేగాక, అనంత అనుభవం కావాలి. కొందరు ఏడుస్తూ నవ్విస్తే, మరికొందరు నవ్విస్తూ ఏడిపిస్తారు. ఈ అంశంపై పరిశోధనలు చేసిన డా॥ విలియమ్ ఫ్రై ఆవేశంతో కూడిన కన్నీళ్ళలో ప్రొటీన్ శాతం అధికంగా ఉంటుందని కనుగొన్నారు. అంటే సాధారణంగా వచ్చే కన్నీళ్ళలో - కంట్లో నలకలు, కారం పడినప్పుడు, ఉల్లిపాయలు కోసేటప్పుడు వచ్చే కన్నీళ్ళలో - అలాంటి ప్రొటీన్లు ఉండవన్నమాట! బాధల మూలంగా వచ్చే కన్నీరు మనలోని కొన్ని ప్రమాదకర పదార్థాలను లేదా టాక్సిన్లను ప్రక్షాళన చేస్తుందన్నమాట! మరో విషయం. కన్నీళ్ళను బలవంతంగా తొక్కి పట్టడం వలన మనలో ఉద్రిక్తత పెరిగే అవకాశం ఉంది. నవ్వు మన భారాన్ని ఎంతగా తగ్గిస్తుందో, ఏడుపు కూడా అదే పని చేస్తుంది. అందుకే కడు పారా నవ్వడం ఎంత మంచిదో, మనసారా ఏడవడం కూడా అంతే మంచిదని పరిశోధ నల ద్వారా తేలింది.' నవ్వు పరమౌషధం అయినట్లే, ఏడుపు కూడా ఒక దివ్యౌషధమేనని గుర్తుంచుకోవాలి.

ప్రతి చిన్న విషయానికి కన్నీళ్ళు కార్చడం చాలామంది మహిళలకు ఒక అలవాటు, ఒక ఆనందం, ఒక తృప్తి. ఏడుపుకు, మహిళకుగల అవినాభావ సంబంధాన్ని వర్ణిస్తూ పిలవకుండానే ఆడోళ్ళ కళ్ళవెంట నీల్లొస్తాయని ఒక కవి ఛలోక్తులు విసిరాడు. చీటికి మాటికి ఏడవటం వల్లనేనేమో మహిళలకు గుండె జబ్బులు తక్కువగా వస్తాయంటారు వైద్యులు! అదేకాదండోయ్. నవ్వుల్లో కూడా వారు ప్రముఖులే. పురుషులకన్నా మహిళ లు 126 శాతం అధికంగా నవ్వుతారని పరిశోధనలలో తేలింది. ముద్దుముద్దుగా ఏడుస్తూ, హృద్రోగాలను మురిపిస్తూ, వాటిని తరిమికొడుతున్నారు. ఈ విధంగా ఎటుచూసినా వారిదే పైచేయి! -

మనందరం రోజూ కొంచెం సేపు నవ్వినట్లే, హాయిగా ప్రతిరోజూ కొంచెం సేపు ఏడిస్తే పోలా! అందుకే.... ఎవరైనా ఏడుస్తుంటే "ఛ అలా అమ్మాయిలా ఏడుస్తావేంటి?".... "మీలాంటి పెద్దవారు ఏడ్వవచ్చునా?" అని నిరుత్సాహపరచకండి, ఓదార్చకండి. వాళ్ళను

---

హాస్య ధోరణి లేని మనస్సు చక్కగా వ్యవస్థీకృతం కాని వ్యవస్థ వంటిదే. – శామ్యూల్ కోలరిడ్జ్

కాసేపు హాయిగా ఏడ్వనివ్వండి. ఇతరుల ఏడుపును బలవంతంగా మాన్పించడం అంటే వారి ఆనందాన్ని దారుణంగా దోచుకోవడమే అని తెలుసుకోండి!

వ్యత్యాసాలు : నవ్వుకు, ఏడుపుకు మధ్య ఎంత సంబంధంఉన్నప్పటికీ, వాటి మధ్య కొన్ని వ్యత్యాసాలు కూడా లేకపోలేదు.

1. నవ్వు మన బాధలను మరిపిస్తుంది. ఏడుపుకు కూడా కొంతవరకు ఆ శక్తి లేకపోలేదు.

2. నవ్వు మనిషిని బహిర్ముఖుణ్ణి చేస్తుంది. నువ్వు నవ్వితే పదిమందీ నీతో కలసి నవ్వుతారు. అది మన దృష్టిని వికసింపజేసి, వినూత్న కోణం నుండి విషయాన్ని వివరించడంలో తోడ్పడుతుంది. అందుకే బాధలలో నవ్వడం నేర్చుకుంటూ నీ బాధను నియంత్రించగలగాలి. అయితే నువ్వు ఏడిస్తే మాత్రం ఒంటరివాడవవుతావు. బాధతో కూడిన కన్నీళ్ళు మనిషిని అంతర్ముఖుణ్ణి చేస్తాయి. నవ్వే వ్యక్తి ప్రపంచానికి చెందుతాడు. ఏడ్చే వ్యక్తి తనకు మాత్రమే చెందుతాడు. అందుకే ఏడుపుకన్నా నవ్వు సుదూరంగా వినబడుతుంది.

3. కన్నీటి గాథలు మనల్ని బాధలకు కట్టివేసి మన దృష్టిని సంకుచితం చేస్తాయి. అయితే ఇది పూర్తిగా నిజం కాదనిపిస్తుంది. మనం మనకొరకేగాక, ఆప్తబంధువుల కొరకు, మిత్రుల కొరకు కూడా ఏడుస్తాం. బాపూజీ మరణించినప్పుడు దేశవిదేశాలలో ఎంతమంది శోకసముద్రంలో మునిగిపోలేదు! నిజానికి ఇవన్నీ మినహాయింపుల క్రిందకే వస్తాయి.

పోలికలు : నవ్వు ఏడుపులమధ్య చక్కని పోలికలు కూడా కన్పిస్తాయి.

1. నవ్వడానికి మనం ఎంత బాధపడతామో, ఏడవడానికి కూడా అంతే బాధపడతాము.

2. "నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి.... ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా" అంటూ ఘంటసాల తన అమరగానంతో పాడిన పాటలో ఎంత అర్థం, అంతరార్థం ఉంది!

3. “నవ్వు నాలుగు విధాల చేటు" అని దానిని ఎంతగా అణచివేశామో, “ఏడవడం ఆడవారి లక్షణం” అని హేళనచేస్తూ ఏడుపునుకూడా అంతగా తొక్కిపట్టాము. అది చాలదన్నట్లు మరొక అడుగు వేసి “నవ్వే ఆడదాన్ని, ఏడ్చే మగవాణ్ణి నమ్మకూడదు” అన్న కుయుక్తితో కూడిన సూక్తితో రెండింటికి దూరమయ్యాము. ఈ విధంగా మానవాళి ప్రగతికి మహత్తర సాధనాలు, జీవన సంగీతపు మధుర రాగాలు అయిన నవ్వు, ఏడుపులమధ్య లింగ భేదాలు సృష్టించి సమాజాన్ని అటు నవ్వుకు, ఇటు ఏడుపుకు దారుణంగా దూరం చేశారు.

---

ఒక మనిషి అవగాహనాస్థాయిని న్యాయంగా అతని ఉల్లాసంతో కొలవవచ్చు -. డా॥ జాన్సన్

దీనివల్లనే సమాజంలో హింస, క్రూరత్వం పెరుగుతున్నా యని, ఆరోగ్యరీత్యా మనిషికి కురుపులు, వ్రణాలు (Colitis), చర్మపు వాపులు వస్తున్నాయని పరిశోధనల ద్వారా తేలింది.

4. ఎవరిమీదైనా కసిగా ఉంటే "వాడిది ఏడుపు ముఖంరా" అని కించపరుస్తాము. నవ్వే ముఖాన్ని 'ఉజ్వలమైన కాంతి' అని, ఎలాంటి వంకర గీతనైనా నిలువుగీతగా మార్చే శక్తిగలది అని వర్ణిస్తూ అభినందన క్రింద జమకడతాము కాని, "ఏడుస్తున్నా నువ్వు అద్భుతంగా ఉంటావ"ని ప్రియుడు తన ప్రేయసిని కొనియాడే మాటలను మనం ఎందుకు విస్మరిస్తాము? మొత్తం మీద ప్రపంచంలో ముమ్మాటికి మూటకట్టి తీసివేయాల్సిన ముఖాలు మూడు రకాలు - ఏడుపుగొట్టు ముఖం, ఎడారి నవ్వుల ముఖం, ఏబ్రాసి ముఖం.

పెద్దపీట : ఏడుపుకు ఒక ప్రత్యేకత ఉన్నది కనుకనే సాహిత్యంలో నవ్వుకన్నా ఏడుపుకు పెద్దపీట వేశారు రచయితలు. వాల్మీకి మహర్షి శోకం అద్భుత శ్లోకం అయ్యింది. అది ఆది కావ్యమైన రామాయణ రచనకు కారణమైంది. శ్రీనాధ మహాకవి కాశీ ఖండంలో పెద్ద కన్నీటి బొట్లు జారిపడేలా పెద్ద గొంతుతో అందంగా వసంతకోకిల ఎలా వెక్కివెక్కి ఏడ్చిందో హృద్యంగా వర్ణించాడు. అలానే ధూర్జటి కవి, అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, భట్టుమూర్తి ఏడ్చేవారిని ఉద్దేశించి చక్కని కవితలు అల్లారు. వికటకవి తెనాలి రామకృష్ణుడు పెద్దల ఏడ్పులు ఎలా ఉంటాయో తనదైన రీతిలో వర్ణించాడు. అల్లసాని పెద్దన అల్లనల్లన ఏడ్చాడు. ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా ఏడిస్తే, భట్టుమూర్తి బావురుమని ఏడ్చాడు అని శ్రీ కృష్ణదేవరాయలవారి సభలో రసవత్తరంగా వర్ణించడంతో సభ గొల్లుమంది. అలానే, దేవులపల్లి కృష్ణశాస్త్రి "కన్నీటి కెరటాల వెన్నెల లా" అని హృద్యంగా ప్రశ్నించుకున్నాడు. "ఏడ్వలేక ఏడ్వలేక ఒక్క కోకిలమ్మ కోయని యేడ్చె" అని విషాద వదనంతో ఆలపించిన మహనీయుడు ఆయన. కృష్ణశాస్త్రి కన్నీటికి, జాషువాగారి కన్నీటికి తేడా చూడండి. కృష్ణశాస్త్రి కన్నీరు కవితాత్మకంగా ఉంటే, జాషువాగారి కన్నీరు కరుడుకట్టినట్లుగా ఉంది. "శ్మశానవాటిక' ఖండికలో "కన్నీటంబడి కాగిపోయినవి నిక్కంబిందు పాషాణముల్" అన్నాడు జాషువా. కన్నీటి శక్తి అంత గొప్పదన్నమాట! అయితే మనుషుల్ని నవ్వుల సముద్రంలో ముంచేది, ఎలాంటి పెట్టుబడి లేకుండా హాయిగా నవ్వించగలిగేది హాస్యం. అల్లుడి మనస్తత్వం పై కొరడా దెబ్బవేసే ఈ ఉదంతాన్ని చూడండి!

మిత్రుడు వెంకట్ తో "మా అల్లుడికి మరీ అనుమానంరా, కోపం ఎక్కువరా" అంటూ వాపోయాడు సుభాష్ "ఏం జరిగింది?" "మొన్న అల్లుడు ఇంటికి వస్తే పలకరింపుగా నవ్వా. అంతే! "నన్ను చూసి నవ్వుతావా" అంటూ అలిగి వెళ్ళిపోయాడు" అన్నాడు సుభాష్.

---

“అసలు అల్లుణ్ణి చూసిన తరువాత నీ ముఖంలోకి నవ్వెలా వచ్చిందిరా?!” అనుమానంగా చూశాడు వెంకట్.

విచిత్రమేమంటే కడుపుబ్బ నవ్వించే చతురోక్తులకు పద్యాలలో స్థానం లేకుండా పోవడం విచారించదగిన విషయం. ఏడుపుకు మేడలు కట్టిన రచయితలు ఎందుకోగాని చతురోక్తులకు, హాస్యానికి అంతటి ప్రాధాన్యం యివ్వలేదు. అందుకే మనమైనా ఇంక నవ్వుల జల్లులలో విహరిద్దామండి!

---

తప్పు చేయడం మానవ సహజం. తడబాటు పడటం సామాన్యం, నిన్ను చూచి నువ్వు నవ్వగలగడం పరిపక్వతకు చిహ్నం. – విలియం ఆర్థర్ వార్డ్

అధ్యాయం 41

# నవ్వుల జల్లులు

అదొక చిత్రకళా ప్రదర్శన. ప్రఖ్యాత చిత్రకారులు తమ కళానైపుణ్యాన్ని అక్కడ ప్రదర్శించారు. చివరి రోజున జరిగిన బహుమతి ప్రదానం సభలో 'ఇద్దరు పిల్లలు నిలబడి మూత్రవిసర్జన చేస్తున్న దృశ్యాన్ని చిత్రకారుడు అరుణ్ అద్భుతంగా చిత్రించా' దని న్యాయనిర్ణేతలు ప్రశంసించారు. 'ఆ చిత్రం అతి సహజంగా ఉందని, కళాకారుడు తన కౌశలంతో చిత్రానికి వాసనలు కూడా జోడించగలిగాడ'ని వాళ్ళు అభినందిస్తుంటే, అరుణ్ కు ఏమీ అర్థం కాలేదు. ఇంటికి వచ్చి భార్య అరుంధతితో "చిత్రానికి వాసన ఎలా వచ్చింది? రంగులలో ప్రత్యేకంగా మనం ఏమీ కలపలేదు కదా!" అని అయోమ యంగా ప్రశ్నించాడు. "అదేం లేదండి....చిన్నాగాడు ఆ పెయింటింగ్ మీద పాస్ పోశాడు" అంది అరుంధతి చిరునవ్వులు చిందిస్తూ!

కిరణ్ ఒక హృద్రోగి. రైలు ప్రయాణం చేస్తూ ప్రతి స్టేషన్లో క్రిందకు దిగడం, బండి బయలుదేరబోయే సమయంలో సామానులతోసహా ఎక్కడాన్ని చూసిన ప్రయాణి కులకు ఆశ్చర్యం వేసింది. "ప్రతి స్టేషన్లో అలా ఎందుకు దిగి, ఎక్కుతున్నా రు?" ఆశ్చర్యంగా ప్రశ్నించారు తోటి ప్రయాణికులు. అందుకు కిరణ్ నవ్వుతూ "అది మీకు అర్థంకాదులేండి. నాకు గుండెజబ్బు ఉందండి" అన్నాడు. "ఉంటే?" అయోమయంగా ప్రశ్నించారు ప్రయాణీకులు. "ఒకేసారి అతి దూరపు ప్రయాణాలు చేయవద్దని డాక్టర్ గారి సలహా. ఏం చెయ్యాలి చెప్పండి! అందుకే ఈ తిప్పలన్నీ" నింపాదిగా సమాధానమిచ్చాడు కిరణ్!

తన భర్తకు అప్పుడే అందంగా నిర్మించిన సమాధివద్ద విసురుతూ కూర్చున్న విమలను చూసినవారంతా విస్తుపోయారు. "భర్తపైన ఎంత ప్రేమ, ఎంత అనురాగం!" అంటూ ఆమె పతిభక్తిని కొనియాడారు. ఇదంతా చూస్తున్న శ్యామలకు ఏమీ అర్థం కాక ఆమె వద్దకు వెళ్ళి "మరణించిన భర్తకు కూడా గొప్పగా సపర్యలు చేస్తున్నారే! మీ ఇద్దరిది ఎంత గొప్ప అనుబంధం!" అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించింది. "అలాంటిదేమీ లేదు....ఆయన సమాధి పూర్తిగా ఆరిందాకా మరొకరిని వివాహమాడనని ఆయనకు మాట ఇచ్చా. అందుకే ఇలా....." అన్నది నెమ్మదిగా.

ఇలాంటి హాస్యోక్తులు చదివే పాఠకులు నవ్వులమైకంలో మునిగిపోతారు; ఆనందం లో తేలిపోతారు. అంతేకాదు. నవ్వు గొప్ప ఆరోగ్యదాయిని కనుక జబ్బులనుండి విముక్తి

---

త్రాగడానికి పాలు ఇచ్చేవానికన్నా చిరునవ్వులు చిందించే వాని ముఖం మిన్న.–టాల్ మడ్

కూడా పొందుతారు అంటారు హృద్రోగ నిపుణులు డా|| కె.పి.మిశ్రా. అందుకే హాయిగా నవ్వడం అలవాటు చేసుకోవాలి. పదిమందీ నడిచే దారిలో గడ్డి మొలవనట్లే, అతిగా ఆలోచించేవారికి జుట్టు నిలవనట్లే, ఎప్పుడూ గంభీరంగా ఉండే ముఖం పై నవ్వు పుట్టదు. అందుకే ఈ అధ్యాయంలో ఎలాంటి సిద్ధాంతాలు, రాద్ధాంతాల జోలికి పోకుండా సరసమైన హాస్యోక్తులు చదువుతూ, హాయిగా నవ్వుల జల్లుల్లో విహరిద్దాం. ఆనందలోకాల్లో సంచరిద్దాం.

రోశయ్యగారి బాణీయేవేరు! శాసనసభలో తన వాక్చాతుర్యంతో పాటు చిట్టిపొట్టి కథలు చెబుతూ అందరినీ నవ్వించగల దిట్ట మనముఖ్యమంత్రి శ్రీ కొణిజేటి రోశయ్య. వైషమ్యాలకు నిలయమైన రాజకీయ రంగంలో కూడా ఆయన ప్రసంగాలు ప్రతిపక్ష పార్టీలవారిని సైతం ఆకర్షించగలగడం ఆయన ప్రత్యేకత. ఒకనాడు ఆయన చీరాల, వేటపాలెం మొదలైనచోట్ల ఉదయం నుండి సాయంత్రందాకా పలు కార్యక్రమాలలో పాల్గొన్న అనంతరం చిలకలూరిపేటలో ఒక సుహృద్భావ సమావేశంలో అనేక హాస్యోక్తు లు పేలుస్తూ అందరినీ నవ్వులలో ముంచెత్తారు. “ఉదయం నుండి సాయంత్రందాకా ఎడతెరిపి లేకుండా కార్యక్రమాలలో పాల్గొంటూ నే ఈ వయసులో కూడా ఇంత ఉత్సాహంగా ఎలా నవ్వించగలుగుతున్నారండి?" అని ప్రశ్నించగా, “మూర్తిగారూ! రైలుపట్టాల దగ్గరలో ఇల్లు కట్టుకున్నవాడు మొదట్లో ఇదెక్కడి గోల అనుకుంటాడు. ఆ తర్వాత ఆ శబ్దాలకు అలవాటు పడతాడు. కొంతకాలం గడిచాక ఆ శబ్దాలే లేకుంటే ఆయనకు తోచదు. మా పనీ అంతే.... చేతినిండా పని లేకుంటే ఏమీ తోచదండి” అనడంతో అందరం నవ్వుకున్నాము. ఆ తరువాత ఆయన అందించిన మరికొన్ని హాస్యోక్తులు :

ఒకానొక పట్టణంలో చక్కగా నిర్మించిన కళ్యాణ మండపం ప్రారంభోత్సవానికి ఆనాటి కేంద్ర హోంశాఖామాత్యులు పెండేకంటి వెంకట సుబ్బయ్యగారిని ఆహ్వానిం చారు. కళ్యాణ మండపంలోకి ప్రవేశించడంతోనే ఫ్యాను మూడు రెక్కల పై ముగ్గురు దాతల పేర్లు వ్రాసి ఉండటాన్ని చూసిన ఆయన “ఏమయ్యా! పైన ఉన్న కర్రమీద, క్రింద ఉన్న కుండమీద కూడా ఇద్దరు దాతల పేర్లు వ్రాస్తే బాగుండేది కదా!?” అని ప్రశ్నించారు వ్యంగ్యంగా. “సార్! మిగిలిన ఫ్యాన్లకు అదే ఆలోచనలో ఉన్నామండి” అని ఆ సంస్థ కార్యదర్శి అమాయకంగా అనడంతో అందరూ నవ్వుకున్నారు.

మార్పు ఎందుకండి!: 'భక్తులు దైవానికి సమర్పించిన కానుకలను ఎలా ఉపయో గించాలి?' అనే ప్రశ్నకు హిందు, క్రైస్తవ, సిక్కు పూజారులు ఇలా సమాధానమిచ్చారు. “ముందు నేలమీద క్రాస్ బొమ్మ వేసి, భక్తులు సమర్పించిన కానుకలను పైకి ఎగురవేస్తా.

క్రాస్ పైన పడ్డ కాసులన్నింటినీ భగవంతుడికి ఇచ్చి, మిగిలినవాటిని నేను ఉంచుకుంటా" అన్నాడు ఫాదర్. "భూమి పైన 'ఓం' వ్రాసి, భక్తులర్పించిన కానుకలను పైకి ఎగురవేస్తా ను. ఓంకారంమీద పడ్డ కానుకలు దైవానివిగా భావిస్తా" అన్నాడు పురోహితుడు. సిక్కు పూజారి తాను చాలా భక్తుడినన్నాడు. భక్తులు సమర్పించిన కానుకలన్నీ పూర్తిగా దైవానికి చెందాలన్నదే తన అభిమతమన్నాడు. అందుకే "కానుకలన్నింటినీ పైకి ఎగురవేస్తా. దైవానికి కావలసినవి ఆయన తీసుకుంటాడు. క్రిందపడిన వాటిని నేను ఉంచుకుంటా" అన్నాడు!

గంగన్న గోరీ మీద ఇలా వ్రాసి ఉంది : "ఇతను వీర సోమరి. ఒకరోజు అతి బద్ధకంతో గాలి కూడా పీల్చడం మానివేశాడు".

నా కాలు కొలతలెక్కడ : ప్రముఖ శాస్త్రవేత్త న్యూటన్‌కు కొత్త బూట్లు కొందామనిపించి కొలతలిచ్చి నౌకరును బూట్లషాపుకు పంపాడు. అతను ఎలాంటి బూట్లు తెస్తాడో అన్న అనుమానంతో కొంత సేపటికి తానే షాపుకు వెళ్ళి ఓ గంట తరువాత నీరసంగా ఇంటికి చేరిన న్యూటన్‌ను "బూట్లు తెచ్చుకోలేదే?" అని ప్రశ్నించింది భార్య. 'నేను పంపిన నౌకరు నాకు కనిపించి చావలా. నాకాలి కొలతలేమో అతని దగ్గరే ఉండిపోయాయిగదా!' అని ఆ శాస్త్రవేత్త అంటుంటే అవాక్కయింది ఆయన అర్ధాంగి.

నిద్రనా? అయ్యోఖర్మ! : బ్రిటీష్ ప్రధాని విన్స్టన్ చర్చిల్ ఒకనాడు పార్లమెంట్‌లో పదునైన భాషతో ప్రసంగించిన తరువాత సమాధానం చెప్పడానికి ప్రతిపక్ష నాయకుడు లేచాడు. ఆయన ప్రసంగం నిస్సారంగా కొనసాగడంతో చర్చిల్ అలా కళ్ళు మూసుకు కూర్చున్నాడు. దానిని గమనించిన ప్రతిపక్షనేత "నేను ప్రసంగిస్తుంటే ప్రధాని నిద్రపోతాడా?" అంటూ చర్చిల్ ప్రవర్తనను దుయ్యబట్టాడు. "గౌరవనీయులైన ప్రతిపక్ష నాయకుని అర్థం పర్థం లేని ప్రసంగం వింటుంటే నాకేమీ బోధపడలా. పోనీ నిద్రపోదామా అంటే ఆయన అరుపులకు కునుకు పట్టలా. ప్రసంగం విందామా అంటే ఆ అతుకుల బొంత అర్థమవలా. దాంతో అజీర్తి చేసినవాడిలా ఉన్నది నా బాధ. ఇంతకన్నా నిద్రపట్టినా బాగుండేది" అని చర్చిల్ అనడంతో సభ అరుపులతో దద్దరిల్లింది.

రాజ్య హాస్య సంఘం! : హాస్యం మంత్రజలంలాంటిది." తరతమ భేదాలు లేకుండా అన్నింటికీ ఉపయోగపడే తురుపుముక్క అది. కుల, మత, వర్గపోరాటాలతో సతమతమయ్యే నేటి సమాజంలో రాజకీయ కాలుష్యంతోపాటు ఉగ్రవాదం వెర్రితలలు వేసి సర్వత్రా భయాందోళనలు చోటుచేసుకోవడంతో ఆనందమయ, హాస్య వాతావరణానికి అవకాశమే లేకుండా పోయింది.

---

మూర్ఖుడు గొంతెత్తి పెద్దగా నవ్వితే, విజ్ఞుడు తరచుగా చిరునవ్వు చిందిస్తాడు. – ఎక్లీషియస్టస్

మరి ప్రభుత్వ ఉద్యోగులు ఎలా ఉండాలి? వాళ్ళు చిరునవ్వుల ముఖాలతో పనిచేయాలి. ఏడుస్తూ పని చేసేవారికి 3 నుండి 5 నిమిషాలు విరామం లేకుండా నవ్వాలని శిక్ష విధించాలి. ముడుచుకున్న ముఖాలతో కఠోరంగా కన్పించేవారి ముఖాలలో నవ్వులు చిందింపజేయడానికి ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించాలి.

నిజానికి అసలుసిసలైన హాస్యయాత్ర విద్యారంగం నుండే ప్రారంభం అవ్వాలి. ప్రతి విద్యాసంస్థను ఓ నవ్వులనావలా తీర్చిదిద్దినప్పుడు దేశ భవితవ్యమే పరమా నందంగా మారుతుంది. దీనిని ఎలా సాధించాలి? కళాశాలలు, పాఠశాలల్లో హాస్యాన్ని విధిగా ఒకబోధనాంశంగా మార్చాలి. రోజూ ఒకగంట నవ్వులకుకేటాయించాలి. క్రికెట్ కు, హాకీకి కొందరు కోచ్‌లు ఉన్నట్లుగానే లాఫింగ్ కోచ్ ను కూడా ఏర్పాటు చేయాలి. హాస్యం పై తరచు సెమినార్లు జరుపుతూ విద్యారంగాన్ని ఉత్సాహభరితంగా తీర్చిదిద్దాలి.

నవ్వనివారు వాతావరణ కాలుష్యానికి కారణభూతులవుతారు కనుక వారి పై హాస్యం పన్ను విధించాలి. కొన్ని వర్గాలకు రిజర్వేషన్ కల్పించినట్లుగానే, మంచి హాస్యోక్తులు విసిరేవారికి ఉద్యోగాలలో 5% రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలి. కోపంతో కన్పించే ముఖాలను ట్రాఫిక్ పోలీస్ ఆపి రోడ్డు జంక్షన్ లో కనీసం 5 నిమిషాలు నవ్వేటట్లు చేయాలి. నవ్వుల వ్యాప్తికి ఇలాంటి ప్రక్రియలు కొన్నింటినైనా పాటించగలిగితే జీవితం ఎంత సుఖమయమవుతుందో!

కుమారుడు తెచ్చిన ప్రోగ్రెస్ రిపోర్ట్ ను చూసి తండ్రి కస్సుబుస్సుమన్నాడు. “నీవు వట్టి పనికిమాలినవాడివి” అన్నాడు. “ఒకే క్లాసులో 3 సం||లు తిష్టవేశావు. సిగ్గులేదా” అని కసరడంతో కుమారుడు బిక్కమొహంతో “ఏం చేయమంటావు నాన్నా! ఇది వంశపారంపర్యంగా వచ్చిన లక్షణం అని మా టీచర్ కూడా నన్ను తిట్టారు. అటు టీచరు, ఇటు మీరు అలా తిడుతుంటే నేనేం చెయ్యాలి?” అన్నాడు అమాయకంగా ముఖం పెట్టి!

ఎబ్రాసీ వెధవ: 'డాక్టర్ గారూ.... సడన్‌గా నేను నిగ్రహం కోల్పోతానండి. అంతే! పిచ్చ కోపం వచ్చేస్తుంది. ఆ తర్వాత ఏం మాట్లాడతానో నాకే తెలియదండి' అన్నాడు రాజీవ్.

డాక్టర్ : సారీ....మరొకమారు చెప్పండి. ఏమన్నారు.....?

రాజీవ్ : రోగం గురించి చెప్పుకోవడానికి వస్తే చెవులెక్కడో పెట్టుకు చస్తావేందిరా చెవలాయ్.....?! నీ పిండం కుక్కలకి పెట్టా. నీ కళ్ళను కాకులకు వెయ్య! అంత ఫీజ్ వసూలు చేస్తావ్ కాని, చెప్పింది వినవేంట్రా ఏబ్రాసివెధవ! నీకు డాక్టర్ డిగ్రీని ఇచ్చిన

---

అలసిన ఆలోచనలు హఠాత్తుగా అర్థరహితం అవడంతో జనించిన ప్రేమయే నవ్వు. – కాంట్

త్రాష్టుడెవర్రా......వాడి శవాన్ని పెట్రోలు పోసి తగలెట్టా....." అంటూ ఛడామడా తిట్టుకుంటూ బయటకు నడిచాడు!

అయ్యో పాపం! : భమిడిపాటి రాధాకృష్ణ రచించిన 'కీర్తి శేషులు' నాటకంలోని మురారి పాత్ర ద్వారా రావుగోపాలరావు ఎంతో పేరు గడించాడు. పరిషత్తు పోటీలో ఆ నాటకానికి భమిడిపాటివారికి ఉత్తమ రచయిత అవార్డు వచ్చింది. ఈ విధంగా నటుడు, రచయిత ఒకే రచన ద్వారా కీర్తి గడించినందుకు అభినందిస్తూ భమిడిపాటివారి ఫొటో వేసి "కీర్తిశేషులు రచయిత భమిడిపాటి రాధాకృష్ణ" అని ఒక పత్రిక ప్రచురించడంతో భమిడిపాటి వారి ఇంటికి ఎన్నో సంతాప లేఖలు చేరాయి!

అయ్యబాబోయ్ రైలునే ఆపిందా! : గోపన్న ఒక రైతు. రైలు ప్రయాణం చేస్తూ సీటు దొరక్క అలా నిలబడ్డాడు. చేతిలో ఆవునెయ్యి టిఫిన్ ఉన్నది. ఆవునెయ్యి చాలా బలమైన ఆహారం అని పట్టణంలోని బంధువులు చెప్పగా, దానిని భద్రంగా తీసుకుపోతున్నాడు గోపన్న. ఎక్కడా ఖాళీ లేక పైన కన్పించే ఒక గొలుసుకు టిఫిన్‌ను జాగ్రత్తగా కట్టాడో లేదో ఇంతలో రైలు ఆగింది. "చెయిన్ లాగింది ఎవరు?" అంటూ గార్డు ఆదరాబాదరాగా పరుగెత్తుకుంటూ వచ్చి స్టాప్ సిగ్నల్ కు టిఫిన్ వేలాడదీసి ఉండటాన్ని చూశాడు. "ఆ టిఫిన్ కట్టింది నువ్వేనా?" అని ప్రక్కనే ఉన్న అతన్ని గద్దించడంతో గోపన్న బిత్తరపోతూ "ఆ...నేనే కట్టా" అన్నాడు. "చంపావుకదయ్యా! నీ మూలంగా రైలు ఆగిపోయింది. దాన్ని విప్పదియ్యి" అని అరవడంతో గోపన్న మరింతగా ఆశ్చర్యపోతూ "అయ్యబాబోయ్! మా ఆవునెయ్యికి ఇంత బలం ఉందా! దీని దుంపతెగ! రైలునే ఆ పేసిందా" అంటూ టిఫిన్‌ను విప్పదీస్తుంటే ఆయన అమాయకత్వం చూసి తోటి ప్రయాణీకులు నవ్వుకున్నారు.

మీరే వెళ్ళి కనుక్కోండి : ప్రఖ్యాత రచయిత మార్క్ ట్వేయిన్ లండన్‌లో ఒక సాహిత్య సమావేశంలో ప్రసంగిస్తుండగా, ఒకతను లేచి "ఏమండి! షేక్స్పియర్ నాటకాలుగా చెలామణీలో ఉన్న నాటకాలన్నింటినీ షేక్స్పియరే వ్రాశారా? లేక మరెవరైనా వ్రాశారా?" అని ప్రశ్నించాడు. హాస్యప్రియుడైన మార్క్ ట్వేయిన్ సూటిగా సమాధానం చెప్పకుండా "ఈ విషయంలో నాకు కూడా అనుమానం ఉందండి. అయితే, నేను స్వర్గానికి వెళ్ళి షేకస్పియర్‌నే అడిగి ఈ అనుమానాన్ని నివృత్తి చేసుకునేదాకా మీరు ఆగాలండి" అన్నాడు. "షేక్స్పియర్ స్వర్గంలో ఎందుకుంటాడు? ఉంటే గింటే ఆయన నరకంలోనే ఉండాలి" అని ఆ ప్రేక్షకుడు రెట్టించడంతో మార్క్ ట్వేయిన్ కి చిర్రెత్తి "ఈ విషయాన్ని గురించి మీరు ఇంత ఖచ్చితంగా

---

మనుషులు భిన్న రకాలు అయినప్పటికీ, వారంతా ఒకేలా నవ్వుతారు. – శామ్యూల్ జాన్సన్

చెబుతున్నారు గనుక, మీరే అక్కడకు వెళ్ళి అన్ని విషయాలు తెలుసుకోవడం మంచిదండి" అన్నాడు నింపాదిగా.

కట్టమంచి రామలింగారెడ్డి ఏలూరులో ఒక కళాశాల ప్రారంభోత్సవానికి ముఖ్య అతిథిగా వెళ్ళారు. పెద్దాయన వచ్చాడని ఘనంగా మేళతాళాలతో ఆహ్వానించారు. "మేళతాళాలు పెండ్లి కుమారునికి గాని, ప్రేతానికి గాని వాడతారు. మరి నేను రెండూ కానుగదా! నాకేల ఈ గోల" అంటూ విసుక్కున్నారు.

పిసినారి - పైసా : ఒక పిసినారిని ఓ వృద్ధ బ్రాహ్మణుడు బిచ్చం అడిగాడు. పిల్లికి బిచ్చం పెట్టని ఆ పిసినారి "నీకొక పైసా ఇస్తా. అయితే, వచ్చే సంవత్సరం వచ్చి దానిని తీసుకుపో" అన్నాడు. మరుసటి సంవత్సరం ఆ వృద్ధ బ్రాహ్మణుడు రావడంతో పిసినారి "వీడింకా బ్రతికేవున్నాడా!" అని గొణుక్కుంటూ "నాకు జ్వరం వచ్చింది అని బ్రాహ్మణుడితో చెప్పు" అంటూ భార్యను పురమాయించాడు. అది విన్న యాచకుడు "అమ్మా! జ్వరానికి నేను మందివ్వగలను" అనడంతో, ఆమె వచ్చి భర్తతో ఆ విషయాన్ని చెప్పింది. "అయితే, నేను చచ్చిపోయానని వాడితో చెప్పు" అన్నాడు భర్త. దానికి ఆ యాచకుడు "మీ ఆయన్ను శ్మశానవాటికకు తీసుకుపోవడానికి నేను కూడా సాయపడతానమ్మా" అంటూ ముందుకు రావడంతో పిసినారికి ఏంచేయాలో తోచక ఏడ్వసాగాడు. యాచకుని రూపంలో ఉన్న భగవంతుడు ఆ పిసినారికి తన నిజస్వరూపాన్ని చూపిస్తూ "ఇప్పటినుండైనా మంచిగా జీవించు. నీకేం కావాలో కోరుకో"ఇస్తాను అన్నాడు. "స్వామీ! మీకు పైసా దానమిస్తానన్నాను కదా! అది ఇచ్చినట్లుగా భావించండి. ఇంక ఆ పైసా అడగకండి" అని ఆ పిసినారి విన్నవించుకున్నాడు!

ఇది కారు కాదు సర్కారు : రోజుకు వెయ్యి రూపాయలు జీతం పుచ్చుకునే ఎం.పి.లు పార్లమెంటులో చర్చ జరగకుండా రచ్చ కల్పిస్తుంటే, అలా అవరోధాల పైనే ప్రజాధనం ఒక్క సంవత్సరం (2007)లో రూ. 20 కోట్లు ఖర్చు అయిందంటే హాస్యోక్తిగా లేదూ! దేశంలో అత్యున్నత చర్చా వేదిక అయిన పార్లమెంటు నడవడానికి నిమిషానికి రూ. 26035 ఖర్చు అవుతుంటే, అక్కడ వాద ప్రతివాదాలకు గాక గందరగోళం సృష్టించడానికి, బలప్రయోగానికి ఆసక్తిచూపే మన ఎం.పి.లు హాస్య ప్రవృత్తిని అతి పొదుపుగా వాడుతున్నారని, మన పార్లమెంటులో హాస్యం కనాకష్టంగా ఉందని మంత్రి ప్రణబ్ ముఖర్జీ వాపోవడంలో వింత ఏముంది?

---

ఎక్కడ వినోదదాయక సంఘటనలకు అవకాశం ఉండదో, అక్కడ నాగరికత ఉండదు. – మెరెడిత్

జనతా పార్టీలో కుమ్ములాటలు చూసిన ఓ విలేకరి నాటి ప్రధాని వాజ్ పాయిని "మీ ప్రభుత్వం ఇలా నడుస్తున్నదేమిట"ని అడిగారట. "అది కారు కాదు కదా, అది సర్కారు కదా! అది అలాగే నడుస్తుంది" అని చమత్కరించారట. అలాంటి హాస్యచతురత లేని కారణంగానే ప్రణకు పార్లమెంటు హాస్యరహితంగా కన్పిస్తుందేమో!

మోహన్ : ఏమిటి అద్దం ముందు కూర్చుని భోజనం చేస్తున్నావు?

కృష్ణ: అతిథి లేకుండా భోజనం చేయడం నాకు అలవాటు లేదు గదా!

లావుసిరీస్ : కృష్ణశాస్త్రిగారికి ఎందుకోగాని స్థూలకాయులంటే మహాప్రేమ. వాళ్లపై ఆయన అల్లిన కథలలో ఒకటి. ఆయన కొత్త తారురోడ్డులా బహునల్లగా ఉంటాడు. ఎవరికైనా సిరా కావలసివస్తే ఆయన ఒంటిమీద అలా కాసిని నీళ్ళుపోసి, ఇలా పెన్ను నింపుకోవచ్చు అంటారు. పెళ్ళికని వీర్రాజు పిల్లని చూడ్డానికి వెళితే (మన లావుపాటి హీరో పేరు అదేలేండి) అతనిని చూసిన ఆ పిల్లకు మతి చలించి మంచం పట్టిందట!

అన్నట్లు మా బొద్దేశ్వరరావుకు కూడా 'లావు' అంటే బహుచిరాకు. నిజానికి మా మిత్రుడి పేరు సిద్దేశ్వరరావు. అయితే లావుపాటివాళ్ళను చూసి బొద్దు, ముద్దు, ఎద్దు అంటూ కథలు చెబుతుంటాడని మేమందరం ముద్దుగా బొద్దేశ్వరరావు అంటాం లెండి. వాళ్ళమ్మాయికి పెళ్ళి చూపులు జరిగాయి. "అబ్బాయి ఎలా ఉన్నాడ్రా?" అని అడిగితే, "ఆ! అంత లావు కాదుగానీ, నిలువునా కోస్తే ఓ అరడజను తలుపుచెక్కలు అవలీలగా వచ్చి, చాలా రీపర్ మిగులుతుంది" అన్నాడు నవ్వుతూ!

పక్క ఊరులోని ఓ స్థూలకాయుణ్ణి గురించి చెబుతూ "అసలే ఎండాకాలం. నీళ్ళకు కటకటలాడుతున్న సమయం. ఓ ధర్మాత్ముడు లారీలో ఓ టాంకర్ పెట్టి నీళ్ళు పోస్తున్నాడు ఆ ఊరిలో. సుకుమార్ (ఆ స్థూలకాయుడి పేరులేండి) అమాయకంగా ముఖం పెట్టి "ఏమండీ! దాహంతో చచ్చిపోతున్నా. కాసిని మంచినీళ్ళివ్వండి." అంటూ ప్రాధేయపడ్డాడు డ్రైవర్ తో. ఆయన వాలకం చూసి జాలిపడ్డ డ్రైవర్ "తాగుబాబు" అంటూ ఏకంగా గొట్టం అందించాడు. సుకుమార్ గొట్టంతో నీళ్ళను అలా తాగుతూనే ఉన్నాడు! కొంత సమయం జరిగాక డ్రైవర్ "అయ్యా! టాంక్ ఖాళీ అయింది. ఇంతకూ నీ బొజ్జ నిండిందా?" అన్నాడు నవ్వుతూ. ఈసారి తెచ్చినప్పుడు కొంచెం సేపు ఇవ్వండి సారూ! కడుపు పూర్తిగా నిండుతుంది." అంటుంటే ఆ డ్రైవర్ ఉద్యోగం మాని పరారయ్యాడని వినికిడి" అంటూ కథ ముగించాడు మా సిద్దేశ్వరరావు.

---

హాస్యం సందర్భాన్ని సృష్టించాలి, సందర్భం హాస్యానికి దోహదం చెయ్యాలి. – శ్రీధర్ బాలన్

చీకట్లో కనబడలా తల్లి : ఏరా బుజ్జీ, ఈ హాల్లో మూడు లడ్లు పెట్టాను. ఒకటే ఉందేమిరా?

బుజ్జి : అయ్యో! మూడు పెట్టావా? చీకట్లో మూడోది కనబడలేదమ్మా!

ప్రశాంతమరణం : రాజు, ప్రేమ్ కారులో ప్రయాణం చేస్తూ మరణాన్ని గురించి చర్చించుకుంటున్నారు. "నేను మా తాతలాగా ప్రశాంతంగా చనిపోదలచాను. ఆయన హాయిగా నిద్రలోనే కన్నుమూయగా, ఆయన ఆప్తమిత్రులు మాత్రం మరణానికి ముందు గగ్గోలు పెట్టారు, గందరగోళం చేశారు". రాజు మాటలతో ఆశ్చర్యపోయిన ప్రేమ్ "అవును.....వాళ్ళు అలా ఎందుకు అరచారు?" కుతూహలంగా అడిగాడు. "నిజానికి వారంతా కలసి కారులో ప్రయాణిస్తుంటే మా తాతయ్య కారు నడుపుతూ నిద్రలో మునిగాడు".

అర్థం చెప్పండి : ఒక విద్యార్థి ఉన్నత విద్యకై అమెరికా వెళ్తూ తన గురువు వద్దకు సలహా కొరకు వెళ్ళాడు. పెద్ద వేదాంతి అయిన గురువు టాల్మండ్ "జీవితం ఒక జలయంత్రం" (Fountain) అని సెలవిచ్చారు. ఆ విద్యార్థి అమెరికాలో పై చదువులు చదివి, అక్కడ అనేక ఉన్నత స్థానాలను అలంకరించాడు. తన గురువు ఆరోగ్యం బాగాలేదని తెలుసుకొని ఆయన దర్శనార్థం హుటాహుటిన ఐరోపా వెళ్ళాడు. "గురూజీ మీరిచ్చిన సందేశం నాకెంతో సహాయం చేసింది. ఎప్పుడు సమస్య ఉత్పన్నమైనా, మీ సందేశాన్నే గుర్తుచేసుకొని చక్కని పరిష్కారం పొందేవాడిని. అయితే, నిజం చెప్పాలంటే దాని అర్థం ఏమిటో ఇప్పటికీ నాకు తెలియలేదు. ఎలాగూ మీరు సత్యలోకంలోకి ప్రవేశించబోతున్నారు కనుక దయచేసి జీవితం జలయంత్రంలాంటిది అన్నదానికి అర్థం చెప్పమని కోరుచున్నాను గురూజీ" అంటూ వేడుకున్నాడు శిష్యుడు. ఆ ప్రశ్నకు సమాధానంగా గురూజీ శిష్యుని కళ్ళలోకి చూస్తూ, పేలవంగా నవ్వుతూ "బాగుంది. జీవితం జలయంత్రంలాంటిది కాదు" అంటూ కన్నుమూశాడు!

ముగింపు : ఇదండీ నవ్వుల జల్లులలో ఆనందించడం అంటే. జీవితమనే తీగకు పూసిన పసందైన పువ్వు నవ్వు. అపురూపంగా భద్రపరచవలసిన అరుదైన పువ్వు అది. మనం నవ్వితే మన గుండె కూడా నవ్వుతుంది. ఉన్నత సమాజు స్థాపనకు చేయూతనిస్తుంది. అందుకే నవ్వుల ఆటలు ఆడుతూ, జీవన సంగీతపు మధుర రాగాలను ఆనందిస్తూ హాస్య సామ్రాజ్యాన్ని విస్తరింపజేయాలి. ఈ సామ్రాజ్యంలో విజేతలూ, పరాజితులూ ఉండరు. ఇక్కడ ఆనందమయ ముఖాలే కనిపిస్తాయి. ఆరోగ్యదాయక సమాజమే కనిపిస్తుంది. అందుకే

చిరునవ్వులు చిందించని ముఖం ఎప్పుడైనా, ఎక్కడైనా మీకు ఎదురైతే, మీ నవ్వులలో ఒకదానిని దానికి ఇవ్వండి. నవ్వు బహుపరాక్.

అందుకే....హాయిగా నవ్వుదాం, నవ్విద్దాం, ఆనందంగా జీవిద్దాం. బోలో హాస్య మహరాజ్ కీ జై అంటూ హాస్య వ్రతకల్పం చేసుకుందామా? అయితే చిరునవ్వులు చిందిస్తూ, హాస్యప్రపంచ యాత్రలో మరో అడుగు ముందుకు వేయండి.

---

బాధలలో వున్నప్పుడు నవ్వడం నేర్చుకోకపోతే, వృద్ధాప్యం వచ్చిన తర్వాత నవ్వడానికేమీ మిగలదు. – ఎడ్ హోవే

అధ్యాయం 42

# హాస్య వ్రతకల్పం

కథా సంగ్రహము :

హాస్య వ్రత దీక్షావిధానమును తొల్లి ప్రమధ గణాధిపతి సూతుడు శౌనకాది మునులతో పాటు ఉల్లాసానందగిరి మహర్షుల వారికి తెలిపిరి. గర్తపురివాసి ప్రగాఢానందులవారికి లభించిన బ్రహ్మానందస్వామి వారి ప్రాచీన రచనల ద్వారా ఆనందసాగరాట్పురివాసులు స్వామి కటారియా, రాధాకృష్ణానందుల వారి ద్వారా వ్యాప్తియగుచున్నది.

ఈ వ్రతదీక్షను శాశ్వత దీక్షగాగాని లేదా మండల, మాస, వార దీక్షగాగాని పాటించవచ్చు లేదా, ఆనందం కోసం అలమటించేవారికి కనీసం రోజుకు ఒక్కరికైనా హాస్య దానం చేసి తరించవచ్చు. సదా దీనినాచరించువారు ఆనందమయ జీవితాలను గడుపుతూ, తోటివారికి ఆనందాన్ని ఇతోధికంగా పంచుతూ, వంశపారంపర్యముగా సుఖశాంతులతో వర్ధిల్లుచుందురు. ఈ దీక్షా విధివిధానంబులెవ్వియన... తెలిసియూ ఆచరించనివారు పలు రకములుగా అపహాస్యముపాలయి, నగుబాట్లనొందెదరు. దీనిని ఒక్కరుగా లేదా బృందములుగా కూడా నిర్వహించవచ్చు. హాస్య దేవతా ప్రీతికై హాస్య బృందాలు, కార్టూన్ క్లబ్ లు, సరదా సదస్సులు, నవ్వుల క్లబ్‌లు నిర్వహించుటవలన... అధికస్య అధికం ఫలం. హాస్యదేవికి ఇష్టమైనవి నవ్వుల పువ్వులు, చిరునవ్వుల జల్లులు, ప్రతిరోజూ పది హాస్యోక్తులకు తగ్గకుండా చదవాలి. తెలిసినవి ఇతరులకు చెప్పాలి.

నిషిద్ధములు:ఈ ఆనంద దీక్షాసమయమున పొగాకు పదార్థములు, మద్యముల పట్ల ఆసక్తి సహజముగానే తగ్గును. అసలు వాడకపోవుట ఇంకా మంచిది. తమను ఇతరులతో పోల్చుకొని వారికి అవి ఉన్నవని, తమకు ఫలానివి లేవన్న ఆలోచనలు చేయరాదు. ఉన్నంతలో తమ ఆనందాస్తిని ఉదారంగా, ఉచితంగా, ఉత్సాహంగా పంచాలి. విద్యాధనంవలె హాస్యాస్తికూడా పంచే కొలది పెరుగుతుందని గ్రహించాలి. పంచేకొద్దీ సంపద తరగగా, పంచేకొద్దీ ఆనందం ఇబ్బడిముబ్బడి అవుతుందని హాస్యదేవి వరమొసంగిరి. ఈ విజయ సాధనకు దేవీ స్తోత్రము యధాశక్తి పఠించాలి.

---

నవ్వును ఒక పరికరంగానే గాని, అస్త్రంగా మాత్రం ఉపయోగించవద్దు. – జోయల్ గుడ్ మన్

వ్రతకల్పము:

ఇందుకు అవసరమైన పూజా ద్రవ్యములు :

హాస్యదేవీ విగ్రహం / పటం

నవ్వులనూనె, ఆనందపు పండ్లు

దీపారాధన : ఓం హాస్యదేవీ నమః (ఈ క్రింది శ్లోకాన్ని చదువుతూ మనస్సులో హాస్య జ్యోతిని వెలిగించి, ఆనందపు కుంది వద్ద నవ్వుల పువ్వులు సమర్పించాలి.)

శ్లో || ఓం హాస్యదేవి రూపస్త్యం, కర్మసాక్షి హ్యామిఘ్నకృత్

యావత్పూజాం కరిష్యామి తావత్వం సిద్ధిదోభవ ||

పరిశుద్ధి : హాస్యపాత్రలోని నీటిని నవ్వుల ఉద్ధరిణితో తీసుకొని కుడిచేతి బొటనవేలు, మధ్య ఉంగరపు వేళ్ళతో ఈ క్రింది మంత్రం జపిస్తూ తల పై చల్లుకోవాలి.

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాంగతోపి వా

మస్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరాశ్శుచి:

ఓం నిత్యానందాయ స్వాహా

ఓం సత్యానందాయ స్వాహా

ఓం మహానందాయ స్వాహా

ఓం హాస్యదేవీ నమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి (నమస్కరించవలెను)

ఆవాహయామి ఆవాహనం సమర్పయామి (నవ్వుల పువ్వులు చల్లవలెను)

ఈ క్రింది నామాలు చదువుతూ చిరునవ్వుల పూలతో పూజ చేయవలెను.

హాస్యదేవి శతనామావళి:

ఓం హాస్యదేవీ నమః

ఓం చిరుహాసాయ నమః

ఓం దరహాసాయ నమః

ఓం అట్టహాసాయ నమః

---

అన్నింటిని అభివృద్ధి పరచేది నవ్వు, దేని నుండీ దానిని బలాత్కారంగా తీసుకోనవసరం లేదు. – జేమ్స్ థర్బర్

ఓం ఉల్లాసాయ నమః
ఓం మహోల్లాసాయ నమః
ఓం అమూల్యానందాయ నమః
ఓం శుద్ధానందాయ నమః
ఓం రమ్యానందాయ నమః
ఓం శ్రద్ధానందాయ నమః
ఓం గాఢానందాయ నమః
ఓం ప్రగాఢానందాయ నమః
ఓం నిగూఢానందాయ నమః
ఓం నిర్మలానందాయ నమః
ఓం నిర్గుణానందాయ నమః
ఓం సత్యానందాయ నమః
ఓం సగుణానందాయ నమః
ఓం అమితానందాయ నమః
ఓం అత్యంతానందాయ నమః
ఓం వ్యక్తానందాయ నమః
ఓం అవ్యక్తానందాయ నమః
ఓం అనుదినానందాయ నమః
ఓం సర్వకాలానందాయ నమః
ఓం చిరానందాయ నమః
ఓం విజయానందాయ నమః
ఓం జోకానందాయ నమః
ఓం నవ్వానందాయ నమః
ఓం వ్యంగ్యానందాయ నమః
ఓం వినూత్నానందాయ నమః
ఓం విలక్షణానందాయ నమః
ఓం చమత్కారానందాయ నమః
ఓం పరిహాస శీలాయ నమః

ఓం చిదానందాయ నమః
ఓం సదానందాయ నమః
ఓం బాహ్యానందాయ నమః
ఓం అంతరానందాయ నమః
ఓం శ్రవణానందాయ నమః
ఓం దృశ్యానందాయ నమః
ఓం శబ్దానందాయ నమః
ఓం స్పర్శానందాయ నమః
ఓం రూపానందాయ నమః
ఓం రసానందాయ నమః
ఓం మహానందాయ నమః
ఓం మహదానందాయ నమః
ఓం బ్రహ్మానందాయ నమః
ఓం వేళాకోళాయ నమః
ఓం హాస్యాస్పదాయ నమః
ఓం దివ్యౌషధరాజాయ నమః
ఓం హసితాయ నమః
ఓం ఆనందసాగరాయ నమః
ఓం దుఃఖ వినాశాయ నమః
ఓం ప్రేమసాగరాయ నమః
ఓం మందస్మితాయ నమః
ఓం హర్షమందస్మితాయ నమః
ఓం అంతస్మితాయ నమః
ఓం జనిత మందస్మితాయ నమః
ఓం ఉదంత మందస్మితాయ నమః
ఓం అనాదర మందస్మితాయ నమః
ఓం సాదర దరహాసాయ నమః
ఓం రోష కఠిన హాసాయ నమః

ఓం ఉద్ఘట హాసాయ నమః
ఓం అపహాసాయ నమః
ఓం దాగుడుమూచ్చి నవ్వాయ నమః
ఓం ప్రౌఢ స్మితాయ నమః
ఓం దగ్గు నవ్వాయ నమనః
ఓం పిన్న నవ్వాయ నమః
ఓం గూడ్సుబండి నవ్వాయ నమః
ఓం చిరునవ్వాయ నమః
ఓం విషపు నవ్వాయ నమః
ఓం అలతి నవ్వాయ నమః
ఓం మొలక నవ్వాయ నమః
ఓం తిన్నని న ద్వాయ నమః
ఓం మొద్దు నవ్వాయ నమః
ఓం లేత నవ్వాయ నమః
ఓం కిచకిచ నవ్వాయ నమః
ఓం పలుచ నవ్వాయ నమః
ఓం కిలకిల నవ్వాయ నమః
ఓం గేలిగొను నవ్వాయ నమః
ఓం వికిలింపు నవ్వాయ నమః
ఓం ఒత్తిలి నవ్వాయ నమః
ఓం సకిలింపు నవ్వాయ నమః
ఓం కలకల నవ్వాయ నమః
ఓం పండు నవ్వాయ నమః
ఓం ఎలక నవ్వాయ నమః
ఓం ముదురు నవ్వాయ నమః
ఓం ఉబ్బు మిగిలిన నవ్వాయ నమః
ఓం మాయ నవ్వాయ నమః
ఓం కన్నుల నవ్వాయ నమః
ఓం వినోద సాగరాయ నమః
ఓం మకిలి నవ్వాయ నమః
ఓం ఎర్ర నవ్వాయ నమః
ఓం మల్లె నవ్వాయ నమః
ఓం కటిక నవ్వాయ నమః
ఓం ముద్దు నవ్వాయ నమః
ఓం అల్ల నవ్వాయ నమః
ఓం వంకర నవ్వాయ నమః
ఓం సకిలింపు నవ్వాయ నమః
ఓం వయ్యారపు నవ్వాయ నమః
ఓం ఇకిలింపు నవ్వాయ నమః
ఓం వెకిలి నవ్వాయ నమః
ఓం ముసిముసి నవ్వాయ నమః
ఓం విరుపు నవ్వాయ నమః
ఓం మూగ నవ్వాయ నమః
ఓం ప్లాస్టిక్ నవ్వాయ నమః
ఓం గుడ్డి నవ్వాయ నమః
ఓం స్మితాయ నమః
ఓం వెకవెక నవ్వాయ నమః
ఓం హసితాయ నమః
ఓం తలకాయ నవ్వాయ నమః
ఓం విహసితాయ నమః
ఓం లయధాటి నవ్వాయ నమః
ఓం అపహసితాయ నమః
ఓం సోడా నవ్వాయ నమః
ఓం ఉపహసితాయ నమః
ఓం కోతి నవ్వాయ నమః
ఓం అతిహసితాయ నమః

భక్తులందరూ ఈ స్తోత్రమును నిరంతర పారాయణ గావించుచు తరింతురుగాక!

ఓం తత్స త్!

గమనిక : హాస్య దేవతా సహస్ర నామావళి టీకా తాత్పర్యములతో సి.డి.లుగా లభ్యము. హాస్య దేవీ తత్వ ప్రచారముకై ఇది సభ్యులకు వెయ్యి నవ్వులకు, అసభ్యులకు ఐదు వందల నవ్వులకు ఒకటి మాత్రమే ఇవ్వబడును. పోస్టు ద్వారా 15 నవ్వులు అదనం. నవ్వుల కరెన్సీ మినహా మరి ఏ కరెన్సీ స్వీకరించబడదు. సర్వదా ప్రత్యక్షమయ్యే నకిలీ ప్రకటనలను చూసి మోసపోవద్దు. మరిన్ని వివరాలకు 0123456789, నవ్వే పేట్, ఈ (హిహి) మెయిల్ : పొట్ట చెక్కలు.కామ్:

హాస్య విశ్వవిద్యాలయము :

ఆనందనగర్, దుఃఖవినాశాయ (పోస్ట్),

హాస్య విద్య కోర్సులకు ప్రవేశము:

లభించు కోర్సులు : హాస్య మహరాజ్, హాస్య విశారద, హాస్య శిరోమణి, హస్య ప్రచారక్, హాస్య ప్రవీణ, హాస్య పోషక్, హాస్య బ్రహ్మ, హాస్యాచార్య.

డిగ్రీ, పి.జి. స్థాయిలలో సర్టిఫికెట్లు, డిప్లొమా, డిగ్రీ, పి హెచ్.డి. వరకు

అర్హత : ఏ విద్యార్హతలు, వయోపరిమితులు లేవు. హాస్యముపట్ల ఆసక్తి, అభిమానం చాలు.

సిలబసు : వ్రాత పరీక్షలు, ప్రాక్టికల్స్, వైవా /ఇంటర్వ్యూలు ఆయా స్థాయిలలో నిర్ణయించబడును.

ఫీజులు : హాస్యపరంగా వెనుకబడినవారికి ప్రవేశము ఉచితము. ఇతరులు (నవ్వుల) నవరత్నాలు చెల్లించాలి. అనవసరపు వివరాలకు వెబ్ సైట్ చూడండి; WWW.నిండు నవ్వు.కామ్

ముఖ్య గమనిక : ఇటీవల మాకన్నా గుర్తింపులేని కొన్ని సంస్థలు 'హాస్య ద్రోహి', 'హాస్య చౌర్య', 'హాస్య ద్వేషి', 'హాస్య వ్యతిరేకి' 'హాస్య వినాశ వంటి డిగ్రీలకు పసలేని కోచింగు ఇస్తున్నట్లు మా దృష్టికి వచ్చింది. మా సంస్థ ఉండగా మరొకదానిలో చేరి మోసపోవడం ఎందుకు?

టేకిట్ ఈజీ! సి.నరసింహారావు 2.3-05-2004
స్మైల్ ప్లీజ్ 01-05-2004
నవ్వించే వాయువు మర్మమేమిటి? 07-09-2003
కుంగ్‌ఫూ కింగ్....కీచాన్...!!
ఫూలైతే ఫీలవకండి 28-03-2004
కుక్కలు నవ్వుతాయా...? 01-08-2004
మిమ్మల్ని మేం నవ్విస్తాం కదా! 16-11-2003
ఆ నవ్వుకు అయిదు శతాబ్దాలు! 29-05-2005
పుచ్చుకోండి 'కామిక్ టానిక్! 08-05-2005
పిల్లల్లో హాస్యప్రియత్వం వాహిని 11-02-2001
ప్రముఖుల హాస్యంలో చురకలు టి.రాజేష్ 00-02-2003
నవ్వులే నవ్వులు చికిత 04-05-2003
ఆంధ్రజ్యోతి జీవనకాలమ్ (అల్లరి కుర్రాళ్ళు-ఆకతాయి గవర్నర్లు) గొల్లపూడి మారుతీరావు
రావూరి భరద్వాజ హాస్య ప్రయోగం 'కరిమింగిన వెలగపండు' తుమ్మల రామకృష్ణ 11-01-1985 ఇంకా అధస్సూచికలు క్రింద ఇచ్చిన గ్రంథములు, పత్రికలు.

## సాంపులు సరదా

"ఫిలాటలీ పైన సాధికారిక గ్రంథం"

"ఇదొక బృహద్గ్రంథం. 230 పేజీల ఉద్దంథం... ఇందులో స్టాంపుల సేకరణకు సంబంధించిన ఎన్నో విషయాలు... కుతూహలకరమైన స్టాంపులు ఎన్నెన్నో కథలు చెబుతాయి! -పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు

"విజ్ఞానదాయకమైన రచన... ఈ రచన ఒక విజ్ఞాన ఖని. ఇలాంటి రచనలు అరుదు". -జి.వి. సుధాకర్, ఐ.పి.ఎస్., పోస్టు మాస్టర్ జనరల్, విజయవాడ రీజియన్.

మూల్యం : రూ. 100/ మా పాఠకులకు ప్రత్యేకం : రూ. 80/

## ప్రసంగం ఒక కళ

"ఈ ఆధునిక ప్రపంచంలో ఉ పన్యాసం కేవలం ఒక కళే కాదు - అదొక మహాకళ. ఆ నైపుణ్యాన్ని నిండుగా సాధనతో సాధించాలనే ప్రతి ఒక్కరికి ఈ పుస్తకం ఓ గురువులా ఉపయోగపడుతుంది."

సంక్షిప్తీకరణ - సంపూర్ణ విషయ సేకరణ ఈ చిన్న పుస్తకం ప్రత్యేక లక్షణం.

-వేలూరు రవీంద్రనాథ్ గుప్త,

అధ్యక్షులు, ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ వాసవీ క్లబ్స్ హైదరాబాద్.

ప్రముఖ చిత్రకారుడు జింకా రామారావు గారి ఆకర్షణీయమైన కార్టూన్లు ఈ పుస్తకానికి ఒక హైలైట్. మూల్యం : రూ. 15/

డి.డి. లేదా ఎం.ఓ. పంపి కొరియర్ ద్వారా 'స్టాంపుల సరదా', 'ప్రసంగం ఒక కళ' అందుకోండి.

## సమయ పాలన

రచయిత: మాచర్ల రాధాకృష్ణమూర్తి

మానవ జీవితంలో సమయపాలనకు మించినది మరేదీ లేదు. “సమయ పాలన” పై ఎంతో ఆసక్తికరమైన గ్రంథం ఇది. ఇదొక పాఠ్యగ్రంథంలాంటిది. -పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు

సమయపాలన' అంటే విలువైన కాలాన్ని సమర్థవంతంగ నిర్వ హించడం, దానినొక పెట్టుబడిగా మార్చగలగడం అని నిర్వచించాడు రచయిత. సాంప్రదాయక మైన ఉదాహరణలతో పాటు పాఠకులకు ఆసక్తి కలిగించే గొప్ప రచన.-ఆచార్య జి.వి. ప్రభాకరరావు, వైస్ ఛాన్స్ , రాయలసీమ విశ్వవిద్యాలయం.

మూల్యం : రూ. 100/ - మా పాఠకులకు ప్రత్యేకం : రూ. 80/

డి.డి. లేదా ఎం.ఓ. పంపి కొరియర్ ద్వారా 'సమయ పాలన' అందుకోండి.

## గమ్యాన్ని నిర్దేశించుకో
## మాచర్ల రాధాకృష్ణమూర్తి

ఒక విద్యావేత్త, ఒక మానసిక శాస్త్రవేత్త ఒక సుదీర్ఘ జీవితానుభవజ్ఞుడు వెలిగించిన "మార్గదీపిక".

-పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు

ఈ పుస్తక పాఠకులకు వయస్సుతో నిమిత్తం లేకుండా ఎన్నిసార్లు చదివినా మరీమరీ చదవాలన్న కోరిక తీరదు. అదీ ఈ పుస్తకం ప్రత్యేకత.

-బి. శేషశయనారెడ్డి, హైకోర్టు జడ్జి.

ప్రతి ఒక్కరిని వెన్నుతట్టి ప్రోత్సహించే చక్కని రచన ఇది. -ఆచార్య జి.వి. ప్రభాకరరావు, వైస్ ఛాన్సలర్,రాయలసీమ విశ్వవిద్యాలయం. మూల్యం : రూ. 100/ - మా పాఠకులకు ప్రత్యేకం : రూ. 80/

డి.డి. లేదా ఎం.ఓ. పంపి కొరియర్ ద్వారా 'సమయ పాలన' అందుకోండి.

## సూక్తి ప్రపంచం

మహనీయుల మహితోక్తులు :

"తెలుగులో ఇలాంటి బృహత్తర గ్రంథం రావడం ఆహ్వానించదగ్గ అంశం". -వార్త

"ఇది ప్రపంచ మేధావుల ప్రవచనాల ఖజానా, తెలుగు ప్రజలకు నిలువెత్తు నజరానా అన్నది ఈ సూక్తి ప్రపంచంకు చక్కని చిరునామా". – పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు

630 పేజీలలో పదివేలకు పైగా సూక్తులు. ప్రతి ఇంటిలోను ఉండవలసిన గ్రంథం.

మూల్యం - రూ. 200/ - పాఠకులకు ప్రత్యేకం! రూ. 160/ -

ఎం.ఓ. లేదా డి.డి. పంపి కొరియర్ ద్వారా 'సూక్తి ప్రపంచం' అందుకోండి.

HASYA PRAPANCHAM M.R.K.MURTY

'హాస్య ప్రపంచం' గురించి పత్రికలు ఏమన్నాయంటే.....

పొయ్యి ముట్టించడానికి ఉపయోగపడే ఎండు కట్టెలవంటివారు చతురులు గ్రాస్ విల్ బర్కర్.

ఏ పదమూ కాని నవ్వు ఏ లక్ష్యమూ లేని నవ్వు నరునికి శత్రువు వంటిది. – గ్రిగరీ ఆఫ్ నిస్సా

కడుపారా నవ్వడమే హాస్యం కాదు మనస్సును కూడా నవ్వించగలిగేదే హాస్యం. – జిగ్ సురయ్య

చక్కలిగింతలతో చిక్కిన ఊపిరితిత్తులు కల వారిని నవ్వించడానికి ప్రయత్నించు – షేక్ స్పియర్

కొన్ని సమయాలలో చిరునవ్వు ఎడారిలో వాన చినుకులా పనిచేస్త. – బార్బడోస్ అడ్వకేట్

నవ్వు  సహచరులను ప్రేమిస్తుంది. సహచరులు నవ్వును ప్రేమిస్తారు. – జోయల్ గుడ్ మన్

చిరునవ్వు లేకుండా ఎవరైనా నీకెదురు వస్తే నీ నవ్వులలో ఒక దానిని వారికివ్వు. – వాయిస్ ఆఫ్ అమెరికా

నవ్వును అణచివేయటం మంచిదికాదు. అది క్రిందకి పోయి నీ పెదాలపై వ్యాపిస్తుంది. – ఫ్రెడ్ ఎలెన్

నీ ముఖంపై వచ్చిన ముడతలే నీ చిరునవ్వు ఎక్కడ  ఉన్నదో తెలియజేస్తాయి. – మార్క్ ట్వైన్

ప్రతి ఉదయాన్ని చిరునవ్వుతో ప్రారంభించి, రోజంతా చిద్విలాసంగా గడుపు. – డబ్ల్యు. సి. ఫీల్డ్స్

మనస్సుకు చక్కలిగిలి పెట్టేది హాస్యం.  దానిని రుద్దటానికే నవ్వు సృష్టించబడింది. – హూగ్ పుట్

నవ్వకుమీ సభలోపల, తల్లిదండ్రి నాధుల తోడన్, పర సతితో, విప్రవరులతో.  - సుమతీ శతకం.

హాస్యాన్ని సృష్టించగల వెఱ్ఱివానిలా ఉండు కాని, వెఱ్ఱి హాస్యాన్ని మాత్రం సృష్టించకు. – షేక్ స్పియర్

అతని అందమైన  హాస్యం గొప్ప గాయాన్ని చేయడమే కాక, కత్తి కూడా కనపడకుండా చేసింది. –షెల్లి.

యదార్థం అనే శరీరంపైన హాస్యం అనే ముఖాన్ని ఉంచడాన్ని వ్యంగ్య చిత్రం అంటారు. – జోసఫ్ కన్రాడ్

చక్కగా చెప్పిన ఏ విషయమైనా అన్ని భాషలలోను హాస్యాన్ని తొణికిస్తుంది. – జాన్ డ్రైడెన్

హాస్యాన్ని నిర్వచించటానికి ప్రయత్నించడం హాస్య నిర్వచనాలలో ఒకటి – సాల్ స్టెయిన్ బర్గ్

నేను హాస్యాన్ని సృష్టించను. ప్రభుత్వ పనితీరును గమనిస్తూ వాస్తవాలను నివేదిస్తాను. – విల్ రోగర్స్

ప్రేమ ప్రపంచాన్ని గిరగిరా తిప్పవచ్చు. కళ్ళు తిరగకుండా చేసేది మాత్రం హాస్యం. – డోనాల్డ్ జోకెర్డ్

హాస్యం ఎలా ఉండాలో ప్రజలకు నువ్వు నేర్పాల్సిన పనిలేదు. వారికి అనుమతిస్తేచాలు. – హెన్రీ మైండెస్

ఎవరు ఇహలోక వినోదాన్ని కోరుకుంటారో, వారు పరలోక భాగ్యాలకు అనర్హులు. – సూరబినీ

హాస్య సంఘటన ఎదురైనప్పుడు, దాని అంతర్గతంగా ఉన్న సత్యాన్వేషణ గావించు. – బెర్నార్డ్ షా

ఎలాంటి సంబంధం లేని కొన్ని భావాల మధ్య హఠాత్తుగా జరిగే పరిణయమే హాస్యం – ట్వైన్

నిర్దిష్ట దృక్కోణంలో అనిర్దిష్ట విషయాన్ని గురించి ఆలోచించేదే హాస్యం. – క్రిస్టియన్ మొర్గాంట్రన్స్

హాస్యం ఒక జీవన విధానం, ప్రవర్తనా సరళి. విరగకుండా వంగే శక్తి దానికి ఉన్నది. – భౌమాన్

మానవుల్ని అన్యమనస్కులుగా ఉండకుండా చూడగలిగేది హాస్యం.- జోయల్ గుడ్ మన్.

జీవన వైరుధ్యాలను గురించి ప్రశాంతంగా ఆలోచించి, కళాత్మకంగా వ్యక్తపరచేదే హాస్యం. – లీకాక్

బాధ నుండి నవ్వును జనింపజేసేది హాస్యం. నవ్వు ద్వారా బాధను తెచ్చేది అపహాస్యం. – గుడ్ మన్

హాస్యప్రవృత్తి గలవాడు తనలోని అసంగత్వాన్ని తెలుసుకొని పాపాలకు దూరంగా ఉంటాడు. – శామ్యూల్

నవ్వించేదేదైనా హాస్యమేగాని, ఉత్తమమైన హాస్యంలో ఒక బొట్టు కన్నీరు కూడా రాలుతుంది. – షా

హాస్యమంటే అసంబద్ధతల మధ్య పోటీ, వాటి సంయోగం భిన్నధ్రువాలు ఒక చోట కలవడం. – లీ

సర్వప్రాణులతో రసార్ద్రతతో, మృదువుగా ఉత్తేజపరచే మైత్రీభావనతో మెలగడమే హాస్యం. – కార్లయిల్

సృష్టిలో అపారమైన వ్యధలకు లోనవుతున్న మానవుడు మార్గాంతరంగా హాస్యాన్ని సృష్టించాడు. – నైట్కీ

హాస్యకారుని ఖ్యాతి ఆలకించేవాని చెవులలో ఉంటుంది కాని, చెప్పేవాని నోట్లో ఉండదు. – షేక్ స్పియర్

ఏదైనా ఒకటి విరుగుతుందని భావించినప్పుడు అది వంగిపోతే నిజమైన హాస్యం జనిస్తుంది. – ఫీల్డ్స్

భౌతిక అవసరాలను, జీవితంపై మమకారాన్ని పెంచే హాస్యం నిష్ప్రయోజనం. – జర్మీ పాలియర్

కామెడీ మన శత్రువు. అది మనల్ని గందరగోళం చేస్తుంది, కలుషితం చేస్తుంది. – బార్నెస్

విశ్వాసానికి ముందు, అస్తిత్వ సంబంధమైన ఆధ్యాత్మికత యొక్క చివరి అంకం హాస్యం. – గార్డ్.

మనోహరమైన, మానసిక సంబంధమైన మార్పుల ఫలితంగా హాస్యం జనిస్తుంది. – జాన్ మొరియల్

హాస్యం విషయంలో ఒకరికి హృద్యంగా ఉన్నది మరొకరికి హృదయవిదారకంగా ఉంటుంది. – మెల్విన్

మానవుని భౌతిక నిర్మాణంపైన, మనోవిజ్ఞానంపైన హాస్యం ప్రముఖ పాత్ర వహిస్తుంది. – డెర్క్

మానవ బలహీనతలను, సామాజిక లోపాలను సరిదిద్దడంలో హాస్యం తోడ్పడుతుంది. – జాన్సన్

హాస్యం జీవితానికి నూతన పరిణామాన్ని శోభను తెస్తుంది. అది మన దృక్కోణాన్ని మారుస్తుంది. ఆలోచనా పరిధిని పెంచుతుంది. – మరియన్ లెంజన్

ఒక వ్యవస్థ పనితీరులో హాస్యం, నవ్వు అద్భుత ఫలితాలను తెస్తాయి. నవ్వు మూలంగా ఉద్యోగులు ఏమనుకుంటున్నారో యజమానులకు సులభంగా తెలుస్తుంది. – కెన్ బ్లాంచెంద్

ఒక విషయాన్ని సాధారణ పద్ధతి ద్వారా గాక తన గ్రహణశక్తిచే, వినూత్న కోణం నుండి పరికించటానికి అవకాశం కల్పించే ప్రక్రియ హాస్యం. – ఎడ్వర్ట్ డి. మోనో.

మనలోని గొప్పతనాన్ని లేదా ఇతరుల బలహీనతను అకస్మాత్తుగా తెలుసుకోవడంతో హఠాత్తుగా ఏర్పడిన ఖ్యాతి యొక్క ప్రతిబింబమే హాస్యం. – హాబ్స్

హాస్యం కొరకు ప్రజలు ఏ పనీనన చేయకూడదు. మనమిక్కడ ఆనందం కొరకు లేము. పార్లమెంటు నిర్మించిన చట్టాలలో ఎక్కడా హాస్యానికి చోటు లేదు. – అలన్ పేట్రిక్ హెర్బర్ట్

ప్రజలు నవ్వటానికి నేను సహాయపడతాను, తమ సంస్థలను నిక్షిప్తమైన హాస్యభావంతో చూసేవారే నిజమైన విప్లవకారులు. – ఇవాన్ ఇల్లిక్

మంచి హాస్యం తాత్విక చింతన స్థితి వంటిది. ప్రకృతి మనల్ని గురించి పట్టించుకోనట్లే. మనం కూడా దాన్ని గురించి అంతగా పట్టించుకోమని దానికి చెబుతుంది. యం.డేల్. భౌగ్ మాన్.

హాస్యానికి ప్రమాణాలు లేవు. ఏది మంచో, ఏది చెడో ఎవరూ చెప్పలేనప్పటికీ, ప్రతి ఒక్కరూ అది తెలిసినట్లుగా భావిస్తారు. – జాన్ కెన్ గాల్ బ్రెత్

మనలోని గొప్పతనాన్ని లేదా ఇతరుల బలహీనతను అకస్మాత్తుగా తెలుసుకోవడంతో హఠాత్తుగా ఏర్పడిన ఖ్యాతి యొక్క ప్రతిబింబమే హాస్యం. – హాబ్స్

దాని రహస్యమంతా ఇదే. దానిని చూచి నువ్వు నవ్వలేనప్పుడు, దాని చుట్టూ పరిభ్రమించడంలో అర్థం లేదు. – జోమోంటానా

నిజమైన హాస్యం కలం నుండి గాక, హృదయం నుండి బహిర్గతమవుతుంది. అది ప్రేమకు నిలయమే కాని,ద్వేషానికి కాదు.- థామస్ కార్లైల్

హాస్యం ఒత్తిడిని తగ్గించి, పరిస్థితులను ఆనందంగా మలుస్తుంది. సవాలును ఒక హెచ్చరికలాగా తీసుకోగల లక్షణాన్ని పెంపొందిస్తుంది. – మార్టిన్

నిజానికి మానవ ప్రగతిలో భౌతికశాస్త్రం, ఆరోగ్యశాస్త్రం, మరే శాస్త్రం కన్నా హాస్య శాస్త్రం సాధించిన ప్రగతి మిన్న. – జార్జ్ మైక్స్.

అల్పబుద్ధికి, అనాగరికతకు సంకేతం నవ్వు, సృష్టి ఆది నుండి మంచి హాస్యం నవ్వుకు కారణం కాలేదు. – ఎర్ల్ ఆఫ్ చస్టర్ ఫీల్డ్

శాస్త్రానికి అనుంగు మిత్రుడు, భావావేశాలన్నింటిలో అత్యంత దార్శినికమైనది హాస్యం. – ఈస్ట్ మన్

గతించిన ప్రపంచం యొక్క వాస్తవికతలకు, నూతన ప్రపంచం అభిలాషలకు మధ్య ఉద్భవించిన ఉద్రిక్తతల ఫలితమే హాస్యం. – మర్క్ ట్వైన్

హాస్యాన్ని గురించి వ్యాఖ్యానించడం అంటే సాలెగూడును రేఖాగణిత సూత్రాలతో వివరించబూనినంత నిష్ప్రయోజనం అవుతుంది. – ఇ.బి.వైట్

హాస్యం మంచితనంతో మిత్రత్వం కలపదు. అది ప్రకృతితో, పరిపూర్ణత్వంతో చేతులు కలుపుతుంది. – హార్వేమైండెస్

ఉల్లాసం దేవుని కానుక కాగా, మందకొడితనం దెయ్యం శాపం. మనం నవ్వినప్పుడు అంతా బాగుందని దైవంతో ఏకీభవిస్తున్నామన్న మాట. – అనామిక

ప్రజల యొక్క నవ్వు వారి అభిమానం, అపరాధం, అవమానాల ప్రతిరూపాలుగా ప్రకాశిస్తుంది. హాస్యం ఒక ఐసోటోపు లాంటిది. – జీన్ షలిత్

కాలానికి ప్రతిబింబం హాస్యం, వర్తమాన సమాజం, రాజకీయాలు, ఆచారాలలో అది ఉద్భవించడమే కాక, వాటిపైన వ్యాఖ్యానంలా కూడా ఉపయోగపడుతుంది. – జీన్ షలిత్

ఆయనకు హాస్యభావనలేదు. ఆయన ఏ సమస్యను ఎదుర్కొనలేదు అన్న అవమానాలను ఏ మానవమాత్రుడూ భరించలేడు. – సింక్లెయిర్ లెవిస్

వ్యంగ్యంతో, పరిహాసంతో అందరినీ ఆనంద డోలికలలో మంచెత్తేది సుఖాంత రూపకం, అదొక హాస్య కళారూపం . – సోరెల్

ధన సంపాదనకు మార్గం హాస్యం. దురదృష్టమేమంటే ఈనాడు ప్రతి ఒక్కరూ దానినొక తాత్విక విధానంగా మలుస్తున్నారు. – జార్జి మైక్

మన దర్జాకు ఒక ధ్రువీకరణ పత్రం హాస్యం. మనిషిని ఆవరించే ఇబ్బందులన్నింటినైన అధిక్య ప్రకటన అది. –రొమేన్ గారీ

లోకజ్ఞానం, ఓపిక, హాస్య శీలం ఉంటేన జీవించడానికీ ఈ భూగోళం ఎంతో అద్భుతమైన చోటవుతుంది. – సోమర్ సెట్ మామ్

దుర్మార్గులను గురించి, పేదరికాన్ని గురించి, తమకు ప్రీతిపాత్రులైన వారి గురించి చతురోక్తులు విసరకూడదు. – సిసిరో

మానవ జీవితాన్ని ప్రభావితం చేసేది హాస్యం.... అయినా దాని స్వభావం అంతు చిక్కదు. – లాఫోలెట్ & షాంక్స్

హాస్యం గురించి అందరకు ఆమోదయోగ్యమైన సిద్ధాంతం ఇప్పటికీ లేదంటే హాస్యోక్తి కాబోదు. – మొరియల్

రెండు ప్రపంచాలు ఢీకొన్నప్పుడు హాస్యం జనిస్తుంది. హఠాత్ పరిణామాలు జరిగి నిన్ను కుదిపివేసినప్పుడు నీలో నవ్వు జనిస్తుంది. – మార్గీ బ్రౌన్

హాస్యం అందరినీ సమ్మోహితులను చేస్తుంది. అది ప్రతి ఒక్కరి జీవితంలో చోటు చేసుకుంటుంది. అయినా సిద్ధాంతపరంగా అది ప్రగతి సాధించలేదు. – రుకి

హాస్యం కళ్ళెంలేని గుఱ్ఱంలాంటిది. కొన్ని సమయాలలో స్నేహితుణ్ణి, మరికొన్ని సమయాలలో దాని యజమానిని తన్న గల ప్రమాదకారి అది. – జార్జ్ హెర్బర్ట్

హాస్యం కొరకు ప్రజలు ఏ పనీ చేయకూడదు. మనమిక్కడ ఆనందం కొరకు లేము. పార్లమెంటు నిర్మించిన చట్టాలలో ఎక్కడా హాస్యానికి చోటులేదు. – అలన్ పేట్రిక్ హెర్బర్ట్

మానవ స్వభావంనందూ, విపరీత మానవ ప్రకృతియందూ సానుభూతి కలిగినవాడే హాస్యాన్ని చదివి ఆనందించగలడు. – మునిమాణిక్యం నరసింహారావు

జీవితంలో సంభవించే ఒడిదుడుకులనుండి, కష్టనిష్టూరాల నుండి బండిని కాపాడే స్ప్రింగ్ వంటిది హాస్యరసం. – అడివి బాపిరాజు

దుఃఖం అనే చెరువు గట్టు తెగిపోతే, ఆ నీరు వెళ్ళి పోయే తూము హాస్యభావం. హాస్యం అనే కాపుదల లేకపోతే మానవుని హృదయం దుఃఖఘాతం. – అడివి బాపిరాజు

పని చేస్తూ నవ్వలేని ఉద్యోగి సొరంగ దృష్టిని ఏర్పరచుకుంటాడు. అతనికి సృజనాత్మక పరిష్కారాలు తెలియవు. – జోయల్ గుడ్ మెన్

భావనకు, యదార్థానికి మధ్య గల అసంబద్ధతను హఠాత్తుగా దర్శించడమే నవ్వుకు కారణం. – షోపెన్ హార్

ఒక భావానికి, మరొక భావానికి మధ్యగల వ్యత్యాసమే, అప్రస్తుతమే నవ్వుకు కారణం. – విలియం హాజ్లిట్

అలవాటుగా నవ్వేవారు మూర్ఖులు. వివేకి, జ్ఞాని తరచుగా నవ్వుతారు. ఉన్నతులు ఎప్పుడూ నవ్వరు. – జార్జి వాసే

నవ్వు సత్యాన్ని మరుగుపరుస్తుంది. హృదయాన్ని పాషాణంగా మారుస్తుంది. బుద్ధిమాంద్యాన్ని కలిగిస్తుంది. – రిచర్డ్ హర్డ్

నవ్వు ప్రధానంగా మనకు గాని, ప్రకృతిగాని వస్తువులను అనుపాత రాహిత్యం మూలంగా ఏర్పడుతుంది. – సర్ ఫిలిప్ సిడ్నీ

నవ్వలేనివాడు దేశద్రోహానికి, కపటోపాయానికి, లూటీలకు మాత్రమే అర్హుడు, అతని జీవితమంతా మోసాల, నేరాలమయం అవుతుంది. – కార్లయిల్

ఓ కీర్తివంతమైన నవ్వా! శ్రమైక జీవుల అలసట చెందిన శరీరాల నుండి తాత్కాలికంగా బరువును తొలగించే, మనిషిని ప్రేమించే ఆత్మవు నువ్వు. – డౌగ్లాస్ జెరాల్డ్

ఆనందమయమైన హృదయం చక్కని మందులా సాయపడితే, మందగించిన ఉత్సాహం ఎముకల్ని ఎండగడుతుంది. – బైబిల్

ఒకే పర్యాయం రెండు వివరణలకు అవకాశం కల్పించే రెండు స్వతంత్ర సంఘటనల మూలంగా నవ్వు జనిస్తుంది. – ఆర్థర్ కోస్లర్

హఠాత్తుగా జరిగిన మార్పు ఫలితంగా, ప్రయాసతో కూడిన నిరీక్షణ పుణ్యమా అని ఏదీ లభించనప్పుడు అనురాగంతో లభించేది నవ్వు. – కాంట్

శబ్ద లక్షణాల ఆధారంగా ఇతర రణగొణ ధ్వనుల నుండి సులభంగా వేరు చేయబడటమే నవ్వు ప్రత్యేకత. – ప్రొవైన్ & యంగ్

మనిషి మాటలకు, తెలివితేటలకు, అభివృద్ధికి చిహ్నాలుగా నిలుస్తాయి చిరునవ్వులు, నవ్వులు. – జానిస్ పోర్డే.

వృద్ధాప్యం మూలంగా నువ్వు నవ్వడం మానివేయవు. నవ్వడాన్ని మానివేసినందువల్లనే నువ్వు వృద్ధుడవవుతావు. – మైఖేల్ ప్రిచర్డ్

ఇతరులలో ఉన్న దేనిని చూసి నువ్వు నవ్వుతావో, నీలో ఉన్న అదే లక్షణాలను చూసి నవ్వడం నేర్చుకో. – హారీ ఎమర్సన్ ఫాసిక్ట్.

నవ్వలేని వ్యక్తి స్ప్రింగులేని బండి వంటివాడు. ప్రతి చిన్న గుంటవద్ద అది కుదుపులకు లోనవుతుంది. – హెన్రీ వార్డ్ బీచర్

ఆరోగ్యకరమైన హృదయాన్ని కలిగి ఉండటానికి ఆనందంగా నవ్వుతూ ఉండగలగడమే ఉత్తమ మార్గం. – డా॥ విలియం పై జూనియర్

నవ్వు నీకొక భూషణం లాంటిది. అన్నింటినీ నిటారుగా అమర్చే వక్రాకృతియే చిరునవ్వు. – పైలిస్ డిల్లర్

దైవం మానవునికి ప్రసాదించిన బహుమతులలో అత్యంత విలువైనది, అత్యంత కపటమైనది నవ్వు. సమానత్వ సాధకులలో దానికి సాటి మరొకటి లేదు. – అనామిక

సహచరుల దుఃఖాల నుండి, బాధలనుండి, లోపాలనుండి కాపాడే కవచంలాంటిది నవ్వు. – విలియం మాగ్డొగాల్

అందమంతా ఆ భగవానుని చిరునవ్వుల భావావేశపూరిత పరమానందమే. సంగీతమంతా అతని నవ్వుల గలగలలే. – శ్రీ అరబిందో

వికృత వేషాలు, భాషలు, అస్పష్ట సంభాషణలు మొదలైనవాటిని విన్నప్పుడు కలిగే మనోవికారమే నవ్వు. – కుమారస్వామి సోమపీఠి

హాస్యోక్తి ఒకరికి మోదం కలిగిస్తే, ఒకరికి ఖేదం అందిస్తుంది. అంటే నవ్వు హాస్యోక్తిపైన గాక, వ్యక్తి చాదస్తం, నైజంపై ఆధారపడుతుంది. – శ్రీమతి కార్టన్

దైవం ప్రపంచాన్ని సృష్టించిన తరువాత పురుషుణ్ణి, స్త్రీని సృష్టించాడు. సృష్టి సర్వస్వం పతనం కాకుండా ఉంచడానికీ ఆయన హాస్యాన్ని సృష్టించాడు. – ఎర్నిహెబరెఖ్

కప్పను అంగచ్ఛేదం చేసినట్లు హాస్యాన్ని కూడా అంగచ్ఛేదం చేస్తే హాస్యం చచ్చి ఊరుకుంటుంది. – ఇ.బి.వైట్

ముఖంపై నవ్వు హృదయంలో ఉల్లాసం ఉంటే అది ఆరోగ్యంపై రామబాణ ఔషధంలా పనిచేస్తుంది. – పండిత హజరత్ సులేమాన్

ప్రతిరోజు కనీసం మూడుసార్లు కిలకిల నవ్వినవాని చెంతకు రోగం దరిచేరదు. అతనికి వైద్యునితో పనిలేదు. – ఆంగ్ల సామెత.

ఆనందానికి, వినోదానికి, భౌతిక ప్రకటన లాంటిది నవ్వు. – ఫిష్ వైన్ ఇల్లస్ట్రేటెడ్ మెడికల్ & హెల్త్ ఎన్ సైక్లోపీడియా

ఏదైనా చెడు జరిగినంత మాత్రాన జీవితం హాస్యజనితంగా ఉండటం ఆగిపోనట్లే. మనం నవ్వుతున్నప్పుడు అది గంభీరంగా ఉండటం మానబోదు. – కాథె ఫెన్విక్

కార్టూన్ పాఠకుని ఆరోగ్యానికి నిత్యఔషధమే గాక, నిశితమైన ఆలోచనా శక్తినిచ్చే విలువైన కుంచెపోటు. – నిఖిల్ చక్రవర్తి.

ఆరోగ్యకరమైన నాగరిక సమాజంలో ప్రతి ఒక్కరు, ప్రతి ఒక్క విషయంలో ఎగతాళి (గేలి)కి తెరచి ఉండాలి. – శ్రీధర్ బాలన్

ముఖానికి వెలుగనిచ్చే మందహాసం హృదయానికి ఉత్సాహాన్నిస్తుంది. కనుక చిరునవ్వులు చిందిస్తూ ఉండు. – పీటర్ బగ్స్

సంతోషంగా నవ్వుతూ ఉంటే, ప్రార్థనచేసే వానికంటే పరమాత్మునికి ఎక్కువ చేరువగా ఉంటాము. – వివేకానంద

ఆనందంగా ఉండటానికి ముందు నవ్వడం నేర్చుకోకపోతే, ఎప్పుడూ నవ్వకుండానే అతను మరణించవచ్చు. – లా బ్రూయెరే

రాత్రింబవళ్లు నన్ను వేధించే ఒత్తిళ్ళమధ్య నేను కనీసం నవ్వలేకపోతే మరణించవలసి ఉంటుంది. – అబ్రహం లింకన్

మనం నవ్వొచ్చే సంగతి ఏదైనా చెప్పి, మనమే నవ్వటానికి ప్రారంభిస్తే, పొడుండబ్బీ దానంతటదే తుమ్మడానికి ప్రారంభిస్తుంది. – ప్రెస్టన్

మనస్సులను, హృదయాలను తెరవడానికి ఉపయోగపడే శక్తివంతమైన, ఆనందదాయకమైన మార్గం నవ్వు. – జోయల్ గుడ్ మెన్

మీ గంభీరమైన పథకాలలో కొద్దిగా వెర్రితనాన్ని కలపండి, సరియైన సమయాలలో చిలిపిగా ఉండటం మంచిదే. – హొరేస్

నవ్వు కేవలం వ్యక్తులకే పరిమితం కాకుండా భావాలకు, సంస్థలకు కూడా వ్యాప్తి చెందుతుంది. – అలెగ్జాండర్ బెయిన్

ఒక అందమైన చిరునవ్వు ముఖానికి చక్కటి అలంకారమై వన్నె తేవడమే కాక, హృదయానికి సైతం నులివెచ్చని ఆహ్లాదాన్ని అందిస్తుంది. – ఫ్రెంచి సామెత

బలవంతుడే జీవించాలి అనే దానికన్నా హాస్య చతురుడే జీవించాలి అని విశ్వసిస్తే మనందరం నవ్వుతూ, హాయిగా మరణించవచ్చు. – లిల్లీ టామ్లిన్

నీ పరిస్థితులు నిజంగా దయనీయంగా ఉన్నప్పుడే నిజమైన హాస్యం ఉద్భవిస్తుంది. నిరర్థకత నుండే నవ్వు పుట్టుకొస్తుంది. – ఫాట్ మాక్ మనస్

గౌరవంకన్నా తృప్తినిచ్చేది నవ్వు. అది డబ్బుకన్నా విలువైనది. ప్రార్థనకన్నా పవిత్రమైనది. – హేరియట్ రోప్లిన్

మంచి నవ్వు మహాశక్తిమంతమైనది. అతి అరుదుగా కన్పించే అత్యున్నత వస్తువు అది. – హెర్మన్ మెల్ నిల్లే.

వ్యవసాయదారునికి మంచి ఎరువు వంటిది నవ్వు. దానిని వెదజల్లినప్పుడే ఫలితం మనకు తెలిసవస్తుంది. – మైకేల్ క్విట్ చార్డ్

ప్రజలకు నిజం చెప్పడానికి ముందు వారిని నవ్వించు, లేకుంటే వారు నిన్ను చంపేస్తారు. – జార్జి బెర్నార్డ్ షా

నిన్ను చూసి నువ్వు మనసారా నవ్వగలిగిన రోజున నీ అభివృద్ధి ప్రారంభమౌతుంది. – ఈటెల్ బారీమోర్

మనకు లేనిదానిని పొందడానికి ఆలోచన ఉండగా, మనకు ఉన్నదానితో ఓదార్చడానికి నవ్వు ఉన్నది. – మేక్ మాగినీస్

ఒక విషయాన్ని పరిశీలించి, రెండు వైపుల నుండి అది నవ్వగలిగిన అంశమేనని తెలుసుకున్న వ్యక్తి సంపూర్ణ వ్యక్తి అనిపించుకుంటాడు. –హెర్బర్ట్ ప్రొక్యన్

నవ్వు కొరకు నువ్వు వెదకనవసరం లేదు. మొదట సహజసిద్ధంగా ఆ ఆటను ప్రారంభిస్తే, ఆ తర్వాత హాస్యాన్ని జోడించవచ్చు. – బిల్ కోస్ బీ

నవ్వు సమస్య యొక్క గంభీరతను తగ్గిస్తుంది. అనేక సమయాలలో ఆ గంభీర భావమే సమస్యగా తయారవుతుంది. – బాబ్ బానో

నవ్వును చులకనగా, బానిసగా చూసే వ్యస్థ నుండి దానినొక విలువైన బహుమతిగా పరిగణించే దశకు మనం ఎదగాలి. – డాక్టర్ గుడ్ మన్

నేను మరణించినప్పుడు ఒక క్షణం ప్రశాంతంగా శ్రద్ధాంజలి ఘటించేకన్నా ఒక్కమారు మనసారా నవ్వడం మిన్న అంటాను. – బాట్ టాల్టెన్

అయిష్టత వ్యక్తం చేయాలంటే నీ ముఖంలో 43 కండరాలు పనిచేస్తాయి. కాని నవ్వడానికి 17 కండరాలే చాలు. మరెందుకు అధిక శ్రమ? నవ్వుతూ ఉండు. – లియో క్రిష్టి.

హాస్య సంఘటన ఎదురైనప్పుడు దాని అంతర్గతంగా ఉన్న సత్యాన్వేషణ గావించు. – జార్జి బెర్నార్డ్ షా

భగవాన్! మీ మీద నేను వేసే చిన్న జోక్ కు క్షమించు.మీరు నామీద వేసిన పెద్ద జోక్‌ను నేను క్షమిస్తాను. – రాబర్ట్ ఫ్రాస్

అనుభవాన్ని పంచుకోవడాన్ని నూతన దృక్కోణంతో చూడగలగడమే ఒక వస్తువులో హాస్యాన్ని సృష్టిస్తుంది. – జేమ్స్ మాకెనెల్

హాస్యం దైవ సంకల్పం.దేవుడు హాస్యప్రియుడు కాకుంటే ఇంతమంది రాజకీయ నాయకులను సృష్టించేవాడు కాదు. – మార్టిన్ లూథర్ కింగ్

హాస్యం మూలంగా అన్ని జీవరాసుల ఎడల సోదరభావం పెరిగి, మనలో రసార్ద్రత కలుగుతుంది. – కార్లయిల్

మన సాంస్కృతిక జీవన స్వరూప స్వభావాలను మార్చగలిగేది హాస్యం. దానిలో శుద్ధిచేసే శక్తి ఉంది. – లిన్ యుటాంగ్

హఠాత్తుగా ఆలోచనలు ఆగిపోతే, బండి పట్టాలు తప్పిన తర్వాత వాటినన్నింటిని క్రమంగా జతచేయడమే హాస్యం. – నార్మన్ కజిన్స్.

హాస్యభావన సనాతనత్వాన్ని అర్థం చేసుకోవటం లోను, ఆశ్చర్యాన్ని అధిగమించటంలోను, భరించలేనిదాన్ని భరించగలగటంలోను మనకు తోడ్పడుతుంది. – జీనే బ్రౌన్

నవ్వు అందరకూగాక ఆనందంగా, ఉత్సాహంగా, జీవితాన్ని అనుభవించాలనుకునేవారికి ఉపయోగపడుతుంది. – ఆనీ విల్సన్ స్కాఫ్

సుఖాంత నాటకాలద్వారా త్రాగుబోతులు, వ్యభిచారులలో నైతిక పరివర్తన తీసుకురావాలి. క్రూరంగా, మొండిగా ఉండే హాస్యం యొక్క విధి అలాంటివారినిన సరిదిద్దడమే. –బెన్ జాన్సన్

స్వీయ పరిరక్షణ పోరాటంలో ఆత్మకుగల ఆయుధాలలో హాస్యం ఒకటి. ఎలాంటి పరిస్థితికైనా అతీతంగా ఎదగడానికి శక్తిని, ఏకాంతాన్ని కొన్ని క్షణాలైనా ప్రసాదించగలదు. – విక్టర్ ఫ్రాంకిల్

హాస్యధోరణిలో సహృదయంతో, విజ్ఞతతో కూడిన సరసోక్తి సముచితమైనది, ప్రశంసింపదగినది. – బర్రోచాలా.

హాస్యం వ్యాప్తి చెందుతుంది. హాస్యపూరితమైన పరిసరాలు హాస్యాన్ని అధికం చేయడంలో దోహదం చేస్తాయి. – రోగర్

సగం సమయం నాకు హాస్యానికి అవకాశం ఉండదు. మిగిలిన సమయంలో అసలు హాస్యమే ఉండదు. – ఊడీ ఎలెన్

గొప్ప హాస్యకారుడు నిరాశావాదిగా, కటువుగా, భ్రాంతి నుండి విముక్తి పొందినవాడుగా ఉండాలి. – జార్జిమైక్స్

మనసు, దేహం విశ్రాంతి తీసుకొని, శాంతిని పొందమని ఆత్మ నుండి జనించే గుసగుసలే హాస్యం. – అనామిక

ఆవేశపరునిలో హాస్యం ఉండకపోవచ్చు కాని, హాస్య చక్రవర్తిలో నిబిడీకృతమైన ఆవేశం ఉంటుంది. – కాన్ స్టాన్స్ రోకే

హాస్యాస్పద విషయాలలో గంభీరంగా ఉండేవారు గంభీర విషయాలలో హాస్యాస్పదంగా ఉంటారు. – కాటో ది ఎల్డర్

మనము ఉన్న ప్రదేశానికీ, జరుగబోయే క్రూర విషయాలకు మధ్య సరిహద్దును ఏర్పరచేది హాస్యం.- జోసఫ్ స్టెయినర్

ఒక విరుపు, ఒక మెలికె, ఒక వక్రోక్తి, ఒక హాస్యపు పలుకు సహృదయుని హృదయాన్ని చలింపజేస్తుంది. –మునిమాణిక్యం.

బహిర్గత సంక్షోభం నుండి తప్పించుకోడానికి అవసరమైన అంతర్గత శాంతిని కలిగించగల ఉత్తమ సాధనం హాస్యం. – బ్రియాన్ డీరి

హాస్యమూ, సృజనాత్మకతా సన్నిహిత సంబంధం కలిగి ఉన్నాయి. హా! హా! ఆహాల మధ్య సంబంధం ఉంది. –గుడ్ మన్

నవ్వు విశ్వాంతరాళాలలో ఉపయోగపడే దివ్యౌషధం, అది అమూల్యమూ, అప్రతిహతమూ అయిన ఔషధం. – బెట్రాండ్ రస్సెల్

హాస్యం వికటంగా, ఎడారిలా ఉంటుంది. కృతకంగా కన్పించడానికి ప్రయత్నించడంతో అది వికటిస్తుంది. మనకు తెలియకుండానే సహజంగా వస్తుంది. – జోనథాన్ స్విఫ్ట్

ఆధునిక కాలంలో ప్రతి ఒక్కరు హాస్యాన్ని ఒక తాత్త్విక విధానంగా మార్చబూనడం బాధాకరమైన విషయం. – మిల్లిగం

రస స్వరూపంతో తలస్పర్శ పరిచయం ఉన్నవాడు హాస్యరసాన్ని సృష్టించగలుగుతాడు. – డా॥ ఇ. కృష్ణమూర్తి.

మన పొరపాట్ల నుండి రాబట్టిన హాస్యం మనల్ని గురించి, మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని గురించి దృక్పథాన్ని ఏర్పరచుకోవడానికి అవసరమైన పునాదులను ఏర్పరుస్తుంది. – కర్లాగరిస్

హాస్య భరిత విషయాలు చెప్పనివారు, అలాంటివి చెప్పేవారిని చూసి విసుగు చెందేవారు ఆటవికులు, కఠినాత్ములు. – అరిస్టాటిల్

మంచి మూలంగా జనించే ఆనందం గుంభనంగా ఉండగా, చెడు మూలంగా వచ్చే నవ్వు దానివెంట పరుగిడుతుంది. – డెస్కార్టెస్

మనుషులను ఉన్నత సామాజిక జీవులుగా రూపొందించడంలో నవ్వాలన్న ఆసక్తి కందెనవలె పనిచేస్తుంది. – రాబర్ట్ ప్రావైన్

తనలోని నిరర్థకతలను చురుకుగా మనిషికి చూపగల హస్యభావన దాదాపు అన్ని పాపాలు జరగకుండా చూస్తుంది. – శామ్యూల్ బట్లర్

ఒకరు నవ్వినంత మాత్రాన జీవితం గంభీరం కాకుండా ఆగిపోనట్లే, ఒకరు మరణించినంతమాత్రాన జీవితం హాస్యభరితం కాకుండా ఉండబోదు. – జార్జి బెర్నార్డ్ షా

నవ్వు ఒక మానసిక, శారీరక అద్భుతం. అదొక సుఖాంత రూపకం, అది ఒక వ్యక్తి యొక్క సృజనాత్మక చర్య. – సోరెల్

ఓ దైవమా! హాస్యభావనలేని వారినుండి మమ్మల్ని కాపాడు. వారు మానవాళికే విపత్తులాంటివారు. – జీన్ షలిత్

మనకు ఉన్న దానికి, మనకు సంభవించిన దురదృష్టాలకు మధ్య ఒక పొలిమేరను ఏర్పరుస్తుంది హాస్యం. – జోసెప్ స్టైనెర్

దేవుడు హాస్యప్రియుడా? మనల్ని సృష్టించాడు కనుక తప్పనిసరిగా ఆయన హాస్య చతురుడై ఉండాలి. – జాకీ గ్లీసన్

హాస్యం ఆత్మకు సంగీతం లాంటిది. కనుక స్వరకల్పనతో పనిలేకుండా నువ్వు పాట పాడితే చాలు. – జాన్ రిచర్డ్ సన్

ఉత్తమ హాస్యానికి మూడు సూత్రాలున్నాయి. దురదృష్టమేమంటే అవేమిటో ఎవరికీ తెలియదు. – లారెన్స్ జేపీకర్

బజారులో నువ్వు నీ టోపీ వెంటబడేటప్పుడు వెనుకనుండి నువ్వు వినే శబ్దాలే నువ్వు. – జాకోబ్ ఎం.బ్రాడ్

నీలో హాస్యభావన లేదని ప్రకటించడానికి మించిన అవమానం మరొకటి లేదు. – జాకోబ్ ఎం.బ్రాడ్

